**మహాత్మకథ**

తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి

**తుమ్మల శతజయంతి ప్రచురణ**

24 డిసెంబరు, 2001



మూల్యము : **రూ. 100/-**

ప్రతులకు :

1. డా॥ కొండబోలు బసవపున్నయ్య
   1, నలందానగర్, రింగ్‌రోడ్
   గుంటూరు
   ఫోన్ - 350461

2. **తుమ్మల శ్రీనివాసమూర్తి**
   విద్యానగర్, నిడుబ్రోలు - 522 124
   ఫోన్ - 46567

3. **తుమ్మల నారాయణ**
   305, స్వగృహ మోతీ అపార్ట్‌మెంట్స్
   మోతీనగర్, హైదరాబాద్ - 18
   ఫోన్ - 3834437

ముద్రణ :

**శ్రీలక్ష్మి ప్రెస్**

14/2 అరండల్‌పేట, గుంటూరు

ఫోన్ - 230643

# తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము
## గుంటూరు

గౌరవాధ్యక్షులు

**శ్రీ వై.వి. రావు**

పార్లమెంటు సభ్యులు

అధ్యక్షులు

**డా॥ కొండబోలు బసవపున్నయ్య**

ఉపాధ్యక్షులు

**శ్రీ పోలిసెట్టి ఏకనాథగుప్త**

**శ్రీ పొన్నెకంటి హనుమంతరావు**

కార్యదర్శి

**శ్రీ కాకరపర్తి వెంకటేశ్వర్లు**

కోశాధికారి

**శ్రీ పాలడుగు లక్ష్మణరావు**

కన్వీనర్

**డా॥ ముద్దన హనుమంతరావు**

తెనుఁగులెంక తుమ్మల

# సమగ్ర సాహిత్యము

రెండవ సంపుటము ప్రచురణకు

**భూరి విరాళము లొసగిన**

వదాన్య శేఖరులు

## నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటి

**గుంటూరు**

## సిద్ధార్థ అకాడమీ ఆఫ్ జనరల్ & టెక్నికల్ ఎడ్యుకేషన్

**విజయవాడ**

# శతజయంతి సమర్పణ

తిక్కన పలుకుబడులను పుణికిపుచ్చుకొని తెనుఁగుదనమును రంగరించిన తమ కవితలో గాంధీయమును వెలయించి ధన్యజీవులైనవారు తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు. జీవితమంతయు నైతికములయిన విలువలకే మీదుకట్టిన మహనీయుఁ డాయన. రాష్ట్రసిద్ధి కొఱకు రక్తమ్ము గార్చిన గాంధికవి. బడలి బడలి తల్లి బాసకూడెము సేసిన దేశికవి, మేడిబట్టి నాగలి దున్నిన కర్షక కవి.

అమరజ్యోతి యగు గాంధీ సంపూర్ణ జీవితచరిత్రను మహావీరకావ్యాలుగా తీర్చిదిద్ది మహాత్ముని ఆస్థానకవి యని పేరొంది, సిసలైన గాంధీ అనుయాయిగా బ్రతుకును పండించుకొనిన మహనీయులు తుమ్మల వారు. చక్కని చిక్కని తెనుఁగుదనపు గుట్టు తెలిసి, నుడికారమునకు మారుపేరైనది తుమ్మలవారి సాహిత్యము. తెలుగుసీమ పల్లెపట్టులు కన్నులకు గట్టినట్లు చిత్రించిన మేటి కైసరులు వారు. మాతృభాషాభిమానము, ఆంధ్రరాష్ట్రాభిమానము వీరి కావ్యములకు జీవగఱ్ఱలు. జీవితము వేఱు, కవిత్వము వేఱు అని వారేనాడును భావింపలేదు నీతిని ఊతగా గొని బ్రతికిన వారికి మాత్రమే తమ కృతులను అంకితమొనర్చి కృతార్థులైనారు.

మేనెంత నలగినను, తమ మనుగడ లోకసేవనమ్మున కొసంగి, నవ్య భవ్య కవితా సృష్టి ద్వారా సామాజిక కల్యాణము కామించిన తుమ్మలవారి శతజయంతి ఉత్సవమును (25-12-2001) పురస్కరించుకొని వారి సమగ్ర సాహిత్యమును సంపుటములుగా ప్రచురింపదలపెట్టినాము ఈ బృహత్కార్యము వ్యయసాధ్యము. అయినను గుంటూరు నగరమునను, ఆంధ్రదేశమందంతటను గల సహృదయశేఖరులు తెనుఁగులెంకపై గల అపారమైన ఆదరాభిమానములతో భూరి విరాళములొసగి ఈ కార్యమును సఫలీకృతము చేసినారు.

వీరెల్లరకు మేము కృతజ్ఞతాంజలి ఘటించుచు తెనుఁగులెంక సమగ్రసాహిత్యమును ఆంధ్ర పాఠకుల కరకమలములందు అర్పించుచున్నాము.

ఇట్లు
**డా॥ కొండబోలు బసవపున్నయ్య**
అధ్యక్షులు
**తుమ్మల శతజయంతి ఉత్సవ సంఘము**
గుంటూరు

# కృతజ్ఞత

తెనుంగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి దాదాపు ఇరువదియైదు వేల పద్యములు విరచించినారని ప్రతీతి. అంత విస్తృతమైన తుమ్మలవారి సమగ్రసాహిత్యమును ప్రచురించుట అలంతిపని కాదు. ఆత్మకథ, మహాత్మకథ అను మహావీరకావ్యములు వీరి రచనలలో సింహభాగము నాక్రమించుచున్నవి కనుక వానిని వేఱు వేఱు సంపుటములుగా ముద్రించితిమి.

తుమ్మలవారి ఖండకావ్యములన్నింటిని మఱి రెండు సంపుటములుగా వింగడించి ప్రచురించితిమి. వారి కైతలోని క్రమవికాసము తేటపడుటకు వీలగు విధమున ఆ ఖండకావ్యములను కాలానుపూర్విగ కూర్చి వెలువరించితిమి ఇట్లు వారి రచనలు మొత్తము నాలుగు సంపుటములుగ తేఱినవి. మొదటి సంపుటము – ఆత్మకథ, రెండవ సంపుటము – మహాత్మకథ, మూడవ సంపుటము – ఖండకావ్యములు, నాలుగవ సంపుటము – ఖండకావ్యములు.

ప్రచురితములైన వారి తొలి రచనలలో 'నామదేవచరిత్రము' అను హరికథ లభింపలేదు. రామశతకము, రామలింగేశ్వరశతకము, మహాత్మాగాంధి తారావళి, రామకృష్ణస్మృతి, మాహేంద్ర జననము – అను గ్రంథముల నెట్లో సంపాదించి ఇందు చేర్చితిమి.

చక్కని చిక్కని తెనుంగుదనము తొణికిసలాడు తుమ్మలవారి కవిత్వమును ముద్రించు పట్టున ప్రూఫ్ సరిచూచుట పండితజనైకసాధ్యము. ఈ రెండవ సంపుటమునకు ప్రూఫ్ సరిచూచిన శ్రీ దుద్దేల పుల్లయ్య గారికి కృతజ్ఞత వెల్లడించుచున్నాము.

ప్రచురణలో తమ అమూల్యమైన సలహాలనిచ్చి తోడ్పడిన సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు గారికి, శ్రీ సూర్యదేవర రవికుమార్ గారికి, విద్వత్కవులు శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు గారికి, కవివతంసులు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గారికి, శ్రీ తుమ్మల శ్రీనివాసమూర్తి గారికి ధన్యవాదములర్పించుచున్నాము.

సంపాదకులు

పులిచెర్ల సుబ్బారావు
వెన్నిసెట్టి సింగారావు

గుంటూరు
24-12-2001

# తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి జీవితం - కృతులు

**జననము :**

25-12-1901, కావూరు, రేపల్లె తాలుకా, గుంటూరు జిల్లా;
తల్లిదండ్రులు : చెంచమాంబా నారయ్యలు.

**కుటుంబము** ·

1930లో శ్రీమతి అన్నపూర్ణమ్మతో వివాహము. ఒక కుమార్తె, నలుగురు కుమారులు.

**గురువులు** ·

శ్రీయుతులు కావూరి శ్రీరాములు, జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

**విద్య :**

ఉభయభాషా ప్రవీణ (ప్రథమశ్రేణి), ఆంధ్రవిశ్వవిద్యాలయము - 1930.

**వృత్తి :**

సేద్యము, తరువాత అధ్యాపనము; 1924-29 తిలక్ జాతీయ పాఠశాల - కావూరు, 1930-57 గుంటూరు జిల్లా బోర్డునందలి దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల ఉన్నత పాఠశాలలు, 1920-30 కాంగ్రెసు సేవ, శిక్ష - 1922.

**అభిమాన విషయములు :**

గ్రామజీవనము, గాంధీతత్త్వము, సర్వోదయము, ఆంధ్రాభ్యుదయము, తిక్కన కవితామార్గము, చిన్నయసూరి సిద్ధాంతము.

## కృతులు

**గాంధీకావ్యాలు** - ఆత్మకథ, మహాత్మకథ, అమరజ్యోతి, సర్వోదయగానము, గాంధీగానము, మహాత్మాగాంధీతారావళి.

**రాష్ట్రకావ్యాలు** - రాష్ట్రగానము, ఉదయగానము.

**ఖండకావ్యాలు** - పఱిగపంట, పెద్దకాపు, శబల, పైరపంట, సమదర్శి, కదంబకైత, చక్కట్లు, దివ్యజ్యోతి.

**కథాకావ్యాలు** - ఆత్మార్పణము, ధర్మజ్యోతి.

**సామాజికకావ్యాలు** - ఎక్కట్లు, సందేశ సప్తశతి.

**స్వీయచరిత్ర కావ్యాలు** – నేను, నాకథలు, తపస్సిద్ధి.

**వేదాంతకావ్యాలు** – గీతాదర్శము, భజగోవిందం, లక్ష్మీనృసింహస్తోత్రము, హనుమాన్ చాలీసా.

**నీతికావ్యాలు** – తెనుఁగునీతి, నీతికుసుమము.

**స్మృతికావ్యాలు** – రామకృష్ణస్మృతి.

**శతకములు** – పురాంతకశతకము, రామశతకము, రామలింగేశ్వరశతకము.

**జంగంకథలు** – బిల్హణీయము.

**నాటకాలు** – గిరిజాపరిణయము, హనుమద్విజయము, మాహేంద్రజననము.

**హరికథలు** – అన్నదాన మహాత్మ్యము, సాత్రాజితీ పరిణయము, నామదేవచరిత్రము.

**సమ్మానములు** :

1949 నిడుబ్రోలులో – గజారోహణము, గండపెండేరము, కనకాభిషేకము, సువర్ణకంకణము. 1960లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సత్కారము. 1967లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదానము. 1969లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానము, ఆంధ్ర విశ్వవిద్యాలయము "కళాప్రపూర్ణ" బిరుదుతో సత్కారము. 1985లో నాగార్జున విశ్వవిద్యాలయము "డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్)" బిరుదుతో సత్కారము. విశాఖపట్టణములో సహస్రచంద్రదర్శన మహోత్సవము. నెల్లూరు, అప్పికట్ల, ముక్త్యాల, తెనాలి, గుడివాడ, మద్రాసు, గుంటూరు, విజయవాడ మొదలగు తావులలో. 1987లో గుంటూరు, విజయవాడ పట్టణాలలో భారత ఉత్సవాల సందర్భంగా ఘనసన్మానం.

**జయంతి మహోత్సవములు** : 1952 నుండి పెక్కుచోట్ల

**బిరుదులు** : ఇతరుల దృష్టిలో "అభినవ తిక్కన", తన దృష్టిలో "తెనుఁగులెంక"

**నిర్యాణము** : 21-3-1990 అప్పికట్ల, బాపట్ల తాలుకా, గుంటూరు జిల్లా.



గాంధియుగమునఁ బుట్టితి, గాంధి నడుపు
నుద్యమంబుల నలఁగితి నోపినంత,
గాంధి నీక్షించితిని, గాంధికవిత వ్రాయఁ
గంటి నీజన్మమునకు నీపంట చాలు

# తెలివిడి

నేను మహాత్ముని ఆత్మకథను పద్యరూపమునఁ దీర్చి 1951లో సమగ్రముగా వెలువరించితిని. ఇందు మనముందు బాపూ సాగించిన సత్యాగ్రహ సమరముల చరిత్రలు, మనకై నలఁగి నలఁగి బలివోయిన జాతిజనకుని జీవనగాథలు లేమింజేసి యెట్లేని శ్రమించి మహాత్ముని మనుగడ నూఁచముట్టుగా నభివర్ణించి యాంధ్రశారదకు నుదుగర వెట్టవలయు నను కోరిక నాలో నపుడ యుదయించె.

పదంపడి నా మిత్రులు, సజ్జనశేఖరులు, కవితావిశారదులు ఓగేటి పశుపతిగారిం జూడ 23-8-1951 'యాజలి' కేగి వారితో నాయై ముచ్చటలు సాగించుపట్ల నా కోరికను వారి చెవికిం దేర సహృదయులగు పశుపతిగారు మిక్కిలిగా సంతసించి నేఁడే కృతి నారంభింపవలయు నని నన్ను మిగుల నుత్సాహపఱిచిరి. 'శుభస్యశీఘ్ర'మ్మని పెద్ద లన్నారు గాన నే నపుడే రచనకుం దొడఁగి పదిపద్యములు వ్రాసి మఱునాఁ డిల్లు సేరితిని. తరువాత నై దాఱునాళ్ళలో నేఁబది పద్యములు నడిచెనో లేదో నాపట్టు సడలినది. కాని ఆరాటము తగ్గలేదు.

ఇట్లుండ న న్నెచటనోఁ గూర్చుండఁబెట్టి పెద్దసేయు మనస్వి, మహాత్ముని భక్తుఁడు, సంగీతకలానిధి, సాహితీకుశలుఁడు శిష్టా సత్యనారాయణరాజశేఖరుని ముల్లుపోటుతో మరల నేను బాపట్లలో నితనియింట 27-8-1952 కలముపట్టి నాల్గుపంక్తులువ్రాసి 'అప్పికట్ల'కు వచ్చి యొకనెలపాటు పాటుపడి దాదాపు మూఁడువందల పద్యములు కూర్చితిని. అంతలో నేవో బెడఁదలు న న్నరికట్టినవి. గ్రంథ మాఁగినది. ఈ యాఁగుట ఒకనెలకాదు. ఏఁడాదిగాదు, పంద్రెండేండ్లు! 'శ్రేయాంసి బహువిఘ్నాని'.

కాఱుమబ్బులు విచ్చినవి. గాంధిమహాత్ముని జయంతి వచ్చినది. సామ్యయోగ నిష్ఠా గరిష్ఠుఁడు, తెలుఁగునాటి వినోబా వెంపటి సూర్యనారాయణగారి యాహ్వానమున వారి వైద్యశాలలో సమావిష్టమయిన సర్వోదయసాహిత్యమండలి సభకు 2-10-1964 తెనాలి వెళ్ళితిని. నాఁటి నా భాగ్యము కొలఁదుల కందనిది. నా యాజమాన్యమున జరిగిన ఆ సభలో మాననీయమనీషి, గణనీయ గాంధేయుఁడు, కాకా కలేల్కరుగారు మండలిపక్షమున రూపుదాల్చిన కవితాసంకలనమును 'సాహిత్యపతాక'ను ఆవిష్కరించి యుదాత్తమగు సాహితీప్రసంగము కావించిరి. సభానంతరము ఆచార్యసత్తముఁడు, 'సామ్యయోగ' సంపాదకుఁడు కేశిరాజు వేంకట నృసింహఅప్పారావుగారు కలేల్కరుగారికి న న్నెఱుకసేయుచు నేను 'మహాత్మకథ'ను అసంపూర్ణముఁ గా నుంచుటసైతము తెల్పిరి. కాకాసాహెబుగా రపుడు నన్ను మెత్తమెత్తగా మందలించి "అనారోగ్యమునకు జంకకుము. రచనము నందుకొమ్ము. 'మహాత్మకథ' నీవు పూర్తిసేయఁ గలవు. కర్తవ్యనిష్ఠయే నీకు వలయు బలిమి నిచ్చు'' నని నాపట్ల శుభాశంసలు పల్కిరి.

ఈ పల్కులు నాలో నూతనోత్సుకతం గూర్చినవి. ధైర్యము నొదవించినవి. 11-10-1964 నాఁడు మరల కవిత్వ దీక్ష నందితిని. 'విజయోస్తని దీవించుచు' అను (49 వ పొరట) పద్యముందొట్టి కొట్టకొసదనుక నిరంతరముగా నిర్బాధముగా వ్రాసితిని. 1-10-1966 లోకము దెసకుఁ జూచి యూపిరిపీల్చితిని. కరుణానిధికి పరమేశ్వరున కంజలించితిని.

నాఁటికి నేఁటికి నా కొజ్జగా నుండి నా పెంపు నభిలషించు విద్వచ్చక్రవర్తి, లాక్షణికశిరోమణి, అపరచిన్నయసూరి, సౌజన్యమూర్తి బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రులుగారు వయోవృద్ధులు, బహుకార్యవ్యగ్రు లయ్యు నా మనవిని మన్నించి యీ కృతికి అనర్ఘము, విపులము నగు అవతారికను రచియించి తమ శిష్యవాత్సల్యమును చాటిరి. వీరికి నా భక్తిపూర్వకనమోవాకములు చెల్లింతు.

అసహాయోద్యమము, అసహాయవాదులు-అనువానికి రాజకీయముగా వచ్చిన రూఢింబట్టి యిందుఁ దా విచ్చితిని. తిక్కనగారి యీ ప్రయోగములును నా కిచట ధైర్యము నొసంగినవి.

**ఉ. వారలఁజూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁడన్న స**
**క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యముసేయువగన్ సహాయమున్**
**గోరి భవత్సకాశమునకుం జనుదెంచితిమి.................**

**క. అనుటయు నాతఁడు హరికి**
**ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్..................**

(ఉద్యోగపర్వము 1 వ ఆ. 69, 86 వావిళ్ళప్రతి)

వైయాకరణశిరోమణి వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారును తెలుఁగునం దీ 'సహాయ' పదము ధర్మవాచకముకూడ నగు ననిరి.

కొన్ని సంస్కృతపదముల కాంధ్రభాషలో నొదవిన యర్థపరిణామముసైతము నేను పాటించితిని. కావుననే మార్గవాచియగు 'పదవీ' శబ్దమును 'అధికారస్థానము' అను నర్థమునఁ బ్రయోగించితిని.

ఇచట తిక్కనగారి యీ ప్రయోగముకూడ గమనింపఁదగినది.

**క. జననీవధంబు సేసిన**
**ననుమానమె నరకమగుట యని యుడిగితిఁబో!...........**

(శాంతిపర్వము 5వ ఆ. 267 వావిళ్ళప్రతి)

ఇట 'అనుమానము'న కర్థము తార్కికమగు 'ప్రమాణభేదము' కాదు. 'సందేహ' మనియ!

ఈ గ్రంథమునందు పలుతావుల శక్యార్థమునను 'జేయ' శబ్దము ప్రయుక్త మయినది. దీనికిని తిక్కనగారే నాకు నాధారము.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడున్ గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యులున్
ప్రాణము లాసుయోధనునిపాలివ యంద్రు; నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్, సుతులజేయులు, బాహ్లికసోమదత్తు లా
స్థాణునకైన నోదరు........................................

(ఉద్యోగపర్వము 1వ ఆ.299 వావిళ్ళ ప్రతి)

*  *  *  *  *

ఆంధ్రదేశమున మహాత్మునిసేనల కానలిచ్చిన స్త్రీ పురుషులెందఱో యున్నను గ్రంథవిస్తర భీతిచే కొందఱనుమాత్రమ యిందుపేర్కొంటిని. దువ్వూరి సుబ్బమ్మ, ప్రత్తిపాటి సీతమ్మ, వాసిరెడ్డి హనుమాయమ్మ వంటి వీరాంగనలును - నల్లూరి రాజయ్య, వీరమాచనేని వేంకటనారాయణ, మేడూరి నాగేశ్వరరావు, శిష్ట్లా శివస్వామి, జాస్తి వేంకటనరసయ్య వంటి నెఱజోదులును నా యెఱుంగనివారు కా రని మనవి.

మహాత్మకథాసంపాదనమున యశశ్శరీరులు పట్టాభి సీతారామయ్యగారి 'కాంగ్రెసుచరిత్ర' నాకు 1941 వఱకు మిగులఁ దోడ్పడినది. భోగరాజువారి నిప్పట్ల మనసార స్మరియింతును.

మఱియు పూజ్యులు ప్యారీలాల్‌గారిచే రచింపఁబడి నవజీవన్ ట్రస్టువారిచేఁ బ్రకటింపఁ బడిన "మహాత్మగాంధి - చరమఘట్టము" **(MAHATMA GANDHI - THE LAST PHASE)** అను గ్రంథము 1944 నుండి నాకు ముఖ్యమగు నాధారమైనది. కాన ఈ రచయితకును, ప్రకాశకులకును నా కృతజ్ఞతాభివందనములు సమర్పింతును.

శ్రీ ఉప్పల నాగయ్య, శ్రీ ఓగేటి పశుపతిగారలు ఆంగ్లగ్రంథముల ననువదించి యిచ్చియు, శ్రీ శిష్టా సత్యనారాయణరాజశేఖరము, శ్రీ మన్నె ఆదిశేషయ్య, శ్రీ చర్ల జనార్దనస్వామి, శ్రీ షేక్ దావూద్‌సాహెబ్ గారలు హిందీరచనల నాంధ్రీకరించి యొసంగియు నా కొనర్చిన మేలు మఱవఁ జాలను.

ఇంగ్లీషును తెనుఁగుసేంతలో నా బిడ్డలు చిరంజీవులు శ్రీనివాసమూర్తియు, శ్రీపతియు మిగుల డస్సిరి. వీరికి నా దీవనలు.

ఎందఱో పెద్దలు విద్వన్మణి ఇనుపకుతిక శంకరశాస్త్రిగారి వంటివారు, పిన్నలు సమీచీన సాహితీసమీక్షకుఁడు నాగళ్ళ గురుప్రసాదరావుంబోనివారు ఈ రచనలో నాకొదవిన భిన్నభిన్న సంశయముల నివారించిరి. వీరికి నా హృదయపూర్వకమగు కృతమెఱుక నావిష్కరింతును.

ముద్రణవేళం బలుప్రొద్దులు తెనాలి నుంట వలసిననాకుఁ దగు సౌకర్యములు సమకూర్చి తుష్టియు పుష్టియు నొదవించిన ప్రియశిష్యుఁడు ధర్మచక్రాది కావ్యకర్త లేళ్ళ వేంకటరామారావునకు సర్వదా శ్రీరామరక్ష లభించుఁగాక!

'నలందా ప్రెస్సు' వా రీకృతిని చక్కఁగా ముద్రించి నాపట్ల వెలువరించిన ఆదరానురాగములను కొనియాడుటయు నిచట నా కర్తవ్యము.

ఇట్లు
**తుమ్మల సీతారామమూర్తి**

శివాయ గురవే నమః

# అవతారిక

నిత్యసత్యవ్రతుఁడయి, అహింసా నిరతుఁడయి, సుఖవాంఛా విముఖుఁడయి, కష్టానుభవ కాముకుఁడయి, పతితోద్ధరణ పరమలక్ష్యమునకు జీవితము నెల్ల ధారవోసి ప్రపంచశాంతికయి ప్రాణములర్పించిన కరుణామూర్తి మోహనదాస కర్మచంద్ర గాంధిమహర్షి జీవితచరిత్రమున పూర్వభాగమగు 'ఆత్మకథ' తుమ్మల సీతారామమూర్తికవిచే తెలుఁగు పద్యకావ్యముగా అనూదితమై 1951లో వెలువడి సహృదయుల మెప్పు లొందుచు సకలప్రమోదసంధాయకమయి వెలయు చున్నది. తదుత్తర భాగము అనువాదముగాక తుమ్మలవారి స్వతంత్రరచనమై 'మహాత్మకథ'గా నేఁడు వెలువడినది.

సీతారామమూర్తిగారు నన్ను దీనికి నవతారిక రచింపఁ గోరినారు. కోరిన తోడనే పెక్కుచిక్కులు నా తలఁపునం బాతినవి. అందుఁ గొన్నింటినయిన విప్పి చెప్పకతప్పదు. ఆప్తులకు నివేదించినచో నా చిక్కులబరువు కొంతకుఁగొంత తేలిక యగునేమొ. ఇష్టజనసంవిభక్తములయిన క్లేశములు సహ్యవేదనము లగు నను నభిజ్ఞులసూక్తి అనుభవసంగతము. కావున రవంత నివేదింతును.

సీతారామమూర్తిగారికి నాయెడ విన్న వారికి వింతగొలుపు గురుభావ మెటులో కుదురుకొన్నది. 'చిట్టిగూడూరు' గురుకులమునందును, 'విశాఖ' విశ్వవిద్యాలయము నందును పెక్కువత్సరములు నియమబద్ధముగా నాయొద్ద విద్యాస్వీకార మొనరించి పండితులు, పట్టభద్రులు నయినవారు పలువురున్నారు. వారికిని నాకుంగల గురుశిష్యానుబంధమున సుంతయు వింతలేదు. అది సహజోపపన్నము, స్వయంసిద్ధము. వలదన్నను వదలునదికాదు. ఇది యెట్టి దందురా; ఈయన తొలుత స్వయంకృషిగా చిరకాలము అధ్యయనమువలన దస్సి వ్యాకరణ వ్యాసంగము గావించికొని ఆ పిమ్మట సాంప్రదాయిక పరిశ్రమాసక్తితో 1929లో నాయొద్ద కేగుదెంచి శ్రీ వరదాచార్యుల వారి గురుకులమున (చిట్టిగూడూరు) 'నాకడనుండి నేర్చినవి నాలుగుముక్కలు.' ఆమీఁద – తనకుఁదానుగాఁ 'బ్రాఁకి గడించుకొన్న ప్రతిభాఫలముల్ శతముల్ సహస్రముల్.'– ఇట్టి పరిస్థితిని లక్షణ వ్యాసంగమున కొంచెపాటి చేయూఁత నిచ్చిన నాయెడ ఆయనకు అవ్యాజమగు గురుభావము గాటముగా నాటుకొనుట వింతగొలుపదా మఱి! ఇట్టిభావన ఆ హృదయమున నుదయించుటకుఁ గారణము నా వ్యాకరణ శిక్షణము కాదు. మఱి ఆయనలో సహజమయి జాలువాఱు సౌశీల్యము. ఆ గురుభావన విశదమయిన దాదిగా ఆయనయెడ ప్రేమమో, వాత్సల్యమో, ఆదరమో, ఆప్యాయనమో, సాహిత్యమో, సౌహార్దమో, గారామో, గౌరవమో సూటిగాఁ దేటపఱుపఁజాలను గాని ఇవి యన్నియు మేళవించిన ఆత్మీయతాదృష్టి యొకటి నాలో నెలవుకొన్నది. ఎవ్వరికేని శిష్టుఁడయిన మనీషి అప్రయాసముగా శిష్యుఁడగుట తనివి గొలుపు సంఘటనముగదా! నా ఆత్మీయులలో తక్కినవారు శిష్యులైన వెనుక శిష్టులయినవారు. ఈయన

శిష్యుఁడయిన పిమ్మట శిష్యుఁడయినవాఁడు. ఇదీ భేదము, మా యుభయుల గురుశిష్యభావమునం గల ప్రత్యేకత యిట్టిది. ఇట్టి శిష్యలాభము సాధారణముగా దుర్ఘటము.

ఈరీతిని గురువ నయిన నేను – ఈయన రచనముల గూర్చిన ఇతరోదీరిత ప్రశంసా వచనములు తటస్థముగ నాలకించుచు, లోలో నానందమొందుచు, తన్నుఁ దా నభినందించు కొనవలసిన నేను – నేనుగా మహాత్మకథకు అవతారిక రచింపవలసివచ్చినది. ఎట్టిచిక్కో గమనింపుఁడు. ఉదాత్త పవిత్రేతివృత్త సంభరితమయి, కమనీయకవితా విలాస భాసురమయిన యీ కావ్యరత్నమునకు అవతారిక రచించునెడ, కవితాగుణము నుల్లేఖించుపట్టులందు కవిని గూర్చిన ప్రశంసావచనములు అనివార్యములయి ఆవరించు నేమో! అట్టి మెచ్చుకోళ్లు లోకము మాట యటుండ మొదట ఈ శాలీనునికే రుచింపవాయెను. అదిగాక నేనుమాత్రము ఆత్మీయ ప్రశంసకు అసంకోచముగ ప్రవర్తిల్లఁగలనా? ఆత్మస్తుతికిని దానికిం గల భేదమేమి? అభిజ్ఞులు లోలో హసింతురేమో! ఇంతటి యిఱుకుపాటుగల యీపనికిఁ బూనుట యెట్లు? సన్నిహితాప్తుని చిన్నికోరికను సరే యనక నిరాకరించుటయెట్లు? వ్రాయుదునా, మానుదునా? అను సంప్రశ్నము సంభవించినది. ఈ చిక్కు నన్నెదుర్కొను నని సీతారామకవికి తోఁచియుండదేమో! తోఁపకుండుట యెట్లు? సూక్ష్మాతిసూక్ష్మ భావనారేఖలతో నిండియుండు కవిహృదయమునకు ఈపాటి స్ఫురణము లేకుండు ననుట సంభావ్యమా? – నో. నో. – ఎంతమాత్రమును గాదు. ఒక్కలా గయి యుండనోపు! చిక్కు లెటులో తప్పించుకొందు నని ఆ యంశము నంతగా గణింపక తన కావ్యమున ఏదో యొకతీరున నాతో సుస్థిరసాంగత్యము నభిలషించి ఈయవతారికారచనను కోరియుండవచ్చును. అట్టి సాంగత్యము నాకుమాత్ర మనపేక్షణీయమా? 'కి మత్రకర్తవ్య' మ్మని యాలోచింప నాలోచింప అనువయిన మార్గ మొండు గోచరించినది. అవతారికా రచనమునడుమ నెటనేని పొగడితపలుకులు తారసిల్లిన తరుణమున అవధానకవితలో నిషిద్ధాక్షరియందువలె అట్టి ప్రశంసలను మెలమెల్లన తప్పింపలేమా అనిపించినది. మఱిమఱి నిదానింప అట్టి ప్రాణాయామప్రయాసముసహిత మక్కఱపడని మిక్కిలి సుగమమయిన వేఱొండునవకాశమును బొడకట్టినది. ఎట్టిదన?

ఇక్కావ్యమున కథాగౌరవము, రచనారామణీయకము–ఇవిగదా ప్రధాన ప్రశంసావిషయ ములు. ఆ రెండింటి ప్రశస్తిని సంపూర్ణముగా విశదీకరించు కృత్యము ఇతరులవలన ఈవఱకే సిద్ధమయి లోకమున వెలసియున్నది. అది నాకుఁగాని వేఱొకరికిఁగాని మిగిలినది లేనేలేదు. ఎట్లన;

ఈ 'మహాత్మకథ'కు మొదటిభాగమగు 'ఆత్మకథ' పదునాఱేండ్లకుమున్నే వెలువడియున్నది. దానికి విద్వదవతంసులు, విమర్శకాగ్రణులు, సరసహృదయములు, సాహితీరసికులు కట్టమంచి వారు 'తిలకరచన' వెలయించినారు. వారు ఏ విషయము నయిన ఆఁచి, తూఁచి పలుకు నభ్యాసము గలవారు, పొల్లుమాటలు గిట్టనివారు నగుట సుప్రసిద్ధము. 'తిలకరచన'మున మహోల్లాసము చూపుచు రెడ్డిగారు ఇతివృత్తమును గూర్చి :– 'ఈ చరిత్రము లోకారాధ్యము,

సర్వజనాదరణీయము, సంసేవ్యము' అని వక్కాణించినారు. రచనమును గుఱిచి :- అది త మ్మాకర్షించి వదలనిచ్చినది కా దని, యించుమించు ఆంధ్రమహాభారతప్రతిబింబ మని పల్కినారు. ఆత్మకథ చదివినపుడు తమకుఁగలిగిన ఆనందాశ్చర్యములకు మేరలే దని స్వానుభూతిని వెల్లడించినారు. సీతారామకవి భావ మనర్గళముగఁ బ్రవహించుచందాన వ్రాయఁగలుగుటం బట్టి తిక్కనతో సజాతీయుఁడయిన మహనీయుఁడని తమసంతసము వెలువరించినారు. వీరికవిత్వమునెడ తమకుండు గౌరవభావమును, దానివలని హృదయాహ్లాదమును దినదిన ప్రవర్ధమానము లగుచున్న వని అయాచితముగా ఆత్మానందము నావిష్కరించినారు. ఇంతతో నూరకుండక భరతదేశము స్వతంత్రతామహితమయిన యీ గొప్పదశకుఁ దగినట్టి వీరకావ్యము నొకదానిని మహాత్ముని శాశ్వతికాస్థానకవియగు సీతారామకవియే సంతరింపవలయు నని తమ ముచ్చట సూచించినారు. మహాత్ముని చరితమునఁ గల యుదాత్తతకును, దాని నుపపాదించిన తుమ్మలవారి కవిత్వమునఁ గల ఔన్నత్యమునకును ఇతరప్రశంసలతో నిఁకఁ బనియేమిగలదు? మఱియు రెడ్డిగారొకరే యిట్లు ప్రశంసించుట కాదు. కవితాకళా కోవిదులు మఱికొందఱును వీరి కవితామాధుర్యమును అత్యానందముతో నభినందించియున్నారు.

తుమ్మలవారి కవితాస్రవంతి ఆత్మకథలోనే గాక మఱి పండ్రెండు కృతులలో భిన్నభిన్నములగు రమ్యరూపములతో దేశమునలుచెఱఁగుల జాలువాఱుచున్నది. ఆ గ్రంథముల రూపరేఖలు తిలకింపుఁడు.

## 1. ఆత్మార్పణము - 1928 - ఇది కపోతకథ

సీతారాముల కవితాకుమారి మొట్టమొదట పిట్టకథగా నవతరించి పలుతెఱంగుల విన్యాసము లతో ప్రాఁకి ప్రాఁకి తుట్టతుదికి గట్టికథగా కుదురుకొన్నది. ఇటమీఁద నెట్టి నడకలతో నెన్ని మెట్టు లెక్కఁగలదో! యాదృచ్ఛికముగా నొక దినమున ఒక కఱకుకిరాతుని కఠోరకృత్యము దృశ్యముకాఁగా, తిక్కనార్యుని లుబ్ధకపోతోపాఖ్యానము తలఁపునకు రాఁగా తోడ్తోడన దయనీయ మగు నితివృత్తముతో ఈ చిన్నికృతి యావిర్భవించి చదువరుల హృదయములఁ గరుణరసాప్లావిత ములఁ గావించినది.

ఈ కావ్యమునందలిది ఉన్నతాదర్శముల హత్తించు నుత్తమకథ యనియు, ఇందలి పరిస్థితులు ఊఁగుండెనైనఁ గరఁగింపఁజాలు ననియు, చౌదరిగారు బహుద్రష్ట లగుటఁ బూర్వకవుల రచనములందలి పోఁకిమిపోకడ లిందుఁ బొసఁగిన వనియు ఈ తొలికావ్యమును శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు ప్రస్తావించినారు.

## 2. రాష్ట్ర గానము - 1938

ఇది ఆంధ్రరాష్ట్రసిద్ధికయి దేశీయులు తహతహలాడు తరుణమున "సోదరా! లెమ్ము నీ హక్కు లాదుకొ"మ్మని ప్రజానీకము నుద్బోధించిన జాతీయకావ్యము.

దీని పీఠికలో శ్రీ విశ్వనాథవారు - ఈ కవిలో స్వభాషాభిమానము పరాకాష్ఠ పొందినది. ఈ కవి అచ్ఛశీలుఁడు, అమృతహృదయుఁడు, ఆదర్శబుద్ధి. ఈయన పాండిత్యమును, కవితాశక్తిని గూర్చి వక్కాణింపఁబోవుట సూర్యుని దివ్వెపెట్టి చూపుట. ఈయన కవిత్వము వెన్నెలతీఁగ మెఱపువలె చలింపనిదై నేత్రాభిరామమై ఆలోచించినకొలఁది, చూచినకొలఁది హృదయంగమమై యలరారును. ఈయన తెలుఁగునుడికారమునందు చక్కనిపట్టుదల గల కవి. మఱియు ఉక్తి వైచిత్ర్యము గలవాఁడు. ఆంధ్రపద్యరచనా శిల్పములోని మెలఁకువలు ఈ కవిగారి కెన్నో తెలి యును-అని యుల్లేఖించినారు. ప్రతిభాసంపన్నులు, బహుగ్రంథ రచయితలు, భావుకశిరోమణులు నయిన విశ్వనాథవారి యామోదముకన్న తృప్తికర మగునది మఱి యేది కలదు?

## 3. ధర్మజ్యోతి - 1940

### ఇందలి దొక ధర్మవీరగాథ

కానిగాదు, పరకగాదు, లక్షలు వెలవెట్టు సువర్ణము అయాచితముగా, అప్పనముగాఁ జేతఁ జిక్కుచుండ కష్టార్జితము కాని పరులసొత్తు మన కేల యని తృణముగాఁ ద్రోసిపుచ్చిన మహ నీయుఁడు తన జనకుని ధార్మికతను ఇట్టికావ్యరూపమున సంతరించుట పితౄణవిముక్తి గాంచుట.

దీని 'తొలిపలుకు'న శ్రీ వేటూరివారు 'ధర్మజ్యోతి'లో కవితాధార దరులొరసికొని నిండారి పార్వాఱిన' దని పలికినారు. ఇందలిపద్య మొందు చూపి 'పద్య రచన మింతకంటె బాగుగా నుండుటకుఁ దెఱంగు నే నెఱుంగ' నన్నారు. పాండితీ ప్రసంగములందును, కవితావిలాస రీతులందును, విమర్శవినోదములందును విదితవేదితవ్యులయిన ప్రభాకరశాస్త్రిగారే యెఱుంగ నిది యితరుల యెఱుక కందుట దుర్ఘటము.

## 4. పఱిగపంట - 1943

ఇది దేశమున ప్రవృత్తములు, వర్తమానములు నయిన రసవత్తరఘట్టముల ఖండకావ్య సంపుటము.

దీనికి పురస్కృతిగావించుచు కాటూరివారు - ధర్మమూర్తి, జనకుఁడు ఆ నారయ్య నిండుమనస్సులో వెలిగిన జ్యోతియే చౌదరిగారియందు వెలిగి వారి కింతటి అభిజనాభిమానం సమకూర్చిపెట్టింది. సీతారామమూర్తిచౌదరిగారు జాతీయ మహోద్యమమునకు నడుముగట్టిన కవులలో ప్రథమగణ్యులు. చౌదరిగారు నిజమైన తెలుగుకవి. పల్లెసౌభాగ్యాన్ని చిత్రించే సిద్ధహస్తుడు. కవులలో చౌదరిగా రొక్కరే శృంగారముజోలికి వెళ్ళకుండా ఉత్తమకావ్యములను రచింపగల్గిరి. స్వభావముచేతనే వారు వీర కరుణ రసలుబ్ధులు. సర్వాంగసుందర మయిన చౌదరిగారి కవిత్వం చదువుతూఉంటే ప్రాణాలు లేచివస్తవి. వీరి తెలుగుపోకడలు వేమన్నను, తిక్కనను గూడ మఱపిస్తూ ఉంటవి. వీరికందముల పరుగు అందుకోరానిది. చౌదరిగారు కలంపట్టినది మొదలు నేటివరకు

చేస్తున్న రచనలు ఎక్కడా జల్లిపొల్లులు లేక కండగలిగి రసనిర్భరము లగుట నాన్యతోదృష్టమని చెప్పాలి.

అని యింకను ఎన్నియో పురస్కారవచనములు పలికినారు. ఆంధ్ర వాగ్దేవిగుడిలో గణగణమని గంటలుమ్రోగించి, రావణాసురుని ఱాతిగుండెనుండి హేలగా భక్తిరసము పిండcగలిగిన కోమల కవితామూర్తి కాటూరివారి పురస్కారముకంటె తనివిగొలుపునది వే ఱేమికలదు?

## 5. ఆత్మకథ - 1950

### ఇది గాంధిగారి ఆత్మకథకు పద్యానువాదము

దీనిcగూర్చి కట్టమంచివారి ఆమోదాభినందన సువిశాలప్రసంగములు ముందటి పుటలలో కలవుగదా! పునరుక్తి యేల! వారిదృష్టి కందినవస్తువుపయి ఇతరు లెవ్వరును చేయివేయc బనియుండదు.

## 6. ఉదయగానము - 1954

లబ్ధరక్షణ మున్ననాcడే ప్రాప్తలాభము సార్థకము గాన సిద్ధించిన రాష్ట్రము చెన్నుమీఱుతెన్నులు గాంచుcడీ! యని తోడిసోదరుల కుపదేశించిన ఉపాయములతో నీతులతో నిండారి జాతిసమున్నతి సాధన మగు నుద్బోధముతో ఉదయించిన దీగ్రంథము.

దీనిని సమీక్షించిన శ్రీ పరుచూరి వేంకటసుందరవరదులు :-

"అభినవతిక్కనగారి కవిత్వము స్పష్టముగ వాణీవరప్రసాదితము, స్వచ్ఛాంధ్రతాస్ఫోరకము. పరిణతభావ సముపేతము. ఆ నడకలోని హుందాతనము, పలుకులోని గంభీరత, పదప్రయోగము లోని ఔచిత్యము వీరికావ్యముల కొకవిశిష్టత నొడcగూర్చినవి. తెలుcగునుడికారపుసొంపు, భావపుష్టికిcదగిన భాషాసమృద్ధి వీరి సొమ్ము. వీరి కావ్యముల నెందుc జూచినను నిత్యసత్యములు కుప్పలు తిప్పలుగ చిప్పిలుచుండును. వీరు మాతృభాషాదేవిని మనోహర పద్యసుమములతో అర్చించి ధన్యులయినారు."

అని ముద్దులొలుకు పలుకులతో తమ సుందరహృదయమును వెల్లడించినారు.

## 7. శబల - 1955

ఇదియు 'పఱిగపంట' వలె 'సంక్రాంతి తలcపులు' మున్నగు వివిధములగు కమనీయ ప్రసంగములతో నిండిన ఖండకావ్యముల సంపుటము. ఇందు రచయితకు అప్పుడప్పు డొదవిన ఆదర్శకల్పములగు ననుభూతులు కావ్యరూపమున ఆవిష్కృతము లయినవి.

'రాష్ట్రగానము'నకువలె దీనికిని శ్రీ విశ్వనాథవా రొక పీఠిక వెలయించినారు. అందు "చౌదరిగారు నిర్దుష్టమయిన సుష్ఠుభాష వ్రాసెడి కొలఁదిమందిలో నొకరు. వీరిది మిక్కిలి సంప్రదాయ సిద్ధమయిన భాష. వీరి కవితాశక్తి శబ్దమును విడిచి చిందులుద్రొక్కదు. పాఠకుని విపరీతబుద్ధిమీఁద వీరి కవితాశక్తి ఆధారపడి లేదు. అందుచేతనే వీరి 'అభినవతిక్కన' బిరుదము సార్థకమైనది" అని తమ యాశయము వెలువరించినారు. మఱియు నిందలి ఖండఖండమును పరామర్శించి దాని దాని స్వస్వరూపకథనముతో నందలి గుణములు సప్రమోదముగా వెల్లడించి నారు. హృద్యమయిన పరామర్శము.

## 8. గీతాదర్శము - 1957

ఇది భగవద్గీత కనువాదము. ధర్మాభిలాషులకుఁగాని యితర కవులకు గీతానువాదసంకల్పమే యుదయింపదు. ఉదయించినను అనువాదకృతి సుకరము, సుసంగతము కానేరదు; కష్టసాధ్యము. ఆ క్లేశమును "ఈపని నాతలకుమించినదే – అయినను భారతీయమగు నా యాత్మ నా కవితాత్మ నిట్లు ప్రేచినది. ఎట్లో గట్టెక్కితిని." అను రచయిత పలుకులే తెలుపుచున్నవి. ఇందు ఉపపాద్యము లగు గీతాధర్మములు గహనము లయ్యు ఏతదుపపాదన సహజసారళ్యముంబట్టి యాధర్మములెల్ల సామాన్యులకు సయితము సులభావబోధము లయినవి.

## 9. సర్వోదయగానము - 1960

మహాత్ముని యనుయాయులలోఁ బ్రథమగణ్యుఁడు, సకలకల్యాణోదయ సాధనమే ఏకైక లక్ష్యముగా నిరంతరము పరిశ్రమించు కరుణాళువు నగు వినోబా మహర్షి – యశ్రాంతయాత్రా ప్రసంగములు, సదుపదేశసమావేశములు, హృదయంగమములయిన గ్రామదానాది పవిత్ర సన్నివేశములు, ఎన్నియో యిందు విశదముగా ప్రదర్శితములు.

దీని పీఠికలో శ్రీరాళ్ళపల్లివారు –

సీతారామమూర్తిగారి కవిత స్వతంత్రమైన మాధుర్యసౌరభ్యములు వెదచల్లఁగలది. సౌలభ్య గాంభీర్యములు దానిమూలద్రవ్యములు. భావములు భావేమునీశ్వరునివే యైనను వానిని జీవ రత్నములుగాఁ దీర్చి యందిచ్చినపుణ్యము సీతారామమూర్తిగారిది. దానిఫలము ననుభవించు భాగ్యము తెలుఁగువారిది. ఇట్టి లోకకల్యాణహేతువయిన కవితకు వలసిన భావనాబలము "ప్రజలమేలు గీళ్ళఁ బాల్గొను వారికే" లభింపఁగలది. కుక్షింభరులకు లభింపదు. వీరి 'ఆత్మకథ' మహాత్ముని ఆధ్యాత్మికప్రభను కన్నులుమిఱుమిట్లుగొలుపునట్లు చేయు మహాంధ్రకవితారచన. శ్రీ గాంధి వినోబాలయెడ వీరికిఁ గల భక్తి, వారినడవడియందుఁ గల ప్రతిపత్తి, వారి యుపదేశము లందుఁ గల ప్రపత్తి – ఇవి నిర్మలములై శ్రీ మూర్తిగారి కవిత వెన్ను వంగక నిటారుగా నిలఁ బడునట్లు చేసినవి."

అని తమ హృదయము నావిష్కరించినారు.

బహుశ్రుతులు, పాండితీనిష్ణాతులు, సాహితీరసికులు, కవితామర్మవిదులు, విమర్శకళా విహారులు, ప్రామాణికాగ్రగణ్యులు నగు శ్రీ రాళ్ళపల్లివారి హృదయము నుండి వెలువడిన యీ పలుకులు అపరిమేయ తృప్తికరములు.

## 10. తెనుఁగునీతి - 1956

ఇది భర్తృహరి నీతిశతకమునకు నిజమయిన తెలుఁగుసేఁత.

దీనికి 'విద్యాప్రవీణ' శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు 'తిలకరేఖ' దిద్దుచు - ఇక్కవి రచనలో మూలములోని శబ్దార్థములు గుణీభూతములై భావము ప్రాధాన్యము నార్జించుకొన్నది. తెనుఁగుఁదన మాద్యంతము కూలంకషమై జాలువాఱినది. శైలి గభీరరమణీయము. కవితకు ప్రసాదగుణముతో పాటు జిగిబిగువులు హెచ్చు. కావ్య మామూలాగ్రము శోధించినను వ్యర్థపదము కలికమునకైనను గానరాదు. గీతికందము లీకవికిఁ బెంపుడు చిలుకలు. వానిని దాను వలచినట్లు పలికించును వివక్షితార్థ మసందిగ్ధముగాఁ జెప్పుటలో నీకవి కనన్వయ మన్వయించును - అని పలికినారు. చక్కని పలుకులు, శతకరచనమునకు తగిన తిలకరచనము. శతకము నందలి గుణగణరూపమున కిది అచ్చుమయిన ప్రతికృతి.

## 11. నేను - 1963

సాధారణ సామాజిక సందర్భములందును, శారీరక మానసిక ప్రవృత్తులందును, భాషా కవితాది విషయములందును బాల్యమునుండి తుమ్మలవారికిఁగల అభిరుచులు, అభిలాషములు, అనుభవములు, ఆసక్తులు, ఆదరములు మున్నగువానితో నిండిన తదాంతర రూపమెల్ల ఉన్నదున్నటులు సువిశదముగా నిందు ప్రతిబింబించును. తన్నుఁ దా నెఱుఁగుట ఆత్మజ్ఞత. అద్దానిని యథాతథముగ లోకమునకు నివేదించుట ఆర్జవము. ఈ గుణములు రెండును శస్తములలో ప్రశస్తములు. నిజమునకు కోఽహమ్మను జిజ్ఞాసయు, సోఽహమ్మను వివేకమును గలుగుటకంటె వాంఛనీయమే లేదు.

ఈ కృతిలో ప్రదర్శితములైన భావములమొత్తమున "తెలియని దెంతో కలదని॥ వలఁతులకడ మస్తకమ్ము వంచెద ...." అను నీభావము సెబాసని యెల్లరును శ్లాఘింపఁదగినది.

## 12. పైరపంట - 1964

ఇది రచనము సాగింప సాగింప అనుభవపరిపాకము నొందిన కవిగారి జీవితపు టుత్తరార్థ మున సంతరించిన మధురాతిమధురము లగు ఖండకావ్యముల సంపుటము. ఇందలివి నూతన లోకానుభవములు. మరలమరలఁ జదివించు మధురభావములు.

# 13. సమదర్శి - 1967

ఈకాలపువారిలో సుకవులు, సహృదయులు, సత్సంకల్పులు, సదాచారులు, పండితులు, మేధావులు, స్వార్థరహితులు, దేశారాధకులు, ఉపకారపరులు, ఉచితవర్తనులు, ధర్మనిరతులు, త్యాగమూర్తులు – అని తమకుఁ దోఁచిన కొందఱు మాననీయుల స్వరూపప్రశంస లిందు ప్రదర్శితములు. ఇట్టి మహనీయుల ఆదర్శప్రాయమగు గుణగణమును విశదీకరించుట భావికాల సమాజమునకు మేలిబాట చూపుట.

దీనికి 'ఆముఖము' రచించుచు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు

"శ్రీ సీతారామమూర్తిగారు రాష్ట్రకవి. గాంధికవి. సత్యాహింసలు వీరి కావ్యములందు వివిధ భూమికలతో గోచరించును. వీరిది యుగానుకూలమైన కవిత. వీరు మతాంతరవాదులకును సమకాలిక కవులకును జయకారములు పలుకు సమదర్శనులు. సహృదయులు, ధారాళమైన శయ్య, మాధుర్యముతోఁ గూడిన సౌలభ్యము, తెనుఁగుందనము – ఈమూఁడును వీరి కవితకు ముఖ్యలక్షణములు" అని కవియెడను కవితయెడను తమకుఁ గలిగిన సంతృప్తిని వెల్లడించినారు.

పండితవతంసులు, పరిశీలనప్రవీణులు, భావుకశిఖామణులు, ప్రఖ్యాత కవిపుంగవులు ఇంత మంది సీతారామమూర్తిగారి కవితావిశిష్టతను ఇన్ని విధములఁ బ్రస్తావించియుండ ఇపు డీమహాత్మ కథలోని కవితారీతినిగూర్చి క్రొత్తగా నిఁకెవ్వరును దడవం బనిలేదు. కావున ఆయంశమున నేను మౌనమువహించుటకు అనువుచిక్కినది. దానిచే గురుశిష్యులనడుమ నుండఁదగిన ఔచిత్యమును దక్కినది. ఇఁక వేఱు విషయములంగూర్చి యించుక ప్రసంగించుకొందము.

ఈ గ్రంథమున నితివృత్తము మహాత్ముని జీవితోత్తరభాగచరిత్రము. మహాత్మునిచరిత్ర లోకారాధ్యము, సర్వజనాదరణీయము, సంసేవ్యము, అనిమాత్రము విమర్శకులు రెడ్డిగారు పూర్వభాగమున వక్కాణించినారు. ఎందువల్ల లోకారాధ్యమో హేతువు నూహించుకొనుభారము మనపయి నునిచినారు. ఆ చరిత్రమునఁ గల ఉపదేశమహత్త్వమే దాని లోకారాధ్యతకుఁ గారణము. ఆ మహత్త్వ మెట్టిదందురా? ఎన్ని దేశములందుఁగాని, ఎట్టి ఘట్టములయందుఁగాని, ఎన్ని పర్యాయములు గాని గాంధిగారు లోకమునకు బోధించినవి రెండేరెండు విషయములు. 1.సత్యము, 2. అహింస. – 'సత్యాన్నాస్తి పరోధర్మః; అహింసాపరమోధర్మః' అనునవి నేఁడే వెలువడిన క్రొత్తపలుకులు కావు. గాంధిగారు సృజించినవియుఁ గావు. ఎంతోకాలము నుండి ఎందఱో వల్లించుచున్నవే. అందఱు నెఱింగినవే. కాని ఇతరుల యుపదేశమునకును గాంధి ప్రబోధములకును నంతర మెంతేని కలదు. 'పరోపదేశ వేళాయాం సర్వే వ్యాసపరాశరాః' అన్నట్లుగాక మున్ను తా నాచరించి పిమ్మట నితరులకు బోధించుట గాంధిగారి మార్గము. అందువల్లనే ఆతని ప్రబోధములు ప్రజల హృదయములను సూటిగా తాఁకఁగలవు. ఆచరణ దూరుల శుష్కవాక్యములు చెవులుదాఁటి లోనికి చొరఁబాఱవు. ఇదీ భేదము. కావుననే గాంధి ప్రబోధనములు లోకారాధ్యము లయినవి. ఆత్మమహత్త్వ మున్నవారుగాని ఆచరణపూర్వక

ప్రబోధనములకుఁ గడంగరు. కడంగను జాలరు. గాంధిగారిది వాగ్రూపబోధనము కన్న క్రియారూపప్రబోధన మధికము. ఆయనకుఁ గల భూతదయ అపారము. ఆ సమదర్శిత అవ్యాజము. ఆ సంకల్పబలము అసాధారణము. ఆ కార్యదీక్ష అచంచలము. ఆ చూపు అతి నిర్మలము. ఆ పలుకు అతిమధురము. ఆ శమప్రధానత అప్రతిమానము. ఆ యాస్తికత అతిగాఢము. ఆ యాత్మవిశ్వాసము అతిప్రబలము. ఆ దూరదర్శిత అపరిమేయము. ఇట్టి లోకోత్తర గుణములకెల్ల మూలమయిన ఆత్మమహత్త్వమునుబట్టియే గాంధిగారు మహాత్ములయినారు.

మనభాషలో మహాత్మశబ్దముతో పాటు మహానుభావులు, మహామహులు, మహాశయులు, మహోదయులు మున్నగు శబ్దములు వ్యవహారక్షుణ్ణము లయినవి పెక్కులు గలవు గాని 'మహాత్మ' శబ్దముతో సరితూఁగు పద మొక్కటియు వానిలోఁగానరాదు. దీని తూనికయే వేఱు. దీని బరువే వేఱు. ఇది సాధారణ విశేషణ శబ్దముకాదు; బిరుదపదము. అట్లని వ్యక్తులుగాని, సంస్థలుగాని, సమాజములుగాని ఎదియో మోమోటకయి సభలుతీర్చి ప్రసాదించినది కాదు. లోకము స్వయముగా సంతరించుకొన్నది. లోచూపునఁ జూచినచో బిరుదమనుటయు పొసఁగుమాట కాదు. సాధారణముగా బిరుదము లన్నవి ఏకవ్యక్తినియతముల కాక మఱికొందఱ కును అయ్యవి వర్తింపఁ జెల్లును. మహాత్మశబ్ద మట్టిది కాదు. ఇది గాంధిశబ్దమునకు పర్యాయ పదముగా, యోగరూఢముగా లోకమంతటను వ్యాప్తమయినది. 'మహాత్మ' అనుట చాలు. గాంధి యనియే దాని కర్థము. ఈతని యాత్మమహత్త్వమును తఱచితఱచి ఎఱిఁగి యెఱింగి లోకమే కాలక్రమమున మహాత్ముఁ డని వ్యవహరింప సాగినది.

గాంధిగారి భూతదయాళుత అడుగడుగునను కానవచ్చును. చిన్నయసూరీయమున ఏదో యొకసూత్రమున, ఏదో యొక వ్యాకరణాంశమునకు లక్ష్యముగఁ జూపఁబడిన యొకవాక్యమున ఎపుడేని ఎవరేని అసాధారణ భూతదయాశీలు రున్నచో, వారికి వాచకముగా అనురూపమయినది 'మహాత్మ' శబ్దముసుఁడీ! యనుసూచన మొండు గలదు.

"భూతదయాళు రగు మహాత్ములకు శ్రేయంబు గలుగును."

భూతదయాపారమ్యమువల్లనే గాంధిగారికి రాష్ట్రసిద్ధిరూపముగా శ్రేయము గలుగుట మనకుఁ బ్రత్యక్షము.

ఆనాఁటి సూరిగారిసూచనమునకును, ఈనాఁటి 'మహాత్మకథ' శబ్దవ్యవహారమునకును యాదృచ్ఛికముగ నయినను ఇట్లు పొత్తుకుదురుట ముచ్చటగొలుపును. అది యటుండనిండు. వేఱొకమాట.

తుమ్మల సీతారామమూర్తి గారు ఈ 'మహాత్మకథ' రచింప నారంభించు తరుణమున గురుస్మరణ ముపస్థిత మయినసందర్భమున నన్ను నిర్దేశించుచు "ఏపగిదిన్ భజించి నుతియించిన నీగురునప్పు దీర్తునా? అని తన్నుఁ దానే ప్రశ్నించుకొనుచు తమచింతను వెలిపుచ్చినారు. ఈ గురుఋణమును తీర్చుకొనుట యెటులో యనుచింత ఏకాంతో ఆయన కున్నట్లున్నది.

ఉండనిండు. మహాత్ముని సారస్వతాస్థానమున గురువిరహితంబుగాఁ గూరుచుండ నొల్లక కోరికోరి తదగ్రభాగమున (అవతారికారూపమున) నాకుఁగూడ నొకపీఠము నిట్లు పొందుపఱుచుట గురుదక్షిణగా నామదికి భాసిల్లి 'కొంచెపాటి యాచార్యకమునకు ఇంతటి దక్షిణ స్వీకరించుటయా' యను సంకోచము నాకునుం గలదు. ఋణపడితినే యనుచింత ఆయనకు. – ఎక్కువ తీసికొనుచుంటినే యను సంకోచము నాకు. ఈ లెక్కల యెచ్చులొచ్చులు ఇపుడు తేలునవి కావు. ఎప్పటికిని తేలవేమొ. మఱొకయంశము.

ఇక్కవి ఆస్తికుఁ డయ్యు తన కృతిసమర్పణ సందర్భములందు ఒక ప్రత్యేక దృష్టిగల వ్యక్తి.

**గీ. ఈశ్వరుని జాటఁగా మర్త్యుఁ డెవఁడు? వీని, కైత కతఁ దుబ్బు ననుటయుఁ గల్ల; కాన**
**హేమగిరికి వరాటిక నిచ్చినట్లె, నరుఁడు తనరచనమ్ము నీశ్వరున కిడుట.**

అని భావించి కావ్యమే యననేల! "య ద్యత్ కర్మ కరోమి తత్త దఖిలం శమ్భో! త వారాధన" మ్మను నమ్మికతో తృప్తిపడి తనకృతిని దేనినిగాని భగవదంకితము సేయుటకు సంకల్పింపలేదు. ప్రకటితపూర్వములగు పదుమూఁడు కృతులును నరాంకితములే! ఆ నరులలో ధనాఢ్యులకుఁ గాని ఉన్నతాధికారులకుఁగాని కృతు లర్పించి వారివలన ధనాదికమునో ఇతరోపకృతులనో వేఁడునట్టివాఁడు కాఁడు తుమ్మలకవి. కన్యాశుల్క మీయనకు రుచింపదు. ఎవరి దృష్టి వారిది. సమాజమున ప్రసిద్ధులా అప్రసిద్ధులా అనిగాని, పిన్నలా పెద్దలా అనిగాని భేదము గణింపక దేశహితకాముకు లగు గుణవంతుల నెంచియెంచి ఆగుణమునకు నుడుగరగా కృతు లర్పింపవలయు నని ఆదినుండి యీయన కోరిక. పూర్వరచితము లన్నిటికిని అట్టివారే కృతిపతులయి కృతికర్తకు ముదముగూర్చినారు. ప్రకృత మీ 'మహాత్మకథ' ను

**ఆ. పడవవాఁడు మెత్తఁబడనినాఁ డుత్తుంగ, భంగభయద యైన గంగ నీఁది**
**వీథిబడికిఁ జన్న వేళనే ప్రజలు నీ, గుండెబిగువు మెచ్చుకొనిరి శాస్త్రి!**

'మత్కృతమున్ 'మహాత్మకథ' నీ కావ్యంబు నీకంకితం బొనరింతున్ – ఈపాలి నీకుఁగా కెవని కిచ్చెద – శాస్త్రిజీ! రమ్ము! కృతినందుకొ' మ్మని గాంధిశిష్యులలో గణనీయుఁడయిన మహనీయునికి లాల్‌బహద్దురుశాస్త్రికి సమర్పించుట సకలసంతృప్తి జనకమగు సంఘటనము. బంగరునకు పరిమళ మబ్బినది.

## రచయితతోనొక్కమాట :

మీరు మీ మొదటికృతి 'ఆత్మార్పణ'మున "ప్రాచేతసుని రామాయణ రచనకుంబోలె నా యీచేఁతకు విషాదజనకమగు నిషాదచేష్టితమే మూలకారణ మని కృతినిర్మాణచోదకమగు సంఘటనము నుల్లేఖించుచు మాన్యులగు వాల్మీకులతో సాదృశ్యము తలఁచుకొనుచుంటినే, ఎవ్వరే నపహసింతురేమో యని కొంత సంకోచము సూచించితిరి. జ్ఞప్తి యున్నదో లేదో!

నలువదేండ్లనాఁటిమాట. ఆయంశమున మీరు సంకోచింపఁ బనిలేదు. పెద్దలయెడనుండు పూజ్యభావముచే మీ కట్టి సంకోచము కలిగినదేకాని ఆ సాదృశ్యభావనవలన వాల్మీకుల కాపా దిల్లిన న్యూనత యేమియు నుండదు. ఇట్టిది పూజ్యపూజావ్యతిక్రమము కాదు. మిమ్మెఱింగిన లోక మీ యంశమున అన్యథా భావింపదు. ఆనాఁడు మీకు స్ఫురించిన ఆ సాదృశ్యముమాట యటుండ, 'రామాయణ' 'మహాత్మకథ' లకును, ఆ రెండిటికి రచయిత లగు మీ యిద్దఱకును నడుమ సాదృశ్య సాంగత్య రేఖలు మఱికొన్నియుఁ బొడకట్టుచున్నయవి.

రాముఁడు సకలసంసేవ్యుఁడు – గాంధి లోకారాధ్యుఁడు. దానింబట్టి రచయితలు మీ యిద్దఱకును ఉత్తమనాయకలాభమును తన్మూలకమగు సంతృప్తియు సమానము. కాఁగా ఈ యంశమునఁగూడ మీయిరువురకును సాదృశ్యము సమకూరినది.

మఱియు మీ మీ నాయకు లుభయులును అత్యంత సన్నిహితులు. వారి నాయకుఁడు రాముఁడు ఆరాధ్యుఁడు. మీ నాయకుఁడు ఆయనకు నిరంతరారాధకుఁడు. వారిద్దఱకు అట్టి సేవ్యసేవకబాంధవము, సంబంధము కుదురుపడినది.

మఱియు మీకును మీ గ్రంధనాయకునకును నడుమ మఱియొక వైచిత్రి కలదు. రామ భక్తుఁడు గాంధి – గాంధిభక్తుఁడు రాముఁడు. ఇది మఱింత విచిత్రము.

ఇట్టి సన్నివేశములు యాదృచ్ఛికముగ సంఘటిల్లుచుండును.

* * * * *

ఇక్కావ్యమునఁ గథాసరణి అనుస్యూతమయి ఆకర్షకమయి చదువరిని నడుమ నడుమ నాఁగనీదు. ఉత్తరోత్తర కథావగాహన కుతూహలమును తుదిదాఁక తగ్గనీదు. ఇది వీరరసో ల్బణము. కరుణరసాలవాలము. ఈ చరిత్రమునందలి పెక్కుఘట్టములు చదువరికి తన్మయత నొదవించును. మాటలు పెక్కు లేల! పటపట పండ్లు గొఱుకుచునో పదేపదే పొడముచున్న కన్నీరొత్తుకొనుచునో నేను జదివినఘట్టము లిందు పెక్కులు గలవు. ఉదాహృతికి నొండు రెండు ఘట్టములు చూపెదను.

జలియన్‌వాలాబాగుహత్యలు ఆంగ్లప్రభుత్వమువారి రాక్షసప్రవృత్తికి ప్రబల నిదర్శనములు. ఇవి దేశభక్తి పరాయణుల గుండెలలో చిచ్చు రగుల్చునట్టివి. సీతారామమూర్తిగారు వీనిని వర్ణించుతఱి ననుభవించినపరితాపమును పాఠకులకును పంచుచున్నారు. డయ్యరు సేనాని క్రౌర్యముం జాటు వేఁడివేఁడిపలుకులతో వీరి కవితాశక్తి యిచట నెట్లు తాండవించినదో చూడుఁడు.

**శా. నిప్పుల్ క్రక్కుచు దూఁకి డయ్యరు చమూనేతృత్వ మేపార నే**
**తప్పున్ గానని బాలవృద్ధశిశుకాంతారంగమౌ రచ్చపైఁ**
**గుప్పించెన్ గృపమాలి మృత్యుసఖముల్ ఘోరాగ్ని గోళచ్ఛటల్**
**తెప్పల్‌తెప్పలుగా శవంబు లసృగబ్ధిం దేలి పర్వెత్తఁగన్.**

మ. పదునార్వందలగుండ్లు ప్రేల్చె నపు డబ్బా! యింతదౌష్ట్యంబు క
న్నదియున్ విన్నది గాదుకాదు; పురుషుల్ నారీమణుల్ కొండికల్
ముదుకల్ వాలిరి నాల్గువంద; లింక నెమ్ములుల్ తొమ్ములున్ ద్రెయ్యుటన్
దుది(ప్రాణంబుల రెండువేలజన మత్తోఁటం బడెన్ జేద్పడెన్. (పొరట 9)

ఈ పాంచాలదురంతములు కన్నులకుఁగట్టునట్లుగా వీరు వర్ణించినవిధానము చదువరులను క్రోధసంతప్తులను జేయఁగలదు. తెల్లదొరతనముపట్ల నేఁడును రోఁత పుట్టింపఁగలదు. ఈ రచనమును పరికింపుఁడు.

శా. ముక్కోణంబులఁ గట్టికొట్టి వసనంబుల్ విప్పి పుర్వంబలెన్
డొక్కన్ బ్రాఁకుట కాజ్ఞ పెట్టి సెలపోటుల్ గుప్పి క్రొన్నెత్తురుల్
నిక్కన్ వాల్కొరడాల మోఁది విమతానీకంబు లుప్పొంగుచో
దిక్కుం గానక పొక్కె భారతసవిత్రీదేవి పంజాబునన్

చ. నెఱిగలవారిఁ బట్టుకొని నేరము సెప్పక పండ్లు తివ్వనన్
గొఱుకుచుఁ గుప్పనూర్పిడికి గొడ్లనుబోలె బిగించి మేళముల్
మొరయ బజార్ల కీడ్చి నలుమూలలఁ ద్రిప్పిరి; దానఁ బోవ క
గ్గఱువలఁ ద్రొక్కి తాళములు కట్టిరి తుల్వలు పాకిదొడ్లకున్.

మ. మగవారిన్ వెలికంపి యంతిపురమున్ మల్లామడిం జేసి దుం
డగముల్ పెంచి పతివ్రతామణులఁ గట్టా! వీధికిం ద్రోసి వ
ల్వగమిన్ దుల్చిరి, వంగఁబెట్టి, రవలన్ వాక్రువ్వలే; నెట్టి నీ
చగతిన్ జొత్తురొ తన్మహాసురులు కాయం బూడ్చి దుశ్శాసనుల్. (పొరటలు 10, 11, 12)

తుమ్మలవారు కన్నెగంటిహనుమంతు – వీరమరణమును వర్ణించుచున్నారు. హనుమంతు పల్నాటిరైతులకు నాయకుఁడు. ఈరైతులు పుల్లరిగట్టుట మానిరి. ఈ తిరుగుపాటునుగూర్చి విచారింప నుపమండలాధికారి హనుమంతును బిలిపించెను. వచ్చుచున్న హనుమంతును పోలీసుపెద్ద అల్లంతదూరమునఁ జూచి.

ఆ. అతఁడె కన్నెగంటి హనుమంతు, మనపర్వు, పదటఁగల్పుచున్న పలువ యతఁడె
చంపవలయు వాని జంకకుఁ డనుచు ము, ప్పం(ద్రుబంట్లతోడ బలసె నతని.

క. టప టప మని నల్దెసలన్, దుపాకిగొట్టములు మ్రోసె దుర్భరకీలా
విపదాకుంచితవపువై, విపులాస్థలిఁ గన్నెగంటివీరుఁ డొరగెన్. (పొరట 47)

అసువులువీడుచున్న ఆ పల్నాటివీరుఁడు పోలీసునాయకుని చూచి అన్న మాటలు కవిగారి భావావేశమునకు, సన్నివేశ వర్ణనచాతుర్యమునకు నికషోపలములు. ఈ క్రింది పంక్తులను జదువుఁడు.

మం. ఓరిదురాత్మ! నీయుదు టెన్నినాళ్ళు, నిలుచుఁ? గర్షకులు కన్విప్పి రీఁనాడు
కార్మికుల్ తమపాలికర్తవ్య మెఱిఁగి, రెదిరించి రేల్బడి నెద జంకులేక
కిగ్గాడి! నీకు నెంగిలికూడు వెట్టు, తెల్లవాఁ డీ ధరిత్రిని గుల్కఁ డిఁకను
సాగదురా! వానిశాసనం బిచట, మాకాఁపుబిడ్డ లీమహి నేలఁగలరు
మాకూలిపెద్ద లీమహి దిద్దఁగలరు, మారాజ్య మిఁక వచ్చు మాపెంపు వచ్చు
మాగాంధిజెండాకు మహిమమ్ము వచ్చు, నీచుఁడా! పొంగకు! నిలువనిమేని
కొఱకు నే విలపింప గోరంతయైన, దేశంబునకు సముద్దీప్తి రావింప
నాయన్న లీపలనాటిహంవీరు, లెందఱో తనువూడ్చి రేగిరి దివికి
నచ్చమౌకీర్తికి నధిపతులైరి, కవిశేఖరులమెప్పు గాంచి రటంచు
నెఱ్ఱటోపీవాని నెదిరించి పల్కి, దీనదృక్కులఁ దన్నుఁ దిలకించుజనుల
కదలరా దడలరా దరి నీయరాదు, సాగింపవలె మీరు శాంతిసంగరము
పల్నాటిమగఁటిమిన్ బ్రదికింపవలయుఁ, దెలుఁగుదేశంపుఁగీర్తిని నిల్పవలయు
నాయకునకు లొంగి నడతేరవలయు, జయమందవలె నని సందేశ మొసఁగి
దగతోడ మరణవేదనతోడ రెండు, జాములపాటు వేసారి వేసారి
యక్కటా! కనుమూసె నంతఁ బల్నాటి, కడిమికి నెఱపాదు కనెగంటిజోదు. (పొరటలు 47, 48)

సీతారామమూర్తిగారు కావ్యశిల్పరహస్యములను ఆకళించుకొన్న కవి. కావుననే యీ కావ్యమునందు ప్రకరణోచితమైన భాష మనకుఁ గోచరించును. మహాత్ముఁడు క్షామపీడితమైన వంగభూమిని దర్శింప వచ్చుచున్నాఁడు. ఆనాఁడు ఆదేశ మనుభవించుచున్న దుర్భరదుర్దశలను కవిగా రెట్లు వర్ణించుచున్నారో చూడుఁడు.

గీ. అది దురాశాపిశాచీ సమర్చన ప్ర, భూత సవన బృహద్భానుహేతివదన
హుత దయాధర్మలకు, నరాకృతినివిష్ట, దుష్టరక్షస్సులకు, జగద్ధూమకేతు
వులకు, గేతువులకు, వణిక్కులకు నిలయ–, మది నిరంకుశక్షామ దురంతదుర్భ
రాగ్రహావేశ వికటాట్టహాస జవన, గమనవిన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన, రాశి బలివోయినట్టి నిర్భాగ్య దేశ –
మది మహాభూతవేతాళమదవతీప, రంపరా రూక్షఖడ్గ నిర్యత్ ప్రభా స
ముజ్జ్వలద్దంష్ట్రమై మృత్యు వుగ్రదీర్ఘ, జిహ్వ లార్చుచు వాహ్యాళిచేసినట్టి
రంగ – మది మదిఁ గరఁగించు వంగభూమి. (పొరట 261)

మఱియొకమాట – మహాత్ముని వ్యక్తిత్వమును ఎందఱో వర్ణించిరి. వర్ణించుచున్నారు. కాని సీతారామమూర్తిగారివలె ఆపురుషోత్తముని – ఆంతరవిభూతిని సందర్శించి చాటినవారు పెక్కండ్రు కానరాదు. ఈమాట కీపద్యమే తార్కాణము.



శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయ
మెవ్వఁ డెఱిఁగించె నాకు నయ్యిద్ధచరితుఁ
బ్రస్తుతించెదఁ బుంభావ పద్మజాత
రమణి దువ్వూరి వేంకటరమణశాస్త్రి

సీ. ఉత్తమవాగ్మి నా నొప్పారె నురక గ, ర్జించియా కాదు వర్షించి నుడులు
అతిలోకబల సమంచితుఁ డయ్యెఁ గండలు, పెంచియా కాదలయించి యొడలు
చిరజయశ్రీధురంధరుఁ డయ్యె రిపుల ఖం, డించియా కాదు పండించి కృపలు
అమృతత్వ మందె యాగము లాచరించియా, కాదు నిష్కామయోగము వరించి
యతఁడు సామాన్యుఁడెట్లు? వీరత కపూర్వ, జీవములు వోసి వాసిదెచ్చినమహాత్ముఁ;
డతనినడచిన బాటలయందు నడిచి, పందయును విక్రమక్రమాస్పందుఁ డయ్యె. (పొరట5)

తుమ్మలవారి వ్యుత్పన్నత యీ కావ్యమునందు బహుధా కన్పట్టును.

'అసలుకంటెను వడ్డి ముద్దయినయట్లు'
'తానా యనినంతనె తందానా యనినట్లు'
'పాము చావనియట్లు బడిత విఱుగనియట్లు'
'మఖను బుట్టి పుబ్బ మణఁగిన దన్నట్లు'

మున్నగులోకోక్తు లిందు ప్రాయికంబుగాఁ గలవు. లోకోక్తు లన్నవి ఏయొక్కరును పనిఁ బూని రచించునవి కావు. లోకవ్యవహారమున భాషాసమష్టిలో భావవిశేషస్ఫోరకములుగా అసంలక్ష్య నిష్పత్తిక్రమములయి కాలక్రమమున తమంతఁ దాము రూపొందునవి. వీనికి లోకమే రచయిత. ఇవి భాషాసౌందర్యమును, భావసౌలభ్యమును సమకూర్చును. తరుణస్ఫురణము కలవారి కృతులయందె యిట్టివానికి ప్రాయికప్రవేశము. మఱియు;

'చేపడ వెన్నఁడును వెతలఁజెందక జయముల్'
'ఎట్లుపలికిన విత యౌనె ఋషివచస్సు'
'చదువు కతము గాదు సద్గుణమ్ములకు'
'ఎల్ల కాలము కష్టము లెదురలేవు'

మున్నగు నర్థాంతరన్యాసములు పెక్కులు ఇక్కావ్యమున సుసంగతమలయి శోభాధాయకము లయినవి. ఇంతేకాక

అంగవింతు – వింగడించు – వీనుమిగులు – సవి – ఇల్లి – రువ్వ – నిగ్గుట – వార్పుట – మున్నగు మఱుఁగువడిన తెలుఁగు పదములను, ఇటులే అస్తుంకృతి – ఔపవస్తము – గ్రామైకరాత్రము – నైకలేఖములు – మున్నగు ప్రౌఢిగల సంస్కృత శబ్దములను బహుళముగాఁ బ్రయోగించుటలో నిక్కవికిఁ బ్రీతి మిక్కుటము. ఇది పాండితీప్రకటనమునకుఁ గాదు. భాషలోని పదజాలమెల్ల ప్రచురప్రచారవిలసితము కావలయు నని యీయన కొక కుతూహలము.

మఱియు నేఁటి శిష్టవ్యవహారమున క్షుణ్ణములయిన జైలు – రైలు – మొదలగు అన్యదేశ్యములకు వీరు ఆంధ్రలక్షణసంస్కారము గావించి వానిని నిశ్శంకముగ వాడుట యిక్కావ్యమునఁ బ్రచురముగాఁ గానంబడును.

"ఆదరింతు వీని నన్యదేశ్యము లైనఁ
బెఱలఁ జూచి బాసపెంపు వలచి''

అని వీనిని బ్రయోగించుట తన కభీష్ట మని ఆయనయే 'నేను' లో స్పష్టపఱిచిరి. సంస్కృత ప్రాకృతములనుండివలె తక్కిన ఏభాషనుండియయిన మనభాషలోఁ జొచ్చి నిలుకడ గాంచిన శబ్దములను తత్సమతద్భవ రూపమున మనము గ్రహించి ప్రయోగించుట అపచారముగాదు. అది భాషావృద్ధికి మార్గమగుటయు యథార్థము. రైలు, రోడ్డు మున్నగువానిని యథాతథముగఁ బరిగ్రహింపక అట్టివాని నాంధ్రీకరించుటకో, సంస్కృతీకరించుటకో యత్నించుటకంటె భాషకు అపాయము, వికారము, హాని, హింస వేఱొకటి లేదు.

మఱియు నీయన పదప్రయోగవిషయమున అతిజాగరూకులు. మిక్కిలి శ్రద్ధాళువులు. నియమనిష్ఠలు లేకుండ, సాధ్వసాధువిచారము లేకుండ, లక్షణపరిశీలనము లేకుండ, సంప్రదాయగౌరవము లేకుండ ఎవరిదారివారిదే యని యథేచ్ఛముగాఁ బ్రయోగించు సోమరుల కోవకుఁ జెందినవారు కారు. భారతాది ప్రామాణికగ్రంథములను లోచూపులతోఁ బలుమాఱు పరికించుకొనుచు, అటు ప్రయోగపరిపాటికిని, ఇటు లక్షణనియతికిని నూటికి నూఱుపాళ్ళును లోపడుచు ఏపదము నయిన నిదానముగాఁ బ్రయోగించు దృష్టియు, నభ్యాసమును గలవారు.

సంక్షిప్తముగ రచింపఁదలంచి యుపక్రమించిన యవతారిక యిప్పటికే యించుక దీర్ఘమయిన ట్లున్నది. ఇఁక ముగింతును. అప్తుల కొక్కమాట :-

'మహాత్మకథ' రసవంతమయిన రమణీయకావ్యము. అందున్నది సచ్చరిత్ర, సజ్జనగాథ, సంసారవిషవృక్షమునకు రెండుఫలము లమృతతుల్యముల. కావ్యామృత రసపాన మొకటి, సజ్జనసంగతి యొకటి. ఈకావ్యమువలన ఆఫలములు రెండును సులభములు కాఁగలవు.

అందుకొని యాస్వాదింపుఁడు
ఆనందింపుఁడు.

**-దువ్వూరి వేంకటరమణశాస్త్రి**

# విషయసూచిక


| | | పొరట |
|---|---|---|
| సత్కృతి | | i-viii |
| కృత్యాది | | 1 |
| | **మొదటి భాగము** | |
| **1919** - | రౌలటు చట్టము | 7 |
| | జలియన్‌వాలాబాగు హత్యలు | 9 |
| | గాంధి మున్నగువారు పంజాబు పడిన బాధలరయుట | 13 |
| | అమృతసరము - కాంగ్రెసు | 15 |
| | మహాత్ముని తీర్మానము నెగ్గుట | 16 |
| | ఖిలాఫత్తు సమస్యపట్ల నాంగ్లేయు లెగ్గుసేయుట | 17 |
| **1920** - | మహమ్మదీయులు తమవేదనను లండనులో వెలువరించుట | 20 |
| | గాంధి నిర్ణయము లోకమాన్యుని కిష్టముకాకుండుట | 23 |
| | తిలక్ నిర్యాణము | 23 |
| | ఖిలాఫత్తు సభలో నిరాకరణ మంగీకృతమగుట | 24 |
| | మహాత్ముఁడు నిరాకరణపద్ధతి బోధించుట | 24 |
| | కలకత్తాలో ప్రత్యేకమగు కాంగ్రెసుసమావేశము | 26 |
| | కాంగ్రెసువారు శాసనసభలను బహిష్కరించుట | 29 |
| | నాగపురి కాంగ్రెసు మహాసభ - గాంధివిజయము | 30 |
| **1921** - | మహాత్ముని సాహాయ్య నిరాకరణ ప్రచారము | 33 |
| | దొరతనమువారి నిర్బంధవిధానము | 35 |
| | బెజవాడలో కాంగ్రెసుసంఘ సమావేశము | 36 |
| | మహాత్ముఁ డాంధ్రదేశమునఁ బర్యటించుట | 38 |
| | కాంగ్రెసువిజయముగని ప్రభుత్వమువారు కలఁగుట | 40 |
| | మహాత్ముఁడు విదేశవస్త్రములఁ గాల్చుట | 42 |
| | కరాచీ యుపన్యాసము | 45 |
| | పల్నాటివారు పుల్లరిచట్టము నెదిరించుట | 46 |
| | కన్నెగంటి హనుమంతు వీరమరణము | 47 |
| | చీరాల పేరాల సత్యాగ్రహము | 49 |
| | కానాటు ప్రభువురాక - అల్లరులు | 51 |
| | అహమ్మదాబాదు కాంగ్రెసు | 53 |

| | | |
|---|---|---|
| **1922** - | సర్వపక్ష మహాసభ | 56 |
| | బార్డోలిలో శాసనోల్లంఘనము సాగింతునని బాపూ వైస్రాయికి లేఖవ్రాంత | 57 |
| | చౌరీచౌరా దుండగములు - బాపూవేదన | 58 |
| | పెదనందిపాడు - పన్నుల నిరాకరణము | 60 |
| | శాసనోల్లంఘనమాఁగుటచే దేశము కలఁగుట | 62 |
| | మహాత్ముఁడు తన్నుఁబట్టినపుడు ప్రజలుండఁదగిన తీరు తెల్పుట | 64 |
| | మహాత్ముని దొరతనమువారు నిర్బంధించుట | 65 |
| | వైష్ణవగేయము | 65 |
| | మహాత్ముని వాఙ్మూలము | 67 |
| | న్యాయమూర్తి మహాత్మునకు శిక్షవిధించుట | 72 |
| | బాపూ చెఱకేగుతఱిఁ బ్రజలకిచ్చిన సందేశము | 73 |
| | స్వరాజ్యపక్ష మవతరించుట | 75 |
| **1923** - | కాకినాడ - కాంగ్రెసు మహాసభ | 76 |
| | నాగపుర సత్యాగ్రహము | 77 |
| **1924** - | మహాత్మునకు శస్త్రచికిత్స - విడుదల | 78 |
| | అల్లూరి సీతారామరాజు | 80 |
| | బెల్గాముకాంగ్రెసు - గాంధి యాజమాన్యము | 84 |
| **1925** - | చిత్తరంజనదాసు నిర్యాణము | 86 |
| | సేన్‌గుప్త స్వరాజ్యపక్ష నాయకుఁడగుట | 87 |
| | కాన్పూరు కాంగ్రెసు | 88 |
| **1926** - | గౌహతీ కాంగ్రెసు | 90 |
| **1927** - | సైమన్‌బృంద మేర్పడుట | 91 |
| | మహాత్ముఁడు కావించిన ధర్మోపదేశము | 92 |
| | చెన్నపురి కాంగ్రెసు - అన్సారీ యాజమాన్యము | 93 |
| | గుజరీవఱదలు - కాంగ్రెసువారిసేవ | 94 |
| **1928** - | సైమనువర్గమును దేశము బహిష్కరించుట | 96 |
| | టంగుటూరి ప్రకాశము - వీరోచితచర్య | 98 |
| | సర్వపక్షసభవారి నివేదిక | 98 |
| | బార్డోలీరైతులు పన్నులు చెల్లింపమి | 99 |
| | కలకత్తా కాంగ్రెసు - సంపూర్ణ స్వాతంత్ర్యచర్చ | 101 |

| | | |
|---|---|---|
| 1929 - | బాపూ విదేశవస్త్రములఁగాల్చి శిక్షితుఁడగుట | 102 |
| | ఖద్దరునిధికి మహాత్ముఁ డాంధ్రదేశమున సంచరించుట | 102 |
| | మాక్డనాల్డు ప్రధానమంత్రియగుట - భారతీయ సమస్యలసమీక్ష | 103 |
| | ఆంగ్లమిత్రులధోరణి - బాపూ సమాధానము | 104 |
| | లాహోరు కాంగ్రెసు - జవహర్లాలు యాజమాన్యము | 106 |
| | సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెసువారి లక్ష్యము | 108 |


రెండవ భాగము


| | | |
|---|---|---|
| 1930 - | లవణశాసనధిక్కారమునుగూర్చి బాపూ వైస్రాయికి లేఖవ్రాయుట | 110 |
| | మహాత్ముఁ డుప్పుచట్టమును ద్రోయ సిద్ధపడుట | 115 |
| | పటేలు బార్డోలీప్రజల నని కాయత్తపఱచుట | 117 |
| | మహాత్ముని సత్యాగ్రహ ప్రస్థానము | 119 |
| | మహాత్ముఁడు దండికిఁజేరుట | 123 |
| | మహాత్ముఁడు లవణశాసనమును ధిక్కరించుట | 124 |
| | తెలుఁగువారి యుప్పు సత్యాగ్రహము | 125 |
| | దొరతనమువారు సత్యాగ్రహులపై లాఠీలు, తుపాకులు పఱపుట | 126 |
| | ఉప్పుఁగొటారు లాక్రమింతునని బాపూ వైస్రాయికి లేఖవ్రాఁత | 130 |
| | గాంధిని నిర్బంధించుట - పలువురు దీనిందెగడుట | 132 |
| | పికెటింగు విజృంభించుట | 137 |
| | సరిహద్దుగాంధి యహింసాదీక్ష | 137 |
| | దొరతనమువారి దారుణచర్యలు | 138 |
| | లాటీదెబ్బలతోఁ బలువురు నలినలియగుట | 139 |
| | సీమసర్కారు కాంగ్రెసుతో రాయబారము లారంభించుట | 140 |
| 1931 - | మోతీలాల్ నిర్యాణము - బాపూవేదన | 143 |
| | గాంధి - ఇర్విన్ సంధి | 145 |
| | సంధిపట్ల బాపూ సందేశము | 146 |
| | కరాచీ కాంగ్రెసు - పటేలు యాజమాన్యము | 150 |
| | గణేశశంకరుని వీరమరణమును కాంగ్రెసు వారభినందించుట | 152 |
| | కరాచీ కాంగ్రెసు నిర్ణయించిన ప్రధానపౌరస్వత్వములు | 153 |
| | తోఁట నరసయ్య మగఁటిమి | 155 |
| | రాజమహేంద్రవరము- జెండాప్లీడరు | 156 |
| | సర్వపక్షసభ - మహాత్ముని గంభీర ప్రసంగము | 159 |
| | సాంఘిక సమస్యను బాపూ ఖండించుట | 163 |
| | మహాత్ముఁడు భగవత్తత్త్వమును బ్రవచించుట | 165 |
| | బాపూ భారతోర్వికిరాక - దేశమల్లకల్లోలముగానుంట | 169 |
| | దేశపరిస్థితులఁ గూర్చి వైస్రాయికి గాంధికి నడిచిన తంత్రీవార్తలు | 171 |

| | | |
|---|---|---|
| **1932** - | మరల శాసనతిరస్కృతి – తీవ్రశిక్షలు | 178 |
| | విపరీతపరిస్థితులలో ఢిల్లీ కాంగ్రెసు | 183 |
| | గుంటూరిలో, తెనాలిలో నిషేధాజ్ఞలనడుమఁ గాంగ్రెసుసభలు | 183 |
| | సాంఘికసమస్యను మహాత్ముఁ డెదుర్కొనుట | 184 |
| | మహాత్ముని యెల్లలేనియిల్లి | 193 |
| | గాంధి యుపవాసముచేఁ బ్రజలు, ప్రభుత్వము కన్నువిచ్చుట | 196 |
| | 'హరిజన' పత్రికావతరణము | 197 |
| **1933** - | అసాధారణ శాసనములు – కలకత్తా కాంగ్రెసు | 198 |
| | వ్యష్టి సత్యాగ్రహము – మహాత్మునిచెఱ, విడుదల | 204 |
| | బాపూ సేవాగ్రామమునఁ దిరపడుట | 205 |
| | బాపూ హరిజనయాత్ర – సవర్ణుల కుపదేశము | 206 |
| | మహాత్ముఁడు కావూరిలో వినయాశ్రయమును బ్రారంభించుట | 207 |
| **1934** - | బీహారు భూకంపము – మహాత్మునిసేవ | 209 |
| | శాసనసభా ప్రవేశయుగము | 211 |
| **1935** - | కాంగ్రెసు సభ్యత్వముమాని మహాత్ముఁడు గ్రామపరిశ్రమసంఘము నేర్పఱుచుట | 212 |
| **1936** - | లక్నో కాంగ్రెసు | 213 |
| **1937** - | ఎన్నికలు – కాంగ్రెసు గెల్పు | 214 |
| **1938** - | కాంగ్రెసుమంత్రుల పరిపాలన | 216 |
| **1939** - | ద్వితీయ ప్రపంచయుద్ధము – కాంగ్రెసువారు సాయపడమి | 218 |


**మూఁడవ భాగము**


| | | |
|---|---|---|
| **1940** - | రామఘర్ కాంగ్రెసు – శాసనోల్లంఘన నిర్ణయము | 221 |
| | వ్యష్టిసత్యాగ్రహము వినోబాతోఁ బ్రారంభమగుట | 226 |
| **1941** - | జపాన్‌సేనల విజృంభణము | 226 |
| **1942** - | క్రిప్సురాయబారము | 227 |
| | క్విట్ ఇండియా | 228 |
| | మహాదేవదేశాయి నిర్యాణము | 229 |
| | దేశదుర్దశనుగూర్చి బాపూ వైస్రాయికి వ్రాఁత | 230 |
| | లిన్‌లిత్‌గో ధోరణి సైరింపలేక గాంధి పస్తుపూనుట | 231 |
| **1943** - | రాజాజీ దేశవిభజన దృష్టి | 232 |
| **1944** - | కస్తూరిబాయి నిర్యాణము | 233 |
| | చలిజ్వరమునకుఁ జిక్కిన గాంధికిఁ గారావిముక్తి | 234 |
| | సుభాష్చంద్రబోసు వీరగాథ | 236 |
| | దేశాయి వర్ధంతి | 242 |

| | | |
|---|---|---|
| **1945** - | ప్రపంచసమరము ముగియుచున్నది | 251 |
| | సిమ్లా రాజకీయగోష్ఠి | 253 |
| | సవర్ణ వివాహమున హరిజనపురోహితుఁడు | 256 |
| | క్షామపీడంబడిన వంగదేశమున బాపూ పర్యటనము | 260 |
| | మహాత్ముని పాదధూళితెమ్ము! | 261 |
| **1946** - | ఆంగ్లమంత్రిత్రయము భారతరాజ్యాంగ చర్చకై వచ్చుట | 271 |
| | స్వతంత్రభారతసేనపై నభియోగము | 273 |
| | మంత్రిత్రయమువారి తీర్పు | 275 |
| | బాపూజీ హత్యకొక పన్నాగము | 277 |
| | జాతీయ మంత్రివర్గమునుగూర్చి కాంగ్రెసు - లీగులధోరణి | 277 |
| | నెహ్రూ నాయకత్వమున జాతీయప్రభుత్వము | 278 |
| | లీగువారి ప్రత్యక్షచర్యతో బంగాళమున రక్తప్రవాహములు | 279 |
| | నౌకాలీ దుండగములువిని మహాత్ముఁడు వగచుట | 282 |
| | లీగుమంత్రులు జాతీయ ప్రభుత్వమునఁ జేరుట | 283 |
| | మహాత్ముఁ డార్తవంగమునకు రాక | 285 |

## నాల్గవ భాగము

| | | |
|---|---|---|
| | బీహారునం దల్లరులుసాగుట విని బాపూ తిండికోఁత | 286 |
| | బాపూ నౌకాలీయాత్ర | 287 |
| | బాపూ దుండగీండ్రగు ముస్లిములకు హితవుసెప్పుట | 287 |
| | బాపూ తనదళముంజీల్చి తాను శ్రీరామపురికేగుట | 291 |
| | ప్రార్థనసభలో బాపూ పల్కిన సూక్తులు | 296 |
| | ఒక మహిళ నవమానించినవానికి వింతశిక్ష | 298 |
| **1947** - | బాపూయాత్రనుగూర్చి మనూగాంధి వివరణము | 304 |
| | మహాత్ముఁడు పాదరక్షలు మానుట | 307 |
| | బాపూ ముస్లిములరాణివాసమున కాహూతుఁడగుట | 312 |
| | బాపూ సబ్బుబిళ్ళను మఱచిన మనూగాంధికిశిక్ష | 312 |
| | అమ్తుస్సలామ్ నిరశనదీక్ష | 315 |
| | మహాత్మున కొక యపవాదము | 318 |
| | మహాత్ముని బీహారుయాత్ర | 319 |
| | బీహారు దుండగములకుఁ గారణములు | 326 |
| | దుండగీండ్రు మహాత్మునిముందు సిగ్గిల్లుట | 329 |
| | గఫూర్ఖాన్ చాటిన విశ్వప్రేమ | 330 |
| | పాంచాలమున దుండగములు సాగుట | 335 |

| | | |
|---|---|---|
| | రాజప్రతినిధి కోర్కిపై బాపూ హస్తినకుంగదలుట | 340 |
| | ఢిల్లీలోజరిగిన యాసియాసభకు మహాత్ముని యుపదేశము | 341 |
| | గాంధి వేఱు - కాంగ్రెసు వేఱు | 343 |
| | గుడిలో ఖురాను చదువకుము | 344 |
| | నన్నుఁ జంపునపుడును రామనామమే పల్కెద | 347 |
| | ఢిల్లీనుండి పాట్నాకు | 347 |
| | పాట్నానుండి ఢిల్లీ - పాకీవాడకు | 348 |
| | దేశవిభజనమునకు బాదుషాఖాను వగచుట | 349 |
| | గఫూర్ఖానునకు బాపూ ధైర్యము సెప్పుట | 352 |
| | రానున్న చీఁకటి చూడఁజాలను | 353 |
| | వేవెలు నూత్నరాజ్యాంగ ప్రణాళికను వెలువరించుట | 354 |
| | సామ్యవాదులతో మహాత్మునిగోష్ఠి | 356 |
| | కాంగ్రెసిఁక నేమిసేయును? | 357 |
| | సుహ్రావర్ది కోర్కిపై మహాత్ముఁడు కలకత్తాను గాచుట | 359 |
| | స్వాతంత్ర్యదినము - మహాత్ముని యుపవాసము | 362 |
| | ఢిల్లీలో మంటలు రేఁగినవి | 365 |
| | మహాత్ముఁడు హస్తినలో శాంతికై బడలుట | 365 |
| | ఢిల్లీలో బాపూజయంతి | 366 |
| | బాపూ మతమైత్రి కొనర్చిన మహోపదేశము | 368 |
| **1948** - | మహాత్ముని గుండెలో ముల్లు నాటుకొన్నది | 373 |
| | బాపూ ప్రాయోపవేశము పూనుట | 374 |
| | మహాత్మునిసభలో బాంబుప్రేలుట | 379 |
| | నాకుఁ బోలీసులకాపు వలదు | 380 |
| | దుర్దినము వచ్చినది | 383 |
| | రామ! రామ! | 385 |
| | .......... తరువాత (అమరజ్యోతి) | 387 |
| సాయపడిన గ్రంథములు - గ్రంథకర్తలు | | 395 |

# సత్కృతి

క. మాతృమహీవైభవ సం, ధాతృ మహావీరధర్మతత్పర! గాంధి
చ్ఛాత్రవర! శాంతిరణమఖ, హోతృమణీ! లాల్ బహద్దరూ! శౌచఖనీ! 1

శా. లోకం బంతయు మాది మాది యనుచున్ లోభానువిద్ధాశయుల్
పాకిస్థానమువార లుద్ధతి వెలార్పన్ ధీరతా వీరతా
శ్రీ క్రేళ్లుబ్బి పరాక్రమించి సమరస్థేయుండవై శాత్రవ
ప్రాకారమ్ముల మూలబంధము లగల్పన్ నీక చెల్లెన్ గృతీ! 2

శా. పాకీస్థానమె కాదు దానికి విషత్పారక్రమం బూఁదుచున్
దోఁకాడించు పెకింగుచిల్వయును నీ దుర్వారవిక్రాంతి రే
ఖాకార్కశ్యము గాంచి వంచె ఫణ; మల్కంగొన్న హిందూర్విపై
దూఁకం జాలుమగండు లేఁడని ప్రజల్ తోషింప ఘోషించితే! 3

ఉ. నీవొకపొట్టివాఁడ వని ని న్నదలించుట కేండ్లుపూండ్లునున్
గావలెనా? యటం చయుబుఖాను తలంచి తుపాకి నెత్త నా
చేవ నెఱుంగవో యని హసించుచు మెల్లన సాఁగిసాఁగి తా
రావసథమ్ము దాఁటితి వజాండకటాహము ప్రయ్యవాఱఁగన్. 4

శా. ఓజన్ దక్కి పురావధుల్ కడచి యేవోతంత్రముల్ పన్ని మా
పౌఁజున్ బోరికి రెచ్చఁగొట్టు చయినాపాషండుఁ డాపన్నుఁడై
యాజిం గూలిన గుంటకే నొసఁగ నార్యక్షోణిఁ జో, టన్న శ్రీ
రాజేంద్రుండును నీవు నొక్క తెగవారా! చాఁగురే! శాస్త్రిజీ! 5

మ. జవహర్లా లతిలోకశక్తులఁ బ్రశంసాపాత్రుఁ డయ్యున్ రణ
వ్యవసాయం బన దయ్యుచుంటకతనన్ వైరుల్ నిరాఘాటులై
యవనిం దోఁచిరి నాఁడు; నేఁడు నిరవద్యక్షాత్రరోచిర్మయా
జవసంజాతుఁడ వీవు నేత వగుటన్ స్రగ్గెన్ దదాటోపముల్. 6

చ. కృతమతి జవ్వరుండు పదునెన్మిదియేండ్లు ప్రధానమంత్రిగా
జతనము లెన్నియో సలిపి సల్పి గడింపనిపేరు పెంపు నం
దితివటె! సార్ధవత్సరము నిండియు నిండకమున్నె శాత్రవ
ప్రతతి నెదిర్చి కీ లెఱిఁగి వాతలుపెట్టి మనీషిసత్తమా! 7

ఉ. నమ్మఁగరానిపాలసుని నమ్మ వహంత నెఱుంగ వార్త లో
కమ్మును గుస్తరించెదవు కాఁపులగోడు గణింతు వుక్తులం
జిమ్మక చేఁత కొగ్గెదవు సింగపుఁబీటను జాఁప నొక్కచం
దమ్మునఁ జూడనేర్తువు సదాతనకీర్తిని నీవు శాస్త్రిజీ! 8

ఉ. ఎల్లరపెంపు నియ్యకొనుటే తనపెం పను ధర్మసూత్రమున్
బల్లెలవారు నేర్పవలెఁ బౌరుల కందువు; గ్రామజీవికిన్
దల్లడపాటు రామి మనధాత్రికి రక్ష యటందు; వౌర! నీ
యుల్లము జాతిజీవనపు టోరలు కన్నది విద్వదగ్రణీ! 9

గీ. ఆర్థికంబగుసవరింత కారటించు, దొరతనము తాళి వెనుక ముం దరయవలయు
ప్రాతఁక్రొత్తలతో జతపడినమార్పె, సైఁచుఁ బ్రజ యన్న నీ మనీషను గణింతు. 10

ఉ. గీతకు నీ వుదాహృతివి కృష్ణుఁడు దిద్దినక్రీడి వీవు నీ
చేతము మోహపుందెరలఁ జీల్చి స్వధర్మము నాదరించి శీ
తాతప సౌఖ్యసంకట జయాపజయమ్ముల భేద మెంచమిన్
బ్రీతమనస్కుఁడై హరి వరించె భవద్రథసారథిత్వమున్ 11

ఆ. ఈశ్వరానుభూతి కీవు నోఁచితివి నీ, వ్రేఁగునెల్ల నిడితి వేల్పుమీఁద
వెలపు నిన్నుఁ గదియ వెఱచె బహద్దరూ! వలచి నిలిచె నీదువలన గెలుపు. 12

క. నిందింపరానికోరిక, లందలుగా నెగసి రేసి యాసురశక్తిన్
దీంద్రించు వారిబింకము, గండిపడెన్ నీదుమ్రోల గగ్గోలుపడెన్. 13

క. అదిగెల్చితి మిది గెల్చెద, మెదు రెవ్వరు కలరు మాకు నిమ్మహి నొకటన్
గొదలేనివార మను దు, ర్మదు లెల్లిదు లైరి నిన్ను మార్కొని శాస్త్రీ! 14

చ. ఇఁక నొకవేయివత్సరము లేగెడుదాఁక నశింప వీధరి
త్రికి నిపు డీవు నేర్పినవితీర్ణియు శౌర్యము నైకమత్యమున్;
తికమకలాడుచున్ భారతదేశము దిక్కులుచూచువేళ నా
యకపద మంది మందిహృదయమ్ము నలర్చితివా! బహద్దరూ! 15

ఉ. చక్కఁదనమ్ములేదు, సడిసన్న బి.యే. మొదలైన పట్టముల్
దక్కను లేదు, లేదు ధనధాన్యపటుత్వము నీకు; నైన నీ
వెక్కినపీఠ మిమ్మహి మహీయ మహో! నినుఁ జేరినట్టి యీ
పెక్కువ చొక్కపుంబ్రదుకు పిండినసారమురా! బహద్దరూ! 16

ఉ. ఎందుచు వాడుచున్ బ్రతిఫలేచ్ఛ యెఱుంగని లోకసేవలోఁ
బందినయోగమూర్తితలపైఁ బ్రజ మల్లెలు చల్లుఁ గాని లో
నిండినలాభలోభముల నిచ్చలు నిచ్చకముల్ వెలార్చు దు
ష్పండితు మెచ్చునా? యతనిపన్నిక లెన్నికసేయఁ జొచ్చునా? 17

ఆ. వలువరీవికతన వచ్చునా సుచరిత్ర, వలన వచ్చుఁగాని విలువ నరున;
కేల దంబమందు; వెంద అమాత్యు లీ, కరణి వక్కణింపఁగలరు? శాస్త్రి! 18

ఉ. కాలము సాయమై చిఱుతగద్దెకు వచ్చినవారలే వెసన్
దూలము లేనికొంపలను ద్రోసి విహాయసచుంబి రమ్యహ
ర్మ్యాళి రచించి రర్థపతు లైరికదా! మఱి పాకయైన నీ
పాలిది కానరాదఁట! సెబా సిది చాలు భవన్మహత్త్వకున్. 19

ఉ. పేదవుగా జనించినను బెన్నిధివంటిపదమ్మునందు న
ష్టాదశవర్షముల్ నిలువఁజాలితి; వైన నకించనత్వమే
యాదరణీయ మంటి; విది యౌనని మెచ్చెదఁ గాని సాధ్వి నీ
పైదలి యెంతయెత్తిడఁగ బ్రాఁకితి వీకొసకొమ్మజుంటికిన్? 20

ఆ. నగలమాట కేమి నల్లబంగారము, మాటకేమి యింటిమాట యైన
నెత్తలేదె యెన్నఁ డిల్లాలు మాయురే!, లలిత నీతపఃఫలమ్ము శాస్త్రి! 21

శా. అల్లాడించు నికృష్టవాంఛలకు లోనై పల్లియల్ పట్టణా
లెల్లల్ దాఁటిన విత్తదాహమున నిస్సీ! ధర్మువున్ రాచునాఁ
డుల్లీఢస్ఫుటికోపలోపమ చరిత్రోదాత్త! యుష్మాదృశుల్
ఢిల్లీ కబ్బుట మాతపమ్ములు ఫలాశ్లిష్టమ్ములై నెగ్గుటే! 22

చ. మనసిరి యుండుచోట మనమానస ముండును గాన మానవుల్
ధనమును ముక్తిరాజ్యమున దాఁచుట మంచిదిగాని, బంధకా
రణ మగు నిమ్మహిన్ నిలుపరా దని రాదిఋషీంద్రు; లీనుడిన్
మననము చేసి చేసి ఋజుమార్గము గంటివి నీవు కోవిదా! 23

గీ. ఐహికంబగు నుద్దీప్తి నరయుపట్లఁ, బారమార్థిక లాభతత్పరత విడని
విజ్ఞుఁడవు నీవు దేశాభివృద్ధికొఱకు, విశ్వహితము నేమఱని వివేకి వీవు. 24

ఆ. ఈజగత్తు సర్వ మీశ్వరుసొ త్తౌటఁ, బరులసిరుల కాసపడక నరుఁడు
బ్రదుకవలయు నీవిపంట; నన్న మహర్షి వాణి కీవు తారకాణ వన్న! 25

ఆ. ఒరునిమొఱకుఁదనము నోర్తువు గాని నీ, యజ్ఞతను సహింప వలఁతి నైన
బాటఁగ్రుంగి నీవుపాలించరైల్ వద, విడితి వొక్కనాఁడు ప్రెగడతనము. 26

ఆ. మంత్రిపదము వీడినంతన సర్కారు, కారు నెక్కుహక్కు కడచె నంటి
వింటి కేగి జీత మిగిరిన దిఁక నొక్క, యిగురు చాలు నంటి వింతితోడ. 27

ఉ. నీవలె నచ్చపుంబ్రదుకు నేర్చి సుఖమ్ముల రోసి జాతికిన్
సేవయొనర్చు నాయకుఁడు సీమకు నొక్కఁడుగా లభించినన్
లేవు నిరాశ లీరసలు లేవు రణంబులు లేవు బాపుజీ
రావలెనన్న రాజ్య మది రాకకు నాఁకలు లేవు శాస్త్రిజీ! 28

ఉ. నీవలె నర్థకామముల నెట్టికసీలతనమ్ము నూఁదినన్
నీవలె నార్జవంబును గణించిన గర్వము డిగ్గనాడినన్
నీవలెఁ గూర్మియుం గృపయు నేర్చినఁ దియ్యనిపల్కు పల్కినన్
దేవుఁడయై నరుండు జగతిన్ వినుతిన్ బడయున్ బహద్దరూ! 29

శా. ఆయం బొప్పమి నన్ను మున్ పద్రుచు పుణ్యక్షేత్రయాత్రారతిన్
ద్రోయన్‌నేర్చితిఁ గాని నేతృపదమందున్ నిల్చి యి ప్డాకొదన్
బాయంగంటిని సర్వభారతము నాపాలన్ మహాతీర్థమే
యాయెన్ నేఁ దని లోక సేవకు విశాలాధ్వమ్ము సూచించితే! 30

శా. చైనారక్కసి దొంగపోటుకతనన్ సవ్రీడమై క్రుంగు దే
శానన్ నూతన దీధితుల్ వొదమి తచ్చౌర్యంబు దుర్ధర్షమై
నానారాజ్యనుతుల్ గడించుదనుకన్ నా కాఁకలిన్ నిద్రయున్
రానేరావని పట్టుపట్టి విజయారావమ్ములన్ జొక్కితే! 31

ఆ. పడవవాఁడు మెత్తఁబడనినాఁ డు త్తుంగ, భంగభయదయైన గంగ నీఁది
వీధిబడికిఁ జన్న వేళనే ప్రజలు నీ, గుండెబిగువు మెచ్చుకొనిరి శాస్త్రి. 32

ఉ. దోవతి మాని కేవలవధూజనవేషము పూని చారులన్
గావలికాంద్రఁ గన్మొఱఁగి గాంధిపతాక ప్రయాగరథ్యయం
దీ వలనాఁడు నిల్పినపుడే భవదీయము కార్యదీక్ష స
ర్వావని కబ్రమయ్యె; వల పబ్బుఁగదా చిఱుమొగ్గకేనియున్. 33

గీ. 'జైజవాన్' 'జై కిసాన్' రవస్రష్టవై వి, శిష్టచైతన్య మావహించితివె ప్రజకు
కత్తి కట్టు నిరాఘాటగరిమ గన్న, దేశ మవమతిసెందునా లేశమేని. 34

శా. ఆటోపించిన భారతీయభటుఁ దుగ్రాస్త్రచ్ఛటల్ గుప్పి పాక్
పాటన్‌టాంకుల జెట్‌విమానముల దిప్పల్ రాల్చి లాహోరు పెన్

కోటన్ ముట్టిననాఁడు దేశ మిది నీకూర్పాసమై బాహు వా
స్ఫోటింపన్ రిపుకోటి యుద్దుగుడిచెన్ భుగ్నాశమై శాస్త్రిజీ! 35

ఆ. పిఱికికందలేని బిరుదు నా సడిసన్న, నీవు దేశమునకు నేత వగుట
నగుర! తెగువ హెచ్చి మగఁటిమి రెచ్చి మై, మఱచి పగఱ నె(ద్రిచె మనదళమ్ము. 36

ఆ. జాతిగౌరవమ్ము సడలమికై ప్రాణ, మిడుటకంటెఁ గృత్య మేమికలదు
మంచితరుణ మొదవె నూయురే! యని మన, బంటు నడిచె నుర్వి పల్లటిల్ల. 37

ఉ. రాజపదాభిరాముఁ దపరాజితశస్త్రుఁడు రామభద్రుఁ డాం
ధ్రాజవసంభవుండు జగదద్భుతలక్ష్య విపాటనక్రియా
భ్రాజితదృగ్ధురా వహనపండితుఁడై పడఁగొట్టెనట్టె! ఘో
రాజికిఁ దారసిల్లు విమతాభ్రచరమ్ములఁ గాకులంబలెన్. 38

ఉ. మచ్చరికించి శ్రీనగరమండలమున్ విదళింప తివ్వనన్
వచ్చెడు గాలియోధఁ జిఱుప్రయ్యలుగా నిలఁగూల్చి నీ నెఱా
మెచ్చు గడించుకొన్న బలుమేటియుఁ దెల్గులపోతరాజె! యీ
చిచ్చఱపిడ్గు పే ర్వినినఁ జెమ్మటలూరు నరాతికోటికిన్. 39

చ. మనపగతైనముస్లిములు మామహి నాకము పుణ్యలోక మం
చనిశము చాటుచుండినను హైందవసంస్కృతి విశ్వమానవ
ప్రణయపతాక యౌకతన భారతదేశమహమ్మదీయులున్
బెనఁగి రహో! దివిన్ భువిని బిందిరి నెత్తురు మాతృభూమికిన్. 40

ఉ. ఆలము నల్లెమున్ సమత నారయుజోదు హమీదు గుండెకుం
గాలము కాఁగ శత్రువు కకావికలై సకలోర్వి నున్న చు
ట్టాలను జీరి చీరి యకటా! గతిగానక చేతులెత్త నీ
నేలను గద్దిపోఁచయు మనీషిమణీ! తలయెత్తె నేడ్తెఱన్. 41

ఉ. నీ కగపడ్డనిగ్రహము నేర్పుట కెల్లరు కారు; శైలమున్
డీకొని వ్రక్కలించు నశనింబలె గట్టితనమ్ము, తమ్మిపూ
రేకువలెన్ మృదుత్వము ధరించినదెందము నీది; బాపుజీ
పోకడ లాఁచికొన్న నెఱప్రోడవు వీవు బలా! బహద్దరూ! 42

ఉ. విక్రమరాశియౌ భరతవీరుఁడు శాంతిన కోరు; శాత్రవుం
డక్రమచర్యకుం గడఁగినప్పుడు నిప్పులుచిమ్ము; వైరి నా
వక్రత సైఁపు మన్న హిమవన్నగ మౌ; ననుసత్యమున్ మహీ
చక్రమునందుఁ జాటితివె శాస్త్రి ! వజీరు లజయ్యు లౌననన్. 43

శా. ఘుట్టో మానవధర్మమున్ మఱచి పెంపుం దక్కి పెన్ రచ్చలోఁ
బట్టం బగ్గములేనిచందమున దుర్భాషాతతిన్ భారతిన్
దిట్టన్ "బాప! మపత్రపన్ మునిఁగి శాంతిం గాన కిట్లయ్యె నీ
దిట్టం" దంటి వహో! ప్రతిష్ఠితమతీ! తేజస్తితిక్షాకృతీ! 44

చ. పరుసనిపల్కు లల్కయు నపాస్తవివేకునిలక్షణంబు; లీ
మొఱకును సైఁచు టొప్పనుచు మున్ను వచించినసంయముల్ భవ
ద్గురు లని యెంతుఁ గాని బుధకుంజర! యెంతయహింస యెంతని
బ్బరికము నెంతసత్త్వము నుపాస్తము కావలె నింత చేఁతకున్! 45

ఉ. "మీామహి కస్మదుర్వికి నమిత్రములైన మహాపిశాచముల్
లేమిని రోగమున్ దెలివిలేపడి నడ్డి యణంచు టొప్పుఁ గా
నీ మన మస్రవాహినుల నీఁదుచుఁ గయ్యముసేఁత చెల్లునా!
యేమి యయూబ! సెప్పు" మని యీావు సృజించితె! శాంతి; శాస్త్రిజీ! 46

ఆ. కూదు గుడ్డ నెమ్మి కోరుఁ గాని జనాళి, దారుణాహవమ్ము కోర దెపుడు
నెఱుకబలిమిలేనిదొర దీనిఁ గన కేచి, యేఁచు నవని నంటివే! మనస్వి! 47

గీ. అంతచేసినరిపుమ్రోల నంతగెలుపు, చేపడినవేళ నీ వింత చెలిమితోడ
నింతమన్ననతోడ భాషింతు వెంత, నిండుమది నీది! యెంతవినీతి నీది! 48

చ. పగతుర దాఁకి లోకము సెబా సనఁ గయ్యమొనర్చి గెల్పునన్
సొగసితి మన్నలార! యిఁక సుస్థిరశాంతి జనింపఁగా జగా
తెగువలు చాటి నేఁటి మనదీప్తికి వ్యాప్తిని గూర్త ముర్వికిన్
బ్రగతి ఘటింత మన్న తుదిపల్కులు నీవి యనర్ఘరత్నముల్. 49

గీ. గాంధి పుట్టినదేశము, కరుణ ప్రేమ, సత్యము సముద్ధరించిన జాతిపిత జ
నించినధరిత్రి శాంతికి నేస్త మగుట, సముచితం బన్న నీవాణి యమరవాణి. 50

గీ. ఏను బోయిన మీరుపోయినను మన ప, తాక వోరాదు వోరాదు తమ్ములార!
భారతక్షోణి శాశ్వత ప్రాభవమున, మనవలయు నన్న నీమాట మాకు బాట. 51

ఉ. కూలినగాంధి వచ్చెనని కుల్కితి నిన్నని; ప్రాఁతగాథలన్
మూలుగుచున్న జాతిజవమున్ బ్రకటించె బహద్ద రద్దిరా!
చాలినవాఁ డితం డనుచు సంతసమందితిఁ గాని దైవ మీా
మేలు సహింపలేక విషమించెఁగదా లలితాహృదీశ్వరా! 52

శా. లేవా నీ విఁక మాకు! లోకములు తూలెన్ నేఁడు దిక్కుద్యముల్
తావుల్ వాసెను మానవావళి ప్రతిష్టబ్ధప్రభన్ దీల్పడెన్

ద్యావాభూములు కాఱుఁజీకఁటుల కాస్థానమ్ములై కల్పవే
ళావిర్భూతికి హేతులై ప్రజల నల్లాడించెడిన్ శాస్త్రిజీ! 53

ఉ. లోకము సర్వ మొక్కత్రుటిలో భరతోర్వికి దూఁకి బాష్పధా
రాకులనేత్రమై వగచె నక్కట! నిన్ మృతుఁజూచి; కోసిగిన్
నీకొఱ కేడ్చె నన్న నది నీ విజయంబె! యయూబు నీ దెసన్
శోకము చాటె నన్న నది సూనృతకింకర! నీప్రభావమే! 54

చ. పొగ నడఁగారి యారి పొలుపున్ బలుపున్ సుడివోవఁగా మహా
యుగములపాటు వహ్ని కొనయూపిరితోఁ బడియుంటకంటె నొ
క్కగడియసేపు అంపిలి ధగద్ధగలన్ మెఱయించి డిందినన్
మగసిరి కేమిలో టనెడిమాటకు మూదల వీవు శాస్త్రిజీ! 55

ఉ. మే నిది నీటిబుగ్గ కుపమేయము, పూరుషుఁ డాత్మదేశ క
ల్యాణము సంతరించుసమయమ్మున నక్కఱపాటు వుట్టుచో
దీనిఁ దృణమ్ముఁగా విడుచుతెంపరి కావలె నన్నసూక్తికిన్
బ్రాణము నీదుజీవనము ప్రాజ్ఞతకున్ శరణమ్ము శాస్త్రిజీ! 56

ఉ. చావఁడు మత్తనూభవుఁడు చావఁడు, చచ్చె నటన్నవార్త సం
భావనసేయరాని దని పల్కిన నీజనయిత్రి సత్యవా
క్సీవధి; శాంతికై తపముసేయునరుం డిల నుండునంతకున్
జావవు నీవు నీజనువు సార్థక మయ్యె నహో! మహామతీ! 57

ఉ. భారతభూతధాత్రిఁ గనుపట్టు చరాచరవస్తుసంతతిన్
జేరె భవన్మహ; స్సది నశింపదు వానకు నెండ కగ్నికిన్
మారుతధాటికిన్ నిశితమార్గణకోటికి నస్త్రశక్తికిన్
దారకలన్ సడల్చు భయదప్రళయోద్ధతికిన్ బహద్దరూ! 58

మ. అల తాష్కెంటునఁ దీవ్రవాదముల కీ వల్లాడి ప్రాణమ్ములన్
బలిగా నిచ్చి గడించినట్టి చెలిమిం బాటించి నిత్యమ్ములై
నిలుచుంగావుత! రెండుదేశములు; నీ నేస్తమ్ము నానాఁటికిన్
బలుపుం గాంచి యఖండభారతము నాపాదించి రంజించుతన్! 59

* * * * *

మ. నిను నిర్భీకు నితాంతసత్యకరుణా నిష్ఠానిధిన్ నమ్రతా
ఖని నంద్రోక్తిమయప్రపంచమునఁ జక్కన్ నిల్పి ధన్యత్వమున్
గనఁగా మత్కృతమున్ మహాత్మకథ నీ కావ్యంబు నీ కంకితం
బొనరింతున్ శుచి మంజు శిల్పసుషమా యోగాఢ్యమున్ శాస్త్రిజీ! 60

ఉ. అచ్చపుఁదీరుతీయముల కాత్మ కరంగి తెనుంగువారి కే
నిచ్చితి నెన్ని యేనికృతు లింతకుమున్ను తెనుంగువాఁడుగన్;
ఇచ్చెద భారతీయుఁడుగ నిప్పుడు నీకు నజాతవైరికిన్
మచ్చ యొకింతలేని బుధమౌళికి నీకృతి లాల్‌బహద్దరూ! 61

ఉ. ఈపొలి నీకుఁగా కెవని కిచ్చెద – మస్కరి నంచుఁ దస్కర
వ్యాపృతి నేర్చి భోగములువాయని మానవుఁ జూచుచున్ నెఱా
కాఁపురమున్న నర్థములకల్మికి మార్గము లున్నఁ జిన్నమున్
దాఁపఁగలేక చన్న గృహధర్మపరాయణచక్రవర్తికిన్. 62

ఉ. ఈపొలి నీకుఁగా కెవని కిచ్చెద – బాపుతపమ్ము పంటగాఁ
జేపడినట్టిరాచసిరిఁ జిందఱవందఱసేయ పంచకుల్
పాపులు భారతమ్మునలుప్రక్కల మూఁగినవేళ విక్రమా
టోపముఁ జూపి జాతి కుదుటున్ గదియించిన శౌర్యమూర్తికిన్. 63

ఉ. ఈపొలి నీకుఁగా కెవని కిచ్చెద – గాంగఝరమ్మువోలె ఛా
యాపతిరీతి మారుతమునట్లు ఫలప్రతిపత్తివాంఛకున్
లోపడ కూఱటం గనక లోకహితక్రియ సల్పి దంభద
ర్పాపహశీలమున్ మెఱసినట్టి నిరత్యయకర్మయోగికిన్. 64

ఉ. ఈపొలి నీకుఁగా కెవని కిచ్చెద దేశవికాసలబ్ధికై
రాపిడు లోర్చియోర్చి రుచిరంబగు జీవనసౌరభంబు నల్
వైపులఁ జిమ్మిచిమ్మి పొదవాసిన గంధపుఁజెక్కకున్ బృహ
త్తాపము సైఁచి స్రగ్గి జనతన్ దనియించిన ధూపవర్తికిన్. 65



# మ హా త్మ్య క థ

## కృత్యాది

ఉ. ఆదరబంధురమ్ముగ జొహారిదుదున్ ననుఁ గాంచి మంచికిన్
మూదలఁగా మలంచి జనముల్ పొగడం బులకించి పాడికిన్
బాదుగ నిల్చినట్టి గుణభద్రకుఁ బుణ్యశరణ్య కస్మదీ
యాదిమదైవతమ్మునకు నక్షరకీర్తికిఁ జెంచమాంబకున్. 1

ఉ. ఎవ్వఁడు నేనుగా వెలసె నెవ్వని మన్గడ మేలివెల్గు లే
నవ్వులతో ననుం బెరసి నాకుఁ దెనుంగులొనర్చు జాళువా
పువ్వులపూజ లందుకొను భోగము గూర్చె వినమ్రతారుచుల్
నివ్వటిలన్ భజింతు నతనిన్ గృతసూనృతు నారయాహ్వయున్. 2

క. శ్రీరామామాత్యునిఁ గా, వూరి కులున్ దనదు మొదటి యొజ్జను విమలా
చార పరాయణుఁ గవితా, ప్రారంభం బిది ఫలింపఁ బ్రార్థింతు నెదన్. 3

ఆ. ఓనమాలనుండి యే నాంధ్రగీర్వాణ, కోశములను లోఁచుకొనెడిదనుకఁ
జదివినాఁడ నితని సరస; దేశికుఁ డిట్టి, వాఁడు వీధిబడికి లేఁడు నేఁడు. 4

క. విరచితరామాయణు మ, ద్గురుఁ దాదేపల్లి వంశ్యుఁ గోవిదకవి కుం
జరు వేంకటప్పయాఖ్యుని, గర మర్థిన్ దలఁతు జయము కడియన్ గొలుతున్. 5

గీ. అంచిత కవి ప్రయోగ రహస్య విదురుఁ, జేసి న న్నలరించిన శిక్షకునకు
నమితసుకృతికి వేంకటరమణశాస్త్రి, కంజలియొనర్తుఁ గృతికి మే లావహిల్ల. 6

ఉ. కోపమెఱుంగఁ డీర్ష్య దెసకుం జననొల్లఁడు శిష్యగౌరవ
శ్రీ పరమార్థ మంచు మతిసేయును సత్యము సత్వమున్ నిజా
లాపమునందు నెల్లయెడలన్ వెడలించు దువూరి సూరి; యే
నే పగిదిన్ భజించి నుతియించిన నీ గురునప్పు దీర్తునా? 7

క. లలితోక్తుల శాబ్ద మహః, కలి తోభయసాహితీ ప్రగల్భత నదిరా!
తలఁపించు నితఁడు చిన్నయఁ, దెలుఁగునకున్ దీపమిడిన ధీమద్రమణున్. 8

క. ఓ చిన్నయసూరి! పరో, క్షాచార్యుఁడ వీవు నాకు, నస్మద్వాణీ
వీచుల కజస్రజీవన, రోచిష్మత్త్వమ్ము సమకుఱుత! నీ కరుణన్. 9

చ. జిగిసెడి మూల్గు తెల్గునకు జీవము నింపి నిలింప వాణికిన్
సొగసులు దిద్దు విన్ననువు చూపి తగన్ బృహదంధ్రభారత
ప్రగతి ఘటించి పుణ్యములు పంచినవేలుపు తిక్కయజ్వ నా
మొగదల నిల్చి కావ్యపథముల్ సుగమమ్ములుగా నొనర్చుతన్. 10

క. ఒక తిక్కన చాలఁడె యీ, సకలాంధ్రమునకును జీవసంపద నొసఁగన్
స్వకభాషా సమధిక తా, ర్థికి నారాధ్యుం డెవండు తిక్కన తక్కన్. 11

మ. అల నన్నయ్యకు లేరు తిక్కనకుఁగా కాంధ్రప్రజానీకహృ
జ్జలజోన్మీలనకృత్ ప్రభాకరవిభాసంకాశ సాధూక్తి మం
జుల పుంభావ సరస్వతుల్ గుణగరిష్ఠుల్ భావుకుల్ భక్త ల
స్థలిత స్ఫార యశోమహోధవళి తాశాసానువుల్ మాదృశుల్. 12

గీ. చెళ్లపిళ్ల మహాకవి శిష్యమౌళి, నాధునిక సత్కవీంద్రు నర్హణ యొనర్తుఁ
బున్నెముల కిరవైన యెట్టిన్నకోవ, నంకురించిన కాటూరి వేంకటేశు. 13

ఆ. అంటుసొంటులేని యందాలు కొఱవోని, మాట నేర్చి మాట కోటువదని
బ్రదుకు నోర్చి కృతులు పల్కిన యానాఁటి, నేఁటికవులకెల్ల నేటికోళ్లు. 14

సీ. వ్యాసవాణిఁ దెనుంగుబాస వ్రాయించిన, వేఁగీవిభున కుగ్గువెట్టినమ్మ
సమతామహాయోగ సంధాతయైన రే, చెర్ల బ్రహ్మన్నఁ బెంచిన సవిత్రి
మగవారి కచ్చెరు వగురీతి రిపుల నో, ర్చిన రుద్రమను దిద్దఁగనిన తల్లి
శ్రీరామనామ మూరూరఁ బల్కించిన, గోపన్న నొడి నోముకొన్న జనని
మూఢవిశ్వాసములు ముచ్చుముడుఁగుపొంటె, గాసిలిన కందుకూరిని గన్న మాత
నా తలంపులు పండించుఁగాత నిరత, మాంధ్రజనయిత్రి విశ్వకల్యాణదాత్రి. 15

సీ. తన ప్రేమసూత్ర మార్తక్షోణికి నశోక, రాజ్యమై ధర్మచక్రమును ద్రిప్పఁ
దన త్యాగనిరతి యాత్మబలిప్రధాన రా, మ రహీమమై జగన్మతముఁ జాటఁ
దన సరస్వతి మహాతత్త్వోపనిష దభి, రామయై యజరామరత వెలార్పఁ
దన యశోరాశి శీతనగేంద్రమై నభః, కషతమై నిల్చి నల్గడను దేర్పఁ
దన తనూవల్లి జహ్నుజాతాము ఖోత్త, మాపగా శీకరపరంపరా పునఃపు
న స్సమార్ద్రమై క్రౌంగ్రొత్తననలు తొడుగ, నలరు భారతజనయిత్రి కంజలింతు. 16

మ. తనువై భాష లెసంగ నంగరుచులై తత్తత్కళానల్ప క
ల్పన లేపార నపారలక్షణసముల్లాసంబు సౌశీల్యమై
తనరన్ గావ్యరసాత్మయై వెలసి నిత్యజ్ఞాన సామ్రాజ్యపా
లనకుం జాలినరాణి వాణి శుభలీలం దోఁచు మద్వైఖరిన్. 17

మ. సకల స్థావరజంగమాత్మక జగచ్చక్రంబునన్ నిండి స
త్యకృపాయత్తులు నిర్మముల్ విదళితాహంకారులై పొల్చు వా
రికిఁగా కన్యుల కందరాని సుషమారింఖోళియై నిర్విక
ల్పకమై నిల్చు నఖండతత్త్వమును సంభావింతు శుద్ధుండనై. 18



ఉ. చేసినపుణ్యమై తనకుఁ జిక్కినకైత ఫలింప భక్తిమై
వ్రాసినవాఁడఁ దొల్లి యెరవాదతపస్వికృతంబు సూనృత
శ్రీసముపేత మాత్మకథ శిష్టజనస్తవనీయ భారతీ
భాసుర గద్యపద్య పరిపాటికి మూదలయై తనర్పఁగన్. 19

గీ. సత్య సంశోధనాసక్తి సందడింప, బాపుజీ నిర్వహించిన బ్రదుకుచంద
మేఁబదేండ్లది యద్దాన నెఱుఁగవచ్చు, నుత్తరకథానిదానమై యొప్పుదాని. 20

క. ఆ మనుగడ సాధనమై, యీ మనుగడ సిద్ధి యయ్యె నియ్యది విజయ
శ్రీమహిత మగుట నఖిలో, ర్వీమండలి నద్భుతప్రవిష్టముఁ జేసెన్. 21

క. ధన్యం బిది నూతన చై, తన్యము సంధించె భారతక్షోణీ; కసా
మాన్య మహింసా సంగర, విన్యాసము గఱపె; దాస్యవిచ్యుతి నెఱపెన్. 22

క. నరజాతికి నాత్మోన్నతి, సరణిం బ్రకటించెఁ బెంచె సంయమరక్తిన్
విరిసిన భౌతికశక్తులు, మొఱలిడి చెడు నాత్మశక్తిముం దని చాటెన్. 23

క. లోకోత్తర మనఁ జాలిన, యీ కథ మద్వాణి నాంధ్రి కిచ్చుటకై దీ
క్షా కంకణమున్ గట్టితి, నాకృతకృత్యత జనాభినంద్యముకాఁగన్. 24

గీ. ఇది మహాత్మకథాభిఖ్య నెసఁగు; నాత్మ, కథను దెనిఁగించి నుతిగన్న కవి మహాత్మ
కథను వర్ణింపవలెఁగదా! కర్జ మిట్టి, దవుట సమకట్టినాఁడ నీ కవిత కిపుడు. 25

ఉ. నా కనకాభిషేక సవనర్త్విజుఁడై కటమంచి రెడ్డి సు
శ్లోకుఁడు రామలింగ బుధసోముఁ "డిఁకన్ మనజాతి కున్నత
శ్రీకర వీరకావ్యము సృజించెద వీవని విశ్వసింతు నీ
వాకును రిత్తసేయ" కని వల్కుటయున్ బెర రేఁచె న న్నిటన్. 26

ఉ. నా నెఱకబ్బ మాత్మకథ నాణెముకట్టుతతిన్ "మహాత్ము నా
స్థాన కవీంద్రుఁ డీతఁడు సదాతన మీ పద" మంచు విశ్వ వి
ద్యానిలయుం డితండు ననుఁ దద్దయు మెచ్చుట సైత మెచ్చరం
బైనది యీ మహాత్మకథ కంజక యేను సముద్యమింపఁగన్. 27

క. పూనినపని కడుదొడ్డది, యేనో తల నిడితి నేఁబదేండ్ల వయస్సున్
మేను తెగుళ్లకు ని ల్లిఁక, నానావేదనల నొజ్జనము నీద్వవలెన్. 28

ఆ. ఇడుము లిట్టి వెన్ని కడుకొన్న నెట్టెటో, గుండె ఱాయిచేసికొంటిఁ గాని
సాహసంబు నాఁగఁ జనదె కించిజ్ఞుఁ డ, స్మాదృశుఁడు మహాత్మచరితవ్రాఁత. 29

వ. ఏల నా బాపూ వ్రాసికొన్న తెలుంగునకును నా వ్రాయనేర్చిన తెలుంగునకును వింగడం బెంతేనిగలదు - ఆత్మపరిశోధనైకదృష్టిమై నడుగడుగునం దొరపిడి వడుచుం బ్రకటించుకొన్న దాత్మకథ - కేవలభక్తివిశ్వాసముల కతనఁ గృతజ్ఞతాసూచకమ్ముగా నభివర్ణించున దీ మహాత్మ కథ - అది తత్త్వసమీక్ష - ఇది కథాకావ్యము - ఈ సృష్టి నిర్విఘ్నమై తేజస్వంతమై సాగున ట్లామహాత్ముని పవిత్రాత్మ నా కెల్లయెడల వెలుఁ గునిచ్చుఁగాక! - గాంధేయ ధర్మానురక్తులు సారస్వత సేవాసంసక్తులు సర్వాంధ్ర ప్రజామండలియు నస్మదీయంబగు నీ కృషిపట్ల నాదరాభి మానములు మెఱసి నన్నుఁ జరితార్థుంజేయుఁగాక! 30



గీ. శాలిశకము పురాబ్ధి కుంజర శశాంక, సంఖ్యలఁ జెలంగుతతి ఖరశరదయందు
శ్రావణ శ్యామసప్తమీ సహిత ధిషణ, వారమున మొదలిడితిఁ గావ్యమును దీని. 31

(23-8-1951)

ఆ. అప్పికట్ల బోర్డుహైస్కూలునఁ దెనుంగు, టొజ్జనంబు నూనియున్న నన్నుఁ
బ్రేచె నంతరాత్మ లోఁచె నీ సృష్టికి, నిది మదీయదృష్టి కీశ్వరాజ్ఞ. 32

గీ. గర్తపురిసీమఁ జోదరాట్కటకమైన, చందవోలికిఁ దూర్పున సందడించు
నూరు 'కావూరు' కాణాచియై రహింపఁ, గీర్తిగన్న సీతారామమూర్తి నేను. 33

ఉ. కమ్మకులమ్మునందు బుధగణ్యము సాధుకథాశరణ్యమౌ
'తుమ్మల'వారి గేహమునఁ దోఁచితి సంస్కృతిసాహితీనిధుల్
నెమ్మిని గుమ్మరింప వరణీయతరమ్ముల నంధ్రజాతిభా
గ్యమ్ముల నైక లోకహితకావ్యములన్ సృజియింప నోఁచితిన్. 34

గీ. విశ్వకల్యాణమునకు నుద్వేలమైన, తపము గావించె నఖిలబాధలు సహించె
నెవ్వఁ డవ్వాని వేల్పుఁగా నెంచి యతని, బ్రతుకు నుతిసేయుకృతి కిష్టపడెద నేను. **35**

సీ. ఉత్తమవాగ్మి నా నొప్పారె నురక గ, ర్జించియా కాదు వర్జించి నుడులు
అతిలోక బలసమంచితుఁ డయ్యెఁ గండలు, పెంచియా కా దలయించి యొడలు
చిరజయశ్రీధురంధరుఁ డయ్యె రిపుల ఖం, డించియా కాదు పండించి కృపలు
అమృతత్వ మందె యాగము లాచరించియా, కాదు నిష్కామయోగము వరించి
యతఁడు సామాన్యుఁడెట్లు? వీరత కపూర్వ, జీవములువోసి వాసిదెచ్చిన మహాత్ముఁ
డతని నడచిన బాటలయందు నడిచి, పందయును విక్రమక్రమాస్పందుఁ డయ్యె. **36**

గీ. రాజదండము వలదు స్వర్గంబు వలదు, జననమరణార్తు లంటని జగము వలదు
తెలిపిలేనిదిగుళ్ళతో దేవురించు, జనులఁ దేర్చుట వలయు నా కనియె నతఁడు. **37**

క. రామునిసత్యము కృష్ణుని, ప్రేమము గౌతముని కరుణ పెనఁగొని యోగి
గ్రామణి బాపూబ్రతుకై, మామకకవితాలతా సమాశ్రయ మయ్యెన్. **38**

ఆ. ఎవఁడు నుడువనేర్చు నవభారతస్రష్ట, జాతిపితసమగ్రచరిత మరసి
కట్టెఁ గొట్టెఁ దెచ్చెఁ గాకుత్థు దన్నట్లు, పలుకనోర్తు నెఱుకపడినదనుక. **39**

క. మ్రుక్కడిమూఁక నొకందుగఁ, బెక్కేండ్లు మహాత్ముకలనఁ బెనఁగితిఁ గానన్
జిక్కినది నాకు దీమస, మిక్కథగు ట్టెఱుకసేయ నించుకయైనన్. **40**

క. పరభాషా పరసంస్కృతి, పరపరిపాలనావిధా నిబర్హణగాథా
కరమైన గాంధిజీవిత, మరిదికదా తెన్గుబాస నభివర్ధింపన్. **41**

ఆ. అదియు వెలఁదివెలఁదియగు పల్కునన వక్క, ణింపవలె మదీయనియతిఁ బట్టి
యెందతెంద ఱిచట నెందాఁక దిగిన నా, యుచ్చ వారితీరు మెచ్చదాయె. **42**

చ. చదువునలోఁతు పాఁతు గనఁజాలక సంతకవిత్వముల్ పదిం
బదిగ నుతించు దుర్బలులు పారకు లౌదురపో! మహాకవుల్
కదలినబాటలో నడుచు కైతలు పుట్టకపోవు; సత్కవుల్
మది నిడఁబోరు నీతినియమమ్ములు దుల్లిన జల్లి పల్కులన్. **43**

ఉ. అందనిద్రాక్షపండ్లఁ దెగనాడు సృగాలమువోలె శౌచ ని
ష్యందివచస్సు నభ్యుదయశత్రువుఁగాఁ దెగనాడువాని తీ
రుం దిలకించి కస్సుమను ప్రొద్దులు దాఁటితి; నేఁడు వానికై
కుందెద వాని పెక్కువను గోరెద జాలికిఁజిక్కి తేతెదన్. **44**

ఆ. నియతభాషఁ గవిత నిర్మించెదను గాని, దొరలవచ్చుఁ గొన్ని దోసఁగు లిందు
మాననీయకవులు మన్నింత్రుగాక మ, ద్దోషముల నటంచు దోయిలింతు. 45

ఆ. వెఱ్ఱి ముదిరి ముదిరి వెలగల తెల్గును, మఱచినారు పెక్కుమందికవులు
కవులఁబట్టి లోక మవమతిపాల్ సేయ, నకట! నేతిబీర యయ్యెఁ దెనుఁగు. 46

చ. తెనుఁగును విస్మరించి యిది తె స్గని పల్కుచు బుంగపోఁత వో
సినగతి సంస్కృతమ్ము పదఁజిమ్మెద రేల కవీంద్రు లక్కటా!
మనజనమెల్ల మేఘమును మాఘము నేర్చునె నేర్వనేల? రా
జనములు మూల్గుచుండఁ జెయిసాఁచుట యేటికి వెల్వదాలకున్. 47

ఆ. జీడిపప్పు వలయు జేజేలబాసయు, వలయుఁ బాసెమునకుఁ దెలుఁగునకును
దూలి తూలి దేనిపాలు హెచ్చించిన, రుచు లడంగి రెంట రోఁతపుట్టు. 48

గీ. ఎంత లోపద్దగీర్వాణ మేని తెనుఁగుఁ, గబ్బమునఁ బెత్తనముసేయఁ గాదు గాని
యెంత దవ్వైనతెనుఁగుఁ బల్కేని యగ్గ, లించి మనకైతలో రవళింపవచ్చు. 49

ఆ. దారితప్పినట్టి తమ్ములార! పరాకుఁ, దెలిసికొండు తగినదెసకు రండు
తేనెసోనవోని తెనుఁగును సేవించు, తీరు గనుఁడు తనివి గూరి మనుఁడు. 50

క. పలికెడిది గాంధికథయఁట, పలికించెడివారు తెనుఁగుఁబ్రజలఁట దీని
బలికిన నూఱట యౌనఁట, పలికెద నిఁక నొండు మఱచి బాపుచరిత్రన్. 51



# మ హా త్మ క థ

## మొదటి భాగము

ఉ. మేలు ఘటించి బెట్టిదుల మీఁగడముద్దలఁ జేసి లోఁగొనం
బోలు నటంచు నిద్ధగుణపూర్ణుఁడు గాంధిమహాత్ముఁ డాంగ్లభూ
పాలురకోర్కి మెచ్చి పలుబాములకోర్చి మగండ్రఁ గూర్చి వే
ల్వేలను బంపె యూరపున విచ్చిన రెచ్చినపోరఁ బాల్గొనన్. **(1918 మే)** **1**

ఉ. ఈ సమరంబు నాలుగయిదేండ్లు జగంబు నశాంతిమగ్నముం
జేసి యడంగె జర్మనులు చేపడి పైపడి రింగిలీసువా;
రాసలువెంచె నంతట మహాత్ముఁ డిఁకన్ మనభూమి వైభవ
శ్రీసముపేత యౌట కెడసెప్పరు పాలకు లన్న నమ్మికన్.(11-11-18 రణ మాఁగెను) **2**

చ. రణమున కట్లు విత్తమును రక్తము నోడ్చి బ్రిటీషు బావుటా
గణగణ లాలకింపఁ గుతుకంబు వెలార్చిన భారత ప్రజా
గణముదెసన్ గృతజ్ఞతకుఁగా నధికారులు తెల్లవార లీ
ప్రణయము చూపరా యనుచు బాపు తలంచె నమాయికమ్ముగన్. **3**

## 1919

## రౌలటు చట్టము

క. వడగల్లునకున్ జనఁగాఁ, బిడుగ ల్లెదురైనయట్లు పెత్తనమునకై
సుడివడు భారతమున కా, ఱడిచట్టం బొకటి వెలసె రౌలటుపేరన్. **(18-3-19)** **4**

చ. అటనట నేల్బడిన్ దుదుచునట్టివి కుట్రలు తొంగలించె దు
ర్ఘటనలు వీనిక న్నెఱిఁగి రాఁదగుచట్టము వ్రాయుమంచు రౌ
లటుదొరపెత్తనంబున నిలాపతు లొం డుపసంఘ మేర్పరిం
చుట నది సృష్టిచేసె నపసూత్రము నిప్పరివాదపాత్రమున్. **5**

క. పోలీసురాజ్యమున కిది, యాలంబము; వీఁడు ప్రభుత కనుకూలుఁడు గాఁ
డాలరి యని బంధింపఁగ, వీలేర్పడె దీన నెంతవిలువరినైనన్. **6**

క. ఇది బందాలకు రచ్చకుఁ, గదలెడిహ క్కోసఁగ; దేలికం దెగడుపదం
బదికినపీలిక గలవాఁ, డదయమ్మగు దీనికోఱ కగపడవలయున్. **7**

క. నీ వీపని సేయఁగరా, దీ విచ్చటు వాయు మంచు నది దేశమునం
దేవానినైన నొక్క నిఁ, కేవిధి సైరింత్రు లోకు లీపెనుఁబామున్. **8**

## మహాత్ముఁడు రౌలటు చట్టము నెదుర్కొనుట

శా. యావద్దేశము పర్యటించి మనమీయన్యాయ్యపుస్థయ్యమున్
ద్రోవంజెల్లును జీము నెత్రు గలహిందూముస్లిముల్! క్రైస్తవుల్!
భావైక్యమ్ముఁ గడించి దీక్షితులరై బంధచ్యుతిన్ గందు నా
త్రోవన్ రం దని విన్నవించెను మహాత్ముం డత్తతిన్ దప్తుఁడై. 9

క. సత్యాగ్రహంబ మన కిపు, డత్యాదరణీయ మనియె నాసేతుతుషా
రాత్యర్థనగము జనతా, నుత్యంచితుఁ డయ్యె నిత్యనూత్న పథానన్. 10

ఉ. భారతరాజకీయములఁ బాల్గొనె గాంధిమహాత్ముఁ డప్డు త
ద్ధోరణి తద్విభూతి గని త్రుళ్ళిరి పాలకు లొక్కపెట్టునన్
ఘోరము ఘోర మంచు మనకున్ గడుఁగూర్చుబిసెంటు కుందె నీ
తీ రవివేకమూల మని దెప్పి రిఁకన్ మితవాదిశేఖరుల్. 11

మ. ఎవ రేమన్నను తిచ్చవోవక ప్రభుం డీబెబ్బులిన్ సాత్త్విక
వ్యవసాయంబున నిల్వరింపఁగ ధృతావష్టంభుఁడై సాగె ని
య్యవమానప్రదశిష్టికై జరుపుఁడీ హర్తాళ మూరూర నం
చు వచించెన్ భరతోర్వి సర్వమును మెచ్చుం జూపె నిచ్చేఁతకున్. 12

ఆ. జరిగె నూరనూర సభలు దుశ్శాసన, ముడుగకున్న శాంతివిడక దాని
నెద్రుతు మంచు సభ్యులెల్లరు ప్రతిన గ్రై, కొనిరి దేశభక్తి కొనలుసాగ. (6-4-19) 13

ఆ. ఆత్మశుద్ధిలేనియతఁడు తొడంగు కా, ర్యం బవార్యమగుట యరిది గాన
బాపుజీ వెలార్చు పల్కు వాటించి హిం, దూర్వి నాఁడు నిత్రు నిర్వహించె. 14

క. చట్ట మిది భారతీయుల, కిట్టలమగు వెట్ట నావహించె నటంచున్
గుట్టెతిఁగెను జగమంతయు, నిట్టూర్చెన్ దెల్లవారినెతికిన్ గుతికిన్. 15

ఉ. తిచ్చవడెన్ బ్రభుత్వ మిటు రేఁగిన భారతజాతిఁ జూచి కా
ర్చిచ్చు విధాన మండిపడి చిందులుత్రొక్కుట కంగవించె నీ
రచ్చలమీఁద శాంతజనరాసులమీఁదఁ బిసాళిహేతువుల్
దెచ్చి తుపాకిగుండ్లు వదలెన్ బలుతావుల హస్తినాదులన్. 16

శా. పాంచాలంబున వీరవిక్రమకలా పాండిత్యభండారముల్
పంచారించినగడ్డలోఁ బ్రభుతపైఁ బైకొన్నవైముఖ్యమున్
గాంచన్ దన్మహి నేలు తెల్లదొరకుం గన్నెఱ్ఱయై కాంగ్రె సీ
యంచుల్ త్రొక్కినఁ గొంపమున్గు ననునూహల్ తోఁచె నుల్లంబునన్. 17

చ. ఒడయరు వీఁడు దయ్యరున కుగ్రతరాసురచక్రవర్తికిన్
దడముల నప్పగించి ప్రభుతన్ వెలిఁగింపఁదొడంగె వీనియా
గడము లెఱింగి సూనృతము ఖడ్గముగాఁగ నహింస డాలుగా
వెడలె మహాత్ముఁ డమ్మిహికి వేఁడినపెద్దలకున్ విధేయుఁడై. 18

ఉ. నీపయనంబు నాఁపవలె నిప్పులుచిందెడుచోటి కీవు రా
నోప మటన్న యాజ్ఞ యిడి దుర్విపతుల్ మనశాంతియోగికిన్;
లోప మదేమి యేను బ్రజలోఁ దగునిగ్రహమున్ గడించు మేల్
చూపునఁ బోవువాఁడ నని చుల్కనచేసె మహాత్ముఁ డానతిన్. 19

ఉ. అంతయహంత పెంచుకొని యబ్ధులు దాఁటి విశాలరాజ్యముల్
సంతనచేసి కత్తిమొనసాయముతోఁ బ్రజనేలు తెల్లవా
రింతకు నోర్తురా ఋషికులేంద్రుమహత్త నెఱుంగ నేర్తురా?
గంతులువైచి పట్టుకొని గాంధిని వెన్కకుఁబంప కూర్తురా? (10-4-19) 20

క. పంజాబున నుద్రేకము, వింజమునాఁ బెరిఁగె నన్యవిషయములందున్
బంజుకొని పుంజుకొనె నిది, నెంజిలి నిడు నంచు గురుఁడు నిలిపెన్ దురమున్. 21

## జలియనువాలాబాగు హత్యలు

ఉ. సైనికశాసనంబు దనుజప్రియమున్ బరఁగించెఁ బాడియున్
నానయుఁ బాసె నోద్వయ; రనంత దురంతము లేచె నేల్బడిన్
మానధనుల్ కలంగి విసిమాలి ప్రభుత్వవిధాన ముగ్ర మీ
గ్లాని సహింపరాని దని కాంగ్రెసుభక్తులు కూడి రొక్కెడన్. (13-4-1919) 22

వ. సత్యాగ్రహవార సమాప్తియు సౌరసంవత్సరాదియు నానాఁడె తటస్థించె - ఇమ్మహాసభ యమృతసరమున జలియన్‌వాలాబాగునం బొడమె - ఈ తోఁటకు నలువలంకుల గోడలు బిగిసె - దీనం జొర నొకంద తెరువు - కదుంగడు నిఱుకటముగా నది యుండు - ఇరువదివేల పిన్న పెద్ద లబలలుం బురుషులు నవ్వనమునం జేరిరి - హంసరాజు కర్తవ్యముం బ్రవచింపసాగె - అంత 23

శా. నిప్పుల్ గ్రక్కుచు దూఁకి దయ్యరు చమూనేతృత్వ మేపార నే
తప్పుం గానని బాలవృద్ధశిశుకాంతారంగమౌ రచ్చపై
గుప్పించెన్ గృపమాలి మృత్యుసఖముల్ ఘోరాగ్నిగోళచ్ఛటల్
తెప్పల్ తెప్పలుగా శవంబు లసృగబ్ధిం దేలి పర్వెత్తఁగన్. 24

మ. పదునార్వందలగుండ్లు ప్రేలె నపు డబ్బా! యింతదౌష్ట్యంబు క
న్నదియున్ విన్నది గాదుకాదు; పురుషుల్ నారీమణుల్ కొండికల్
ముదుకల్ వాలిరి నాల్గువంద; లిఁక నెమ్ముల్ తొమ్ములున్ ద్రెయ్యుటన్
దుదిప్రాణంబుల రెండువేలజన మత్తోఁటం బడెన్ జేద్పడెన్. 25

క. చచ్చినవారు సరే! యీ, చచ్చియుఁ జావనిజనంబు జల మొక చేరెం
డిచ్చుపురు గొండు కన్పడ, కిచ్చోఁ బడినట్టివెతల కెల్లలు గలవే? 26

ఉ. ఏలినవారికై యనికి నేగినభర్తలు పుత్రు లాప్తులున్
గూలినవార్త గుండియలకున్ బరువై దురపిల్లువారి పెన్
గోలకు నద్రులున్ గరఁగి కూలుతఱిన్ సరకారువారు పాం
చాలము నిట్లుచేసి రభిచారపరాయణబుద్ధు లేర్పడన్. 27

క. సొమ్ము దిని తొమ్ముగ్రుద్దిన, తిమ్మన రా నేరుదాఁటి తెప్పను గాల్పన్
సమ్మతి చూపిన వెలిద, య్యమ్ముల నేమని వచింతు నపజంతువులన్. 28

ఉ. వచ్చినయెల్లగుండు విదువంబడి మానితిఁ గాని కానిచో
హెచ్చుని కొందలంపదక యెన్నిటినైనను గాల్చియుందు నా
తెచ్చుఫిరంగిబండి చనుదెంచుటకున్ దగుదారి లేమి నా
చిచ్చు రగుల్పనైతి నని చెప్పిన దయ్యరు గుండె యెట్టిదో. 29

ఉ. అంతలు చేసి వీఁడు భయమందక లజ్జకు లోనుగాక యే
చింతయు లేక “నిప్పుకలుచిందక జంకెనచూపులన్ ప్రజా
సంతతిఁ దోలివైచుట యసాధ్య మటం చనఁ గాని నన్ను ది
గ్దంతిని లోకు లప్పు డెగతాళి యొనర్పక మెత్తురా” యనెన్. 30

క. ‘తానా’ యని నంతనె ‘తం, దానా’ యనినట్లు వీనిదౌష్ట్యమునెల్లన్
నాన విడి మెచ్చె నొడయరు, మానచ్యుతు లెంతకును సమర్థులు గారే! 31

## పాంచాల దురంతములు

చ. అమృతసరమ్మునంబలె దురంతము లమ్మహిఁ బెక్కు తావులన్
సమకుఱె స్మితు జాన్సను లసాధుపథప్రియులై ప్రజావలిన్
జమరి యమానుజన్ము లనఁ జాలిరి నాఁడు కసూర్ లహోరు గృ
ధ్రములకు నండయై విలయతాండవకేళికి దండయై చెడెన్. 32

ఉ. మారణహోమ మిట్టి దపమార్గములం బరిపూర్తి చేసియున్
దేఱక పెంచుకొన్న కసి తీఱక సైనికశాసనంబు న
ద్ధారణి రెండుమూన్నెలలదాఁకను బెంచి నిరాయుధప్రజా
గౌరవ మేటఁగల్పి రధికారులు సాధుజనాధికారులై. 33

శా. ముక్కోణంబులఁ గట్టి కొట్టి వసనంబుల్ విప్పి పుర్వంబలెన్
దొక్కం బ్రాఁకుట కాజ్ఞపెట్టి సెలపోటుల్ గుప్పి క్రొన్నెత్తురుల్
నిక్కన్ వాల్కొరడాల మోఁది విమతానీకంబు లుప్పొంగుచో
దిక్కుం గానక పొక్కె భారతసవిత్రీదేవి పంజాబునన్. 34

ఉ. తెల్లనితోలువానికి విధేయతచూపి సలాము లీనిచో
నల్లులకైవడిం బ్రజల నల్పిరి నిండినరాజవీధులం
దెల్లిని మూయలేదనుచు నెక్కినబండిని డిగ్గలేదటం
చల్లరిచేసి గాసిపడున ట్లొనరించిరి పౌరవర్గమున్. 35

చ. నెఱిగలవారిఁ బట్టుకొని నేరము సెప్పక పండ్లు ఊడ్వనన్
గొఱుకుచుఁ గుప్పనూర్పిడికి గొడ్లనుబోలె బిగించి మేళముల్
మొరయు బజార్ల కీడ్చి నలుమూలలఁ ద్రిప్పిరి దానఁ బోవ క
గ్గఱువలఁ ద్రొక్కి తాళములుకట్టిరి తుల్వలు పాకిదొడ్లకున్. 36

చ. దనుజులఁగాక యిట్టిదొరదౌష్ట్యము లీకొనువారి నెవ్వరిన్
గనఁగల మక్కటా! యనృతకల్పితసాక్ష్యము వల్కలేని స
జ్జనుల బలాత్కరించి చెఱసాలలఁ గ్రుక్కి రుదగ్రదండముల్
చొనిపి రపానమార్గముల శుంఠలు నెత్తురు వఱ్ఱుకట్టఁగన్. 37

ఉ. సెజ్జలు నెత్తిపై నదిమి చెప్పులుమానుట కానవెట్టి పే
రొజ్జల శిష్యులన్ గణఁకు లూరెడియెండలఁ దోలి దైన్యముల్
విజ్జఁగఁ బెద్దదవ్వు నడిపించిరి వంచిరి వైజయంతిముం
దుజ్జనచేసి రక్కటిక మూడ్చిరి ధర్మము నాంగ్లసైనికుల్. 38

ఉ. అంగదఁ గ్రుంగిపోవ జలయంత్రము లాఁపిరి దేవళాలలో
నెంగిలినింపి కంపుగదియించిరి పంటల నిండ్లఁ గాల్చి యు
ప్పొంగిరి పల్లెపల్లెనడిబొడ్డునకుం బ్రజఁ జేర్చి ముద్దుపె
ట్టంగ బలాత్కరించి రకటా! తనచెప్పుల కన్నరాధముల్. 39

చ. కటకట! యెఱ్ఱసంజవెనుకన్ బురవీధి మెలంగువారిపైఁ
బటపట నగ్గరాసులు తుపాకులు ప్రేల్చిరి; మింటనిల్చి యు
త్కటత నటింప బాంబులనుగాల్చిరి పల్లెలపట్టణాలపైఁ
గటుత నెఱుంగనట్టి ప్రజ కట్టిఁడిచావులకున్ వశంపడన్. 40

క. ఊరేగు పెండ్లివారిని, గారాగారముల కంపఁగల్గిరి తమకున్
సూరెల నిలువఁబడి వకీ, ళ్లాఱడిసురఁటీలు విసర నార్చిరి పెలుచన్. 41

మ. కొడుకుం జూపనివృద్ధు నీడ్చి కొరదాకు న్మేఁతగావించి దుం
దుడుకుం జూపిరి; నే నెఱుంగఁ బిత యెందున్ దాఁగెనో యన్న లే
బుడుతన్ జెండిరి; పెద్దపెద్దలకుఁ జీఁపుర్లిచ్చి దుర్భాములన్
దుడువన్ బంపులువెట్టి రింతటి యసాధుత్వంబు నెట్లోర్చిరో. 42

క. ధనధాన్యంబులు దోఁచిరి, వనజంతువు నట్లు మానవప్రాణి నిసీ!
యినుపతెరబోనునం దిడి, యనలంబు నదల్చునెంద నాఁపిరి కూళల్. **43**

మ. మగవారి న్వెలికంపి యంతిపురమున్ మల్లామడిం జేసి దుం
డగముల్ పెంచి పతివ్రతామణులఁ గట్టా! వీథికిం ద్రోసి వ
ల్వగమిన్ దుల్చిరి వంగఁబెట్టి రవలన్ వాక్రువ్వలే; నెట్టి నిం
ద్యగతిం జొత్తురొ తన్మహాసురులు కాయం బూడ్చి దుశ్శాసనుల్. **44**

ఉ. ఈ సయితానురాజ్యమున కేలికయై యపరాధగంధ మే
వీసము లేనిమానవుల వెంపరలాడినదయ్య రాంగ్లభూ
వాసులమెప్పు వొందె నులుపా నెఱపచ్చలబాఁకు నందె రా
కాసికి హారతుల్ నిలుపఁగల్గినబోయల నేమిసెప్పెదన్. **45**

ఉ. ఈ విఁక మాతృదేశమున కేగుము దస్సినవాఁడ వేము నీ
సేవల కుబ్బినార మని సీమకు దయ్యరు నంపి వానికిన్
జావు ఘటిల్లుదాఁక మనజాలెధనమ్మునఁ బించ నిచ్చి పా
పావధి కేగి రేలుబడియయ్యలు సిబ్బితిలేని కొయ్యలై. **46**

చ. నిలువునఁగూలి యుస్సురని నెవ్వగ మున్కలువైచె గాంధి, నా
తలఁపనిచెట్ట వుట్టెనుగదా యని దిక్కులుసూచె, సైనికుల్
సలిపినదుండగంబు లవి సైఁపఁగ రానివ యంచు వానికిం
దొలుతఁ బ్రజాలి సాత్త్వికవిధుల్ తలఁదాల్పమి రోసి చేద్పడెన్. **47**

వ. భారత జాతీయమహాసభ పాంచాలమునం దాయేఁడు (1919 డిశంబరు) జరుగవలయు – కాని కాంగ్రెసాగద్దం ద్రొక్కరా దని రాష్ట్రపాలకుఁడు మైకేలోడ్వయరు నిశ్చయించుకొనె – ప్రజానాయకులు కిచ్లూ సత్యపాలు రెట్లయినం బరిషత్తు సాగింపఁదగు నని పంచకరపాట్లు వడం జాగిరి – కాన నమృతసరాధికారు లయ్యిరువురం బిలిచి బంధించి యెందో మఱుగు పఱిచిరి (10-4-1919) – పౌరు లివ్వార్త విన్నంతన కలంగి తమ పెద్దలయున్కిం దెలుపు మని మండలాధిపతి నడుగం బయనమైరి – మధ్యేమార్గమునఁ బ్రజాప్రవాహము సైనికనిరుద్ధం బాయె – అవ్వల మూఁకవా రొందురెండుఱా లాబంట్లపై విసరిరి – వెన్వెంటన తుపాకులు ప్రేలె – ఇద్దఱుపౌరు లసువులం బాసిరి – పలువురు క్షతగాత్రు లైరి – ప్రజ లాశవంబులం బ్రోలికిఁదెచ్చుచుఁ బాంచాలమునకున్ వెడలినమహాత్ముం దపుడ దారిలో నాఁకట్టఁబడె నన్నవార్త వినిరి – వారియాగ్రహము కట్టలం ద్రెంచుకొనియె – ఉద్రేకవివశులు కొంద ఱల్లరికిం దెగిరి – దీనం దెల్లవారు నల్వురు మరణించిరి – అవ్వల సైనికశాసనము ప్రయుక్తం బాయె – పదంపడి దయ్యరు విజృంభించి పాంచాలమున రక్తవాహినులం బరఁగించె – ఇది ఘోరాతిఘోరం బనుట నిక్కంబ – దీనిని మహాత్ముఁ డెంతయు గర్హించె – కాని సత్యాగ్రహతత్త్వం బెఱుంగని

జనత కావించిన ప్రతీకారచేష్టితంబుల మన్నింపలేక విన్నంబోయి 'సాయొనర్చినదోషంబు హిమాద్రియంతదికదా' యని పశ్చాత్తాపసంతప్త హృదయుఁడై సాత్వికసమరంబు నప్పటికిం గట్టిపెట్టి 48

చ. కలఁగినభారతమ్మున జగద్భయదాసురశస్త్రపాలనన్
నలఁగినభారతమ్మున జనమ్ములమానధనంబు సర్వమున్
దొలఁగినభారతమ్మున బుధుల్ కొనియాడఁగఁదగ్గ శాంతిదాం
తులు సమకూర్చ నెంచె నృపతుల్ సహకారులు కాఁదలంచినన్. 49

## హంటరువర్గమువారి తీర్పు

క. వెనువెంటన ఢిల్లీపతి, మనకన్నులనీరు తుడుచుమాటలు పలికెన్
జనులొప్పనియుపసంఘముఁ,బనిచెన్ బాంచాలగాథపరిశోధింపన్. (1919సెప్టెంబరు) 50

ఉ. 'హంటరు' పెద్దగా వెదలి యయ్యది నీతివిరుద్ధవాదముల్
పంటకుఁదెచ్చి ఖడ్గపరిపాలన కక్కఱపుట్టె లోకులే
తుంటరులైరి సైనికులదుండగ మల్పతరంబ యంచు వా
కొంటకు నోర్చె విత్తన మొకొండును వృక్ష మొకందు నెట్లగున్. 51

శా. లంకం బుట్టినవారలెల్ల రసురుల్ గాకుందురా? తెల్లవాఁ
డంకాపొంకము లూఁపి పాపములుసేయన్ మాయురే! వానిపై
రంకుశ్యమ్మును రచ్చకుం దిగిచి దూఱన్ దెల్లవాఁ డోర్చునా?
లెంకల్ హైందవు లెంద ఱెంత చెడినన్ లేశంబు వేసారునా? 52

ఉ. నిందలుమోపి బందెలకునెట్టినపౌరులఁ బిల్చి మీర లే
మందు రటంచుఁ దా నడుగ కక్కడనక్కడ ముక్కడుల్ జడుల్
పందలు రాజ్యతంత్రపరిపాలకు లాడినపల్కు నూఁది యా
బృందము తీర్పుసెప్పె గుణవృద్ధు లిసీ! యని యూసడింపఁగన్. 53

## గాంధి మున్నగువారు పంజాబుపడినబాధ లరయుట

గీ. ఏలుబడివారు సృష్టించు నీకదంబ, మవతరింపకమున్నె దయ్యరుపిసాసి
తులువతనమెల్లఁ బరికింపవలయు నన్న, నిర్ణయమొనర్చెఁ గాంగ్రెసునేతృచయము. 54

వ. ఈతీర్మానములఁ బాటించి మున్ముందు (1919 జూన్ చివర) శ్రద్ధానందస్వామియు మోతీలాల్ మాలవ్యాలును దుఃఖభాజనమైన పాంచాలమునం గాలుమోపిరి – పదంపడి దీనబంధు వాండ్రూసు వారిం బెరసె–అవ్వల జవహర్ టాండను లమ్మనీషులం గలసిరి – నిషేధాజ్ఞ తొలఁగుటంజేసి మహాత్ముఁడున్ దూఁకి (17-10-19) యేతన్నేతలం గదిసె – అంత 55

ఉ. ఆతనిరాక రాకవలె నమ్మహికిం బరితాపతప్తకున్
శీతము హృద్యమయ్యె వెఱచే నఱచేతులఁ బ్రాణ ముంచి ని
త్యాతురతం గృశించుప్రజ కయ్యెడ గుండెలువచ్చె నయ్యకున్
జోతలువెట్టి దైవమును జూచితి మంచుఁ దలంచి రెల్లరున్. **56**

క. మ్రోయన్ 'మహాత్మగాంధికి, జే' యనురావములు యోగిశేఖరుఁ డార్త
శ్రేయఃకాముఁడు పంజా, బాయెడ వీక్షించె నశ్రు లాఱనికంటన్. **57**

ఉ. నెత్తురువఱ్ఱు లోడ్చి యవనీతల మంతయు నాంగ్లరాజ్యసం
పత్తిగఁ జేయ రక్తియును భక్తియుఁ జూపినవీరజాతిపైఁ
గత్తిని దూసి పాపములు గాదెలఁబోసిన తెల్లవారిదు
శ్చిత్తము నెంచి విస్మయముసెందె వగంబడె సిగ్గునన్ జెడెన్. **58**

క. నాదిర్షాదౌరతనమున, కీదౌరతనమునకు వేర్మి యేమని తలఁచెన్
ఖేదమున మున్గితేలుచు, నాదేశము నరసెఁ బల్లియలఁ బట్నములన్. **59**

గీ. తమగడించినరాజ్యంబు తమవిభూతి, కదలకుంటకు నవి చెక్కు చెదరకుంట
కెంతరాకాసితనమునకేని జంక, రాంగిలేయులు పెనుఁబాము లని యెఱింగె. **60**

వ. ఏల్బడివా రంపినహంటరువర్గ మంతకుమున్న యానేలకు వచ్చి యుచ్చులం బన్నె - దాని పిసాళిబ్రదుకుం గన్నవెన్క నమ్మూఁకమ్రోల సాక్ష్యముసెప్పం గాదని మహాత్ముదులు భారతప్రజానేత లూహించిరి-కావుటంజేసి కాంగ్రెసుపక్షమునఁ బాంచాలదురంతములం బరికింప నొకశిష్టపరిషత్తు రూపెత్తె - అందు గాంధి చిత్తరంజనులును ఫజ్లుల్‌హక్కు జయకర్ తయాబ్జీలును సభ్యులైరి - మహాత్ముని యాజమాన్యమున వా రార్తిం బడినతావుల కెల్లం జని సత్యగంధబంధురంబగు సాక్ష్యంబు సముపార్జించి యుదాత్త మగునివేదికం బ్రచురించిరి - అయ్యది తెల్లవారిదుండగములనెల్లం దెల్లమి సేయు నిద్దంపుటద్దము నాఁదగు - వెండియు నందనపరాధులగుప్రజలం గాల్చిచంపిన డయ్యరు మున్నగు పడవాళ్లను వారిం బ్రయోగించిన పాంచాలరాష్ట్రపాలకు నోద్వయరును వారి నిరంకుశతం గాదనక మన్నించిన రాజప్రతినిధి ఛేమ్సుఫర్డును బదభ్రష్టులఁ గావించుట యధికారుల కనిష్ఠకర్తవ్య మనియు వీరిం బాడిపట్టుల కప్పగించి శిక్షితులం జేఁత నీతి యైనను భారతీయు లిప్పట్ల నుదారతం జూపుట లెస్స యనియు మహాత్ముం డెచరించె - అయ్యది ముద్రితమై నేల నాల్గుచెఱఁగులకుం బ్రాఁకె - దానిం గని **61**

ఉ. నాగరికప్రభుత్వములు నైకము లెంతయుఁ దల్లడిల్లె నీ
యాగడముల్ పిశాచములకైనను జెల్ల వటంచుఁ బల్కె నే
లాగున నెంద ఱన్నను బలా! చలియింపక సీమపార్లమెం
టౌఁగద యంచు డయ్యరుకృ తాసురచేష్టలనెల్ల నీకొనెన్. **62**

క. ఈపుండు మాను టెట్లని, బాపూ దురపిల్లె, సర్వభారతమును సం
తాపమున గ్రుంగె, దాస్య, క్షేపమె కర్తవ్య మన్న చింతకుఁజొచ్చెన్. 63

వ. వేయితొమ్మన్నూట పందొమ్మిదవయేఁటి నాల్గవనెలయం దాఱవనాఁట మొదలై పదుమూఁడవనాఁటి 'జలియన్‌వాలాబాగు' దుండగములతో ముగిసినకాలము భారత రాజకీయేతి హాసంబున మఱవంగానిది యౌట నమ్మఱుసటియేఁటినుండియు నయ్యది జాతీయవారమై ప్రజాగౌరవపాత్రం బాయె - అయ్యది యట్లుండె. 64

సీ. అస్వతంత్రమ్ములై యల్లాడుభూముల, నుద్ధరింపఁ దలంచి యుద్ధమునకుఁ
దారసిల్లితి మని ధర్మసూత్రంబులు, వల్లించి గెల్చినతెల్లవారు
కలనికై విత్తంబు కాయంబు నర్పించి, నలఁగిన భారతీయులకు నాఁడు
కంటినీ ర్తుడువంగఁ గడఁగి వారిని వీరి, నటునిటు త్రిప్పి సాక్ష్యములు పెంచి
నేతిబీరకాయరీతిని జవియు సా, రంబు గానరాని రాజకీయ
సంస్కరణము లేర్చి చర్చించి యిడిరి మ, హాప్రసాద మిది యటంచు మెచ్చి. 65

ఉ. సైనికరాజ్యవేళఁ జెఱసాలల కంపిన దేశనాయక
శ్రేణిని బంధముక్తమును జేయు మటంచు బ్రిటీషుధారణీ
శానుఁడు షేమ్సుఫర్డునకుఁ జాటినయాజ్ఞయు వచ్చె నప్పు; డీ
యానతి భారతీయహృదయంబుల కించుక శాంతి గూరిచెన్. 66

## అమృతసరము కాంగ్రెసు మహాసభ

ఉ. వచ్చిరి బందెవీడి జనవంద్యులు నేతలు భారతక్షితిన్
హెచ్చెను సంతసం బొదయ రేలెడుసీమ నపూర్వపర్వముల్
విచ్చెను, మాతృభక్తిపదవీ నదవిష్ణులు వేలువేలుగా
నచ్చటఁ గూడు కాంగ్రెసుమహాసభకుం జనుదెంచి రాదటన్. (1919 డిశంబరు) 67

చ. అమృతసరంబునం దిది మహావిభవమ్మున జాతిముక్తికై
శ్రమపడు మోతిలాలుకనుసన్నల సాగెడివేళ సాధువి
క్రమనిధు లాలిసోదరులు కారఁదొలంగి సదస్సులోనికిన్
సమదగజంబులో యన హసన్ముఖులై యరుదెంచి రంచితుల్. 68

క. ఓహో! జయజయపద కో, లాహలముల పొంగె నపు డలబ్ధానంద
శ్రీహత్తి చటులవీచీ, వ్యూహోద్యజ్జలధి యయ్యె నోలగమెల్లన్. 69

ఉ. చర్చకువచ్చె సంస్కరణశాసన మాసభయందు; దానిచే
కూర్చుఫలం బలంతి; మనకుం దగ దీవెదచట్ట మంచు దా
సర్చులు రేఁపె; వానిపలు కొననిమెచ్చెను లోకమాన్యుఁ; డీ
పేర్చినపెద్దలన్ వినయపీఠము గాంధి యెదిర్చె నత్తతిన్. 70

వ. సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వము వలయునని యింతకుమున్ను బొంబాయి ఢిల్లీ కాంగ్రెసు మహాసభలు తీర్మానించుటయు నేఁడు వెల్వడిన 'మాంటుఫర్డు' సంస్కరణము లాపెత్తనమునకు వేయామడలదవ్వునం దుంటయు మహాత్ముఁ డెఱుంగనిది కాదు- కాని పాంచాలమునం బ్రవర్తిల్లినహింసం బరికించుపని తన తలపై నుండుటంజేసియు ఖిలాఫత్తుం జక్కఁబఱచు నారటంబు తన కగ్గలంబగుటను మాంటేగు మనభూమికిఁ జెల్మికాఁ డని తాను విశ్వసించుట కతనను రాజసందేశ ముదారమై యాలీసోదరులు మున్నగుప్రజానాయకుల బంధవిముక్తికిం గారణమగుటచేతను దొరతనమువారి కిపు డెడమొగము పెడమొగముగా నుంట యనర్థకం బనియు, నేఁటిసంస్కరణముల తోడ్పాటున భారతీయు లనతికాలంబున సంపూర్ణస్వతంత్రతతం బడయవచ్చు ననియు నమ్మేటి తలపోసె - కానఁ గ్రొత్తచనవుల నీకొంట యుచితం బని తన యహింసా తత్త్వము సత్యనిరతి వేదాంతదృష్టి పొంగిపొరల సిద్ధాంతమొనర్చి సభాసదుల ముగ్ధులఁ గావించి విజయమ్ము వడసె - అంత 71

క. నంజుడుదిండులు సైనికు, లంజక సాగించుహింస కసురుచు రగుచున్
బంజాబువారు కుడిచిన, నెంజిలి యీకొల్వుచూపు నెట్టన తిగిచెన్. 72

శా. ఈపోరాములు శోచనీయములు; కానీ ఘూర్జరక్షోణిలో
నీపాంచాలమునన్ బ్రజల్ కుపితులై హింసావిధిం జొచ్చు టే
నోపన్ గాంగ్రెసువారలున్ నియతులై యోచించి యీచందమున్
ద్రోపాడం జను నంచు గాంధి వలికెన్ దుర్వారసత్యాదృతిన్. 73

ఉ. శిష్టసదస్సువారు ఋషి శేఖరు తెచ్చిననిర్ణయమ్ముపై
నిష్టత చూపకుంట గురుఁ డెంతయు నిస్పృహచెంది కాంగ్రె సీ
శిష్టిని మెచ్చదేని తనసేవలు దానికి దక్కవంచు వి
స్పష్టముచేసె బెట్టిదపుజాడలు లేని వచఃపరంపరన్. 74

ఉ. ప్రొద్దు కదుంగదుం గడచిపోవుట నప్పటికిన్ సభాసదుల్
నిద్దురకొగ్గి రంతటిమనీషులు దోషము నొప్పలేమికిన్
దద్దయు విస్మయంపడె వెతంబడె మోహనుఁ డంతలో నెఱా
ముద్దుగఁ దోఁచె వేయికరముల్గలవేలుపు తూర్పుగట్టునన్. 75

## మహాత్ముని తీర్మానము నెగ్గుట

ఉ. అత్తఱిఁ దారసిల్లినమహాసభకున్ దననిర్ణయంబు కిం
చిత్తును మార్ప కిచ్చె గురుసింహుఁడు; సభ్యసమాజ మంత ను
వ్వెత్తు కలంగె సందడులువిజ్జిన కొల్వుతెఱం గెఱింగి లో
కోత్తరధర్మమూర్తి వినుఁడో! ప్రియసోదరు లంచు నిట్లనెన్. 76

శా. ఎన్నో నిర్ణయముల్ బయల్పడును నేఁ; డీనాదుతీర్మాన మా
యన్నింటన్ గొనియాడఁ దగ్గదిసుఁడీ! యందున్న సత్యంబు మీ
కన్నుల్ మీహృదయంబులున్ గనవలెన్ గాంగ్రెస్సుగె ల్పెల్ల నీ
సన్నాహంబున దాఁగియున్నది మనీషామాన్య లీ రందఱున్. 77

చ. పలుకులు పెక్కు లేల మనభావిజయమ్మునకెల్ల మూల మే
నిలిపిననిర్ణయంబ; యవనిన్ నరుఁ డెంతసమర్థుఁడైన నే
తెలివిగడించినన్ నిజముతెన్ను లెఱుంగనినాఁడు సత్యమున్
గొలువనినాఁడు వాఁడు సమకూర్చుకొనంగలఁడా జయోన్నతుల్. 78

ఉ. గుజ్జరిసీమలోఁ బ్రజలకున్ సివమెత్తె; నహింసమీఁదిచూ
పుజ్జనచేసి వారు పరుషోద్యమముల్ పరఁగించి; రిమ్మహిన్
విజ్జినదుండగమ్ములును వింటిని గంటిని గాన దీనికిన్
లజ్జపడందగున్ మన మలంతివలంతులు సెప్ప కియ్యెదన్. 79

చ. ఇచటికి వచ్చున న్నెదిరి యింటికిఁబొమ్మని త్రోసి సత్యపాల్
కిచులులఁ బట్టి బందె నిఱికించి దొరల్ ప్రజ కాఱ్గహంబు కూ
రిచి రని వార లట్టు లొనరింపనిచో మనవారు తిక్క రేఁ
గి చెడుపనుల్ పొనర్పఁ దమకింపకయుం డ్రని యే నెఱుంగుదున్. 80

వ. కాని యేల్బడివారి కానాఁడు గంగవెఱ్ఱి వుట్టె - అదియ ప్రజకుం బ్రాఁకె - వెఱ్ఱికి మందు వివేకమ్ముగాని వేఁదు తెట్లగు - ఈ రహస్యము గన్నవానికి లోకంబు దాసోహమ్మను - అనవుడు నోలగంబెల్ల గంభీరతాముద్రితమై మహాత్ముని ప్రస్తావమునకుం దలయూఁపె-అమృతసరమునం గూడిన కాంగ్రెసుతత్త్వంబు నిది తెల్లమిచేసె-నాఁటి సభాసదు లిత రాంశము లెట్లున్నను బాపూయాజమాన్యమునం బయనించు జాతీయ మహాసభ సత్యాహింసలపై నాధారపడియుంట నిక్కం బని యెఱింగిరి నాఁ జను 81

ఉ. తద్దయుదస్సి గాంధి ప్రభుతావిముఖత్వము లేనిదారికిన్
బెద్దల బిన్నలం దిగిచి పేరుగడించెను గాని దైవ మా
పద్దున కొప్పదాయెఁ బరిపాలకులం బెడఁబాసియుంటయే
ముద్దగు నా కటంచుఁ దగుమొగ్గరముల్ సమకూర్చె నిమ్మహిన్. 82

## ఖిలాఫత్తు సమస్యపట్ల నాంగ్లేయులెగ్గుసేయుట

ఉ. భారతభూమి దయ్యరుతుపాకులదుండగమున్ దలంచి యూ
రూరును గ్రుంగుచున్ గెరలుచుండ ఖిలాఫతుపట్ల సీమస
ర్కారు సహింపరాని యపకారముసేఁతకుఁ జొచ్చి పుండుపైఁ
గారము చల్లె ముస్లిములకట్టలుకం బడెఁ బాడిఁ గోల్పడెన్. 83

ఉ. ముప్పదికోట్లముస్లిములు మూరినవిశ్వము తెల్లవారిమే
లొప్పనిదయ్యె నాఁడు; పెనుయుద్ధము సాగుతతిన్ బ్రిటీషువా
ర్చెప్పిన దొక్కటై యిపుడు చేసిన దొక్కటియౌటఁజేసి యీ
తప్పున కేమిశిక్ష యనుదారికి వచ్చె మతానురక్తమై. 84

వ. ఇస్లాము నా మతప్రవక్త యాదేశించినధర్మంబును విశ్వసించుటయ కాదు - ఇది దృఢతరం బగు సాంఘికబంధము నాఁ దగు-ముస్లిము లెల్లవా రన్నదమ్ములం బోని వారు- లోకమం దేనేల నేజాతి నేవన్నియం బొడమినవాఁడేని యిస్లాము నీకొన్నంతన యీసోదరులకుం గల యెల్లచనవులం బాలువడయు - విశ్వంబునం గల నానా రాజ్యములం గాఁపురించు మలకలకెల్లఁ దుర్కీప్రభువొకండ మతాధికారి - ముస్లిముల కరేబియా పాలస్తీనాలు మహాతీర్థములు - అందలి మక్కామదీనా మున్నగుతావులు మహమ్మదుమనికిపట్లు - మక్కా మసీదు ముస్లిములకుం బరమారాధ్యమైన మత కేంద్రము-టర్కీ తేని కీపవిత్రస్థాములపట్ల మతాధికారముతోపాటు రాచతీకము న్గలదు - ఈచనవులు రెండును వేఱుపఱుపరానివి - ఇది మహమ్మదీయప్రపంచ మంగీకరించిన ధర్మనిర్ణయము - కావుటంజేసి తుర్కీసుల్తాను రాజకీయ ధార్మికాధికారముల రెంటిం జేపట్టియుండు - ఇస్లాముపాలకుని పట్టపుంబేరు 'ఖలీఫా' యగుట 'ఖిలాఫత్తు' నా మతపాలకత్వ మని యెఱుంగవలె - టర్కీవిభుండుతక్క లాఁతివాఁ డెవ్వఁడుం దమ తీర్థమ్ముల కానవెట్టరా దని మహమ్మదీయుల పట్టుదల - ఇట్టి చెట్ట మూడిననాఁడు ముస్లిములెల్లరుం గత్తికట్టి తుట్టతుదినెత్తుబొట్టు రాలుదనుకం బోరాడి ఖలీఫాపెత్తనము నుద్ధరింప వలయు - ఇది వారికిం గడవరానికట్టడ - విడువరానిపాడి - పరిస్థితు లిట్లుండఁ బందొమ్మిదివందల పదునాల్గవయేఁట నాంగ్లేయులు జర్మనీ టర్కీ రాజ్యము లపైఁ గాలుదువ్విరి-హిందూమహిం గలముస్లిము లానాఁడు పెద్దయుం గలఁగి 85

ఉ. ఏలినవారిపల్కు విని యీసమరంబున దూఁకినన్ మతో
న్మూలన మాచరించుకొల మూడును; గయ్యము సేయకున్నచో
వాలినరాజభక్తి కొకవంకర వచ్చు; నటంచు నిల్వునం
గూలిరి యొల్లఁబోయిరి దిగుల్పడి రెన్మిదికోట్లమందియున్. 86

చ. అపుడు బ్రిటీషుమంత్రిమణియై తగు లాయదుజార్జి, భారతో
ర్విపతియు ముస్లిముల్ కుడుచువేదన సర్వ మెఱింగివక్తృతా
నిపుణత చూపి మీ రిటులు నెవ్వకు లోపదనేల వెఱ్ఱివా
రిపనికిఁ బూననేల మతరీతులు నీతులు మే మెఱుంగమా! 87

చ. మతమునకున్ రణాన కణుమాత్రయుఁ జుట్టతికంబు లేదు మీ
హితులగు తుర్కివారు విజయేందిర కింపనివార లైననాఁ
డితరులయ ట్లధర్మవిధి నీకొనఁబోము ఖలీఫహక్కు లం
చితముగ నిల్పఁబెట్టెదము చేకొన మీరు భజించుతీర్థముల్. 88

ఉ. మూలుగుచున్న రాజ్యములముక్తికి మే మిపు దస్త్రశస్త్రముల్
కేల ధరించుటాయెఁ దురికీపాల మేటికి మాకు? వైరముల్
మాలినవెన్క గెల్చినసమస్తధరిత్రులుఁ దొంటితేండ్లకుం
బాలగునట్లు చూతు మనపాయపథం బిది విశ్వసింపుఁడీ. 89

చ. అనుటయు భారతంబునమహమ్మదుభక్తులు తేతి పోరికిన్
గునగునసాగి ఖడ్గములకున్ బలిగా నిడి రాంగ్ల శత్రులన్
బెనఁకువలోన గెల్పుఁగొని పేర్చిరి యార్చిరి యింగిలీసువా
రును మతివారిమిత్రులును రోజులు మంచివి దాపరించుటన్. 90

క. చేసినవాగ్దానంబులు, త్రోసిరి మనదొరలు ఫ్రాన్సుతో నిటలీతో
గ్రీసూర్వితో నొడంబడి, కోసిరి తుర్కీని బాళ్లకుం దగునట్టుల్. 91

వ. సుల్తానురాజ్యము నిట్లు ముక్కలుగావించి మిత్రమండలివా రాసియా యూరపులం దమకు వలయుతునియలఁ గైకొని తక్కినతుర్కీ నెల్ల శాసింప నొకపంచాయతిం బొడమించి సుల్తానును బందాఁబోనివానిం జేసిరి - లాయడుజార్జి యిట్లు విశ్వాస ఘాతుకుఁ దగుటంజేసి మనదేశమ్మున మహమ్మదీయుల కాక యెల్లమతములవారుం గ్రోధావేశఘూర్ణితు లైరి - ముస్లిముపెద్దలు కాంగ్రెసునేతలు మహాత్ముని యాజమాన్యమున నీసంకటముం ద్రోయ నమృతసరపుఁ గాంగ్రెసునఁ దీరుమానించిరి - వెన్వెంటన గాంధియు నాలీసోదరులు మున్నగు మహమ్మదీయులు నన్సారి నాయకత్వమున రాజ ప్రతినిధిం జేరి (19-1-20) 92

## 1920

ఉ. లాయడుజార్జిపల్కు లవలం బడి తుర్కికి నామరూపముల్
పోయె ఖలీఫ బన్నమున గ్రుంగెను ముస్లిములెల్ల రీసడిన్
మోయుట కొల్ల మంచు నలుమూలల రేఁగిరి వీరి శాంతులన్
జేయుట మీకుఁ బాడి యని చెప్పిరి కోపము నాఁకపెట్టుచున్. 93

ఉ. మాపలు కాదరింప కవమానము డింపకయున్న ముస్లిముల్
రే పెటు రాజభక్తిని భరింతురు నమ్మినవారి నివ్విధిన్
ద్రోపు చరిత్రలోఁ గనము దుష్ఫలముల్ మొలతేకమున్నె మీ
చూపును మార్చుటొప్పు ననుచు న్వచియించిరి వీరసింహముల్. 94

ఆ. ఇటు మహమ్మదీయులే కాక హైందవు, లెల్లవారు తుర్కివల్లభునకు
నేఁడు మీ రొనర్చుకీ డోర్వ మని పట్టు, పట్టి రనిరి వినయ ముట్టిపడఁగ. 95

ఉ. చెప్పినమాటలెల్ల విని శేముషి పింపిసలాడ ఛేమ్సుఫ
ర్డిప్పటిమీదిగుల్ తెలిసి యేనును గుందితిఁ గాని సీమవా
రొప్పినమాత్ర మీకు ఫల ముందదు నల్వురు సమ్మతించి యీ
ముప్పును ద్రోయఁగావలయు ముంగల వెన్కల చూడఁగావలెన్. 96

## మహమ్మదీయులు తమ వేదనను లండనులో వెలువరించుట

ఉ. నావుడు వెచ్చనూర్చి పయనంబునుగట్టిరి సీమకున్ మత
శ్రీవిభవానురక్తములు చిత్తము లూఁగ మహమ్మదీయు; లాం
గ్లావనిఁ జేరి పేరుగలయందఱఁ జూచి సమాదరప్రభల్
పూవఁగ విన్నవించి రెదఁ బుట్టినవేదనచంద మంతయున్. 97

ఉ. చేసినదెల్ల ధర్మమును జేకొని చేసితి మందు వీసమున్
దోసములేదు రోసములతో నగులగ్గులు లేవు టర్కికిన్
గీసినగీఁత మార్చుపనికిన్ దలయూఁపరు మిత్రు లేలపే
రాసలు పొం దటంచుఁ దెగనాడెను లాయదుజార్జి యత్తఱిన్. 98

క. ఇంద మని తుర్కిగద్దకుఁ, జెందనిదేశముల నిచ్చుచిత్తంబు సుహృద్
బృందమునకు లేదు వృధా, వందురకుం దనియు మంత్రివర్యుఁడు వలికెన్. 99

ఆ. నేఁడు దురమునందు నోడినక్రైస్తవ, రాజ్యములకుఁ ద్రచ్చిత్రచ్చి యెట్టి
మనువుసూపెమిత్రమండలి తుర్కి కే,నదియచెల్లుననియునతఁడువినిచె.(17-3-20) 100

ఉ. తెచ్చినదౌత్య మిట్లు వితథీకృత మౌట మహమ్మదాలి యీ
పచ్చెపుదొంగలన్ విడుట పాడిగదా! యురడించిముస్లిముల్
వెచ్చనినెత్రు గార్చి రణవీధులఁ జచ్చుట వీరిపేర్మికా
వచ్చెను బుద్ధియంచుఁ దనవర్గముతో నిటు సాగె నుగ్రుఁడై. 101

ఉ. ఆంగలమంత్రిపుంగవుఁ దహంకృతిమైఁ దురికీమహత్తకున్
భంగముతెచ్చుచున్ నుడువుపల్కులు భారతభూతధాత్రి మ్రో
యంగనె సర్వదేశములు నల్లలనాడి విచారముద్ర దె
ల్పం గడఁగెన్; గురుండు మరలన్ దుమికెన్ బరిమీఁది కాదటన్.(19-3-20) 102

వ. ఆలీసోదరులపెత్తనమున ఖిలాఫత్తుసంరంభము రెండుమూఁడేఁడులఁదొట్టి భారత దేశమునం జాగుచుండె - ఆదినుండియు మహాత్ముం డిది భారతీయసమస్య యనియ భావించె - రాజప్రతినిధి ఛేమ్సుఫర్డు తన్ను సంగ్రామసభకు నాకారణచేసిననాఁడు ముస్లిమురాజ్యములయు క్షేత్రములయు గౌరవంబు నే మఱఁగింప మని యతం డనుదన్క నాకొలువునం గాలుమోపఁడయ్యె - హిందూమహమ్మదీయు లీగడ్డలోనివార యగుట నిం దెవరి కేయొప్పమి వాటిల్లిన నుభయులుం గూడి యక్కీడుం ద్రోయవలయు నని

బాపూతలంపు - కావుటం జేసియ పాంచాలప్రజా దురవస్థలం బరికించునాఁడు మహాత్ముఁడు హస్తినకుం జని ఖిలాఫత్తు సదస్సునం బాలుగొనియె - ఇది హిందూ ముస్లిము లేకీభవించి కావించిన సభ (నవంబరు 24-1919) - గాంధియాజమాన్యమున నిప్పరిషత్తు విప్లవజనకంబు లగు నిర్ణయంబులు పెక్కు లంగీకరించె - విదేశీవస్తు బహిష్కృతియు సాహాయ్యనిరా కృతియు నిదియ తీర్మానించె - అవ్వల (19-1-20) మహాత్ముఁ డన్సారి మున్నగు పెద్దలం బెరసి ఖిలాఫత్తుపట్ల మున్ను కావించిన వాగ్దానములం బాలింపుఁ దని వైస్రాయి నర్థించె - భారతీయులముక్తికి హిందూ ముస్లిముల మైత్రి పరమసాధనం బని భావించుటం జేసి గాంధిమహాశయుం డిట్లు ఖిలాఫత్తువ్రేఁగు న్వలచి తలఁదాల్చె-అతనిపల్కుం బాటించి యుపవాసాది నియమములం బూని యానాఁడు భారతంబెల్లఁ దనసంతాపముం బ్రకటించె - మిత్ర మండలి వెలువరించు సంధిసూత్రములు టర్కీగౌరవముం జెఱుచునేని యే నసహకారిత్వంబు నాశ్రయించుట యనివార్యం బని మహాత్ముఁ డింతకుమున్న (10-3-20) తనకర్తవ్యముం దెలిపె - దానితెఱఁగు నించుక వివరింతు. 103

## మహాత్ముఁడు ఖిలాఫత్తున కెగ్గుమూడుచో సాహాయ్య నిరాకరణము సాగింతుననుట

మ. తెలవారల్ మనకోర్కికిన్ దిబిరిగాఁ దీర్మానముల్ సేయుచో
నలుకం జేకొనరాదు కయ్యమునకై యావేశముం జూపరా;
దెలమిన్ బన్నము సైఁచి హింసకుఁ బదం బీకున్ననాఁ డెల్లయా
ర్తులు బెగ్గిల్లి తొలంగు నస్మదనుభూతుల్ దీనికిన్ మూదలల్. 104

చ. రణమున కంగవించి రుధిరంబును ద్రావుట రాక్షసత్వ కా
రణ మని సంగరంబు కొనరానిది వాకొనరాని దం చెఱిం
గినమనుజున్ గదల్పఁ దమకించుమగండు జగత్త్రయంబునన్
గనఁబడఁ డెత్తులున్ వెదఁదకత్తులు వానికి లొంగిపోవలెన్. 105

క. అసి కూడ దన్ననాఁ డిఁక, నసహాయోద్యమమె నరున కాశ్రయ; మది ర
క్షసితన మింతయెఱుంగక, వసపడుచో దాని మించు వా లేది యగున్. 106

చ. తనసకలమ్ముకంటెను మతం బధికం బని విశ్వసించువే
ళ నది మహావమానహతులం బడి చేద్పడునేని దాయపైఁ
బనుపఁగఁ దగ్గయస్త్ర మనపాయము సాయమునీమి యొండ నా
కనినరహస్య మియ్యది జగంబునకెక్కినఁ బందుఁ బందువుల్. 107

చ. మతము ననూపమంబుగ సమాదృతిసేయు మహమ్మదీయుఁ; దా
మతమున కాంగిలేయు లపమార్గమునం బెనుచెట్ట గూర్చిన
ట్టితతిని రాజభక్తిఁ బ్రకటించుట భారతజాతి కైతి యౌ
కృతి యని యూహసేయఁగలరే తెలవారలు నిద్రనేనియున్? 108

ఉ. కావున భారతీయులు తగన్ దమధర్ము వెతింగి గౌరవ
శ్రీ వెరిఁగించుపీఠముల జీతము నిచ్చుపదంబులన్ వడిన్
ద్రోవఁజనున్ గనిష్ఠ మిది దొడ్డది యియ్యది నాక దేశ మే
సేవకునైన మంగళము సెప్పవలెన్ సరకారుదానికిన్. 109

చ. తెగఁబడి యెవ్వఁడేని మనతెన్నునఁ గాలిడఁ జాలకున్న నాఁ
డు గనలి వాని వంకకును డొంకకు రావల దంచు నేఁచఁగాఁ
దగదుసుఁడీ! బలాత్కృతికిఁ దా విట లేదు నిజేచ్ఛమై నరుం
డెగఁబడి యానిరాకరణ మీకొనఁగావలె సాగిరావలెన్. 110

ఉ. మానుఁడు శస్త్రజీవనము మానుడులన్ వినుఁ డంచు నిప్పు డే
సైనికమిత్రులన్ బిలువఁజాల దొరల్ తెలవారు భారత
క్షోణికిఁ గానివార లనుచున్ నెఱనమ్మిననాఁడు తప్పు క
ద్దాని కుపక్రమింతు, నుచితం బది, లోఁతులు త్రచ్చిచూచితిన్. 111

ఉ. ఈసమరంబునందు మన మెల్లపనిన్ గనుగల్గిసేఁత క
భ్యాసపదందగున్ బ్రభువు లాగ్రహముం బొడమించు కార్యముల్
చేసినఁజేయవచ్చు మనచిత్తము లత్తఱి నిగ్రహంబు వోఁ
ద్రోసిన ముప్పువచ్చు నకుతోభయతన్ బయనింపుఁ డెల్లరున్. 112

వ. మహాత్ముం డి ట్లసహాయోగధర్మముం బ్రవచించి ముస్లిముసమస్యను జాతీయసమస్యఁ గావించి యావద్భారతము నొక్కత్రాటం గట్టివైచె - ఇంతకుము న్నెన్నఁడుం గుదురని నెయ్యం బానాఁడు హిందూముస్లిములకుం గూరె - పాంచాల హింసయు ఖిలాఫత్తుబెడం దయు నీపరస్పరానురాగంబున కాదికారణంబు లాయె - మహాత్ముఁ డీసౌహార్దజాహ్నవి నపరభగీరథుఁడై పరఁగించె - దేశ మి ట్లుఱ్ఱూఁత లూఁగుచుండఁ (25-3-20) బంజాబుహత్యలం గూర్చిన కాంగ్రెసునివేదిక వెలువడె - దానిం గన్న మైకేలోడ్వయరు నిప్పులుక్రక్కం దొడఁగె - అయ్యెడ బాపూ నిరాకరణధర్మప్రచారము గావించుచు నఖిల భారతస్వపరిపాలన (హోమ్‌రూల్) సభ కధ్యక్షుఁడై (1920 ఏప్రిల్) దాన దేశీయవస్తువుల నాదరించుట హిందూమహమ్మదీయమైత్రిం బెంచుట ఖిలాఫత్తుసమస్యకై పోరాడుట హిందూస్థానిని రాజభాషం గావించుట మున్నగు నుత్తమకార్యంబుల కనుకూలించు తీర్మానములు చేయించె - ఇంతలో (14-5-20) తుర్కీసంధినిర్ణయము ప్రకటితంబాయె - అది ముస్లిముజాతి కెనలేనియవమతిం గలిగించె - దానివెంట మనరాజప్రతినిధి మొసలికన్నీరు కార్చుచు భారతోర్వి కాశ్వాసవాక్యములు వల్కె - తుర్కీకిఁ బాటిల్లిన చేటుంగని మనముస్లిములు పెద్దయుం గనలుచుండ హంటరు సంఘము సృష్టించిన నివేదిక (28-5-20) బయల్పడె - అది భారతంబు నాగ్రహావిష్టముం జేసె-ఆనాఁడ ఖిలాఫత్తుపరిషత్తు బొంబాయినగరమునం గూడి గాంధి సూచించిన సాహాయ్యనిరాకర ణంబ యిఁక నవలంబనీయ మని నిశ్చయించె. 113

ఆ. ఆత్మశక్తి గాంధి కగ్గల మని జగద్, బంధు వాతఁ డని తపస్వి యనియు
నతనిపల్కు దేవునానతి యనియు స, ర్వారువార లపుడు పేరుకొనిరి. 114

## గాంధి నిర్ణయము లోకమాన్యున కిష్టము కాకుండుట

మ. ఎవ రె ట్లన్నను లోకమాన్యునకు నాఁ డీగాంధికార్యక్రమం
బవలంబించుట లగ్గు గా దనుతలం పావిర్భవించెన్ బ్రజా
నివహం బాత్మబలంబు లేని దిఁక దానిన్ నమ్మి వేదాంతముల్
ప్రవచింపన్ ఫల మేమి కల్గు నని సంభావించె నాతం డెదన్. 115

చ. ఒకదెసఁ గ్రొత్తచట్టమున కొప్పుకుఁడీ యని గాంధి సెప్పఁ దా
నొకదెస నేల్బడిన్ దొడరకుంటయ మే లని పల్కసాగె నీ
తికమక లెన్నియున్న సుమతిప్రవరుం డతఁ డమ్మహాత్ము పే
ర్మికిఁ దగుమన్ననల్ వెలువరించుచునుండె నళీకదూరుఁడై. 116

చ. అతఁడు ఖిలాఫదుద్యమము నాదృతిసేయఁడు గాంధిజీ నిరా
కృతిపథ ముత్తమం బనుట కీకొనఁజాలఁడు గానఁ గాశిలో
నతిరథులైన కాంగ్రెసుమహాశయు లందఱుఁ గూడినట్టిగో
ష్ఠి తెరువు చూడఁడయ్యె జగడించుట కూడ దటన్న చూపునన్. (30-5-20) 117

ఉ. వేఱడ మెట్టులున్న మనవిజ్ఞులు కాంగ్రెసువార లిత్తు రే
తీఱుపు దాని కేనును విధేయుఁడ నౌదు నటంచు నమ్మహో
దారచరిత్రుఁ డాసభకు నంపెను గమ్ము; తదాత్మశుద్ధిపెం
పారసి దేశభక్తి కలయంగని సభ్యులు పిచ్చలింపఁగన్. 118

## తిలక్ నిర్యాణము

ఉ. ఇంత స్వతంత్రతేచ్ఛ వెలయించిన, యింత వివేకసంపదన్
సంతనచేసికొన్న బుధసత్తముఁ డవ్వల గొన్నినాళ్లకే
గొంతుకవిప్పి భారతము గొల్లున నేడ్వఁగ మేను వీడె ది
గ్దంతి యితండ యున్న మనతండ్రిబలమ్మున కెల్ల లుండునా? (1920 జులై 31 రాత్రి 1గం.) 119

(అప్పుడీ రచయిత తన సంతాపముం దెల్పుచు 4-8-1920 రచియించి ప్రకటించిన పద్యముల నుండి రెం డిట నుల్లేఖింతు)

ఉ. "దేవుఁడు లేని కోవెలయు దీపములేని గృహంబు రమ్యరా
జీవములేని కోనెఱును శీతమయూఖుఁడులేని రేయు నై
బావురుమన్న దీసకలభారతదేశము నేఁడు నీవు ని
ర్జీవుఁడ వౌటచేత బుధశేఖర! శ్రీతిలకా! జగత్సఖా! 120

క. ఓలోకమాన్య! నీవిఁక, నాలోకనములకుఁ దగుల వైనను మాహృ
జ్జాలమ్ములయందుం గల, కాలము కన్పింతువయ్య! ఘనతేజమునన్." 121

## ఖిలాఫత్తుసభలో నిరాకరణ మంగీకృతమగుట

ఉ. ఆసద మప్డుముస్లిముల కంటినదుర్దశపట్ల సత్యవా
గ్వాసన లేక లోకమున వాలినహంటరుతీర్పుపట్ల ని
శ్శ్వాసము లూర్చి పెద్దయును వందురి తద్దయు నెట్టివాతి యీ
గాసిని ద్రచ్చుపొంటె జరుగన్వలెఁ గాంగ్రెసు వేగిరం బనెన్. 122

చ. అపుడ గురుండు సోదరమతార్తిని దీర్పఁగఁ దాఁ గుదుర్చుకొ
న్నపని సహాయతావిముఖనవ్యవిధిం బరికించి మంచి చె
ద్ద పలుక నెల్లపక్షములరాకురులన్ దయచేయుఁ దంచు వేఁ
డి పరమపుణ్యజాహ్నవితటిన్ సభఁ గూర్చెఁ బ్రయాగవేదికన్. (2-6-20) 123

మ. అసహాయోద్యమతత్త్వ మంతయుఁ బ్రభుం డాగోష్ఠికిం జెప్ప బల్
ససిగా నున్నది సాధనం బని సదస్యశ్రేణి కొండాడె న
య్యసిరూపంబును దిద్దె గాంధి తగునయ్యల్ ముస్లిముల్ తోడుగా
నసువర్గంబు చలించి యేలుబడి దీనావస్థకుం బాల్పడన్. 124

వ. ఇయ్యుపసంఘమువా రాంగ్లపాఠశాలల కళాశాలల పాడిపట్టుల బహిష్కృతిం బెరసిన కార్యక్రమం బేర్పఱిచి వెలువరించిరి – నిక్కముం బరికింప నార్నెలలనాఁ డిభపురింగూడిన ఖిలాఫత్తుమహాసభయ మహాత్మునిహితోక్తిం బాటించి దొరతనమువారికి బాసటగా నిల్వం గా దని తీర్మానించె – తన్నిర్ణయం బవ్వలఁ గలకత్తా మున్నగుతావులం బ్రవర్తిల్లిన ముస్లిముసదస్సులం దిరపఱుపంబడె – ఆపైఁ జెన్నపురిని (17-4-20) జరిగిన మహమ్మదీయ సమజ్యయం దీబహిష్కారవిధానంబు విస్తృతంబాయె – దానింబట్టి యేలుబడివా రొసంగిన బిరుదంబులు గౌరవపదంబులు వేతనోద్యోగములు శాసనసభా సభ్యతలు పోలీసుకొల్వులు సైనికవృత్తులు విడువందగు – పన్నులనీకుంట వలయు – కర్తవ్య మిట్లు నిర్ణీతంబగుట నాగష్టు (1920) మొదటినుండియు మహాత్ముఁ డాలీ సోదరులతో నిరాకరణోద్యమ ప్రచారంబు గావింప దేశంపునలుగడకు న్వెడలె – అతం డపుడ తన కేలిక లొసంగినపతకంబు (కైజర్‌హింద్) నుజ్జనచేసె – వెండియు నానాఁడు 125

## మహాత్ముఁడు నిరాకరణపద్ధతి బోధించుట

ఉ. రాఁగలదోయి! ధర్మసమరం; బిది భారతజాతిముక్తికై
సాగినదోయి! దాస్యమునఁ జచ్చియుఁ జావనివార లందఱున్
ద్యాగము శాంతి సత్యమును దప్పనియస్త్రములై జగజ్జయ
శ్రీ గురియింప సంగరముసేయుఁడు ద్రోయుఁడు మాతృదుఃఖమున్. 126

ఉ. ఈపరతంత్రజీవనము నెట్లుభరింతురు విశ్వమెల్ల ను
ద్దీపితమై స్వతంత్రత కతీవకృషిం దలఁదాల్చి మానరే
ఖాపరిపుష్ట మయ్యెఁ ద్రిజగంబుల గెల్చినవారిబిడ్డ లీ
యాపద నుందురా సమయమైనది లెం డిఁక భారతప్రజల్! 127

ఉ. ఈతెలవారి నమ్మి మన మివ్విధి నిద్దురనుంట చెల్ల దీ
జాతికి నీతిపోయె మనసాయమునన్ రణభూమి గెల్చి వి
ఖ్యాతి గడించుకొన్నదిగదా! యిది; యవ్వల నేమిసేసె? నే
పాతకమేని లేని మనపాపలఁ జంపుటగాక సెప్పుఁడీ! 128

మ. ఎవరో మోక్షము నిచ్చువార లని మీ కేలా వృథాభ్రాంతి; మీ
వ్యవసాయంబ గడించిపెట్టవలె మీవాల్లభ్యమున్; మీనమే
షవివాదంబులకాల మేగె సమరోత్సాహమ్మునం బేర్చి మీ
భవమున్ ధన్యముఁ జేసికొండు మిము నొంపన్ బుట్టిలేఁ డెవ్వఁడున్. 129

ఉ. అన్నువులేదు కుత్రలకు నక్కఱలేదు కటారు లీఁటెలున్
బన్నుటలేదు శాత్రవులప్రాణముఁ దీయుటలేదు నెత్తురున్
జున్నువిధానఁ బట్టి తెగజుఱ్ఱుటలేదు జగచ్చరిత్రలోఁ
గన్నదిగాని విన్నదియుఁగాని రణం బిది విక్రమింపుఁడీ! 130

ఉ. ఆగ్రహ మింత సూపినఁ బ్రయత్నము సర్వము ర్రితవోవు న
త్యుగ్రవిపత్తి వచ్చు నొకయోగముగాఁ దలపోసి నిచ్చలున్
నిగ్రహ మూఁది శాంతిసరణిన్ నడుపందగు నీ రణంబు; పా
పగ్రహముల్ తొలంగి నవపర్వము లేర్పడు జాతి కత్తఱిన్. 131

చ. ప్రజకు నిటుల్ నిరాకరణపద్ధతి మప్పుచు మోహనుండు స
ర్వజనుల మన్ననల్ గొనుచుఁ బర్యటనం బొనరించువేళ న
గ్గజపురి శిష్టికర్తృసభ "కౌన్సిలు" నాఁ జనునట్టి దేచె; జా
తిజనకునుద్యమం బచటిధీరులఁ బల్వుర నూఁపె సభ్యులన్. 132

ఉ. వా రధికారమున్ వదలి వచ్చిరి; మెచ్చిరి పౌరు లమ్మహో
దారుల దేశభక్తి; "నిది ధాత్రికి నార్తిఘటించుకృత్య; మీ
తీ రవిచారమూల;" మని తీంద్రలుసూపెను వైసరాయి; నీ
దారియ మంచి దంచు మనతండ్రికి నాంతరవాణి వాకొనెన్. 133

చ. మనకు వచింపరానియవమానము గూర్చిన తెల్లవానిశా
సనమున నుంట సిగ్గు; సరసన్ గల దాష్టనుభూమి; దానియం
దునికి సమంజసం; బనుమహోద్యమమున్ బరఁగించి రప్డు సిం
ధునదముచెంత ముస్లిములు దుర్భరమైనక్రుధన్ గలంగుచున్. 134

చ. ఇరువదివేలమంది పౌల మిల్లును వాకిలి వీడి పశ్చిమో
త్తరవిషయమ్ము సొచ్చుదును దన్మహి నేల్బడివారిసేనతో
దురము పొసంగె వారి; కది తూలినపిమ్మట గమ్యభూమికిన్
దరలిరి తత్ ప్రజల్ శతవిధమ్ములఁ గ్రమ్మనెగుళ్ల నోర్చుచున్. 135

చ. అదె యదె యాష్టనుర్వి మన కాశ్రయపాత్ర మటంచు ముస్లిముల్
ముదపడువేళ మీ రిటకు మూఁగినఁ జిక్కులువచ్చు వెన్కకుం
బదఁ దని వారికిన్ ముదలపంపెఁ దదీశ్వరుఁ డంత దైవముం
బదరుచు వార లింటిదెస పైనముకట్టిరి వెచ్చనూర్చుచున్. 136

ఉ. భారత మిట్టిచెట్టలకుఁ బాల్పడి వీనికి మూలమైన స
ర్కారుదెస న్మిడుంగుఱులు క్రక్కుతతిన్ సహకారిథోరణిం
గోరకుఁ డంచు సోదరులకున్ వినిపించె మహాత్ముఁ; డట్టియా
చారము క్రొత్త దౌటఁ బలుచర్చలు రేఁగిన వెల్లసీమలన్. 137

## కలకత్తాలో ప్రత్యేకమగు కాంగ్రెసు సమావేశము

వ. ఈ క్రొత్తబాటం గల యోగాములఁ బరికింప భారత జాతీయమహాసభా ప్రత్యేక సమావేశ మావశ్యకం బని యింతకుముంద (1920 మే 30) కాంగ్రెసు సంఘము నిర్ణయించె - నాఁటంగోలె నాయారాష్ట్రములవా రీ మార్గంబునందలి మేలుగీళ్లం దడవిరి - పెక్కు రీ ప్రయోగ ముచితం బనిరి - కొంద ఱిం దలఁతి యలంతిమార్పు లక్కఱ యనిరి - వంగభూమివారును, మధ్యరాష్ట్రములవారును దీని కాయువుపట్టగు శాసనసభా బహిష్కృతిపట్ల విముఖతం జూపిరి - ప్రజాభిప్రాయం బిట్లు పలుచందములఁ దలచూపుటం జేసి కాంగ్రెసువారి ప్రత్యేక సమావేశము కాళీఘట్టమున జరిగె (4-9-20) - సుప్రసిద్ధ దేశారాధకుఁడు లాలా లజపతిరాయి యేతన్మహాపరిషత్తున కధ్యక్షుఁ డాయె - సభాగతుల కుదాత్త సౌకర్యము లనేక మేర్పఱుపంబడియె - బొంబాయినుండి కాంగ్రెసువారియు ఖిలాఫత్తువారియు వేర్వేఱు పొగబండ్లు వెడలె - ప్రతినిధులయు, దిదృక్షువులయు నొత్తడి యేరాళమై కలకత్తానగర ముట్టట్టూఁగఁజాగె - ఉద్రేకజనకంబగు నిట్టి తరుణంబునఁ గాంగ్రెసు మహాసభ యారబ్ధమాయె - మహాత్ముఁడు విషయనిర్ణాయకసభయం దసహాయోద్యమ నిర్ణయముం బ్రతిపాదించె - అంత 138

ఉ. వీరుఁడు దేశబంధు వన విశ్రుతికెక్కిన చిత్తరంజనుం
దాఱనిదీక్షతో గురున కడ్డమువచ్చి సహాయధర్మమే
భారతముక్తి హేతు వని పల్కి వివాదము పెంచె నెంత వే
సారిననేమి శిష్టసభ సమ్మతిచూపె మహాత్మపక్కికిన్. 139

క. శిష్టతతిముద్ర వదసిన, శిష్టి మహాసభకు వచ్చెఁ జిన్నలు పెద్దల్
దృష్టి నిడి దానికూర్చెడి, నష్టిం బుష్టిని గుఱించి నడిపిరి చర్చల్. 140

మ. తనవాచావిభవంబు తేటపడ విద్వన్మౌళియౌ పాలు గాం
ధి నెదిర్చెన్ మఱి చిత్తరంజనుఁడు తద్రీతిన్ సమర్థించెఁ ద
ర్జనముల్ భర్జనముల్ సభాస్థలమునన్ అంపిల్లె నేదారికిం
జనునో కాంగ్రె సటంచుఁ బ్రేక్షణికబృందంబెల్లఁ దొట్రిల్లఁగన్. 141

శా. గంటల్‌గంట లుపన్యసించి తమతర్కప్రౌఢి చూపించి యా
దంటల్ దస్సినవెన్క మోహనుఁడు వేదశ్రేణిసారం బిదే
యంటన్ లోప మదేమి యంచుఁ బరిష త్తామోదరుక్ పుల్లమై
కంటన్ బాష్పము లూర్చుచున్ సొగయఁ జక్కం ద్రెంచెఁ దద్వాదమున్. 142

క. ఇది కీ డని వెనుదీయక, యిది మే లని పొంగ కుర్వి యేఁ జూపినబా
ట దొలంగకున్న ముక్తిం, గదింతు నొకయేఁట నని జగద్గురుఁ డాడెన్. 143

చ. పదుగుర కేడ్గు రౌ ననుచుఁ బల్కిరి సభ్యులు బాపుదారికిం
గదలిరి మన్ను మి న్నదర 'గాంధికిజే' యను మంజునాదముల్
పొదలె మహాసభన్; భరతభూమి నలంచు దురబ్దముల్ బదా
బదలుగ వ్రీలిపోయె నవభాస్కరబింబము తోఁచెఁ దూర్పునన్. 144

క. కలకత్తాకాంగ్రెసులో, నిలిచి గెలిచినట్టి గాంధినిర్ణయము సము
జ్జ్వలచైతన్యము జాతికి, నెలయించిననిర్ణయంబు నిట వివరింతున్. 145

వ. "ఖిలాఫత్తుసమస్యను దీర్చునాఁ డీదేశమునం గలముస్లిములపట్ల భారతోర్విం బాలించు వారును సామ్రాజ్యప్రభుత్వమును సాగించువారును దమకర్తవ్యముల నుచితవిధిం బాటింపమిచేతను లాయదుజార్జి మహమ్మదీయులయెడఁ గావించిన వాగ్దానమ్మును గావలె నని త్రోసివైచుటచేతను భారతోర్విం గల మహమ్మదీయేతరు లందఱుం దమ తమ్ముల కాపాదిల్లిన ధార్మికదుర్దశం బాపఁ దగురీతిం గడఁగుట పాడి యగుటచేతను బాంచాల హింసావేళ నేపాపం బెఱుఁగనిపౌరులం గావ నీరెండుదొరతనములవారు నాలంబుసేయుటచేతను గృతాపరాధులగు దయ్యరుమున్నగు పదవాళ్ళ దండింపమియ కాక సైనికాధికారుల దుండగమునకుం బూఁటవడఁదగ్గ పాంచాలపతి మైకోలోడ్వయరు తీరు న్గొనియాడుటచేతను భారతీయుల మానప్రాణములపట్ల నాంగ్లజాతికి సానుభూతి లే దని పార్లమెంటు చర్చలు చాటుటచేతను రాచతికమువారు పంజాబునం బ్రయోగించిన నిరంతర నిరంకుశ నిర్దాక్షిణ్యచర్యలును మొనమొన్న వెలువడిన రాజప్రతినిధి యభిప్రాయ మును ఖిలాఫత్పాంచాలసమస్యలయెడ నేర్పడివారి కించుకేని పశ్చాత్తాప మేర్పడమిం దెల్లమిసేయుటచేతను, రాచవా రీరెండుదోసములన్ సవరించు కొనునంతదనుక భారత క్షోణికి శాంతి లేదని యీకాంగ్రెసువారు భావించుచున్నారు - మఱియు వీరు 146

శా. రేపే నిట్టికరోరహింసలకు దూరీభాలికిం జిక్కి నీ
చాపత్తిం బడ కాత్మగౌరవము కాసంతైనఁ గోల్పోక శ్లా
ఘాపాత్రంబుగ భారతోర్వి నిలువం గాంక్షింతు రీసిద్ధికై
రాపుల్ త్రోపులు సైఁచి కూర్తురు ప్రజారాజ్యంబు నీభూమికిన్. 147

మ. పరతంత్రుల్ తమముక్తికై జగమునం బాటించుకయ్యంబు లా
శరధర్మంబులు నిచ్చసేయక యహింసాబద్ధమౌ బాటలోఁ
జరియింపంగలవారు వీరు; ప్రభుతాసంబంధికార్యంబులన్
జొరఁగానొల్లరు గాంధిసెప్పిన మహాసూత్రంబు మన్నించుచున్. 148

క. అసహాయోద్యమ మనఁగాఁ, బ్రసిద్ధిగన్నట్టిసాధుపథమిది; నేఁడీ
వసుధాప్రజ కిది గా క, న్యసాధనము లేదు వాంఛితార్థము వడయన్. 149

వ. కావుటంజేసి ప్రజల యాదరముం జూఱగొని వారి ప్రతిభువులుగా రాణించు పెద్ద లీ యుద్యమంబున కంకురార్పణ గావింపఁదగు - వలఁతివలఁతిచాగము లొనర్చి పెదపెద్ద యిడుములం బడక యల్పశ్రమమ్ములతోడన దేశీయు లీకార్యంబు నిర్వహించి సఫలతం బడయవలయుఁ గాన నేల్బడివారి కందదండగానున్న మాన్యపదవులం బాయుట వా రొసంగిన బిరుదులం ద్రోయుట, వారిపేర్మికై సాగు విందుల కేగకుండుట, వారి సాయమ్ముగల చదువులు వీడి జాతీయవిద్యాలయములు నెలకొల్పుట, వారిపాడిపట్టులు బహిష్కరించి గ్రామపంచాయతుల నేర్పఱుచుట, వారికై సైనికధర్మంబు నూఁది 'మెసపొటోమియా'కుం జనకుండుట వైదేశిక వస్తువులు వదలుట, రాటము నుద్ధరించుట, రానున్న క్రొత్తయెన్నికలం బాల్గొనకుండుట ప్రజల కీనాఁడు కర్తవ్యము లని యీ మహాసభ వారు సూచించుచున్నారు." అనునది తన్నిర్ణయమున సారము - భారతీయ దాస్య విక్షేపమున కదియ ప్రశంసింపఁదగిన ప్రథమప్రయోగము నాఁదగు - దానంజేసి ప్రజాహృదయముల శుభపరిణామం బేర్పడియె - కాన 150

ఉ. విన్నపముల్ విధేయతలు విజ్జఁగ నేల్బడివారిభిక్షపైఁ
గన్నిడి తన్నిరాకృతులఁ గందుచుఁ గుందుచునున్న కాంగ్రె సే
తన్నిమిషంబుఁదొట్టి నవతారుచిరంబుగ విప్లవోర్మిసం
పన్నముగా నెసంగెఁ దనపాలితపంబులు పండఁబాఱుటన్. 151

ఉ. ఆసలుపెంచి పల్లియల కల్లుకొనెన్ బురమందిరంబులం
బాసెను దేశభక్తి యనఁ బ్రన్ననిపల్కులజల్లుగా నుప
న్యాసముసేఁత కాదు జనతార్తినివారకసేవ కైన సం
న్యాసమురా యటంచు మొరయంగ మొదల్కొనె వాడవాడలన్. 152

శా. అమ్మా! రమ్మని కాంగ్రెసుం బిలిచి యాహా! నేఁడు నీపూజ నా
సొమ్మై ధన్యతగంటి నేమికల దిచ్చే? వెండిబంగారముల్
తెమ్మన్నన్ వెలవెల్లనౌదును సవిత్రీ! రాటపుంగాన్క నీ
కొమ్మా! దీవన లిమ్మటం చబల యుద్ఘోషించె గ్రామంబునన్. 153

క. జాతీయభావరుచు లు, ద్యోతించె నసూయ సావఁదొడఁగెను ఖాదీ
నేఁతలు తలయెత్తెఁ బ్రజా, నేతల యుపదేశవాణి నెగసెన్ దెసలన్. 154

ఉ. క్రొత్తయుగమ్ము వచ్చినది కోర్టుల రోసిరి న్యాయవాదు; లీ
వృత్తి మహోఘమూల మని విత్తము వందలు వేలు తెచ్చు భూ
భృత్తుల కొల్వు మానిరి వివేకులు కొందఱు; నీచదాస్యధీ
విత్తన మాంగ్లవిద్య యని వీడిరి కుఱ్ఱలు పాఠశాలలన్. 155

క. శాసనసభ లవమతి కా, వాసంబు లటంచు బుధులు వదలిరి, బిరుదుల్
త్రోసిరి, పిసాళిపీఁటలు, వాసిరి దేశాభిమానపరతంత్రమతుల్. 156

క. చిన్నవి పెద్దవిగా నెల, కొన్నవి దేశీయవిద్యకున్ దగుసంస్థల్
మన్ననగల పెద్దలతో, ద న్నెగసెను రచ్చ లవగడంబుల నరయన్. 157

క. ఈనేలఁ బొడమువస్తువు, కానిది నింద్యం బటన్న కట్టడ సాగెన్
నే నెచ్చు వాఁడు లొ చ్చను, ధీ నిందితమాయె గాంధి దేవుఁడ యయ్యెన్. 158

## కాంగ్రెసువారు శాసనసభలను బహిష్కరించుట

గీ. ఎన్నికలు వచ్చె బాపుజీ యన్నపల్కు, దెస విధేయతఁ జూపించె దేశమెల్ల
వట్టిపెట్టెలతో గెల్చినట్టిఘనుల, బ్రదుకుఁ గని సిగ్గునం దోఁగె భారతంబు. 159

వ. శాసనసభాబహిష్కృతికార్యక్రమముపట్ల నానాఁడీరచయిత యాసక్తిగొని శిష్టాపార్వతీశము పోలిసెట్టి ఆదినారాయణగుప్త జనాబ్ గౌస్‌బేగ్‌సాహెబులతోఁ గలసి తనసీమయందలి (రేపల్లె తాలూకా) నిజామ్‌పట్టణము ఖాజీపాలెము మునుకుదురు మున్నగు గ్రామము లకుఁ జని కాంగ్రెసుసందేశమును బద్యగద్యములతోఁ బ్రజలకు విన్పించె - ఇతఁడు నిజామ్‌పట్టణముసభకు (15-11-1920) రచియించి చదివినపద్యములు ప్రౌఢతనము లేని వైననేమి యావిష్కరణీయముల యని తలంచి యిటఁ బ్రకటింతు. 160

గీ. "ధర్మసంస్థాపనార్థ మీధరణియందుఁ, బుట్టినటువంటి కృష్ణుఁ డీపుణ్యుఁ డనుచు
నెవని హైందవు లాత్మలో నెంచుచుందు, రట్టిగాంధిమహాత్ము నాయాత్మఁదలఁతు. 161

సీ. గాంధినాయకు సహకార నిరాకర, ణోద్యమం బభివృద్ధి నొందుఁగాక
పెక్కువేలేఁడు లేయిక్కట్టు లేక యీ, విశ్వబాంధవుఁడు జీవించుఁగాక

దేశసేవ నొనర్చుధీశాలు లీనేల, నెందతెందతొ జనియింత్రుగాక
హిందూముసల్మాను లేద్వేషమును లేక, యుచిత భావంబుతో నుంద్రుగాక
స్వపరిపాలన సిద్ధించి జనులకెల్లఁ, గూడు గుడ్డయు నిల్లుఁ జేకూడుఁగాక
భరతమాత స్వపుత్రులబలిమి కలిమి, యరసి సంతోష మెంతయు నందుఁగాక. 162

క. తల్లీ! భారతజననీ! యుల్లమ్మున నీవు చింత నొందఁగ నేలా
తెల్లదొరతనము నిలువదు, చెల్ల; దిఁకన్ దేశమందుఁ జీఁకటి తొలఁగున్. 163

ఉ. అమ్మరొ! నీ మహత్త్వ మిసుమంతయుఁ దా మెఱుఁగంగ లేక ద
ద్దమ్మలు కొందఱిప్పుడు వృథావచనంబులు పల్కుచుంద్రు; లో
ప మ్మది కాదు నీకు; మదవారణరాజము రాజవీథి యా
నమ్మొనరించుచో మొఱిఁగినన్ శునకంబులు లోటువచ్చునే" 164

వ. ఇతనియూరు 'కావూ' రెన్నికలదెసకుం జనదాయె - ఇట్టిపల్లె లానాఁటిపత్రికలం బ్రశం
సితములు - దేశమిట్లుండ 165

ఉ. కన్నులువిచ్చినారు సరకారుమహాశయు; లీజగంబు మే
ల్కొన్నది సాహసక్రియలకున్ దొరకొన్నది గాంధితత్త్వ మీ
కొన్నది క్రొత్తచట్టమునకున్ విజయంబు ఘటిల్లుదారి లే
కున్నది యంచు విన్నఁదన మొందిరి కుందిరి కోటపేఁటలన్. 166

క. ఈ సాహాయ్యనిరాకృతి, కీసున్ మతివోపుటయును హేతువులు, జనం
బీసరణిం బయనించిన, గాసింబడు ననిరి స్వార్థకాముకబుద్ధుల్. 167

గీ. రాజభక్తికి గాంధిధర్మంబునకును, జుక్కయెదు; రిది శాసనధిక్కృతికిఁ బు
నాది, యాంగ్లేయరాజ్యవినాశకారి, యనిరి జాగర్య కిపు దద ననిరి దొరలు. 168

చ. ఒకవిలయాగ్ని రేఁపఁగల యోద్ధ మహాత్ముఁడు వీనిపల్కు పా
డికిఁ బ్రజ లాఁకసెప్పరు కడిందుల కోదరు గాంధి యైంద్రజా
లికుఁ డెపు దేమిసెప్పి కదలించునొ యీజనతాపయోధి నే
ది కలుగనున్నదో యని మదిం దలపోసిరి హస్తినాపురిన్. 169

## నాగపురి కాంగ్రెసు మహాసభ - గాంధివిజయము

చ. కత యిటులుండ నాగపురి కాంగ్రెసు వచ్చె సహాయతానిరా
కృతి కిది ముద్రవేయవలె నింతకుమున్ను మహాత్ము కార్య ప
ద్ధతికి ససమ్మతిం దెలుపు దాసుమహాశయుఁ డిచ్చుటన్ జయో
న్నతి వడయంగ నెల్లజతనంబు లొనర్చి శ్రమించెఁ బెద్దయున్.(1920 డిశంబరు)170

ఉ. ముప్పదియాఱువేలధనమున్ వెదపెట్టి నిజోక్తి కద్దముం
జెప్పనివారి నీసభకుఁ జేర్చెను బల్వురఁ జిత్తరంజనుం;
డిప్పుడమిన్ బ్రజాభ్యుదయ మెంచి నలంగెడివార లందఱున్
దప్పకవచ్చి కాంగ్రెసు నుదాత్తముఁ జేసిరి విశ్వబంధువున్. 171

వ. ఖద్దరువలువలం దాల్చి దాదాపు పదునైదువేల ప్రతిభువు లీ సభకు వేంచేసిరి-మహమ్మదీయులు, మగువలు పెక్కం డ్రిందుఁ గలరు - ఇంగ్లండునందలి కర్మకర పక్షమువారి సానుభూతిం దెలుప వెడ్జివుడ్డు బెన్న్యా రను పెద్ద లీ మహాసభకు సోదర ప్రతినిధులుగా విచ్చేసిరి-మన జాతీయమహాసభలగ్గుంగోరి యాంగ్లావనిం బనిసేయుచున్న 'హోల్‌ఫోర్డు నైటు'సైత మీ పరిషత్తునకు వచ్చె-దాక్షిణాత్యులలోఁ బేరొందిన ప్రజానేత విజయరాఘవాచార్యు లీకాంగ్రెసున కధ్యక్షపాదులై నిల్చిరి - మొన్నటి కలకత్తా కాంగ్రెసు నాఁడు 172

సీ. పాంచాలమునకు నేల్బడివా రొనర్చిన, పాపంబుఁబని చక్కఁబడుటకొఱకు
ముస్లిముల్ వెట్టలో మునుఁగ ఖలీఫాకుఁ, గూర్చినబన్నముల్ కూలుకొఱకు
సహకారవిముఖమౌ సరణి గమ్యం బని, మప్పసాగిన గాంధిమాట యేత
దాచార్యులకుఁ బేదదై చప్పచప్పని, దై యసంతృప్తికి నాలవాల
మగుట నద్దాని కిద్దాని కని వచింప, నేల ఘోరాపచార మీనేలకున్ స్వ
రాజ్య మీకుంట కానఁ దద్రాజ్యసిద్ధి, కొఱకె యీ నిర్ణయం బంట కూడు ననిరి. 173

వ. వెన్వెంటన బాపూ విజయరాఘవుం గొనియాడి స్వరాజ్యపదముం జేర్చి తన తీర్మానమును సవరించె - ఇ ట్లానాఁడు తన కుచితోపదేశం బొనర్చి తోడ్పడిన గఱువ నేఁటిసభం బాలించువాఁ డగుటంజేసి మహాత్ముఁ డెంతేని తనిసె - అతని విభూతి నాగపురమునం దతివేలమ్ముగా వెలసె-తన్నిర్ణయము శిష్టసభాసమ్మతిం బడసె - ఉచితజ్ఞుఁడగు దాసు ప్రజాభిప్రాయ విధేయుఁడై గాంధితీర్మానమును దాన మహాసభం బ్రతిపాదించె - లాలాజీ దానిని సమర్థించె - మహాత్మున కద్వితీయంబగు విజయంబు సిద్ధించె - లజపతి చిత్తరంజనుల కాక కలకత్తా కాంగ్రెసునం దీ నిర్ణయముదెస నొల్లఁబాటు సూపిన మోతీలాల్ పండితుఁడు సైత మీనాఁడు సమ్మతింజూపె - నిస్సంశయముగా నిది గాంధిమహాశయుని వైయక్తిక విజయంబునాఁడగు - ఈ గెల్పుం గని పాల్, మాలవ్యా, కపర్దే మున్నగు మహారథులు నివ్వెఱపడిరి - కాని 174

క. ఇసుమంతయు బాపూదెస, నసూయపడరైరి, యిట్టి యౌదార్యము వా
రి సమగ్రదేశభక్తికి, నొసపరితార్కాణ యంచు నుబ్బిరిలోకుల్. 175

ఉ. ఇత్తతి వెడ్జివుడ్డు తగ దీపథ మాపద నావహించు, మీ
పొత్తును గోరి మీ గరిమపొంటె శ్రమంపడు మేము చిక్కనం
జొత్తుము దీన; మీ రయిన స్రుక్కుటతప్పదు, నాదుపల్కుపైఁ
జిత్తమునిల్పి చూడుఁ డని సెప్పెను సౌహృద మగ్గలింపఁగన్. 176

ఉ. అనుడి విన్నసభ్యుఁ డొకఁ డాఁగక భారతభూమి కవ్వలన్
మానెతి గోరుమిత్రులు కనంబడ, రేదురవస్థ వచ్చినన్
మానము నేఁటిదీక్ష, ఋజుమార్గమున న్మముఁ దీర్చి భారత
క్షోణికి ముక్తిగూర్చు నెఱజోదు కలండు మహాత్ముఁ డంచనెన్. 177

వ. నిరాకరణప్రస్తావమైన పదంపడి కాంగ్రెసు నియమావళిన్ దిద్దుటె ట్లనుచర్చ యారబ్ధ మాయె - మహాసభకుఁ బదునైదువందల ప్రతినిధు లున్నంజాలు నని గాంధి సూచించె - నిర్ణేతృమండలి యాఱువేలమంది వలయునని తేల్చె - ఇది ముంజూపులేనిపని యని బాపూ తలంచె - మంది హెచ్చుటంజేసి కార్యక్రమంబు చక్క సాగుననియుఁ బ్రజాస్వామ్య మపుడు సార్థకం బగుననియు మహాత్ముఁడు విశ్వసింపఁడాయె - స్వయం సృష్టులగు ప్రతిభువు లాఱువేలున్ననాఁటికంటె నుదారాశయులు, ప్రజాధికారధూర్వహులు, లక్ష్యభూతులు నగువారు పదేనువంద లున్ననాఁడ ప్రజాతంత్ర మవిచ్ఛిన్నముగా సాగు ననియు, దానింబూనుటకుఁ బ్రజలయం దొరిమయు నాత్మగౌరవమును స్వతంత్రతయు నేర్పడవలయు ననియు, నుత్తమాచారులు, సత్యారాధకులు నయినవారల తమపూఁట కాఁపులుగా నుండునట్లు దేశీయులు కనుగల్గియునికి వలయుననియు నాయన భావించె - వెండియు మహాత్ముఁడు "శాంతియుతము, న్యాయసమ్మతము నగు కార్యపద్ధతితో స్వరాజ్యమును సాధించుటయే భారతజాతీయ మహాసభ యుద్దేశ" మని కాంగ్రెసు మూలసూత్రమును నిర్ణయించి దానిపట్ల సభాసదులయంగీకృతిం బడసె - మఱియుఁ గాంగ్రెసువారు కావించు నెల్లపనికిని సత్యాహింస లాయువుపట్లని నొక్కిపల్కె - అవ్వల నస్పృశ్యతానిర్మూలనాది కర్తవ్యములపైఁ బెక్కుతీర్మానము లాసభం జేయించె. 178

## 1921

క. అగంటనుండి కాంగ్రెసు, లోఁగల హైందవులు ధర్మలుబ్ధాశయులై
సాగిరి జనపదములకున్, మూఁగిరి యస్పృశ్యతాసముద్ధతి నార్పన్. 179

క. అనాఁటినుండి రాటపు, గానంబులు పెంచి నించి కాంగ్రెసువారల్
దీనులకున్ గొటగొటమను, ప్రాణంబులు నిల్పి రాప్తబంధువు లగుచున్. 180

గీ. ఆగడియనుండి తోడ్పాటు నాఁగి ప్రభుతఁ, గేరడింపఁగఁ దెగిరి కాంగ్రెస్సువారు
తిరుగుపా టిది తనకు నుద్దీప్తినొసఁగ, ముమ్మరించె ఖిలాఫత్తుమొగ్గరంబు. 181

క. హిందువులకు ముస్లిములకుఁ, బొందిక లానాఁడు మూరిఁబోయెను గాంగ్రెస్
పొందించినపనులం దఖి, నందింపఁగఁ దగిన దిది యనంగలవాఁడన్. 182

## మహాత్ముని సాహాయ్యనిరాకరణ ప్రచారము

చ. కదలె గురుండు నాగపురికాంగ్రెసునుండి నితాంతబోధనా
స్పదవిధిఁ బూని పల్లియలు పత్తనముల్ తిలకింపసాగెఁ దాఁ
బదమిడు ఘట్టముల్ ప్రజలపాలిటితీర్థము లౌట సూచి స
మ్మదపడె మాతృదాస్యమును మాపుఁడు సోదరు లంచు వేఁడుచున్. 183

ఉ. త్యాగములేక పోదు పరతంత్రత; యేల్బడివారు వెట్టికిన్
లోఁగుట తప్పు; దద్రిపతులో యన నిగ్రహ మూఁదువారికే
కాఁగల దర్థసిద్ధి; కినుకన్ గినుకన్ సమయింపజాల మీ
యాగ మహింసతో నడుచునట్టిది కట్టుఁడు కంకణం బనెన్. 184

చ. వల దిఁక నింగిలీసు చదువన్వల డియ్యది పౌరుషోన్నతిన్
దొలఁచును దేశభక్తి నటు త్రోయును భారతసంస్కృతిన్ రసా
తలమున కంటఁద్రొక్కుఁ బరదాస్యమునం దనురక్తి పెంచు నీ
గొలుసును ద్రెంచి దేశమునకున్ బరిచర్య లొనర్పుఁడా! యనెన్. 185

ఉ. ఆద్యపవిత్రజీవనము నల్లరిపాలొనరించి జాతినీ
తిద్యుతు లార్పి కయ్యముల దింపి దరిద్రత నంటఁగట్టి ధీ
విద్యు దఖండరోచి నొకవ్రేల్మిడిలోన హరించినట్టి యీ
మద్యపిశాచికిన్ బ్రళయమంత్రము పాడఁ గడంగుఁడీ యనెన్. 186

ఉ. పెద్దలు లేరె ధర్మరతి పెంచినవృద్ధులు లేరె కయ్యమున్
దిద్దెడువారు లేరె మనదేశమునంగల పల్లెపల్లెకున్;
బుద్ధితొలంగి కోర్టునకుఁ బోవకుఁ డెవ్వనికేని బూమియల్
బద్దలు నేర్పునొజ్జ యది పాపగృహంబుసుఁడీ! యటం చనెన్. 187

ఉ. దేశమునన్ జిరమ్ముగ జితించినధర్మము నుక్కడంచి భూ
మీశులు సీమచట్టముల నిచ్చటిరచ్చలఁ బెట్టఁ దర్కధీ
కౌశల మేచి నిక్కములె కల్లలు పొల్లులు నౌట నాగ్రహా
వేశము లెచ్చి కయ్యములవెంపరతోఁ జెడెఁ బల్లెటూర్లనెన్. 188

క. తల్లిని బిడ్డను జీలిచె, నిల్లాలికి మగని కీర్ష్య లెగయించె నిసీ!
యల్లుఁడు మామయుఁ బెనఁగెడి, వల్లడి పుట్టించెఁ గోర్టువైఖరి యనియెన్. 189

ఉ. మొద్దుగ నుండుఁగాక వెల ముమ్మర మయ్యెడుఁగాక దీక్షమై
ఖద్దరుకట్టి పేదలకు గంజిని బోయుఁడు భారతార్థికా
పద్దశ లంతరించు నని పల్కెను మచ్చుఁ దొఱంగి రాటపున్
ముద్దియ తేటి తెప్పిటిలి మోహనసూత్రము లాలపింపఁగన్. 190

క. బేరులు పరదేశవ్యా, పారమ్ములు మాని ముదుకబట్టల పెంపున్
గోరవలయు మగ్గంబులు, మీఱవలయు నంచు విశ్వమిత్రుఁడు వినిచెన్. 191

చ. చనవల దంచు భారత మసమ్మతి సూపుచున్న నోర్చి శా
సనసభలందుఁ జేరినప్రజల్ తమతప్పు నెఱింగి శుద్ధులై
వెనుకకు రానినాఁడు మనవెంబడి సాగనినాఁడు వేఁడఁగాఁ
జన దనె రాజకీయమగుసాయము వారలచెంత నింతయున్. 192

క. ఇది గ్రామం బిది పత్తన, మిది నగరం బనక యెల్లయెడలను శాఖల్
పొదలించి కాంగ్రెసున క, భ్యుదయము సంధింపుఁ డనుచు నుపదేశించెన్. 193

ఉ. మాకు నహింస యొండె తిరుమంత్రము, భావన కీడుజోడుగా
వాకొనుచుందు మే, మెటులు వల్కుదు మట్లొనరించువార; మ
ళ్యాఁకలు మాకు గిట్టవు భయం బిఁక నేల, రహస్యవేషముల్
గైకొననేల రండ! యధికారులు! మాసభ కంచుఁ బేర్కొనెన్. 194

శా. నారీమండల మండగా నిలువకున్నన్ భారతోర్వీహిత
ప్రారంభంబులు పండఁజాలవు; చరిత్రం జూతు మీసత్యమున్;
శూరత్వంబున వేదనాభరసహిష్ణుత్వంబునన్ బావనా
చారస్ఫూర్తిని మెత్తునింతి; ననె రచ్చల్ పొంగి జేపెట్టఁగన్. 195

ఉ. వంగధరిత్రి నాఁడు గురువర్యుపథంబున సాగి దాసు ప
ల్కంగనె పాఠశాలలఁ గలానియంబుల నుజ్జగించి కీ
ర్తింగనె దేశివిద్యను వరించి సృజించె సమగ్రభారతీ
రంగము నిట్టిచేఁత ప్రతిరాష్ట్రమునన్ దలయెత్తె నయ్యెడన్. 196

క. బందరుజాతీయకలా, మందిర మానాఁడు నూత్నమహముం బడసెన్
వందలువందలు యువలకు, నందించెను దేశభక్తి నాదరయుక్తిన్. 197

ఆ. బాపుజీ వచించు ప్రతివాక్యమునకును, శిష్టభాష్యసృష్టి చేసిచేసి
యింటికింటి కేగి కృష్ణాంధ్రపత్రికల్, తెలుఁగువారి నపుడు దిద్దితీర్చె. 198

వ. మఱియు నానాఁడు పూడిపెద్ది వేంకటరమణయ్య వద్దాది సీతారామాంజనేయులు జంటగాఁ గూర్చిన 'భారతమాతగేయము' గరిమెళ్ళ సత్యనారాయణ సృష్టించిన 'మాకొద్దీతెల్లదొరతనము' మున్నగు లోకోత్తరజాతీయ కీర్తనలు కొండపల్లి జగన్నాథదాసు వ్రాసిన దేశభక్తిగీతములు సాయము వరదదాసు పన్నిన గాంధి పాటలు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి రచియించిన 'స్వరాజ్యసమస్య' పద్యములు దామరాజు పుండరీకాక్షుఁడు నిర్మించిన పాంచాలపరాభవ గాంధీవిజయాది నాటకములు నాంధ్రప్రజాహృదయమ్ముల నతివేల

మగు స్వతంత్రపిపాస రేకెత్తించి చరితార్థతం గనియె - చెఱకువాడ వేంకటనరసింహము సంతరించిన 'స్వరాజ్యదర్పణము' 'శాసనసభ' లనురచనలు కాంగ్రెసుప్రచారకులకుఁ బ్రమాణ గ్రంథములాయె - అది యట్లుండె - న్యాయస్థానములం బాయుట దేశీయుల కపుడు గణనీయకృత్యముగా నుంటంజేసి 199

శా. ధీమద్రత్నము చిత్తరంజనుఁడు, మోతీలాలు, రాజేంద్రుఁడున్
శ్రీముంపుల్ గదియించు కోర్టుపని వాసెన్ దేశ మగ్గింప నీ
భూమిం బల్వురు ధర్మవాదు లపు డిప్పోల్కిన్ బ్రకాశాదు లు
ద్దామత్యాగము లాచరించిరి జగత్కల్యాణకృత్సేవకున్. 200

ఉ. ఏలినవారు మెచ్చి తనకిచ్చిన రావ్‌బహదూరుపట్టమున్
దూలిచి, వృత్తిమాని వగఁ దోఁగు వకీళ్ళకుఁ బేదవారికిన్
బాలుగ లక్షరూప్యములు పంచె 'బజాజు'; మహాత్మువాణి యీ
లీల వదాన్యభావమును లేపె జగమ్మున మూలమూలలన్. 201

గీ. కల్లు సారాయి నమ్మునంగడులపజ్జ, సీమదు స్తమ్ము విపణులచెంత నిల్చి
వలదయా! వీని విలువ రావల దటంచుఁ, బ్రజల బతిమాలి రైచ్ఛికభటులు నాఁడు. 202

క. అరగంట రాట్నపుంబని, జరుపనినాఁ డేను నిద్రు సాగింతు నటం
చఱమరిక లేక కస్తురి, వరుఁ దత్తతి దీక్షపూని వసుధ నలర్చెన్. 203

## దొరతనమువారి నిర్బంధవిధానము

ఉ. వెల్లువకట్టుచున్ బుడమి విజ్ఞు మహాత్మునిపెంపు గాంచి బె
గ్గిల్లిరి తెల్లవార లుడికిల్లిరి యీవిలయానిలం బిటుల్
త్రుళ్లనయేని మూలములతో మనపెత్తన మొక్క వ్రేల్మిడిన్
ద్రెళ్లుట నిక్క మంచు నసి తీసిరి త్రోసిరి ధర్మసేతువున్. 204

వ. ఆనాఁడు (1921 మార్చి) దేశమం దేమూలఁ గన్నను బ్రజోత్సాహ ముఝ్ఝాంత లూఁగు చుండె - ఇది యేలినవారికి దుస్సహం బాయె - వారీచైతన్యము నెట్లే నడంపవలయు నని నిశ్చయించిరి - మున్ముందు నాయకుల పయనంబు లాఁకట్టిరి - మైమెన్సింగునకుం జను చిత్తరంజను నుపరోధించిరి - పెషావరునకుం బోవు లాలా లజపతిరాయి నాఁపిరి - కలకత్తాకు వచ్చు యాకూబుహుస్సేనున కడ్డుతగిలిరి - మజ్రుల్‌హక్కు నాసేధించిరి - కిచ్లూ రాంభుజదత్తుచౌదరుల వారించిరి - సత్యవతీదేవి నుడిగించిరి - రాజేంద్రబాబున కంకిలిసెప్పిరి - వారి వీ రన నేల ప్రతి రాష్ట్రమునను వీనుమిగిలిన ప్రజానేతలం గదలనీక ప్రతిబంధించిరి - రాజద్రోహ సభాశాసనము లాహోరునెడం బ్రయుక్త మాయె - కాని యీదుండగములు 'నాన్కానా' హింసలముం దెన్నఁదగినవి కావు - నాన్కానా యన్నది సిక్కుల తీర్థము - వారి గురుద్వారమిచటం గలదు - సిక్కు

యాత్రికులు పెక్కు రచటం గూడి నిరుద్రేకమ్ముగాఁ బ్రజాసమస్యలం దదవునెడఁ బోలీసులు దూఁకి వారిపై గుండ్లుప్రేల్చి యిన్నూర్వురు నిరపరాధులం గూల్చిరి - మరణావస్థ నున్నవారి నదయమ్ముగా నెత్తి మంటలన్వైచిరి - రాచతికంపువారితీ రిట్లుండ నఖిల భారత జాతీయమహాసభా సాధారణసంఘమువారును గార్యనిర్వాహక సంఘము వారును **205**

## బెజవాడలో కాంగ్రెసు సంఘసమావేశము

ఉ. దేశపరిస్థితుల్ తడవి తిన్ననితెన్నులు నిర్ణయింప లో
కేశి హిరణ్యదుర్గ వసియించు పురమ్మున నాంధ్రమండల
శ్రీశరణంబు నా వినుతిసెందు పొలమ్మున సహ్యజాస్రవం
తీ శరశీకరార్ద్రజగతిన్ బెజవాడను గూడి రత్తఱిన్. (31-3-21) **206**

శా. ఆనాఁ డాంధ్రులపాలి పర్వము త్రిలింగానందరు గ్వీచికా
శ్రేణుల్ పింపిసలాడినట్టిదిన మాశేషాద్రి సింహాచల
క్షోణీమండల భాగధేయములు రాసులు రాసులై విప్రతీ
పానీకమ్మున కీసువెంచినయహం బై పొల్చె నుద్దామమై. **207**

ఉ. దూరము భార మం చనక దూఁకిరి లక్షలులక్ష లాంధ్రహం
వీరు లుదారు లవ్విజయు వీటికి; నూటికి నూర్వురున్ జగ
ద్గౌరవపాత్రమై వెలయు కద్దరుగట్టి తెలుంగుబిడ్డలే
భారతముక్తిదాత లని వచ్చినపెద్దలు ముద్దుసేయఁగన్. **208**

ఉ. నోఁచిననోము పండెను జనుఃఫల మబ్బె నటంచు వేలుపుం
జూచినయట్టు లార్ష రుచిసుందరు నార్తశరణ్యుఁ బుణ్యముల్
పూచినకల్పమున్ బురుషపుంగవుఁ జూచిరి భక్తిభావనా
వీచుల నూఁగుచున్ భువనవిశ్రుతకీర్తిఖనిన్ మహాత్మునిన్. **209**

శా. వాలుంగట్టియుఁ గిఱ్ఱుచెప్పులు జపావర్ణాంచితోష్ణీషమున్
గ్రాలన్ దెల్లుదళంబులన్ నడిపి శిక్షానైపుణిం జూపె న
వ్వేళం గృష్ణుఁడు రామదాసు ధిషణావిభ్రాజి చీరాల పే
రాలన్ దీర్చినవీరుఁ డాంధ్రజనతారత్నం బయత్నంబుగన్. **210**

క. ఆలీసోదర్యులు లా, లా లజపతిరాయి మోతిలాల్ వంగమహీ
చాలకుఁడు దాసు మున్నగు, చాలినవా ర్వచ్చి రపుడు సహ్యజదరికిన్. **211**

చ. అతిరథు లందఱున్ బ్రజలయం దెసరేఁగిన దేశభక్తి నెం
చి తనివిసెంది కాంగ్రెసు విశిష్టపథంబున సర్వభారత
క్షితికిని సేవచేయ మనసేవధిలో నొకకోటిరూక లుం
ట తగునటంచు నిర్ణయమొనర్చిరి గాంధిమహాత్ముపల్కునన్. **212**

చ. తనసకలమ్ము నాత్మవసుధాపరిచర్యకు ధారవోసి - దు
ర్జనతకుఁ బేరుమోసిన దొరల్ చెఱసాలల నిల్పినిల్పి యెం
త నవయఁజేసినన్ దెరువుదప్పక లోకమువీడిచన్న పు
ణ్యనిధి తిలక్ మహాశయుని నామమునం దలపెట్టి రీనిధిన్. 213

ఉ. అర్థబలమ్ముతో మనకు నంగబలమ్మును హెచ్చుకున్నచో
సార్థకభావ మే మని మహాత్ముఁడు సెప్ప సభాసదాళి య
త్యర్థ మెలర్చి కాంగ్రెసున కౌననుసభ్యులు కోటిమంది గా
స్పర్థవహించి రాష్ట్రములు పాటుపడందగు నంచుఁ దీరిచెన్. 214

చ. అగునగుఁగాని కాంగ్రెసు జయం బల రాట్నపునూలిపోఁగుతో
డఁ గలసియుంట నాదగునెడంద కనుంగొనె దానిపేర్మికై
తగుపని సేయుఁడా! యని సదస్యులకున్ గురుఁ డాద మంచిమా
ట గద యిదంచు మెచ్చిరి నెటాల్రణచోదకునుక్తి నబ్బుధుల్. 215

క. ఇరువదిలక్షలరాట్నము, లురవడి నిమ్మహి మధుప్రతోత్కరములనన్
మొరయవలెఁ జేతివల్వలు, మెఱయవలె నటంచు వారు మెఱసిరి తీర్పున్. 216

వ. అట్టియెడ మహాత్ముఁ "డీయుత్తమకార్యంబులు మూఁటిని జూన్మొగియులోనన నిర్వహింపవలయు - బిరుదులు వదలుట యెన్నికల ననాదరించుట యాంగ్లవిద్యాశాలలు వీడుట పాడిపట్టుల నుజ్జనసేయుట మున్నగుపనులపట్లఁ బ్రజ లెంతయున్ మన్నన చూపిరి - వీనికై మన మిఁక దయ్యందగునక్కఱ లేదు - ఏలనాఁ బ్రజాహృదయ మీనాఁడు దొరతనమువారిం బెద్దసేయ నొల్లకున్నది - కాన నేఁడాది లోపలం బారతంత్ర్య మడంగుభంగి మన మిప్పు దంగవింపందగు - రహటప్రచారం బీనాఁడు మన ముఖ్య కార్యంబు - దేశీయులు రాట్నమునంజేసి యార్థికస్వాతంత్ర్య మగ్గపడఁగల దని లెస్స యెఱుంగవలయు - వా రపుదు తమయున్నతి విదేశీయుల కటాక్షములపై నాధారపడి యుంట కల్ల యని గుర్తింతురు - లాఁతిబట్టలం ద్రోసిన పదంపడి పెఱదినుసుం బాయుట కుద్యమింతము - మన మీయవధిలో నిమ్మూఁడు పనులం దీర్చి 'యేము స్వరాజ్యము వలవం దగువార' మని లోకంబునకుఁ జాటవలయు"నని యుపదేశింప సభాసదు లెల్లరుం దనిసిరి - అంత న బ్బలుమానుసులు 217

చ. మనప్రజ కాత్మశక్తి యసమగ్రము నాఁదగుఁ గాన నేలికల్
పనిచెడియాన లెంతచెడుబాటకుఁ జెందినవైన వానికిం
గినియక లొంగిపోవుటయె కృత్యము పెద్దల కిప్పు డంచు శా
సన మొనరించి విజ్ఞతను జాటిరి దేశహితమ్ము గోరుచున్. 218

వ. మహాత్ముఁ డీ బెజవాడ సమావేశమునందు బందరుపురమునం గాఁపురించు కలాతపస్వి జాతీయవాది పింగళి వెంకయ్యనేర్మిం దెలిసికొని రహటాంకితమగు కాంగ్రెసుపతాక

నమ్మనీషిచే సృజియింపించి తద్వైజయంతి కతఁడు కుదిర్చిన రూపకల్పా దనిసె – అందలి యరుణిమ హిందువులకును హరిద్వర్ణము మహమ్మదీయులకును ధావళ్య మితరమతములవారికిని సత్యాహింసలకును ప్రాతినిధ్యము తెలుఁగువాని కావించిన యీ పడగ యావద్భారత పతాకయై కోట్లకొలది హస్తముల కలంకరణమై యావేశమునకుఁ గారణమై త్యాగమున కాకర మై విచ్ఛిత్తికిఁ జోదకమై ధన్యమగుట మఱవరానిమాట.

## మహాత్ముఁ డాంధ్రదేశమునఁ బర్యటించుట

ఉ. ఆవల గాంధి గర్తనగరాదిపురమ్ముల నాదరించి యాం
ధ్రావలి సూపుభక్తికి, సమర్పణసేయు వరాలమూటకున్
బ్రోవులుగా సృజించు నునుపోఁగుల నేసినవల్వవాసికిన్
భావమెలర్ప దీవనలు పంచె దెలుంగుల కెల్లతావులన్.

ఉ. గుంపులుగుంపులై తెలుఁగుకొమ్మలు గాంధికి నంజలించి మీ
పంపులు మాశిరమ్మునకుఁ బన్ననిక్రొవ్విరిదండ లంచు వాల్
జంపుల కంకణమ్ముల బులాకుల బన్నసరాలకానుకల్
నింపిరి దేశభక్తిరమణీయలు తండ్రికిఁ దగ్గబిడ్డలై.

ఆ. ఒక్క తాలిబొట్టు తక్కఁ దక్కిన తన, నగలనెల్ల నప్పనంబొనర్చి
యెలమిగూర్చె గాంధి కేలూర మాగంటి, యన్నపూర్ణ సద్గుణావగీర్ణ.

చ. ఒకముదియవ్వ పున్నమకు నూరిన వెన్నెలబింకమున్ గకా
వికలొనరించు క్రొంజిలుఁగువిచ్చెను విచ్చి ఋషీంద్రుహస్తమం
దకుటిలభక్తితో నిడి మహాత్మ! యిదే పదివేలు వేఱుసే
యక ననుఁ దేర్పవే యనుదు నయ్యకు జల్లున రాలె నశ్రువుల్.

ఉ. ఈదెస వాసి యాదెసకు నేగుకృపామయు నాఁగి తండ్రి! నీ
పాదము లిందు మోపవలెఁ బల్కులు గుప్పవలెన్ దరిద్రతా
వేదనఁ దొప్పదోఁగు నిఱుపేదల మీహృదయం బొకండె నీ
కీఁదగుకట్న మంచు గురు నెయ్దిరి పల్లెల మాలమాదిగల్.

చ. ముసిముసినవ్వుదొంతరల మోములతో నొకహద్దులేని సా
హసములతో విశుద్ధహృదయమ్ములతో సభకెక్కి మంజుల
ప్రసవనిబద్ధ హారములు బాపుమెడన్ జిఱుచేతులన్ దగి
ల్చి సొగసి తేఱి తాతయకుజే యని కుత్తుకలెత్తి రర్భకుల్.

ఉ. తల్లులు చంటఁజేర్చి పలుతంత్రములన్ బరఁగించి యెంత గా
సిల్లినఁ బోరుమానని కసిన్ విడనాడని చిట్టిపాప లా
యల్లరిపూలతోఁటలు మహాత్ముఁడు వేదికఁ జేరినంత ను
త్ఫుల్లముఖంబులన్ మునులపోల్కిఁ గుదుర్కొని రేవివేకమో. 226

ఉ. కమ్మనిపాటలన్ దెలుఁగుగాయకవర్యులు గాంధిధర్మగం
ధమ్ములు చిల్కి సభ్యులకుఁ దన్పు ఘటించిరి, సత్కవీంద్రబృం
దమ్ములు పొంగి సాధుకవితాపవమానకుమారముల్ రసా
ర్ద్రమ్ములు వీచి మోహనునిరచ్చల నిచ్చల నూఁపె నుయ్యెలన్. 227

క. మనము తథాగతు జీస, స్సును గంటిమొ లేదొ కాని సుకృతం బెదియో
నినుపారి నేఁడు గాంధిని, గనినార మటంచు నపుడు కరఁగిరి తెల్గుల్. 228

ఉ. చిత్తము నెట్టెటో మరలఁజేసి త్రిలింగముఁబాసి మోహనుం
డుత్తరభారతక్షితికి నుత్సుకతం బయనించెఁ; బల్లియల్
పత్తనముల్ స్వరాజ్యనిధి ప్రబ్బునటుల్ ధనమిచ్చి భక్తిసం
పత్తిని దన్నుఁ గొల్వ నవభావిభవంబు గడించె నయ్యెడన్. 229

## బెజవాడ తీర్మానములు ఫలించుట

చ. మతిసెడె గాంధి కెవ్వరు సుమాళమునన్ శతలక్ష లిత్తు, రే
గతి నితఁ డొద్దుపట్టు నని గర్వము నజ్ఞతయున్ నటింప భూ
పతులు హసింపసాగఁ దనపట్టినపట్టు రవంత వీడఁబో
క తిరిగెఁ దండ్రి కాంగ్రెసువికాసము కోరి నిరంతరమ్ముగన్. 230

చ. పలువురునాయకుల్ తనకు బాసటగా నడుముల్ బిగించి పె
న్నలసటకోర్చుచున్ ధనసమార్జనసేయఁదొడంగి, రెల్లసీ
మలఁగల పేదవారు, వసుమన్మణులున్ దమశక్తిమేరలన్
దొలఁగినకాన్క లిచ్చి పరితుష్టి కదించిరి నేతృకోటికిన్. 231

చ. గడువునకంటెముందె గుణకంధికి గాంధికి గెల్పువచ్చె, ను
గ్గడువుగఁ జేరె విత్త; మధికారులమోములు సిగ్గువెల్లువం
బడె, నిట మెచ్చుఁదగ్గయది బంబయిపౌరులయావి; వారికిన్
విడిముడి యుండుఁగాక ప్రభవించు నుదారత యింతయొప్పునే! 232

క. రాటములు సభ్యులున్ దొలి, పూఁటన చిక్కినను గురుఁడు పొంగక కట్టా
రాటంపడె సొమ్మున కది, కోటిపదేన్లక్ష లాయెఁ గొనరాతిరికిన్. 233

ఉ. కోరికతీరి కాంగ్రెసునకున్ జవసత్వము లగ్గలించుటన్
దేఱెను గాంధి; దేశమునఁ దియ్యనిపాటల నాలపించుచున్
మీఱెను రాటముల్; పసిఁడిమేడలుగట్టిన లాంకషైరుబే
హారులు దస్తరాల్ముడిచి యాకసపుందెసఁ జూచి రొక్కటన్. 234

మ. పదుగున్ బేకయు లేక నెవ్వగలకుం బాల్పడ్డసాలీని క
ప్పుడు సంక్రాంతిఘటిల్లెఁ బైకొనినయప్పుం జూచి బెగ్గిల్లుకాఁ
పెడకున్ దీమస మింత తెచ్చుకొనె రావే! తల్లి! రా! యంచుఁ గ్రొ
త్తడికూఁతుం బిలిపించి కోకలిడె నేఁతల్ మెచ్చుచున్ విచ్చుచున్. 235

చ. అది మనచేతఁ గానిపనియా కదురాడెదుచోటఁ గవ్వమా
దుదెసను జీఁకు చింతయు నెటుల్ నిలువంగల దోసిపిల్ల! నా
మదిఁగొని రాటమున్ నడుపుమా యని పాయనికూర్మి నవ్వ యో
ర్తి దఱిసి నీతిసెప్పి కసరెన్ గొసరెన్ బొరుగింటికోడలిన్. 236

వ. ఖాదీప్రచారమునంజేసి పేదవారి కింతకూడు చిక్కుటయకాక దేశీయులకెల్లరకును జాతీయాభిమాన మేర్పడు నని బాపూతలంపు - మనదినుసుపట్లం గూర్మికల్గిననాఁడు మన కితరవస్తువు నెడన్ గామక రోఁతవొడము - తనవస్తువును గారవింపనివాఁడు తనదేశముం బ్రేమింపనేరఁడు - ప్రేమలేనినాఁడు తేగం బబ్బదు - కానఁ బేదతికంబు నక కాక దేశప్రేమకుసైత మీ ఖాదీ యానవా లని పల్కందగు - మహాత్ముని చలువచే జాతీయతా విజాతీయతలకు, దేశాభిమాన దేశద్రోహములకు ముదుకబట్ట కొలతబద్ద యయ్యె - దానంజేసి యెల్లకాంగ్రెసువాదికిం బ్రతి దేశాభిమానికిం గద్దరుకట్టుట యొక సామాన్య నియమంబుగా నేర్పడియె - సాహాయ్య నిరాకరణోద్యమ ఫలంబుగా స్వదేశీ ప్రచారం బిట్లు రేకెత్తె - ఒక్క ఖాదీ యననేల మహాత్ముని కార్యక్రమం బంతయు నగ్ని జ్వాలవోలె నెల్లసీమలకుం బ్రాఁకె - అ య్యుదుటుం గని 237

## కాంగ్రెసు విజయముగని ప్రభుత్వమువారు కలఁగుట

చ. సదలదు భారతంబు మనజంకెనచూపులకున్ బిసాళి గా
రడముల; కల్పదేశ మనరా దిది; నల్వదికోట్లమందికిన్
విడిదల; పేరు పేర్వడినవీరుఁడు వీరికిఁ జిక్కె గాంధి; యీ
పిడుగు నదల్చు టెట్టు లని పెల్లుకలంగిరి తెల్లయేలికల్. 238

ఉ. సంపద ఉన్నవారు మనచక్కి నిలంబడి చిన్నమైనఁ జె
ల్లింపరు గాంధి; కించుక చలింపరు కాంగ్రెసుగోల; కంచు గ
ర్వింప నిదేమి తెప్ప తలక్రిందయిపోయె, దివాకరుండు లో
పింపనిరాజ్య మింతదురపిల్లునె యంచు నలంగి రేలికల్. 239

ఉ. ఎందఱుతెల్లవారు కల రిచ్చట నబ్ధులు దాఁటిదాఁటి యిం
కెందఱు రాఁగలారు మఱి యీప్రజసర్వము కన్నువిప్పఁ జే
యందగునట్టి దేమి గొఱియల్ నెఱసింగము లైన గొల్లవాఁ
డెందుల కొ; నటంచు నపు డేలినవారు వడంకి రాత్మలన్. 240

ఆ. కనకదుర్గమ్రోలఁ గావించునిర్ణయ, త్రయము నెగ్గుపొంటెఁ దంద్రి బడలు
చున్ననాఁడె భారతోర్వీశుఁడు మహాత్ముఁ, బిలిచిబుజ్జగించి పేర్మిగురిసె.(1921 మే)241

క. మేలెంచి మదనమోహన, మాలవ్యా కూర్చె నీసమావేశంబున్
బోలినబాటల నిర్వురు, నాలోచించిరి పొసర్పనగు చందములన్. 242

ఉ. అంగద లెన్ని యెత్తిన మహాత్ముఁడు సత్యము వాయఁ దంచు రీ
డింగు తలంచె; హింసలుఘటింపక సాగినయంతవట్టు మీ
భంగికి నడ్డుసెప్పనని బాపును మెచ్చె; నహింస నాదువ
ర్జాంగిక దాని వీడఁగలనా యని పల్కె గురుండు నమ్రుఁడై. 243

చ. అగు నది వోలుఁగాని కనుఁడా! నుతికెక్కిన యాలిసోదరుల్
తగు నని రచ్చ నాడినవిధం; బిది లోకులఁ గత్తిచెంతకున్
దిగుచుటలేదె? శబ్దములతీరు ప్రధానము కాదు, భావ మె
ప్పగిదిని దోఁచుఁ దెల్పుఁ డని బాబున కాదొర యిచ్చెఁ బత్రమున్. 244

క. సత్యంబునకు నహింసకు, నిత్యార్చన సల్పుగాంధి నృపుమాటలలో
నత్యయము లేమిఁ గని మది, నత్యంతము వగచె నెయ్యు ర ట్లాడుటకున్. 245

చ. అపుడ గురుండు సోదరుల కావగ పంతయుఁ దెల్ప వారు మా
కెపుడును హింస గిట్టదని హింసను బ్రేచెడుపల్కు లన్నచోఁ
ద్రపపడుచున్నవారమని తత్క్షణమంద వెలార్చి రార్తి; ధా
త్రిపతి ప్రసన్నతం బడసి త్రెంచె సగర్భ్యులమీఁదిపంతమున్. 246

క. రీడింగుగెల్చినాఁ డని, వేడుకపడెఁ దెల్లజాతి; విజయోన్నతి చే
కూడె నని గాంధి పొంగెను, దోడునడుచువా రహింసతోఁ బెనఁగొనుటన్. 247

వ. జూన్ పదునైదవనాఁడు బొంబయిం గూడిన కాంగ్రెసు కార్యవర్గసభయందు రాజప్రతినిధి రీడింగునకుం దనకును నడిచినచర్చ తెఱంగెల్ల బాపూ వెల్లడింప సభాసదులు హర్షించిరి – ప్రభుత్వమువారు తమపై నభియోగమ్ము తెచ్చినతఱి నిరాకరణవాదులు ప్రతివాదము నకుం బోక తమతప్పులేమిం దెల్పు వాఙ్మూలంబు మాత్రమ కోర్టునెదుట నీవలయు ననియు మీసత్ప్రవర్తనమునకుం బూఁటవడు వారిం జూపుఁ డన్ననాఁ డభియోక్త లప్పుని కంగీకరింపక చెఱసాలకుం జనవలయు ననియు నమ్మంత్రిమండలి నిర్ణయించె –

అవ్వల జులైతుదిదినమ్ముల నమ్మహానగరంబునంద కాంగ్రెసుమహాసమితి సమావేశమై విదేశవస్తుబహిష్కృతి పరిపూర్ణతం బదయుపొంటె నెల్లకాంగ్రెసువాదియు నాగష్టు మొదటి దినముందొట్టి పెఱవల్వను బహివెట్టవలయు నని యాదేశించె - మఱియు విదేశవస్త్ర వణిక్కులాబేరం బిఁకనాఁపి యాపణములం దున్నబట్టను లాఁతివిలాతులం దమ్ముకొనఁ దగు నని నిర్ణయించె - భారతీయుల విశ్వాసగౌరవములం గోలుపోయిన యేలుబడి వారికొల్వుం బాయుఁ దని సైనికాది సర్వశాఖోద్యోగుల కెల్లపౌరుఁడుం గఱపవచ్చు నని నిశ్చయించె - మద్యనిషేధప్రచార ముగ్గదువుగా సాగుచున్న ధార్వాద మున్నగు తావులం దీపని కానుకూల్యంబు సూపుచున్న స్థానికసంస్థల నభినందించె - ప్రజాసము దాయమం దేర్పడ్డ యాత్మనిగ్రహముం గొనియాడె - కాని స్వదేశీ కార్యక్రమము సంపూర్తి యగుదన్క శాసనోల్లంఘనమునకుం గడఁగరా దని దేశీయుల హెచ్చరించె - భారతోర్వికి రానున్న యువరాజు నాదరింపం దలయెత్తు నుత్సవములం బాల్గొనరా దని ప్రజలం గోరె - పదంపడి **248**

గీ. శాంతిసైనికు లుత్తమాచారనిష్ఠు, జీవనులు దేశమం దెల్లసీమలందు
నొల్లఁబోవనిదీక్ష నిల్లిల్లు తిరిగి, సంతరింపఁ గడంగిరి వింతబట్ట. **249**

క. ఆ దినము లెట్టివో నిఱు, పేదయు వారల కొసంగెఁ బెఱవల్వ నహో!
యేదారియు లేనప్పుడు, ఖాదీగోవణమ చాలుఁగద నా కనుచున్. **250**

## మహాత్ముఁడు విదేశవస్త్రములఁ గాల్చుట

ఉ. చిచ్చులు గుమ్మరించు తెలసింగముజూల్ పిడికింటఁబట్టి, నీ
పె చ్చుదియేమి పొమ్మనుచు బీరముసూపిన లోకమాన్యుఁ దే
మచ్చయు లేని భారతకుమారుఁ డుదారుఁడు పుణ్యలోకముం
జొచ్చినరోజు వచ్చినది శోకము హెచ్చిన దెల్లమోములన్. **251**

గీ. అ మ్మహారాష్ట్రకేసరి కాత్మశాంతి, చేకుఱుట పొంటె నూరూర సీమబట్ట
గుట్టగావైచి బూడిదమిట్టఁజేసి, తనిసె న య్యేఁడుడిన్ భారతప్రజాలి. **(1-8-21) 252**

గీ. లోకమాన్యుని వర్ధంతి నైక దేశ, హితసమారంభముల నిర్వహింపఁబడియె
సిరులపెంపున జాతీయసేవనమున, మిగుల నుతిగన్న బొంబాయినగరమునను. **253**

ఉ. ఆ సభలో దహించుటకు నప్పురికాంతలు వేలు లక్షలుం
బోసి గడించుకొన్న తమపుట్టము లిచ్చిరి మేల్మిజాఱువా
పోసనముల్ జిలుంగుటొఱపుల్ వెదలించుచు విశ్వమోహన
శ్రీసదనంబులౌ సరిగచీరలు, రైకలు, పావడంబులున్. **254**

ఉ. నాఁటిమహాసదస్సునకు నాయకుఁడై వొలిచెన్ మహాత్ముఁ, ద
మ్మేటి నగంబునాఁ బెరిఁగి మింటికినంటిన సీమబట్ట కు
చ్చాటనసెప్పి నిప్పునిడి "చచ్చుచునున్నది పారతంత్ర్య, మీ
కాట జనించు భారతజగద్ధితమైన స్వతంత్రతాద్యుతుల్. 255

ఉ. రాటము మగ్గము న్మఱచి రక్తపువెల్లువవోలె నర్వదా
ర్కోటులసొమ్ము వస్త్రములకున్ బరభూముల కంపి రిత్తజం
జాటము పెంచుకొన్న మనజాతికిఁ బట్టిన దుర్వివేక మీ
కాటికిఁ జేరి పేరి మసిగా నుసిగా నగుచుండె నేఁటికిన్. 256

ఉ. ఆసలుపెంచి యీసులకు నర్చకులై మనవారు పచ్చిరా
కాసితనంబు సైఁచి వెడకత్తుల నెత్తురుపొత్తుకుత్తుకల్
కోసి పరప్రభుత్వములకున్ నెఱపీఁటలు వైచి గాదెలం
బోసినదోసముల్ కరఁగిపోవుచునున్నవి నేఁటి మంటలన్. 257

చ. మతకలహంబు లన్వయవిమర్శన మండలవాదముల్ మహో
న్నతి నిడు నంచు దుర్భ్రమమునం బడి రేఁగి యమాయికప్రజా
వితతిని ఱాతిగానుఁగలవేసిన భారతజాతిదౌష్ట్య మీ
గతి విలయాగ్నికీలములఁ గాలుచునున్నది గోడుగోడునన్. 258

చ. పడమటిసోకు మెచ్చి మనపల్లెల - చాకలిమంగివాండ్రకున్
గొడగరివడ్లవాండ్రకును గొంతుకలెండి తపించుదుర్దశల్
పొడమఁగఁజేసి పొంగు లఘుబుద్ధులు తెచ్చినకీడు నేఁటితో
నడ పొడ కానరాక తెగటాఱుచునున్నది వాడవాడలన్. 259

ఆ. పరులబాస కాసపడి మనవిజ్ఞాన, మన్న రోసి ప్రాజ్ఞు లన్నఁ ద్రోసి
యిచటివారు పెంచి రేమోహ, మది నేఁటి, కుపశమిల్లసాగె నుస్సు రనుచు. 260

చ. కటకట! సాటిమానవుని గాడిదకంటెను లొచ్చువానిఁ జే
యుటకు సహించి వాని కొకయూరు విధించి తదాహ్వయంబు వ
ల్కుటకును రోసి హైందవులు కూర్చిన పేర్చిన ఘోరపాపపుం
బటలము నేఁ డిటుల్ పదటిపా లగుచున్నది పేఁటపేఁటలన్. 261

క. విడఁదీసియు నడిదంబున, జడిపించియు భారతోర్వి శాసించుటకున్
గడఁగినదొరల యహంకృతి, యుడికిల్లఁదొడంగె నేఁటి హోమాగ్నిశిఖన్. 262

ఉ. పొట్టలతో నిఁకన్ భరతభూప్రజ ప్రాఁకదు మాతృదైన్యమున్
నెట్టక నిద్రవోదు ధరణీవలయం బఖిలంబు నొక్కఁడై
కట్టిఁడిచేఁతకున్ దిగునుగాక జయధ్వజమెత్తి కీర్తి చే
పట్టక పట్టువీడ" దని పల్కె సభాజలరాశి పొంగఁగన్. 263

క. బెజవాడతీర్పు లన్నియుఁ; బ్రజాభిమానమ్ము వడసి పండుటకతనన్
గుజరీతపసికి భారత, మజయ్యే మిఁక నన్నతనివి యపు దేర్పడియెన్. **264**

చ. మన కెనలేనిచెట్ట లవమానములున్ గదియించి పాప వ
ర్తనమునఁ బేరువద్ద ప్రభుతన్ గొనియాటకు వచ్చు రాజనం
దను దెస నిచ్చుమన్ననలదండకుఁ గాంగ్రెసువార లెవ్వరున్
జనవల దంచు మోహనుఁడు చాటి సదస్యులమెప్పు గైకొనెన్. **265**

క. ఇది కృత్యం బని బాపూ, యెదిసెప్పిన దానికొగ్గెనిమ్మహి, నిందా
స్పదమైన తనదుబానిస, మదృశ్యమగువేళ తటిసె నని అంపిలుచున్. **266**

వ. ఆనాఁడు సాహాయ్యనిరాకరణోద్యమం బెల్లరాష్ట్రములయందును సహస్రముఖములఁ దాండవింపఁ జాగె-దీనికిం దెలుఁగునాటఁ గొండ వేంకటప్పయ్య ప్రధానావలంబముగా నిలిచె - గొల్లపూఁడి సీతారామశాస్త్రి, శరణు రామస్వామిచౌదరి, కన్నెగంటి సూర్య నారాయణమూర్తి, గుళ్ళపల్లి వేంకటపున్నయ్యశాస్త్రి, కాళేశ్వరరావు, కోటగిరి వేంకటకృష్ణా రావు, దండు నారాయణరాజు, జగ్గన్నశాస్త్రి, సాంబమూర్తి, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యము, బుచ్చి సుందరరావు, రామలింగము, ఓరుగంటి వేంకటసుబ్బయ్య, పొణకా కనకమ్మ, తిక్కవరపు రామరెడ్డి, కపిస్థలము రాజగోపాలాచార్యులు, కల్లూరి సుబ్బారావు, కడప కోటిరెడ్డి, హరిసర్వోత్తమరావు, నాయకంటి శంకరరెడ్డి, భీమసేనరావు, కాశీనాధుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్యనాయఁడు మున్నగువారు ప్రముఖ కార్యకర్తలై తెలుఁగు సీమల సహాయతానిరాకరణశంఖము పూరించిరి - ఏతాదృక్ష దేశారాధకుల నిరంతర ప్రబోధనమునంజేసి సర్వరాష్ట్రముల నూతనచైతన్యముం బడయుచున్న భారతప్రజం గన్నయంతన సరకారువారి కాగ్రహావేశములు రేఁగె - విదేశవస్తు బహిష్కృతి మున్నగు కర్తవ్యములఁ బాటించి యహింసాబద్ధమగు ప్రచారము గావించు నైచ్ఛికభటుల నధికారు లపు దేఁపం దొడఁగిరి-వారి యాగడ మెంత ముదిరినను శాంతిసైనికు లాత్మనిగ్రహముం బాయక ప్రతివాదంబు నొల్లక చెఱసాలలకు దూఁకిరి - కాంగ్రెసువారి సంయమశక్తితో పాటు ప్రభుత్వమువారి తిక్కయుం బెరిఁగె - వెఱ్ఱిముదిరిన యధికృతులు ధార్వారు నందును, సంయుక్తరాష్ట్రములం బెక్కు తావులయందును జనసమూహముపైఁ దుపాకులు కాల్చిరి-అలిఘరుప్రజల రెచ్చఁగొట్టిరి - సరిహద్దురాష్ట్రముం బట్టి చూచిరి - తెనుఁగు సీమం జెనకిరి - వంగభూమిని గవ్వించిరి - ఇప్పట్ల నలిఘరు కుఱ్ఱలుతక్కఁ దక్కెల్ల సీమలవారును జలింపక తమ యహింసానిరతిం జాటిరి - మహాత్ముఁ డీ యోర్మిం గని **267**

క. ఏ పాపం బెఱుఁగని ప్రజ, లీ పగిదిన్ వలచి బందె కేగుట కతనన్
జేపడు నుర్విికి మోక్షము, లోపడు నేల్బడి యటంచు లోలోఁ దనిసెన్. **268**

# కరాచీ యుపన్యాసము

ఉ. నాఁడు కరాచిపట్టణమునన్ మన ముస్లిమువీరులెల్లరున్
గూడిరి సుప్రసిద్ధమగు కొల్వది తద్యజమానుఁడై జగా
వేఁడి వెలార్చి పాలకులవెద్దను రచ్చకుఁదెచ్చి త్రచ్చి వో
నాదె మహమ్మదాలి తెగనాడె సదస్సులు సంభ్రమింపఁగన్. (8-7-21) 269

గీ. ఎవ్వఁ డిస్లాముధర్మువు నియ్యసేయు, నాతఁ డీనాఁటినుండి సైన్యమున నిల్వఁ
జన దటన్నతీర్మాన మాసభను వెలసె, నేలుబడివారిపై నేవ యెగసి బలిసె. 270

గీ. అదరులుమియుచుఁబాళెముల్ వదలుఁడనుచు, మునుమిడిమహమ్మదాలి చేసినప్రసంగ
మది "కరాచియుపన్యాస" మన్నపేరఁ, బ్రకటమయ్యె సమస్తభారతమునందు. 271

చ. అది సరకారుపెద్దలకు నాగ్రహము న్గలిగించుటన్ మహ
మ్మదు కిచులూ హుసేను లహమద్ ముజదీదులు సౌకతాలియున్
బెద రిసుమంత లేక యదువీరుఁడు పుట్టినపుణ్యభూమికిం
గదలిరి నూత్ననిర్భరవికాసమునం బ్రజ విక్రమింపఁగన్. 272

వ. ఆలీసోదరులు బందా లగుటకుం గరాచియుపన్యాసమ కతం బని జగంబున కెఱుక వద్దనాఁడు మహాత్ముఁడు దక్షిణాపథమున సాహాయ్యనిరాకరణ ప్రచారం బొనరించు వాఁడు తిరుచినాపల్లిని విడిసియుండె - అచటం గూడిన మహాసభయం దమ్మేటి మహమ్మదాలి వాఙ్ముఖము నామ్రేడితముఁ గావించి దొరతనముం బ్రతిఘటించె - అవ్వలఁ గాంగ్రెసు మంత్రిమండలిని బొంబాయినగరమ్మున (5-10-21) సమావేశ పఱిచి దానం దత్ ప్రసంగసారముగా నొకతీర్మానము సేయించి దానిం బునశ్చరణ మొనర్పుఁ డని ప్రజల కాదేశ మొసంగె - ప్రతిజనపదమునం దెల్లనగరమునం దానిర్ణయ (16-10-21) మనూక్తం బాయె - దేశ మిట్లు కాంగ్రెసుపల్కుఁ బాటించుటంజేసియు నాలీసోదరులు మున్నగు మహారథులు నిర్బంధితులైనతఱి నుదాత్తమగు సంయమదీక్ష నూపుటంజేసియు మహాత్ముఁ డెంతేని దనిసనియె - కాని ప్రజలు ఖాదీపట్ల సముచితాసక్తి చూపమికి వగచి దీనికిం దాన దోషియని నమ్మి తద్దోషమునకు శిక్షగా దోవతి చొక్కా టోపీ వదలి కొల్లాయి కండువా మాత్రమ ధరింప నిర్ణయించుకొనె - అంత (5-11-21) హస్తినం గూడిన కాంగ్రెసు మహాసమితివారు హిందూమహమ్మదీయమైత్రియు, నస్పృ శ్యతా నివారణమును, ఖాదీ కట్టుటయు, నహింసానిరతియు సమగ్రముగా నున్నతావుల నాయా రాష్ట్రసంఘములు తమ పూఁటపై సమష్టి శాసనోల్లంఘనము సాగింపవచ్చునని పన్ను చెల్లింపమిసైతము ప్రయోగింపఁదగు నని నిర్ణయించిరి - ప్రజ లానాఁడు తమ రాజనైతికపీడలం దొలఁగించుకొంట కేలుబడివారి నహింసావిధానంబుల నటనట నెదు ర్కొనిరి - ఈ ప్రతిఘటనములం బేర్పడినవానిం గొన్నింటి నించుక వక్కాణింతు. 273

## పల్నాటివారు పుల్లరి చట్టము నెదిరించుట

ఆ. వంగభూమిఁ జీల్చి వాలింపఁ గర్జను, తీంద్ర సూపినట్టి దినముఁదొట్టి
దాస్య దళనమునకుఁ దహతహపడుచు జా, తీయసేవ మరగెఁ దెలుగునాడు. 274

క. మెహనుఁ డుపదేశించిన, సాహాయ్యనిరాకృతికి హసా దనియెను స
త్యాహింసారణ దీక్షా, దోహలమున నిలువరింపఁ దొడఁగెను బ్రభుతన్. 275

క. బెజవాడపురికిఁ గాంగ్రెసు, యజమానులు వచ్చి యుజ్జ్వలాదేశములన్
బ్రజ కున్మేషముగూర్చుట, నజడమ్ముగ సాగె నాంధ్ర మసహాయవిధిన్. 276

గీ. తెలుఁగునాఁటికినెల్ల నుద్దీప్తి నొసఁగి, పేరుగన్న ధరిత్రి గుంటూరిసీమ
దేశహితజీవనమ్మున కాశపడిన, మగల మగువల మనికి యీమండలమ్ము. 277

వ. ఇందు వీరత్వమునకుం గాణయాచియై పల్నాటిగడ్డ వెలయు – దీనం గానలు హెచ్చు – వీని సరసంగల పల్లె లటవీశాఖాధికారులరాయిడికి లోనై తడవులం బట్టి నానాబాధల నందుచుండె – ప్రజ లీయిక్కట్లు సైరింపనొల్లక పుల్లరినిచ్చుట మాని యానాఁడు సర్కారు నెదిరిచిరి – ప్రభుత్వమువా రీతిరుగఁబాటు నణఁపం దొరఁకొని గ్రామీణుల కెనలేని యొత్తడి తెచ్చిరి – ఆంధ్రరాష్ట్రపుఁ గాంగ్రెసుసంఘమువా రీప్రతిఘటనవార్త విని దీనకల రూపు తెల్పుఁడని సుప్రసిద్ధ దేశారాధకుల నున్నవ లక్ష్మీనారాయణప్రెగ్గడ, మాడభూషి వేదాంతము లక్ష్మీనృసింహాచార్యుల నియమించుచు వేంకటగిరి సమావేశమునఁ (జులై 1921) దీర్మానము కావించిరి – పదంపడి గుంటూరినుండి దండిమగలు వీరిర్వురుం గదలి పల్నాటి కరిగి మాచెర్ల పరిసరములఁ బర్యటించుచుఁ బ్రజలయుద్యమము నగ్గించుచు వారికి ధైర్యాదులు కఱపుచుండ వణిజ్మణి సాహసికశేఖరుఁడు రంగా చెంచయ్య ప్రబోధనమున జానపదు లేచి యధికారవాసన గలవారికి వారియే నమ్మక సాంఘిక బహిష్కరణము సాగించిరి – తదనంతరమున 278

గీ. గర్తపురమండలము నేలుఘనుఁడు షీల్డు, తరలె మాచెర్లకుం బ్రజోద్యమము నణఁప
నతని కాయూరఁ గోడిగ్రు డ్డబ్బదాయె, నెంతపడినఁ దప్పెట లభియింపదాయె. 279

ఆ. అలుక పెరిఁగిపెరిఁగి యద్దిర! కాంగ్రెసు, వార లింతచేసినా రటంచు
నతఁడు నమ్మి ప్రెగడ కాచార్యునకుఁ దన, పజ్జ కేగుదేరఁ బనుపు లనిపె. 280

మం. పెళపెళార్భటులఁ దప్పెటలు వేల్వేలు, మ్రోయుచు దిక్కుద్యముల ప్రక్కలింప
గొనబైన గజ్జెలగుఱ్ఱంబు నెక్కి, ప్రజలు సూరెల బరాబరులు గావింప
మాచెర్ల విడిసిన మండలాధీశు, పటకుటీరమునకు వచ్చె నిశ్శస్త్ర
యోధచమూనాథుఁ డున్నవమంత్రి, తనకొకదప్పు సైతము చిక్కదాయె
నిన్ని కాంగ్రెసువారి కెట్లబ్బె ననుచు, షీల్డు నివ్వెఱపాటుసెంది యాప్రజలు

తమ కెపుడో స్వతంత్రత వచ్చు నందు, రిది స్వరాజ్యము కాదె యానన్నుఁ జుట్టి
అంపిల్లునది ప్రజారాజ్యమ్ము కాదె, యద్భుత మద్భుత మని నొక్కిపల్కి
తేఱి ముందున్ననిందితుల వీక్షించి, మీనడవడి నేను మెచ్చులే; నీరు
నేర్పుచున్నా రవినీతిని బ్రజకు, దేశశాంతికి ముప్పుదేము మే మనుచు
నిపుడు పత్రముఁవ్రాసి యీవలె మీరు, నావుడుఁ గాంగ్రెసునాయకు లట్టి
పని మాదిగా దని పల్కిరి రచ్చ, నటులైనచోఁ జట్ట మది పల్కుపగిది
నొకయేఁడు చెఱసాలనుండుఁ డటంచు, దొరశిక్షసెప్పెఁజోదులకునప్పుడ (25-7-21)
చెలఁగెను గాంధికిజే యన్ననుడులు, మలఁగెను సర్కారుమానంపుమిసలు. 281

## కన్నెగంటి హనుమంతు వీరమరణము

క. పలునాడు కాంగ్రెసునకున్, గలుకోటగ మాఱెఁ గన్నెగంటికులకృషీ
వలుఁడు హనుమంతు జనతా, దళనాయకుఁ డాయె ధీరతారుచు లెగయన్. 282

వ. కోలగొట్లకుఁ జెందిన మించాలపా డితనికాఁపురించుపల్లె - దీనికింబలె మఱిముప్పది కుప్పములకుసైతము పుల్లరిబెడఁద కలదు - నేఁ డీగ్రామములకాఁపులు హనుమంతు నాయకత్వమునఁ బ్రభుతన్ ధిక్కరించి తృణభాగధేయ మిడుట మాని కానలం దమ పసుల నిచ్చవచ్చిన తెఱఁగున మేపికొనం దొడఁగిరి - వీరియూళులన్ దొరతన మన్నది ప్రమానుపడియె - రాచలెంకల కన్నపానము లీకొట్టికలం బుట్టవాయె - నిలువమూఁక లీజనపదములకు దూఁకి యెంతజంకించినం బ్రజలయుక్కు మొక్కవోక నిలిచె - అంత నుపమండలాధికారి వచ్చి 'కోలగొట్ల' విడిదలగా నుండి పల్నాటివారిసత్యాగ్రహమున కబ్బురంపడి తన్నాయకునితోఁ గరవ్యవహారము చర్చింపనెంచి తనయాస్థానానికిం గ్రన్న రమ్మని హనుమంతునకు నుత్తరువు నంపె - పదంపడి 283

క. తెల్లదొరతనమ్మునకున్, బుల్లరి నిచ్చుట హుళిక్కిపో! యని ప్రజతీ
రెల్లం దెల్లమిసేయఁగ, నుల్లాసంపడుచు నాంధ్రయోధుఁడు కదలెన్. 284

వ. ఊరుదాఁటివచ్చుచున్న యమ్మేటి నాఱడుగులపొడుగున్న వానిం గన్న పోలీసుపెద్ద 285

ఆ. అతఁడె కన్నెగంటిహనుమంతు మనపర్వు, పదటఁ గల్పుచున్న పలువ యతఁడె
చంపవలయు వాని జంకకుఁ డనుచు ము, ష్పంద్రుబంట్లతోడ బలసె నతని. 286

క. టపటపమని నల్దెసలన్, దుపాకిగొట్టములుమ్రోసె దుస్సహకీలా
విపదాకుంచితవపువై, విపులాస్థలిఁ గన్నెగంటివీరుం డొరగెన్. 287

మం. అతఁడు దాహముదాహమని మెల్లపల్క, నీర్దైరి పోలీసు లించుక నీర
మిది జలంబని ప్రజ లీఁబోవుచుండ, మొదటిబంటు తుపాకిమొన చూపె వారి
కతనిదుశ్చేష్టకు హనుమంతు కనలి, యోరిదురాత్మ! నీయుదు టెన్నినాళ్లు

నిలుచుఁ? గర్షకులు కన్విప్పి రీనాఁడు, కార్మికుల్ తమపాలికర్తవ్యమెఱిఁగి
రెదిరించి రేల్బడి నెద జంకులేక, కిగ్గాడి! నీకు నెంగిలికూడు వెట్టు
తెల్లవాఁ డీధరిత్రిని గుల్కఁ డిఁకను, సాగదురా! వానిశాసనం బిచట
మాకాఁపుబిడ్డ లీమహి నేలఁగలరు, మాకూలిపెద్ద లీమహి దిద్దఁగలరు
మారాజ్య మిఁకవచ్చు మాపెంపు వచ్చు, మాగాంధిజెండాకు మహిమమ్ము వచ్చు
నీచుఁడా! పొంగకు; నిలువనిమేని, కొఱ కేను విలపింప గోరంతయైన
దేశంబునకు సముద్దీప్తి రావింప, నాయన్న లీపలనాటిహంవీరు
లెందఱొ తనువూడ్చి రేగిరి దివికి, నచ్చుమా కీర్తికి నధిపతులైరి
కవిశేఖరులమెప్పు గాంచిరటంచు, నెఱ్ఱటోపీవాని నెదిరించి పల్కి
దీనదృక్కులఁ దన్నుఁ దిలకించుజనుల, కదలరా దదలరా దరి నీయరాదు
సాంగిపవలె మీరు శాంతిసంగరము, పల్నాటిమగఁటిమిన్ బ్రదికింపవలయుఁ
దెలుఁగుదేశంపుఁగీర్తిని నిల్పవలయు, నాయకునకు లొంగి నడతేరవలయు
జయమందవలె నని సందేశ మొసఁగి, దగతోడ మరణవేదనతోడ రెండు
జాములపాటు వేసారి వేసారి, యక్కటా! కనుమూసె నంతఁ బల్నాటి
కడిమికి నెఱపాదు కనెగంటిజోదు; ప్రజలెంతకిన్క యేర్పడిన నహింస
విడనాడనొల్లక విమతుల సైఁచి, హనుమంతుకుణపంబు నావేశమదరఁ
గాహళీ శంఖ ఢక్కా వేణు పటహ, దుందుభి మర్దల తూర్యఖందాది
వాద్యనాదములు దైవాఱ దిక్కుద్య, పాటనక్షమములై పరఁగ మహాత్మ
గాంధికిజే! కన్నెగంటివీరునకు, జే! కాంగిరెసునకుజే! యనురవళి
అంపిల్లఁగా మూఁడురంగులపడగ, యస్వతంత్రత నొల్లమనువారిపడగ
సేవకు నీవికిఁ జిహ్నమౌపడగ, శాంతికి దాంతి కాస్థానియౌపడగ
ప్రేమకుఁ గరుణకుఁ బీఠమౌపడగ, సత్యవ్రతాసక్తి చాటెడిపడగ
రహటలక్ష్మిమందిరం బైనపడగ, లోకకల్యాణప్రలుబ్ధమౌ పడగ
మెఱయ నల్దిక్కుల మెఱవణిచేసి, గుణగరిష్ఠులు కోలగొట్లచెంగటను
జాల్వాఱు వాఁగుపజ్జకుఁ దెచ్చి మాఁటి, పెనుపారు భక్తిమైఁ బృథులచైత్యంబు
నద్దానిపైఁ గట్టి హనుమంతుచరిత, నందుఁ జెక్కించి యహంతమై వీఁగు
నాంగ్లప్రభుత్వము నదలించినట్టి, ప్రజలకై పోరాడి బలివోయినట్టి
శూరునిదెసఁ బేర్మిఁ జూపి రీపగిది, వీరునిదెసఁ గూర్మి వెలయించి రిట్లు. 288

వ. నిక్క మిట్లుండఁ గన్నెగంటి హనుమంతు గంద్రగొడ్డలి పూని తమ్ముఁ జంపవచ్చుటం గని యాత్మరక్షణార్థ మతనిపై గుండ్లు పఱపవలసి వచ్చెనని యనృతదాసులగు పోలీసు లానాఁడు తమ దాకాసితనమును సమర్థించుకొనిరి – మఱియు నిటు వేఱొండుకథం దెలుపవలయు. 289

## చీరాల పేరాల సత్యాగ్రహము

గీ. గర్తపురిసీమ వెలనాటిఖండమందు, రాణగల పల్లె యగుచుఁ జీరాల వెలయు
వలువనేఁతల జీవించువార లచటఁ, బెక్కు రున్నారు పేదర్మిఁ జిక్కువారు. 290

క. చీరాలను దత్సోదరిఁ, బేరాలన్ గలిపి యొక్క పేఁటను జేయన్
దీరుపుసేసిరి నాఁ డధి, కారులు; వ్రాఁలకుఁ గోటగద పేఁట యనన్. 291

క. ఏలుబడివారినిర్ణయ, మాలించి కరార్తిపెంచి యలయించుపురం
బేలా మన, కిది బీదకు, మేలా యని దానిఁద్రోయ మెయికొనిరి ప్రజల్. 292

గీ. విజయవాడకు వచ్చినవెనుక నాంధ్ర, దేశసంచార మొనరించు దీనబంధు
వటకువేంచేసినపుడు మహాత్మ! మాకు, నేమికర్తవ్యమనిరి తద్గ్రామజనులు.(6-4-21) 293

క. పురపాలకసంఘము మీ, కరిష్ట మిదునేని దానిహద్దుల కవలన్
దిరపడఁదగు మీ; రిప్పని, దొరతనము నెదుర్చు మేలిత్రోవగ నెంతున్. 294

క. ఈపని కాంగ్రెసు పనుపున, రూపెత్తదు కాని సత్యరుచిరు లహింసా
దీపితులు మీరు గెల్చినఁ, జేపడుపే ర్కొంత దానిచెంతకుఁ జేరున్. 295

క. మీయత్నం బిది వితథం, బాయెనయే నపుడు వచ్చు నపకీర్తిని మీ
రే యోర్వవలయు నని జా, తీయసభానేతృమౌళి తెల్పె హితంబున్. 296

గీ. మేలుమే లని యీనెమ్మి చాలు ననియు, మెచ్చిరి మహాత్ము నావేశమచ్చుపడఁగ
మాతృసేవాపరాయణుల్ మాననీయ, శీలసంపన్నులైన చీరాలప్రజలు. 297

ఆ. రామదాసుఁ డాంధ్రరత్నము గోపాల, కృష్ణుఁ డధిపుఁడై మహిష్ఠధైర్య
లక్ష్మి నొసఁగ వాడలకు మేడలకు స్వస్తి, వలికి యూరిమేర వెలికి నడిచి. 298

ఆ. అలఁతియలఁతిగుడిసె లటఁ గట్టుకొని వార, లాతపాదిదుర్భరార్తు లోర్చి
కాఁపురమ్ము నీద్వఁ గడఁగిరి భారతీ, యప్రజాళి విస్మయంపడంగ. 299

క. నేరిమిసెడి యోరిమి దిగ, జాతి తెరువుదప్పకుండుసరణిని మృదువా
గ్ధోరణిమై గోపాలుఁడు, వీరోచితకథలు ప్రజకు వినుపందొడఁగెన్. 300

క. గోపాలుని మురళీధ్వని, గోపికలన్ దిగిచినట్లు గుణనిధి తెనుఁగుం
గోపాలుని వాణీరవ, మాప్రజలన్ నిలువరించె నాకర్షించెన్. 301

క. విజయో స్తని దీవించుచు, మజా! తెగిం పనుచు నౌర! మగఁటిమి యనుచున్
నిజహార్దము చాటుచుఁ దెనుఁ, గు జగం బపుడనిపె వారికొఱకున్ గాన్కల్- 302

ఆ. ఆంధ్రరత్న మెంతయడిగిన నెన్నిమా, ర్లడిగినను రవంత యలంతవడక
వేలువే లొసంగె విత్తము దాతృతా, కుల్య కుదయభూమి కుప్పుసామి. **303**

వ. దళవాయి గోపాలకృష్ణున కపు డంగరక్షకులుగా ఊటుకూరి వేంకటేశ్వరులు జూలగంటి వేంకటసుబ్బారావు గౌస్‌బేగ్‌సాహెబు శ్రీకాకుళము సుబ్రహ్మణ్యము పట్టాభిరాములుగుప్త ఇసునూరి సుదర్శనము అప్పాజోస్యుల వేంకటేశ్వరులు రావుల లోకనాథము రామయ్య మునిపల్లె వేంకటసుబ్బయ్య లింగయ్య చీరాల రంగయ్య ఎనమండ్ర వేంకటప్పయ్య మున్నగు జోదులు నిల్చిరి – రామదాసు తన రాణువకు 'రామదం'డను పే రిడియె – దీని తోడుపాటునంజేసి ప్రజోద్యమ మనర్గళముగా సాగందొడంగె – అంత **304**

క. మతిసెడె నధికారుల; కే, గతినైనన్ జనతయోర్మిఁ గదలించుటకున్
గృతనిశ్చయులై వా రు, ధ్ధృతిమైఁ బ న్నిండటంచు నేఁచిరి ప్రజలన్. **305**

గీ. ఎవరు వారికిఁ బన్నిత్తు? రిచ్చువార, లేలవిడుతురు తమవసియించు నెలవు
లలుక హెచ్చిన యధికారు లపుడు ప్రజల, నంపఁదొడఁగిరి చెఱసాల కనుదినమ్ము. **306**

గీ. ప్రభుత నెదిరించి నాఁడు నిర్బంధమునకు, నిచ్చగించినవారిలో నేఁబదేండ్ల
యవ్వ కల "దలమేలమ్మ" యామె తెలుఁగు, నారి కొసఁగినకీర్తికి మేర కలదె? **307**

ఆ. అఖిలభారతోర్వి నాంగ్లేయశాసన, మతకరించి కార కరగినట్టి
మొదటిమగువ యీామె మదియున్న హృదియున్న, మఱవరాని వీరమహిళయీామె. **308**

వ. చీరాల పేరాల శాంతిసమరంబునం దొలిసారి చెఱకేగిన పదుముగ్గురలో నీమె కలదు – మహాత్ముఁడు చీరాలకు (6-4-21) వచ్చిననాఁ డీ వీరనారి నాయయ్యసరస నునిచి యాంధ్రరత్న మపూర్వమగు నూరేగింపుటుత్సవము నడిపె – సభారంభమున నీయవ్వ బాపుమెడన్ నూలిదండను వైచుటయు బందిగమున కేగివచ్చిన వారినొజ్జ యభినందించి మల్లికామాలికలఁ గైసేయుటయుమఱవరానిదృశ్యములు – **309**

## మాపలాలు దారితప్పుట

తెలుఁగుదేశమునం దసహాదయ్యోమ నిర్వహణ మిట్లుండ నిది కేరళరాష్ట్రమునుసైత మావేశించి యందలి మాప్లాలను రెచ్చఁగొట్టె – వారికుద్రేకము హెచ్చు – తమ పరమాచార్యుఁడు ఖలీఫా కాంగ్లేయులు కావించిన యవమతిం దలఁచినంతన వారిలోఁ గొంద ఱగ్గిపిడుగులై కత్తులుదూసి తెల్లవారి కుత్తుకలు కోయంజొచ్చిరి – దొరతనమువారి కార్యస్థానములం గూల్చిరి – కాల్చిరి – పదంపడి వీరిత్రిక్క వెఱ్ఱితలలువైచి మతవిప్లవముగాఁ బరిణమించి యెందఱో హిందువుల ప్రాణమానవిత్తముల బలిగొనియె – శిక్షాగంధము నెఱుఁగని మాపలాల దుండగము నెఱింగి మహాత్ముఁడు పెద్దకుమిలె – దీని దుష్ప్రభావము దేశమునందెల్లగోచరించె **310**

## కానాటు ప్రభువు రాక - అల్లరులు

తదనంతరమున - (1921 అగస్టు) నూతనముగా నేర్పడిన కేంద్రశాసనసభ నారంభించి భారతీయులఁ దీయతీయనిపల్కులం దనియింప నింగ్లండు దొరతనము వారిపనుపున రాజ బంధువు కానాటుప్రభువు బొంబయిరేవునం దోదడిగె - ఈపని కింతకుమున్ను యువరాజగు విండ్సరుప్రభువు (8 వ ఎడ్వర్డు) నియుక్తుఁ డయ్యెను - కాని మనదేశమునందలి రాజకీయ వాతావరణమునుబట్టి యాతనికి మాఱుగా నీతఁ డనుపంబడియె - (17-11-1921) ఈ దొర బొంబాయిలో నడుగుమోపి నంతన తన్నగరమునఁ గాంగ్రెసు ఖిలాఫత్తువర్గముల స్వచ్ఛందసేవకులు సంపూర్ణమగు హరతాళమును సాగించిరి - పోలీసులు వారిని లాటీలతోఁ గొట్టం దొడఁగిరి - సుశిక్షితులు గాని ప్రజ లవు దుద్రిక్తులై రక్షకభటుల నెదుర్కొనిరి - పోరు ఘోరమై నెత్తురుటేర్లు ప్రవహించె - అయ్యవసరంబున **311**

ఆ. కుందికుంది నాయకుఁడు గాంధి సిగ్గిల్లి, ప్రజలపాపమునకుఁ బాచితముగఁ
దనకు శిక్షవైచికొనె నైదుదినములు, చెల్లుదనుకఁ దిండి నొల్ల ననుచు. **312**

ఆ. నలఁగి కలఁగి యపుడె నాముక్కులకు సైఁప, రానికంపు నిదు స్వరాజ్య మనియె
వారమునకు నొక్క వాసరముగ మౌన, దీక్ష దాల్తు ననియె దేశికుండు. **313**

గీ. ఆఁగుఁడని వార్తనంపె సత్యాగ్రహమ్ము, నడుపఁజూచెడి బార్డోలినాయకులకు
నెంత చెప్పిన వినదేమి యీప్రజాళి, దీని దిద్దువాఁ డెవఁడని దిగులుగుడిచె. **314**

క. పదపడి తేతీ మహాత్ముఁడు, కదలెన్ దనపనికి నెట్టికష్టములందున్
బెదరని - సత్యాహింసల, వదలని సైనికులు తన్నుఁ బరివేష్టింపన్. **315**

సీ. కానాటుప్రభు వెందుఁ గాలుపెట్టిన నందు, హరతాళములు సాగున ట్లొనర్చి
పరదేశవస్త్రముల్ ప్రతివీధిని గడించి, ప్రోవుగా నిడి కాల్చి బూదిచేసి
వలువ లూడ్చినఁ దోయముల ముంచినను రాజ,భటులపై నాగ్రహింపదక నిలిచి
దుష్టశాసనములఁ ద్రోసి కోర్టువిధించు, శిక్షకున్ బెదరక చెఱకునేగి
తెల్లవారలగుండియల్ తల్లడిల్ల, భారతీయప్రజాశక్తి బయలుమెఱయ
విక్రమించిరి జగదేకవీరు లగుచు, శాంతిసైనికు లఖిలవిశ్వము నుతింప. **316**

వ. ఏలుబడివా రపుడు పెక్కు రాష్ట్రములం గల కాంగ్రెసుఖిలాఫత్తుసంఘము లశాస్త్రీయము లని ప్రకటించిరి-స్వచ్ఛందసైనికదళములు దండనార్హము లని చాటిరి - ఈ నిర్ణయముల నుల్లంఘించి పాంచాలము సంయుక్తరాష్ట్రములు వంగభూమి మున్నగుతావుల వేల కొలఁది దేశభక్తులు పిన్నలు పెద్దలు కారాగృహమ్ములకుం జనిరి - లజపతిరాయి మోతీలాలు జవహర్లాలు చిత్తరంజనదాసు మున్నగు నతిరథులును నాఁడు బంధితులైరి - గాంధిటోపీని ధరించినవాఁ రందఱు నయ్యెడ శిక్షితులైరి - మాలవ్యాపండితుఁడు తటస్థుఁడుగా నుండి **317**

సీ. కానాటుదొర నప్డు కాశి కాహ్వానించి, విశ్వవిద్యాలయవేది నతని
కుచితసత్కారమ్ము లొనరించె నిమ్మేటి, సాయమున్ బడసి రాజప్రతినిధి-
రీడింగు కాంగ్రెసురీతికిఁ దనరాజ, నీతికిఁ బొత్తుసంధించి వంగ
నగరమందేని తన్నరనాథునకుఁ దగు, మన్ననల్ దక్కెడితెన్ను వలచి
బందిలోనున్న దాసుతోఁ బ్రజలనడుమ, మెలఁగుచున్న మహాత్ముతో వలయుచర్చ
జరిపెఁగాని బంధితులనందఱను విడువ, నొల్లక హతాశుఁడయ్యె నాఢిల్లివిభుఁడు. 318

క. ఆలీసోదర్యులచెఱఁ, దూలింపనిసంధి కెవఁడు తుష్టింగను నం
చాలోచించె మహాత్ముఁడు, మే లని దేశికునితలఁపు మెచ్చిరి మిత్రుల్. 319

గీ. కదిసె లగ్నము; కాళికాఘట్టమునకు, వచ్చెఁ గానాటుదొర పరివారసహితుఁ;
డాతనిబహిష్కరింప నాయత్తమయ్యె, వీధివీధియు నిర్భరావేశ మొదవ. 320

ఆ. అంత నిండుకొన్న హరతాళ మెందును, జరుగదాయె నొదయఁ దరుగుదేర;
చాఁగురే! కసాయిసైత మానాఁడు బీ, గము బిగించెఁ దనదుకాణమునకు. 321

ఆ. తెల్లవానిఁ జూడఁ దల్లడమందెడి, ప్రజలు జంకులేనిబంటు లైరి
గాంధినుడువు నుడువుగాక రాచతికంపు, వారిమాట మెచ్చరై రొకింత. 322

గీ. తెల్లదొరపల్కు దెస భారతీయులకుఁ దొ, లంగె విశ్వాస; మాంగ్లేయులకు నమర్ష
మగ్గలంబయ్యెఁ గాని వా రపుడు ప్రజలఁ,జెఱ నిడుటగాక యొండేమిసేయఁగలరు? 323

క. చెఱసాల కేగులగ్నము, కొఱకుం బ్రజ వార్చె నుక్కుగుండియతో న
త్తఱి ముప్పదివేల నెఱా, సరు లీఁగిరి బందిగముల జగ మబ్రపడన్. 324

వ. అసహాయోద్యమమును బహిష్కారోద్యమమును విశృంఖలముగా నిట్లు సాగందొడఁగె - దేశమునంగల పల్లెలు పట్టణములు పెఱవల్వలం గాల్చుట యనఁబెనుజన్నముం జేయుటవలె భావించె-ప్రజల యుత్సాహమున కవధి కన్పింపదాయె - కానాటుప్రభువు ఢిల్లీశాసనసభ నారంభించుతఱి "భారతీయులు తరతరాలనుండియు రాజభక్తిసంపన్నులు - వారు తమ దేశమునకు స్వరాజ్యము వలయుననిరి - కాన నేఁ డా సంస్కరణములను బ్రారంభించుచున్నాము - మా సామ్రాజ్యమునందలి కెనడామున్నగు నధినివేశదేశముల కున్న స్వాతంత్ర్యము మెల్లమెల్ల వీరికిం దక్కఁగలదు" - అని రాజుపంపిన సందేశమును వినిపించె - పాంచాలమున జరిగిన దుండగములను విస్మరింపుఁ డని, క్షమం బాటింపుఁ డని భారతీయుల నుపలాలించె - ఈ యోదార్పులకు మనవారు శాంతింపరైరి - వారు నిరాకరణకార్యక్రమము నుద్దీప్త మొనరింపఁ గృతనిశ్చయులైరి - "నా కార్యక్రమము నూఁచముట్టుగాఁ బ్రజలు పాటింతురేని స్వరాజ్యము నేఁడాదిలో సాధింతు"నని మహాత్ముఁడు వాగ్దానమొనర్చి నేఁటి కొకవత్సరము పూర్తికావచ్చె - "గాంధి చెప్పినపని యే నెంతచేసితి"నని తలంపక ప్రతి భారతీయుఁడు నేదో యతిమానుషసంఘటనము

జరిగి నేఁడో రేపో స్వరాజ్యము దివినుండి భువికూడిపడు నని నిరీక్షింపం దొడఁగె - కాని 325

క. ఆలాభము చెచ్చెరఁ దన, పా లగుటకు శక్తికొలఁది బడలెద ననియున్
వాలాయము పెద్దలప, ల్కాలించెద ననియు ధర్మ వాలోకించెన్. 326

క. ఆయెడ దేశము త్యాగప, రాయణమై బానిసమును రాపాడి జగద్
గేయస్థితి నార్జింపఁగ, నాయితమై యుండె మోహనాజ్ఞావశమై. 327

ఆ. సంభ్రమపడె సమష్టిశాసనోల్లంఘన, పుణ్యకాల మెపుడు పొసఁగుననుచు
నంతలో నహమ్మదాబాదుకాంగ్రెసు, వచ్చె వలఁతి వల్లభాయి పిలువ. 328

## అహమ్మదాబాదు కాంగ్రెసు

గీ. ఈసభను జిత్తరంజనదాసు నడుప, వలయుఁగాని ప్రభుత్వమువార లతనిఁ
బట్టుటంజేసి తన్నేతబరువు ప్రాజ్ఞ, మానితుఁడు హకీమజ్మలుఖాను దాల్చె. 329

చ. ఒక పెనుపాదుసాకరణి నొప్పు నతం డెనలేనిరీవి; రీ
వికిఁ దగినంతవిజ్ఞతయు విజ్ఞతకుం దగినంతశీలమున్
స్వకవశవర్తులై వెలయ సత్పురుషుం డతఁ డచ్చమైన కీ
ర్తికి నెలపట్టమై ప్రజకుఁ దీయని పాయని చుట్టమై తగున్. 330

క. హిందూమహమ్మదీయుల, పొందున కితఁ డానవాలుపో! యని విద్వద్
బృందము మనసారఁగ నభి, నందించుఁ దదీయమైన నడవడి నెపుడున్. 331

క. కరినగరమునం దొకపరి, జరిగినహిందూసదస్సు జయజయరావ
స్ఫురిత మగుభంగి నడిపిన, దొర యతఁ; డీగరువమునకు దొర లేదుగదా! 332

ఉ. పెద్దలు పిన్న లద్దిర! వివేకము! బాపురె! దేశభక్తి! యం
చుద్దవిడిన్ నుతింప మధురోక్తిపరంపర నించె ఖాను; మున్
గద్దియ కెంచుకొన్న గుణగణ్యుఁడు దాసువచస్సు లెంతయున్
ముద్దుగ వించె నక్కొలువుమ్రోల సరోజిని భారతింబలెన్. 333

గీ. తనయుపన్యాసమున దాసు మనకుఁ బుట్టు, చనవుగా స్వరాజ్యము కల దనెడిపాడి
నింగిలీసుమహీపతు లియ్యకొన్నఁ, గలదు వారికి మనకు సంగాత మనియె. 334

క. మనజాతీయత కెల్లను, మనవిజ్ఞానము పునాదిమాదిరి దనియెన్
మన మస్వతంత్రతన్ బడ, మనవిజ్ఞానం బదెట్లు మనఁగల దనియెన్. 335

క. ఈతనిచూపునకున్ దగు, రీతిని తీర్మానములను సృష్టించి సభా
యాతప్రతినిధులకు సం, ప్రీతిప్రదుఁ డయ్యె జాతిపిత భాష్యములన్. 336

వ. అహింసాబద్ధమగు నసహాయోద్యమమును స్వరాజ్యసిద్ధిదనుకం తీవ్రతరమ్ముగా సాగిం
చుట, దేశీయు లెల్లరు జాతీయస్వచ్ఛందసైనికదళములందీఁగుట, మహాత్ముని నాయకత్వ
మున సమష్టి శాసనోల్లంఘనమునకుఁ గడంగుట, సర్వమతములం బ్రేమించుట, నూలు
వడుకుట, యంటరానితనమున్ ద్రోయుట మున్నగు సముచిత నిర్ణయమ్ము లా మహాసభ
నంగీకృతములాయె - మఱియు నందు **337**

చ. ప్రతినిధియై తనర్చు 'హజరత్ మొహనీ' యనుకుఱ్ఱఁ డాంగ్లసం
గతి యిసుమంతలేని యధికారము కావలె నేఁడు భారత
క్షితి కనునిర్ణయం బొకటి చేర్చెను జర్చలఁ; దత్సభాజన
ప్రతతి చలింప నిప్పులుక్రక్కె వితర్ది నుపన్యసించుచున్. **338**

గీ. దేశమం దపుడున్న యావేశమునకుఁ, దగినతీర్మాన మిది, కార్యతంత్రమర్మ
మెఱుఁగనిసభాసదులఁ దన్నె నిది, మహాత్ము, నెదనుగాఱియపెట్టె నియ్యదికరమ్ము. **339**

ఉ. అచ్చెరువున్ విషాదమును నల్కయుఁ బైకొన నప్పు డిట్లు వా
క్రుచ్చె మహాత్ముఁ "డీతలఁపు ఘోరము దీని నలంతిదానిఁగా
నిచ్చటిసభ్యు లెంచుట సహింపను బాధ్యతలేనివార లీ
మెచ్చెడివారు కయ్య మన మేలములాడుట కాదుకాదయా! **340**

క. తొందరపడ నీతిజ్ఞులు, నిందింతురు మనబలంబు నెఱి యెఱిఁగి దురం
బెం దెపు డేరీతి నొన, ర్పందగు నది తెలిసి మనము రాణింపవలెన్. **341**

క. హిందూముస్లిములకు నభి, నందింపందగిన చెల్మి నాటుకొనినదా
డిందినదా యస్పృశ్యత, క్రిందినదా మదిరమీఁదిమక్కువ ప్రజకున్. **342**

గీ. కలరు సిక్కులుక్రైస్తవుల్గలరు కలరు, యూదు లెన్నోమతమ్ముల నూఁదియున్న
ప్రజలు గల రిందు వా రిష్టపడుదురొక్కొ, తెల్లవారలతోఁ దెగత్రెంపు లనిన. **343**

ఆ. వలదు! వలదు! లోఁతుతెలియని మడుఁగులో, నడుగుమోపవలయు నను తెగింపు;
కనుఁడు సభ్యులార! కాంగ్రె సధోగతి, కేగకుండుమార్గ మాఁగి యాఁగి." **344**

చ. ప్రతినిధికోటి డెందములఁ బ్రామినచీఁకటి తూలఁగా సబ
ర్మతిఋషి యిట్లుపల్క హజరత్ మొహినీ కొనితెచ్చినట్టి తీ
ర్పతలము నాశ్రయించె; నది యమ్మెయిఁ గాక మఱెట్టులౌఁ? జమూ
పతి వలదన్నమార్గమును బట్టినబంటు జయమ్ము నందునే? **345**

వ. ఆనాఁడు రాజప్రతినిధి కాంగ్రెసువారి తీవ్రత నణంప నఖిలపక్షసభన్ జరిపి యందు
నెగ్గిన తీర్మానముమేరకు భారతభూమి స్వతంత్రమగునట్లు చూతు నని మాలవ్యా వంటి
తటస్థనాయకులతోఁ బల్కెడితీరు గుర్తించి మహాత్ముఁడు కాంగ్రె సెంత ముందడుగునం

దున్నను సంధిద్వారము నది మూయ దనియు, రాయబారము సదుద్దేశపూరిత మగుట వలయు ననియు, సర్వపక్షసభలో నిచ్చువారు పుచ్చుకొనువా రను వేర్మి తగదనియు, సభ్యులందఱు సమానాధికార సంపన్నులుగా నుంట సముచితమనియు, నెందఱుబందా లైన నెంద ఱసువులంబాసినను లెక్కింపక కాంగ్రెసు తన లక్ష్యమును సాధించు ననియు నిది వాక్సభాస్వాతంత్ర్యము నరికట్టఁ జూచు నేలుబడివారిపట్ల వినీతిమై నొనర్చు ప్రతిన యనియు నీ ప్రతిజ్ఞ తృణీకరింపరానిదనియు నుదాత్తప్రసంగము కావించి సభకు న్మేషముంగూర్చె - మఱియు 346

గీ. అహమదాబాదుకాంగ్రెసునందుఁ బ్రజల, కాత్మగౌరవ మగ్గలం బగుట తెలిసె
నలుకుదిగజాతెననువార్తతెలిసె దొరల, గౌరవముతగ్గె నన్నయీగదయుఁ దెలిసె. 347

గీ. అహమదాబాదుకాంగ్రెసునందుఁ బ్రజల, ప్రేముడిని గోరుపెద్ద లీవికిని సేవ
కగ్గలిక చూపి కర్మయోగానుకూల, సరణిఁ జనఁదగు ననురహస్యమ్ము దెలిసె. 348

గీ. అహమదాబాదుకాంగ్రెసునందుఁ బ్రజలు, దాస్యమును సైఁప రన్న సత్యంబు తెలిసె
దేశము స్వతంత్రతా సముద్దీపనమునఁ, గలుగుశోభలఁ గనె నన్నకథయుఁదెలిసె. 349

ఉ. ఇంతకుమున్ను కాంగ్రె సెట నెప్పుడు సాగిన రాచఠీవితోఁ
బంతములాడెఁ గాని యిట బల్లలు మేల్కురిచీలుమున్నుగా
వింతగదించువస్తువులు వేనికి నించుకతావులేదు కా
సంతయు రిత్తవెచ్చ మెదియైనను లేదు పరీక్ష చేసినన్. 350

ఉ. అచ్చపుబేరగాఁ దగుమహాత్ముఁడు పుట్టినఘూర్జరమ్మునన్
వెచ్చముపట్లఁ గన్నిడి వివేకముచూపెడివార లుంటలో
నచ్చెరువేమి వల్లభునియాజ్ఞను గాంగ్రెసువీడు దంబపున్
మచ్చుకు దవ్వుగా వెలసె మాయురె! చాపలు గద్దెలైతగన్. 351

ఆ. మేలిమేలి వడుకునూలిదేరాలతో, నది తనర్చె వలసినంత నీటి
కలిమి దాని కొదవెఁ గంపు రేకెత్తని, మఱుఁగుదొడ్లు దానిగరిమఁ బెనిచె. 352

ఉ. ఏ దెసవారికైనఁ జెఱు పింతయుఁ గూర్పనికూర లప్పముల్
సాదము లందు వండఁబడె శాంతిదళమ్ములవారు నమ్రతా
మేదురశీలురై యతిథిమేలు వరించి శ్రమించి రీసుఖా
పాదకరీతు లన్నియును బాపు విధించినసూత్రముల్గదా! 353

గీ. అహమదాబాదుసభ పూర్తియయ్యెఁగాని, ప్రతినిధులు పోవరైరిస్వరాష్ట్రములకు
వారు నివసించుచున్న యావరుల కరిగి, యొసఁగె వలసినసందేశ మొజ్జ గాంధి. 354

ఆ. కత్తిమీఁదిసాముగాని వేఱొండు గా, దనియె శాసనంబు నతకరించు;
టరసియరసి చేయునట్టి కార్యమె కర్త, కెలమిగూర్చు ననుచుఁ బలికె గురుఁడు. 355

చ. అతఁ డపు డాంధ్రులున్నబస కల్లన చేరి తెలుంగులార! మీ
కత వినినాఁడఁ బన్నులను గట్టమి కువ్విళులూరుచున్న మీ
చతురత దేశభక్తియును సన్నుతి పాత్రము లౌనుగాని తీ
వ్రత చన దిందు ముందుగనె రాఁగలచిక్కులు చూచుకోవలెన్. 356

గీ. పల్లెపల్లె కింటింటికిఁ బదఁడు! వచ్చు, నష్టములు కష్టములు తెల్పుఁ డిష్టపడిన
పౌలికులవ్రాళ్లు కొనుఁడు కొండంతయాస, కలదు మీదెస నాకని పలికె శుభము. 357

వ. వెండియు వ్యష్టి సమష్టి శాసనోల్లంఘనములకు సిద్ధపడినతావులే పన్నులనిరాకరింప నర్హము లని హెచ్చరించె - వేంకటప్పయ్య మున్నగు నాంధ్రనాయకులు మహాత్ముని హితోపదేశము నలరుదండంబలెఁ దలఁదాల్చి తమ భూమికి మఱలిరి. 358

## 1922

## సర్వపక్ష మహాసభ

గీ. దేశహిత మాసచేసిన ధీమదగ్ర, గణ్యులు ప్రభుత్వమునకును గాంగ్రెసునకు
మైత్రి నొదవింపఁదలఁచి బొంబయిపురాన, సర్వపక్షమహాసభ జరిపిరపుడు. 359

చ. అది సరకారు కాంగిరెసునానతి నొదలఁ దాల్చువారలన్
బదఁ దని బందిగమ్ములకుఁ బంపెడికాలము; కానఁ గాంగ్రె సీ
సదమునఁ జేరఁజాల దని చక్క వచించె మహాత్ముఁ; దవ్వలన్
బెదపెదవారు పేర్మిమెయిఁ బిల్వ నొదంబడె నిష్టగోష్ఠికిన్. 360

మధ్యా. ఆరచ్చ శంకరనాయ రనుమేటి యాజమాన్యమునఁ
బ్రారబ్ధమయ్యెను గాని, బాపుజీబాటకుఁ దనదు
దారి కెంతేని ద వ్వంట నతఁడు సదస్సును వీడె,
ధీరుఁడు విశ్వేశ్వరయ్య పెద్దగద్దెకు వచ్చె నంత. 361

మధ్యా. ఆ సభ యేల్పడివారు కాంగ్రెసు నణఁచెడితీరు
కాసంత మెచ్చరాని దనె మొన్నటికాంగ్రెసు చేయు
శాసనోల్లంఘననిర్ణయ మిపుడు సాగరా దనియె
వే సరకారువా రెల్లబందాల విడవలె ననియె. 362

క. స్వాతంత్ర్య సమస్యను దగు, రీతిన్ సవరింప నీ ధరిత్రింగల నా
నాతంత్రప్రియులసభన్, నేతలు సమకూర్పవలె ననెన్ శీఘ్రముగన్. 363

వ. ఈసభవారిపల్కు పాటించి మహాత్ముఁ డానెల నిందుదనుక శాసనతిరస్కృతి నాఁపె - కాని రీడింగుప్రభువు సర్వపక్షసభానిర్ణయమ్ముల నాలిగొని తనతత్త్వముం దేటపఱిచె - మహాత్ముఁ డీఖింకమునకు దేశీయులు వలయునంత త్యాగము కావింపమియె కారణం బని తలంచె - సంధి కిది సమయముకా దని విశ్వసించె - బార్డోలిలోఁ జట్టముంద్రోయ నెంచితి నని రాజప్రతినిధి కిట్లొకకమ్మనంపె. (1-2-22) 364

## బార్డోలిలో శాసనోల్లంఘనము సాగింతునని బాపూ వైస్రాయికి లేఖ వ్రాఁత

మం. "మనవి నాలింపుఁడు! మానవేశ్వరులు! ముసు దయ్య రేదోసమును లేనిప్రజల
నతిముతిఁ జంపె మహమ్మదీయులకు, గురువౌ ఖలీఫాకుఁ గూరె నవజ్ఞ
యీతప్పిదములు మీయేల్బడివారు, హేతువుగాఁ బుట్టె నివి సైఁపరాని
విట్టిదుష్కార్యంబు లిఁకనైన నిచటఁ, బుట్టమి కేము మాపుదమికి వడిగ
నిండు స్వరాజ్యంబు నిండని పేర్మి, నిండినపల్కుతో, నిర్భరాహింస
పండినపల్కుతోఁ బ్రార్థింపమీరు, కొండికవిలువ మాకోర్కికి నీక
ప్రతికూలమగుబాటఁ బట్టి ధర్మంబు, నతకరించి కఠోరమైన నిర్బంధ
విధికి నీకొంటి; రీ పృథివి నల్గడల, నధికారు లెసరేఁగి యనపరాధిప్ర
జావళిం జెఱలలో నదిమిరి; దేశ, సేవాభిరతుల నిసీ! గొడ్లఁ జూచి
నట్టుల చూచి; రయ్యనఘులఁ గశలఁ, గొట్టిరి కట్టి ముక్కోణమ్ములందు;
నక్కఱపడినకార్యమ్ములా? వాడి, దక్కనిచేఁతలా? తలపోయ సభ్య
చేష్టలా? యివి; యిట్టిచెయువు లెందేని, దుష్టముల్ గాక సాధువు లౌనె! రాచ
తికము భారత ధరిత్రిని నేఁడు కలదె, సుకమన్న దిప్పు డీక్షోణిని గలదె
యసహాయవాదులు హరతాళములను, బొసఁగించి పరదేశపుంబట్టఁ గొనెడి
వారలఁ, గల్త్రాగువారల నాఁపి, యూరూర నించుకయుద్రేక మొదవు
పని చేసి రనిన నాపలుకులో నిక్క, మనున దించుక యుండు నందును గాని
శాంతిమై సాగెడిసభలను గాని, శాంతికై పెనఁగెడిసైనికుఁ గాని
దుండగీం డ్రగువారి దుందుడు కడఁపఁ, దీండ్రించు మూర్ఖులతీరు వారింపఁ
బఱపుచట్టములతో బాధింపనగునె, నెఱపులాటీలతో నెగు లిడందగునె
ప్రజ లయో! వాక్ సభా ప్రచురణస్వేచ్ఛ, త్యజియింపవలసె నీయవనియం దిపుడు
బాపురే! నిర్బంధపద్ధతి యనక, యీపరిపాలన నేమనవలయు
నీయరాజకపీడ నీయధర్మంబు, నీయప్రియమ్ము నీయెగ్గు దౌర్జన్య
దూరపద్ధతుల నెదుర్కొనఁ దలఁచి, నారు కాంగ్రెసువారు నాతలమీఁద
నునిచి రీ వ్యూహప్రయోగభారమ్ము, వినిచిరి నను సదా విడకుండు మనుచుఁ
జేసితి బార్డోలిసీమ సమష్టి, శాసనోల్లంఘన సమరంబు నడుపఁ
దగు నన్నతీర్పు, నాంధ్రమునందు వీను, మిగిలిన గుంటూరుమేదినిలోని
జనపదమ్ములు నూఱుసైత మీదొడ్డ, పనికి నర్హములు గావచ్చు; నీపోరు

సాగకమున్నె మీసరణిని బ్రజలు, బాగు! బా! గని మెచ్చుపగిదిని దిద్దుఁ
దసహాయవాదుల నాఁచినవారి, వెస విడుపుఁ దహింస విడక స్వరాజ్య
సంపాదనమునకై జను లుద్యమింప, నొంపము వారి నన్నును వెల్వరింపుఁ
డీపత్రమునకు మీ రేడుదినాల, లోపల స్వాతంత్ర్యలోల మౌజగము
పులకించుమాడ్కిఁ బంపుఁడు మాఱుఁగమ్మ, నిలిపెదఁగయ్యంబు నే నంతదనుక."365

క. రాజప్రతినిధి దేశికు, నోజ నుఱఁడు గాన శాసనోల్లంఘన మే
రోజున సాగునొ బార్డో, లీజయమున్ మనము పిచ్చులించుట యెపుడో. 366

గీ. అనుచు నాసేతుశీతాచ లావనీస్థ, మానవానీకమును నిస్సమానమగు హ
ళాహళికిఁ జిక్కి ఘూర్జరేలాతలమ్ము, దెసకు సారించె నాత్మీయదృష్టి నపుడు. 367

ఆ. కలరు గాంధివెంట నిలిచి నానాఘోర, బాధ లోర్చి యాఫ్రికాధరిత్రి
విడిచి వచ్చినట్టి వీరహాలికులు బా, ర్డొలిసీమయందు వేలకొలఁది. 368

గీ. తనసృజించిన క్రొత్తయుద్ధమునఁ బ్రాఁత, కాఁపులై సడిసన్నమగంద్ర వీరి
నూఁతగాఁ గొని తెలవార లోహటిల్ల, విక్రమింపఁ నెంచెను గార్యవిదుఁడు గాంధి.369

గీ. మాప్రయోగమ్ము గనుఁగొండుమాజయమ్ము, నిచ్చగింపుఁడు దేశీయు! లింతెకాక
మాకుఁజీకాకునొదవించు మార్గమెద్ది, యేని త్రొక్కకుఁ డనియె సేనాని యతఁడు.370

ఉ. అతనిలేఖ చేరినది హస్తినకున్; సరకారువారు త
ద్రీతికి నించుకైన నురరీకృతిఁ జూపక తీయతీయగా
మాతెఱఁగెల్ల మంచిదిసుమా యని, రీప్రతిలేఖ బాపుజీ
చేతికి రాకమున్నె కదిసెన్ బెనుఁజీఁకటి భారతమ్మునన్. 371

## చౌరీచౌరా దుండగములు – బాపూ వేదన

వ. సంయుక్తరాష్ట్రములకుఁ జెందిన గోరక్షాపురముపజ్జ నొకయూరు 'చౌరీచౌరా' యనునది కలదు – దానం గాంగ్రెసువా రొకయుత్సవము నడుపుచుండఁ (5–2–22) బోలీసువా రద్దాని నిలువరించిరి – వారితీరు సైరింపఁజాలనిప్రజలు కొంద ఱుద్రేకమునకు దాసులై వివేకమును గోల్పోయి యేకవింశతిరక్షకభటులను దదధికారిని వారికార్యాలయమునకుఁ దఱిమి తఱిమి కసివోక యాయింటికిఁ జిచ్చువెట్టిరి – ఆ మంటలయం దా ద్వావింశతి రాజభటులును మలమల మాడిరి – కానాటుదొర దిగిననాఁడు బొంబాయినగరమునం దేఁబదిమూవు రసువులం బాయుటయు నాల్గైదువందలమంది క్షతగాత్రు లగుటయు నాపాదిల్లె – అతేఁడు చెన్నపురమునం దడుగిడిననాఁడు (13–1–22) సైత మించుక యల్లరి సాగకపోలేదు – ఈ దుస్సంఘటనములు మహాత్మునుల్లమును గాయపఱుప నగ్గఱువ యీదురితముల కేనబాధ్యుఁడ నని నమ్మి యైదునా ళ్లుపవసించె – పదంపడి

సామూహికశాసనోల్లంఘన మిపుడు కూడనిపని యని నిశ్చయించి కాంగ్రెసుకార్యకర్తలను బార్డోలిలో సమావేశపఱిచి (12-2-22) తన నిశ్చయమును వా రంగీకరించునట్లు కావించె - మఱియుఁ గాంగ్రెసువారు దొరతనమువారిచట్టముల నెదిరిచి చెఱసాలకుం బోకయు బహిరంగసభలు సాగించుటయు శాంతిసైనికుల యూరేగింపులు జరుపుటయు మానవలయు నని తత్కార్యకర్తృసభన్ దీరుమానములు సేయించె - కాంగ్రెసుప్రచారకుల పాలి కొక నిర్మాణకార్యక్రమము నేర్పఱిచె - ఇదియ బార్డోలీకార్యక్రమ మని పేరందె - దీని ననుసరించి భారతజాతీయమహాసభా ప్రచారకులు కోటిమందిసభ్యులఁ జేర్ప వలయు - వడుకునూలివల్వం బెనుపవలయు - పంచాయతుల నేర్పఱుపవలయు - మద్యపానము వలదని ప్రజకు మప్పవలయు - అయ్యది యట్లుండె - అహమ్మదా బాదుకాంగ్రెసునందు సమష్టి శాసనోల్లంఘన మంగీకృతమగుటకుం బదునైదునాళ్లు ముందుగనె (15-12-21) యాంధ్రరాష్ట్రపుఁ గాంగ్రెసుసంఘమువారు గుంటూర బెరసి తమసీమలలో సర్కారుశిస్తు చెల్లింపఁజన దని నిర్ణయించిరి - సత్కార్యములపట్లఁ దెనుఁగువారికిం గల తీవరపాటున కిది మూదలయనందగు - మహాత్ముఁ డీసంవేగము నోర్వలేక యాంధ్రులు తమపన్నులనెల్లఁ (25-1-22 లోపల) జెల్లించుట సముచిత మని ప్రకటించె - అంత 372

గీ. ఒక్క గుంటూరిసీమలోఁ దక్క లాఁతి, తెలుఁగుసీమలనెల్ల బన్నుల నొసంగి
రపుడుకర్షకు; లెవ్వ రెట్లైన మేము, పోరుసాగింతు మనిరి గుంటూరివారు. 373

ఉ. వారు మహాత్మ! మాతలఁపు వమ్మొనరింపకు; దేశభక్తి నె
వ్వారికి నేము తగ్గము విపత్తులనోర్తుము భారతావనీ
గౌరవ మెంచి సంపదనె కాదు ప్రభూ! బ్రతుకైన నిత్తు మిం
పారఁగ దీవనల్ పనుపుమంచు గురున్ గొనియాడి రెంతయున్. 374

ఉ. ఔననలేక కాదనుటకైనను జాలక యుక్తియుక్త భా
షానిపుణుండు దేశికుఁడు "శాసనధిక్కృతిసేయ నర్హమౌ
నాణెము మాకు నున్న"దను నమ్మిక మీమదిఁ బుట్టునేని మీ
పూనిక కడ్డుసెప్ప నిడుఁబో! భగవానుఁడు మీకు భద్రముల్. 375

చ. అని యొకతంతివార్త తెలుఁగన్నుల కంపఁగ దానికిన్ "గురుం
డనుమతినిచ్చె నిచ్చె" నని యర్థముదీసిరి గర్తధారణీ
జను; లపు డున్న సంబరపుఁజందము తాదృశ మౌట వారికిన్
గనఁబడదయ్యె నన్యగతికంబగు నర్థ మ దెంతచూచినన్. 376

వ. స్వతంత్రతా పిపాసితులు పదివేలమంది కమ్మతీం ద్రానాఁడు (31-12-1921) పెదనంది పాటి కనతిదూరమునం గల పాలపర్తిని సమావిష్టులై కాంగ్రె సంగీకరించినతఱి నెన్ని యిడుములకే నోర్చి శిస్తుచెల్లింపక నిల్తు మని తీర్మానించి తమ మగఁటిమింజాటిరి -

అతిదుష్కరమగు తిరుగఁబాటు నంగీకరించిన యీ కర్షకసభ నాహ్వానించి వ్యయప్రయాసములు సైఁచిన పాలపఱ్ఱు మఱవరాని పల్లియనాఁ జను - పెద్ది, ముద్దన, తేళ్ళ మున్నగు వంగడములకాఁపు లీ సభావిజయమునకుఁ బెద్దయుం దోడ్పడి సదస్యుల మన్నన లందిరి - పదంపడి గుంటూరి మండలమునకుఁ జెందిన కాంగ్రెసుసంఘము వారు జనవరి పండ్రెండవ దినమునఁ (1922) బొన్నూరఁగల బుఱ్ఱయ్యసత్రమున సమావేశమై జయజయారావముల నడుమం గరనిరాకరణప్రతిజ్ఞ కావించిరి-నాఁడు పొన్నూరిలోఁ దత్సభ జరుగరాదని దొరతనమువారు ప్రయోగించిన యాజ్ఞను మును ముందుగా నుల్లంఘించిన గౌరవము గొల్లపూఁడి సీతారామశాస్త్రి, మద్ది రాధాకృష్ణయ్య, మాచిరాజు రామమూర్తి, శరణు రామస్వామిచౌదరి, ఇటికాల సూర్యనారాయణ, జనాబ్ గౌస్ బేగ్సాహెబు, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, పత్రి అనంతరావు, మంతెన నాగరాజు, వాసిరెడ్డి వెఙ్కయ్యలకు దక్కె - ఈ భాగ్యమున కీ రచయితయు నారటంపడె - కాని నీ వంటిపిన్న లివు డాఁగవలయు నని సీతారామశాస్త్రి వారింప నమ్మేటిమాట నితఁ డౌదలం దాల్చె - నాఁటి కోలాహలమునకు దిక్కుద్యములు వ్రీలె ననుట యతిశయోక్తి కానేరదు - అయ్యెడం గదనసభకు దూఁకిన కాంగ్రెసు వజీరుల వాఁడిమిం గన్నప్రజల కపుడపుడ తమ వాంఛించు స్వరాజ్యలక్ష్మి సాక్షాత్కరించిన ట్లాయె - సీతారామశాస్త్రి మున్నగుపెద్ద లపుడ చెఱసాలకేగిరి - అంత 377

## పెదనందిపాడు - పన్నుల నిరాకరణము

క. పెదనందిపాడు సంగర, సదనముగాఁ దిరుగఁబాటు సాగెను దేశా
భ్యుదయమునకై తపించెడి, చదురులు వేల్వేలశాంతిసైనికు లెసఁగన్. 378

గీ. నిలిచె నానాఁడు పర్వతనేనివీర, యాఖ్యుఁ డీశాంతిసేనకు నధిపుఁ డగుచుఁ
దెల్లగుఱ్ఱముపై వచ్చుదిట్ట నితనిఁ, గన్నయంతన ప్రజలలో గణముపెరిఁగె. 379

గీ. గాయకుఁడు నర్తకుఁడు హరికథనకుశలుఁ, డుత్తమాన్వయుఁ దుర్వీహితోద్యమాను
రక్తుఁడు కృషీవలుఁడు ధృతిరాశి యగుట, వీరయకుఁ బల్లెపట్లు జోహారు వనియె. 380

క. ధీరున కితనికిఁ గవచము, తీరున సంకాకులాంబుధి సుధాంశువు సీ
తారామమంత్రి నిలఁబడ, నూరూరున్ గరనిరాసనోత్సుక మయ్యెన్. 381

క. ఇంటింటికిఁ జని కాంగ్రెసు, బంటులు కాఁపులకుఁ గట్టుపాట్లను వెత లీ
కొంటను గఱపిరి యోర్మికిఁ, బంటకదా గెలు పటంచుఁ బలికిరి నేర్మిన్. 382

ఉ. హాలికు లెన్ని కష్టములనైన సహింతుము మాపొలంబులన్
బాలసు లఙ్ఞ లేలమునఁ బావునకుం బదిగొర్లు పాడినన్
దాలిమినుజ్జగించి పెదదారికిఁ బో మిఁకఁ దెల్లవాని దు
ష్పాలన మోర్వమంచు నెఱి పందినవా రయి రెల్లపల్లెలన్. 383

క. సరకారుకంపు సోఁకిన, నరునకు నేవస్తు వమ్మినం ద ప్పని తీ
ర్చిరి పాలు ప్రాలు మున్నగు, సరకులు చిక్కక యతండు చదికిలఁబడఁగన్. 384

గీ. తలుపులం దోఁచునంకెల పాలకువలను, దుడిచివైచిరి సకలవీధులకు నేగి
పన్ను దెమ్మని యధికారి పట్టుపట్ట, నెవని దేయిల్లొ యాతని కెట్లు తెలియు? 385

గీ. కస్సుమని మాండలికకరగ్రాహి వచ్చి, సత్రమెటనుండె? నీయూరిసంజ్ఞ యేమి?
యనుడుఁ బసిపాపఁడైన మాఱాడఁడాయె, వాఁడిదేలిన పెదనందిపాడునందు. 386

క. ఆదెస నపుడు ప్రభుత్వము, లేదు భయము లేదు భ్రాంతిలే దెటఁగన్నన్
బ్రాదేశనమే దాస్య, చ్ఛేదనసంరబ్ధ నవ్యజీవన రుచులే. 387

వ. కర్షకవృత్తికిఁ జెందిన యీరచయిత యపుడు తనయూరం గరనిరాకరణ వార్త చాటం బూని దప్పువానిం బిలువ నతఁ డాపనికి వెఱచె - అంత నేతత్కవి యొక పావులా యిచ్చి వానితప్పెటం బడసి తనచంకం దాల్చి మొరయించుచు వాదవాదలం బన్నుసమ్మె నెఱుకపఱిచె-ఈచాటువ హేతువుగా నితఁ దధికారుల యలుకకుం గుఱియై శిక్షితుఁ డాయె. 388

ఆ. కాఁపు లిట్టులుండఁ గరణాలు మున్సబుల్, ద్రోచి రపుదు తెల్లరాచకొలువు
రామమూర్తి మాచిరాద్వంశ్యగణకుఁ డీ, బలిమి గూర్చె నేఁటిబవరమునకు. 389

మధ్యా. అరినిచ్చు హలికుఁ డిమ్మనుచు సైరికు నడిగెడిగణకుఁ
దరరె! గుంటూరిమండలమునం దొకఁడైనను లేఁడ!
దురమున కాయువుపట్టుగా సంస్తుతు ల్గనుచున్న
ధర, పెదనందిపాడు కలఁచె రిపుల దర్పితమతుల. 390

క. పెదనందిపాటిపే రపు, దదిరా! మదరాసుదొరల హస్తినతేండ్లన్
బెదరించుటె కాదు బదా, బదలొనరిచె సీమనున్న ప్రభువులగుండెన్. 391

చ. తెఁగబడె భారతోర్వి యిఁక దీని నెదుర్కొని యేలుటెట్టు లీ
జగ మనఁ జిన్నదా కదువిశాలము; నల్వదికోట్లమానవుల్
నెగడుదు రిందు వీరిపుడె నిద్రనువీడిరి వీరిబీరమున్
బ్రగతియు సైఁపరాని వని వందురి రాంగ్లమహీమహారథుల్. 392

ఉ. ఐనను రాజ్యలోభము నహంకృతియున్ బెదవారి కీద్వ వా
రేనెఱినైనఁ గాంగిరెసునే పణఁగించుట కర్జ మంచు ధి
ల్లీనృపు నెచ్చరించి రవలేపము పింపిసలాడ వేనవేల్
సైనికు లప్డు దూఁకి రనిసాగెడిచోటికి నందిపాటికిన్. 393

క. తమయెక్కినహయముల పు, చ్ఛములకు ముడివెట్టి శాంతిసైనికులఁ బశు
త్వము పొంగ వార లీడ్చిరి, యమదండము లెత్తి ప్రజల నణఁచిరి పెలుచన్. 394

ఆ. ప్రళయతాండవమ్ము పరఁగించి రూరూర, శిస్తు లిండటంచుఁగస్తిగూర్చి
రాల నెడ్ల విప్పి రేలమువేయఁగాఁ, బాదువారు లేక పల్లటిలిరి. 395

ఆ. ఆత్మబలము చాల కైదుగురే నూటి, కిచ్చి రపుదు పన్ను; లిది యపూర్వ
జయము ప్రజ, కపూర్వజయ మహింసకు నని, కొసరి మెచ్చి రెల్లదెసలవారు. 396

వ. అయ్యవసరంబున గుంటూరిసీమయందలి పరిస్థితులం బరికింప నేతెంచినకాంగ్రెసు ప్రముఖు లీమండలమువారు సామూహికశాసనోల్లంఘనము నాఁపి పన్నులుచెల్లింపఁ దగు నన్ననివేదికం బ్రకటించిరి - గర్తపురాంధ్రుల కీతీర్పుతోఁ గాలుసేతులు చల్లపడియె - మున్ను (5-11-21) ఢిల్లీలో సమావేశమయిన కాంగ్రెసుకార్యవర్గము పన్నుల నిరాకరించు టాదిగాఁగల శాసనోల్లంఘనకార్యములకుఁ గడంగువారు 397

సీ. పెఱునేలపుట్టమున్ విదనాడి ఖద్దరు, వలువఁ బాటించి నూల్వడుకవలయు
హిందువుల్ ముస్లిము లేకోదరులరీతి, నడుచుట మేలని నమ్మవలయు
మనుజులందఱ నంటుకొనవచ్చు ననుపాడి, వెడలింపవలయు మన్గడనుబట్టి
ప్రజలవిత్తమ్ముతో బ్రదుకఁ జూడక తమ, మోపునెల్లను దామె మోయవలయు
సత్యమున కహింస కత్యంతముగ లొంగ, వలయు ననుట నిట్లు వచ్చెఁ దీర్పు
ముఖ్యకారణంబు మొన్న చౌరీచౌర, దుదుకుఁ జూచి గురుఁడు ధుఃఖపడుట. 398

క. తానే ప్రజ యని ప్రజయే, తా నని మదినమ్మి యస్వతంత్రత నణఁపన్
నానాశ్రమమ్ము లీకొను, సేనాపతి విన్నఁబాటుచే నిటులయ్యెన్. 399

## శాసనోల్లంఘన మాఁగుటచే దేశము కలఁగుట

క. రణభేరీధ్వని తగ్గక, మునుపే సమరమ్ము నిలిచిపోవుటకతనన్
వినరానివార్తయై యిది, జనులన్ గలఁగించెఁ దీవ్రసంతాపకమై. 400

క. ఆశాభంగముపాలై, దేశీయులు దద్దఱిల్లి ధీ తొట్రుపడన్
దేశికునితీర్పు త ప్పని, యాశూక్తులు విసరసాగి రావేశమునన్. 401

సీ. చెఱనున్న మోతిలాల్ కొఱకొఱలాడుచుఁ, గన్యాకుమారిచెంగట నహింస
యొకయూర లేదని యుద్రేకపడి మంచుఁ, గొందనెత్తమ్మున నుందుపురిని
దండింపవచ్చునా ధర్మువున్ గనని చౌ, రీచౌర నవలికిఁ ద్రోచివైచి
తక్కినసువిశాలధరణి భారతమున, శాసనోల్లంఘనసమర మేల
నడుపరా దని పెద్దగ్రంథమునుబోని, లేఖనంపెను గాంధి; కాలీల వ్రాసె
లజపతియు నౌర! యెంతయక్కజము! గాంధి, ననుసరించు దేశాయియునట్లె తెలిపె. 402

ఉ. ఎందఱుపెద్ద లప్డు తను నెవ్విధి దూఱిన నించుకేనియుం
గుందక బందెలోఁ గుదురుకొన్న నరుల్ మృతకల్పు లీప్రజా
బృందముమేలుగీల్ల వివరించుట కర్హులుగారు వారు నా
కందినసత్య మిట్టిదని యాడె మహాత్ముఁడు నిర్భయమ్ముగన్. 403

వ. ఆవెంటన (24-2-1922) హస్తినయం దన్నారియింట నడిచిన కాంగ్రెసు సభ్యులగోష్ఠిలో నలుమూలలనుండియుఁ దీవ్రవిమర్శనము లాసర్వసేనాపతిపై రేఁగె-వంగరాష్ట్ర ప్రతినిధు లీనాఁ డెంతయుం దెగిరి - హరదయాల్నాగువంటి భక్తుఁడు సైతము గాంధిని దూయఁ బట్టె - ఇఁక మూంజీగంతుల కాయోలగమెల్ల నూటాడె - అతఁ డాసభన్ మహాత్మునిపయి విశ్వాసరాహిత్య నిర్ణయమే ప్రతిపాదించె. 404

ఉ. ఆతనితీరు పెద్ద కొనియాడుచుఁ గొంద ఱుపన్యసించి రా
రీతి నికృష్ట మంచు నెదిరింపఁ గడంగినవారికిన్ గురుం
డీతెఱఁ గేల మానుఁ దనియెన్ దుదకున్ సభ నూటికిద్దఱే
చేతులనెత్తినా రపుడు చెన్నఁటితీర్పున కియ్యసేయుచున్. 405

గీ. వలదుపొమ్మని మూంజి నిప్పులనుగ్రక్క, నించుకయు డిందువడఁడు, నీవే శరణ్యుఁ
దవు ప్రభూ! యని సభ మెచ్చ నవుర! పొంగఁ, దపుదునిపుదునుగాంధిమహాచలంబె. 406

వ. కాంగ్రెసుకార్యవర్గమువారు బార్డోలిలోఁ (12-2-22) గావించిన సమష్టిశాసనోల్లంఘన విరమ ణాదినిర్ణయము లన్నియు నీసదస్సున నంగీకృతము లాయె - కాని కొన్ని కఠోరనియమముల కగ్గపడి కొందఱు వైయక్తికశాసనతిరస్కృతి యొనర్పవచ్చు ననియు నొకతీర్మాన మేర్పడె - ఇది యిరువాగువారికిం గొంతయూఱట నొదవించె - మఱియు సామూహికశాసనధిక్కారమును గాంగ్రెసువా రాఁపుటంజేసి నేఁడు దొరతనమువారు మనశ్శాంతి నంది గాంధి నిఁక నిర్బంధింపవచ్చు నని నిశ్చయించిరి - తన సమర వైముఖ్యమును సమర్థించుచు మహాత్ముఁ డానాఁ డిట్లు వక్కాణించె. 407

ఆ. శాంతి లేనినాఁడు సాగదు నాబంది, దాంతి లేనినాఁడు తరలఁజాల
దస్మదీయసేన కస్త్రంబగు నహింస, కవచ మగును సత్యగౌరవంబు. 408

ఆ. నరునిగొప్పతనమున కతండు తనచేయు, తప్పు నొప్పుకొనుట తగినగుర్తు
చిత్తశుద్ధి గూర్చు చీఁపురుకట్టఁగా, మానసింతు నిరభిమానవిధిని. 409

చ. అరమరలేక యిట్లు గురుఁ డాత్మపరీక్షకు సాగ నూబిలో
నితికెను గాంధి యింకఁ దలయెత్తఁ డితం డని నమ్మి యేలువా
రురక కిరాతచర్యలకు నొగ్గిరి కాంగ్రెసువారిఁ గొట్టుచున్
జెఱలకుఁ ద్రోయుచున్ గెలుపు చేపడెలే! యని పొంగి రెంతయున్. 410

ఆ. దేశికుండు వారి పాశవసంరంభ, మెఱిఁగి దొరలు నెత్రుటేర్లుపఱప
వచ్చుఁగాక నేను వణఁకను భారత, ప్రజలు వణఁక రిట్టిపాట్ల కనియె. 411

ఉ. జంకక గాంధి యిట్లు తనచందము చాట రవంతయే నెదన్
గొంకక రాచవా రితనిగొప్పతనం బదఁగారె వీనికిన్
వంకలుసెప్పువారు నలువైపుల నేర్పడి రంచు నజ్ఞతా
పంకిలబుద్ధి నెంచి పనుపన్ దలపోసిరి బంది కాప్రభున్. 412

## మహాత్ముండు తన్నుంబట్టినపుడు ప్రజ లుండందగిన తీరు తెల్పుట

క. త న్నేలిక లరికట్టెద, రన్న సమాచారమును మహాత్ముఁ డెఱింగెన్
మిన్ను తెగి మీఁదఁబడినను, జెన్నఁటిచెయిదములు ప్రజలు! సేయకుఁ డనియెన్.413

క. చౌరీచౌరాదుండగ, మారసి బార్డోలిసమర మాఁపితి హింసా
దూరస్థితి యేర్పడుచో, నారంభించెదను విడువ నాలము ననియెన్. 414

ఆ. శాంతినాశ్రయించి శాసనాతిక్రాంతి, సలుపుహక్కు మనకుఁ గలదు దొరలు
నీతిబాహ్య మిట్టిచేఁత నా నది యాత్మ, హత్య కంగవింపుఁ డనుట యనియె. 415

క. హింసామయవిప్లవముఁ బ్ర, శంసించెదు తెల్లవారు శాంతియుతం బ
వ్యంసకమగు కయ్యము నభి, శంసించెద రింతతెగువ చనునే యనియెన్. 416

ఉ. భారతభూమియందు ననుఁ బట్టినపిమ్మట నెట్టిదూషితా
చారము లెట్టిహత్య లెట సాగినఁ గ్రుంగెద నేను, దుష్క్రియల్
మీఱిన రాచవారి కవి మేలు గదించునుగాని మీకు దు
ర్వారవిపత్తిగూర్చు నని వల్కెఁ జమూపతి సత్యదర్శియై. 417

గీ. ఆశుగతిని నిర్మాణకార్యక్రమంబు, సాగుకైవడి మీర్ కృషి సల్పవలయు
నన్ను నాతోడఁ జెఱసాల నున్నవారి, నపుడ విడిచెద రధికారు లనియె గాంధి. 418

ఆ. మనస్స్వరాజ్యసౌధమునకు నహింసయు, నంటరానితనము గెంటుటయును
సర్వమతములందు సౌహార్దమును రహా, టాంబరమును నిట్ట లని వచించె. 419

ఉ. మీ కిపు డేను దవ్వయిన మీరు యథావిధి మాతృదాస్యని
ర్మోకకరక్రియానిరతి ముంగడ కేగి నిన్నినాళ్లు నా
వాకున కుబ్బికాక తెలవారలయేల్బడి కల్గియే ననున్
జేకొనినా రటంచు దరిసింతురు సత్యము నెల్లవా రనెన్. 420

ఆ. అపుడు మీస్వతంత్రతాసక్తి మీనేర్పు, బయలుమెఱయు, నపుడు భారతోర్వి
నేలఁదగినయోగ మిఁక లేదు మన కని, ప్రభుతవారు చల్లఁబడుదు రనియె. 421

క. అది మార్చిన్ బదియవదిన, మది నిశఁ బదిగంటలైనయద నది పడవాల్
కుదురుకొనినట్టి యాశ్రమ, మది పుణ్యసబర్మతీ తటాంచన్మహియున్. 422

క. నానాదేశాగతలే, ఖానిచయమ్మునకు మాఱుఁగమ్మలు వ్రాయం
బూనెను మహాత్ముఁ దత్తఱి, మే నలసిననేమి విశ్రమింపఁడ లవమున్. 423

## మహాత్ముని దొరతనమువారు నిర్బంధించుట

గీ. వచ్చె లగ్నము పోలీసువారు కదిసి, రా(శమక్షోణి; కపుడు మహాత్ముపాలి
కరిగియొకc దంజలిఘటించి యయ్య! మిమ్ముc.బట్టనేతెంచితిమి సిద్ధపడుcడియనియె. 424

ఆ. వలసినంతతడవు వాడుకోవచ్చు మీ, రదియు నిదియు దిద్ద ననియె భటుcడు
జాగదేల యనుచు సాగె యోగేశ్వరుc, దాస్యవీధి మందహాస మొలయ. 425

ఉ. అయెద గాంధి కెంతయుc (బియంబగు వైష్ణవగేయమున్ గదుం
దీయcగc బాడి రా(శమసతీమణు; లచ్చటివారిమోములన్
మాయురె! దుఃఖచిహ్న మణుమా(తయుc గన్పదదాయె; నౌ; నుపా
ధ్యాయునిబట్టి శిష్యసముదాయముచందము లుందునేకదా! 426

## వైష్ణవగేయము

(నరసీమెహతా - "వైష్ణవజనతో" అను గుజరీకీర్తన కనువాదము)

వాcడే వైష్ణవుc దని పలుకందగు, వాcడే వలయును జగమునకు
ఇతరజీవులను బాధించెడువెత, లెఱిcగి జాలిపడువాc దెవcడో
ఒరులదుఃఖములc దీర్చినపిమ్మట, గరువము నందనివాc దెవcడో
అణcకువతో (బజ కంజలిసేయుచు, నన్యుల దూఱనివాc దెవcడో
తలcపు పల్కు పని యొకటై తల్లికి, ధన్యత గూర్చినవాc దెవcడో
సమతనంది యాశలు విడి పరసతి, జననిగ నెంచినవాc దెవcడో
దబ్బఱలాడక లాcతివారిసిరి తాcకక నిల్చినవాc దెవcడో
మాయామోహము లణcగి విరాగము మదిలో నిండినవాc దెవcడో
తెలిసిరాముపే ర్వినివిని తనువే తీర్థము చేసినవాc దెవcడో
కపటము లోభము కామము (క్రోధము కదచి మెలంగెడివాc దెవcడో
కన్నవారి తరతరములపాపము కాల్చివేయcగలవాc దెవcడో
మేలు! మేలు! సేబా! సని నరసీమెహతా మెచ్చినవాc దెవcడో
వాడేవైష్ణవుcదని....... 427

ఆ. బాపు వెలువరించుప(త్రిక 'యంగిండి, యాసమాఖ్య నలరు నాంగ్లభాష,
దీని నచ్చువేయు ధీనిధియు నిబద్ధుc, దాయె శంకరుcదు మహాత్ముతోద. 428

శా. వందేమాతర మన్న మంజురవ మావాదన్ సమస్తాశలన్
(గందిల్లన్ సరకారుకారు నడచెన్ గారాగృహక్షోణి కా
బందిన్ గాలముపుచ్చె మున్ తిలకు; తద్భాగ్యం బ దేపాటిదో
బందాయయ్యెను దాన నేcడు సుకృత(ప్రాసాదమౌ గాంధియున్. 429

ఆ. అది సబర్మతీమహాపగయొద్దన, నుంట నిట్టిపేర్మి నొందెనేమొ
పూజనీయుఁడైన పురుషున కాతిథ్య, మిదినతావు కీర్తివిదనిరావు. 430

వ. తనవెంట వచ్చిన యాశ్రమవాసులను వీడ్కొలుపుమహాత్ముఁడు "సోదరీసోదరులు! నిర్వి రామమ్ముగాఁ గర్తవ్యము లాచరింపుఁడు-నా కిట్లు విశ్రాంతి చిక్కె నని సంతసింపుఁడు - న న్నేలుబడివారు శిక్షించుటంజేసి మనయుద్యమమునకు లగ్గువాటిల్లు నని నమ్ముఁడు-మన కడ్డువచ్చువారిపట్ల సద్భావముం జూపుఁడు - నమ్రతంబాయకుఁడు - మన యహింస ధీరు లాదరించుసుగుణం బని మీమనుగడంబట్టి చాటుఁడు - అది సర్వ మతము లంగీకరించిన పరిశుద్ధప్రేమ మని భావింపుఁడు - దానిముం దెట్టిమంటలేని చల్లాఱు నని యెంతబాహాబలంబైన నుడిపోవు నని యెఱుంగుఁడు - దానం బడయు స్వరాజ్యము చిరకాలము నిల్చు నని గుర్తింపుఁడు - త్రికరణశుద్ధి పాటింపుఁడు-" నవి వారికిన్ వలయుహితమ్ములుపల్కి తనభక్తుఁడగు శంకరలాలుతోఁ జెఱసాల నధివసించి యాయైపెద్దలకు వలయుకమ్మలు వ్రాసికొనుచుండె - అంత మార్చి - పదునెన్మిదవదినమ్మున (1922) 431

గీ. అహమదాబాదుకోర్టునయందు గాంధి, యాచరించిన నేరము లరసి యరసి
శిక్షసెప్పఁగ నధికృతుల్ సిద్ధపడిరి, దారిదప్పిన ధర్మశాస్త్రమును బట్టి. 432

ఉ. చిక్కినమేనితో నెదఁదచేవను జాటు గభీరదృష్టితోఁ
జక్కనినవ్వుతో మొలకుఁ జాలియుఁజాలని మోటవల్వతో
మక్కువఁ దన్నుఁగొల్చు బలుమానిసి శంకరులాలుతోఁ బ్రజల్
మ్రొక్కుచు నిల్వఁగా నడుగుమోపె మహాత్ముఁడు పాడిపట్టునన్. 433

ఆ. న్యాయమూర్తి మన్ననయొనర్చి బాపున, కుచితమైన పీఠ మొసఁగె నపుడు
గాంధి కెడమదెసను గస్తూరి కూర్చుండఁ, గుడిని శంకరుండు కూరుచుండె. 434

వ. న్యాయస్థానమున విఠల్‌భాయిపటేలు, జవహర్‌లాలునెహ్రూ, ప్రకాశముపంతులు, మదన మోహనమాలవ్యా, సరోజినీనాయఁడు, సరళాదేవిచౌదరాణి మున్నగు నుత్తమశ్రేణికిఁ జెందిన కాంగ్రెసువా రెందఱో యుపవిష్టులై యుండిరి - రక్షకభటుల యాడంబర మగ్గలముగా నుండె - అయ్యవసరంబున "రాజభక్తిని భగ్నమొనరించుట, సమస్య - దాని పరిష్కారము, సింగపుజూలు గుంజుట" యను మేలుబంతులతో రాజద్రోహకరము లగు వ్యాసములను యంగిండియా పత్రికలో వ్రాసిన గాంధియు, వాని నచ్చొత్తించిన శంకరలాలును జట్టమునుబట్టి దోషు లని న్యాయమూర్తి తన నిర్ణయముం బ్రకటింప నిందితులిర్వురుం దమపై మోపిన నేరమున కియ్యకోలు తెల్పిరి - మహాత్ముఁ డపుడు పాడిపట్టునకై వ్రాసియిచ్చిన వాఙ్మూలము లోకోత్తరము నాఁ దగినది - దానికి మున్నుడిగా నతఁడు పల్కిన పల్కులు ముల్కులం బోనివి - వాని నించుక వివరింతు. 435

## మహాత్ముని వాఙ్మూలము

ఆ. ఔను! ధర్మమూర్తి! యేను రాజద్రోహ, బోద్ధ ననుట సత్యబద్ధవార్త
యిపుడె కాదు ప్రజల కీపార మర్థిమైఁ, బెక్కునాళ్ళనుండి వక్కణింతు. 436

గీ. నిప్పుతోఁ జెరలాట మీచొ ప్పటంచు, నెఱుఁగుదును గాని సేయుదు నిది వరించి
యిపుడున న్నీవు వదలిన నిదె యొనర్తు, నన్యము నొనర్తునా దోషినగుదు నపుడు.437

క. నామత మిది నానమ్మక, మీమాదిరి దస్మదీయ మేపని నైనన్
నేమించుట కధికారము, నామదికే కలదు పిన్ననాఁటంగోలెన్. 438

ఉ. నాపలు కాదరించినజనం బపుడప్డు వివేకదూరమై
పాపపుఁగార్యముల్ సలిపి ప్రాణుల కెగ్గొనరించె దీని నే
సైఁపఁగలేక సిగ్గున విషాదమునం బడి క్రుంగుచుండు నీ
లోపము నాదిగాఁ దలఁచి లోఁగెద నెంతటిశిక్షకేనియున్. 439

ఆ. కనికరించి నన్నుఁగావుము మన్నింపు, మల్పశిక్షసెప్పు మనుచు నిన్నుఁ
గోరనొల్ల నీవు కొంకువీడి విధింపఁ, దగును నాకుఁ గఠినదండనంబు. 440

ఉ. నాయొనరించునట్టిపని నామది మేలని మెచ్చుఁగాని యాం
గ్లేయులధర్మశాస్త్ర మిది కేవలదోష మటంచుఁ బల్కు నీ
వీయెడ నాదునిర్ణయము నియ్యకొనం దగుదారి లేదు, నీ
న్యాయము నాశ్రయింపవలె నాకధికాధికశిక్ష నీవలెన్. 441

ఆ. ఇంగిలీసువారిస్మృతియు వారిప్రభుత్వ, పద్ధతులును బ్రజలబాగుకొఱకె
యొదవె ననుచు నీవు మది నెంతువేని నన్, శిక్షసేయవలయు రూక్షముగను. 442

గీ. ఈపనికి నీమనం బొప్పదేని విడుచు, టుచిత మధికార మిపుడె, నీకున్న తెరువు
లన్న! యివి రెండె కాని నీవస్మదీయ, సరణి కేతెంతు వని నమ్మఁజాల నేను. 443

గీ. ఏల నే నింతలోఁతున కేగవలసి, వచ్చె నామది నెట్టిభావములు గుములు
గుములుగా నిట్ట వొడిచె నీగుట్టు సకల, మెఱుఁగఁగలవు నావాఙ్మూలమెల్లముగియ.444

ఆ. కోరికోరి తెచ్చుకొన్న తీఱమి నాది, వలచి తెచ్చుకొన్న యలఁత నాది
మాతృదేశభక్తి మరగినధీమంతు, లెల్లవారు వీని నిచ్చగింత్రు". 445

వ. ఇ ట్లుపోద్ఘాతము ముగించి బాపూ తన వ్రాసిన వాఙ్మూలము నివ్విధింజదివె. 446

క. "ఈయభియోగముపట్ల మ, దీయమహీప్రజల కాంగ్లదేశీయుల కా
ప్యాయనము గూర్పువివరణ, మీయందగు నేను సత్యహితవాక్యములన్. 447

గీ. రాజభక్తికి మూదల నాఁ జెలంగి, రాచతికమున కండనా రాణకెక్కి
యేను నేఁడు రాజద్రోహ మేల పూనఁ, దెగితినో దానిహేతువు తెల్పవలయు. 448

గీ. అస్మదీయప్రజాసేవ యాఫ్రికాధ, రిత్రి నారంభమయ్యెఁ; బరిస్థితులు త
దుర్విలో విటతటముగా నుండె నపుడు, వికృతవికృతశాసనము లావిర్భవించి. 449

గీ. భారతోర్విని బుట్టిన కారణమున, నాకుఁ గఱవయ్యె నచట మానవునిహక్కు
లైన నమ్మహిఁ బాలించునట్టి తెల్ల, వారి దూఱక యోర్మిని వదలకుంటి. 450

క. ఉత్తమపరిపాలన కా, యత్తములై యున్న సీమలందును మావా
రిత్తెఱఁగున నవమతి కా, పత్తికిఁ బాలగుటఁ దలఁచి పడసితిఁ దాల్మిన్. 451

గీ. ఇచ్చమై దక్షిణాఫ్రికా యేలుబడికి, నపుడు సాయమొనర్పఁగా నాసపడితి
సరసముగ దానితప్పుల నొరయ నెంచి, నాఁడఁ గాని తన్నాశము వేఁడనైతి. 452

గీ. ఈ దొరతనమ్మువారల కెదురుదిరిగి, బోయరులు కత్తిదూసి యజేయు లైన
సమయమునయందు స్వచ్ఛందసైనికులను, భారతీయులఁ గూర్చి నేర్పారఁ దీర్చి. 453

క. క్షతగాత్రులైన యోధుల, వెత లణఁపం బాటువడితి, వెండియు జూలూ
లు తెగించినపుడుసైతము, బ్రతికించితి గాయపడినభటులను సేవన్. (1906) 454

ఉ. ఆలము లావహిల్లి తమ కాపద లేచినపట్ల నేనిటుల్
పోలినసేవ చేయఁ గడుఁ బొంగి బలా! యని దక్షిణాఫ్రికా
నేలెడివారు నాకు మెఱుఁగెక్కిన మేల్పతకమ్ము లిచ్చి నా
శీలము వర్ణనీయ మని సీమకు లేఖలు పంపి రత్తఱిన్. 455

క. ఈ యూడిగ మిచ్చటి వై, స్రాయికి హార్డింజికిని గరం బాశ్చర్యం
బాయెను గాన నతం డా, ప్యాయితుఁడై నాకుఁ గనకపదకము నొసఁగెన్. 456
(కైయిజరీ హింద్ పతకము)

చ. సకలజగమ్ము బెగ్గడిల జర్మనువారికి నింగిలీసువా
రికిని రణంబు సాగినతఱిన్ బ్రభుభక్తికి లోఁగి యేను వి
ద్యకుఁ జనుదెంచి యాంగ్లవసుధన్ వసియించెడికోడెగాంధ్ర మా
మకమహివారిఁ గూర్చితిని బ్రమగ్గెడిబంట్లకు లగ్గుగూర్పఁగన్. (1914) 457

ఉ. ఆవల ఛేమ్సుఫర్డుదొర హస్తినయం దొకగోష్ఠిఁగూర్చి కీ
డావహిలెన్ బ్రభుత్వమున కాఱనిమంటగ సాగు సంగరం
బీవెత దాఁటఁ బోటుమగ లిత్తఱి వేలకొలంది కావలెన్
గావునఁ బెద్దలార! సమకట్టి దళమ్ములఁ గూర్పుఁడా! యనెన్. (27-4-18) 458

ఉ. ఆసభ నేను నుంటి నతఁ డాడినమాటల కియ్యకొంటి న
న్నాసమయంబునన్ నలంచునామయమున్ గణియింపఁబోక “ఖే
దా”సకలమ్ము క్రుమ్మరి దదమ్ములఁ గూర్చితి గెల్చినంతనే
మాసరకా రొసంగెదరు మాకు స్వరాజ్య మటంచు నమ్మితిన్. 459

ఆ. ఆఁగిపోయె బవర, మాంగ్లేయులను వరి, యించె విజయలక్ష్మి, ‘మంచి’దనుచు
భారతీయు లుబ్బినారు గాని తదీయ, వాంఛితమ్ములెల్ల వట్టిపోయె. 460

క. పిట్టపిడు గనఁగ రౌలటు, చట్టము రూపెత్తి ప్రజలస్వాతంత్ర్యమునాఁ
కట్టె నడంగె మదాశలు, ముట్టిన దీఫలము నాకు మొదటిది యగుచున్. 461

క. ఈశాసనంబు తగ దని, దేశమ్మునఁ దిరిగి తిరిగి తెల్పఁ దొడఁగితిన్
నాశక్తికొలఁదిఁ బెనఁగితి, ధీశరధులయండ వదసితిని నల్దిశలన్. 462

క. అవెన్కను జలియన్వా, లావనమున సాగె నగ్గలంబుగ హత్యల్,
హోవడుల కపుడు పాంచా, లావని కుదురయ్యె దయ్యరాదులకతనన్. 463

ఉ. కట్టిఁడిసైనికుల్ చెనఁటికంకరబాటలపైఁ బ్రజావళుల్
పొట్టలతోడఁ బ్రాఁకఁ బనుపుల్ వెడలించిరి పౌరముఖ్యులన్
గట్టి కశాహతిన్ మిగులఁ గాతియపెట్టిరి చెప్పరానియి
క్కట్టు లవజ్ఞలుం బఱపి కాంతల నేఁచిరి ఱాచి రమ్మహిన్. 464

ఆ. మఱియు బ్రిటనుమంత్రిమౌళి టర్కీపట్ల, నెగ్గుసేయ ననుచు నిచటిముస్లి
ములకు మాటయిచ్చి నిలఁబెట్టుకొనమియుఁ, దెలిసికొంటి నెదఁద కలఁతనంద. 465

వ. ఇన్ని యవకతవక లేర్పడి నాచెలికాండ్రు న న్నెంతవారించినం గాదని యమృతసరమునఁ గూడిన (1919) కాంగ్రెసుమహాసభలో భారతీయులు నేఁటిసంస్కరణముల నీకొని యేలుబడివారికిఁ దోడ్పడవలయు నని పట్టుపట్టితిని - ఇంగ్లండు దొరతనమువారు భారతోర్వింగల ముస్లిముల కొనర్చినవాగ్దానము చెల్లింతురనియుఁ బాంచాలమువారి మానసికవ్రణముల మానింతురనియు నమ్మితిని - రాజ్యాంగ సంస్కరణము లొడఁ గూర్చుమేలు గణింపరానిదైనను దేశీయరాజకీయ జీవనమునం దాశాజనకమగు నవ శకమున కవి హేతువగు నని తలంచితిని - కాని 466

ఆ. దొరతనమ్మువారు నెతిదప్పి దయ్యరు, సలిపినట్టిహింసఁ జులుకఁజేసి
రాదరంబు నొసఁగరైరి ఖలీఫాకు, నస్మదాశలెల్ల నడఁగిమడఁగ. 467

ఉ. ఇంతియకాక పల్లియల హెచ్చుచునున్నది లేమి; పేద కా
వంతయు శాంతిలే; దతనియాఁకటిమంటలు రేఁగిరేఁగి పెన్
గంతులువేయ సాగినవి; కష్టము వానిదియై సుఖంబు దే
శాంతరవర్తకావళిది యయ్యెఁ గనం దతఁ డీబవంతమున్. 468

ఆ. ఈ ధరిత్రి నేలు నింగ్లీషువారును, లాంతినేలబేరి లగ్గకొఱకె
సాయపడుదు రన్నసంగతి నెఱుంగఁ డీ, కూడుగుడ్డలేని కూలివాఁడు. 469

చ. ఎముకలగూఁడులై బ్రదుకు నీడువలేక తపించుదీను లీ
క్షమ నెటకేగి చూచినను గన్పడుచుండఁగ భారతీయభా
గ్యము వికసించె నంచు నధికారులు చూపెడిలెక్క లేల వా
దములవి యేల మాకు, నయధార్థనివేదనముల్ వృథావృథల్. 470

ఉ. ఎన్నఁడు నేప్రభుత్వమున నిట్టియధర్మము లేమి నిక్క మీ
పెన్నపరాధమున్గుఱిచి వేలుపుముంగడ నాంగిలేయు, లా
యన్నలఁగొల్చి యిందు మనునట్టిపురప్రజ లుత్తరంబు నీ
య న్నిలువంబడన్వలయు నాగము లూరక నాసిరిల్లునే? 471

క. పరదేశవణిగ్గణ మీ, ధర బేరమొనర్చి మేరదప్పిన ఫలముల్
దొఱయుటకుఁ దగినశాసన, పరంపర సృజించి రేలుబడివా రిచటన్. 472

ఆ. దండుచట్ట మందదండగాఁ బాంచాల, ధరణి నరసినట్టితప్పిదముల
కిడినశిక్షలందు నెన్నిధర్మ్యంబులు, కలవు? నూటికైదు కలవొ లేవొ. 473

సీ. రాజకీయమహాపరాధులు వీరని, యేలెడివార లీనేల నెంద
ఱెందఱకో విధియించిరి శిక్షలు, శిక్షితులందుఁ బరీక్షసేయ
నేయపరాధంబు నెఱుఁగని సాధువుల్, వందకుఁ దొంబదిమంది కలరు
తమమాతృభూమిపై మమతచూపుట కాక, వీరు కావించిననేర మేమి?
భారతీయులకును దెల్లవారలకును, వచ్చుతగవుల నిచ్చటివారి కెంత
ముట్టుచున్నది న్యాయంబు? కట్ట! పాడి, పట్టునకుఁ జెల్లునా పక్షపాతసరణి. 474

గీ. ఇట్టిదురితమ్మునకుఁ దామె హేతువగుట, యెఱుఁగ రీనేల నేలెడిదొరలు, వారి
కొలువునందున్న భారతీయులును గాన, రెంతదురదృష్ట మిది! బలా! యెంతవింత! 475

క. ఈదొర లీయుద్యోగులు, నీధర నాంగ్లేయరాజ్యమే మేలని తా
మాదట దానిం గొలుచుట, యాదరణీయమగు సేవ యని చిత్తమునన్. 476

గీ. విశ్వసింతురు; వెండియు వీర లాంగ్ల, పాలనమ్మున భారతప్రజకు మెల్ల
మెల్లగా నభ్యుదయ మావహిల్లుచున్న, దనియు నమ్మెద రదిర! యే మనెద వీరి. 477

ఆ. పశుతనూఁది హింసపఱిపి పాలితులకు, నులుకు గూర్చుఁ బ్రభుత యొక్కవంక
నాత్మరక్షణార్థ మసిపట్టనీయక, చిక్కుగూర్చు వారి కొక్కవంక. 478

గీ. ఈకతమ్మునఁ బ్రజలు నోరెత్తలేక, యణఁగి పడియుండఁ బాలకులైనవారి
మొఱకుఁదన మాత్మవంచనమును గొలంది, పెట్టరానివై దేశమున్ బెద్ద నొంచె. 479

వ. నా యదృష్టముపండి హిందూదేశశిక్షాస్మృతిలో నెన్నఁదగిన నూటయిర్వదినాల్గవసూత్రపు మొదటిభాగ మాదరువుగా నాపై నభియోగము విధింపఁబడియె - ఈ చట్టము దేశీయుల జన్మస్వతంత్రత నడ్డగింపం బొడమె - శాసనమునం బ్రేమమొదవదు - మానవుఁడు తన కొకనిపై ననురాగములేనినాఁ డాలేమిని బ్రశాంతసరణిం బ్రకటించుచనవు కల వాఁడై యుంట వలయు - న్యాయ మిట్లున్నను నేను శంకరలాలును రాచతికముపై రాగరాహిత్యమును బ్రేరించితి మనియు నది కూడనిపని యనియుఁ గాన మే మపరాధుల మనియు నధికారులు నిశ్చయించిరి - ఇట్టి యపరాధులపట్టికలో సడిసన్న దేశభక్తు లెందఱో కలరు - వారిపై మోపిన నేరము నాపై మోపుట నన్ను సమ్మానించుట యని తలంతు - మఱియు 480

గీ. ప్రభుతసాగించు నధికారిపట్ల నెపుడు, నేను వైయక్తికద్వేష మూను టెఱుఁగ
నిఁక మహీపతిపట్ల నా కీర్ష్యపూనఁ, దగినయక్కఱ లేదుకదా రవంత. 481

ఉ. ఈపజ నెందఱోనృపతు లేలిరి వేలతరాలనుండి, తద్
భూపతు లెవ్వ రీకొనని పోలనియేల్బడి నేఁడు వచ్చె; నీ
పాపనిశాంతమైన పరిపాలన కర్మిలి చూపఁజాల; నీ
చూపమి సద్గుణంబ యనుచున్ వినుచున్ మది నాది నిచ్చలున్. 482

గీ. కొఱవడియెఁ జెల్లరే! నేఁటిదొరతనమునఁ, బాలితులమానవత్వ మీభారతోర్వి;
నిట్టినమ్మిక యున్న నే నీప్రభుత్వ, సరణి మెచ్చుట పరమదోషముగ నెంతు. 483

క. నాదుండగమున కియ్యెడ, మూదలగా నిడినవ్యాసముల బ్రాఁతకు స
మ్మోదము నందెద నతివే, లాదరమును గంటి దీన నని భావింతున్. 484

ఆ. ఆంగ్లభూమి భారతావని పెడదారి, పట్టె నేఁడు వీనిబాగుకొఱక
యేర్పరించినాఁడ నే నసహాయమ, హోద్యమంబు శాంతియుతపథంబు. 485

క. మంచిపనికి సాయం బొన, రించుట కర్తవ్యమైనరీతి నొరులఁ గా
రించుపని కుపకరింపమి, యెంచందగినట్టి చేఁతయే యగునందున్. 486

సీ. దౌర్జన్యసహితమై తనరు సాహాయ్యని, రాకరణంబు దుర్జనుని పట్లఁ
బఱుపుట యిందాఁకఁ బరిపాటియైనచం, దమును దెల్పును జరిత్రము సమస్త;
మీప్రయోగము కూడ దిది దుష్టదౌష్ట్యంబు, నెచ్చుసేయునుగాని లొచ్చుపఱుప
దీసత్య మస్మన్మహీప్రజాకోటికిఁ, దెల్ల మొనర్ప యత్నింతు నేను
హింస నణఁచివైవ నెంచినవానికి, హింసతోడిపొ త్తొకింత చనదు
హింసకునకు సాయ మీయమి కతముగా, ముట్టుశిక్ష నతఁడు మోయవలయు. 487

వ. అహింసాసిద్ధాంతమున కీ సైరణ ప్రాణమువంటిది - కావున నో న్యాయాధికారీ! శిక్షా స్మృతింబట్టి యెఱిఁగియెఱిఁగి చేసిన పెనుదోసముగా, నాదృష్టింబట్టి యుత్తమ పౌర

ధర్మముగాఁ దోఁచు నా నేరమునకు వీలైనంత తీవ్రశిక్ష విధింపుమని నిన్ను వేఁడెద - నీకు నేఁ డీ యభియోగమును సమీక్షింప నాధారమైన ధర్మశాస్త్రము దుష్టమనియు నేను నిర్దోషిననియుఁ దలంతువేని నీవు నీ యధికారము నుజ్జనసేయవలయు - లేక నీ ప్రయోగించు చట్టము దేశాభ్యుదయమును సాధించుననియు నా యుద్యమము ప్రజా క్షేమము నవరోధించుననియు నమ్మెదవేని న న్నీవు బెడిదమ్ముగా దండింపవలయు."488

## న్యాయమూర్తి మహాత్మునకు శిక్ష విధించుట

క. తన వాఙ్మూలము నిమ్మెయి, వినిచి మహాత్ముండు వినయవినతాననుఁడై
తనగద్దె నధివసించెను, జన మమితాశ్చర్య హర్ష సంభ్రాంతముగాన్. 489

ఆ. ఎట్టిశిక్ష గాంధి కీవలెనని విప, ర్యాస మందసాగె న్యాయమూర్తి
ముదుఁగఁబాఱె నతనిమోము చెల్లరె! దయ, నీయదశ నతండు నెగులుగుడిచె. 490

ఆ. మొనసి యెవనిపాదములచెంతఁ గూర్చుండి, ధర్మతత్త్వ మెఱుఁగఁదగునొ యట్టి
పరమపురుషు నెట్లు పంపుసేయు నతండు, బందిగమున కెట్లు పనుపనేర్చు. 491

ఆ. గుండె ఱాయిచేసికొని తుద కాధర్మ, మూర్తి యిట్టు లనియె నార్తిమ్రింగి
"అన్న! తప్పొనర్చినట్లు నీ వీకొంటఁ, జేసి కొంతవ్రేఁగు వాసెఁ దనకు. 492

గీ. చట్టమున్ బరికించి నీ కెట్టిశిక్ష, నిదుట సముచితమో నిశ్చయింపఁగనుట
యిచటఁ బనిసేయుతీర్పరి కేనికేని, జటిలమైన సమస్యయై చాల నొంచు. 493

క. వైయక్తికగరిమమ్మును, న్యాయము గుర్తింప; దది యనర్గళ, మది సౌ
ఖ్యాయాసమ్ములఁ గను నొక, తోయమ్మున; నదిర! యది సుదూరము దయకున్.494

గీ. ఎందఱోనిందితులఁ గంటి నింతదనుక, నెందఱోనిందితులఁ గందు నేను తేపు
కన్న కనఁగల వారిలో నిన్ను నెవరి, తోడ నుద్దింతు? నెనలేనివాఁడ వీవు. 495

ఆ. నిన్ను భారతీయు లన్ని రాష్ట్రమ్ముల, వారు నేతఁగా నపారదేశ
భక్తి యుక్తుఁగా శుభప్రదుఁగా మాన, సింతు రనియు విశ్వసింతు నేను. 496

గీ. రాజకీయములందు నీయోజ కియ్య, కొననివారును నిష్కళంకునిగ నుత్త
మాశయునిగ నుదారతారాశిఁగా ని, నుం దలంతురు గౌరవింతురు సతమ్ము. 497

క. నీ నడవడి నొకపాలే, నేను విమర్శింపవలయు నేఁడు నినున్ జ
ట్టానకు లోపడవలసిన, మానవుఁగా నెన్నవలయు మద్భావమునన్. 498

గీ. ఈవు సామాన్యమానవదృష్టి కనుచి, తమ్ముగాఁ దోఁచునట్టికార్యమ్ము సల్పి;
తియ్యకొంటి వీనేరము నీవుసైత; మగుట దీనిపరామర్శ కంగవింతు. 499

ఆ. తగదు దుండగంబు తగ దని ప్రజ కీవు, సెప్పుచుంట, యెచటఁ దప్పిదమ్ము
సాగె నచటికేగి జనతకు నీతులు, మప్పుచుంట యేను మఱవఁజాల. 500

ఆ. అర్హుఁ డితఁ దతం దనర్హుఁడు నాక నీ, కిష్టమైనధర్మ మెల్లరకును
జెప్పె దీవు దీన ముప్పురా దని యెట్లు, తలఁతు వది యెఱుంగఁ దగను నేను. 501

ఆ. అవని నేలువార లాఁకసెప్పనిబాట, నీవు నడువకుంట నీక్షచేసి
కుందువదనివారు హిందూధరిత్రి న, త్యల్పసంఖ్య నుందు రనుట నిజము. 502

ఆ. మున్ను తిలకుమీఁద మోపిననేరమ్ము, తెలఁగు, నేఁటితప్పుతెలఁగు నొక్కఁ
దగుట నాఁటితీర్పు నౌ నని యాతేండ్లు, బందిగమున కగ్గపఱుతు నిన్ను. 503

క. విడిచెఱ యిది, యీశిక్షకు, నొడఁబడియెద వీ వటంచు నూహించెద, నా
విదరానివిధికి లోపడి, యిడితిని దండనము నీకు నిపు డీమేరన్. 504

ఆ. అన్యథా తలంపకయ్య! పరిస్థితుల్, చక్కఁబడి ప్రభుత్వసరణి మాఱి
తనవిధించుశిక్ష తగ్గిన ననుఁబోలె, నుబ్బువార లెందు నుండఁబోరు." 505

వ. తగవరి బ్రూముఫీల్డు తననిర్ణయము నిమ్మెయిం బ్రకటింప మహాత్ముఁడు "న్యాయాధిపతీ! నీవు లోకమాన్యబాలగంగాధరతిలకుతో నన్నుఁబోల్చుట నా కతివేలమగు మాన్యత నొసంగుట - ఇది నా యదృష్టమని భావించి తనియుచున్నవాఁడ - నానేరమున కింతకంటె నలంతియగుశిక్ష నేతగవరియు విధింపఁజాలఁడు - ఈ యభియోగసమీక్షలో నీవు నాపట్ల వెలువరించిన యాదరానురాగములు మఱవరానివి - ఇవి నే నపేక్షించునట్టి కొలఁదిం గడచినవి - నీ సౌజన్యము నన్ను ముగ్ధుని గావించు" - అని తనకృతజ్ఞత నమ్మేటిమానిసికి సమర్పించె-బ్రూముఫీల్డు శంకరలాలున కొకవత్సరము చెఱనుంటయు, వేయిరూప్యములు చెల్లించుటయు శిక్షగాఁబల్కి నిందితుల కిర్వురకును దరహాసపూర్వ కముగాఁ గరస్పర్శన మొసఁగి న్యాయస్థానమును వీడె - పదంపడి 506

## బాపూ చెఱ కేగుతఱిఁ బ్రజల కిచ్చిన సందేశము

ఉ. కావలివార లియ్యకొనఁగా బ్రజలందఱు నొక్క పెట్టునం
గేవలభక్తిముద్ర తులకింపఁగ రచ్చకువచ్చి బాపుజీ
పావనపాదపద్మములు పట్టి నమస్కృతిసల్పి దైన్యరే
ఖావలితాకృతుల్ వణఁకఁగా విలపించుచు రాల్చి రశ్రువుల్. 507

క. ఎలనవ్వులతోఁ దియ్యని, పలుకులతో మోహనుండు ప్రజఁ దేర్చుచు నీ
యిలనెల్ల నేలుభాగ్యము, కలిగినరారాజువోలెఁ గన్పడుచుండెన్. 508

ఆ. ఏల విహ్వలింతు రిది మేలుగాని వే, తొందు గాదు ధైర్య మూని కదరు
వలువ పెంపుసేయ వాడవాడల కేగుఁ, దనియెఁ బ్రజలతోడ నపుడు గురుఁడు. 509

ఆ. కదలె రాచవారికారు మహాత్ముతో, జయజయారవమ్ము సందడింపఁ
బాదుకొనియె నల సబర్మతిచెఱసాల, దూఱు దుడుకులేని నేరగాఁడు. 510

గీ. అచటియధికృతుల్ త న్నెంతయాదరించి, యెన్ని సౌకర్యములు తన కేర్పఱిచిన
మమ్మరే! బందికట్టద లమ్మహాత్ముఁ, డించుకయు మీఱి బ్రదుకుట కియ్యకొనఁడు. 511

ఆ. వదలఁ డొజ్జనూలువడుకుట, వదలిన, నాఁడు సంజతిండి వీడవలయు
నది ప్రతిజ్ఞ కాన నరగంటయైనను, ద్రిప్పు రాట్న మతఁడు దినదినమ్ము. 512

ఆ. తన్నుఁ జూడ వచ్చు పిన్నపెద్దల కతఁ, దంటరానితనము నణఁపుఁ డనియు
హింస మానుఁడనియు హిందూమహమ్మదీ, యానురక్తిపెనుపుఁ డనియుఁదెలుపు. 513

క. ఖద్దరుమాట సరేసరి!, నిద్దురయందేని మఱచునే దాని గురుం
దద్దిర! వేల్పునకంటెను, ముద్దుకదా మొద్దునూలిముక్క యతనికిన్. 514

గీ. అతనిని సబర్మతీకారయందు రెండు వారములు నిల్పి సర్కారువార లవలఁ
బుణ్యపురి నెరవాడ నాఁ బొలుచుచోటఁ, గలచెఱకుఁ మార్చి రితవు శంకరునిజేర్చి. 515

## మహాత్ముని యాత్మశక్తిని లోకమగ్గించుట

ఆ. మేనిచేవలేనిమానిసి వృద్ధసం, న్యాసి యైనగాంధి కాంగ్లజాతి
వెఱచి యింతసేయ విశ్వ మాత్మబలంబె, బల మటన్నగుట్టు తెలిసి తనిసె. 516

గీ. కాఁడు సామాన్యమనుజుఁడు కాఁడు గాంధి, నిక్కమున కీశ్వరప్రతినిధియ కాని
దీనసేవకు వితరణాస్థాని యైన, పురుషుఁ డితఁడు పుణ్యంబులప్రో వితండు. 517

ఆ. హిందు వతఁడు ముస్లి మితఁడు క్రైస్తవుఁడువాఁ, డనెడి వింగడంబు నరయఁడితఁడు
సకలమనుజులందు సర్వేశ్వరుని జూచి, సంతసించు ప్రేమజలధియితఁడు. 518

ఆ. కత్తిపట్టి యొరులకుత్తుకలను ద్రుంచి, పుడమినెల్ల నెత్తురుమడుఁగుఁ జేసి
పడయఁ డితఁడు రాజ్య, మిడుమ లీకొనివైరి, యెదఁద మార్చి పడయ నెంచుఁగాని. 519

గీ. సాత్వికనిరోధసంగర స్రష్టయై జ, గమ్మునకు నవ్య భవ్యమార్గమును జూపి
వర్తమానయుగాచార్యవర్యుఁ డన్న, కీర్తి గాంచిన సాధుతామూర్తి యితఁడు. 520

ఆ. వినయమున కితండు విడిది, కఠోరవ్రై, రాగ్యమున కితండు రచ్చపట్టు
ధైర్యమున కితండు తార్కాణ కృపకు స, త్యంబునకు నితం డుదాహరణము. 521

క. ప్రాచీనధర్మముల న, ర్వాచీనాకృతులతోడఁ బ్రకటించి, ప్రజన్
శౌచమ్ముదెసకునడుపు స, దాచారవిధాత యితఁ డహంతారిపుఁడున్. 522

ఆ. ఇట్టిసాధుమౌళి యిట్టి మహాఋషి, దోషి యనియెఁ దెల్లదొరలచట్ట
మకట! నేఁడు దీనియాధిక్య మదఁగారె, నజ్జరే! మహాత్ముయశము హెచ్చె. 523

మం. ఎరవాడచెఱసాల యిరవుగా మాత్ర, దాస్యవిముక్తికై తప మాచరింపఁ
బూనె మహాత్ముఁ; దాబోద్ధ ము న్నఖిల, షించినకైవడి శీతాద్రినుండి
సేతువుదనుక దూషితకార్య మెదియు, జరుపక ప్రజలు నిశ్చలచిత్తవృత్తి
నిలిచిరి గురుని బంధించిననాఁడు, పొలిచి రహింసకున్ బ్రోపరు లగుచు;
నధికారులు మహాత్ము నాఁగినవెనుక, నాంధ్రాదిరాష్ట్రములందుఁ బెక్కండ్రు
కాంగ్రెసువారలఁ గారకుం ద్రోసి, రౌను! సేనాపతి నఱ్ఱాఁకపాలు
చేసినశాత్రవుల్ చెలరేఁగి బంట్ల, కొత్తడి కావింపకుందురా? వీరి
దొరలేని నెతిలేని దురుసును జూచి, కాంగ్రెసువారు దిగ్భ్రాంతులై నేఁడు
కలవరపోయి రక్కట! తేఱలేక, యసురుసురైరి నాయకుఁడెవ్వఁ డనుచు
వెచ్చనూర్చిరి మహావీరుఁడౌ గాంధి, దవ్వోట నెంతయుఁ దల్లడంపడిరి. 524

వ. పదంపడి మూన్నెలలకు వారు తెప్పిఱిల్లి లక్నోనగరమునం గూడి యేలుబడివారు సాగించుచున్న నిరంతరనిర్బంధవిధానమును గర్హించిరి - దీనికిఁ బ్రతిక్రియగా సమష్టి శాసనోల్లంఘనము నారంభింపఁ దలఁచిరి - దేశ మీకయ్యమునకుఁ దగియున్నదా లేదా యని పరికింప హకీమజ్మల్‌ఖాను నాయకత్వమున నొకయుపసంఘమును నిర్ణ యించిరి-మోతీలాలునెహ్రూ, విఠల్‌భాయిపటేలు, రాజాజీ మొదలగువా రిందు సభ్యులు - గుంటూరియం దదుగుమోపి నంతన వీరి కెదురుకో లొనర్చిన స్వచ్ఛందసైనికు లిన్నూర్వురు నిర్బంధితులైరి-గర్తపురమాంధ్ర ప్రజాహృదయము నిట్లు క్రియారూపమునం జాటె-ఇచటి పురపాలకమండలి శాసనోల్లంఘ నోప సంఘమునకు సమ్మానపత్ర మొసఁగి శుభాకాంక్షలు పల్కె - గుంటూరి గొప్పతనము మఱల నొక్కమాఱు దేశమునఁ బ్రకటితం బాయె-కాని యీచిఱుకూటువవారు భారతావనినెల్లం బర్యటించినవెనుక దేశము సమష్టి శాసనోల్లంఘనమున కర్హముగాలేదని తేల్చుటంజేసి ప్రజలలో నిరుత్సాహ మేర్పడియె.

## స్వరాజ్యపక్ష మవతరించుట

శాసనసభలం బ్రవేశించి యందును సాహాయ్యనిరాకరణమును బ్రయోగించుట లెస్స యని కాంగ్రెసువారు కొంద ఱపు దూహింపసాగిరి - ఈవర్గమునకుఁ జిత్తరంజనదాసు నాయకుఁ డాయె - మోతీలాలు, విఠల్‌భాయిపటేలు మున్నగు మహారథు లామేటి కండగా నిల్చిరి - సభాప్రవేశము నంగీకరింపనివర్గమునకు రాజగోపాలాచార్యులు నేత య య్యె - ఈరెండువర్గములతో గయానగరమునఁ జిత్తరంజనదాసు యాజమాన్య మునఁ గాంగ్రెసుమహాసభ (1922 డిశంబరు) ప్రవర్తిల్లె-అం దధ్యక్షుఁడును మోతీలాలు, శ్రీనివాసయ్యంగా రాదిగాఁగలపెద్దలు నెంతపెనఁగినను సాహాయ్యనిరాకరణనొక పెద దారికిం జనదాయె - శాసనసభా ప్రవేశము తగ దను తీర్మాన మధికసంఖ్యాక ప్రతినిధుల యంగీకృతిం బడసె - మహాత్ముని సిద్ధాంతమునకు విజయము లభించె. 525

## 1923

క. తనతలఁపు నుఱని కాంగ్రెసు, మొన నేలుట యరిది, ధర్మమునకు విరుద్ధం
బని చిత్తరంజనుఁడు స, జ్జనుఁ డుజ్జనచేసె నిజపదం బయ్యెదనన్. 526

వ. అంతఁ గాంగ్రెసుసంఘమువా రాపదవి కాంధ్రనాయకు నుపధాశుద్ధ దేశభక్త వేంక టప్పయ్య నెన్నుకొని తమవిజ్ఞతను మెఱసిరి - ప్రధానకార్యదర్శిగా నాంధ్రరత్న గోపాల కృష్ణయ్యను వరించిరి (**1923** జూన్) - కాన భారతజాతీయమహాసభా కార్యస్థానము బెజవాడయ స్థేర్పడె - తెలుఁగువారిరాజనైతిక జీవితమున కిది యొకక్రొత్తవెలుఁగు నాఁడగు - అది యట్లుండె. 527

మం. ఓటము నందినయోధు లారటము, పాలుగాక స్వరాజ్యపక్ష మన్‌పేర
నొకవర్గమును నిల్పి యూరూరు తిరిగి, తమ మార్గమునకునందఱు వచ్చు కరణి
నుడుగనిజతనంబు లొనరింప సాగి, రానాఁటికానాఁటి కందిరి దిటవు. 528

వ. వీరి బలిమి పెరిఁగిపెరిఁగి ఢిల్లీనగరమున అబుల్‌కలామాజాదు యాజమాన్యమునఁ బ్రత్యేక జాతీయమహాసభ (**1923** సెప్టెంబరు) జరుగవలసివచ్చె - ఇందు సభాప్రవేశ వాదులు సులభముగా గెల్చి వివిధశాసనసభల యెన్నికలం బాల్గొని సఫల ప్రయత్నులైరి (**1923** నవంబరు) - పదంపడి మహమ్మదాలీ యాధ్వర్యమునఁ గాకినాడం గాంగ్రెసు మహాసభ (**1923** డిశంబరు) సాగె. 529

## కాకినాడ - కాంగ్రెసు మహాసభ

ఆ. తెలుఁగువారిమేల్మి దేశదేశమ్ముల, ననయఁజేసెఁ గాకినాడ కాంగ్రె;
సాంధ్రమౌళి వేంకటప్పయాఖ్యాకుఁ డా, హూతిసంఘమునకు నేతగాఁగ. 530

వ. దేశభక్తుఁడు తన యుపన్యాసమున "మహాత్ముని నాయకత్వము నౌదలందాల్చి దాస్య విముక్తికై మనముకావించిన పోరాట గణనీయము-ఐనను మనలక్ష్యము సిద్ధింపమికిఁ గారణ మాచరణలోపముగాని సిద్ధాంతదోషము కాదు - మన మింతమాత్రన నైరాశ్యము నందం జనదు - సంశయములం గలఁగరాదు - ఇరువాఁగువార మెల్లసీమలకుం జని యూరూర వాడవాడఁ గాంగ్రెసు సందేశము ప్రకటింపవలయు - మనయుద్యమము నకు మూలబంధము నిర్మాణకార్యక్రమం బని విశ్వసించుట లెస్స - ఇది కావింపని నాఁడు దేశము శాసనోల్లంఘనమునకుం గాదు - చట్టముంద్రోఁత వినా స్వాతంత్ర్య సిద్ధికి వేఱొండుసాధన ముత్తమములేదని తలంతు" - సవి రాష్ట్రభాషం బలుక నుత్తర భారతమువలన విచ్చేసిన పెద్దలు తద్దయుం దనిసిరి - ఆ నేల వెలువడుపత్రికలుసైత మీ గఱువ చాటిన జాతీయ భాషాభిమానమును బహుధా ప్రశంసించె-మఱియు 531

మం. సర్వాంగశోభ నీసభ నిర్వహిల్ల, మహనీయగౌతమీ మండలప్రజలు
కడుగాసి నంది రగ్గలముగా విత్త, మొసఁగిరి తమయింటియుద్వాహమునకు

నలఁగినగతిఁ గాకినాడపౌరాళి, సకలశ్రమమ్ములు సైఁచె వరించి;
తనకన్న యేకైకతనయుండు దివికి, నరుదెంచి రెన్నెలలాయెనో లేదొ
బులుసుసత్యములుఁడు తత్పుత్రశోకమ్ము, దిగమ్రింగి సంస్థితధీ సాంబమూర్తి
సద ముదాత్తమ్ముగా సాగ నవ్వేళఁ, బూనినవ్రేఁగు బాపురే! దుర్భరమ్ము
పడసినయోగసంపద నిర్భరమ్ము; పరిషత్తునకుఁజాలు పటకుటీరమ్ము
తలయెత్తె మేటిఖద్దరుతోడ నాఁడు, రమణీయరహటాంబరముతో వితాన
మేర్పడె ఆబాట లెసఁగె నెల్లెడల, నతిరథులగువారి కనుకూలగృహము
లెక్కటిగా లేచె హిందీ ననర్గ, ళమ్ముగాఁ బల్కువలంతులు తెల్గు
లౌత్తరాహులసేవ కాసక్తి నిల్చి, రధ్యక్షుఁడు మహమ్మదాలి తజ్జనని
తత్సోదరుఁడు పటేల్ దాసు బజాజు, జవహరుఁ దన్సారి నడిసన్న విజయ
రాఘవాచార్యులు రాజగోపాలుఁ, దాజాదు మోతిలా లనుపమత్యాగ
ధనుఁడైన శ్యామసుందరచక్రవర్తి, కస్తూరి సాహితీఖని సరోజినియుఁ
గాకినాడకు వచ్చి కాంగ్రెసువేది, నిలువ నహో! తెల్గునేలతపమ్ము
పండిన దని ముదంపడె నాంధ్రజనము, వచ్చినవారి సేవకు సిద్ధపడిన
యువదళమున కప్పు దొడయఁడై రామ, చంద్రరావు రహింపఁ జానలమొనకు
నాజ్ఞలిచ్చుచుఁ గమలాంబిక పొల్చె, నిశితసూత్రమ్ములు నిర్మించి దండు
నడిపి వీరిద్ద తేనలఁగుడు రాని, పగిదిఁ గాపాడిరి ప్రజల నత్తతిని. 532

వ. మూన్నెలలనాఁ డిభపురమునం గూడిన ప్రత్యేక జాతీయమహాసభ నంగీకృతమైన శాసన సభా ప్రవేశనిర్ణయ మీసదస్సునందును నెగ్గె - నిర్మాణకార్యక్రమము నితోధికదీక్షతో సాగింపవలయునను తీర్మానముకూడ నేతత్పరిషత్తునం దురరీకృతమయ్యె - శాసనసభల వెలుపలన కాక లోపలసైత మసహయోగ మవలంబింపఁజను నని సాహాయ్యనిరాకరణ సిద్ధాంతమునకు నూతన వ్యాఖ్యానము కావింపఁబడియె - సభాంతమున నధ్యక్షుఁ డాంధ్రుల యతిథిసేవాసక్తిని, జాతీయోత్సాహమును గొనియాడి యిట్టిప్రజల నితర రాష్ట్రములం గననైతి ననియె - తెలుఁగువారి ఖాదీమక్కువను, స్వచ్ఛంద సేవాదళముల విధినిర్వహణనిష్ఠను బ్రఫుల్లచంద్రరాయి పొరింబొరిఁ బ్రశంసించె - సరోజినీదేవి ద్రావిడులు బుద్ధికుశలతంబలె నాంధ్రులు హృదయపరిపాకమునం బ్రసిద్ధు లని యుగ్గడించె -తెలుఁగువారు స్వతంత్రులు, సమర్థులు, ప్రత్యేకమగు నుపజాతివా రనుసత్య మానాఁడు భారతీయులకెల్లరకుం దెల్లమియాయె-అది యట్లుండె-ఇచట నీ యేఁటం(1923 లో) బ్రవర్తిల్లిన యుదాత్తచరిత్ర మొక్కఁడు వక్కాణింపవలయు - ఇది నాగపుర సత్యాగ్రహ

## నాగపుర సత్యాగ్రహము

గాథ - మహాత్ముఁడు (1922) మార్చినెలం బదునెన్మిదవ దినమున శిక్షితుఁ డగుటం జేసి కాంగ్రెసువా రదిసుత ప్రతిమాసపు టష్టాదశదినమ్మును బాపుజీశిక్షాజయంతిగా నిర్ణయించి, యానాఁ డెల్లరాష్ట్రములఁ బతాకోత్సవములు సాగింప దొరఁకొనిరి - నాగ

పురమునం దీ యుత్సవ మాంగ్లేయులకుఁ బృథక్కరించిన వీధికి రాఁజనదని యధికారు లానవెట్టిరి - కాంగ్రెసువా రీముదలం బాటింపక నిషిద్ధవీథి నూరేఁగింపుసాగింపఁ బోలీసులు వీరి నరికట్టి చెఱసాలకుఁబంప నారంభించిరి - అగ్రశ్రేణికిఁ జెందిన నాయకుఁడు వదాన్యశిరోమణి జమునాలాల్‌బజాజు సైత మీ తిరుగఁబాటునం బాల్గొని శిక్షితుఁడాయె - ఈ మేటి కార్థికశిక్షగా మూఁడువేలరూప్యముల విధింప నితఁ డాసొమ్ము నీ ననె - అంత నధికారులు బజాజుకారుం బట్టి యేలమునకుఁబెట్టి కొనువానిం గానక వెలుకంబాతిరి-"చినికి చినికి గాలివాన"యన్న ట్లీసత్యాగ్రహ మేచియేచి యఖిల భారతోద్యమమై జాతీయమహాసభ మెప్పుం బడసె - దీని యాజమాన్యము వహింపఁ గాంగ్రెసువారు వల్లభాయి నర్థించిరి - వల్లభుఁ డీ కోర్కి నంగీకరించినంతన ప్రజలలో నూతనచైతన్య మొదవె - అంత వివిధరాష్ట్రములవలనం గదలి సత్యాగ్రహులు గుంపులు గుంపులుగా నాగపురి కేతెంచి ప్రభుతాజ్ఞ నధఃకృతము నొనర్చి బందాలగుచుండిరి - ఎల్లనాఁడులనుండియు నీ సమరమునకు విత్తముసైత మపారముగా వచ్చుచుండె - ఇప్పట్ల విఠల్‌భాయిపటేలు కావించిన సాహాయ్యము కాంగ్రెసుకార్యవర్గమువారి ప్రశంసకుఁ బాత్రమయ్యె - పటేలుసోదరు లేతదుద్యమ సఫలతకు ముఖ్యహేతువు లనుట పరమ సత్యము - తెలుఁగుయువలు పెక్కం డ్రీపోరంబాల్గొని స్వరాష్ట్ర గౌరవమునకు వన్నె దెచ్చిరి - పల్లెపాటి సత్యాగ్రహాశ్రమపక్షమున నారునాగనార్యుఁ డీ శాసన ధిక్కారమున కరిగి శ్రీమతి సుభద్రాదేవిదళమునం జేరె - పదంపడి **533**

గీ. మూఁడువన్నెలదాల్ తనమూఁపునందు, మోపికొని యేలుబడివారిముదల నుఱక
చెంగలించుచు గాంధికిజే యటంచు, నడిచె నాగన్న నల్గడ నాగపురిని. **534**

క. పట్టి రకోలాచెఱకున్, నెట్టిరి పోలీసు లితని; నీచపుఁదిండిన్
బెట్టినఁ గొట్టిన నార్యుఁడు, పట్టుదలన్ డిగ్గవిడక ప్రస్తుతివడసెన్. **535**

ఆ. నేఁటి తెల్గునాఁటి మేటికైసరులలోఁ, దా నొకండుగా నుదాత్తకావ్య
శతవిధాతగా నెసంగు నాగార్యుఁ; డే, బాటఁ జనిన నితని కోటలేదు. **536**

వ. నాగపురపతాకాసత్యాగ్రహ మిట్టిదిట్టలకతన నవిచ్ఛేదముగా సాగిసాగి యేలికల బింక మును సడలించె - కాంగ్రెసుతీరిట్లుండ **537**

## 1924

## మహాత్మునకు శస్త్రచికిత్స - విడుదల

ఆ. బందిగముననున్న బాపున కేర్పడె, నకట! ఘోరజాఠరామయంబు
శస్త్రవైద్య మిపుడు శరణని వెజ్జు నా, నొజ్జ యెట్టకేల కొప్పుకొనియె. **538**

గీ. దొరతనమువారలు మహాత్ముతోఁ "జికిత్స, యిది యలంతిది గామి నీకిచటనున్న
మిత్రు నొకని రావింతు మామేటిపేరు, సెప్పు" మన "శ్రీనివాసశాస్త్రి" యనె గాంధి. **539**

క. ఈశాస్త్రి మొదటినుండియు, దేశికు నధ్వంబు ననుమతింపఁడు నానా
దేశముల కేగి యాంగ్లే, యాశయముల మాన్యతమము లనుచున్ వినుచున్. 540

ఆ. ఏలువార లితని కెల్లవెచ్చ మొసంగి, పంపుచుంద్రు తమ్ముఁ బ్రస్తుతింప
శాస్త్రి కాంగ్లవాణి చక్క లోపడెఁ గాన, నితఁ దలర్చు శ్రోతృతతిని సభల. 541

వ. మహాత్ముని యుదారతముం దితనిరాజకీయజీవనము లెక్కకురాదాయె - ఇతఁ దాప ద్భంధువుగా నిలువఁ బూనానగరమున 'శాసూన్' వైద్యాలయమున నర్ధరాత్రమున నగదంకారశిరోమణి 'మేదక్కు' సత్యాగ్రహాచార్యునకు శస్త్రచికిత్సగావించె - ఈకోఁత జరుగుచున్నతఱి విద్యుద్దీపము లాఱినను వెజ్జు బెదరక లాఁతి దీవియల వెల్గునం బని పూర్తిసేసె - మహాత్మునినొవ్వు దవ్వులకుం జనియె - కాని బలహీనత హెచ్చుండౌదఁగె - కావున 542

గీ. తగదుచెఱసాల నిఁకనిల్పఁదగదుగాంధి, నెమ్ములు బయల్పడియె శక్తియెడలె నితని
కెల్లి యెదిపుట్టునో యని యేలువారు, వెఱచి బందా మహాత్ముని విడిచి రపుడు.
(5-2-1924) 543

క. విడుదల నందినయంతన, కదలిదరిన్ దనరు సుఖనికాయము 'జూహూ'
విడిదలగా గురుఁ దుండెను, సదలినతిమ్మందనమ్ము సంపాదింపన్. 544

గీ. వచ్చెఁ జెఱనుండి మనగాంధి వచ్చె నిరులు, విచ్చె నని పొంగె భారతోర్వీజనాళి
యొజ్జకుం జేవ గూర నూరూర నన్న, దానము లొనర్చె నపుడు ప్రార్థనలు తీర్చె. 545

గీ. రెండుతెగలుగనున్న కాంగ్రెస్సువారు, బాపుజీచెంత కేగి సభాప్రవేశ
మెగ్గనుచు లగ్గనుచుఁ గలహింతు మేము, వలయు మీతీర్పు మాకని పలికి రవల. 546

గీ. శాసనసభానుకూలత చన దటంచు, దేశమున కది కడగండ్లు తెచ్చు ననుచు
నభినివేశముఁ జూపునెయ్యరులు వల్ల, భాదులకు నిట్లు నుడివె మహాత్ముఁ డపుడు. 547

ఆ. "అన్నలార! మామకాశయమును శిష్టి, సభను గాలుమోప సమ్మతింప;
దగునుగాక! రచ్చ కరిగెద మనువారి, మందలించుపనులు మనకుఁ దగవు. 548

ఆ. తల్లిబానిసమ్ము తలఁగింప దొరలేని, సేవసల్పి యీవిచేవ దెల్పి
వాసిగన్నవారు వారు; వారికి మన, మెదురుసెప్పు టెంతయేనితప్పు. 549

క. అనుభూతికతన వారలె, కననేర్తురు తమతెఱంగు కానిది యనుచున్
మన మంతదనుక వారిని, వెనుకకు రం దనక తాల్మి విడకుంట తగున్. 550

క. మన సొప్పినవా రందఱుఁ, జనవచ్చున్ సభల కనుచు సమ్మతినిచ్చెన్
మును ఢిల్లి కాకినాడల, నెనసినకాంగ్రెసులు; చనిన నెగ్గేమి యిఁకన్. 551

క. పరిణామవాదులు జయేం, దిర నందిరయేని వారితెరువున మనమున్
బరుగెత్తవచ్చు నిప్పటి, తెలఁగున్ విడనాడి దేశదీప్తి గడింపన్. 552

ఆ. దారిదప్పి వచ్చినారము రిత్త న, లంగినార మని తలంచినపుడు
వారు జంకులేక వత్తురు మనచెంత, కేల లేనిపోనిగోల యిపుడు. 553

గీ. మనము నిర్మాణకార్యక్రమమ్ముపట్ల, నభినివేశమ్ము చూపుద మలఁత కోర్చి
కదరు జాతీయవిద్యలు పొదలునట్లు, మతవివాదముల్ ఖేదముల్ మడఁగునట్లు. 554

క. ఈపాలికిఁ జెందినపని, యాపెద్దలు సైత ముచిత మన్నారుకదా!
కోపముజోలికిని మన, స్తాపముజోలికిని బోవఁదగ దిఁక మనకున్." 555

గీ. స్థితమనీషావిరాజి దేశికుఁడు గాంధి, యిమ్మెయిని బల్కి నుభయవర్గమ్ములకును
దనివి చేకూరె; మోతిలాల్ దాసు లప్పు, డెల్లవారికిఁ దమవాద మేర్పడంగ - 556

వ. "నాగపురమున నంగీకరించిన యసహాయోద్యమమునకు మాశాసనసభా ప్రవేశము విరుద్ధముకాదు - నిరంకుశ ప్రభుత్వమువారి యాటకట్టింపన మేమీప్రదేశము నంగీక రించితిమి - ప్రజాసమ్మతమగు పరిపాలన మేర్పడుదనుక నేల్బడివారియాయవ్యయ పట్టికలం ద్రోసివేయుచుందుము-వారియధికారమునకుం జేవగూర్చు శాసన మేర్పడిమిక్కై పెనఁగుదుము-దేశాభ్యుదయ హేతువులగు మేలిచట్టముల సృష్టింతుము - మనసంపద లాఁతివిలాతులపాలు గాకుండునట్లు చూతుము-కార్మ కర్షక కల్యాణమును సాధింతుము - శాసనసభలవెలుపల శ్రద్ధధానులమై నిర్మాణకార్యక్రమము సాగింతుము-స్వరాజ్యసిద్ధికి శాసనోల్లంఘన మనివార్యమని తోఁచిననాఁడు శిష్టసభలం బరిత్యజించి మహాత్ముని కండగా నిల్తుము" సని యొకప్రకటనమును గావించిరి - అది యట్లుండె - ఇట సుప్రసిద్ధమగు విప్లవచరిత్ర మొందు వివరింపవలయు - ఇది కాంగ్రెసుతోడిపొత్తు లేనిది - అయినను శాసన తిరస్కరణోద్యమ మీయొద్దారమునకు బీజమని దొరతనమువా రనిరి - వారిమాటల నటుంచి యీతిరుగఁబాటుతెఱఁ గించుక వక్కాణింతు. 557

## అల్లూరి సీతారామరాజు

గీ. చక్రవర్తులు రాజులు సచివముఖ్యు, లుత్తమోత్తమయోద్ధ లనుత్తమాంధ్ర
కవులు పుట్టినగడ్డయై గణుతిగన్న, గర్తపురిసీమ 'బొప్పూడి' గ్రామ మలరు. 558

క. ఆయూరఁ గలరు శత్రుని, కాయమదోన్మథన శౌర్యగణ్యులు విశ్వ
శ్రేయోऽర్థులు బాహుజు; లం, దాయతయశమున్ గడించి రల్లూరికులుల్. 559

వ. ఈ వంగడపువారు కొందఱు బాంధవాదులఁబట్టి 560

గీ. మహిత పశ్చిమగౌతమీ మండలమునఁ, బేరుగాంచిన చాళుక్యభీమవరము
చెంత నలరారు 'మోగల్లు' చేరి హలము, పట్టి పంటలుపండించి రిట్టలముగ. 561

మం. ఇందు వేంకటకృష్ణనృపతిసుతుండు, వేంకటరామపృథ్వీపతి సూర్య
నారాయణాంబికానాథుఁడై దీప్తి, రాశి సీతారామరా జను తనయుఁ
గనియె నబ్బాలుండు కాలక్రమానఁ, జినచిన్న చదువులఁ జేవనార్జించి
యావెన్క నున్నతమగు పాఠశాల, నాశ్రయించెను గాని యచట బోధించు
నాంగ్లభాష రుచింపదాయె నాతనికి, నది భారతీయత నణఁగించుభాష
యది బానిసతనమ్ము నదరించుభాష, యది కూడదని తోఁచె నా బాలకునకు
నతనిలో రాజకీయాగ్ని దీపించె, వానిలో స్వాతంత్ర్యవాంఛ రేకెత్తె
విద్యాలయంబును విడనాడె రాజు, దేశాన నలుగడఁ దిరిగెను రాజు
కూడుగుడ్డలు లేక కుమిలెడిపేద, లజ్ఞానభరముతో నల్లాడుపేద
లేసీమ నేయూర నేవాడఁ గనినఁ, గన్పించి రతని కగ్గలముగా నప్పు;
డీ దురవస్థకు నింగ్లీషువారి యాధిపత్యమె హేతు వని నమ్మె రాజు
పరులయేల్బడి కగ్గపడినధరిత్రి, యెదియుఁ గోల్పోన దని యెంచెను రాజు
ప్రజలలోఁ జైతన్యబలము హెచ్చించి, ప్రజలలో విప్లవప్రవణత గూర్చి
తెలవానిజెండాను దింపి జాతీయ, వైజయంతిక నెత్త వాంఛించె రాజు
క్రన్నన భద్రాద్రికడ నుండువనుల, కేతెంచి (1922 లో) కోయలనెఱుకలఁజెంచు
వారలఁ గాంచి మీవనటలకెల్ల, నీ ప్రభుత్వమెకదా హేతువు, దీని
నణఁగింపకున్న మీ కబ్బునా సుఖము, కట్టెకు దుంపకు గడ్డికి వెదురు
బియ్యమునకుఁ బన్ను విధియించురాజ్య, మెన్నాళ్లుసైఁచెద రెన్నాళ్లు బేద
కూలితోఁ గంకరగుట్టలు మోసి, ఱాబాట నిర్మింత్రు రాచతికమున
కాఁకటికోర్వలే కక్కటా! చింత, పప్పుజావను ద్రావి భయదరోగముల
నెన్నాళ్లు మూల్గెద రీనీతిలేని, మూఁకకు నెన్నాళ్లు మ్రొక్కెద రనియె
నతనిపల్కులు నచ్చె నాటవికులకు, నతఁడు దైవత మాయె నాప్రజాతతికి. 562

వ. వారినాయకులు గాముగంటముదొర, మల్లుదొర యనుసోదరులు యోగివేషమునం దనరు సీతారామరాజుమ్రోలం దలవంచి యయ్యా! మీరు మ మ్ముద్ధరింపవలయు - మాకుం జేరువగా నుండు కృష్ణదేవుపేఁట రామాలయమున నివసింపవలయు - అని వేఁడ నారాచబిడ్డ వల్లెయనె - అంత నమ్మేటి గాముసోదరులు వెంటరా మన్నెమునంగల గూడెములకుఁ జని యూరూరఁ బంచాయతి సంఘమును నెలకొల్పుచు మద్యపానమును మాన్పుచుఁ బ్రజలకన్ను తెఱవందొడఁగె - దీని నేలుబడివా రోర్వలేక సీతారామరాజుపై లేనిపోనినేరములు మోపి యోయీ! నీవు నరసీపట్టణమునందే నిలువవలయు నని శాసింప నతఁ డాపురమున నుండిన యట్లయుండి చారుల వంచించి మన్నెముచేరి రహస్యముగా మెలఁగుచు నిశాసమయమునఁ బ్రజలం గలసికొని వారికిఁ దిరుగఁ బాటుతెఱఁగుం గఱప మొదలిడె - అంత 563

గీ. ఆటవికు లధికారులమాట వినక, మూటముల్లెలు మోయక మొక్కవోని
పట్టుదలఁ జూపఁ బశువులఁ గొట్టినట్లు, కొట్టి రవ్వారిఁ బొగరుపైకొనఁగ దొరలు. 564

ఆ. ప్రజలు తాల్మివీడి బాఁకులు బల్లెముల్, పట్టి రామరాజుపజ్జ నిల్చి
రరులగుండె లదర నార్చిరి విప్లవ, శంఖ మొత్తి రాకసమ్ము ప్రిదుల. 565

వ. అల్లూరివీరుఁ డీదండుతోఁ (22-8-22) గదలి చింతపల్లి మున్నగు తావులఁగల పోలీసుఘట్టముల నాక్రమించి యందలియాయుధములఁ బరిగ్రహించి బందాలఁ దన దళమునఁ జేర్చికొని యూరూర విప్లవప్రచారము గావించుచుండ మండలాధికారి పనుపున నిలువమూఁక వచ్చి ప్రజాప్రతిఘటనము నణఁపంబూనె-వంచనాసమరమునం దాఱితేఱిన రాజుపౌఁజు దాని నలవోకం గూల్చె - పదంపడి చనుదెంచిన మలబారు సేనను సైత మది పరాభూతము నొనరించె - అంత నస్వామునుండి శతఘ్నిదళ మేతెంచి మన్నెమున విడిసి వికటాట్టహాసములు సేయుచు విప్లవసైన్యమున కిరవైనగట్టును ముట్టడింప సీతారామరా జపు దనుచరులం గని 566

ఆ. మన్నెజోదులార! మనపాలిపండువు, పొలిచె నేఁడు పుణ్యములు ఫలించి
పగఱ పిచ్చలింప మగపాడి మెఱయించి, త్రెంపరయ్య బానిసంపుఁద్రాళ్ళు. 567

ఆ. తనువు నిలువ దెన్నితంటాలుపడినను, యశ మొకండె నిత్యమై వెలుంగు
యశముకొఱకు నసువులర్పించి రెందఱో, బిరుదమగలు విశ్వ మరుదుపడఁగ. 568

క. కోరఁదు కోరఁదు భారత, వీరుఁడు రుజ నింట నొదలువీడుట నెపుడున్
దారుణరణమరణంబున, కారటపడు నాతఁ డెట్టియాపద నున్నన్. 569

క. ముక్కంటికైన మానము, దక్కునె మనముందు కత్తితాల్చి నిలిచినన్
మిక్కిలిన తెల్లమగఁటిమి, నుక్కఱి పరసేన పఱవ నుద్ధతు లగుఁడీ! 570

క. కూటికిఁ బెనఁగెడిసైన్యము, పోటీపడునొక్కొ మాతృభూమీదైన్య
స్ఫోటవ్యగ్రధ్వజినీ, ధాటికి; జంకేటి కాయితంపడుఁ దన్నల్! 571

ఆ. అనుడు నతనిపల్కు లావేశమును బెంప, ననికి నుత్సహించి రాటవికులు
గొనయ మెక్కువెట్టి ఘోరవిషాక్తబా, ణములు పఱపి రరిగణమ్ముదెసకు. 572

గీ. ప్రేల్చిరి తుపాకులను బెద్దపెద్దఱాల, విసరి రహితులమస్త్రముల్ ప్రీలుపగిది
నెల్లయెడలఁ దానై మొన కేపుగూర్పఁ, దొడఁగె సింగపుఁగొదమకైవడిని రాజు. 573

వ. అంత సర్కారువారిపాళెము పిఱుతివియక మరతుపాకులు పిరంగీలు కాల్చుచుఁ బ్రజావాహినిపైఁ గసిమసంగ సంగరముతీరు ఘోరంబైయిరువాఁగులఁ బెక్కండ్రు జోదు లొఱఁగిరి - పలువురు క్షతగాత్రులైరి - ఇంతలోఁ బ్రొద్దుగ్రుంకి చీఁకట్లలముకొనం జాగె - కొండపై గాయపుమందు లేదాయె - తెల్లురాణువ యప్పట్టున ప్రణితులతో గట్టుదిగి తెగించి శత్రువ్యూహమును భేదించి యెందేనిసురిఁగె - దీనిజాడం దెలియ నేలుబడివారి పౌఁజు నేర్మిచాలనిదై జనపదములపైఁబడి మీ నాయకులం జూపుఁడని

ప్రజల బెదరింప వా రించుకేని చలింపరైరి - సర్కారుజం ట్లపుడు రక్కసులంబలె రక్కెసచేఁతలకుం దెగి స్త్రీశిశువృద్ధవిచారము వీడి చేతికందిన తలలనెల్లం దెగవేయు చుండఁ బల్లెపట్టుల హాహాకారములు చెలరేఁగె - రా జీయార్తనాదముల వినలేక తన మొనం బంప నది పరిపంథివరూథినిం దలపడి సందడికయ్యము రేఁపె - ఈ పెనఁ కువ నుభయపక్షములుం బెద్దచెడియె - విప్లవవాహినిలో వీనుమిగిలినబంట్లు పెక్కండ్రు మడిసిరి-అగ్గిరాజు, మల్లుదొర మొదలగు యోద్ధలు పగతురకుం జిక్కిరి - సీతారామరా జొకదుర్గమస్థానమున నుండినవాఁడు తనవారికిం బాటిల్లినదుర్దశ కెంతేనికలఁగి కర్తవ్యముం దడవుచుండ 574

క. మింటికి నంటెదుమంటలు, కంటికిఁ గన్పించె; రిపులు గ్రామములకు ని
ప్పంటించిరిపో! యని యా, వెంటన నడిసన్న తెల్గువీరుఁడు లేచెన్. 575

క. వెఱవకుఁ డోప్రజలారా!, వెఱవకుఁ డిదె వచ్చుచుంటి విమతధ్వజినీ
శిరములఁ ద్రుంచుట; కనుచున్, గరవాలమె తనకుఁ దోడుగా నతఁ డెగసెన్. 576

ఆ. ప్రళయరుద్రునట్లు పరుగెత్తురాజును, బొంచియున్నపగఱ కాంచినారు
బెదరి యెదురలేక పొదనుండి గుండ్లను,బ్రేల్చినారు ధరణిఁ గూల్చినారు.(7-5-24)577

గీ. విప్లవము వర్ధిలునుగాక! విప్లవంబు, వర్ధిలునుగాక! యనుచు జీవములు వదలె
నాంధ్రయువమౌళి రామరా జరిభయంక, రాతిమానుష కదన క్రియావిధాత. 578

వ. మాతృధాత్రీదాస్యవిచ్ఛిత్తికై తనవలచినబాటంబయనించి యాధునికశస్త్రసంపద లేని యిన్నూర్వు రనుచరులతో నపారశక్తి సంపన్నమగు శత్రుసైన్యమున కెదమదువుగా మూఁడేండ్లు పోరి ప్రాఁతవడినచరిత్రం గుఱ్ఱువెట్టుతెల్గుమగఁటిమిని మరల నొక్కమాఱు మేల్కొల్పి మెప్పులందిన యల్లూరి సీతారామరాజు మఱవరాని మహావీరుఁడని దేశ మానాఁ డతనివిక్రమముం దలఁచుకొని పులకించె. 579

## కాంగ్రెసు సభ్యుల నూలిచందా

మం. అవలఁ గాంగ్రెసుసంఘు మహమదాబాదు, పురమునఁగూడి బాపూజుహూతీర్పు
లరసి స్వరాజ్యపక్షాగ్రిముల్ వెలువ, రించిననుదులఁ జర్చించి నిర్మాణ
కార్యక్రమంపు టగ్గలిక నర్థించి, సన పెద కాంగ్రెసుసంస్థ లన్నింటి
కెన్నికమై వచ్చు నెవఁడు సభ్యుఁడుగ, వాఁడు చొక్కముగఁ దా వడికిననూలు
నియతమ్ముగా నెలనెలకును రెండు, వేలగజమ్ము లర్పించుట వలయుఁ
గాకినాడపురానఁ గావింపఁబడిన, తీర్మానమునకు విధేయమౌగతి వి
సర్జింపవలయును శాసనసభలఁ, బరదేశవస్తువులఁ బారశాలలను
బిరుదులఁ గోర్టుల వెలివెట్టవలయు, నీ బహిష్కృతు లేని కిష్టముల్ గావొ
యతఁడు కాంగ్రెసుసంస్థలం దుదయించు, నెన్నికలకు నిల్వ నించుకయేని

పనికిరాఁ దని తీర్చెఁ; బదపడి వంగ, జగతి గోపీనాధషా యనుకుఱ్ఱఁ
దర్నెస్టుదే యనునాంగ్లేయుఁ జంపు, టతినింద్య మగుపని యని నిర్ణయించె
నీ నిర్ణయముఁ గొంద ఱెదిరింప గాంధి, పలవించె గోష్ఠిలో బావురు మనుచుఁ
దలవంచె హింస కాదరమా! యటంచు. 580

గీ. పిమ్మట మహాత్ముఁ డిభనగరమ్ముఁ జేరి, నిలిచెను మహమ్మదాలిమందిరమునందు;
నంత నటనట మతకలహములు పొడమి, వెఱ్ఱితలవైచెఁ గోహటువీట నకట! 581

వ. కోహటునగరము వాయవ్యరాష్ట్రము నందలిది - ఇందు జరిగిన హిందూమహమ్మదీయ ప్రహారములతో భారతదేశపునడుము విఱిగె - ఈకలహములకుం గలకారణంబు లరయ గాంధియు షౌకతాలియుం బూనుకొనిరి - కయ్యములం బ్రేరించినతెగలఁ గూర్చి వీరి తీర్పులు బెడిసె - మహాత్ముఁ డీహత్యలకుఁ దానపూఁటవడి యేతద్దురితము నకుం బాచితముగా ఢిల్లీనగరమున నిర్వదియొక్క ప్రొద్దు లుపవసించె - ఈతపంపువెట్ట కోర్వంజాలక సర్వపక్షనాయకు లేకమై మతాచారములపట్లఁ గొన్నికట్టడల నేర్పఱిచి బాపువేదన కుపశాంతి గూర్చిరి - (24 అక్టోబరు) తరువాత బొంబాయినగరమునఁ గాంగ్రెసుసంఘమువారు (24 నవంబరు) సమావేశమై దేశపరిస్థితులను సమీక్షించి గాంధి - దాసు - మోతీలాలు నెహ్రూలు బెరసి కావించిన నిర్ణయము నంగీకరించిరి - సర్వరాజకీయ పక్షముల సాయముం బడయ నొక్కవిదేశవస్త్ర బహిష్కృతి వినా తక్కిన యసహాయోద్యమ కార్యక్రమమునెల్ల నుజ్జనసేయవలయు ననియు స్వరాజ్యపక్షము వారు కాంగ్రెసుసభ్యతం బాయక శాసనసభలం గృషిసల్పవలయు ననియు నీసమష్టి నిర్ణయపు సారాంశము - కాన మహాత్ముఁ డీనాఁడు స్వరాజ్యపక్షమునకు లొంగెననుట సముచితము కాని కాంగ్రెసునందలి సాధారణసభ్యుఁడుసైతము నెలనెలకును రెండువేల గజాలనూలు కాంగ్రెసున కర్పింపవలయు ననుకట్టడ యీసమావేశమున నంగీకృత మగుట మహాత్ముఁ దానష్టికి మాఱుగాఁ బడసినలాభ మనం జను. 582

## బెల్గాము కాంగ్రెసు - గాంధి యాజమాన్యము

గీ. రెండువర్గాలతీరు లీరీతి నుండఁ, గడిసె బెల్గాముకాంగ్రెసు; కర్మచంద్రు
కొమరుఁడే దాని కాధ్వర్యవమువహించె, నతఁడుగా కెవ్వఁడోపు నేఁ దట్టిమోపు. 583

క. శాసనధిక్కృతి నాఁపి త, దాసక్తులఁ దనుపఁజాలు నాతఁడు; వల దీ
శాసనసభ లని తెగడి త, దాసక్తులఁ దేర్పఁజాలు నాతఁడు చులుకన్. 584

గీ. వలఁతులు మహామహోద్యమంబులను నడుప, నిలుప నర్హులు; వారలు నేల ప్రొద్దు
లరసి కర్తవ్య మూహింతు; రట్టివారి, బంది యొఱకాటపుంబాటఁ బడదు చెడదు. 585

ఆ. నాలుగేండ్లనుండి నడిచినకాంగ్రెసు, చరితమెల్లఁ దెలిపె సభకు గాంధి
సాటిలేనికల్మి జాతీయమగుబల్మి, నావహించెఁ గాంగ్రె సని వచించె. 586

క. ఆయాబహిష్కృతులఁ బ్రజ, లీయకొనిరి పూర్ణవిజయ మిట రాకున్నన్
బోయె బహిష్కృతసంస్థల, కీయవనిం గలప్రతిష్ఠ యెల్లయు ననియెన్. 587

వ. న్యాయస్థానాదుల బహివెట్టుకంటె హింసనువెలివేఁత పెద్దయుం గొనియాడఁదగ్గవని - ఐననైమి - నేఁ డీయహింస బలిమి లేనివారి యాదరువుగాఁ దక్క నుక్కు గలవారి కైదువుగాఁ బ్రయుక్తంబగుట కానము - కాంగ్రెసువారు తమదారికిరాని వారిపైఁజూపు నేవగింపు సైతము హింస కొకసరళరూపము - నిర్దుష్టముగాఁ బఱపు నహింస హింస నరికట్టు ననుపల్కు నిక్కము - సత్కార్యములపట్ల స్వార్థత్యాగము గావింపఁగలబల్మి హెచ్చినకొలఁది నహింసాపాటవము హెచ్చు - నేఁ డసహాయవాదులు కొందఱు కొన్ని యెడలఁ బశ్చాత్తాపముం బ్రకటించుచు నుద్యమాభివృద్ధి కద్దుతగులుచున్నారు. 588

క. కాన బహిష్కారము లిఁక, మానందగుఁ గాని యన్యమహిఁ బుట్టిన వ
స్త్రానకుఁ గలవెలి మానుట, కానిపని యటంచు నుడివె గాంధి సమజ్ఞన్. 589

క. వెలివేఁతలో బలాత్కృతి, కల దనెదను గాని కినుకకతమున నిడి వా
టిలలేదు సదుద్దేశము, వలనన యేర్పడె నటంచు వక్కాణించెన్. 590

గీ. లాఁతినేల బియ్యంబును ద్రోఁతవోలెఁ, బరమహీవస్త్రములఁ ద్రోపు పాడి మనకు;
భారతీయకర్షకు లార్తిపాలు గాఁగ, నలముకొనె లాంకుషైరుబేహార మనియె. 591

ఆ. దీనిబెడఁద మాన్పి దేశంబు నలరింప, వడుకునూలు మనకు వలసె ననియెఁ
బల్లెటూరితోడి ప్రత్యక్షమైత్రి కీ, చేతినూలిపోఁగు హేతు వనియె. 592

గీ. మన కుటీరపరిశ్రమల్ మనుచుకొన్న, రాదు రాదు నిరుద్యోగబాధ యనియె
నితరవస్తువులను జేయు టెట్టులున్న, వదలరా దనె ఖద్దరువలువసృష్టి. 593

గీ. గురునకు స్వరాజ్యవాదులకును ఘటిల్లె, నమ్మహాసభ రాజకీ యానుకూల్య;
మీయకొనె దాసు నూలిచందా యొసంగ, నిష్టపడె శిష్టిసభ కతఁ దేగ నొజ్జ. 594

వ. మఱియు నాచార్యుఁ డిమ్మహాసభన్ స్వరాజ్యప్రణాళికను దెల్లమిచేసె-నూలువడుకుటయు, మతమైత్రియు నంటరానితనముం ద్రోయుటయు స్వాతంత్ర్యసిద్ధికి రాచబాటలని చాటె - భాషాప్రయుక్తరాష్ట్రము లేర్పడి దేశభాషలలో రాజ్యతంత్రము నడువందగు ననియె - హిందీభాష జాతీయభాషగా నుంట సముచితంబని పల్కె - ఇంగ్లీషువారితీరు దూష్యమగునేని సంపూర్ణస్వాతంత్ర్యము వాంఛనీయమని నుడివె - దేశాభ్యుదయమునకు వలయు నిర్ణయము లెన్నేని సూచించి సభాసదుల యంగీకృతిం బడసె-పదంపడి 595

## 1925

గీ. చిత్తరంజను బలఁగంబు శిష్టిసభల, కరిగి యేల్బడివారికి నడ్డుతగిలె
మాటిమాటికి నపజయమగ్నమగుచుఁ, బరువుగోల్పోయె నుడివోయె దొరతనమ్ము. 596

క. శాసనసభాప్రవేశము, నాసింపనివారు కట్టి రాశ్రమములు; ఖా
దీసృష్టికి నస్పృశ్యత, నాసిరిలంజేఁతకును బెనంగిరి మిగులన్. 597

వ. నిర్మాణకార్యక్రమ సంచాలకుఁడగు మహాత్ముఁ డానాఁడు దక్షిణభారతమునం దిరుగు వాఁడు (1925 మార్చి, ఏప్రిలు) తిరువాన్కూరు రాజ్యమున 'వైకము' నాఁ బరఁగు నగ్రహారంబునఁ గేలప్పన్ నాయకత్వమున నస్పృశ్యతానివారణమునకై సాగుచున్న సత్యాగ్రహము నాదరించి తత్కార్యకర్తల బందిగము పాలుసేఁత మేలుగాదని యేలుబడివారి కుపదేశించి మాలమాదిగల కయ్యూర నెల్లవీధులం దిరుగునధికార మేర్పఱిచి తత్సంగరము నాఁపి వంగభూమికిం జని యారోగ్యభంగమునం గుములుచిత్తరంజనుఁ బరామరిసించి (జూన్ 9) ఖుల్నా పట్టణమున కరిగి కర్తవ్యపరాయణుఁడై యుండ598

## చిత్తరంజనదాసు నిర్యాణము

సీ. సర్వస్వమును దేశజననిదాస్యముఁబాప, ధారవోసిన మహాత్యాగమూర్తి
దీక్షతోడ స్వరాజ్యపక్షసైనికకోటి, నడిపిన వాహినీనాయకుండు
ద్వంద్వప్రభుత్వపద్ధతి రూపుమాపఁగా, బోరి గెల్పందిన వీరమౌళి
మకుటంబులేనిసమ్రాట్టుకైవడి వంగ, భువిని వెల్గెడి మహాపూరుషుండు
కుడిబుజమువోలెఁ గాంగ్రెసుగురున కండ, దండగా నిల్చినట్టియుదాత్తచరితుఁ
డక్కటా! వేఁకివెట్టకుఁ జిక్కి స్రుక్కి, కన్నుమూసెనుదాసు లోకము వణంక.
(16 జూన్ 1925) 599

క. ఈవార్త విన్నయంతన, బావురుమని యేడ్చి 'ఖుల్న' ప్రజ లొకచోటన్
బ్రోవైరి తత్సభన్ గురు, దేవుఁ డిటుల్ పలికె సుప్రతిష్ఠితబుద్ధిన్. 600

ఆ. అన్నలార! నేఁడు కన్నీరు మున్నీరు, కరణి విడుచు టరిదికాదు; కాని
యేమిలగ్గవచ్చు నీనీట మన? కెంత, బాగువొదము దాసుబంధువులకు. 601

క. మతభేదములెంచక భా, రతీయతాదృష్టిఁ జిత్తరంజనదా సీ
క్షితి సాగించినపని కొ, గ్గితిమే నదియిపుడు తగినకృత్యము మనకున్. 602

గీ. చిత్తరంజనుతనువు నశించెఁగాని, యతనియాత్మ నశింపలే దది నశింప;
దఖిలసంగపరిత్యాగ మాచరించి, యతఁడు పడసినకీర్తియు నణఁగఁబోదు. 603

గీ. యువలు వృద్ధులు దేశబంధువు నుదార, జీవనము దర్పణమ్ముగాఁ జేసికొనుట
కియ్యకొందురుగాక! దా సెట్లు మహికి, నూడిగముచేసె నట్లు సేయుదురుగాక! 604

వ. మహాత్ముఁ డిమ్మెయిం బల్కి హుటాహుటిం గాళీఘట్టమునకువచ్చి డార్జిలింగు నుండి తేఁబడిన చిత్తరంజనుమృతదేహమున కజాదు మున్నగువారితోపాటు వాహకుఁడై

మననంబుదనుక నడిచి వంగనాయకునిపట్లఁ దనకుంగల శ్రద్ధాదరంబులు మెఱసె - మఱియు బంగాళమునఁ గొన్నినాళ్లాఁగి పదిలక్షల ధనంబు సేకరించి చిత్తరంజన సార్మక చిహ్నముగా నొకచికిత్సాసదనంబు నేర్పరించె - ఇంతకుమున్ను దాసు దేశము నకుం గాన్కగా నర్పించిన భవనమునం దీ వైద్యశాల స్త్రీ శిశు చికిత్సకై రూపెత్తె-పదంపది605

## సేన్‌గుప్త స్వరాజ్యపక్షమునకు నాయకుఁడగుట

గీ. సేనుగుప్తను నేతఁగాఁ జేసె వంగ, రాష్ట్రమునకు గురుండు; స్వరాజ్యపక్ష
పటుతకై లెస్సయత్నించెఁ బట్టణములఁ, బల్లియలఁజేరి పెద్దల నెల్లఁ జూచి. **606**

మం. అతండు స్వరాజ్యపక్షాభ్యుదయంబు, మనసార వలచి యిమ్మయి శ్రమంపడుచుఁ
బరిణామవాదులపని కియ్యకొనని, కాంగ్రెసువారియల్కకు నసంతృప్తి
కానాఁడు కారణమై యుండ శిష్టి, సభల నీఁగినవారు చదురుఁడౌ మోతి
లాలు నాత్మీయదళంబున కధిపుఁ, జేసిరి దాసుమోసినవ్రేఁగు నతని
తలమీఁదనుంచి రంతట మితవాద, సరణి మెచ్చెడివారు శాసనసభల
నాక్రమించుట మంచిదని కాంగిరెసునఁ, జేరి రెన్నికలలోఁ జినపెద్దగద్దె
లెక్కిరి నానాఁటి కీతెగవారు, నూలిచందాను మానుట లెస్స యనెడి
బాటకువచ్చిరి బాపుజీ దీని, కెంతయుఁ గలఁగి నా కేల కాంగ్రెస్సు -
పెద్దఱికంబు? నాపీఁటయు మాన, నీయుఁడు మోతిలాల్ నెహ్రూవశమ్ము
గావింతు నని కలకత్తాపురానఁ, గలసిన కాంగ్రెసుకార్యవర్గమ్ము (15 జులై)
నెదుటఁబల్కుడు సభ యిల్లిగ్గి వత్స, రాంతముదనుక నీయాధ్వర్యవమ్ము
సైఁపుఁడీ! మీ రన సరి! యనె నొజ్జ, యేమన్న నేమి యీ హేమాహెమీల
చిత్తవృత్తి సదా ప్రసిద్ధసమస్య, లను గాంధిచూడ్కికి లాఁతిగా నుండుఁ
జదువులబిగిలేని సాధారణప్ర, జావళితలఁపు మహాత్మునితలఁపు
బెడియక సర్వదా పెనఁగొనియుండు, నయ్యది యట్లుండె; నవ్వలఁ బాట
లీపుత్రమునయందు లెస్సను జెడ్డ, నరయఁ గాంగ్రెసు పెద్దలందఱు గూడి
నూలిచందాను మానుట కియ్యకొనిరి, రాజకీయంబగు ప్రాముఖ్య మెడియు
ఖాదీకి లేదనఁగల్గి రన్నన్న!, కాంగిరె సచ్చముగా రాజకీయ
సంస్థయై పనిసేయఁజను నని తీర్చి, రిపుడు కాంగ్రెసునయం దేకదేశంబు
కాదు స్వరాజ్యపక్షం; బదే కాంగ్రె; సది శిష్టిసభలకు నంపినసభ్యు
నిఁకను గాంగ్రెసుసభ్యుఁడే యనవలయు, నెంతలో నెంతమా ర్పేర్పడె! ననుచు
సాధారణప్రజాచయ మబ్రపడియె, నొదవినమార్పైన నొకనాలుగేండ్లు
సాగెనా? లేదు; శాసనసభలందు, నడుగుమోపినవారియం దొకకొంద
ఱేమి! మంత్రిత్వము నీకొని మనము, బహుమార్గముల నేలుబడివారియాట
కట్టింపవచ్చునుగద! యన సాగి, రీ వర్గమున రాఘవేంద్రుఁడు, మూంజి,
జయకరు, కేల్కారు సడిసన్నవార, లీ తీరు మోతిలా లీకొనఁడాయె

## జయకరు, కేల్కారు స్వరాజ్యపక్షమును వదలుట

వాదోపవాదముల్ వచ్చె వీరలకుఁ, గేల్కారు, జయకరు కినిసి స్వరాజ్య
పక్షము తోడిసంబంధము న్మాని, యనుకూల సహకార మనుపాట పాడఁ
జొచ్చిరి, పాలకుల్ సూచించినట్టి, యుపసంఘములఁజేర నొప్పిరి కొంద,
అల్లన వంగోర్వియందును బలిమి, సడలె స్వరాజ్యపక్షంపువారలకు;
గజిబిజిగా నుండెఁ గాంగ్రెసునడత, ఖద్దరుపనులకై కాంగ్రెసునందుఁ
గలసొమ్ము గైకొని గాంధిమహాత్ముఁ, డపుడు చర్ఖాసంఘ మన్ని రాష్ట్రముల
శాఖోపశాఖల సాగింపఁదొడఁగె, నస్పృశ్యతాదోష మణఁగింపఁదొడఁగె
మతకలహమ్ముల మాయింపఁదొడఁగె, నొకపరి యీ కయ్య మొకవీట మిగుల
బెడిదమ్ముగా రేఁగఁ బెద్దయుఁ గుంది, గాంధి యిట్లనెఁ గాళికాఘట్టసభను. **607**

గీ. మనకు మనభూమి నేలుపెత్తనము చిక్క, వలయు నన్న హిందూముస్లిములు పరస్ప
రానురాగముతో మను టబ్బవలయు, నన్నదమ్ములవలె నుంట యమరవలయు. **608**

ఆ. ఇట్టికూర్మి పేర్మి పుట్టులోపల వీర, లొకనిరక్తధార లొకఁడు చూడ
వలతురేని జాగువల దట్టిపని; కది, యెంతక్రన్న నైన నంతమేలు. **609**

ఆ. చంపునందు మనకుఁ జవిగలదేని య, ద్దానిఁదీర్ప దొంగదారులేల
మనము నిక్కమైన మగవాండ్రభంగిన, చేసికొనుట మంచి దా సవమ్ము. **610**

గీ. మొసలికన్నీరు మనకేమియొసఁగు సాను, భూతికోరకుఁ దదిలేని పొలమునుండి
యెంతత్రచ్చియు నీతెగు లెదలుమందు, గానసైతి నాచాలమి కేను వగతు. **611**

వ. ఐకమత్యము త్యాగము సేవమున్నగుసుగుణములు ప్రజలం బాదుకొన మహాత్ముఁడి
ట్లారాటంపడుచు సత్యప్రయోగభరితంబగు నాత్మకథను రచియింప సమకట్టి (**1925**
నవంబరు) దాని బ్రతిసప్తాహమునఁ గొంతకొంతగా 'నవజీవన' పత్రికలోఁ బ్రచురింపఁ
దొడఁగె - అంత **612**

## కాన్పూరు కాంగ్రెసు

గీ. వచ్చెఁ గాన్పూరుకాంగ్రెసు; వర్ణనీయ, కవితలో దేశసేవలో గణ్యయైన
చాన తెనుఁగింటికోడ లాసభను జక్క, నడిపెను సరోజినీదేవి నమ్రసరణి.
(**1925** డిశంబరు చివర) **613**

గీ. బాపుజీ నిజాధ్యక్షతాభరము నామె, చేతఁబెట్టుట సభకుఁ గ్రొంజెలువు దెచ్చె
నతఁడు తనయయిదేండ్లచెయ్దములఁ గూర్చి, వించె నిటు లైదునిముసముల్ మించకుండ. **614**

గీ. "ఏను బల్కినసుడులయం దిడినయట్టి, యడుగులం దొకఁడును గాని దని తలంప
సర్వ మానాఁటికానాఁడు సవ్యమని మ, దాత్మకుం దోఁచుచున్నది యనె గురుండు. **615**

గీ. దేశమునఁ దగినంత యుద్రేక మున్నఁ, జట్టమును ద్రోయఁగా సమకట్టనేర్తుఁ
గాని దురదృష్టవశమునఁ గానిపింప, దట్టియావేశ మిపుడు కాసంతయైన". 616

గీ. దేశికున కుచితోక్తులు దెల్పి దేవి, వచ్చె నధ్యక్షపీఠికి నిచ్చె నమృత
రసము చిందు నుపన్యాస మసదృశంబు, పరిమితం బని సభ్యు లబ్రంపడంగ. 617

ఆ. దేశ మైకమత్యదీపితమై ధైర్య, కలితమై గమింపవలయు ననియె
సైఁపరాని గుణము జంకనియె నిరాశ, నరుఁడు మోయరానిదురిత మనియె. 618

వ. విదుషీమణియగు నమ్మగువపల్కు లాపరిషత్తునకుం గ్రొత్తతెగువను నమ్మికం బొడమించె - కాన్పూరుకాంగ్రె సాయమ్మదిద్దగడం జల్లగా సాగిపోయె - కాంగ్రెసుసంఘమువారు పాట్నాయం దొనర్చిన తీర్మానములెల్ల నిం దంగీకృతములాయె - సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వము నీదేశమున నెలకొల్పుట కేల్బడివా రవిలంబితమ్ముగా నాయిత్తపడరేని కాంగ్రెసువారు శాసనసభలం బాయవలయు నను నుత్తమనిర్ణయ మీసభం గావింపబడియె - మహాత్ముఁ డీసమావేశమునం దేనొక వత్సరంబుదనుకఁ గాంగ్రెసురాజకీయకార్య క్రమముతోడి పొత్తు విడువందలఁచితి నని తన నిశ్చయముం బ్రకటించె-మఱియు నమెరికా నుండి యీసదస్సునకు వచ్చిన రెవరెండుహోమ్సు గాంధిటోపీ దాల్చి వేదికపై నిల్చి 619

## రెవరెండుహోమ్సు మహాత్ముని మెచ్చుట

ఆ. "గాంధి దక్షిణాఫ్రికావాఁడు కాఁడు కాఁ, డిండియామనుష్యుఁ డితఁడు సకల
జగముపాలి మేలిసంపద యని యేను, వక్కణింతు సత్యవశుఁడ నగుచు. 620

వ. నే నొకమిత్రసంఘమున సభ్యుఁడ - దానికిం బ్రతినిధిగా నిమ్మహాసభకు వచ్చితి. 621

ఆ. మీరు మెచ్చినట్లు మేమును మెత్తు మీ, మానవోత్తముని గృపానిధాను
నితనియుద్యమంబు హిత మూర్వి కని నమ్మి, మానసింతు మెపుడు దానిగెల్పు. 622

క. మా పదమటినాగరికత, యాపదలం దెచ్చిపెట్టె; నధికారంబున్
జేపట్ట సిరిం బడయఁగ, నేఁప్రొద్దున్ బరుగులిడెద మే మూర్ఖులతోన్. 623

క. మాకోరికలు ఫలింప న, నేకరణంబులు ఘటిల్లె నీపీడకు ని
ర్మోకము గానక శాంతి, శ్రీ కోల్పడియుంటి మే మిసీ! రేయి పగల్. 624

ఆ. అణఁగ వీరణంబు లస్మదీయంబగు, నాగరికత సర్వ మీగుదనుక
హింసలేనిదారి నేగుచున్నారు మీ, రనుసరింపఁదగిన మనువు మీది. 625

ఆ. మీప్రవక్త గాంధి మీకిదు ప్రేమసం, దేశ మెల్లరకు నతీవశాంతి
జనకధర్మసూత్ర మనవద్య" మనుదు మే, ల్మేలటంచు నతని మెచ్చె రచ్చ. 626

## 1926

వ. కాన్పూరుకాంగ్రె సిట్లు ముగిసె-తదనంతర వ్యవహారములు నిస్సారములు - బొంబాయి రాష్ట్రమునందలి స్వరాజ్యపక్షమువారు జయకరునాయకత్వమున ననుకూల సహకార వాదముదెసకు మ్రొగ్గిరి - వీ రధికారమునందుకొనుట లెస్సయని నుడువందొడఁగిరి - వీరితీరు మోతీలాలునకు రుచింపమి నుభయవర్గముల నడుమన్ మచ్చరికములు హెచ్చె - శాసనసభాకార్యవిధానముపట్ల మోతీలాలునకుం దనకు నభిప్రాయభేదములు పొటకరించుటంజేసి లజపతిరాయి 'జాతీయపక్ష' మనుపేర నొకవర్గమును సృజియించె - మాలవ్యాపండితుఁడు దీని కండగానిలిచె - దిగజాఱుచున్న స్వరాజ్యపక్షమునుండి 'భారతస్వాతంత్ర్యసమితి' యనుతెగ యొం డుదయించె - రాజకీయాకాశము నిస్తేజ మయ్యె - స్వరాజ్యపక్షమువారు కేంద్రశాసనసభం బ్రకటించు జాతీయవాంఛ నధికారులు లెక్కసేయరైరి - దీనం గినిసి మోతీలాలు తనవారితో సభంబాసి బయటికివచ్చె-క్రొత్త యెన్నికలం (**1926** నవంబరు) బెక్కు తావులఁ గాంగ్రెసుపక్ష మోటువడె - లాలాజీ మాలవ్యాల జాతీయపక్షమ యీయోటమికిం గారణమాయె - కులతత్త్వ మీజాతీయపక్ష విజయమున కాధారము నాఁడగు - దేశమందిట్లు జాతీయదృష్టి సడలుటం గని యువ లాగ్రహోయత్తులైరి - వా రటనటం దమస్వరాజ్యదాహము నుపశమింపఁజేయ జెండాసత్యాగ్రహము మున్నగుతీవ్రకార్యక్రమము లారంభించి ప్రభుత్వము వారివిధించు

## గౌహతీ కాంగ్రెసు

శిక్షల కగ్గపడుచుండిరి - ఇంతలో గౌహతీకాంగ్రెసు వచ్చె - శ్రీనివాసయ్యంగారు దీని కధ్వర్యువు - వీరిపల్కులఁగాని వీరిపెద్దతికమునం బొడమిన నిర్ణయములఁగాని నూతనత్వ మేమియుం గానము - బాపుజీ మఱల నిమ్మహాసభను రాజకీయసంబంధము గల్గించుకొని స్వాతంత్ర్యసమితివారి సంపూర్ణ స్వరాజ్యనిర్ణయము నెదిర్చె - వెండియు నపు డొకమహమ్మదీయుఁడు శ్రద్ధానందస్వామిని జంప మహాత్ముఁ డీదుర్ఘటనపట్ల సానుభూతితీర్మానముం బ్రవేశపెట్టి హంతయగు నబ్దుల్ రషీదు దోషిగాఁ డనియు సత్యమగు మతముం గనలేక హిందూమహమ్మదీయుల కితరేతరద్వేషము నేర్పిన యుభయమతనాయకులే యిం దపరాధులనియు నిర్భయముగాఁ బల్కె - మఱియు **627**

క. ఇన్నాళ్లనుండి ఖాదీ, యున్నతికై గురుఁడొనర్చు నూడిగమెల్లన్
ద్రన్ననిరూపమునం బ్రజ, కన్నులకున్ గానిపించె గౌహతిసంతన్. **628**

క. ఎన్నికలకు శాసనసభ, పన్నాగంబులకు నిష్టపడక మహాత్మున్
వెన్నాడువారు నిరత, స్విన్నత నిల్లిల్లుదిరిగి చెప్పినపల్కుల్ - **629**

ఆ. విన్న పల్లెటూరివెలఁదులు మచ్చుపై, మూల్గుచున్న రాట్నములను దింపి
సవరచేసి కదురు సంధించి తెచ్చిరీ, వెలుఁగు; దీన నుఱవు తెలుఁగుపాలు. **630**

క. పొందూరిసన్నఖద్దరు, నందము చూపఱను బెద్ద యాకర్షించెన్
డిందుఁగదా మనపుట్టము, ముందఱ మరబట్ట యనుచు మురిసిరి విజ్ఞుల్. 631

వ. కాంగ్రెసువారి వస్తుప్రదర్శనశాలం గలబీహారుఖద్దరుసైతము ప్రేక్షణికుల నలరించె - నిద్రాణములైయున్న కుటీరపరిశ్రమల నిట్లు మేల్కొల్పిన చరఖాసంఘమువారి సేవ బహుధా కీర్తితంబాయె - పేదలకుఁ గూడుగుడ్డలు కల్పించునదియ నిక్కముగుస్వరాజ్య మని ప్రజ లానాఁ డెఱింగిరి - అది యట్లుండె. 632

## 1927

మం. గౌహతిపరిషత్తు కడచన్న వెనుక, శాసనసభలకుఁ జన్న కాంగిరెసు
పక్షమువా ర్విఠల్‌భాయిపటేలు, నధ్యక్షుఁజేసిరి హస్తినాసభకు
నీసభ నీతఁడే యింతకుమున్ను, నడిపె నేలికలును నల్లవో! యనఁగ
నిమ్మేటివంటివా రెందఱు కేంద్ర, శాసనసభయందు సభ్యులైయున్నఁ
దగిన రాజ్యాంగసూత్రంబులు లేమి, ద్వంద్వప్రభుత్వవిధానమ్ము కలిమి
నభ్యుదయమ్ము రాదాయె దేశమునఁ; గాంగ్రెసువారు ప్రెగ్గడలుగా నిల్చి
తమవ్రేఁగు మోయఁగాఁ దగునొదంబడిక, కియ్యకోల్‌చూపమి నేల్బడివార
లుత్సాహశూన్యులై యుండి; రేదెసను, గన్న నసంతృప్తి కడుకొనఁజాగె. 633

## సైమన్ బృందమేర్పడుట

గీ. ఆంగ్లసామ్రాజ్యనేత లీయవకతవక, లెఱిఁగి మతికొంతపెత్తన మీయకున్నఁ
దనిసనదు కాంగ్రెసనియెంచి తగినపనికిఁ, దొడరుమని భారతామాత్యుతో వచింప-634

గీ. అతఁడు సైమనుఁ బిల్చి "భారతధరిత్రి, కరిగి రాజకీయసమీక్ష జరిపి నేఁటి
బాధ్యతాయుతప్రభుత నేపాటిమార్పు, వలయు నది తేల్పఁగాఁ దఱివచ్చె మనకు-635

క. ఈవ్రేఁగు నీవ సైఁపం, గా వలఁతివి నీకుఁదోడుగా గొందఱు ప్ర
జ్ఞావంతుల నిచ్చెద వే, పోవలయును మీరు భరతభూమికి" ననినన్ - 636

క. సైమ "నగుఁగాక" యని తన, యామోదము దెల్పె; నిర్దయం బిడి హిందూ
భూమి కసమ్మతినిడె నౌ, రా! మోస మటంచు నార్చి రయ్యయిపెద్దల్. 637

వ. మన స్వయంనిర్ణయాధికారము నూఁచముట్టుగా నవధీరితమ్ముఁగావించి యభారతీయ మగు పరిశీలకబృందమును నియమించిన భారతరాజ్యాంగ కార్యదర్శి బర్కెన్‌హెడ్డుచర్య పుండుపైఁగారముచల్లిన ట్లున్నదని రాజకీయకార్యకర్త లీనేల నెల్లయెడలం బెల్లుడికిరి - సైమనుసంఘ మేర్పడినట్లు బర్కెన్‌హెడ్డు కావించిన యుత్తరువు నిచట రాజప్రతినిధి యిర్విను వెల్లరించి యీవర్గమునకుం దోడ్పడి సానుభూతి మెఱయుండని రాజకీయ నాయకులనెల్లర నర్థింపఁదొడఁగె - అయ్యవసరంబున 638

గీ. కేరళమ్మున ఖాదీప్రచారకార్య, మగ్నుఁడై యున్నయొజ్జకు మాననీయుఁ
డిర్వి నవిలంబితమ్ముగా నిభపురమ్ముఁ, జేరి ననుఁజూడుఁ డని యొకచీటి పంపి -639

ఆ. ఎల్లపనులు మాని ఢిల్లీకివచ్చిన, గాంధి కొసఁగె నింతకాగితంబు
చక్క విచ్చిచూడ సైమనుబృందంబు, నాదరింపుఁ డనుచు నందుఁ దోఁచె. 640

వ. పని యింతే యందురా? యని మహాత్ముం డపు డన 'నౌ'నని రాజప్రతినిధి పల్కె. 641

ఆ. ఇంతమాత్రకేల యీపిలు, పీయల, పంచెలేదె లేక నందఁజేయ
నని మనమ్మునందె యనుకొని గాంధి రై, లెక్కి దక్షిణోర్వి కేగుదెంచి - 642

## మహాత్ముఁడు కావించిన ధర్మోపదేశము

ఆ. పెక్కుతావులందుఁ బిన్నలు పెద్దలు, కూడినట్టి గొప్పగొప్పసభల
నుచితధర్మములను వచియించె జాతీయ, దీప్తి వలచి మంగళాప్తిఁ దలఁచి. 643

ఆ. మనుజుఁ డుత్తమోత్తమబ్రహ్మచారిని, మదిని నిల్పి వానిబ్రదుకువంటి
బ్రదుకు నేర్వ నిచ్చపడవలె సద్వాంఛ, రిత్తపోవ దుపకరించితీరు. 644

గీ. ఉత్తమాదర్శ మొకటి లేకున్ననాఁడు, నరుఁడు చుక్కానిలేనట్టి నావయగును
వలచు నాత్మవికాస మెవ్వాఁ డతండు, మెచ్చునీపల్కు లనియొకరచ్చఁ బల్కె. 645

ఆ. ఆత్మవికసనంబు నాసచేయక సదా, భౌతికాభివృద్ధికై తపించు
మార్క్సుమతమువారిమార్గము నన్ను రం, జింపదాయె నాహరింపదాయె. 646

ఆ. భాగ్యముండి పెట్టుబడిపెట్టి బేర మొ, నర్చువాఁడు కూలినాలిచేసి
బ్రదుకఁజూచువాని బాధించు ననువాద, ముచితమౌనె యనియె నొండుసభను. 647

గీ. బ్రాహ్మణ బ్రాహ్మణేతరప్రధనమిట్లు, రేఁగనేల తత్త్వజ్ఞులు త్యాగులైన
బాఁపనులు! మీర లైహికభద్రములు త్య, జింపుఁడీ! పెఱవారి కాసించుమేర. 648

క. మిగిలిన యుద్యోగాదులఁ, దగుతనివిం గనిన శాంతిదక్కును మీకున్
దిగులేలా నార్వోసిన, భగవానుఁడు నీరువోయుపని కొగ్గఁడొకో! 649

గీ. బ్రాహ్మణేతరులార! బాఁపలకు నూఱు, మడుఁగులుగ మీరుకల రతిమాత్రమైన
సిరికి మీ రేలికలు వృథాచింత మాని, యంగవింపుఁడు విశ్వకల్యాణమునకు. 650

క. బాఁపలపైఁగల కిన్కకు, లోపడి యన్నన్న! మంటలో వేయకుఁ డ
య్యా! పరమార్థప్రదమై, దీపించు సరస్వతిని స్వదేశపుటాస్తిన్. 651

వ. అని వేఱొండుగోష్ఠిం బల్కె. 652

క. ఒకనగరమందు నాంగ్లే, యకలాశాలను బఠించునట్టియువలు గాం
ధికిఁ గొంతరొక్కమిడి పే, దకు నుపయోగింపుఁడయ్య! ధనమిది యనినన్. 653

ఆ. ఒజ్జ యిట్టులనియె నోయన్నలార! మీ, రభ్యసించుచున్న యాంగ్లభాష
కల్లుత్రాగు దీనకార్మకు లర్పించు, పన్నుకతన నేర్పఁబడెడి నిచట. 654

ఆ. తెల్లవార లిట్లు తీర్పుచేసిరి; మీర, లీరహస్య మెఱుఁగరేమొ కాని
నేఁడు గుట్టుదెల్పినాఁడఁగదా! మదీ, యోక్తి నమ్మి శంక లుజ్జగించి - 655

ఆ. బడుగువాం డ్రొసంగు పాపపుసొమ్ముతో, నెఱయు నింగిలీసు నేర్చుయువలు!
మీయఘమ్ము వోవ మిక్కిలిగా విత్త, మిందు తెం దటంచు హెచ్చరించె. 656

ఆ. మఱియుఁ గుఱ్ఱలార! మన కొకజాతీయ, భాష వలయు బంధుభావ మొదవ
నిట్టిపొత్తు గూర్ప హిందీ తగున్ గాన, నియతులై తదుక్తి నేర్వుఁ డనియె. 657

వ. ఆచార్యుఁ డి ట్లయ్యయిధర్మము లందందుఁ బ్రవచించుచుండఁ జెన్నపురికాంగ్రెసువచ్చె (1927 డిశంబరు) - దేశమునం దీనాఁడు హిందూమహమ్మదీయకలహము లగ్గలముగా నుంటంజేసియు నీరెండువర్గములవారిలోఁ బరస్పరానురాగము లేర్పడ నింతకుమున్ను రెండైకమత్యసభలు జరుగుటంబట్టియు నేఁటిజాతీయమహాసభ సుప్రసిద్ధుఁడగు మహమ్మదీయుఁ డధ్యక్షుఁడుగాఁ బ్రవర్తిల్లుట సమంజసమని కాంగ్రెసుప్రముఖు లూహించి తద్భారము నన్సారిభుజస్కంధములపై మోపిరి - 658

## చెన్నపురి కాంగ్రెసు - అన్సారీ యాజమాన్యము

అతఁడు విజ్ఞానమూర్తి - వీనుమిగిలిన వెజ్జు - ఉదారుఁడు - ఆయన తనప్రసంగమున మతమైత్రింగూర్చి హెచ్చుతడవు పల్కె - కాంగ్రెసు ముప్పదియైదేండ్లు దొరతనమునకుఁ దోడ్పడెనని రెండేండ్లు సాహాయ్యనిరాకరణ మొనర్చెనని నాల్గేండ్లు శాసనసభలం బ్రతిష్టంభ కార్యక్రమము సాగించెనని తచ్చరిత్రసారాంశములు తేల్చివినిచె - నిరాకరణోద్యమముచే మన కపజయము రాలేదనియు మనచేతన దాని కోటమి వాటిల్లెననియుఁ గలరూపు చక్క మెఱయించె - కాంగ్రె సాగఱువ పల్కుల కతివేలమ్ముగాఁ దనిసె - దానఁ గావింపఁబడిన తీర్మానముల జాన్‌సైమను బృందము నెల్లవిధముల బహిష్కరింపవలయు నన్నది ప్రధానము - దీనివెనుక నుడువందగినది 'భారతీయుల లక్ష్యము సంపూర్ణ స్వాతంత్ర్య' మనునిర్ణయము - పెక్కేండ్లనుండి దీనిపట్లఁ దీవ్రమగుచర్చ జరుగుచుండె - నేఁటి కిది యంగీకృతమాయె - ఇందులకు జవహరలాలునెహ్రూ కారణము - ఇతఁడు బ్రస్సెల్సులో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేకసభం బాల్గొని స్వేచ్ఛావాయువులు పీల్చిపీల్చి యపుడ వచ్చినవాఁడు - ఈయనకు బాసటగా యువనాయకమణి సుభాసు చంద్రబోసు నిలిచె - తీర్మాన మిది చర్చకువచ్చినతఱి మహాత్ముఁడు సభలో లేఁడయ్యె - అవ్వల దీనివిజయమును విన్నంతన "యిది బడిపిల్లలచర్చాసంఘమున వెదలు

తీర్మానముంబోని" దని యమ్మేటి దానిం జులుకఁజేసె - ఇంకొక విశేష మేమనఁ 'గాంగ్రెసువారు దేశమునందలి రాజకీయపక్షములనెల్లం గలిపికొని యధినివేశ రాజ్యాంగ మున కొకప్రణాళికను సంతరింపవలయు' ననుతీర్మానముసైత మిమ్మహాసభం జేయఁ బడె - అది యట్లుండె - ఇంతకుము న్నీయేఁటఁ గాంగ్రెసువా రొనర్చిన లోకోత్తరమగు ప్రజాసేవ నించుక వివరింతు. 659

## గుజరీ వరదలు - కాంగ్రెసువారి సేవ

గీ. ఘూర్జరమ్మున వాలుమొగుళ్లు క్రమ్మి, వాఁగులును వ్రంత లేకమై వఱదపొంగఁ
బ్రజలు పశువులు దుర్భరాపదలఁ గ్రుంగఁ, గురిసె నేఁబదిదుక్కుల కుంభవృష్టి. 660

ఆ. ఇండ్లుకూలెఁ బంటయెల్ల మల్లామడి, యయ్యొ మిట్టపల్ల మనెడువాసి
తొలఁగెఁ దూలె వంతెనలు బాటలం బెను, గండ్లు పడియెఁ బ్రళయగతి ఘటిల్లె. 661

క. ఆకస్మికముగ ముట్టిన, యాకట్టిఁడివానలకు ననేకులు నరు ల
ఙ్గాఁకలఁబడి మడిసి రిఁకన్, మేఁకలగొఱ్ఱెలయవస్థ మేరన్గలదా? 662

క. పల్లెలలోఁ బట్టణముల, నల్లాడిరి ప్రజలు కూటి, కక్కట! పసులున్
డిల్లపడె బీళ్ళు వాములు, వెల్లువకుంజిక్కి మేఁతవెలితి గదింపన్. 663

ఆ. ఐదువేలపల్లె లలజడికిన్ బాలు, పడియెఁ, జెడియెఁ బెక్కుపట్టణములు
సగము బ్రుంగె భాగ్యనగర మహమ్మదా, బాదు సాహు లెదల బాఁదుకొనఁగ. 664

గీ. లేమికిని గల్మి కీనాఁడు లేదు వేర్మి, గుడిసెకును మేడకును గనంబడదు భేద
మెల్లరును విన్నఁబోయి బెగ్గిల్లి విధికి, నంజలించి రహంకార మణఁగిమణఁగ. 665

క. ఆపదయును సంపదకే, ప్రాపించు నొకప్పు డీ విపద్దశ ప్రజలో
వ్యాపించిన మచ్చరముల, రూపడఁచెన్ శుద్ధహార్దరుచి కల్పించెన్. 666

ఆ. గుజ్జరాతిసీమకుం గల కాంగ్రెసు, వల్లభుండు నాఁడు వల్లభుండు;
అమ్మహాశయుం దహమ్మదాబాదుమే, లరయుసంఘమునకు నధిపతియును(మేయరు). 667

గీ. అతనిపెద్దతికమ్ముతో నార్తసేవ, సలుప నేర్పడె నపుడుస్వచ్ఛందసేన;
నేను నే నని యొక్కదినాన దానఁ, బాలివారై రహో! రెండువేలమంది. 668

ఆ. వఱద యెంతవచ్చె వల్లడి యేపాటి, కూరె నది యెఱుంగరైరి దొరలు
కొంతకొంత తెలిసికొన్నను బైవారి, ముదలరాక వారు కదలరైరి. 669

ఆ. సాగినది పటేలుసర్దారుకాంగ్రెసు, యంత్ర మాఁకలేని యానమునను
గురుఁడు మేనిమేలుకొఱకు మైసూరు ధ, రిత్రి నపుడు కాఁపురించుచుండె. 670

ఆ. లోకబంధు వీతఁ డీకష్టకథ చెవి, కందినంతఁ గలఁగి యాఁగలేక
కదలె ఘూర్జరమున; కడి యెఱింగి పటేలు, పట్టుపట్టి గాంధిపయన మాఁపె. 671

వ. మహాత్మునిరాష్ట్ర మతని పరోక్షమునసైత మా యొజ్జయొనర్చిన హితోపదేశమును బాటించి సాంఘికసేవ కావింపఁగల దనుసత్యము నిప్పట్ల లోకమునకుం జాటనెంచి వల్లభాయి మహాత్ము నిట్లు నిలువరించె - వెండియు నిమ్మేటి యా రాష్ట్రమునందలి కాంగ్రెసువారి కెల్లరకును సేవాధర్మవిశిష్టతంగఱపె - వారు 672

క. తెప్పలపైఁ జని యెన్నో, కుప్పమ్ముల కిడిరి కూడుగుడ్డలు; ప్రజ లా
యప్పల భగవద్దూతల, చొప్పున భావించి రార్తి సురుఁగన్ విఱుగన్. 673

ఆ. ప్రజలెకాక యేలుబడివారియధికారు, లెందఱో మునింగి రీ బెడందఁ
గరుణ కగ్గపడిన కాంగ్రెసుబంటులు, బళిర! వీరలకును బంధులైరి. 674

ఆ. రాజకీయదృష్టి రాదు వీరికి విప, న్నులకు నూడిగంబు సలుపుపట్ల
నారగించె వీరియంపిన బోనంబు, నార్తుఁడైన మండలాధిపతియు. 675

గీ. క్రిందివారినివేదిక లందుకొనఁగ, వార్చుచుండిరి దొర; లవి వచ్చినపుడు
కొన్ని తావులకుం జేరుకొనుట మిగుల, నరిది యని తీర్పుచేసి రాయయ్య లకట!676

ఆ. గమ్య మిద్ది యది యగమ్యం బనక యెల్ల, పల్లె కేగె వల్లభాయిదళము
వలచి సేవచేయువారిచంద మెఱింగి, విశ్వమంతయును ద్రవించె నపుడు. 677

ఆ. ఐన నార్తజనుల కప్పటికప్పుడు, వలయుకూడు గుడ్డ వచ్చెఁగాని
చెడినయిల్లు చేను చెట్టు చేకూర్చిన, కొలఁదిలేనినష్టి తొలఁగు టెట్లు? 678

వ. ఇది పరిష్కరింపరానిసమస్యయై కాంగ్రెసువారిం గలఁచె - కావున గుజరాతియందలి పెద్దలు పటేలుయాజమాన్యమునం బెనఁగి దొరతనమువారు ప్రజాశ్రేయమునకై నూట యేఁబదినాల్గులక్షల రూప్యము లిచ్చునట్లు చేసిరి - ప్రజాసంస్థ లీ వఱద బెడఁదం దీర్ప ముప్పదిలక్షలరూప్యము లార్జించె-ఈవిత్తమంతయుఁ గాంగ్రెసు నాయకత్వమునఁ గర్షకాదుల కొసఁగంబడె - ఏలుబడివా రిప్పట్లఁ గాంగ్రెసునందు వెలువరించిన విశ్వాస ముభయగౌరవకారణ మాయె - వల్లభాయిపటేలున కీనాఁ దప్రతిద్వంద్వి యగుయశము వశంపడె - అతనిబలఁగము సుశిక్షితమయ్యె - ఘూర్జరుల కాత్మవిశ్వాసము హెచ్చె - ఆశాద్యుతులు దీపించె - అపుడు బొంబాయి శాసనసభయం దార్థికసభ్యుఁడు మెహతా భారత జాతీయ మహాసభను, దాని నాయకుఁడగు మహాత్మునిం గొనియాడిన తీరు మన కానందజనకము - దాని నించుక వివరింతు. 679

## కాంగ్రెసువారి సేవను దొరతనమువారు ప్రశంసించుట

ఆ. "కష్టకాలమందుఁ గర్తవ్యములఁ దీర్చ, ధృతి వివేక మిత్సుకతయు వలయు
నిచటిశాంతిసేన యామేల్మిని గడించి, యాదుకొనియె నార్తులైన ప్రజల. 680

గీ. ఈదళము దిక్కు లేక పెల్లేడ్చుజనత, కందఁజేసెఁ బసాదము నంబరమును
వఱదఁబడి పోవుననదల దరికిలాఁగి, ప్రాణములునిల్పి సంస్తుతిపాత్ర మయ్యె. 681

ఆ. తరతరాలనుండి ధనము నార్జించుట, తక్క నీవి - సేవ - ముక్కుమొగము
తెలియనట్టి ఘూర్జరులు నేఁడు తమమేలు, మఱచి సంఘసేవ మరగి రగుర! 682

ఆ. లోకసేవనంబు నీకొన్నబంట్లలో, జనపదమ్మువారిసంఖ్య హెచ్చు
ఇడుమ లనుభవించు టెఱిఁగినవారికే, యొరునిబెడఁద విన్నఁ గరఁగు నెడఁద. 683

గీ. నల్లవో! తమప్రియతమనాయకుండు, దవ్వుదవ్వుల నున్నను దత్తతిలక
తలఁపనితలంపుగాఁ దారసిలినకడిఁది, కీదు నిట్లెదిరింత్రె! కాంగ్రెస్సువారు. 684

గీ. ఎంత తనియుచున్నాఁడొ నేఁ డింతమంచి, పని యొనర్చి పొగడ్తలుపడయుచున్న
తనబలంగమువార్తలు వినుచు నొదలు, పులకరింపఁగ మైసూరుపుడమి గాంధి. 685

ఆ. అనఘుఁ డతఁడు పెద్దయలసి సేవాధర్మ, రతుల నేతదీయరాష్ట్రమందు
సృష్టిచేసె నతనిశిష్యులలో వల్ల, భాయి ప్రథమగణ్యుఁడై యెసంగు. 686

ఆ. ఇతఁడు నేఁడు గురున కింపైనగతిఁ బయ, నించి యింతపనిని నిర్వహించె
నెట్టిసంకటంబు ముట్టడించిన నహో!, విన్నబాటులేని వీరుఁ డగుట. 687

గీ. దొరతనమువారి కిమ్మేటి తోడ్పడంగ, నొల్లఁ; డైనను నేఁ డటులున్కి తగని
చేఁతయని నిర్ణయించె; నౌచిత్యవేది, నితని మెచ్చెద సంతోస మేసరేఁగ. 688

వ. మహాత్ముఁడు నేర్పినసాంఘికసేవా పరాయణత్వము గుజ్జరిం దిరపడుఁగాక! 689

ఆ. మోవరానిపీడగా వచ్చినట్టి వాః, ప్రళయ మిట్లు దేశపాలకుల ప్ర
శంస గూర్చి గుజరిజగతి సుఖాంతమై, పరిణమింప వల్లభాయి తనిసె. 690

## 1928

## సైమను వర్గమును దేశము బహిష్కరించుట

గీ. రాజకీయవిధా విమర్శనముకొఱకు, వచ్చుచున్నది సైమనువర్గ మిటకు
ఇర్వి నానాఁడు "దేశీయులెల్ల రండ, దండగా నిల్చి దీనికిఁ దగినయంత - 691

గీ. సాయ మొనరింపవలెఁ గేంద్రసభయు దీని, జయమునాసించి యొకచిన్నసమితినెన్న
వలయు నది సైమనుదళమ్మువారితోడ, నేకమైసాక్ష్యములు సంగ్రహింపవలయు. 692

గీ. ఈసమితివారు తమవాదమెల్లఁ దెలుప, వచ్చు సైమనుబృందమువారిఁ[బోల"
ననుడు దీరుపుసెప్పు పెత్తనములేని, పేర్మి యే లని మోతిలాల్ పెదవివిఱిచె. 693

గీ. గౌరవించు టెట్లగు నిది? భారతోర్వి, నలుపముగఁ జూచుకార్యంబ యగునుగాని
చీము నెత్తురు కలదు మా; కేమ దీని, దెసకురా మని పల్కె మోతీమనీషి. 694

వ. అంత రాజప్రతినిధి 695

ఆ. కలసి మీరు సాయపడినను బడకున్న, సైమ నిచటఁ జర్చ జరిపితీరు
నతనిసూచనల సమాలోచనమొనర్చి, పార్లమెంటు తీర్పు పల్కితీరు. 696

ఆ. అని ప్రతిజ్ఞసేయ నౌరౌర! యెంతమా, టాడె నిర్వి నని ప్రజాళి కనలె
అడుగుమోపె సైమ నమ్మఱునాఁడె భా,రతధరిత్రియందు హితులతోడ. (ఫిబ్రవరి3)697

వ. సైమనుబృందము బొంబయిరేవునం దోడదిగిననాఁడు భారతావనినెల్ల హరతాళము జరిగె – రాజభక్తి కడియాలముగా నేలికలిచ్చిన 'సర్' బిరుద మున్నపెద్దలు బొంబాయి నిర్వదియిద్ద ఱున్ననేమి? వారియం దొకఁడేని తద్దినమునఁ దద్వర్గముం గనఁడాయె – ఇది వచ్చినతతి భారతరాజధానిలో 'సైమనూ! తిరిగిపొ'మ్మను పల్కులుగల యట్టలంబూని పౌరు లత్యద్భుత ప్రతికూల ప్రదర్శనములు సాగించిరి – కాళీఘట్టమున విద్యార్థులకును రక్షకభటులకును జగడము వాటిల్లె – లక్నోలోఁ బ్రవర్తిల్లిన యాంక్షపట్ల నల్గిన పోలీసులు ప్రజలన్ దుడ్డుగఱ్ఱలతో మోఁదిరి – ఈ సంభావనము జవహర్‌లాలునకును ముట్టె – పాటలీపుత్రమున కీ దళమువా రేతెంచినపుడు వారి నాహ్వానింప నాయాపల్లెల కాఁపులం బెక్కంద్ర నధికారులు లారీలతోఁ దెచ్చుకొనిరి – పాప మా కర్షకు లువ్వెత్తుగాఁ జని బహిష్కారమహోత్సవమునం జేరిరి – రైలునొద్దఁగూడిన బహిష్కృతిసభకును స్వాగత సమితికిని జనసంఖ్యం గలవింగడ మేలుబడివారికనులం దెఱచె – సైమనుసమితి లాహోరుచేరినవేళ లాలాలజపతిరాయినాయకత్వమున నసంఖ్యాకప్రజలు గుమిగూడి ప్రతికూలకార్యక్రమము నేరాళముగా నడిపిరి – పోలీసు లయ్యెడ నిరంకుశ చర్యకుం గడఁగి పిన్న పెద్ద యనక యెల్లరపై లాటీలు వఱపిరి – లాలాజీసైత మీ ప్రహారములకు గుఱియయ్యె – అవల ననతికాలమునంద యిమ్మేటి మేనింబాయుట కీ ప్రేటులే హేతు వని కొందఱు నమ్మిరి – మఱియు నీసంఘమువారు చెన్నపురిం గదిసినపుడు 698

ఆ. దొరతనమ్మువారు సిరి తద్ద వెచ్చించి, రింబుమీఱ నాఁటిదంబములకు
దిద్దియుంచెఁ బ్రజలఁ దెనుఁగుసింగము బహి, ష్కరణ మద్వితీయగతిని సాగ. 699

గీ. పొమ్ము! సైమనూ! వెన్కకుఁబొ! మ్మటంచు, నల్లజెండాలతోఁబ్రజల్ నడిచిరెదురు
అబ్ధి నా వచ్చుజనసమూహమును జూచి, యధికృతుల్ దురహంకృతి కగ్గపడిరి. 700

ఆ. ప్రజలఁ జెదరఁగొట్టఁ బ్రయతించి; రించుక, జడుపు లేక నిల్వఁబడిరి ప్రజలు
రాచవారు సైఁపరానియెల్లిదమును, గుడిచి నిప్పుద్రొక్కుకోఁతులైరి. 701

క. కాల్చిరి లఘునాళికలన్, బ్రేల్చిరి గుండ్లను జనాళి బెదరుట కనుచున్
వ్రాల్చె నొకపౌరుఁ దురముం, జీల్చినగోళమున సొమ్మసిలి కాయంబున్. 702

ఆ. గాయపడినవారు కల రపు డెందఱో, రక్కసుల తుపాకిరవలు తాఁకి
యగ్గలించెఁ బ్రజలహాహారవంబులు, పెద్దపాడిపట్టునొద్ద నకట! 703

గీ. వచ్చుచున్నది వెల్లువవలె జనాళి, పృథివి కొరగినపార్థసారథిని జూడ
నదయు లధికారు లొకచిన్నగదిని శవము, నునిచి కావలిపెట్టి రా యొవరికిని. 704

## టంగుటూరి ప్రకాశము - వీరోచితచర్య

గీ. నెట్టుకొని యెవ్వఁడేని లోనికిఁ బదమ్ము, పెట్టెనా కాల్తు మనుచు ఱంపిలిరి బంట్లు
అత్తఱిఁ బ్రకాశ మక్షుల నగ్నికణము, లదరఁ బ్రజముందు నిల్చి వీరాంకమూర్తి. 705

మ. ఎవఁ డాకాల్చెదువాఁడు కాల్పవలె నా యూఱొమ్ముపై; నీశవం
బవలోకింపక పోవ నే నిపుడు, న న్నాఁపంగ నెవ్వాని కు
న్నవి గుండెల్, నిటలాక్షుఁ డడ్డుపడినన్ నాథాకకుం జాలఁ డీ
యవనిన్ భీరులు లేరు లేరు పరగర్వాగస్సహిష్ణుల్ శరుల్. 706

క. ఏనే కా దీజనతతి, లో నొక్కరుఁడైన సజ్జలోఁ గల బదుగున్
గానక మఱలఁడు మఱలఁడు, సైనికులారా! తొలంగిచనుఁ దవ్వలికిన్. 707

వ. అని యార్చి కూర్పాసముం ద్రోసి వక్షముం జూపుచు గదిలోనికిన్ దూసికొని పోవం
జాగిన 708

గీ. పుల్లవడి డిల్లవడి భటుల్ తెల్లమొగము, వైచి సూరెల నిల్చి యవార్యశౌర్య
ఖనికిఁ దెరువిచ్చి రీవీరఘట్ట మెవఁడు, మఱచు నత్యద్భుతం బతిమానుషంబు. 709

వ. టంగుటూరిప్రెగ్గడ కీనాఁడు దేశమునం దొదవినకీర్తి యతివేలము శాశ్వతము - అది
యట్లుండె. 710

గీ. ప్రజలు చాటునసమ్మతిం బడసిపడసి, దేశమున నాల్గుమూలలు తిరిగితిరిగి
చౌకతెగలతో ముచ్చటల్ సలిపిసలిపి, మనధరిత్రిని వీడె సైమనుదళంబు. 711

## సర్వపక్షసభవారి నివేదిక

గీ. చెన్నపురమునఁ గాంగ్రెసు చేసినట్టి, నిర్ణయమ్మునుబట్టి తన్నేత లఖిల
రాజకీయపక్షమ్ముల రాణగన్న, పెద్దలను బిల్చి తర్కముల్ పెనిచి రపుడు. 712

వ. సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వము వాంఛనీయమనియు, నిది యాదర్శముగా భారత
రాజ్యాంగస్మృతి యేర్పడవలయుననియు సర్వపక్షపరిషత్తువా రేకగ్రీవముగా నంగీకరించి

స్మృతినిర్మాణమునకై మోతీలాల్పండితునియాజమాన్యమున నొక యుపసంఘమును నిర్ణయింప నది కదుంగడు శ్రమించి రాజ్యాంగశాసనమును రచియించె - అఖిలపక్ష మహాసభయుఁ గాంగ్రెసుసంఘమును దానిం గొనియాడె - జవహరులాలు, సుభాసు, బులుసు సాంబమూర్తివంటి సంపూర్ణ స్వతంత్రతావాదులకు మాత్ర మీ రచన రుచింప దాయె - అదియట్లుంచి యాయేఁడుసమకూడిన ప్రజావిజయము నొకదాని నిట నుగ్గ డింపవలయు. 713

## బార్డోలీరైతులు పన్నులు చెల్లింపమి

గీ. సాధుశీలమ్మునకుఁ ద్యాగసంపదకును, దేశభక్తికి స్వాతంత్ర్యదీక్షకును బ్ర
సిద్ధినందిరి బార్డొలిసేద్యకాండ్రు, గాంధిపుట్టిన గుజ్జరీగడ్డ నుంట. 714

క. పన్నుల నిరాకరించుట, మున్నగుమార్గములఁ జట్టమును ద్రోయుటకున్
మున్ను (1922) గురుఁడు బార్డోలీ, నెన్నుకొనెన్గాని మానె నిప్పని నవలన్. 715

క. దేశమునయందు హింసా, వేశం బచటచటఁ దోఁప విడిచె మహాత్ముం
డీశాసనధిక్కృతి నపు, డాశలుడిగజాతి గుజరి యలమటఁ బడఁగన్. 716

క. నేఁడీకొఱంత తొలఁగన్, గూడె ముహూర్తంబు; నేఁడు ఘూర్జరకీర్తి
శ్రీ డంకా మొరయించుచు, వేడుకలన్ మునిఁగితేల విధి యిష్టపడెన్. 717

గీ. ఉండు నిర్వదియైదేండ్ల కొక్కవిడుత, పొలముపన్నున హెచ్చుతగ్గులసమీక్ష
తడవతడవకు నరిగ్రేఁగు తద్దయగుట, తక్క ముక్కాని యైనను దఱుగువడదు. 718

వ. నేఁటికరనిర్ణయమునసైతము బార్డోలిసీమలో, నూటికిర్వదియైదుపాళ్ళుగా నప్పనము పెరిఁగె - దీని నోర్వఁజాలమని కాఁపు లేలుబడివారి కెన్నేనిమనవులు పంపిరి - రాయబారములు నడిపిరి - జతనము లన్నియు విఫలమ్ము లగుటంజేసి గత్యంతరము గానక 719

గీ. పెంచినకరమ్మునెల్లఁ దగ్గించుదనుక, శిస్తు నీమని చాటిరి సేద్యకాండ్రు
తిరుగఁబా టిది రాజనైతికము గాదు, హలికు లాత్మరక్ష కొనర్చునట్టి తెగువ. 720

ఆ. దొరతనమ్మువారి మొఱకుఁదనం బింత, దనుకఁదెచ్చెఁ గృషికతతి నయారె!
పెల్లుతడవి రైతుపెద్ద లర్థించిరి, వల్లభాయి నపుడు వాదు నడుప. 721

ఆ. ఈయకొనెఁ బటేలు నాయకతాభార, మవధరింప నిడుమ సవదరింపఁ
గాఁపులార! మీకుఁ గల్గు జయంబని, దేశికుండు పల్కె నాశిషమ్ము. 722

ఆ. గడువుముగిసెఁ గాని మడితీర్వలో నొక, కానియేని యిడినకాఁపు లేఁడు
పండ్లుకొఱికి రేలుబడివారు నాదారు, మాసికింతబింకమా యటంచు. 723

గీ. మొదట వా రొకకోమటిముందు తమప, రాక్రమమ్మును జూపి రూరవ్యఁ దదురు
గుండెవాఁడని వారనుకొనిరి వారి, పప్పులుదుకవ బేహారిపట్లనైన. 724

గీ. ఒక్కదెస దేశదేశాల నూఁపుచున్న, బిరుదు కోమటిగాఁ గనిపించుచుండ
నింతపెదదారిఁద్రొక్కెదరేమి వీరు, కాలగతి గుర్తెఱుంగనిబేల లగుచు. 725

గీ. అవల సర్కారువారు మహమ్మదీయు, నొకని బెదరింప నతఁ డింతయును జలింపఁ
దదియొనర్చెద మిదియొనర్చెద మటంచు, సన్నకాఁపులకడఁ ద్రేలసాగి రంత. 726

గీ. పేదరైతులు "మాచేతిమీఁదుగా నొ, సంగనొల్లము గడ్డిపోఁచయును; బట్టు
కొనుఁడు మాకున్నమేఁకల గొఱ్ఱియలను, దున్నపోతుల"నని పల్కఁదొడఁగి రెదిరి.727

వ. అంతఁ గరగ్రాహులు కులమతస్పర్ధాజనకంబులగు తంత్రములుపన్నిరి - అవియు వీసరవోవుడు వారు క్రుధాశీలురగుపరానుల రావించి వారిసాయమునఁ గాఁపుల సంపద నరికట్టందొడఁగిరి - దుండగములకుం బేరుగన్న పరానులరాక ప్రజలం బెద్దకలఁచె - ఐనను వారు 728

క. నిగ్రహముంబాయక స, త్యాగ్రహసమరమున నిల్చి రద్రులకరణిన్
వ్యగ్రత నిందితమని స, మ్యగ్గీతిని వల్లభాయి యాదేశింపన్. 729

క. బలవంతముగాఁ బట్టిన, పలుగొఱ్ఱెల నాల నెడ్ల బఱ్ఱెల నొకపెన్
దళముంబలె నడిపించిరి, తెలివిం గోల్పడినభటులు తికమకపడుచున్. 730

ఆ. వారిపాట్లుసూచి యూరూరఁగల పసి, వాండ్రు పాటలల్లి వాడవాడఁ
బాడఁజొచ్చి రకట! పరిపాలకులచర్య, లిటులు నవ్వులాట కిరవులయ్యె. 731

క. ఎటులైననేమి వా రు, త్కటతన్ విడనాడరైరి ధర్మువుదెస కే
గుట కొప్పరైరి ప్రజకిది, పటుతన్ సమకూర్చె వల్లభాయి చతురతన్. 732

క. కాఁపులు కరణము లయ్యెదఁ, ద్రోపాడిరిపదవు లిడిరి దొరలకు దస్త్రా
లాపూఁటకు గతిగానని, యాపన్నుఁడు వెట్టియును దదధ్వమ ద్రొక్కెన్. 733

ఆ. ఉజ్జగించి రెందఱో శాసనసభాస, దస్యు లపుడు తమపదమ్ము లదిర!
గుజరి నెచటఁగన్న గునిసె నుత్సాహమ్ము, త్యాగ మాత్మగౌరవానురక్తి. 734

వ. వీరతావర్ధనంబగు నయ్యవసరంబున. 735

క. అసీమవాఁడు భారత, శాసనసభ నేలువాఁ డసాధారణధీ
భాసిల్లువాఁడు ప్రభువుల, మీసర మణఁగార జనులు మేల్మేలనఁగన్ - 736

క. ఈరీతిఁబల్కె "నేలిక, లారా! బార్డోలిప్రజలలంపట దీర్పన్
మీ రియ్యసేయరే నది, యోరువ నీగద్దెవీడి యుఱికెద ననికిన్." 737

వ. ఇట్లు విఠల్‌భాయిపటేల్ హెచ్చరింప. 738

గీ. ఆ పటేలున కీపటే లండయైన, నెవఁడు ఘూర్జరదేశంబు నేలఁగలఁడు
వలదువల దాల మని దొరల్ తలఁచి సంధి, సరణికొప్పిరి మర్యాద సడలనీక. 739

మం. జతపడ్డ యీనాఁటిసంధినిబట్టి, హాలికుల్ హెచ్చినయరినెల్ల మధ్య
వర్తికిఁ జెల్లింపవలయు నావెన్క, వ్యవహార మిది రచ్చవారు చర్చించి
బుద్ధికిఁ దోఁచుతీర్పును జెప్పవలయు, నిచ్చిరి పన్నెల్లఁ గృషికులు పెద్ద;
కేర్పడెఁ గోర్టు; ము న్నెవఁడు మహాత్ము, నంపె బందిగమున కా బ్రూముఫీల్డు
మాక్సువె ల్లనుబలుమానిసి తనకుఁ, దోడుగా నిల్వ రైతులవాదమెల్ల
నాలించె నోపిక యాదృతి పూని, గాలించె గాఁపులకలిమిలేములను
మూరినశిస్తులో ముప్పాలు ద్రోసి, యొకపాలు తగునని యునిచె; నిద్దాని
సైత మేల్బడివారు సైరికునుండి, రాఁబట్టరైరి గౌరవమును మెఱసి
చేకొన్నయాస్తు లిచ్చిరి కర్షకులకు, వదలిరి చెఱనున్న వల్లభాదులను
మానినపదవులు మరలనొసంగి, యుద్యోగులకుఁ దృప్తినొదవించి; రిట్లు
బార్డోలికాఁపులు పడసినవిజయ, మెల్లరమె ప్పందె; నిఁక భారతోర్వి
జంకదు దాస్యమున్ సైఁప దటంచు, జాతీయవాదులు సంతృప్తిపడిరి. 740

## కలకత్తా కాంగ్రెసు - సంపూర్ణస్వాతంత్ర్యచర్చ

వ. ఇంతలోఁ గలకత్తాకాంగ్రెసు తఱియంబడె - (1928 డిశంబరు) మోతీలాలు దీని కధ్యక్షుఁడుగా నుంట లెస్సయని కొందఱు, జవహర్లా లధ్వర్యుఁడుగా నునికి మేలని కొందఱు నాఁడు వాదప్రతివాదములు సాగించిరి - ఈకంటకమకుటము నీతండ్రి తలకే యెక్క నిమ్మని మహాత్ముఁడు కుమారనెహ్రూ నియ్యకొల్పె - వృద్ధనెహ్రూ సభాపతి యయ్యె-అఖిలపక్షమువారు కూర్చిన యధినివేశస్వరాజ్యవిధానమును సభవారామోదింప నొకతీర్మానమును బాపూ ప్రతిపాదించినంతన తద్విధానము పరిత్యాజ్యమని సంపూర్ణ స్వరాజ్యవాదులు కుమారనెహ్రూ, సుభాసు మున్నగువారు దాని నెదుర్కొనిరి-ఏఁడాదిలో మన కధినివేశప్రతిపత్తి నాంగ్లేయు లీయరేని సంపూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసులక్ష్యమని మహాత్ముఁడు తన నిర్ణయమును సవరింప నెల్లరుం దనిసిరి - ఈకాంగ్రెసునం దిదియ ముఖ్యమగునిర్ణయము నాఁజెల్లు - అంత నమ్మహాసభవా రస్పృశ్యతానివారణము మద్యపాననిషేధము సేవాదళనిర్మాణము విదేశవస్త్రబహిష్కరణము మున్నగు కార్యక్రమ ముల నంగీకరించిరి - పెఱవల్వలం ద్రోయ నేర్పడినకూటువకు సత్యాగ్రహవిధాత నేతగా నిలిచె - ఈయయ్యకు జయరామదాసదౌలత్‌రాము కార్యదర్శిగా వచ్చె - వీరు పరదేశ వస్త్రములం బదటిపా లొనరింప నిశ్చయించిరి - అయ్యది యట్లుండె. 741

## 1929

గీ. కాంగిరెసువారలొకయేఁడు గడువుపెట్టి, బాధ్యతాయుత స్వాతంత్ర్యపథము నియ్య
కొనుట విని యేలుబడివారు కుతిలపడిరి, కొందలించిరి క్రోధసంకుసుకులైరి. 742

క. మంచిపనిచేసెఁ గాంగ్రెసు, దంచెద మిఁక మాతృదేశదాస్యము నని హ
ర్షించిరిప్రజ లిఁక నేమొన, రించెదరో ప్రభువు లని నిరీక్షంబడుచున్. 743

## బాపూ విదేశవస్త్రములఁ గాల్చి శిక్షితుఁడగుట

క. అయ్యెడ భారతమం దొక, ప్రయ్యగతిన్దనరు బ్రహ్మవసుధకుఁ జనుచున్
నెయ్యురను జూచి రాఁగల, కయ్యము తెలిఁ గరయఁ గాళికాఘట్టమునన్ - 744

క. ఒకనాఁడాఁగె మహాత్ముఁడు, వికసించెఁ బురమ్ము ధర్మవీరునిరాకన్
స్వకకార్యక్రమ మచటం, బ్రకటింపఁగదంగె గాంధి ప్రజతోడుపడన్. 745

ఆ. నగరమెల్లఁ దిరిగి నానావిధవిదేశ, వస్త్రములను దెచ్చి వాని నొక్క
కొండవోలెఁ బేర్చి గురుఁ డగ్నిముట్టించి, కాల్చె నఘునగమ్ముఁ గాల్చినట్లు. 746

క. బహిరంగవీథియం దీ, దహనక్రియ జరిపి దారితప్పితి నిన్నున్
సహియింపదు చట్టం బని, మహాత్ముతో నపుడు వినయమంజులఫణితిన్ - 747

గీ. పలికి యధికృతుఁ డొక్కరూపాయశిక్ష, సెప్పె నొజ్జకు విజ్ఞు లచ్చెరువడంగ
నిసిరొ! వెదయుత్తరువునాశ్రయించుకతన, దొరతనమువారిపెక్కువతొలఁగఁబాతె. 748

ఆ. గడ్డిపోఁచవంటికట్టడఁ బఱపి వి, దేశవస్త్రనికృతిదెసకు నేగు
స్యందనమును దొరలు శాసనధిక్కృతి, స్మృతికి మలప మానసించియుంద్రు. 749

వ. ఇది నిక్కమగునేని వారిపన్నుగడ రిత్తవోయె ననందగు - కర్తవ్యనిర్ణయమున మహాత్ముఁ
దొరులకు నందువాఁడుకాఁడు - అది యట్లుండె - బాపూ బర్మా విషయమునకేగి
యచటివారికి వలయుహితోక్తులు పల్కి వైశంబ యిటకువచ్చి 750

## ఖద్దరు నిధికి మహాత్ముఁడాంధ్రదేశమున సంచరించుట

తెలుఁగువారివేఁడికోలు మన్నించి యాంధ్రదేశమునం దాఱువారములు సంచరించి (1929 ఏప్రిలు) పెక్కుపల్లెలం బట్టణముల దననిర్మాణకార్యక్రమ సందేశమును వినిచి ఖద్దరునిధికి మూఁడులక్షల రూప్యములు గడించె - పొందూరు తుని ఘంటసాల చేఁబ్రోలు పల్నాడు కనిగిరి కర్నూలు తాడిపత్రి మున్నగుతావుల నుత్పన్నమగు రహటాం బరముసొంపున కబ్బురంపడి తెలుఁగువారి హస్తనైపుణి నభినందించె - మఱియు నీయాత్రలో మహాత్ముఁ డీరచయిత కభిజనమగు కావూరికి విజయంచేయ వేయాఱులు

కాన్కవెట్టి ప్రజల లాసుకృతరాశియాశీస్సు లందిరి - ఈయుత్సవము సముచితముగా సాగింప నేర్పడిన కార్యకర్తృమండలియం దీకవియుం బాలివాఁడై సమ్మానపత్రరచనాది విధులు నిర్వహించి ధన్యతం బడసె - అది యట్లుండె - పదంపడి బాపూ బాపట్లవారి కాన్కలఁ బరిగ్రహించి చీరాలపౌరుల యుదుగర లందుకొని వేఁటపాలెమున కరిగి **(18-4-1929)** ప్రజాసేవాపరాయణుఁడు యశఃకాయుఁ దూటుకూరి వేంకటసుబ్బారావు శ్రేష్ఠి నెలకొల్పిన సారస్వత నికేతనమును గని సంతసించి దాని నూతనభవనమునకు శంకుస్థాపనముగావించి 'యీనవీనమందిరమున గ్రంథాలయము నిరంతరాభివృద్ధి నందుఁగాక' యని శుభమ్ముపల్కి నాఁటిధర్మకర్త నూటుకూరి జయరామదాసు నాదరించి గౌరవ కార్యదర్శి నదుసుమల్లి శ్రీనివాసరావు నభినందించె - ఈకార్యదర్శి **751**

క. పదవులుకోరక దేశా, భ్యుదయమునకు నలఁగు పూరుషోత్తముఁ; డీతం
దెదురైన నయత్నమ్ముగ, విధేయమగు విజ్ఞకోటి వీటన్ బాటన్. **752**

ఆ. ప్రజకు నిక్క మైనబలము సారస్వత, బల మటన్న పాడి దెలిసికొన్న
పెద్ద యితఁడు పెనఁగిపెనఁగి యజ్ఞులఁ దీర్చి,దిద్దు నితఁడు వీని కుద్ది యెతఁడు? **753**

గీ. కవులుపుట్టిరి సంఘసంస్కర్త లుదితు, లైరి మాతృమహీదాస్యభార మణఁపఁ
బ్రతినపూనిన యోధులేర్పడిరి శ్రీని, వాసరా వొనరించుసేవలు ఫలించి. **754**

ఆ. ఏఁబదేండ్లనుండి యెదయ కీతనివంటి, త్యాగధనులు కర్మయోగరతులు
కడఁగి నడిపినట్టి గ్రంథాలయోద్యమ, మద్వితీయతేజ మాంధ్రమహికి. **755**

గీ. సారసాహిత్యకిరణప్రసార మెచట, నొదవె నచటనె సత్యాగ్రహోద్యమమ్ము
మెప్పుగన్నది పరరాజ్య మొప్పనన్న, పలుకు మ్రోఁగినది హరిత్తు లులికి ప్రీల. **756**

వ. అది యట్లుండె - పదంపడి మహాత్ముఁ దామృగయాపుర ప్రజలు సమర్పించు నుపదం జేకొని వేతాందుదెసకుం జనియె - అయ్యవసరంబున **757**

## మాగ్డనాల్డు ప్రధానమంత్రి యగుట - భారతీయ సమస్యల సమీక్ష

ఆ. ఎన్నికలుఘటిల్లె నింగ్లాండునందు; మా, ర్వొల్లననెడివర్గ మోటునందె;
కలితవిజయ మయ్యెఁ గార్మికపక్షంబు, నేల ప్రొద్దెఱింగి నెగదుజట్టు. **758**

గీ. భారతోర్వి స్వతంత్రతాప్రభ గడించి, విశ్వరాజ్యకూటంబున వీనుమిగుల
వలతు రీతెగవారు వీరలజయమ్ము, వలచు భారతజాతీయవాదికులము. **759**

మం. వచ్చెను గార్మికవర్గనాయకుఁడు, మాగ్డనాల్డు ప్రధానమంత్రిపీఠికకు
విద్వదగ్రణియగు వెడ్జివుడ్‌బెన్ను, పడసె భారతమంత్రిపదము నానాఁడు
సైమనుచర్చలు చాలవు భార, తీయసమస్యలఁ దేల్చుట కనుచు
విశ్వసించినసత్యవిదురులు వీరు, "భారతావనినుండి బహుళవర్గముల -

రాజనీతిజ్ఞుల రావించి (తచ్చి), వలయురాజ్యాంగంబు వలయురక్షణలు
సంతరించెద, మాంగ్లసామ్రాజ్యమునకు, నగ్గపడిన స్వరాజ్యము భారతీయు
లనుభవించుట మాకు నభిమత" మనుచుఁ, బ్రకటింప భారతప్రజ సెబా సనియె. 760

ఆ. ఈసమస్యపట్ల నితరేతరాలోచ, నాదు లుచితరీతి నమరుకొఱకు
మార్గనాల్డు నిజసమక్షవాసమునకుఁ, బిలువ నిర్వి నేగెఁ బిలుపువెంట. 761

ఆ. అతఁడు నెలలునాలు గాంగ్లదేశంబున, నిలిచి పెద్దపెగడ కలఁతి వలఁతి
సుద్దు లెఱుకచేసి 'శుభమ'స్తనుచు మార్గ, నాల్డు పంప హస్తినగరి చేరి-(అక్టోబరు)762

వ. భారతరాజ్యాంగమును సంస్కరింప నీదేశమునంగల నానారాజకీయపక్ష ప్రతిభువులతో సంస్థానాధీశ్వరప్రతినిధులతో నొకసభ లండనులో జరుపంబడుననియు దేశీయులిందుఁ బాల్గొని యేలుబడివారికి సాయపడవలయుననియు నొకప్రకటనముకావించె - ఇట్టి వాగ్దానము తగదని లండనునందలి ప్రభువులసభలోఁ బెద్దదుమారము రేఁగ దీనం బొదముసష్టి లేదని భారతమంత్రి వక్కాణించె - ఇది జరిగినవెనుక మహాత్ముఁడు రాజ ప్రతినిధిం గని లండనుసభ సంపూర్ణమగు నధినివేశ ప్రతిపత్తి నాశ్రయించియ నడుచు నని మీరు పూఁటపడవలయు నని కోర నది నాతలకుమించినపని యని యిర్విను పల్కె - అంత నాచార్యుఁడు మాఱాడక మరలివచ్చె - ఈఘటన కాంగ్రెసునందలి గోవాళ్ళకు నిరుత్సాహముం గూర్చె - ఏలిక లొకవంక రాయబారములు సాగించుచు వేఱొకవంక నిర్బంధవిధానము ప్రయోగింపం దొడఁగిరి - చెఱసాలలం గలదేశభక్తుల మిగుల హింసింపఁబూనిరి - దీనికిం బ్రతిక్రియగా నెందఱో బందాలు నిరాహారదీక్షకుఁ గడంగిరి - ఈతపమ్ము నర్వదినాల్గునాళ్లొనర్చి యతీంద్రనాధదాసు తనువుంబాసె - రెవరెండువిజయా నూటయఱువది నాల్గుప్రొద్దు లుపవసించి బర్మాబందిగమున బొంది నూడ్చె - కేంద్రశాసనసభలో బాంబుప్రేల్చి యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష ననుభవించెడి దత్తు భగత్‌సింగు లన్నమున్‌ముట్టక కట్టెలగుచుండిరి - నేఁడు కార్మకసమస్యలుం బెరిఁగి బొంబయి కలకత్తా మున్నగు నగరమ్ముల సమ్మెలేర్పడియె - దేశ మి ట్లల్ల కల్లోలముగా నుండ 763

మధ్యా. భారతీయులకు స్వరాజ్యభాగ్యము ప్రాప్తించుకొఱకు
నారటంపడుచున్న కార్మికప్రభుత కనుకూలమగు
తీరున సాయం బొనర్ప మీ రిప్డు తివురుఁ డటంచుఁ
గోరఁగా సాగి రాంగ్లేయసుహృదులు గురుని వేమాఱు. 764

## ఆంగ్లమిత్రుల ధోరణి - బాపూ సమాధానము

ఆ. వార లంపుతంతివార్తల కుచితమౌ, నుత్తరంబు నిట్టు లొసఁగె గాంధి
"మిత్రులార! మీకు మే లొనరించుట, యస్మదాత్మ కిష్టమైన చేఁత. 765

క. కలకత్తానిర్ణయమున్, బలెఁ గార్మప్రభుతప్రకటనమ్మును నమ్మం
గల నియ్యవి రెండును నా, తలఁపునకుం దోఁచు నొక్కదారివ యగుచున్. **766**

ఆ. అక్షరములకంటె నర్థముకంటె భా, వము ప్రధాన మగును వ్రాఁతపట్ల
నిది గణింపకున్న నెన్నె ననర్థముల్, చెనకఁగలవు లోకజీవనమున. **767**

ఆ. ఇంగిలీసువారిహృదయంబు మాఱి భా, రతమహామహిన్ బురాతనాత్మ
గౌరవాఢ్యఁ జేయ స్వైరతారమ్యవి, ధానకలితఁ జేయఁ దలఁచునేని - **768**

ఆ. ప్రజకు సేవఁజేఁత పరమధర్మం బని, యిచటియధికృతాళి యెంచునేని
కత్తిగాదు ప్రజలగౌరవమే రక్ష, సేయు ననుచు మానసించునేని - **769**

గీ. వసువు నసువును గాపాడ వప్రవేదు, లేటికి శతఘ్ను లేటికి నెత్తు లేటి
కన్నృత మేటికి భారతీయప్రజాళి, శీలమే చాలు నని విశ్వసించునేని - **770**

గీ. అధినివేశస్వరాజ్యతం త్రానుకూల, దృష్టిఁ బయనించునేని యా శిష్టిరాక
కురవడింపక నే వార్చియుండ నోర్తుఁ, గలదు కాల మనంతముగా జగాన. **771**

క. నాపల్కు లనుసరించుట, కీపరిపాలకులు చాలరేని యిఁకన్ నా
కాపోక నిదుస్వతంత్రత, తోఁపదు నాబుద్ధి కెంతదూరము చనినన్. **772**

గీ. అధినివేశస్వతంత్రత యనిన నిచ్చ, యున్నదనుక సామ్రాజ్యమం దుండి వలపు
తొలఁగినంతన దానిపొత్తును ద్యజింపఁ, దగినచన వుంట యని మదిందలఁతు నేను. **773**

వ. కావున నాంగ్లభారతదేశముల పొత్తుంగూర్చి కట్టిఁడికట్టడలు కోరుట నాకు రిత్తపని - ఏ నాంగ్లసామ్రాజ్యమున నున్నంతకాల మీలోకమున శాంతిసౌహృదములు వర్ధిల్లుటకే నాపాలిపెత్తనము నుపయోగింతుఁ గాని సామ్రాజ్యవిస్తరమునకుం బరులసంపద నాహరించుటకున్ వినియోగింప - నాభావముల నాముఖ్యలక్ష్యములఁ బూర్తిగా గ్రహించుట కార్మకప్రభుత్వమువారియు నామిత్రులయుఁ గర్తవ్యము. **774**

మం. తనకోర్కి పండింపఁ దగినబలమ్ము, హిందూమహికి లేమి యెఱుఁగుదు నేను;
మాభూమి యాంగ్లోర్వి మంచితనమ్ము, కతననే యున్నతి గడియింపవలయు
నిది మాయుదారత యిది మాసుశీల, మని సంతసింపరా దాంగ్లభూప్రజలు
తరతరమ్ములనుండి తాము మాపాల, నాచరించిన బహుళాపరాధముల
కిది పాచితంబని యిది పరిహార, మని వారు గుర్తింపనగుఁ దేఱిచూచి
తప్పునొప్పిననాఁడె తలయెత్తు నరుఁడు, మదిని విప్పిననాఁడె మానవుం డెసఁగుఁ
దనలక్ష్యమును జేరఁదగుతఱి భార, తోర్వికి రాలేద యోర్వుఁడీ యనుచు
మీ రందురేని నే మిమ్మెదుర్కొనక, కలఁగ కల్గక కొంతకాల మాఁగెదను
నామాటలే యివి; నను సమర్థించు, ప్రజ లెంద ఱుందురో! భారతక్షోణి." **775**

వ. మహాత్ముఁ డిచ్చినయీసమాధాన మానెయ్యుర కెంతతెలిసెనో యెంతసంతృప్తి గూర్చెనో
దైవంబ యెఱుంగు - అది యట్లుండె. 776

## లాహోరు కాంగ్రెసు - జవహర్లాల్ యాజమాన్యము

గీ. కదియుచున్నది లాహోరుకాంగ్రె; సది వి, శిష్టమగుకాంగ్రె సది తప్తచిత్తమైన
భారతమ్మున కనుకూలపథముఁ జూపఁ, దగినకాంగ్రెసు దాని కధ్యక్షుఁ డెవఁడొ! 777

గీ. శాసనోల్లంఘనాది నిశాతసాధ, నాళితో దేశమాతృదాస్యమును ద్రోయ
నారటించుకాంగ్రెసున కంతంతమాత్ర, చదురుగలవాఁడు నేతగాఁ జాలఁ డపుడు. 778

ఆ. గాంధితక్క నెవఁడుకలఁడు దుర్గమమైన, సరణి జాతి నడిపి జయమునంద
గాంధితక్క నెవఁడుకలఁ డాంగ్లసామ్రాజ్య, నేతకంటి కాని నిలుచుమగఁడు? 779

ఆ. అగుటఁజేసి గాంధి నధ్యక్షుఁగా నెన్ని, తెలివి తెలివు రాష్ట్రములు వెలార్చె
వలదువలదు యువల కెలమి నీఁగలవాని, నధిపుఁజేంత యుక్తమనియె నొజ్జ. 780

క. జవహర్లా లీపేర్మికిఁ, దవునని సూచించె; నయ్యతలఁపున కడ్డం
బెవరుం జెప్పమి లోకం, బవురా యన జవహరాఖ్యుఁ డధిపతి యయ్యెన్. 781

ఆ. ఇంతపిన్నవాని కిదివఱ కీగద్దె, యబ్బలేదు కీర్తి సుబ్బలేదు
వయసుతోఁ బనేమివచ్చు విద్యావివే, కాదులున్నవాని నాదరింప. 782

ఆ. కదలినారు కార్యకర్తలు లాహోరు, కాంగ్రెసునకు నెల్లకడలనుండి
పిడుగువంటివార్త విని రిర్వి నేతెంచు, రైలుక్రింద బాంబు ప్రేలె ననుచు. 783

(1929 డిశంబరు 23)

వ. ఈదుర్వార్తకు జతగా నానాఁడ రాజప్రతినిధి యధినివేశస్వరాజ్యమునకుం బూఁటపడఁ జాల నని పల్కుటంజేసి కాంగ్రెసుపెద్దలయాస లడియాసలైనకథయు వీ రెఱింగిరి - ఇఁకఁ బ్రాణత్యాగమునకేని సిద్ధపడియుంట కాంగ్రెసుసేవకుల కర్తవ్యమని నిర్ణయించుకొనిరి - ఈయుద్రేకవహ్నిముం దెముకలం గొఱుకఁదగినసీతు వయ్యెడ వీరిం దాఁకలేక తోఁకముడుచుకొనియె - లాహోరునంగూడిన భారత జాతీయమహాసభ దేశమునం గల తీవ్రతరనిర్బంధవిధానముం దలఁచియు భారత రాజ్యాంగకార్యదర్శి బెన్ను మననేలం బదియేండ్లఁగోలె నధినివేశప్రతిపత్తి కలదని పిసాళిపల్కు లాడుటం దడవియు సంవర్త సమయసరిత్పతింబలె ఘూర్ణిల్లసాగె - అట్టియెడ జవహర్లా లధ్యక్షపీఠినుండి యిట్లభి భాషించె. 784

ఆ. పొదముచున్న దిపుడు పుడమి నేనాఁడును, జిత్తగింపనట్టి క్రొత్తమార్పు;
అనుభవించుచున్న దవని యీనవతకై, పురుదు గానరాని పురుటినొప్పి. 785

ఆ. ఆసియాధరిత్రి నన్యదేశమ్ముల, పోల్కి నిపుడు భరతభూమిసైత
మూనె వెతలు విశ్వమానవోద్యమములఁ, బొలువడసి లోక భద్ర మరసి. 786

ఆ. ఎంతపడిననేమి? యీగడ్డలోఁ బెక్కు, మతము లుంట నన్యమతమువాని
నరుఁడు నమ్మకుంట నానాభయమ్ములు, రేఁగి వచ్చునశుభము లాఁగిపోయె. 787

గీ. హైందవులు ముస్లిములు సిక్కు లన్నదమ్ము, లట్లు జీవింపఁ దగిన సూత్రాళిగూర్చి
ప్రాజ్ఞు లెంతబోధించినఁ బ్రజలు వినరు, చెల్లరే! లేదు సాంఘికస్థిరత యిచట. 788

క. ఇర్విను చేసినప్రకటన, సర్వము కన్పించు శాంతిసందేశముగన్
గుర్వెట్టరు ప్రజలు దయా, పూర్వకవాక్యముల మఱచిపోరు సమస్యన్. 789

గీ. ఇప్పటికినైన మించిపోయినది లేదు, బెడిదపుంగయ్యమున కేమ తొందరలేదు
మంచిమన సేలికలకున్న మనము వారు, చేసికొనవచ్చు సంధి నెచ్చెలులవోలె. 790

ఆ. వెడ్జివుడ్డుబెన్ను వెలువరించిన బాధ్య, తాయుత స్వతంత్రతావిధాన
మనుచితం; బతండు మనచుట్టుఁ బన్నిన, జాల మద్ది యింద్రజాల మద్ది. 791

ఆ. మనము చేయఁదగినపని కాళికాఘట్ట, నిర్ణయంబె వక్కణింపఁగలదు
లాఁతిపెత్తనంబు లవమాత్ర లేని పూ, ర్ణస్వరాజ్య మిటఁ దనర్పవలయు. 792

ఆ. ఏనుసామ్యవాది నేను బ్రజాతంత్ర, ముచిత మని తలంచు నోజవాఁడ
రాజు లీజగమ్ము రక్షింతురని విశ్వ, సింప నేను నిర్ణయింప నేను. 793

ఆ. హింసవలన హింసయేర్పడు నవినీతి, పెరుఁగు నుద్యమంబు బెడిసికొట్టు
భారతోర్వి నిట్టిపని బొత్తిగాఁ దగ, దది ఘటించు నెల్లయవగడముల. 794

ఆ. జగము నిపుడు హింస శాసించుచుంట నా, కవగతంబ, దాని నాశ్రయింప
మనకు గెల్పు కల్గినను గల్గవచ్చును, గాని మనము తగము దీనిఁ బఱప. 795

గీ. కత్తిలేని విమానసంపత్తిలేని, నావలేని సంగరశిక్షణమ్ములేని
భారతీయులు దౌర్జన్యపథముపట్టి, నోవిపా లౌటగా కేమిబావుకొంద్రు. 796

క. మనలోఁ బెక్కురు హింసకు, ననుకూలురు గామి, దీన నాసించిన మే
లొనగూడదు దేశమ్మున, కని నమ్ముటఁజేసి; దోస మని కాదుసుండీ! 797

గీ. కార్యసాధకదృష్టితోఁగాక ధర్మ, దృష్టితో దీని నేను జర్చింప నిపుడు
అలవరించిన విప్లవంబులకుఁదక్కఁ, దగదు దౌర్జన్యవిధి ప్రజోద్యమములందు. 798

క. ఏదారిని మనకు జయ, శ్రీ దక్కునొ గట్టిపఱిచి చెప్పంజాలన్
నాదారుగుండె నెఱుఁగని, జోదులకే విజయలక్ష్మి చొప్పదు ననెదన్. 799

క. ఎదిరింపవలయు నుగ్రా, పదలన్ మనమిపుడు; మేటిపను లొనరింపన్
మదిగలవారికి బెదఁదలు, పదపదమున నడ్డువచ్చు భయదాకృతులన్. 800

మం. ఆంగ్లేయుల నిరంకుశాధికారంబు, తలఁగి సంపూర్ణస్వతంత్రత మనకు
రావలె; నిదియె స్వరాజ్యం బనంగ, నిది వచ్చి సామ్రాజ్యదృష్టి సర్వంబు
దిగజాఱుదనుక నీదేశ మన్యోన్య, భద్రంబులకు నేరుపడునట్టిసమితి (కామన్‌వెల్తు)
నంగీకరింప; దెట్లైనను మనము, గడియింపవలె నధికారమున్ మొదట
నధినివేశస్వరాజ్యము నిక్కమైన, పెత్తన మనరాదు పెఱవానిదళము
లీనేలనుండి పోయిననాఁడె మనకు, నిజమైనచనవు సన్నిహితమైనట్లు
అన్యదేశీయుల యార్థికస్వామ్య, మీనేలనుండి పోయిననాఁడె మనకు
నిజమైనచనవు సన్నిహిత మైనట్లు. 801

క. ఈకరణి వెదలువలుకుం, బాఁకులతో వానిచాటుభావమ్ములతో
నేకీభవించుటన్ గురుఁ, డీ కాంగ్రెసుచర్చలెల్ల నిమ్ముగఁ జాగెన్. 802

## సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెసువారి లక్ష్యము

వ. భారతీయుల యధినివేశప్రతిపత్తివాంఛ చెల్లింపఁ గలకత్తాకాంగ్రె సేలుబడివారి కిచ్చిన గడు వేఁదాదియు డిశంబరుతుదినాఁటినడికిరేయితో ముగిసె - కాన మహాత్ముఁ డా నిశీథమున లాహోరుకాంగ్రెసునందు 'సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెసువారి లక్ష్య'మను తీర్మానము నుపపాదింప నది జయజయధ్వానముల నడుమ నంగీకృతమయ్యె-మఱియు నిమ్మహాసభ నఖిలపక్షసభవారి రాజ్యాంగ నివేదిక (మోతీలాల్ నెహ్రూ సంఘనివేదిక) యిఁకఁ బరిత్యాజ్యమనియు, శాసనసభాసభ్యులు తమపదవులు వదలుటయకాక రానున్న యెన్నికలకు దవ్వుగా నుంటయు వలయుననియుఁ గార్యకర్తలు నిర్మాణకార్యక్రమమును నిరంతరదీక్షతో సాగింపఁ దగుననియుఁ గాంగ్రెసుసంఘమువారు తఱియెఱిఁగి కర నిరాకృతిసహిత శాసనోల్లంఘనము నుచితరంగములఁ బ్రయోగింపవలయుననియు, నిర్ణయింపంబడె-వెండియు రాజప్రతినిధివచ్చు పొగబండిపై బాంబుపఱపుట శోచనీయ మనియు, నిట్టిదుశ్చర్య కాంగ్రెసులక్ష్యమునకు విరుద్ధమనియు జాతీయోద్యమమునకు గొడ్డటిపెట్టనియు నిమ్మహాసభవా రంగీకరించిరి. 803

మం. పెనుగాలివాన పింపిసలాడఁ దొడఁగె, కదలె మున్నీటిపైఁ గాంగ్రెసునౌక
ఉల్లోలపంక్తుల నుదధిఘూర్ణిల్లె, అకాశ ముగ్రమేఘావృత మాయె
తెరవోనిమంచుతో దిగ్భ్రాంతివొడమె, అనుభూతిలేనివారైరి తెర్వరులు
అగుఁగాక నావికుఁ డసమానధైర్య, శేముషీఖని కానఁ జే టెట్లువచ్చు? 804



# మహాత్మ కథ

## రెండవ భాగము

## 1930

గీ. ఒఱగcబెట్టెద రెడ్డియో దొర లటంచుc గాంగ్రెసు నిరీక్షణమొనర్చుకాల మరిగె
నెట్టిచాగంబులకునైన నియ్యచేసి, దాస్యనిర్మూలన మొనర్చుతఱి ఘటిల్లె. 1

### సుముహూర్తము వచ్చుచున్నది

వ. కావున లాహోరుకాంగ్రెసు ముగిసినంతన తన్నగరమునc గాంగ్రెసు కార్యవర్గమువారు సమావిష్టులై జనవరియిరువదాఱవదినము సంపూర్ణస్వాతంత్ర్యజయంతిగా నిర్ణయించిరి – ఆదినమున సేతువునుండి శీతాద్రిదనుక బహిరంగసభలం బ్రజ లెన్ని యిడుములేని సైcచి సంపూర్ణస్వరాజ్యము సాధింతుమని ప్రమాణము కావించిరి – నివురుగప్పిన నిప్పువలె నున్న భారతీయులయుత్సాహ మానాcడు తేటతెల్లమయ్యె – ఈప్రమాణోత్స వములకు ముందు (జనవరి 25) రాజప్రతినిధి ఢిల్లీ శాసనసభం బ్రసంగించుచుc గాంగ్రెసువారుకోరు సంపూర్ణస్వరాజ్యము లభించుట స్వప్నవార్తయనియు నాదర్శము నకును సిద్ధికిని జాల నెడముండుననియు వలయితగోష్ఠిలో వెలువడుతీర్మానము లభిప్రాయము లగును గాని చట్టములుకావనియు నుపాలంభించె – పదంపడి మహాత్ముcడు రాజప్రతి నిధికిc బ్రత్యుత్తరముగాc దన 'యువభారత' (యంగిండియా) పత్రిక నిట్లువ్రాసె. (జనవరి 31) 2

ఆ. "బళిర! మెచ్చcదగినపని చేసె నిర్విను, సూటిగా వెలార్చె సూనృతంబు
నితనిచిత్తశుద్ధి కీనేల నెల్లరు, చాటవలెc గృతజ్ఞసరణి సరగ. 3

గీ. ఇచటి కోటీశ్వరుcడు కూటి కేడ్చు కూలి, వాcడుగా మాఱినప్పు డీప్రోద మనకుc
బెత్తనంబు నొసంగు నీబెదcద రాక, కెన్ని యేండ్లైన నితc డోర్చి యెదురుసూచు. 4

ఆ. కాంగ్రెసునకు శక్తికలదేని యెముకల, గూcడులై కడిందిగోడు గుడుచు
నేcటిసేద్యగాండ్రc గోటీశ్వరులcజేయ, నంగవించి గెలిచి పొంగcగలదు. 5

క. దైవముకా దీప్రభుతయ, నావెతకుం గతమటంచు నమ్మిననాc దే
త్రోవకువచ్చునొ కర్షకుc, దేవిప్లవమునకు నెట్టిహింసకు దిగునో! 6

ఆ. సైరికులను మంచిదారిలో నడిపింప, నభిలషించుc గాంగ్రె సనుదినంబు
దుండగములు కుట్ర లుండవు కాంగ్రెసు, వారి కనుచుc గననివారు లేరు. 7

వ. ప్రజలయోర్మి సడలకుంట కీనాcడు 8

మం. కలుద్రావరాదని కట్టడసల్పి, పంటపన్నున నర్ధభాగంబు తొలఁచి
మాఱకపున్విల్వ మడఁగింపనొప్పి, యప్పుప న్నంతయు నుడిగించివైచి
పెఱవల్వపైపన్ను పెంపుగావించి, తొలఁగించి దేశభక్తుల బందిబ్రదుకు
సైనికవ్యయమున సొఁబాలు కోసి, తద్దగా నౌసఁగుజీతములు తగ్గించి
చారశాఖావిసర్జన మొనరించి, యొడబేరము ప్రజ కొప్పనచేసి
యాత్మసంరక్షణ కసి పట్టనిచ్చి, యేలువారలు పాలితేచ్ఛ లీపాటి
మన్నింపవలయు; నిమ్మయి కియ్యకొన్న, నుజ్జగించును శాసనోల్లంఘనమ్ము
వలయితగోష్ఠికి వచ్చి కాంగ్రెస్సు, నిజమనోరథము లన్నియు బయల్పఱుచు." 9

క. వ్రాయసమును దీనిని వై, స్రాయి గణింపమి మహాత్ముశరణంబున జా
తీయమహాసభమంత్రులు, పాయని స్వాతంత్ర్యదాహబాధం బడుచున్. 10

గీ. "శాసనోల్లంఘనం బిఁక సాగవలయు, గాంధిపెత్తనమున నిది కదలవలయు
సాత్వికనిరోధకులకుఁ బ్రజాసమూహ, ముచితమగు సాయమొనరింప నొప్పవలయు. 11

క. పెద్దలు బంధితులగుచోఁ, దద్దయు ధైర్యమున రణవిధానము నడుపన్
గద్దఱిపిన్నలు రావలె, నుద్దీప్తి ఘటింపవలయు నుద్యమమునకున్." 12

వ. అని తీర్మానమొనర్చిరి - దేశమున సత్యాగ్రహోత్సాహము వెల్లివిరియందొడఁగె - తిరుగఁబాటున కేచట్టము గుఱియగునో యని ప్రజలు తహతహపడుచుండ నుప్పు చట్ట మని సత్యాగ్రహసమరవిధాత ప్రకటించె - ఆయయ్య తన నిర్ణయమును ముందుగా దొరతనమువారి కెఱుకసేఁత సముచితమని తలంచి రాజప్రతినిధి కొక దీర్ఘలేఖ వ్రాసి దానిం దనచెంత నివసించు నాంగ్లమిత్రుడు 'రెజినాల్డురెయినాల్డు'న కిచ్చిపంపె - (మార్చి 2) చరిత్రాత్మకమగు నాకమ్మ నిటఁ బ్రకటింతు. 13

## లవణ శాసనధిక్కారము గూర్చి బాపూ వైస్రాయికి లేఖవ్రాయుట

గీ. "నెచ్చెలీ! తడవులనుండి నేను బూన, వెఱచు శాసనోల్లంఘనవిధికి నేఁడు
నడుముకట్టఁదలంచి మున్నడిగ మీకుఁ, బంపుచున్నాఁడ నీలేఖ బరువుతొలఁగ. 14

ఆ. ఎఱిఁగియెఱిఁగి ప్రాణి కెద్దానికైనను, గీడుగూర్ప నిచ్చగింపనేను
నన్నువంటిమనుజునకు నిఁక నెట్లార్తి, గూర్పఁగలను శాంతి నార్పఁగలను? 15

క. ఏవారైనను నాకున్, నావారికి నెంతయొగ్గొనర్చిన సైఁతున్
నేవారి కలఁతిచెట్టయుఁ, గావింపఁదలంప నెట్టిఘటనలనైనన్. 16

ఆ. అగుటఁజేసి యిచటియాంగ్లరాజ్యము పాప, నిలయమనుచు నేను దలఁతుఁగాక
యిచటి తెల్లవాని కితనిసత్సంపద, కెదరు దెచ్చుపనికిఁ దొడరనొల్ల. 17

గీ. వేఱుగా నన్నుఁదలఁపకుఁ డీరు; దురిత, శరణ మీనేలఁగల తెల్లదొరతనమ్ము;
ఐన నింగ్లీషుజాతివా రంద ఱుద్ది, లేని చెన్నఁటివారని యేను దలఁప. 18

ఆ. ఇంగిలీసువార లెందఱో కలరు నే, మెచ్చి గారవించు మిత్రతతిని
కలదు నాకు నిట్టికలిమి యంచు వచింతు, పట్ల మిగుల గర్వపడెద నేను. 19

గీ. ఆంగ్లరాజ్యము - భారతీయ ప్రజాళి, నేలురాజ్య మొనర్చినయెగ్గులెల్ల
నేనెతింగితి నాంగ్లేయుఁడే యొకండు, సత్యనిరతిని వ్రాసినచరిత చదివి. 20

గీ. మెల్లమెల్లగ మావిత్తమెల్ల గుంజె, మోయరానివెచ్చమ్మున ముంచె నిలను
నోరులేని మా ప్రజలను నొంచినొంచి, పేదలనొనర్చెఁ దెలవారి పెత్తనమ్ము. 21

గీ. అకట! యిదిమాకు దాస్యము నలవరించె, నణఁచె మాసంస్కృతిని గణ్యమైనదాని
మము నిరాయుధులనుజేసె, మణఁచె నస్మ, దాత్మ నిస్సిరో! పందలమైతి మేము. 22

ఆ. ఎల్లి మీరుకూర్చు నెల్లపక్షమ్ముల, సభ నిరర్థ మన్నజాడ తెలిసె
నింక నాఁగనేల యీగోష్ఠి కయ్యది, నేతిబీరకాయరీతి దైన. 23

గీ. ఇండియాకు స్వతంత్రత నిడిన నిచటి, సంపదను వణిజ్యాదుల సంగ్రహింప
సందుచిక్క దటంచు మీజాతివారు, తలఁచి రిఁక జాడ్యమొనరింపఁదగునె మాకు. 24

గీ. అస్వతంత్రత నణఁగించునట్టివేళ, వచ్చినది మాకు; మేము కావలయుననెడి
పెత్తనముతీరు మీకు విన్పింతుఁ గొంత, నావచస్సులు సావధానముగ వినుఁడు! 25

వ. స్వతంత్రభారతమున నేలపన్నుబరువు తగ్గవలయు - శిస్తుమేరకు నిలుకడరావలయు -కాఁపులమేలు ప్రధానముగా నేలుబడివారియాయవ్యయము లేర్పడవలయు-నేఁడు పేదవాఁ డుప్పుపన్నువ్రేఁగుసైత ముగ్గడువుగా మోసెడిని - సంపన్నుల కంటె నితఁ డెక్కుడుగా నుప్పు దినవలయుఁగదా! దొరతనమువారు మద్యము నమ్మి యార్జించుసిరి యందేని వీనిపా లధికము - త్రాగుఁబోతునకు విత్తమేకాదు శీలారోగ్యములును లుప్తము లగు - వైయక్తికస్వేచ్ఛ యనుపేర మద్యపానమున కధికారులు దోహదమొసఁగుచున్నారు - కల్లుపాటలతో వచ్చులాభము విద్యాశాఖకు వెచ్చింపఁబడుచున్నది - దీనిని వారించు చనవు ద్వంద్వప్రభుత్వమునంగల ప్రెగ్గడకు లేదు - వారించిననాఁడు వానికి వేఱొండు దారిని దమ్మిడీరాదు - కాన దరిద్రులసొమ్మే వాని కాదరువు - బీద లిట్లు పన్నుల వ్రేఁకనతోఁ గ్రుంగుచున్నారు - తెల్లవా రీదేశమున నూలుదీఁత వలువనేఁత మున్నగు నుపవృత్తులం గూల్చుకతనఁ బేదవానిబ్రతుకు కడుంగడుదిగజాఱె - మఱియు 26

మం. భారతావనిపేరఁ బాడుకొన్నట్టి, జాతీయఋణ మాకసమ్మునకంటె
దీనిరహస్యమున్ దెలుపకయున్న, ముగియ దీ దేశమున్ ముంచినచరిత

రేపు స్వతంత్రతారేఖలతోడ, భారతావని సముద్భాసిల్లునపుడు
ధర్మమార్గులు దీనితప్పొప్పు లరసి, చెప్పవలయుఁ దీర్పు; చెల్లవటంచుఁ
బ్రాజ్ఞులు సూచించుపద్దులఁ దీర్చు, పని లేదుమాకుఁ; బ్రపంచరాజ్యముల
నెందును లేనిక ర్చైనేలనుండె, నీ కర్చునకు హేతు విచటివిదేశ
పరిపాలనమ; దీన్ని బ్రతుకు సాగింప, నద్దిరా! ఋణమింత యక్కఱయయ్యె;
నయ్యారె! యింతయన్యాయమ్ము వలసె, వినుఁ దుగ్గడింతు మీవేతనగాథ
ప్రతిమాసమందు నిర్వదివేలకంటె, హెచ్చుగా ముట్టు మీ కీపేర ధనము;
దీనికిఁదోడు మీతెంకికిఁ దోఁట, కతిథుల కశ్వాల కటునిటు పోయి
వచ్చుపైనములకుఁ బరివారమునకు, నెన్ని యోరీవుల కెంతయో సొమ్ము
వెచ్చింపవలయు; మీ బ్రిటనులో నుండు, ముఖ్యమంత్రికి మీకు ముట్టుజీతమున
నాల్గవపాల్ ముట్టు; నల్లవో! యిచటి, పేద పూఁటకు నొకబేడ గడింప
నేడువండలవిత్త మీరు గడింత్రు, మీదెస నా కెంతమృదుభావ మున్న
గారవమున్నను గౌరవమున్నఁ, గటకటా! మిము గుఱిగాఁజేసి నన్ను
బాధించుసత్యముం బ్రకటింపవలసె, నే మిమ్ము నొప్పింప నెన్నఁడు నొల్ల
నన్యథా తలఁపకుఁ దయ్య! నన్గూర్చి, మీరు సంపన్నులు మీ కింతజీత
మక్కఱలేదు మీ కందుసంబళము, సర్వము మీరు విశ్వహితమ్ము కోరి
యీవచ్చు నొరులకు నిది వింతకాదు, కాని లోకమున నెక్కడఁ గానరాని
వేతనపద్ధతి వెలసె నీ పుడమి, నిది మాఱవలె నిది యిగ్గుట వలయు
నిది తగ్గినంతన యిచటికర్షకుల, బాధించు పన్నులభారంబు దగ్గు
నవని స్వతంత్ర మైనపుడె యీ మార్పు, లేర్పడు నన్నగు ట్టెఱిఁగితి మేము
మాజాతి యాఁకటిమంటలు పెరిఁగి, చాకుండవలె నన్న సమ్యగుపాయ
మెద్దియో యొకటి సమీక్షింపవలయు, నింగ్లండునందు రే పేర్పడు సర్వ
పక్షసదస్సు మాబాధలఁదీర్ప, దఱఁగదు మ మ్మేఁచునార్తి తర్కములఁ
బాపపుణ్యంబులఁ బరికింప కాంగ్ల, వసుధ మావసుధలో వాణిజ్యమాడి
సంపదల్ పడయంగ సర్వశక్తులను, బఱఁగించుఁ గాన మాప్రాణముల్దీయ
నెదురుసూచెడుమిత్తి నెట్లైన గెల్వ, నగుబల్మి మే మిప్పు డార్జింపవలయు. 27

ఆ. హింసతో స్వరాజ్య మీనేల నెలకొల్ప, నుద్యమించువర్గ మొకటికలదు
చిన్నదైననేమి శిక్షచాలనిదైన, నేమి తగదు దీని నీసడింప. 28

ఆ. ఇంగిలీసువారి యేచినహింసతో, నెదిరి గెల్చుకొన నహింసతక్క
నితరసాధనంబు లెవ్వియుఁ జాల వీ, నమ్మకంబు బలియు నాకు సతము. 29

ఆ. ఏలుచున్నవారిహింసను, విప్లవ, ప్రియులహింస నడ్డపెట్టి నొంప;
నిపుడు నాయహింస నేను బ్రయోగింప, కున్న దేశమునకు నొదవుఁ జేటు. 30

గీ. అల్పమే యగుఁగాక నాయనుభవంబు, మాటిమాటికి నది యహింసామహత్త
నిరుపమం బని తిరుగులేనిదియు నని మ, దంతరాత్మకుఁ దెల్పు భయమ్ము దుల్పు.31

గీ. శాసనోల్లంఘనమ్ముతో జగతి కెఱుక, పఱుతు నస్మదహింసాప్రభావమెల్ల
మొదట నాశ్రమవాసులే ముదలఁ ద్రోతు, రవల నెల్లరు నిప్పని కంగవింత్రు. 32

క. ఈపని కే నొగ్గుట యన; నాపదలకు నగ్గపడుట యని యెఱుఁగుదుఁ, గా
నీ పాడికి సత్యమునకుఁ, జేపడ వెన్నఁడును వెతలుచెందక జయముల్. 33

ఆ. ఎఱిఁగియొండె, నొండె నెఱుఁగక యొకజాతిఁ, బీల్చి పిప్పిచేసి పెనుపువదయు
జాతి కెడఁదమార్పు సమకూర్పవలె నన్న, నిడుమ లెన్నియో సహింపవలయు. 34

గీ. 'ఎడఁదమా'ర్పనుపల్కు నేనిచటఁ గోరి, వాడితి, నహింసఁబఱపి మీవారికెడఁద
మార్పురావించి వారు మామహికిఁ జేసి, నట్టియెగ్గులఁ జూప నే నభిలషింతు. 35

ఆ. ఏను హానిసేయ నెంచ మీవారికి, వారితప్పు లెన్నివంద లున్నఁ;
జేయనోర్తు నస్మదీయులకుంబలె, వారికూడిగంబు వలచి వలచి. 36

వ. ఏను మొదటినుండియు వారిని సేవించుచుంటి నని విశ్వసింతు - మొన్నమొన్నటి (1919) దనుక నంధప్రాయముగా వారిసేవ సల్పితి - కాని చూపువచ్చినవెన్క వారిపట్ల సాహాయ్యనిరాకృతి యుచిత మని భావించితి - నేఁడైనను వారి కుపకృతి కావింపన తలఁతు - నాకుటుంబమున నా ప్రేమముం జూఱలాడిన ప్రజ కెదమదువుగా నపుడపుడు ప్రయోగించిన శస్త్రమును వారిపైసైతము పఱపితి - వారియందేని నాకు మక్కువ గలదు - కాన దీనిం బరఁగింపకతప్పదు - ఆంగ్లేయు లీ సత్యమును ద్రచ్చిత్రచ్చి యంగీకరింతురుగాక! - నావారును నన్నుఁ బెక్కేండ్లు పరికించికాని నా ప్రేమతత్త్వ రహస్యముం గానరైరి - మఱియు 37

క. ఏ నూహించినకైవడి, నా నెయ్యురు నా పథాన నడిచిన వెత లె
న్నేని సహింపవలయుఁ; బా, షాణము లానాఁడు కరఁగి జాల్వాఱుఁగదా! 38

గీ. ఇచట బేరాలుసాగించు నింగిలీసు, సాహులు దురాశ లుడుగుట కీహపడిన
నరిది గా దీమహీప్రజ యభిలషించు, నేలుబడి నింద మని పొంగి యిదుట మీకు. 39

గీ. బేరములపేర మానెత్రు పీల్చుతలఁపు, మిమ్ము వదలిననాఁ డెల్లమేళ్లు గూరు
నపుడు నిష్కంటకంబగు నధ్వ; మపుడు, దౌత్యములుసాగు మైత్రీయుతంబులగుచు.40

గీ. రెండుజాతులనదుమ వీరికిని వారి, కొక్కతరమునగౌరవ ముందునట్లు
నుభయవాణిజ్యములకుఁ బెంపొదవునట్లు, విశ్వమానవశ్రేయమున్ వెలయునట్లు- 41

ఆ. అఖిలపక్షగోష్ఠి నన్ను! లండనుపురిఁ, గూర్పవయ్యె! హృదయకుహరములను
దెలుచుకొంద మెల్లతీరుపులను సవ, రించుకొంద; మేల రిత్తపోరు. 42

క. మాయుర్విం దలయెత్తిన, వా యా మతకులసమస్య, లవి సర్వజన
శ్రేయమును దదవుతతి గణ, నీయమ్ములు కావు కాన నిల్వఁదు వానిన్. 43

ఆ. ఇందుఁ బట్టుపట్టనేల మీరు; ప్రధాన, చర్చ లైనవెనుక సన్నసన్న
సందియములు తొలఁగుసరణిఁ జూతము వీని, విడువరాదు తేల్చివేయు టొప్పు. 44

మం. ఈపల్కులకు మీర లీకొని మీకు, మాకున్న భేదముల్ మదఁగింపరేని
యర్థిమై నాపంపునట్టి యీకమ్మఁ, గని పదినాళ్లలోఁ గరఁగరయేని
నాతో సబర్మతీనదిపజ్జ నుండు, సహచరుల్ కొందఱు జంట నేతేర
నుదధిచెంతకుఁ జేరి యుప్పుకట్టదల, నవఘళింతు దరిద్రుననుభూతిఁ జూడ
నుప్పుపన్నునకంటె నుడిగింపఁదగిన, పన్ను - నింద్యంబగుపన్ను లే దొండు
లేమిఁ గ్రుంగెడివారిలెస్సకే మేము, పూర్ణస్వరాజ్యపుంబూన్కి సాగించి
నారము కాన నీనాఁటిశాసన తి, రస్కృతి పేదలరాపాడు లవణ
శిక్షితో మొదలిడఁ జిత్తగించితిమి, యిన్ని నా ల్పీపన్ను నెదిరింపలేని
మాచర్య మిగుల విస్మయము గూర్చెడిని. 45

ఆ. నన్నుఁ జెఱకుఁబంపి నాజతనమ్ముల, నడ్డగింప మీకు హక్కుగలదు
దిగులుసెంద నేను దీనిఁదలంచి న, న్ననుసరింత్రు పెక్కు రఱకులేక. 46

గీ. వేలకొలఁది సత్యాగ్రహవీరు లస్మ, దుద్యమమ్మును సాగింతు రుత్సహించి
పడిపదాతేండ్లనుండి నాబాట మాట, మంచిదని విశ్వసించి కష్టించువారు. 47

గీ. శాసనగ్రంథమునకు మచ్చగఁ దనర్చు, లవణశాసన ముల్లంఘ్య మవుటఁజేసి
త్రోసెదను దానిఁ, దగుశిక్షతోడఁ జెఱకు, దాసెదను; నాకు నిదియెకర్తవ్యమిపుడు. 48

ఆ. చాలఁబెనఁగినాఁడ నాలేఖలో మిమ్ము, ఱాచుపల్కు లుందరా దటంచు
నెంతవఱకు నేను గృతకృత్యుఁ డైతినో, దైవమునకుఁదెలియుఁ దమకుఁ దెలియు. 49

మం. ఈకమ్మఁ జదివి మీ రిందుఁ బాటింపఁ, దగుపాళ్లు కలవని తలఁచెదరేని,
నాతోడఁ జర్చయొనర్చుట వలయు, నని యెంతురేని యయ్యది సాగుదనుక
నుత్తరంబిది మెఱయుట కూడదనుచు, భావింతురేని 'నీప్రకటన మాఁపు'
మని తంతివార్త నా కనుపుఁ డాఁపెదను, నాలేఖలోఁ బ్రధానంబగుభాగ
మాదరించుటకు మీ కానుకూల్యంబు, పొసఁగనినాఁడు నాపోకదనుండి
నను మరలించుయత్నమును జేయకుఁడు, సత్యాగ్రహి గణించుసద్ధర్మమునకు

వశపడి యీకమ్మ వ్రాయుడుఁ గాని, వ్రాయను మీకు సాధ్వసము కల్పింప
నమ్మఁడు నాపల్కునమ్ముఁ; దహింస, నాదరించుచు మాకు నందగానున్న
యాంగ్లేయమిత్రునిహస్తమం దునిచి, చేర్చుచున్నాఁడ మీచెంత కీజాబు" 50

గీ. కనియె లోకోత్తరంబగుకమ్మ నిర్వి, ననియె గ్రక్కన గాంధి సేయందలంచు
పని యశాస్త్రీయ మని శాంతిభంజక మని, యస్మదాత్మకు వెతగూర్చునట్టిదనియు. 51

## మహాత్ముఁ డుప్పు చట్టముం ద్రోయ సిద్ధపడుట

ఆ. అపుడు పల్కె నొజ్జ "యకట! వినీతిమై, రొట్టెనడుగ నాకు ముట్టె నిటిక
ఐళిరె! ఐల్మి నగ్గపడుఁ గాని యాంగ్లేయ, జాతి లొంగ దితరసాధనముల. 52

గీ. శాంతియఁట శాంతి! నేఁడు విశాలఘోర, కారగా మాఱిపోయిన భారతమున
నున్నదాశాంతి? విసుగుతో నుత్తలమున, నూపిరాడక యల్లాడు టొకటితక్క. 53

ఆ. ఏను వింతసెంద నిర్వినుమఱుమాట, కిట్టియనుభవమ్ము లెన్నొ కనుటఁ
గార్య మెఱుకపడియెఁ గావింతు ధిక్కృతి, నుప్పుచట్టమునకు నోటపడక. 54

ఆ. నన్ను రేపు దొరతనమువారు కారాని, వాసమునకుఁ బంపవచ్చుఁ గానఁ
బ్రజ లొనర్పఁదగినపని యపు డెట్టిదో, పల్కరింతు లోకభద్ర మెంచి. 55

ఆ. ఎనిమిదేండ్లనాఁడు నను బందిగమునకు, నేలువార లంపువేళఁ బ్రజలు
హింసదెసకుఁ జనక యీశ్వరు మఱవక, నిలుపుతో మెలంగవలయు నంటి. 56

ఆ. అంటరానితనము నణఁచుట మున్నగు, సవరణలకు నొగ్గఁజను నటంటి
సభలుచేయరా దసమ్మతిప్రకట నా, యత్తవిధులు గూడ వనియు నంటి. 57

ఆ. ప్రజలు నాఁడు నాదుపల్కులు నూటికి, నూఱుపాళ్లుగా ననూనరక్తి
ననుసరించినార లదిమెత్తు నిట నొక్క, వార్త వెలువరింతు వలయు ననుచు. 58

వ. నాఁటి నా నిర్బంధముకతన నొక్కకుక్కయేని మొఱుఁగలేదని యాంగ్లప్రభువొకం డెల్లిద మాదె - ఇది మిగులఁ జింత్యము - ఏలయన నేను జెఱనున్నతఱి దేశమహింసాపరాయణమై యుండెనని విని తనిసితి - ఇట్లుంటకు నా ప్రబోధన మాధారమని విన్నవింతు -ఆనాఁడు బార్డోలిలోఁగూడిన కాంగ్రెసువారు సమష్టిశాసనధిక్కారమును దాత్కాలికముగా నాఁపవలయు నని నిర్ణయించిరి - ఇందు నాపూఁట హెచ్చని నుడువంబనిలేదు - ఆ నిర్ణయమును లెక్కింపక నాఁడు కుక్కలు మొఱిఁగెనేని దేశ మేమయ్యెడిదో నేఁ దూహించుట వివేకముకాదు - ఐనను నాఁడు కుక్కలుకూసినచో మొన్న మనము లాహోరులో సంపూర్ణస్వాతంత్ర్యము నంగీకరించుదనుక వచ్చువారము కాము-అహింసాశక్తి యజేయ

మని నమ్మి యింతబృహత్కార్యము సాగింప గాంధియనువాఁ డిందనుక బ్రదికియుండు వాఁడును గాఁడు - అది యట్లుండె - ప్రకృత మనుసరింతము. 59

గీ. ఎల్లి న న్నేలికలు బంది నిదుదురేని, నాఁటికైవడి సాధారణముగఁ గాక
జగము పులకించున ట్లహింసను భజింప, వలయు దేశీయు లెల్లబాధలు సహించి. 60

గీ. భారతోర్వి కహింసతో స్వైరమైన, బ్రదుకు సాధింపఁదగు నంచు మదిఁ దలంచు
నతఁడు తనమేనఁ బ్రాణ మున్నంతదనుక, బానిసతనమ్మునకు నిష్టపదుట తగదు. 61

ఆ. ఏను బందిగమున కేగినపిదప నా, పని కితండు పాత్రుఁ డని వచింప
నొకని నిర్ణయించియున్నవాఁడను గాను, గాన నడుముగట్టుఁ గాంగ్రె సపుడు. 62

గీ. ఉద్యమంబును సాగించునోర్పు నేర్పు, గలమనీషులు దేశానఁ గలరు పెక్కు;
రెవఁడు నాయకుఁడైన నహింసపట్ల, నతనికిం బూర్ణవిశ్వాస మమరవలయు. 63

వ. సత్యాగ్రహసిద్ధాంతరహస్యము లూఁచముట్టుగా నెఱిఁగి సుశిక్షితులైన మా యాశ్రమ వాసులుగాని తాదృశు లితరులుగాని యాభారముం దలదాల్చుట సముచితమని నా తలంపు - లోక మిందనుక నాశ్రమమునం దునిచిననమ్మికకును బ్రకటించినమక్కువకును దగిన ట్లిది సత్యాగ్రహధర్మమునం దిమిడియున్న మేలి గుణములనెల్లఁ బ్రదర్శింపవలయు - పదునైదేండ్లనుండి భారతీయులయాశీస్సులతో మనుచున్నయీయాముఁక తనశక్తి నొక మాటు చాటదయేని యిదియు నేను నణంగుట లెస్స - ఈపని మాకేకాదు దేశమునకును మేలుగూర్చు - తగువాఁడు నడుపునే నుద్యమంబు జయించు - ఉద్యమ జయమ్ము కోరువారు నాయకు ననుసరింపవలయు - నేఁటి యుల్లంఘన మొక్కసత్యాగ్రహి బ్రదికి యున్నను మానంబదదు - సత్యాగ్రహి కాఁగోరువాఁడు చెఱసాలఁగాని శాసనోల్లంఘన వ్యూహమునఁగాని నిర్మాణకార్యక్రమునఁగాని చిక్కియుండవలయు - అతఁడు కారలో నుండు తఱిఁ గాంగ్రెసుసొమ్ము నర్థింపరాదు." 64

క. గురుఁ డిట్లు శిష్యులకు న, క్కఱయగు నుపదేశమొసఁగ గ్రామంబులలోఁ
బురములలో నుత్కంఠం, బొఱివోయి జనాళి కన్నుమూయకయుండన్ - 65

క. రాజప్రతినిధి సుముఖుఁడు, కాఁజాలమి నుప్పుపన్నుకట్టడపై బా
పూజీ ధిక్కృతిదెల్పుచు, నాజి నహింసను బొనర్చునవసర మొదవెన్. 66

క. ఒకదండయాత్ర యిది; దీ, నికిఁ దగుసన్నాహమెల్ల నిశ్చితమాయెన్
బ్రకటచరిత్రులు డెబ్బది, యొకండ్రు గురువెంట నడువనుండిరి జోదుల్. 67

వ. ఈ సత్యాగ్రహయోధమండలికి 68

ఆ. తెలుఁగుతల్లినోముఫలము సబర్మతీ, ఋషికిఁ గూర్చుశిష్యుఁ డెన్నఁబడియె
నెట్టినేనికోవ నెసఁగు సుబ్రహ్మణ్యుఁ, డఖిలభారతంబు నజ్ఞ యనఁగ. 69

## పటేలు బార్డోలీ ప్రజల నని కాయత్తపఱుచుట

మం. సత్యాగ్రహాశ్రమసభ్యులు గుజరి, నలరు జాతీయవిద్యాపీఠపరిత
లిన్నాళ్ళశిక్షణ మిన్నాళ్ళతపము, పండి పాల్గొని రిప్డు బాపుజీసేన
నేత్యాగమునకైన నిగ్గరు వీరు, ఏకష్టినైన సహింతురు వీరు
దం డిది రెండువందలమైళ్ళు నడిచి, పశ్చిమవారాశిపజ్జ నొప్పారు
దండి యన్‌పల్లెకుఁ దఱియఁగావలయు, నట నుప్పుచట్టంబు నదలింపవలయుఁ
గదలనుండె దళంబు; కదలె మున్ముందు, వల్లభాయిపటేలు వరణీయచరితుఁ
డతఁడు బార్డొలిసీమయందు ననేక, జనపదంబులకేగి "జాతీయముక్తి
కొకమహాయజ్ఞంబు నొనరింప గాంధి, వచ్చుచున్నాఁడు మీవంతుకానుకల
నర్పింప వేవేగ నాయిత్తపడుఁడు, మాటిమాటికి నిట్టి మహనీయమఖము
రా దిట్టిపండువు రాదు పల్మాఱు, బాపుజీ నడిచినబాటలో నడువ
బాపుజీ పల్కినపల్కు పాటింప, నడుముకట్టుఁడు వచ్చినది ముహూర్తంబు. 70

ఆ. అన్నలార! కడు నహంత, యహంతకుఁ, దగినదిటవు గల్గి నెగడుచున్న
దొరతనమ్మువారితో నెదుర్కొనఁజూచు, పాలితులకు భోగవాంఛ తగదు. 71

క. ఇది సంగరసమయం బీ, యదన వివాహోత్సవమ్ము లాఁపుఁడు మీమీ
సదనములు మూసి పొలముల, నొదిఁగి దివంబెల్ల, మఱలుఁ దూరికి సంజన్. 72

ఆ. ఒజ్జ మున్ను శాసనోల్లంఘనంబు మీ, సీమ మొదలుపెట్ట సిద్ధపడియె
నపుడె మీకువచ్చె యశ; మది నేఁడు పెం, పొందవలయు నవధినందవలయు. 73

క. వచ్చెఁ బరీక్షాసమయము, విచ్చేయుఁడు రంగమునకు; విశ్వము సకలం
బచ్చెరుపడ నధికారులు, తిచ్చపడన్ మీ రధఃకరింపుఁడు ప్రభుతన్. 74

గీ. మీరు కొందఱు సర్కారువారు పొలము, లాక్రమింతు రటంచు భయమ్ముగందు
రాక్రమించిన నేమగు? నవి విమాన, మెక్కి తుఱ్ఱున సీమకు నేగునొక్కొ. 75

గీ. ఏలువారు మీపొలములనెల్ల నాక్ర, మింపవలెఁగాని యానాఁడు మీకు సకల
ఘూర్జరమె కాదు భారతక్షోణిసర్వ, మండయై నిల్వదా? యేల యళుకు మీకు. 76

ఆ. పోరు పొరపు మాని యూరివారందఱు, నొకకుటుంబ మనఁగ నుండవలయు
నితరభూమివారి కీసీమ పౌరముల్, నేర్పవలయు భయము దీర్పవలయు. 77

ఆ. పల్లెపల్లె నేఁడు పటుశిబిరమ్ముగా, మాఱువలయు నెదిరి మ్రాన్పదంగ
మేలికట్టుపాట్లు మీ రియ్యకొన్నచోఁ, గలనిలో సగమ్ము గెలిచినట్లె. 78

ఆ. ఊరి కొక్కకాపుఁ నొక్కతలారియు, నుండు రాచవారి కండగాఁగ
వయసువచ్చినట్టివాడెల్ల మనసేనఁ, జేర మేరలేనిచేవ మనది. 79

క. ఈపదిరోజుల నుండియు, మీపొందిన యనుభవమున మీభీతి కడున్
లోపించియుండు, శేషం, బీపూఁట తొలంగవలయు నిల్లిగ్గులుగన్. 80

ఆ. ఏలమీకుభీతి యేలువారికిఁగాక, తొఱఁగుఁ దధమమైన పిఱికితనము
నది యనార్యసేవ్య మపకీర్తిజనక మో, పంటకాఁపులార! దంటలార! 81

గీ. నిర్భయతఁ జేర్తు నిపుడు మీ నెత్రునందు, నది నిలుచుతా వహింసకు నాలవాల
మెట నహింసవసించునో యట వసింప, వెఱచుఁ గోప మసూయయు విష్వాలించు. 82

ఆ. బాసచేసి మీకు బాసటగా నుందు, మన్నప్రజలు కొంద ఱజ్ఞు లగుచు
నేలువారు పన్నుజాలమునం బడ, వచ్చుఁగాక కాఁక వలదు మీకు" 83

## వల్లభాయి నిర్బంధము

వ. అని ప్రజలం గర్తవ్యపరాయణులఁ గావించుచుండ దొరతనమువా రోర్వలేక 'రాసు' గ్రామమునం దీమేటిని బంధించి (మార్చి 6) మూన్నెలల శిక్షతోఁ జెఱకంపిరి - ఈ శిక్షతో ఘూర్జరమెల్ల నొక్కపెట్ట యేల్బడి నెదిరె - అహమ్మదాబాదున సబర్మతీసరిత్తటమున నాఁడు దెబ్బదియైదువేల ప్రజలు సమావిష్టులై 84

ఆ. వల్లభాయిబాట వదలము మే మెన్ని, యిడుమలైన సైఁతు మిందు నడువ
విప్ప నిష్టపదము వీరకంకణము స్వ, తంత్రభారతమ్ము దక్కుదనుక. 85

క. అందాఁక మేము శాంతత, నందము రానీము శాంతి నాంగ్లేయులకున్
కందుము సత్యాహింసల, కుం దొలఁగక దేశదాస్యకుట్టకశక్తిన్. 86

వ. అనుతీర్మానమును గావింప మహాత్ముఁ డీప్రమాణముం జేయువా రుత్తంభితహస్తులు కావలయునని కోరి సభవారెల్లరుం జేతులెత్తఁ దనిసి 87

ఆ. మేలు! మేలు! మిమ్ము మెచ్చెదఁ గాని నేఁ, దొడఁగుదనుక మీరు తొదరవలదు
ఏను నిశ్చితోర్వి నీఁగువేళకు మీరు, తీర్పఁదగినదెల్లఁ దెల్లమగును. 88

ఆ. నిగ్రహమ్మునూఁది నిల్వుఁడు తొందర, పాటు చనదు రాచపనులపట్ల
గ్రామములను బ్రేమధామమ్ముల నొనర్పుఁ, దెదిరివారిపట్టు చెదరునట్లు. 89

గీ. మాతృదేశముక్తికి గుజరాతినేల, సమరరంగ మౌనని పలుసారు లంటి
నన్నలార! మీమగంటిమి యట్టిదగుట, యే నెఱుంగుదు జగమెల్ల నెల్లి యెఱుఁగు"90

## మహాత్ముని సత్యాగ్రహ ప్రస్థానము

వ. అని సభ్యులకుఁ బ్రశంసాపూర్వకసందేశ మొసఁగె - ఇంతలో యావత్ప్రపంచ ప్రతీక్షా కారణమగు లవణసత్యాగ్రహ సుముహూర్తము కదియంబడె - నాఁటి (12 మార్చి) ప్రాతఃకాలమున సబర్మత్యాశ్రమమున ననుచర సహితమ్ముగాఁ బ్రార్థనాదివిధులు నిర్వ హించి కాంగ్రెసుపతాకంబూని మహాత్ముఁడు తనదళమ్ముతో సముద్రతీరమునకుం గదలె - అయ్యెడ సమీపగ్రామముల కర్షకులు నానారాష్ట్రముల కాంగ్రెసు పెద్దలు విదేశాగత పత్రికావిలేఖకులు ఛాయాగ్రాహకులు చలనచిత్రనిర్మాత లహమ్మదాబాదునగరవాసులు వేలకువేలకుం జాలి మహాత్ముని వలగొనిరి - సన్న వెదురుగఱ్ఱం బూని మౌనముద్రఁ దాల్చి సేనాముఖంబునఁ జెకచెకం బయనించుబాపూవెంట నీప్రజలు పిక్కబల మున్నంత దనుక నడిచిరి - అదృశ్య మత్యద్భుతము - భారతస్వాతంత్ర్య సమరచరిత్రలో సువర్ణా క్షరమాలామండితమగు వీరఘట్టము - దీనిం గనువారలయుల్లముల స్వరాజ్యతృష్ణ పొంగిపొరలె - 'మహాత్మగాంధికిజే' యని వారు వెలువరించుకేక లాకసమును బ్రక్క లించె - దారిలో నడుగడుగునం బ్రజలుమూఁగి ముక్తిదాతకు నమ్రతాపూర్వకప్రణామము లర్పించిరి - వారి కపు డొక నూతనయుగము గోచరించె - సత్యాగ్రహసమరనియంత యీప్రస్థానము నారంభించుచు 91

ఆ. మార్గమధ్యమందు మరణింతునా సరే, బ్రదికియుందునా స్వరాజ్యరవి మ
హస్సు తోఁచుదనుక నాశ్రమక్షోణికి, రాను రా నటంచుఁ బ్రతినచేసె. 92

మం. భయదూరుఁ డీక్షితప్రజ్ఞ శేఖరుఁడు, సర్వసేనాపతిస్థాన విభాసి
గురుమౌళి యి ట్లెదుక్రోసులు నడిచి, యస్లాలి యనుచోట నాఁగెనాపూఁట
నూరివా రర్థిమై నొసఁగినతిండి, సాపడియెను సానుచరముగా గాంధి
ఖద్దరుకట్టుఁడు కల్లుద్రావకుఁడు, తరలింపుఁ దస్పృశ్యతాకిల్బిషంబు
నెలవుల బాటల నీటుగా దిద్ది, శౌచధామమ్ముగా సల్పుఁడు పల్లె
తరతరమ్ములనుండి తలఁగనిదాస్య, మణఁగింప సత్యాగ్రహమ్మునఁ జేరుఁ
డిట్టిభాగ్యము చిక్క దెల్లవేళలను, బ్రాక్తనపుణ్యముల్ పండి యీనాఁడు
మనపాలిదై వచ్చె మాతృసేవనము, తల్లిబన్నముఁబాపు తనయుఁడే తనయుఁ
డమ్మకై బలివోవునతఁడె మానవుఁడు, తనువు నిత్యముగాదు, ధనము చంచలము
చావులేనిది కీర్తి, శౌర్యవిస్ఫూర్తి; స్వప్రయోజనముల చక్కికిఁ గాక
దృష్టిసారింపుఁడీ దేశమ్ముదెసకు, నధికారులకు జంక నక్కఱలేదు
లే దహింసాగ్ని వెల్గెడిచోట భీతి, యని గ్రామవాసుల కాదేశమిచ్చె

వందలువేలుగా వచ్చి దేశికుని, పొంజులోఁ జేరిరి పల్లెలవారు
సాగుచున్నది గాంధి సంగ్రామయాత్ర, మ్రోగుచున్నది విశ్వమున జయస్వనము. 93

వ. ఈప్రస్థానము మోసెస్సునాయకత్వమున యూదు లైగుప్తముం బాసిన ప్రాచీన గాథ నెదకుందెచ్చు ననియు నిక్క ట్లెన్ని చుట్టినన్ విన్నఁబడక బాపూ గమ్యముం జేరితీరు ననియు జగద్విఖ్యాతవిజ్ఞానవేది 'ప్రఫుల్లచంద్రరే' యానాఁడు దండియాత్ర నగ్గించె - నాగరికప్రపంచమెల్ల నిప్పట్లఁ జాటినసానుభూతి యతివేలము - సత్య మసత్యమును, దేజ స్సంధకారమును, బ్రాణంబు మిత్తిని జయించుకరణి మహాత్ముఁ దాంగ్లప్రభుతను 'జితోస్మి'యనిపించు నని యది పల్కె-ఇఁకఁ గాంగ్రెసువారిమాట సెప్పనేల-వారు తమ యుద్రేకము నాత్మశక్తిమై నిలువరించి బాపూసందేశము నాసేతుశీతాచల మింటింటికిం దెలిపిరి - కాంగ్రెసునకు వలయు సాయ మనాయాసముగా లభింపఁదొడంగె - ఇది యెఱింగినబాపూ తనియుచుం బయనించుచుండె - ఒకనాటివిడిదిలోఁ దన్ను మన్నింప వచ్చిన ప్రజలం గని మహాత్ముఁ డిట్లనె. 94

ఆ. అన్నలార! భారతావని కాంగ్లేయ, పాలనమ్ము కీడుపాటుదెచ్చె
నైతికావసతియు భౌతికాధ్యాత్మిక, హీనతయును వచ్చె నిచట దీన. 95

క. దొరతన మిది పాపంబుల, కిర వని మనసార నిశ్చయించితి దీనిం
బరిమార్పవలయుఁ గానీ, దొరలదెసన్ దగదు మనకు దుండగ మెదియున్. 96

ఆ. ఈశ్వరుండు రాజు నేలుత మనుపాట, పాడినాఁడ మున్ను పాడి యనుచుఁ
బంపినాఁడ విన్నపమ్ములు, రాయబా, రములు నడిపినాఁడ శ్రమముగనక. 97

క. ఇవి దండుగుచెయిదము లి, ట్టివి ప్రభుతన్ వంచుటకుఁ బటిష్ఠంబులు గా
వవమక్రియ లని నేఁటికి, నవగతమై వేఱుదారి నడుగిడినాఁడన్. 98

ఆ. ఇపుడు నాకుఁ బ్రభుత నెదిరించుటే పని, యిది యవశ్యకృత్యమే యటంచు
మీరు తోడువచ్చినారు నా కెంతయు, బలిమివచ్చె నేఁడు బాగు! బాగు! 99

గీ. ఏలుబడిలోనిక్రుళ్లను మూలమూల, వెదకి త్రోయుట మనకిప్డు విధి; రవంత
హింసకున్ మన మొప్పరా దితరుపట్లఁ, గత్తిలేని నెత్తురులేని కలను మనది. 100

ఆ. ఇది యపూర్వసమర మిద్దాన విజయ మం, తంతమాత్రవెతల కబ్బఁబోదు
సత్యముఖ్యదైవసంపద గలవారె, సంతరింపఁగలరు జాతిముక్తి. 101

క. ఏవంవిధోపదేశ, శ్రీ వెలయన్ గురుఁడు యాత్రసేయుచునుండన్
దైవాఱఁదొడఁగె నుద్యమ, మీవికసన మోర్వరైరి యేల్బడివారల్. 102

గీ. చిన్నకొల్లాయి మొలఁ జుట్టి చేత నేకు, కదురు ధరియించి దండికిఁగదలు గాంధి
బొమ్మలను జూపరాదని బుద్ధిమాలి, చిత్రశాలల కానతిచ్చిరి బలారె! 103

గీ. సత్యము నహింస నెదయనిజనుల తెఱఁగు, నమ్మఁజాలక వారలనదత నరయఁ
బిఱుద నిల్పిరి యెట్టిటోపీలవారి, గూఢచారులఁ దోలిరి కుప్పములకు. 104

గీ. గాంధిసేనకుఁ దోడ్పడఁ గడఁగువార, లధికృతులకిన్కకుం బాత్రులగుదు రనుచు
బేరులకు సాహులకుఁ బెదపెద్దకాఁపు, లకును వార్తలుపంపి కళంకపడిరి. 105

ఆ. ఇంగిలీసుబాస నింతయో యంతయో, యెఱిఁగి దాన బ్రదుకు నీడ్చుచున్న
పౌరు లపుడు భీతిపడిరి గాని రవంత, యులుకరైరి పల్లెటూరిప్రజలు. 106

గీ. కుట్రలు కుతర్కములు పొట్టకూటిదేవు, లాట యలసత్వ మెఱుఁగనిచోటఁ గాక
ధృతి మఱెచ్చట నెలకొను? దేశభక్తి, యింకెచటఁ బుట్టు? నీగి వేఱెందు సాగు? 107

మం. ఆయెడ గ్రామీణు లాంగ్లప్రభుత్వ, మీయుర్వి నిల్వరా దిది జాతిసిరిని
మానమున్ గబళించు మాయలమారి, యాదయ్యమును నావ కెక్కింపవలయు
నీకయ్యమునఁ బ్రాణమే నొడ్డవలయుఁ, జీము నెత్తురు లేని చెన్నంటిగాక
యెవఁడోర్చు స్వాతంత్ర్యహీనమౌ బ్రదుకు, పరిపంథు లెన్ని యాపదలఁగూర్చినను
బదరానిరక్కెసపాట్లు తెచ్చినను, బూర్ణస్వరాజ్యానుభూతి యౌదనుక
భారతమాతృ శోభాసుప్రసాద, కలితమంగళమూర్తి కన్గొనుదాఁక
విప్పము విప్పము వీరతాయెత్తు, త్రిప్పము త్రిప్ప మే స్థితినైన మదమ
నని తెగించి మహాత్మునాదేశమునకు, వినతులైనిల్చిరి విక్రాంతిమూర్తు
లానాఁడు పల్లెటూ రనిమొన నుండెఁ, బోనాడె స్వార్థానుభుక్తిపై రక్తి
గ్రామ మివ్విధి నాయకత్వముం దాల్చ, నోట రాఁగలదె ప్రజోద్యమంబులకు? 108

గీ. దినదినమ్మును బెరిఁగి యుద్వేలమైన, సేనతో 'జంబుసారు'ను జేరె నేత
యధికృతుల నన్నపానాదు లడ్డగించి, యచటివా రేఁచుచున్నరహస్య మెఱిఁగె. 109

వ. ఇట్టిసాంఘికబహిష్కారము శతధా నింద్యమని నిరసించి యెదిరిం బస్తుపాలుచేసి గాసిల్లఁ జేఁత మనమతముకాదనియు నురగదష్టుఁడై చావనున్న పగతునితనువుం గొఱికి విసముఁదిగిచి యేను వాని ప్రాణములు నిల్పంబెనఁగుదు ననియు దేశికుఁ డయ్యూరి వారితోఁ బల్కి తన విశ్వమానవసౌహార్దము నెఱుకపఱిచి వేఱొండు విడిదలకుం గదలె – మహాత్ముఁ డీ పయనము తీర్థయాత్రంబోని దనియు నిందు విందులు తగవనియు నుసురునిల్ప నెంతవలయు నంతయ తినంజను ననియు నయ్యాయితావులం బల్కుచు నాత్మపరీక్ష గావించుకొనుచు సూరతునం దడుగు మోపి ప్రార్థనాసమయమునఁ దనవారి కిట్లనియె. 110

గీ. శాసనోల్లంఘనక్రియ జరుపఁదగిన, సీమకుం జేరినారము; చిత్తములను
దేర్చి యాత్మార్పణమునకువార్చియుంట, వలయు మనకన్నులార! పోవలయు బెదరు. 111

క. ఈమండలమున మనలం, బ్రేమించెడిమిత్రులుండ్రు పెక్కురు; వారల్
మోమోటపెట్టఁ జూతురు, తాము సమర్పించుభక్ష్యతతులన్ మెసవన్. 112

క. లోపడకుఁ డా మెతలకున్, గాపాడుఁడు నిగ్రహమ్ము, గారెలు బూరెల్
తేపకుఁదేపకు మెక్కుట, కీపయనము పుట్టలేద యెఱుఁగుడు నిజమున్. 113

ఆ. దేవతలము కాము కావున మన మంత, లోన జాతిపోయి లోభపడుదు
మింద్రియములబల్మి యింతంతకా; దైన, నిలువవలయు వాని గెలువవలయు. 114

ఆ. ఆతిథేయు లలఁతులా కారు కారులో, కజ్జు; లైననేమి కడిఁదికడిఁది
వెచ్చమోర్చి మనకు విందులుసేఁత నే, నొప్పఁజాల బొంకు సెప్పఁజాల. 115

ఆ. ప్రజలవెచ్చ మిట్లు బహుళమ్ముగా నుండ, నేల నీకు జీత మింత యనుచు
హస్తినాపురీంద్రు నడిగెడిచనవు నా, కెట్టులుండు? ధర్మ వెఱుఁగుఁ డిచట. 116

ఆ. "కూడులేనివారిగోడు మానింప మా, యాత్ర" యని వచింతు మనుదినమ్ము
ఇంతమ్రింగువార మీపని కీసేవ, కెట్లుతగుదు మరయుఁడీ రవంత. 117

ఆ. హక్కులేనితిండి మెక్కినవానికి, దొంగతిండితిన్న దురిత మబ్బు
దొంగతిండి యనిన దోసంబు లుదుపని, పాదరస మనెన్ బ్రబంధ యొకఁడు. 118

ఆ. లేమి కగ్గపడినభూమి సార్థికశక్తి, యెంతకానిపించు నంతకంటె
మించితినుట ముచ్చిమియొనర్చి పడసిన, కూడు దినుటవోలెఁ గుత్సితమ్ము. 119

గీ. ఇచటినరునకు దినమున కేడుకాను, లాయ మని మీరెఱుంగుఁ డాదాయమునకుఁ
దగినకైవడిఁ దినుఁడు మద్వాక్యములకుఁ, గినియకుఁడు చెప్పవలసి తెగించినాఁడ. 120

గీ. వేలకొలఁదిసత్యాగ్రహవీరు లనికిఁ, జేరఁగలరుకదా? వారి మేరలేని
కర్పుతో నెమ్మియి భరింపఁగలము మనము,మిత్రు! లంతర్ముఖులు కండు మేలుకొండు. 121

వ. మహాత్మునిప్రసంగం బిది యెల్లరకన్నువిప్పె - దీనిఫలముగా మున్నూర్వురుపటేళ్ళు
తమయుద్యోగములం ద్రోసిరి - పదంపడి బాపూ 'నవసారి'కిం జేరి 122

ఆ. మదిర నమ్మరాదు మానుఁ డీపని, యిది, పరువులేని చెట్టపని; ధనమ్ము
పడయువారు ధర్మపథ ముజ్జగింపక, పడయవలయుఁ బాప మెడయవలయు. 123

ఆ. కల్లుబేర ముప్పుగల్లుపైఁ గలపన్ను, నణఁచివేయఁగంటిమా యహింస
గెలిచిన ట్లటంచుఁ దలఁపుఁ దానాఁడు భా, రతము నలముకొను స్వరాజ్యరుచులు. 124

క. ఆనాఁడు స్వరాజ్యద్యుతి, రానీ మని కోటిమందిరారాజులు పం
తానకు నడ్డంపడినను, మానచ్యుతు లగుదు రేక్షమన్ బ్రజలారా! 125

గీ. ఉప్పుపన్నును దొలఁగింప నుద్యమంబు, నదపుచున్నాఁడ నే నిందుఁ బడకు గెల్పు
పడచుటకుఁ జాలనేని యాపశ్చిమాంబు, రాశితరఁగల నూఁగింతు నాశవంబు. 126

## మహాత్ముఁడు దండికిఁ జేరుట

వ. ఇ ట్లభిభాషించినవెనుక రాముఁడు లంకం జేరినట్లు బాపూ తనగమ్యస్థానమగు దండి
నావేశించి (ఏప్రిల్ 5) పత్రికాప్రతినిధులతో నిట్లు వాక్రుచ్చె. 127

గీ. "ముగిసె నవరోధ మెద్దియు మూడకుండఁ, గదనయాత్రానుబద్ధమౌ మొదటిరంగ
మిది జగత్పతికరుణగా నెంతు నతని, కంజలిఘటింతు నమ్రత నాశ్రయింతు. 128

ఆ. మున్ను పెక్కుసమరములను సాగించితి, రాజకీయముక్తి రాక వలచి
యేతదీయరణము నాతుదిరణముగాఁ, దలఁతు నిందు గెలుపు దక్కుఁగాక! 129

క. ఏనెంజిలి గూర్పక నా, పైనము చననిచ్చి రేలుబడివా రిది స
మ్మానార్హంబగు సాయము, దీని మఱవఁజాల నెట్టితీఱములందున్. 130

గీ. ఐన నిచట వల్లభభాయి నచట వంగ; ధరణిలో సేనుగుప్తను బరుషవృత్తి
కియ్యకొని పట్టిశిక్షించి రిది తదీయ, గౌరవచ్ఛేత్త యగు నల్పకార్య మనెద. 131

గీ. అంతవఱదాఁక జాతినయట్టి దొరలు, నన్నుఁ బట్టకవిడుతురా యన్నతలఁపు
గంటిఁగాని యే దేవుని కరుణయో ని, రుద్ధ మొనరించియుండుఁ దద్రూక్షచర్య. 132

గీ. చుల్కగాఁ బ్రజలకు జగాయల్క దెచ్చి, యవల వారికి నెనలేనియఱుకు గూర్చి
ఘోరమగుశిక్షలు విధింప నాఱితేఱి, నట్టివా రేలుబడివార లనుట నిజము. 133

ఆ. ఇట్టినేర్పు వీర లిపుడు కోల్పడిరని, యెంచుపాటివెఱ్ఱి నేను గాను
మానసింతు వీరిమది రాజనైతిక, పదవిపట్ల మాఱినది యటంచు. 134

గీ. సైఁపదు జగం బహింసతో సాగుచున్న, రాజకీయోద్యమంబును రాచపనుల
నేల యపకీర్తి మనకని యెల్లలేని, చేగ గలవారలయ్యు వీ రాఁగి రనెద. 135

వ. నాదండియాత్ర నొప్పరికించినయట్ల యెల్లిసుత యెల్లరాష్ట్రములవా రుప్పుచట్టము నుల్లం
ఘించుటనుసైత మధికారు లుపేక్షింతురా - చూడవలయు - భగవదనుకంపంజేసి
రేపటిరేపు నాయనుచరులతోఁ జట్టముం ద్రోఁత సాగింతు - దయ్యరు జలియన్వాలా
వనమునం దగ్నిగోళములు ప్రేల్చి నిరపరాధులగు భారతీయుల నసంఖ్యాకులఁ గాల్చి

చంపినవాడిగా హత్యలవి జరిగిన యేప్రిలాఱవదినము మాకుఁ బవిత్రదినముగాఁ బ్రాయ
శ్చిత్తదినముగా నేర్పడియె - కావున రేపు నిరాహార దీక్షపూని భగవత్ప్రార్థన గావించినంతన
మేము శాసనోల్లంఘనముసాగింతుము - దేశ మాసేతుశీతనగం బీశుభలగ్నమునం
దేను భావించినట్లు పరిశుద్ధహృదయమున నీ జాతీయసవనము నారంభించుఁగాక!
మాతృభూమీవిముక్తికై ప్రజలు కావించుసేవలు త్యాగములు వేవేగ ఫలించుఁగాక!"136

## మహాత్ముఁడు లవణశాసనమును ధిక్కరించుట

గీ. వచ్చె సుముహూర్త మిరులెల్ల విచ్చి తూర్పు, దిక్కునం దరుణారుణదీధితి ప్ర
సారములతోడ సవిత సాక్షాత్కరించెఁ, బశ్చిమసముద్రవీచికాపటలి రేఁగె. 137

క. భగవన్నుతి యైనంతన, జగదేకపరాక్రమప్రశస్తుఁ డహింసా
యుగకర్త మహాత్ముఁడు చ, క్కగ మినమినలాడు నుప్పుగల్లును బట్టెన్. 138

క. సేనాపతితోపాటుగ, సైనికులున్ బట్టి రుప్పు; సమరోత్సుకమై
యేనాదమునన్ మూఁగిన, ప్రాణిచయంబెల్ల నపుడు పట్టిన దుప్పున్. 139

ఆ. లవణశాసనంబు నవధీరితమ్మెఁ గా, వించి జగతి కిట్లు వించెగురుఁడు
"నెట్టఁబడియె నుప్పుచట్టము ప్రజలెల్ల, ధిక్కరింపవచ్చు దీని నిఁకను. 140

ఆ. ధిక్కరించువా రధీకారు లేశిక్ష, నిడిన నైఁపవలయు జడియఁబోక
యెచటఁ బొసఁగు నచటికేగి కాంగ్రెసువార, లుప్పు వండవలయు నోహటిలక. 141

ఆ. ఉప్పు నెట్లుసేయు టొప్పు నత్తెఱఁ గెఱిఁ, గింపవలయుఁ బ్రజకు; నింప దిట్టి
చేంత దొరల కనియుఁ జెప్పవలయు, శిక్ష, పడుట తప్పదనియు నుడువవలయు.142

ఆ. కాదు - దొంగతనముకా దిది తెలిసి కా, వించుపని యటంచు వినుపవలయు
కడలిచెంత నీటిమడుఁగులఁ దనకుఁ దా, వెలలు నుప్పటంచుఁ దెలుపవలయు.143

గీ. ప్రజలు తమవంటకమునకుఁ బసికి ససికి, వాడుకొనవచ్చు దీనిఁ; గావలయు నన్న
వారలకు నమ్మి జీవింపవచ్చు ననుచు, మాటిమాటికి నూరురఁ జాటవలయు. 144

క. జాతీయవారమునయం, దేతన్నిగ్రహము వలయు నీ శాసనముం
ద్రోఁతకుఁ జాలనివారలు, లాఁతివిలువ మానుఁ దన్నలా! యనవలయున్. 145

గీ. రాట్నములు మగ్గములు ముమ్మరముగ సాగ, వీధివీధిని గల్లుపై వెగటుపుట్ట
వెలఁడు లూరూరికిం జని తెలుపవలయు,దేశగరిమమ్మునకుఁ బ్రయత్నింపవలయు.146

క. మగవారికంటె నతివలు, మిగులన్ దగియుంద్రు రాచమేలు గడింపన్
మగువ లహింసాతపమునఁ, బ్రగతిని సాధించినారు భారతభూమిన్. 147

గీ. అబల లగుట నింతు లహింస నాదరింతు, రనెడుపురుషులపల్కు నే నాదరింప
నరునకు నహంత పెరిఁగిననాఁడు నారి, కేర్పడియె దుర్బల యటన్న హీనసంజ్ఞ. 148

గీ. వనితకుంగల ధీరతావైభవమ్ము, చానకుంగల వితరణసాహసంబు
నెలంతకుంగల యింద్రియనిగ్రహమ్ము, చక్కవివరింప మాటలు చాలునొక్కొ." 149

## తెలుఁగువారి యుప్పుసత్యాగ్రహము

వ. మహాత్ముని యనుజ్ఞతో భారతభూమి నన్నిరాష్ట్రముల నానాఁ డుప్పుసత్యాగ్రహ మారంభ మాయె - దేశభక్తవేంకటప్పయ్య నియంతగా నిలువఁ దెలుఁగునాఁట నెల్లసీమలయం దీయుల్లంఘన మపూర్వోత్సాహసంపన్నమై సాగె - ఆంధ్రకర్షకవర్గ మీసమరంబునఁ బుంఖానుపుంఖముగాఁ బాల్గొనియె - దేశభక్తికిం గాణయాచియగు గుంటూరిమండల మునఁ దడవులంబట్టి కాంగ్రెసుసేవ గావించు సీతారామశాస్త్రి మున్నగుసర్దారులు గాక నడిమిపల్లి వేంకటలక్ష్మీనరసింహారావు కల్లూరి చంద్రమౌళి చింతమనేని భావయ్య వెలువోలు సీతారామయ్య వావిలాల గోపాలకృష్ణయ్య గోళ్ళమూడి రత్తమ్మ మంతెన వేంకటరాజు సీరము వేంకటసుబ్బారావు మొదలగు దిట్టలు నేఁ డని మొనకు వచ్చిరి - వీరియనుశాసనమున గణపవరము చీరాల నిజామ్‌పట్టణము దేవరంపాడు మున్నగు తావులకు నంతకుమున్న చేరి విడిసిన కాంగ్రెసుబంటు లాయారేవుల నప్పు దుప్పుం నుప్పిరి - మాండలికసత్యాగ్రహు లావేళ రెండువేలమంది గుంటూరుచేరి యెడవల్లివారి సత్రము తమ శిబిరముగా నిల్చి గుంపులుగుంపులుగాఁ బరిసరగ్రామములకేగి కాంగ్రెసు సందేశమును బ్రకటించుచుఁ బ్రజలలో నూతనవికాసము నాపాదించుచుండిరి - నగర వణిక్కులు వీరిభోజనాదులకు వలయువెచ్చమును బరమోత్సాహముతో సైఁచిరి - వీరశేఖరుఁ డున్నవ లక్ష్మీనారాయణ శిబిరనాయకుఁడై సత్యాగ్రహులకు వలయు నియ మములు నేర్పందొడఁగె - రేయుంబవలు తెఱపిలేని యూరగింపులతో నీవిడిదల యొకరాజసూయసత్రశాలం దలఁపించె - శాంతిసైనికు లానాఁడు శివాలయముచెంతఁ గోనేటిమెట్లపై నిలువ శూరనారీమణి యున్నవ లక్ష్మీబాయమ్మ "వీరగంధము తెచ్చి నారము వీరులెవ్వరొ తెల్పుఁడీ" యను త్రిపురనేని రామస్వామి కవీంద్రుని గేయమును బాడుటయు ముంగడకు వచ్చిన జోదులకు శారదానికేతనవిద్యార్థినులు వీరగంధము నలఁది తిలకముదిద్దుటయుఁ బదంపడి దేశభక్తుఁడు సత్యాగ్రహులచేతికి వీరకంకణము కట్టుటయుఁ బ్రేక్షణికులుకావించు జయజయధ్వానముల కాశావలయము కంపించు టయుఁ గన్నవారెన్నఁటికేని మఱవంజాలరు - దేశభక్తుఁ డోడరేవునుండి తెచ్చిన సముద్ర జలంబును సత్యాగ్రహు లమ్మహానాయకునింటిముందు వెలసినపందిట నధిశ్రయణీ శతమ్ముపైఁ గాఁచి యుప్పుచేసి దానిం బురవీథుల నమ్ముచు జాతీయగీతము లాలా పించుచు 'మహాత్మగాంధికిజే' యనురవములు నిరంతరముగా వెదలించుచుండ గుంటూర నప్పు డాంగ్లప్రభుత కలదని యెవ రనుకొనిరి? - సత్యాగ్రహులయంద

కాదు సర్వప్రజలయందు నాప్రొద్దు అంపిల్లిన స్వతంత్రతాతృష్ణకుఁ ద్యాగాసక్తికి నవధులు కానరావు - నాఁడు కృష్ణామండలమునం దీసమరము కోటగిరి వేంకటకృష్ణారావు వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదు కాళేశ్వరరావు కానూరి చినవేంకటదాసయ్య పట్టాభి సీతారామయ్య గొట్టిపాటి బ్రహ్మయ్య కొడాలి అంజనేయులు నూఁకల వీరరాఘవయ్య దుగ్గిరాల బలరామకృష్ణయ్య కాకాని వేంకటరత్నము కొల్లిపర సూరయ్య అన్నె అంజయ్య గొట్టెపాటి వేంకటసుబ్బయ్య వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ మొదలగువారి పర్యవేక్షణ మున సాగి సర్కారునకు సంభ్రమాశ్చర్యములు గూర్చె - నారాయణరాజు జగ్గన్నశాస్త్రి గోవిందాచార్యులు మూల్పూరి రంగయ్య చుక్కమ్మ తల్లాప్రగడ ప్రకాశరాయఁడు కేశిరాజు వేంకటనృసింహాప్పారావు ద్రోణమురాజు లక్ష్మీబాయమ్మ మున్నుగాఁగలవారు పశ్చిమ గౌతమీ మండలమునను సాంబమూర్తి సుబ్రహ్మణ్యము కళా వేంకటరావు క్రొవ్విడి లింగరాజు పళ్లంరాజు బిక్కిని వేంకటరత్నము కమలాదేవి కామేశ్వరమ్మ ప్రభృతులు ప్రాగ్గౌతమీమండలమునను తెన్నేటి విశ్వనాథము జగన్నాథగుప్త జానకీ బాయమ్మ ద్వారకాదీక్షితు లాదిగాఁగలవారు విశాఖమండలమునను ఉన్నవ రామలింగము గౌతు లచ్చన్న శ్యామసుందరరావు రాకూరు రామకృష్ణారావు పురస్సరులు గంజాము మండ లమునను పొణకా కనకమ్మ బెజవాడ గోపాలరెడ్డి వెన్నెలకంటి రాఘవయ్య పురోగములు నెల్లూరిమండలమునను రామకృష్ణరాజు వరదాచార్యులు కన్నయ్య నాయఁడు కల్లూరి సుబ్బారావు సంజీవరెడ్డి కడప కోటిరెడ్డి రామసుబ్బమ్మ నాయకంటి శంకరరెడ్డి పురో గాములు పశ్చిమాంధ్రమునను ప్రకాశముపంతులు దేశోద్ధారకుఁడు దుర్గాబాయమ్మ రంగయ్యనాయఁడు రామచంద్రుని వేంకటప్ప పురోగులు చెన్నపురము నను లవణ సత్యాగ్రహమున కండదండలై నిల్చిరి - మఱియు 150

క. కదలికిఁ గదుదూరంబగు, పుడమిం గలవారు చొటిభూమికిఁ జని మ
న్నుడికించి యుప్పుచేసిరి, యెదఁబాయనిదీక్ష విక్రయించిరి కెడలన్. 151

గీ. ఉప్పుచట్టమె యననేల తప్పుచట్ట, మెద్దియైనను నిల్వరా దీధరిత్రి
దుష్టశాసనములనెల్లఁ ద్రోయుదనుక, నిదురపోమని శపథించి రదిర! ప్రజలు. 152

## దొరతనమువారు సత్యాగ్రహులపై లాటీలు తుపాకులు పఱపుట

ఆ. కాఱుచిచ్చువోలెఁ గదలె ధిక్కారసం, గరము నగరములకు గ్రామములకు
మొదట రిత్తచేఁత యిది యని నవ్విన, పాలకులకు ఱిచ్చపాటు వొడమె. 153

క. తగ దిఁక నాలస్యం బని, మొగజోదులఁ బట్టుకొనిరి ముమ్మం, దవలన్
దిగిచిరి బంట్లను బందెకు, జగడము అంపిల్లెఁగాని సదలద దీనన్. 154

క. కారాగృహశిక్షలతో, నాఱదు పొం గిది యటంచు నధికారులు దు
ర్వారోద్యములై కాంగ్రెసు, వీరుల బాఁదిరి శిరాలు వీఁపులు బ్రీలన్. 155

క. ఈమాత్రముతో నిల్వక, యామున వీరలు కరాచి నల కలకత్తా
భూమిని బాట్నామున్నగు, సీమలఁ గాల్చిరి తుపాకి ఏచ్చులురేఁగన్. 156

వ. ఈ కాల్పులలో నిరపరాధులగుప్రజ లసువులంబాసిరి – కరాచిలో దత్తాత్రేయుఁడు రేవాచంద్రప్రభృతు లేడ్గురు మరణింపఁ గాంగ్రెసుకార్యవర్గసభ్యుఁడు జయరామదాసు దౌలత్‌రాము మృతకల్పుఁడాయె – దొరతనముపా రెంతక్రూరతం జూపిన నంత ముమ్మరముగా సంగరముసాగె – బాపూ పిలిచినంతన వేలకొలఁది మహిళామణులు సమరభూమికిదూఁకి యేలుబడివారికి భయసంభ్రమంబు లొదవించిరి – వారు సారా దుకాణములకడ, విదేశవస్త్రాపణములచెంతఁ గాపుగడ సాగించిరి – పోలీసులు వీరి నడ్డగింపలేక మగవారిదెస విజృంభించిరి – సత్యాగ్రహులకు విధించు శిక్షలయవధియుం బెరిఁగె–సంపన్నులు, నాగరికజీవను లగు నిర్బంధితులకుఁ బెక్కుర కధమశ్రేణిసౌకర్యము లొసఁగంబడె – చెఱసాలతిండి కుక్కలకుం దగనిదాయె – అందలి పులుసునం గ్రిములు లుకలుకలాడె – ఊతిబందలు వ్రీల్చుట, గానుఁగలు లాఁగుట మున్నగుకట్టిఁడిపనులు బందాలకు విధింపఁబడియె – ఐనను 157

ఆ. రాచవారుచూపు రాక్షసత్వమున కా, నాఁడు బెగడువడినవాఁ డెవండు?
తెల్లదొరతనమ్ము త్రెళ్లినఁజాలు నా, బ్రదిమికేమి యనియెఁ బ్రతినరుండు. 158

క. చెఱసాల నరకసఖమై, దురన్నముల నిడిననేమి దుర్భరబాధా
కర మైననేమి దేశము, శిరమెత్తినఁజాలు సంతసించెద ననియెన్. 159

ఆ. నాశరీర మీరణక్రతువైశ్వాన, రార్చి నాహుతంబ యైననేమి
దిగులుసెంద నేను; దేశవిముక్తికై, తనువు నూడ్చువాఁడె ధన్యుఁ డనియె. 160

గీ. కట్టరాదన్న ఖద్దరుబట్ట కట్టె, పెట్టరాదన్న గాంధిటోపీని బెట్టె
ముట్టరాదన్న యుప్పునుముట్టె నపుడు, భారతీయుఁడు విశ్వ మబ్బ్రంపడంగ. 161

క. విపరీతబుద్ధి లేలిక, లపు దన్నిటిమించి నొంచు నర్థచ్యుతి యం
చపరాధశిక్షగా ధన, మపరిమితమ్ముగ విధించి రవనీప్రజకున్. 162

ఆ. కట్టరెరి సొమ్ము కాంగ్రెసుబంటులు, రాచవార లంత దోఁచులైరి
బంధితులపొలమ్ము పసి నేలమునఁ బెట్ట, విలుచువాఁడు లేక వెల్లనైరి. 163

## మహాత్ముఁడు ముద్రణ శాసన ప్రయోగమును ఖండించుట

వ. ఇట్టితతి నెన్నఁడో మృతమైన ముద్రణశాసన ముగ్రరూపమునఁ బునరుజ్జీవితమయ్యె – దీనింబట్టి ముద్రణాలయాధిపతులు, పత్రికాసంపాదకులును దొరతనమువారికి వా రడిగినమేరకు మున్ముందుగా బాధ్యతాధనము చెల్లింపవలయు – వీరి ప్రచురణములు

వారి కంగీకృతములు గానినాఁ దావిత్తము శిక్షాధనముగాఁ బరిణమించు - మహాత్ముఁడీ చట్టమునకు లొంగవలదని తన 'నవజీవన' ముద్రాపకు నాదేశించె - అంత నాపత్రిక యుపసంహృతమయ్యె - రాజప్రతినిధి కావించిన యీదుశ్శాసనముం దదవుచు గాంధి యిట్లనియె. 164

మం."ఈనేలవారంద ఱెఱుఁగరు గాని, యిచట నేఁ దుచితమౌ నేల్బడి లేదు
రాజప్రతినిధి పౌరస్వామ్యరక్ష, వదలి సేనాపతిత్వము తలఁదాల్చె
నితనిచట్టంబులు హేతిచట్టంబు, లితనిపాలనము గర్హితపాలనమ్ము,
నీచపాలనము, సైనికపాలనంబు; ఇతఁ డున్నచట్టాల నెదలింపఁగలదు
రక్కసచట్టాల రావింపఁగలఁడు, ప్రతిఘటనక్రియా పటుత లేనట్టి
వినతులై బ్రదుకులు వెదలించునట్టి, ప్రజల నిరంకుశప్రభుతపాల్ చేసి
తనబల్మినెల్లఁ బ్రదర్శింపఁగలఁడు, కాని, యీబింక మీగర్వ మీతెగువ
చెల్లునా భారతక్షితి నిప్డు? చెల్ల, దాకాల మాయుగ మా దుర్ముహూర్త
మెప్డుదో పరువెత్తె నీ మహినుండి, యీ క్రొత్తచట్టము నీక్షించి ప్రజలు
భయముపా ల్గారని భావింతునేను, పత్రికాచాలకున్ ప్రజలకోర్కులకుఁ
బ్రతిభువులైన నీపనుపున బెదరి, చెదరి ధరావత్తు చెల్లింపఁజనదు
మనమే నొసంగ సమ్మతిపద్దనాఁడు, మనయాస్తి నొసఁగ నుమ్మలికింపరాదు
వచ్చి స్వాతంత్ర్యదేవత మనయింటి, తలుపు తట్టుచునుండఁ దత్ ప్రసన్నతకు
మనప్రజ లూరూర మరణానకైన, నాయిత్తపడుచుండ నాపని కేమి
కామందురా పత్రికాప్రతినిధులు, మనయచ్చుకూటాల మనయంత్రములను
బట్టుకొందురుగాని పాలకుల్ పట్టు, కొందురా మనపలుకులను లేఖినుల;
అగుఁగాని వారు జాత్యాశయములకు, నావంతవిలువ నీ రని యెఱుంగుదును."165

గీ. నాఁడు సత్యాగ్రహులకు నానావిధాల, హింసలువిధించు నేల్బడి నెఱిఁగి గాంధి
"మొదట నభినంద్యమగు మార్గమున గమించి,తుదకుఁ జెడెనేమి కటకటా! దొరతనమ్ము. 166

ఆ. ఉప్పు విడువుమనుచు గుప్పిటిపై దుడ్డుఁ, గట్టి నార్పనేల విఱ్ఱవీఁగి
చట్ట మెట్లు దీని సమ్మతించు? మనుష్యుఁ, గొట్టఁదగునె పశువుఁ గొట్టినట్లు. 167

ఆ. ఉద్యమంబు నణఁపునూహముతో నధి, కారు లిట్టిపనికిఁ గడఁగిరేని
చక్కనిల్వవలయు సత్యాగ్రహులు కిన్క, పదక పరుషమైనపల్కు లనక. 168

గీ. తప్పుతెఱఁగు విచారించి తగినశిక్ష, సెప్పి చెఱకంపఁగా నియ్యసేయరేని
దొరలు సత్యాగ్రహులఁగొట్టఁదొడఁగనేల, కాల్పవచ్చుఁదుపాకితోఁగూల్పవచ్చు." 169

వ. ఇట్లు సర్కారువారిని హెచ్చరించి 170

## బాపూ తాటిగెలలు కోయుట

గీ. ఊరనూరను దాళ ఖర్జూరవృక్ష, కోటికిం బట్టుగెలలను గోసివేయఁ
దవి సురాస్రవంతులు, సుర కరులు మనము, చనుఁదుతోఁటలకనెగాంధిసైనికులకు. 171

ఆ. తాన గెల యొకండు తఱిగె మహాత్ముఁ డా, వేళఁ జిన్నతాటిపాళి కరిగి
మెఱపువోలె నవని మెఱసె నీవార్త; యూ, రూరఁ దెగినగెలలు మూరిఁబోయె. 172

క. పెనుగాలివానకైవడి, దినదినముం బెరిఁగె రణ; మధికారు లింకన్
దనుఁ బట్టెదరని తలఁచిన, మనదేశికుఁ డిట్లనుడివె మధితాహవుఁడై. 173

ఆ. "యుగయుగాలనుండియును భారతోర్వికి, నున్నగొప్పతన మనుత్తమంబు
నిఖిలవిశ్వమునకు నిజమహత్త్వం బిది, చూపఁదగినవేళ దాపరించె. 174

గీ. పట్టువదలక యిది నేఁచిపరువుబరువు, విడక తుదిదాఁక సమరంబు నడుపునేని
పడయుఁ బూర్ణస్వరాజ్యవైభవము, పడయు, సకలరాజ్యసమజ్యలో స్వర్ణపీఠి. 175

గీ. కష్టములకోర్చి పెక్కు త్యాగము లొనర్చి, పడసినస్వరాజ్యమే నిలంబడును సతము
పిఱికితన మిట నెందైన నిఱికియున్నఁ, దఱుమవలె దానిఁ బ్రజలు నిస్తంద్రులగుచు. 176

ఆ. చావునందుఁగాక చంపుటలో నాకుఁ, గానరాదు నిక్కమైనతేగ
మీరహస్య మెఱిఁగి యీలక్ష్యమును జేర, బడలుఁగాక నేఁటిభారతమ్ము. 177

ఆ. భారతీయునాత్మగౌరవ మిప్పాఁట, నొడిగియుండె గుప్పెఁడుప్పునందు
సదలరాదు వీనిపిడికిలి పోలీసు, బెట్టిదమున నలఁగఁగొట్టుఁగాక. 178

## బాపూ తన్నరికట్టిన పిదపఁ బ్రజలకర్తవ్యము నిర్ణయించుట

ఆ. ఏను బంధితుండనైనచోఁ బ్రజలు కం, పిల్లరాదు బెగ్గడిల్లరాదు
దురము నడుపువాఁడు పరమేశ్వరుఁడు గాని, యేనుగాను నిక్క మీవచస్సు. 179

ఆ. దేవుఁ డెల్లవారిలో వెల్గుచున్నాఁడు, దీని విశ్వసించుమానవునకు
నతఁడ దారిచూపు నతఁడ సారథియగు, నతఁడ జయము లోఁచు నతఁడ కాచు. 180

క. మనగమ్యము మనబాటయు, సునిశ్చితంబయ్యె ధర్మశూరతమై ను
ప్పొనరింప నెల్లపల్లెల, మనుజులు రావలయుఁ బ్రభుత భ్రమానుపడంగన్. 181

గీ. మద్య మమ్ముతావున నల్లమందుకొట్టు, నెదుట సీమవల్వలు విక్రయించుచోట
స్త్రీలు నిలఁబడి పికెటింగు చేయవలయుఁ,గాల్పవలయు విదేశాంశుకములగములు. 182

క. ప్రతిగేహమ్మున మగవా, రతివలు పిన్నలును బెద్ద లర్థిని దకిలీ
జతపఱిచి వడుకవలె నూ, లతివేలంబగుచు ఖద్దరది రావలయున్. 183

క. అతఁ డస్పృశ్యుఁడు స్పృశ్యుం, డితఁ డనుభేదమ్ము మఱచి హిందువులెల్లన్
బ్రతుకవలె నొక్కకుదురుగ, నితరేతరగౌరవంబు లెసఁగన్ బొసఁగన్. 184

గీ. హిందువులు, పారశీకులు, నేసుమతము, నాదరించెడివారు మహమ్మదీయు
లైకమత్య మన్యోన్యధర్మానురాగ, మలర జీవింపవలయు శ్రేయములు గనుచు. 185

గీ. అల్పసంఖ్యాకవర్గము లౌననంగ, నధికసంఖ్యాకవర్గముల్ బ్రదుకవలయు
రాచబడి వీడవలయుఁ గుఱ్ఱలు, ప్రభుత్వ, సేవ నుద్యోగు లిఁక విసర్జింపవలయు."186

వ. మహాత్ముఁ డావెనుక సూరత్తునకుంజని సభకువచ్చు మహిళలు తకిలీతో రామి తగ దనియు, విదేశవస్త్రము తమరేవున నొడ్డుపట్టి దేశమండలముటంజేసి సూరత్తు మగువ లీపాపమునకుం దగినప్రాయశ్చిత్తము గావించుకొనవలయు ననియు హెచ్చరించె - కులపంచాయతులు నిర్మించి మద్యమున్ ముట్టమని వానిచే బాసచేయించె-'నవసారి'లో నధికారులను వెలివేఁత గర్హించె - బహిష్కృతి యాధికారికముగాఁగాక వైయక్తికముగాఁ బ్రయుక్తమగుట యనుచిత మనె - గౌరవమాధుర్యములు లేని సాంఘికబహిష్కారము హింసయగును గాన నహింసావ్రతు లిప్పట్ల జాగరూకులుగా నుంట వలయుననె - పదంపడి 'కరాడి'యను పల్లెకుఁ జని యచట దొరతనమువారి దుడుకుఁదన మగ్గ లించుట యెఱిఁగి 'దర్శన' యందలి యుప్పుఁగొటారుల ముట్టడింపం దెగి రాజప్రతినిధి కిట్లు లేఖవ్రాసె. 187

## ఉప్పుఁగొటారు లాక్రమింతునని బాపూ వైస్రాయికి లేఖవ్రాత

మం."అవధారు! ప్రియమిత్రమా! దర్శనాఖ్య, నొప్పు పల్లియనున్న యుప్పుఁగొటార్ల
సానుచరమ్ముగా నాక్రమించుటకు, నిశ్చయించితి, నన్ను నిలుపుతలంపు
మీ కున్న దే నుప్పుమీఁదికప్పంబు, మానింపవలె - నొండె - మముఁబట్టవలయు -
నొండె - నెత్తురుటేఱు లురల మాతలలు, వ్రక్కలుసేయింపవలయు మీ రెట్లు
చేసిననేమి వచ్చెద రనుకొందుఁ, గయ్యము సాగింపఁగాఁ గ్రొత్తబంట్లు
రానిచో దండయాత్ర నణంపవచ్చు, నీముట్టడి మదాత్మ కిష్టముగాక
యున్నినా ళ్ళాఁగితి నే నెంతసైఁపు, చూపిన మీవారిచుఱుకుఁదనమ్ము
కఱకుఁదనమ్ము మొక్కలితనం బకట!, నానాఁడు హెచ్చుచున్నదిగాని శాంతి
సరణి నీకొనదాయె సత్యాగ్రహులను, నాగరికంబగునడతతో దొరలు
నిలువరించెద రంచు నే నూహసేయఁ, బెడదారిత్రొక్కి రీబిరుదు లెందులకొ
ప్రథితికెక్కినవారిపట్లఁ జట్టంబు, ననుసరించుట కొంత యగపడెఁ గాని

సాధారణశ్రేణి సైనికుల్ దెసను, లేదుచట్టము నీతిలే దయో! వీరి
బెడిదమ్ముగా హింసపెట్టఁ దొడంగి, రెచటనో యొకచోట నిట్టిదుండగము
సాగినచో దాని సైఁతునుగాని, యెల్లతావుల సాగె నీయకృత్యమ్ము
ప్రజలు గుప్పిటితోడఁ బట్టినయుప్పు, వదలింప నెమ్ములు వ్రక్కలౌనట్లు
పొడిపొడి యగునట్లు పోలీసువారు, బాఁదిరి మనికట్లపై దుడ్లపూని
యిస్సిరో! నలిపినా రీ మొక్కలీంద్రు, మావారిముష్కముల్ మనుజత వీడి
పదదుచేసిరి వీరు పంటపొలాలఁ, ద్రిప్పించి మళ్ళించి త్రిచ్ఛాయమైన
జెండాను విడువనిచిఱుతలఁ గొట్టి, రెన్నియోదౌష్ట్యమ్ము లేచె బార్డోలి
నధికారులకు సత్య మన్నది గిట్ట, దపవార్తలను మీకు నంపెద ర్వారు
మైరేయపానంబు మానుఁడీ! యనుచు, మావారుపల్కుదు మద్యవిక్రేత
లెసరేఁగి వారల హింసించుచుండఁ, బోవరై రటకు మీ పోలీసువారు
ఇది యెట్టియేల్బడి యిది యెట్టినీతి, తలయెత్తె నేఁడు ముద్రణశాసనంబు
తలఁగె భగత్సింగుతప్పు చర్చించు, తతిఁ గోర్టువారికి ధర్మానురక్తి
యిట్టిచర్యలఁ జూచి యిపుడు దేశమున, సైనికరాజ్యమే సాగెడి ననుట
దోసమ్ముకా దని తోఁచు నామదికి, ఈదుష్టపాలన మీ కత్తిరాజ్య
మన్నన్మహీప్రజ నణఁపకమున్నె, తగుచర్య పాటింపఁదలఁచితి నేను
మీయల్క యిఁక మేరమీఱిపోవచ్చుఁ, గాదేని తగ్గి చక్కంబడవచ్చు
నాపల్కు లన్నియు నమ్మరు కాని, చిత్తగింపుఁడు వాని శిష్టులుమీరు
సత్యాగ్రహుల నేఁడు చక్కటి దప్పి, యధికృతుల్ హింసించునట్టితెఱంగు
మీకెఱిఁగించి యీమిడిసిపాటెల్ల, నరయఁగా మిమ్ము నాహ్వానింపకున్న
ననుఁ బాఱుఁబోతని నవ్వదా జగము, పసలేనివాఁడని పల్కదా జనము. 188

గీ. పాలకులదుండగంబులు బలియుకొలఁదిఁ, బ్రజలకష్టసహిష్ణుత బలియవలయు
కోరికోరి విపత్తులు కుడువకున్న, నబ్బునా విజయంబు సత్యాగ్రహులకు. 189

క. నామార్గమునం దెదురగు, బాముల నావలె నెఱుంగుఁ బ్రజ; భారతధా
త్రీమహనీయతకై యిది, యేముప్పునకైన నిప్పు డీకొని నిలిచెన్. 190

గీ. తదవులంబట్టి యాఫ్రికాధరణి నిచట, సలుపుచున్నాఁడ నే నహింసారణంబు
నిందుఁ బడసినయనుభూతి హేతువై వ, చింతు హింస నహింస శాసించు ననుచు. 191

క. మనసున మాటను బనిలో, నణుమాత్రయు హింస కూడ దని పలుతడవల్
వినిచితిఁ బ్రజలకు; వా రీ, దినమం దిది మఱచి తీవ్రతీవ్రక్రియకున్ - 192

ఆ. తొడఁగిరేని పూఁటపడఁజాల; నైనను, మనుజుఁ డొకఁ డొనర్చుపనికి నన్య
పురుషుఁ డెంతదనుకఁ బూఁటపడందగు, నంతదనుకఁ బదుడుఁ జింతవిడిచి. 193

గీ. దౌష్ట్య మణంప సహింసయ తగినసాధ, నం బని జగత్ ప్రసిద్ధులు నమ్ముచుండ
నస్మదనుభూతి దీనిఁ గొండాడుచుండఁ, గయ్య మెట్లు నివారింతునయ్య! నేను. 194

క. ఐనను దీవ్రక్రియకున్, బూనక మీ కాగ్రహమ్ము పుట్టింపక దే
శానకు వెతలంగూర్పక, యే నీభారమ్ము విడువ నెడఁదం దలఁతున్. 195

ఆ. యుప్పుమీఁదికప్ప ముచితము కాదని, నారు మీధరిత్రివారె పెక్కు
రీధరిత్రివారు నిది నింద్యమని నేఁటి, సంగరమ్ముతోన చాటినారు. 196

క. కావున మీ రీపన్నును, ద్రోవన్ సమకట్టవలతుఁ ద్రోచిననాఁ దే
నావిష్కరించినరణం, బావర్జితమగును శాంతియగు నుభయులకున్. 197

గీ. తగదు శాసనధిక్కృతి తగ దటంచు, నిష్టమగు బాసతోద మీ రీరణంబు
దూఱవచ్చును గాని కత్తులఁ బెనంగు, విప్లవమ్మును మెత్తురా వినుపుఁడయ్య! 198

గీ. శాసనోల్లంఘనము హింసతో సమాప్తి, చెందు నని మున్ను మీరు భాషించినట్లె
నేఁడునుం బల్కవచ్చుఁ గానీ! చరిత్ర, కర్త మీదెస నెగ్గాడఁగలఁడు రేపు. 199

ఆ. తెల్లదొర లహింసతెఱఁ గెన్నఁ దెఱుఁగని, వార లగుట మానవప్రవృత్తి
నిసిరొ! దుండగములదెసకుఁ బ్రేరేపించి, రని లిఖింపవలయు నాతఁ డెల్లి. 200

ఆ. కోపకారణంబు లేవూఁట కాపూఁట, యెన్ని గూర్చి జనుల నీర లెంత
రెచ్చఁగొట్టినను బొరింబొరిగా వారి, కీశ్వరుండు తాల్మి నీయఁగలఁడు. 201

ఆ. తాల్మివిడువలేని దళమున్న నాతేరు, కదలుటకు నిఁకేమికలదు భీతి
యుప్పుకట్టు మీర లుడిగింపరేని నా, సమరయాత్ర చక్క సాగితీరు." 202

## గాంధిని నిర్బంధించుట - పలువురుదీనిం దెగడుట

వ. సత్యాగ్రహసమరనేత యాత్రాఁతను మఱునాఁడు హస్తినకుఁ బంపందలఁచె - గూఢచారు లీవేగుదీసి పైవారి కెఱిఁగించి వారి యనుజ్ఞతో నాఁటి (మే 4) రేయి పండ్రెండుగంటల నలువదియైదు నిముసములకు నిద్రావశుఁడై యున్నగాంధిని మేల్కొలిపి నిర్బంధితు నొనర్చి యెరవాడ చెఱసాలకుం గొనిపోయిరి - దీనింగన్న విదేశ పత్రికావిలేఖకుఁ డొకం డిట్లు పల్కె. 203

ఆ. "ఏను గన్నులార నీక్షచేసితి మహా, పురుషుఁ డైనగాంధిఁ జెఱకుఁబంపు
టది యపూర్వదృశ్య మాకస్మికమ్ముగాఁ, గూడివచ్చినట్టి గొప్పమార్పు. 204

ఆ. భారతీయులైన ప్రజలు మహర్షిఁగా, నెంతు రితని నెడఁద లివతళింప
నిఁకను శతశరత్తు లేగినవెనుక నీ, దేశమున కితండు దేవుఁడగును." 205

వ. అయ్యెడ సరోజినీదేవి పత్రికల కిట్లువ్రాసె. **206**

ఆ. అరసియరసి యొక నిరంకుశశాసన, మాశ్రయించి గాంధి నాఁగినట్టి
రాచవారిఁ దెగడరా దిట్టిపని మన, విభునిపెంపు గౌరవించు టనెద. **207**

ఆ. మడఁగిమడఁగి శల్యమాత్రావశిష్టమై, యున్నగాంధితను వయోమయంపుఁ
గటకటాలవెనుకఁ బటుశిలాభిత్తుల, నడుమ నున్న మనకు నష్టి యేమి? **208**

ఆ. అతనిపల్కు ముఖ్యమగుఁ గాని తత్తనూ, యష్టిగాదు ముఖ్య; మఖిలభార
తీయహృదయవీధి దేశికవాణి ప్ర, తిధ్వనించు నేఁ డతీవగతిని. **209**

గీ. ఏనిరంకుశసమ్రాట్టులేని దాని, రవళి నణఁగింపఁజాలుదురా? కఠోర
శృంఖలలు దాని బంధించునే? తదుక్తి, చాలు భువనత్రయంబును సంస్కరింప. **210**

వ. మహాత్ముని నిర్విచారణముగా దొరతనమువా రరికట్టుటపట్ల సర్వప్రపంచము సానుభూతి మెఱయించె – పెనామా, సుమత్రా, నైరోబీ మున్నగుతావుల నావేగ మేర్పడె – అమెరికా యందలి క్రైస్తవాచార్యులు విశ్వకల్యాణమునకై మహాత్మునికోర్కు లంగీకరింపఁదగునని బ్రిటనుదేశపు మంత్రిసత్తమునకుఁ దంత్రీవార్త పంపిరి – ఇఁక భారతభూమింగూర్చి నుడువనేల – ఇం దెల్లపల్లెలం బట్టణములన్ హరతాళము జరిగె – బొంబాయివణిక్కులు తమ యంత్రాగారములు మూసిరి – బట్టలబేర మాఱుప్రొద్దు లాఁపిరి – దేశభక్తిమైఁ గొంద ఱుద్యోగములు మానిరి – గౌరవపదములం బాసిరి – ఖాదీపట్లఁ బ్రజలమక్కువ పెరిఁగె – దేశమునం గలఖద్ద రంతయు నొకవారమున వెచ్చపడె – ఇడి చిక్కనివారు మన పుడమిం బొడమిన మరబట్టఁ గట్టందొడఁగిరి – కాంగ్రెసువా రీ వల్వసైత మాదర ణీయమని తీర్మానింప విదేశవస్త్ర వ్యాపారము దిగజాఱె – దేశమునం గల్లుపాట పాడు వారు కఱవైరి – గాంధిస్థానమున కబ్బాసుతయాబ్జీ వచ్చి 'దర్శన' కొటారులపై దండ యాత్ర నారంభించె – నిర్బంధములు, లాటీదెబ్బలు ప్రబ్బె – తయాబ్జీ బంధితుఁడైన (మే 12) వార్త విని సరోజినీదేవి దర్శనకుఁ బరుగెత్తె – ఆకెయు నాల్గునాళ్లలో నిర్బంధిత యయ్యె – ఆమెతోపాటు వందలకొలఁది స్వచ్ఛందసేవకులు బందాలైరి – దండయాత్ర 'వాదాలా' కొటారులదెసకును నడిచె – వేలకొలఁది సత్యాగ్రహు లందు బంధితులైరి – వీరు పెక్కండ్రు పోలీసులదెబ్బలకు గుఱియైరి – కొంద ఱబాధలతో మృతులైరి –

## పోలీసుల దుండగములు

మృతకల్పులు సత్యాగ్రహశిబిరములం దుపచారము లందిరి – పోలీసులయత్యాచారము లకు మేరలేదాయె – వీరి దుండగములన్ గని నివ్వెఱపడిన భారతసేవకసంఘా ధ్యక్షుఁడు దేవధారు మున్నగు పెద్ద లాడిన మాట లట్లుంచి విదేశీయులు పల్కినపల్కుల నిట నుగ్గడింతు – 'న్యూఫ్రీమన్' పత్రికకు 'వెబ్ మిల్ల' రను విలేఖకుఁ డిట్లువ్రాసె. **211**

ఆ. పదియునెనిమిదేండ్లఁబట్టి విలేఖక, వృత్తి నాశ్రయించి విశ్వమందుఁ
బెక్కు దేశములను ద్రొక్కినవాఁడఁ గ, న్నాఁడఁ దిరుగఁబాట్ల నాదనాడ. **212**

ఆ. దర్శనాహవమున దర్శించిన కఠోర, దృశ్యములను జూచియెఱుఁగ నెందు
నకట! యొక్కొకప్పు డాఘోరచేష్టల, దరికి నడువలేక మఱలినాఁడ. **213**

ఆ. అంతనియమబద్ధ మగుజీవితమ్ము స, త్యాగ్రహులకె చెల్లుననెద నదిర!
యేకరూపమయ్యె నీసైనికుల రుధి, రంబుతోడ సూనృతం బహింస. **214**

వ. లండనుపత్రిక 'డెయిలీహెరాల్డు' ప్రతినిధి, 'జార్జిస్లోకోం' బిట్లు నుడివె. **215**

గీ. కటకటా! ప్రియమిత్రులకరణి మెలఁగు, కాంగిరెసుబంట్ల మధ్యభాగమున నిలిచి
దొరతనమువారిప్రతినిధుల్ నెఱపుహింస, యాంగ్లజాతిపరువునెల్ల నణఁచివైచె. **216**

వ. దేశమునందానాఁడయ్యయితావులఁ బోలీసులు చూపినదౌర్జన్యమును వర్ణించుచు
'మాంఛెస్టరుగార్డియను' పత్రికకు 'బెయిల్సుఫర్డు' వ్రాసినవ్రాఁతలు వివరింతు. **217**

మం. చేరితి నేను నిషిద్ధముల్ గాని, సభలకు రెంటి; కచ్చటఁ దగువారు
శాంతిగోల్పక ప్రసంగముల్ సలిపి, రధికారు లొనరించు నవగడములను
దూఱిరి; పురుషు లింతులును గంభీర, సరణిని గూర్చుండి సన్ననినూలు
వడుకుచు వినిరి తద్వాక్యంబులెల్ల, నింతలోఁ బోలీసు లేతెంచి దుడ్డుఁ
గఱ్ఱలతో సభన్ గదలించి; రలుక, హెచ్చెఁ బౌరులకు; వా రేము పోమనిరి
లాటీలు తచ్చిరాలను వ్రక్కలించె, నెత్తుటికాల్వలు నిండారిపఱచెఁ
బ్రజలలోఁ జా వన్న భయమునశించె, నాంగ్లాధికారుల యనుశాసనమునఁ
గటకటా! వారలకన్నులయెదుటఁ, బోలీసు లీదౌష్ట్యమును బ్రదర్శించి
రెవ రిందు నేరగాం; డ్రింగ్లీషుదొరల, తీ రిది నను సిగ్గుఁదెరలలో ముంచెఁ
గాళికాఘట్టానఁ గాంగ్రెసువారు, నదుపునుత్సవమును నానావిధాలఁ
జెఱుచుపోలీసుల చేష్టలు సూచి, విశ్వవిద్యాలయవిద్యార్థి 'మీరు
పితికివాం' డని కేకపెట్ట నుద్యోగి, యాంగ్లేయుఁ డొకఁడు సైన్యమ్ముతో వచ్చి
గదిగదికిం దూఁకి కటికచందానఁ, గొట్టించెఁ గుఱ్ఱల; గోడలువారి
నెత్తుచుక్కలతోడ నిండి చూపఱకు, నులుకుపుట్టించె; వేఱొకచోట గురుల
శిష్యుల బాఁది రిస్సీ! యధికారు, లీయకృత్యములచే నేల్బడివారి
యపకీర్తి వేయిరెట్లాయె; నూరూర, హెచ్చెఁ గాంగ్రెసుబల్మి యెన్నేనిరెట్లు." **218**

## కాంగ్రెసు నాయకులు దేశపరిస్థితుల సమీక్షించుట

క. అది యట్టులుండెఁ - గారా, సదనమ్మునకున్ గురుండు చన్నపిదప నె
య్యది కర్జంబని కాంగ్రెసు, పెదపెద్దలు మూఁడునదులు బెరసినవీటన్ - **219**

ఆ. గోష్ఠిసల్పి దేశికుని మెచ్చి రవని కు, ద్దీప్తి నిచ్చురణము దెచ్చె ననుచు;
బాపువెంట నడిచి బదలినజోదులు, మాతృభక్తి నిరుపమాన మనిరి. 220

గీ. శాసనోల్లంఘనంబు నీ సమితివార, లీకొని కొటార్లుకొట్ట దండెత్తఁగలరు
సమధికోత్సాహమునఁ బోరుసల్పఁగలరు, విజయమందక దీక్షనువిడువ రనిరి. 221

గీ. కర్షకులు కార్మికులు బేరగాండ్రు రాచ, కొలువువారు విద్యార్థులు గొప్పగొప్ప
మరలసాహులు దేశాభిమాన మలర, వలఁతిసేవలు కావింపవలయు ననిరి. 222

గీ. ఎల్లకాంగ్రెసుసంఘము లీధరిత్రి, నన్యదేశాంబరంబు క్రేయంబుగాని
తెఱఁగునం బట్టుపట్టి యత్నింపవలయు, ననిరి, ఖద్దరు సర్వభద్రాంక మనిరి. 223

ఆ. ఆంగ్లదేశవస్తు వది వస్త్రమేకా దిఁ, కెద్దియైన దాని కిచటఁ దావు
చిక్కకుండునట్లు మక్కువరానట్లు, ప్రజలు కృషియొనర్పవలయు ననిరి. 224

గీ. ఓర్పు నే ర్పున్న తావుల నుర్విపన్ను, కానపన్ను ఘట్టముపన్ను కట్టకుండ
నేలువారి నహింసతో హాలికాదు, లెదురుతతి వచ్చె ననిరి మనీషిమణులు. 225

గీ. మద్యపానము నుడిగించునుద్యమంబు, లెస్సకావలె నని; రాంగిలేయు లిచట
నడుపు వాణిజ్యకోశాదు లెడయవలయు, ననిరి ముద్రణశిక్షి యనర్హ మనిరి. 226

గీ. ఉప్పుచట్టముపట్ల నీ యుర్వినదత, యొదమదు వటంచు సూచింప నెల్లయెడల
నెల్లరవివాసరమ్ములఁ జెల్లవలయు, సర్వపథముల నుచితప్రచార మనిరి. 227

ఆ. అచటనచటఁ గొంద అన్యాయ్యకార్యము, లాచరించి ప్రభుత నేఁచినట్టి
సరణి దూష్యమనిరి సత్య మహింసయుఁ, దలఁగరాని యాయుధంబు లనిరి. 228

## పటేలు చెఱనుండిరాక - బార్డోలి రైతులు శిస్తుకట్టమి

ఆ. మూఁడునెలలశిక్ష ముగిసి విముక్తుఁడై, వచ్చె రంగమునకు వల్లభాయి
పోటుబం టతండు బొంబయిగుజరాతి, రాష్ట్రముల రణంపుఱావు నెగచె. 229

గీ. అపుడు కాంగ్రెసుసంఘము లన్నియును ని, షిద్ధసంఘము లనుఘోరశిక్షి వెడలె
భారతధరిత్రియందలి ప్రతికుటీర, మిపుడు కాంగ్రెసునెల వనియెన్ బటేలు. 230

గీ. అతఁడు ప్రతిభారతీయునియాత్మ నేఁడు, కాంగ్రెసుమహాసద స్సనెఁ గరిపురంపు
సభ నసిన్ జళిపించి రాజప్రతినిధి, మెఱసినప్రసంగమునకు నుత్తరము గాఁగ. 231

గీ. చెలఁగె బార్డోలి బోర్సాదుసీమలందుఁ, గరనిరాకృతి లోక మచ్చెరుపడంగ
రేఁగె నిర్బంధములు తద్దయాగడములు, దొరల బెట్టిదపుం దలబిరుసుకతన. 232

ఆ. ఇసిరొ! యెనుబదేండ్లముసలమ్మ వల్లభుఁ, గన్నసుకృతరాశి - యన్నఘటము
పగులఁగొట్టి యెంతపలువలో పోలీసు, లిసుక గబ్బుచమురు పిసికి రందు. 233

గీ. అంతచేసిననేమి యాయవ్వగాని, యచటిపౌరులుగాని మహాత్ముపల్కు
మఱవరైరి యహింసను మానరైరి, విడువరై రతిలోక గాంభీర్యముద్ర. 234

వ. ఘూర్జరగ్రామముల నధికారు లానాఁడు సాగించినదౌష్ట్యముం గన్న బ్రెయిల్సు ఫర్డు పల్కులు కొన్ని యిట వెలువరింతు. 235

## బ్రెయిల్సుఫర్డు పోలీసులయాగడముల గర్హించుట

ఆ. "ఏను దిరిగినాఁడ నేనుప్రొద్దులు పన్ను, కట్టకున్న గుజరిగ్రామములను
సంతరించినాఁడ సాక్ష్యముల్ పోలీసు, మూఁక సల్పు నాగములనుగూర్చి. 236

ఆ. గాంధిమీఁదిభక్తికతన స్వరాజ్యాను, రక్తికతన ధనవియుక్తికతన
నీయరైరి పన్ను లీరాష్ట్రమున మన్ను, పిసికి బ్రదుకులీడ్చు పేదవారు. 237

క. ప న్నీ లే దని దొర లీ, యన్నలపొలములను బసుల నరికట్టి కడున్
సన్నంపువెలల కమ్మిరి, పెన్నెద్దును రూకకైన విడి రేలమునన్. 238

ఆ. ఒప్పు తప్పు గనక యూరూరఁ బోలీసు, దళము రేఁగి ప్రజలతలలు మూఁపు
లంగుటమ్ము లాదియగునంగములు వ్రీలఁ, బొడిచినది తుపాకిమదమతోడ. 239

క. ఆగాయము లావాపులు, నేఁ గంటిని గన్నులార, విని తీవ్రము; లీ
యాగస్సుల కకటా! యెల, నాఁగయు నొక్కరిత చిక్కినది యొకపల్లెన్. 240

క. ఈ కన్నియ తనదెబ్బలు, నాకుం గనిపింప సిగ్గునం దోఁగె నిసీ!
వాకొనఁగఁ జాల నత్తతి, రేకెత్తిన మత్ క్రుధాగరిష్ఠత నార్తిన్. 241

ఆ. ప న్నొసంగఁదగిన పంటకాఁ పింట లే, నపుడు పొరుగురైతు నణఁచి రరికి;
కాంగిరెసుపతాక గాంధిటోపీ డింప, ననినవారిఁ దన్ని రదిర! బంట్లు. 242

గీ. కరనిరాకృతి సాగించుకర్షకులను, బట్టి శిక్షీయరేని శేషములఁ గోసి
పేదులనుజేసి మిమ్ముఁ బంపెద మటంచుఁ, బదరి రధికారులొకయూరనెదురులేమి. 243

క. 'బరియా, లనుదొంగల నిటఁ, గరిసెనమున బ్రదుకువారి గ్రామంబులపై
కుతికించిరి పోలీసులు, సిరి దోఁచుకొనంగ నిండ్లఁ జిచ్చుంబెట్టన్. 244

గీ. వీరవనితలు బోర్సదువెలఁదు లొక మ, హోత్సవమ్మును సాగింప నుద్యమించి
యచ్చటచ్చట నోరెండినపుడు త్రాగ, సలిలమును నిల్పికొనిరి బానలకుఁబట్టి. 245

క. పోలీసువార లీకథ, నాలించిరి దూఁకి రత్యహంకారమునన్
ప్రేలిచిరి నీటిపనఁటులఁ, దోలిరి మగువలను గొర్లఁ దోలినకరణిన్. 246

క. పరుగెత్తలేక సపిచెడి, ధరపైఁబడి లేవలేనితరుణుల నిస్సీ!
పొరలించి యెగసి వారల, యురములపై కెక్కి త్రొక్కి రురుపాదువులన్. 247

ఆ. బంధితులను దెచ్చి పదిమంది పట్టని, గదిని నూఱుమంది నదిమి నారు
సభ్యతావిదూరచర్య లింకెన్నియో, కలవు గాని వానిఁ బలుకఁజాల. 248

గీ. ఈయకృత్యములన్ భరియింపలేక, కమ్మతీంద్రు బరోదాకుఁ గదలినారు
త్యాగ మన వీరిదేకదా త్యాగ! మిట్టి, బాట వీరి కహో! వల్లభాయి చూపె" 249

క. వల్లభునికృషికి ఫలమై, వెల్లివిరిసె లాఁతిబట్ట వెలివేఁత; యిఁకన్
జెల్లదు మనబేరం బని, యల్లాడిరి లాంకషైరునందలివణిజుల్. 250

ఆ. వారిమరలు త్రుప్పువట్టె నిరుద్యోగ, పీడఁబడిరి వారుపెనుచుప్రజలు
మూల్గె నిచటిసంద్రములతీరముల వారి, దింపువలువ కొనెడిదిక్కు లేక. 251

## పికెటింగు విజృంభించుట

వ. బహిష్కారోద్యమముతోపాటు నిర్బంధవిధానంబును విజృంభించె - స్వచ్ఛంద సైనిక
దళములు బొంబాయిలోని విదేశవస్త్రవ్యాపారమును లోకోత్తరముగా నరికట్టె - మహిళ
లీసేనయం దసంఖ్యాకముగాఁ జేరిరి - కుసుమపూవన్నె చీరలు దాల్చి వారు పెఱవల్వల
నమ్మునంగడిముంగడ నిల్చి పికెటింగుసేఁత ప్రజాహృదయములయం దెనలేనిమార్పు
దెచ్చె - మఱియు 252

ఆ. వదల నేను సీమవలువబేరం బని, మూర్ఖుఁ డెవ్వఁడేని మోహరింప
నతనిసతియ వచ్చి యాకొట్టుకడఁ బికె, టింగుసేయ మగఁడు లొంగఁజొచ్చె. 253

గీ. అన్యదేశాంబరవణిజ్య నాఁపుసతుల, గుంపుగాఁ జేర్చి లారీలఁ గ్రుక్కి క్రుక్కి
వీటికవ్వల దవ్వుల విడువసాగె, నపుడు పోలీసుమూఁక హెచ్చైనకాఁక. 254

క. చావో బ్రదుకో తేలం, గావలె నని భారతోర్విఁ గలకాంగ్రెసువా
రావేశఁ దెగించిరి దొర, లేవేదన లిడిన సైఁచి రేచి రహింసన్. 255

## సరిహద్దుగాంధి యహింసాదీక్ష

ఆ. కత్తిపట్టి పగఱకుత్తుకల్ కోయుట, తక్క వేఱుదారి త్రొక్కనట్టి
శస్త్రజీవనులు పెషావర్ పఠాను ల, యారె! పిచ్చుగోవు లైరి యిపుడు. 256

గీ. అనఘుఁ డబ్దుల్‌గఫర్‌ఖాన్ మహాత్మునడత, మంచిదనువాఁడువెలసెనమ్మహినినేఁడు
దయను సత్యమున్ గఱపి పఠానుజాతి, నితఁడు దిద్దె నహింసాభిరతము కాఁగ. **257**

క. సరిహద్దుగాంధి యనఁగా, జిరకీర్తిం గన్న యితనిశిక్షకు లోనై
కఱకుఁదనమెల్ల దుల్లఁగ, మెఱసెఁ బఠాన్‌ప్రజ జగంబు మేల్ మే లనఁగన్. **258**

వ. అహింసాబద్ధమగు శాసనోల్లంఘనోద్యమమున కీ వాయవ్యరాష్ట్ర మీనాఁడు కోట యయ్యె – దొరతనమువా రీనేల నెన్నేని ఘోరకృత్యము లొనర్చిరి – ఒకనాఁడు పఠానులసభపైఁ దుపాకులు కాల్ప ఘూర్వాలా సిపాయుల కాన యిచ్చిరి – కాని యీ సిపాయులు నిరాయుధులం గూల్ప మని తమనాయకు నెదుర్కొని సైనికన్యాయస్థానమునఁ బదిపదు నాల్గేఁడు లవధిగా దీర్ఘశిక్షల నందిరి – మఱియు **259**

క. చెఱసాలశిక్షకే కా, దురిశిక్షకునైన నెవ్వఁ డోటంగనె న;
ప్పురలని స్వరాజ్యలాలస, యురరీకృతమైన త్యాగ ముల్లము నెగువన్. **260**

గీ. అణఁచినకొలంది భారత మపుడు బంతి, కరణి మీఁదికిలేచె; నాంగ్లప్రభుత్వ
మాసచావమిచేఁ దెగునంతదనుక, లాఁగఁదొడఁగె వివేకంబు లజ్జ విడిచి. **261**

## దొరతనమువారి దారుణచర్యలు

గీ. ఎల్ల రాష్ట్రములందు నేఁ దెగసి దొరలు, పంపి రొకలక్షమందిని బందిగముల
కకట! చెటచెట లాటీల నార్చి ప్రజల, తలలు బ్రద్దలుచేసి రుత్కటులు భటులు. **262**

గీ. గుండ్లు ప్రేలిచి వందలకొలఁదిప్రజలఁ, గూలఁద్రోసిరి మఱి వేలకొలఁదినరులఁ
బాణిపాదము చెఱిచి జీవచ్ఛవములఁ, జేసి రాశరు లగుచుఁ బోలీసువారు. **263**

గీ. సంపదలను దోఁపించిరి సదనములకు, నగ్గిపెట్టించి రాశ్వికమైనదళము
నూరనూరఁ ద్రిప్పించిరి క్రూరతరము, నేలుబడివారు తెగి రెట్టిహింసకేని. **264**

క. మాటాడుహక్కు నూడ్చిరి, కూటువుగాఁ బ్రజలు చేరఁగూడ దనిరి, యే
టాటోటులేని కాంగ్రెసు, పాటింపం దగని దనిరి బలిసినకినుకన్. **265**

క. ఎంతలుచేసిన దేశం, బంతయు నాబాలవృద్ధ మసమానధృతిన్
గ్రాంతి యహింసామయభా, స్వంతము సాగించి వీరజాతిగ నిలిచెన్. **266**

ఆ. వేలకొలఁదివెలఁదు లాలమునన్ దీనఁ, బాలుగొనుట కబ్రపడఁగ జగము
తీంద్రదెసకుఁ బోక పంద్రెండువేల ము, స్లిములు బందిగములఁ జిక్కి రపుడు. **267**

గీ. హిందువులు ముస్లిములు మైత్రి కియ్యకొనుట, యటనటన్‌సైనికులు నేతకద్దుపడుట
కన్న తెలవానిగుండెలోఁ గంపమెత్తె, విన్న తెలవానిమది గంగవెఱ్ఱి పుట్టె. **268**

గీ. భక్తిమై రక్తిమైఁ దమశక్తి కనుగు, ణంబుగా దస్సె నఖిలరాష్ట్రంబు లీమ
హాధ్వరమున జాతీయమహారణమున, మాతృదాస్యవిమోచక మంగళమున. 269

వ. వంగరాష్ట్రమున నిర్బంధితులసంఖ్య హెచ్చె - ఘూర్జరమునం గరనిరాకృతి ప్రథమస్థాన మందుకొనె - కన్నడమున ద్వితీయస్థానముం బడసె - సంయుక్తరాష్ట్రములఁ దృతీయ స్థానము గడించె - బీహారున విదేశవస్త్రబహిష్కారము మూరిఁబోయె - ఉత్కలమునందు సైత మిది హెచ్చె - మధ్యరాష్ట్రముల నటవీ సత్యాగ్రహము జంపిల్లె - తమిళకేరళములఁ గల్లుపాటలు పడిపోయె-పాంచాలాదులఁ గారాగృహక్లేశము లతిశయించె - తెనుఁగు నాట గ్రామీణచైతన్య మతివేలమాయె - నిర్బంధవిధానము సర్వతోముఖముగా సాగె

## లాటీదెబ్బలతోఁ బలువురు నలినలియగుట

లాటీప్రయోగములు ముమ్మరించె - నాగళ్ళ కృష్ణయ్య, గుళ్ళపల్లి రామకృష్ణయ్య, కొండి పర్తి వీరభద్రాచార్యులు, వేదాంతము శంభుశాస్త్రి, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త, భువన కడియము నాగభూషణము (అంధుఁడు), తల్లాప్రగడ ప్రకాశరాయఁడు, నారాయణ మూర్తి, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యము, వంకాయల సూర్యగుప్త, బాబూలాలు, వసంత రావు బుచ్చిసుందరరావు, దుర్గాబాయమ్మ, వేంకటప్ప మున్నగు తెల్లజోదు లీకరోరప్రహ రమ్ములకు నలినలియై నెత్రుటేర్లందేలితేలి చచ్చిబ్రదుక సురవకొండలో నోబలే సను సత్యాగ్రహి నూటపదిలాటీదెబ్బలతో నొదలు నజ్జునజ్జుగా నసువులం బాసె-వెండియు270

మం. గొంతెండి ప్రాణముల్ గుటగుటలాడ, నలమటసెందు సత్యాగ్రహినోట
మంచినీ ర్పోసిన మానిసి నిసిరొ!, యొద్దిరి చెఱసాల కేల్పాడివారు
ప్రతిపురమ్మునకు మల్బారుసైనికుల, రావించి రానాఁడు బాగుందెవారి
నీరక్కసులు తద్ద యెసరేఁగి కాకి, నాద, రాజమహేంద్రనగరి, తెనాలి,
గుంటూరు, చీరాల, గుడివాద, బంద, రాదిగాఁగల తావులందు రేపవలు
గాలించి ఖద్దరుకట్టినవాని, బాఁదిరి నేలపైఁబడి తన్నుకొనఁగ;
నేలూరిప్రజ వీరి నెదిరించి నిల్వఁ, జిచ్చులుపఱపి యాచెనఁటులు చంపి
రిద్దఱుపౌరుల; నింతియ కాక, పెద్దాపురమ్మున విందారగింపఁ
జేరినమిత్రుల శీర్షముల్ వ్రీల్చి, రింతులున్ జిక్కి రేహింసకు ముగురు
దొరతన మెంతదుందుడుకుతో నున్న, మనవారు కనరైరి మనసుపేదఱిమి. 271

ఆ. తూలి తాల్మివీడి పోలీసులను బ్రజ, లెదిరి యచటనచటఁ బదురఁ జంపి
రింతపెద్దనేల నీపాటిచెదు గద్భు, తమ్ము కాదు గాని తప్పు తప్పె! 272

క. గోపీనాధపురమ్మున, బాపూపని సేయుచున్న ప్రజలను హింసా
వ్యాపారప్రియమానసు, లై పోలీసులు కదంగి యమదండంబున్ - 273

క. పురుడించు దండములతోఁ, జఱచిరి చఱవంగఁబడినజనులందుఁ గడున్
జిఱుత కలఁ దొక్కఁ దాతని, దురవస్థం జూచి కినుక తొందరపెట్టన్ - 274

గీ. ఊరివారు పోలీసుల నొడిసిపట్టి, బడినిఁద్రోసి తాళమువైచి పారశాల
కగ్గివెట్టిరి; యీవార్త నాలకించి, నంతనే కాంగిరెసుబంటు లరుగుదెంచి - 275

గీ. పారశాలతాళమ్మును బగులఁగట్టి, యుమ్మలించుపోలీసుల నుద్ధరించి;
రేమికన్గొంటి మీకథన్? హింసకును మ, హాత్మసేనకుఁ బొత్తులే దనియ కాదె. 276

ఆ. ఐననేమి తెలివిలేని ప్రజల్ సేయు, చెట్ట కాంగ్రెసునకు ముట్టుఁ; గాని
దీనికేను బూఁటఁ గానోప నని గురుం, దెఱుకచేసె మున్నె యిర్విసునకు. 277

గీ. దేశ మిట్లు స్వతంత్రతావేశమునకుఁ, జిక్కి యేత్యాగమునకేని సిద్ధపడఁగ
నడఁగె నిర్విసుగారిపొం; గుడిగెమార్గ, నాల్డుదొరగారి రాజసోన్నతియు ధృతియు. 278

## సీమసర్కారు కాంగ్రెసుతో రాయబారము లారంభించుట

గీ. బ్రిటనుమంత్రివరేణ్యుఁ డవ్వేళ భార, తోర్విఁ దనతెగపత్రిక కుచితవార్త
లంప నిల్చినస్లోకోంబు నాతితేతి, నట్టినీతిజ్ఞుఁ బిలిచి యిట్లనియె నెమ్మి. 279

ఆ. ఉప్పుశాసనంబు నుల్లంఘనముసేఁత, మొదలుగాఁ బ్రభుత్వమూలబంధ
మూఁగులాడఁజేయు నుద్యమమునకు భా, రతము పూనె నన్నకతను వింటి. 280

క. ఈయుద్యమమునకు మహా, నాయకుఁడగు గాంధిఁ గని రణం బాఁపి మహీ
శ్రేయమ్ము నరయుసభకున్, దాయునటుల్ చేయు మతనిఁ దగునెత్తుగడన్. 281

ఆ. ఉభయగౌరవంబు లుడుగనిచందానఁ, గృషి యొనర్పుమయ్య! యెంతకాల
మాఁపఁగలము ప్రజల? నసిలేనివారితోఁ, బోరుటెట్లు? శాంతిపొందు టెట్లు? 282

క. నావుడుఁ జిత్తంబని తత్, కోవిదుఁ డెరవాడకారకుం జని కనియెన్ (మే 26)
బావనచరిత్రు మాతృమ, హీవైభవకరణకృతి మహీయఃప్రతిభున్. 283

క. ఆతఁడు వినీతుఁడై మన, నేతకు నిఁక నుద్యమంబు నిల్పఁడు, సంధి
ప్రీతి వహింపుఁడు, గోష్ఠికి, నేతేరుఁడు, తేఱుఁ దనియె హితమితఫణితిన్. 284

ఆ. ఒజ్జ యిట్లుపల్కె నోయన్న! సత్యాగ్ర, హమున సంధికెపుడు నడను కలదు
పాడి కాసచేసి ప్రత్యర్థి వచ్చినఁ, బీఁటవైతు నతని కోటలేక. 285

ఆ. ఈరసం బహింస యితరేతరవిరుద్ధ, గుణము లని యెతింగి కొంకుమాను
మేను ప్రేమతో జయించినరాజ్యమే, వలతుఁగాని యొండు వలవఁజాల. 286

గీ. నెమ్మితో గడించినసిరి నిలుచుఁగాని, నిలుచునా పగతోఁ గన్నకలిమి యెందు?
నీరహస్య మెఱుంగక యింతదాఁక, వచ్చెను జగమ్ము కత్తులు విచ్చివిచ్చి. 287

ఆ. ఏప్రభుత్వమునకు నీనాఁడు నిర్వృతి, కలదు? చిత్తశాంతి కలదు? సెప్పుమ!
హింస యేమిసేయు? హింసను బ్రేరించి, యిదుమలెల్లఁ దెచ్చి యిడుట గాక. 288

ఆ. ఇంటిప్రక్కవాఁడు హితుఁడు గాకున్నచో, నిదురరాక నరుఁడు నెగులుగుడుచు
దేశ మెల్ల నెదురుదిరుగుచో దొరతన, మెంతసుఖము పడయు శాంతి వడయు. 289

గీ. ఎల్లకాలము తంత్రము చెల్ల నేర, దెల్ల కాలము వాలు జయింపఁజాల
దాంగిలేయులు కనువిచ్చి యర్థమైన, తెరువునకు వచ్చి యశము నందెదరుగాక! 290

గీ. చెలిమి నాంగ్లేయు లాసచేసెదరయేని, వదలవలయు బంధితుల మావారినెల్ల
నుప్పుచట్టమునకు స్వస్తిసెప్పవలయుఁ, జనదు మద్యపానం బని చాటవలయు. 291

ఆ. ఇతరదేశవస్త్ర మిచ్చుట దిగరాని, సరణిఁ జేయవలయు శాసనంబు
వలయుఁ బెత్తనంబు వలయితగోష్ఠికి, నధినివేశరాజ్యవిధి రచింప." 292

ఆ. గాంధి యిట్లుపల్కఁగా జార్జిస్లోకోంబు, సంతసించి యాంగ్లసచివమౌళి
కీప్రసంగమెల్ల నెఱుకసేయుచుఁ దన, తలఁపుసైత మివ్విధానఁ దెలిపె. 293

ఆ. ఉభయగౌరవంబు లుడుగనిసంధి మీ, కిష్టమగునయేని యెదురుసెప్పఁ
దపుడు మీకు గాంధి; యఖిలభారతమున, కాత్మ యతఁడు నమ్ముఁ దన్మదుక్తి. 294

గీ. మీరు మీదొరతనమువారిరహస్య, మెఱుఁగుచో నేఁడు గొప్పదెప్పరముతొలఁగు
నేదెసన్ దురుసున్నను రాదులగ్గు, సామరస్యంబె సకలార్థసాధకంబు." 295

ఆ. ఇతనిమేలిపల్కు లింగ్లీషువారల, కన్నువిప్పెఁ గాని, కస్సుబుస్సు
మనియె నాంగ్లదేశమందలి భూస్వామి, పటల మాదరించు పత్రికాళి. 296

క. మితవాదు లపుడు బాపూ, మతిచంద మెఱింగి సంధి మంచిదికద యీ
కృతి కొగ్గెదమని రాజ, ప్రతినిధిసమ్మతి గడించి ప్రజ్ఞానిధులన్ - 297

ఆ. అచటనచటఁ జెఱలయం దుండుకాంగ్రెసు, సచివులను మహాత్ముసదన మగుచు
నురుయశమ్ముగనెడియెరవాడకారకుఁజేర్చిరదియునిదియుఁజర్చసేయ. (ఆగస్టు 14)298

వ. అంత బాపూసమక్షమునఁ గాంగ్రెసు కార్యవర్గసభ్యులు జవహర్‌లాలునెహ్రూ, మోతీలాలు నెహ్రూ, వల్లభాయిపటేలు, సయ్యదుమహమ్మదు, జయరామదాసు దౌలత్‌రాము, సరోజినీదేవులు కూర్చుండి సంధితంత్రమును బరామర్శించి మహాత్ముఁ దింతకుమున్ను

స్లోకోంబున కెతిఁగించిన యొదంబడికలకుఁ దోడుగా నధినివేశప్రతిపత్తి ననుభవించు భారతదేశమున కిచ్చువచ్చిననాఁ డాంగ్లసామ్రాజ్యముతోడిపొత్తు(కామన్‌వెల్తు సంబంధము) నుజ్జనసేయునధికార ముంట వలయు ననియు నధినివేశస్వరాజ్య మారబ్ధమగులోపల నేఁటిరాజ్యాంగశాసనమునకు వలయుమార్పులు భారతీయప్రతినిధులే నిర్ణయింపవలయు ననియు, మఱిమూఁడొదఁబాట్లు నిర్ణయించి యీసంధియత్నములు సాగించిన సప్రూ జయకరుల నభినందించి యెవరిబందిగమునకు వారు మఱలిరి - పదంపడి 299

గీ. కాల మది పరిపక్వముకామి నాంగి, లేయు లీసూత్రముల నియ్యసేయరైరి
వరుఁడు లేని వివాహమ్ముకరణి జరిగెఁ, గాంగిరెసులేని సర్వపక్ష ప్రయుక్తి. 300

మం. ఈగోష్ఠి ప్రజలలో నిసుమంత పలుకు, బడిలేని - జాతీయభావప్రపంచ
మెఱుకసేయఁగలేని - యింగ్లీషువారి, జంకించుధృతిలేని సంస్థానపతుల
తోడను, మితవాదధోరణివారి, తోడను, మతకులాదులకు సంకుచిత
దర్శనములకు సంతతసేవఁ జేయు, పెంకెలతోడను, బ్రిటనులోనున్న
నానావిధా రాజనైతికపక్ష, ముఖ్యులతోడను మూఁగె లండనునఁ (నవంబరు 12)
బాము చావనియట్లు పట్టినబడిత, విఱుగనియట్లు కావించెఁ దీర్పులను. 301

## 1931

వ. దీనిబండార మెతిఁగిన మహామంత్రి మాక్డొనాల్డు 302

మం. "కాంగ్రెసువారు చక్కంబడి శాస, నోల్లంఘనక్రియ నుజ్జనసేయ
నీకొనుచో వారి నెట్టి కట్టడలు, పెట్టక చెఱనుండివిడుతు మావెన్క
వలయితగోష్ఠి కాహ్వానించి వారి, సాయమ్ము పడతు మీసందర్భమునకు
వలసినపనులెల్ల వైస్రాయిచేయు" నని వెల్లడించుడు హస్తిపురీంద్రుఁ
డిర్విను ప్రకటించె నీవాక్యములను. (22-1-31) 303

గీ. "ఆంగ్లసామ్రాజ్యసచివచ యాగ్రగణ్యుఁ, డుగ్గడించినపల్కుల కగ్గపడుచు
మంచిచెడ్డల తెఱఁగు చర్చించుకొనుట, కెల్లకాంగ్రెసుముఖ్యుల నిపుడు విడుతు. 304

క. ఈ విడుపున కేనియతులు, లేవు మహిన్ శాంతి యగ్గలింపందగు వా
తావరణము సృష్టింపఁగ, నీ వలఁతులు వలతురనియ యే నూహింతున్. 305

ఆ. శాంతి యొదవునేని సర్కారువారు త, దనుగుణక్రియార్థ మంగవింతు
రాగ్రహోదు లుడిగి యందఱు హర్షించు, వెరవు, నెఱవు పెద్ద లరయవలయు." 306

క. మఱుసటిదినమునఁ - బూర్ణ, స్వరాజ్యదినమున జగత్ ప్రశస్తుల సేవా
భరనతుల మహాత్మాదుల, నిరువదియారుగుర విడిచి రేల్బడివారల్. 307

గీ. పిల్లచెఱసాల విడనాడి యెల్ల లేని, పెద్దచెఱసాలలోఁ గాలుపెట్టె గాంధి
గెలుపు నోటమి నెఱుఁగనిబలియుఁడతఁడు, నుడివె నపుడిట్లు నిర్వికారుఁడుగ నిల్చి. 308

ఆ. ఏ కలంక లేని యెదఁదతో నెరవాద, విడిచి వచ్చినాఁడ వెలికి నిప్పు
డీమహాధరిత్రి నేప్రాణియందును, లేదు కినుక నాకు లేశమేని. 309

క. లే దభిమానము నాకొక, వాదమ్మునయందు ధర్మవాదమున వినా;
నాదృష్టి సర్వదిక్కుల, నాదృతిమైఁ జూచు సత్య మన్వేషింపన్. 310

క. మొన్నటి వలయితగోష్టికిఁ జన్న ప్రజాతంత్రరతులు సత్పూజయక
ర్లిన్నేలకు దిగినంతన, పన్నెదఁ జర్చల నమాత్యుపల్కులపట్లన్. 311

ఆ. ఆంగ్లభూమి నున్నయన్నలు తద్గోష్ఠి, కేగినట్టిదేశహితులు కొంద
ఱియ్యపడుటకతన నీపాటిగా వెల్వ, రించితిని మదీయహృదయసరణి. 312

## మోతీలాలు నిర్యాణము - బాపూవేదన

వ. ఇట్లు పల్కి యలహాబాదునం దీవ్రవ్యాధికిలోనై నలుగుఁచున్న మోతీలాలు చెంతకు బాపూ పరుగిడియె-కారాగృహవిముక్తినందిన కాంగ్రెసు కార్యవర్గ సభ్యులందఱు నావేళ కట కాకారితులై వచ్చిరి - త్యాగమూర్తి మోతీలాలు కాంగ్రెసున కర్పించిన ప్రాసాదమున స్వరాజ్యభవనమునం బెద్దలు గోష్ఠిసల్పి (ఫిబ్ర1) శాసనోల్లంఘన ముపసంహృత మని కొందఱుతలంచుట సరిగాదనియు దీనినాఁపినట్లు తేటతెల్లమగునానతి వెలువడుదనుక నిది యనర్గళముగ సాగుచుండు ననియు సారాదుకాణములకడ విదేశవస్త్రాపణములకడ జరుగుపికెటింగు శాసనోల్లంఘనమునం దొకపాలు కాదనియుఁ గాపుగడ ప్రజల సాధారణస్వత్వ మనియు లాఁతివిలాతివలువల వెలివేఁత జాతీయత కొకసదాతన చిహ్న మనియు నిర్ణయించిరి - ఇంతలో మోతీపండితునిరుజ శోచనీయస్థితికి వచ్చె - లక్నోనగర మాయన చికిత్సాస్థానముగా మాఱె - మహాత్ముఁ దాయాపన్నుతో లక్నో చేరె - సుప్రసిద్ధవైద్యు లెంతో శ్రమించిరి - కాని మోతీలాలునకు నూఱేండ్లు నిండె (ఫిబ్ర-5) - తుదిగడియల నమ్మహాపురుషుం డిట్లుపల్కుచుఁ బ్రాణమ్ము విడిచె. 313

ఆ. "అన్నలార! భారతావనీభవితవ్య, ఘట్ట మేను జూడగా స్వరాజ్య
భవనమందు సిద్ధపఱుపుఁ డీ చేతలో, నాకుఁగూడఁ జెత్తనమ్ము నిందు. 314

ఆ. ఏను మేను విడుచుటే తప్పదేని యీా, దాస్యమగ్న భారతమునఁగాక
స్వైరజీవనప్రసన్న భారతమున, విడుతుఁగాక! శాంతి గుడుతుఁగాక !" 315

క. అకటకటా ! మోతీలా, లిఁక లేఁడు కుశాగ్రబుద్ధి యిఁక లేఁదు తమః
ప్రకరము కవ్వించెదుతతిఁ, బ్రకృష్ట తేజమ్ము గురియురవి లేఁడ యిఁకన్. 316

ఆ. ఎంత చెట్టు వొదమె! నీదిట్టి యొక రాజ, రాజువోలె బ్రదికె నీజగానఁ
బ్రజ్ఞయందు సిరిని విజ్ఞానమున సర్వ, రంగముల నితండు రాజరాజె! 317

ఆ. ఇతఁ డుదారదృష్టి నీక్షించు నఖిలంబు, నతినిగూఢవిషయమైనఁ దేల్చు
నాంగిలేయు లితని యనితరాసాదిత, ప్రతిభ నరసి తిచ్చపాటు గంద్రు. 318

ఆ. ఎల్లలేనికలిమి నేలువాఁడయ్యును, గోరికోరి లేమిఁగూరె నితఁడు
గాంధికొలువు సొచ్చి కటుతరవైరాగ్య, మభ్యసించె లోక మబ్రపడఁగ. 319

ఆ. ధనము గూర్చెఁగాని తానొక్కఁడే దాని, ననుభవించు టెఱుఁగఁడాయె నితఁడు
కాంగ్రెసునకు నిచ్చెఁగద లక్షలకుఁజాలు, దివ్యభవన మీ వితీర్ణిరతుఁడు. 320

ఆ. ఎంత గొప్పదైన నిది జడదానంబ, కద యటంచు నొరుఁడు పెదవివిఱుచు
నని తలంచెనేమొ తన ప్రేమ కిల్లైన, తనయునే యొసంగె ధరణి కితఁడు. 321

గీ. తమసుతులు న్యాయమూర్తులో ధరణినేలు, ప్రెగడలోయౌట కోరనిపితరు లెంద
ఱుందురుజగాన? మోతిలా లొకఁడనేర్చె, నింతయౌదార్యమన్నను వింతగాదు. 322

ఆ. ఇతఁడు దివ్యజగతి కేగునుగాక కాం, గ్రెసున కేతదాత్మ కొసరికొసరి
దారిచూపుచుండుఁ దద్విజయాకాంక్షఁ, దత్కుటుంబమందె తనరుచుండు. 323

ఆ. మోతిలాలుమృతికి సేతుశీతాచల, మధ్యమైన వసుధ మ్రానుపడియె
విశ్వ మతఁడు లేనివెల్తి దుస్సహ మనెఁ, దనతలంపు నిట్లు వినిచె గాంధి. 324

ఆ. "పండితుండు పరమపదమునకుం బోక, కన్నవారికెల్లఁ గన్నుగుట్టె
దేశభక్తులకు నతీవలక్ష్యమ్ముగాఁ, జెల్లు నితని మధురజీవితమ్ము. 325

క. తనకున్న సర్వధనమును, దనతనువుం దనకుమారుఁ దనభూమికి న
ప్పనచేసి చనియె నితఁ; డీ, మనుగడ యెందఱకుఁదక్కు మానవకోటిన్. 326

క. చరమక్షణంబువఱ కీ, పురుషుఁడు తలపోసె నాత్మభూమీశుభమున్
పరతంత్రత నణఁగింపఁగ, దొర లేనివిపత్తులందుఁ దోఁగి కృశించెన్. 327

గీ. అతఁడువలచిన భారతీయస్వరాజ్య, మతఁడుకోరిన మాతృ దేశాభ్యుదయము
తొలకరింపఁగ మన మెట్టియలఁతకైన, నియ్యకొనవలె నమ్మేటియీవిఁజూచి. 328

ఆ. ఏ ననాథకంటె హీనస్థితికి వచ్చి, నాఁడఁ దీర రానినష్టి గంటి
వివృత కాలగర్భవీధి నన్నును దన, లో నిముడ్చుకొన్నచో నెలర్తు." 329

వ. మహాత్మున కప్పటిరాజనైతిక స్థితియుం గస్తి గూర్చె – ఇంగ్లీషువా రీదేశమునకు స్వరాజ్య

మీఁబోవుచున్నా రనువార్త నాఁడూరూర మాఱుమ్రోఁగందొడఁగె - కాని దొరతనము
వారితీరు దీని కెడమడువుగా నుండె - సత్యాగ్రహుల బంధించుట యేపాప మెఱుఁగ
నిప్రజం బడియతో బాఁదుట మాననీయులసంపద నకారణముగా నగ్గపఱుచుకొంట,
మాననీమణులనుసైతము కచాకర్ష మొనర్చి వీథులందీడ్చి పాదూచరణములం దన్నుట
మున్నగునకార్యముల వారు మానరైరి-దుండగము లిట్లుండునేని కాంగ్రెసువా రేలుబడి
వారి కెట్లు సాయంపడఁగలరని బాహ్య పరిపరి విధములం బరితపించి తనయుదారత
కనుగుణముగా శాసనోల్లంఘనమునం దీవ్రత వలదని యాయారాష్ట్రముల కార్యకర్తలకు
రహస్యసందేశము నంపె-మఱియు మున్ముం దేదేనొకవర్గము సౌమనస్యముం దెలిపినఁ
గాని పొందు పొసఁగదనితలఁచి 330

## గాంధి - ఇర్విన్ సంధి

ఆ. ఏలువారు నియతు లిదక కాంగ్రెసు కార్య, వర్గసభ్యులైనవారి విడిరి
వారిపిలుపుకొఱకు వీరు వార్వక కమ్మ, నేల పంపఁగూడ దిర్వినునకు 331

గీ. పనికిమాలినపట్టింపు చనునె శాంతి, వలచుసత్యాగ్రహికి? వీని వర్తనమున
కుచితమైన యుదారత యొప్పు, నదియ, విజయకారణ మౌనని విశ్వసించి. 332

ఆ. వ్రాసెఁ జిన్న లేఖ 'వైయక్తికప్రతి, పత్తితోడ మనము ప్రణయపూర్వ
క ప్రసంగ మలఁతిగా సల్ప నానతి, యీవె!, యనుచుఁ గరిపురేశ్వరునకు.(ఫిబ్ర 14)333

గీ. వెంటనే పంపె ననుకూలవిధిని గాంధి, కిభపురీనాథుఁ దుత్తర; మేల జాల
మని మహాత్ముదు హస్తిన కరిగెనంత; (ఫిబ్ర 16) నరిగి రంతకుమున్నె నాయకులటకు.334

మం. జవహరుఁడు పటేలు జయరామదాసు, మున్నగు కాంగ్రెసు ముఖ్యులు - కార్య
వర్గసభ్యులు ప్రభుత్వమువారితోడ, సంధితంత్రంబెల్ల సాగించుచనవు
నిడిరి మహాత్మున; కిది తలఁదాల్చి, యిర్వినుసన్నిధి కేగెను గాంధి; (ఫిబ్రవరి 17)
యన్యోన్యకుశలవార్తాదులవెనుక, నేతలు ముగ్గులోనికివచ్చినిలిచి
రొకనాఁటితో ముగియునె రాచకార్య, మదినిక్క మిదికల్ల యది కార్య మిదియ
కార్యమటంచు నైకప్రకారముల, చర్చ లిద్దఱకును జరుగుచునుండె
నొకనాఁడు గాంధిమో ముల్లాసమునకు, నొకనాఁడు నిస్పృహ కొకనాఁడనిశ్చి
తార్థంబునకుఁ జిహ్నా మగుచుండ సభ్య, లలుక చెందిరి దైన్యమంది రీతీరు
దేశాన నల్లడఁ దెలిసె నట్టుడికి, నట్లుండెఁ బ్రజదెండ మబ్ధిచందాన
ఘూర్ణిల్లె నమవస కూడె భారతధ, రా రాజకీయాంబరమ్మునయందుఁ (20)
బదునైదుదినము లిప్పగిదిని దేశ, మల్లకల్లోలమై యలసిన వెనుక
విచ్చెను జీకట్లు; విరిసె వెన్నెలలు, వెదలెను గాంధియిర్వినులమైకోలు; 335

వ. ఈయొదంబడిక ననుసరించి మహాత్ముఁడు తాత్కాలికముగా సత్యాగ్రహము నుపసంహ రింప నియ్యకొనియె - మున్ముందు లండనులో జరుగనున్న సర్వపక్ష గోష్ఠిం బాల్గొందు ననె - అం దధినివేశ స్వాతంత్ర్యము నర్థించనధికారముంబడసె - దొరతనమువా రేనాదమున నుండు పేదలు నిర్నిబంధముగా నుప్పుచేసి తమయూరికిం జాలినంత యమ్ముకొనుట కంగీకరించిరి - మద్యశాలకడ, విదేశ వస్త్రాదు లమ్ము తావులం గాంగ్రెసువారు ప్రశాంతమగు పికెటింగు సాగింపవచ్చుననిరి - చెఱసాలల యందలి సత్యాగ్రహుల విడుతు మనిరి-సంధియందలి ముఖ్యాంశము లివియ- మహాత్ముఁ డీసంధిపత్రముపైఁ జేవ్రాలు చేసి పత్రికా ప్రతినిధుల కొక యుదాత్త సందేశము నిట్లు వెలువరించె. 336

## సంధిపట్ల బాపూ సందేశము

క. "రాజప్రతినిధి యోరిమి, సౌజన్యము శ్రమము సుప్రశంసార్హము; లీ
యోజం గని యధికారుల, కోజగదా యితఁ డటన్న యూహము గంటిన్. 337

ఆ. ఇంతమంచితనము నితఁడు చాటఁడయేని, నేడు పొందు కుదురనేర దనెద
నీడు లేనివిసుగు నితనికిఁ గూర్చితిఁ, గాని యితనిమొగము కందుటెఱుఁగ. 338

గీ. రాయబారము భావింపరానివెతల, ఆచునది గాని సులభ కార్యంబు గాదు
బాధ లెటులున్ననిది యొద్దుపట్టవలయు,ననికడుం బట్టుదల చూపెనదిర! యితఁడు 339

క. పుట్టెఁడుభయమ్ముతో సమ, కట్టితి నిప్పునికి; నాదుకంపమునెల్లన్
దట్టించె నితఁడు మొదటన, పుట్టించెను దనకు సుఖము బుద్ధి యెలర్పన్. 340

క. ఇదియంతయుఁ బరమేశుఁడు, కదించిన మహాశుభమ్ముగా నెంచెదఁ బొ
త్తిది కలుగ దేని దేశం బదవదయై యెంతక్రుంగి యల్లాడెడిదో! 341

క. నేఁ డెవ్వరుగెల్చిరి యెవ, రోడిరి యని నిర్ణయింపనోపము; మఱియున్
గూడనిపని తత్తర్కం, బాడెద నిది యుభయవిజయ మని యొకదృష్టిన్. 342

ఆ. తాన గెల్వ నెపుడుఁ దలఁపదు కాంగ్రెసు, స్వపరగౌరవంబు వలచుఁగాని
యుభయచిత్తతుష్టి నొదఁగూడువిజయమే, చిరము నిల్వఁగలదు చెఱుపులేక. 343

వ. ఐనను భారతజాతీయ మహాసభ కొకనిర్ణీతలక్ష్యము కలదు - దానిం జేరుదనుక జయం బన్నది కాంగ్రెసునకు లేమి నిక్కము - కాని నేఁటియొదఁబాటునం దెదియే నుత్సాహజనక మగునంశ మున్న నాసోదరీసోదరులుప్పొంగక మున్ముందు తమకు వలయు ప్రజ్ఞా పాటవముల నొసఁగ భగవానునకు నమ్రతమై నంజలింపవలయు - మఱియు 344

గీ. ఆధునిక భారత చరిత్రయందు వీర, యుగముగా - నిర్ధరత్యాగయుక్తమైన
యదనుగా నెన్నఁదగిన యీహోయనముసఁ, బ్రజలు వెలువరించిన దేశభక్తి నెంతు. 345

క. రానున్న ఘట్టములలో, నీనాఁటిస్వరాజ్యతృష్ణ యేకాగ్రత పై
త్రీనిష్ఠ కష్టసహనత, మానక వీ రందవలయు మహనీయదశన్. 346

గీ. కొందఱీనాఁటియొడఁబాటు కూడదని యు, శాసనోల్లంఘనంబ యాశాస్య మనియుఁ
బల్కుదు రటంచెఱుంగుదు బాధవీరి, కెలమి సంధించు ననుకీలు నేను గందు. 347

క. వీరంబును ద్యాగంబును, వీరికిఁ బ్రాణములు; వీని విడిచినతఱి ని
స్సార మని వీర లెంతురు, పేరలఁతన్ గూర్చె నని శపింతురు దానిన్. 348

ఆ. వీరి కొక్కమాట వినిచెద వీరము, త్యాగ మెంతమంచి వైననేమి
యెల్ల లుండె వాని కిది విస్మరించుట, తప్పు, వేగపడిన ముప్పువచ్చు. 349

వ. ఇంతకు నిది తాత్కాలికసంధి యగుట వీరు మఱవరాదు - ఈ సంధి ననుసరించి కాంగ్రెసువారు వలయితసభ కేగవలయు - ఏగుటకుమున్ను వీరు చక్కఁబెట్టి కొనఁదగినపని చాలఁగలదు - వీరియాదర్శము సంపూర్ణస్వరాజ్యము- అది ప్రతి జాతికిని జన్మస్వత్వము - కాని సంపూర్ణస్వరాజ్య మనుమాట సంధిపత్రమునఁగానరాదు - దానిం గప్పిపుచ్చినపద (ఫెడరేషన్) మే యర్థమునైన నీవచ్చు - ఇఁక బాధ్యతలని, రక్షణలని యేవేవో కలవు - ఇవి యెండమావులగునో, చల్లనీరగునో నేఁడు నుడువఁజాల - మార్గము సుగమముగా లేదు - దాన ఱాలు ముండ్లు తక్కిడి గుంటలు కలవు - వీనియడ్డు తొలఁగి వలయితగోష్ఠిలోఁ గాంగ్రెసువారిమాట గెల్చునేని దానిఫలము సంపూర్ణస్వరాజ్యమ యగు- ధైర్యవిశ్వాసములం బెనఁగిననాఁడు కాంగ్రెసుజయము నిక్కము - ఇప్పట్ల భారతసంస్థానాధిపతులయు, నాంగ్లేయులయు నౌదార్యమెంతేని వలయు - మఱియు నీ సంధిసందర్భమునఁ బోలీసులు మున్నగునుద్యోగు లొనర్చిన దుండగములనరసి దోషుల దండింపవలయునని యేను గోరఁగా నిట్టి విచారణక తనఁ బరస్పర దోషారోపణములు పెరిఁగి శాంతి కవరోధ మేర్పడునని సర్కారువారనిరి - నే నపుడు పట్టుపట్టుట మానితిని - అయినను 350

క. త్వరలో భారతధాత్రీ, పరతంత్రత తొలఁగు; నేలుబడివారిపనిన్
దిరపడి బ్రతికెడివా రిది, యెఱిఁగి ప్రజన్ గొల్వవలయు నిప్పటికోలెన్. 351

ఆ. బందితొలఁగి వేలమంది వచ్చుచునుండ, ముక్తిరాక చెఱల ముఱుగుచున్న-
దుండగములొనర్చి దూషితులైన త, మ్ములకు నొక్కపల్కు పలుకువాఁడ. 352

ఆ. తప్పుదారిద్రొక్కి దౌర్జన్యముం జూపి, నట్టి ప్రజలనైనఁ బట్టి చెఱకుఁ
బంపు టుచితమని తలంపను నేను సై, రింతు వారి మందలింతు విడుతు. 353

ఆ. రాజకీయదృష్టితోఁ జెడ్డపనులు గా, వించుమానవులు వివేకమునను
హార్దమునను త్యాగమందును నాకంటెఁ, దగ్గువార లంచుఁ దలఁప నెపుడు. 354

గీ. నాకు వీలున్నచో వీరియాఁక తొలఁగు, కరణిఁ గష్టించియుందును గాని యస్మ
దీయధర్మము నన్నట్లు సేయనీక, నిలిపె నాతీరు వీరికిం దెలిసియుండు. 355

ఆ. ఇంతమాత్రచేత నేనును గాంగ్రెసు, మంత్రచయము వీరి మఱువలేదు
మాతలంపు పంద మఱికొంత కాలంబు, జరుగవలయు బెదఁద లరుగవలయు. 356

గీ. ఏలుబడి కందగా నుంద నిపుడు కాంగ్రె, సియ్యకొనె నేఁటిసంధికి నిది విధేయ
మగునయేని నిర్భరకీర్తి నందితీరు, దొరతనమువారి హృదయమ్ము దోఁచితీరు. 357

గీ. దేశమున నిన్నినాళ్లు హత్తినయశాంతి, నణఁచుటకు నెంత గాసిల్లి రంతకంటె
నెచ్చుగాఁ బాటుపడఁజూతు రేలువారు, శాంతి సమకూర్పఁబ్రజలవాంఛలనుదీర్ప.358

గీ. కాంగ్రెసున కధికారంబు కదియునట్లు, కాంగ్రెసునకుఁ బురస్కృతి కలుగునట్లు
ప్రజలు వర్తింతురేని రాబాటవిడిన, బంధితులుసైతము విముక్తిఁ బదయఁగలరు.359

ఆ. అవధిలేనిశిక్ష నదలుబందాలు మీ, రట్టుకుట్రలో నిరంతరా ర్తి
జనకదండనమున స్రగ్గుబంధితులును, బదయఁగలరు ముక్తభావ మపుడు. 360

గీ. భారతోర్వీస్వతంత్రత ఘోరహింసఁ, బఱపి సాధింపవలె ననుపక్ష మొకటి
దేశమున నుంట నాకును దెలియు నల్ప, సేన యగుఁగాక యిది పెద్దచేవ గలది.361

క. ఈతెగవారలు తమయను, భూతిని బాటించియైన బుద్ధిని మార్పం
జూతురుగాక యహింసా, హేతిబలిమి వీ రెఱుంగరే? యిపుడైనన్. 362

ఆ. ఎఱుఁగకేమి లెస్సయెఱుఁగుదు రీనాఁటి, మేలిమికి నహింస మూలమనుచుఁ
గొన్నినాళ్లు వీరు నన్ను నాదారిని, సాగనిత్తురేని సంతసింతు. 363

ఆ. ఒకటి లక్ష్యమై ప్రయోగముల్ రెండైన, రెండుజతనములును రిత్తవోవు
బుద్ధిమంతు లిచటఁ బొరపడక యహంత, దరికిఁ జనక సత్య మరయుచుంద్రు.364

క. ఒకయేఁడైనను గాలే, దుకదా! నే దండియాత్ర దొడఁగి; సహస్రా
ధిక వర్గవన్మహోభూ, మికి నేతత్ కాల మొకనిమేషం బగునో ! 365

ఆ. అఁగవలయు విప్లవాసురక్తులు నిజ, మాతృభూమి నిరుపమాన మాన
మహిత యగుటకై సమగ్రసేవలు సల్ప, వందయేండ్లు బ్రదుకవలయు వీరు. 366

ఆ. అందఱకును గ్రన్న నాహ్వానములు వచ్చు, వచ్చునంతలో నవాప్తమరణ
శిక్షులకును మేలుసేయఁ గాంగ్రెసునకు, వీ లొసంగవలయు వీరు తేఱి. 367

గీ. రిత్తరిత్త కోరికలను రెచ్చఁగొట్టు, కథలు నేఁజెప్పఁ; గాంగ్రెసుగమ్య మిట్టి
దనియ చెప్పెద; యత్నంబ మనది గాని, ఫలము దైవమునకు నగ్గపడిన దనెద. 368

గీ. దేశగౌరమునకు నుద్దీప్తి గూర్చు, సంధి నిద్దానిఁ బొసఁగింప శక్తినెల్ల
ధారవోసితి వాంఛితార్థములు దక్కి, యిదియ తుదియొదంబడికగా నెసఁగుఁగాక! 369

క. ఈయొదఁబా టేర్పడఁగన్, సాయంపడినట్టి - లోకశాంతిప్రియతం
బాయక నిల్చినయట్టి గ, రీయశ్శీలురను విస్మరింపఁగఁ జాలన్." 370

## రాజప్రతినిధి తన కృతజ్ఞత చాటుట

వ. అప్పట్ల రాజప్రతినిధి తనకృతజ్ఞత నిట్లు వెలువరించె. 371

ఆ. "నిత్యసత్యవాణి నిష్కలంకుఁ డఖండ, దేశభక్తికలిత ధీవిరాజి
పుణ్యరాశి వీరపురుషమూర్ధన్యుఁడు, భారతీయకీర్తిపాళి గాంధి. 372

గీ. ఇతనితోఁగూడి యొక మహాకృతిని జేఁత, మన్మహాభాగ్యమనిసదా మానసింతు
నితనివలె శాంతికోరువా రీ ధరిత్రి, నిద్దఱున్నను సమరంబు లెగయలేవు. 373

గీ. ముగియవచ్చె భారతదేశమునకు నాయొ, నర్చునూడిగ; మింగ్లాండునకు మహాత్ముఁ
దేగుదెంచిననాఁడు తద్ధితము కోరి, ధారవోసెద నాసమర్థత్వమెల్ల." 374

ఆ. అతనికార్యదర్శి యగునెమర్సను గాంధి, కిట్లు వ్రాసె "గుణనిధీ ! స్వతంత్ర
భారతమ్ము వొడమ భక్తిమై సేవలొ, నర్ప నురవడించు నామనంబు." 375

క. భిన్నరుచి లోక మని బుధు, లన్నారుగదా ! మహాత్ము నమ్మెయి నానాఁ
డెన్నికగాంచిన పెద్దలు, మన్ననసేయంగ, నీవ మానిసి వనఁగన్ - 376

ఆ. ఆంగ్లదేశమున నహంయువులైన సా, మ్రాజ్యవాదు లెంతమాట పుట్టె
భారతీయుఁ డాంగ్లపాలకుతో సమా, నాదరంబు నందుటా సెబాసు! 377

క. మనరాజప్రతినిధి - మన, ఘనతాంకము నిల్చు లసదగారవుమెట్లె
క్కునె యర్ధదిగంబరుఁడని, యని రపవాక్యములు చర్చిలాదులు కినుకన్. 378

క. వారి పటాటోపమ్ములు, వారి యహంకారములను వ్రక్కలుసేయన్
భారతఋషికొల్లాయకు, నేరుపు కలదని యెఱుంగనేరరు వెడఁగుల్. 379

వ. అది యట్లుండె - ఇట నొక్కవిశేషము నుడువందగు - ఈదేశమున హింసామార్గమున స్వాతంత్ర్యము సాధింపఁబూనినవర్గ మొకటి కల దనువార్త మన కశ్రుత చరము కాదు - ఈవర్గమున సుప్రసిద్ధుఁడు భగత్‌సింగు - వీనికి రాజగురు సుఖదేవు లనుచరులు

– మున్నుసైమనుబృందము లాహోరు వచ్చినతఱి (ఫి|బ 1928) దాని బహిష్కృతి సాగించిన లజపతిరాయితొమ్ముపై లాటీపోట్లుపొడిచి యమ్మహనీయుని మృతికిం గతమైన పోలీసుశాఖోద్యోగి 'సాండర్సు'ను (13-9-28) జంపిరనియుఁ గేంద్రశాసనసభ సాగుతఱిఁ(8-4-29)దత్సభాభవనమున బాంబుంబఱపిరనియు వీరిపై రెండు నేరములు గలవు – వీనిని విచారించిన పాంచాల ప్రభుత్వమువా రీముగ్గురకు నురిశిక్ష విధించిరి – (1931 ఫి|బ) ఈ దండనము దేశమును గగ్గోలుపాలొనర్చె – కాన నురిశిక్షను ద్వీపాంతరవాసశిక్షగా మార్పింపుఁడని మహాత్ముఁడీ సంధి కాలమున రాజప్రతినిధి నర్థించె–అతఁ డామార్పు గావింపఁజాల ననియు దేశమల్లకల్లోలమై కాంగ్రెసుబల్మి చెడమికి ననతికాలమునం (1931 మార్చి చివర) గూడనున్న కరాచి కాంగ్రెసుదనుక నీ మరణదండనము నాఁపింతు ననియుం బల్క 380

ఆ. "కాదు, మీ మనస్సు కరఁగనిచో వారి, నిపుడ చంపుఁ, డీ రలిట్లు సేయఁ
దెల్లమగును మాకు దేశాత్మ నాఁటికి, రిత్తకోర్కు లంకురింపకుండు. 381

క. మననేఁటిసంధి యణఁగునొ, మనునో యదికూడఁ దెలియు మాసభ" కనుచున్
వినిచె మహాత్ముఁడు గిరివలెఁ,దొనఁకక చంపించె వారిఁ దోడ్తో నిర్విన్.23-3-31 382

ఆ. సంధిజనితమైన సంతోషపుఁదరంగ, లణఁగిపోకముందె జనుల చెవికి
వచ్చె నీ విషాదవార్త – దుర్భరమైన, వార్త – నిర్భరార్తి వఱపువార్త. 383

ఆ. తీవ్రవాదు లపు డతీవక్రుధావ్యథా, మగ్నులైరి భరతమాతృముక్తి
కురవడించి యెంద ఉరికంబముల నెక్క, వలయుఁ గాల మెంతవలయు ననుచు.384

## కరాచీ కాంగ్రెసు – పటేలుయాజమాన్యము

వ. కాంగ్రెసువా రేల్బడివారినిషేధముతొలఁగిన తమసంఘములఁ బునరుద్ధరింపఁ దొడఁగిరి – గాంధియిర్విసులయొడంబడిక పాటింపవలయు నని యనుబంధిసంఘముల కెచ్చరిక పంపిరి – ఇంతలోఁ గరాచికాంగ్రెసు కదిసె – దీని కధ్యక్షుఁడుగా వల్లభాయిపటే లంగీకృతుఁడాయె–ఈయన్నతో బెరసి మహాత్ముఁడు కరాచికి వచ్చుతఱి(24-3-31) భగత్సింగుముఖ్యుల నురిదీసినప్రభుతతో సంధిచేసికొనె ననుమంటం గొందఱుయువలు నల్లజెండాలు నీలకుసుమములు పూని బాపున కెదురురాఁ జాగిరి – వారి నేత్రారుణిమం గన్నప్రజలు కొంద ఱాకుట్టి లొజ్జ కేయెగ్గొనరింతురో యని బెదరుచుండ. 385

గీ. సహజమందస్మితమ్ముతో సప్రసాద, వదనరంగముతో గాంధి వారిఁ గదిసి
యందుకొనె నల్లపువ్వుల నమృతరసము, చిందుపల్కులతో నాశ్వసించె యువల.386

గీ. కొట్టవచ్చినవారు జేకొట్టి కనుల, నశ్రువులు రాల మందాక్ష మగ్గలింప
బాపుజీబంటులైరి తపస్వియెదుట, సర్పములు నవ్యలతలు, శస్త్రములు విరులు. 387

గీ. గురుఁడువచ్చెఁ గరాచికి గొప్పసదసు, కూర్పఁబడియెఁ దదీయసూక్తులు వినంగ
పావులా నిచ్చువారె సభాప్రవేశ, పాత్రు లను బెట్టిదపుఁగట్టుపాటుతోడ. 388

ఆ. పావులాలు పెరిఁగి పదివేలరూప్యముల్, సంఘటిల్లె నొక్క క్షణములోన
గాంధి చావవచ్చుఁ గాని గాంధిమతమ్ము, చావదనియె నాఁటిసభను బాపు. 389

గీ. వల్లభాయియుపన్యాసవాణి మిగుల, నలఁతిగా నుండె సామాన్యహాలికునకు
నా కొసంగినయీపేర్మి నలఁగినలఁగి, చివ్వనడిపిన గుజరికే చెందునియె. 390

గీ. ఏలువారికి గాంధికి నేర్పడినయొ, డంబడిక మాన్యమనియె, దేశంబు దీని
కెదురుసెప్పుట పెదదారి కేగు టనియెఁ, గూడనియవస్థలను దెచ్చుకొనుటయనియె. 391

క. ఆవేశపడక కాంగ్రెసు, సేవకు లౌగాములెఱిఁగి చిరదాస్యవటీ
లావన మొనర్పవలె ననె, నీవసుధాప్రజ కహింసయే కవచమనెన్. 392

ఆ. చిన్నదైననేమి తిన్ననిమార్గంబు, మెఱసె వల్లభాయిమేలిపల్కు
పనికివిలువనిచ్చు పదవాలు భాషించు, చంద మిట్టి దనుచు సభ యెలర్చె. 393

గీ. ఐననేమి భగత్‌సింగు నతనిసఖుల, నపుడె యురితీసి రేలిక లన్నవార్త
యొక మహాదుఃఖమేఘమై యోలగమున, నాల్గుదిక్కులయందు నానాఁడుక్రమ్మె. 394

గీ. కాంగ్రెసుమహాసదస్సునఁ గదలుకొనియె, దివికినేగిన వీరపుంగవులయాత్మ
లదిర! బహిరంతరమ్ముల నవియ తోఁచి, నాఁటిపరిషజ్జనమ్ముల నలఁచెఁ గలఁచె. 395

ఆ. నాఁడు భారతోర్వినలుదెసలన్ భగత్, సింగుపేరు మొరసె ఖంగుమనుచు
నితఁడు పడినశిక్ష యతిదారుణం బౌట, నింతసానుభూతి యితని కబ్బె. 396

గీ. ఇతని - యీతనిమిత్రుల మృతివిపత్తి, నణఁపలేఁడయ్యె బాపుజీ యంతవాఁడు
బాపుజీ వీరికై పడ్డపాట్లు మెచ్చి, నయ్యలయ్యారె ! మెచ్చులేరైరి నేఁడు. 397

వ. ఉద్రేకము వివేకముంజెఱుచు ననుట నిక్కము - కాన 398

మం."హింసావిధానంబు నెపుడును గాంగ్రె, సాదరింపదు, మెచ్చ, దా నిరాకృతిని
బాయక యిది నేఁడు పరలోకమునకుఁ, జేరుకొనిన భగత్సింగు రాజగురు
సుఖదేవుల యపూర్వశూరతానిష్ఠ, యద్వితీయత్యాగ మగ్గించి వీరు
లీముప్పు రీభూమి నెదయుట నెంత, పొక్కు వీరికుటుంబములు కాంగ్రెసంత

పొక్కు, నీ శిక్షలపోకడ మార్పు, దగునని దేశమంతయు నెంతవేఁడి
యెంతవాపోయిన నెంతడీల్పడినఁ, బాటిసేయక యేలుబడివారు క్రూర
విధి కీయకొంట నీ విపరీతచేష్ట, కసిదీర్చుకొనుటకే కావించిరనియు
నిది ప్రజాభిప్రాయ మెదిరించు టనియు, నీకాంగ్రెసు తలంచు, నింగ్లీషువారు
భారతీయులుఁ బరస్పరమైత్రితోడ, నడువఁగాఁ దగినయీనాఁడు సర్కారు
వా రింతకుం దెగి వలసినచెల్మి, నెడచేసి రని ఘోరహింసాప్రవృత్తి
యావశ్యకం బని యటనట నదరు, యువలయుద్రేకంబు లుడిగించువీలు
పోనాడి రని తలపోయు నీ కాంగ్రె", సను నిర్ణయము చర్చ కరుదెంచినపుడు
ముందున్న పరిహారపుంబల్కు లేల, తొలగింపుఁడీ యని తూర్పు పడమర
యెఱుఁగనికోడెకాం గ్రెగిరిరి కాని, నెగ్గెఁ దీర్మానంబు నెతిని గోల్పోక. 399

గీ. రాజకీయబంధితుల నేయోజవారి, నైన విడవలె నేలువారనియెఁ గాంగ్రె
సాంగ్లభారతజాతుల నాదరాను, రాగములు హెచ్చు నిదియెకర్తవ్యమనియె. 400

గీ. ఆంగిలేయు లీనేల నిజాధికార, ముజ్జగింప సంసిద్ధులై యుండిరేని
ప్రజలరాజ్యంబు నిచ్చుటఁ బరఁతురేని, యెల్లబందాల వదలుట కృత్యమనియె. 401

క. భగవత్సింహుఁడు మున్నగు; ముగురన్ దునుమాడి దేశమున వీ రీనాఁ
డెగచినపగ చల్లాఱుట, కగు నీపని యనియె ధైర్య మచ్చుపడంగన్. 402

## గణేశశంకరుని వీరమరణమును గాంగ్రెసువారభినందించుట

వ. కాంగ్రెసుమహాసభ యిట్లు సాగుచుండ వేఱొండుకాఱుమబ్బు దానిం గ్రమ్మె - అది గణేశశంకరవిద్యార్థి మరణవార్త - భగత్సింగు మున్నగువారి నురిదీసినంతన కాన్పూరున (23-3-1931) హరతాళము జరిగె - ఇందు మహమ్మదీయులు పాల్గొనరైరి-మున్ను మహమ్మదాలీమృతిపట్ల సాగినహరతాళమున హిందువులు చేరలేదఁట - ఇఁకఁ జెప్పనేల - అగ్గి ముట్టుకొన్నది-గణేశశంకరుఁ దామంటలంటనీక వందలకొలఁది మహమ్మదీయ కుటుంబముల మనిచె - అట్టిప్రేమమూర్తిని గొంద ఱవివేకులు వంచించి యొకమాఱు మూలకు లాఁగిరి - అందు 403

క. బాఁకులతో నున్నది యొక, మూఁక; యహో ! నగుచు దానిముందు గణేశా
ఖ్యాకుఁడు నిల్చెఁ దదస్రము, నాకంఠముగాఁ దదోషమాస్వాదించెన్. (24-3) 404

ఆ. అతని మృతశరీర మైదాఱునాళ్లకుఁ, బ్రజకుఁ దోఁచె ఖదరుబట్టకతనఁ
జేతిమీఁద హస్తిచిహ్నరచితమైన, పచ్చకతనఁ బత్రపటలికతన. 405

ఆ. ఇట్టివారలెంద తీనేల మతమైత్రి, వొడమ నెత్రు ధారవోయవలెనొ
యిట్టివారి బూది యాచేల కెరువయి, ప్రణయ సస్య మెంత పండవలెనొ. **406**

వ. గణేశశంకరుని వీరమరణము నభినందించుచుఁ గరాచికాంగ్రెసువా రొకతీర్మానము గావించిరి - గాంధియిర్విసుల యొడంబడిక నంగీకరించిరి - వలయితగోష్ఠిం గాంగ్రెసు పక్షమున నేకైకప్రతినిధిగా వ్యవహరింపమహాత్మున కధికారమొసఁగిరి - నానా బాధ లోర్చినసత్యాగ్రహులఁ గొనియాడిరి - మహిళ లుద్యమమునం జేరుట మెచ్చిరి - ఎన్నికలపట్ల నరనారీ తారతమ్యము కల్పించు రాజ్యాంగతంత్రము నొప్పమని వాగ్దానము గావించిరి - అమృతసరమునఁ **(1919)** గూడిన భారత జాతీయ మహాసభం బొదమి

## కరాచీ కాంగ్రెసు నిర్ణయించిన ప్రధానపౌరస్వత్వములు

నాగపురమున **(1920)** బలపడిన ప్రధాన పౌరస్వత్వనిర్ణయమున నేఁడు గణనీయములగు పలుమార్పులుగావించి భారతదేశమునంగల ప్రతిమానవుఁడును దనతలంపుల నఱ మరికవీడి వెలువరించవచ్చునని తనకిష్టమగు సంఘమునఁ జేరవచ్చునని చట్టమునకు విరుద్ధముగాని పనికి నిరాయుధుఁడుగా మహాసభలం బాల్గొనవచ్చునని తాను విశ్వసించిన మతము నాదరింప వచ్చునని యల్పసంఖ్యాకవర్గములయు, రాష్ట్రములయు భాషా విజ్ఞానములు లిపులు సురక్షితములు కావలెనని న్యాయశాస్త్రము కుల మత లింగ వ్యత్యయ రహితముగా నెల్లరకు వర్తించునని యీకులాదు లుద్యోగాదుల కడ్డురారాదని దొరతనమువారి బడులు బావులు బాటలు తోఁటలు సర్వజనులసొత్తని ప్రతి పౌరుఁ డును శాసనసమ్మతముగాఁ గత్తిపట్టి తిరుగవచ్చునని, సర్వమతములయెడం బ్రభుత తటస్థమని వయోజనులకెల్లరకు నియోజనాధికారము వలయునని ప్రాథమిక విద్యను నిశ్శుల్కముగా నిర్బంధపూర్వకముగా నేలుబడివారు సాగింపవలయునని బిరుదముల నేరికిం బ్రసాదింపఁజనదని మరణశిక్ష విధింపరానిదని ప్రజలు తమ దేశమున నిచ్చ వచ్చిన తెఱంగునఁ బయనింపవచ్చునని వలచినచోట సంపద నేర్పఱుచుకొనఁజెల్లునని యభిమత వృత్తి నవలంబింపవచ్చునని దోషారోపణమున నెల్ల రాష్ట్రములు సమాన స్వత్వము నందితుల్య రక్షపడయవలయునని కూలివాండ్రకుఁ దగినంతభృతి చిక్కున ట్లార్థికజీవనవిధి యేర్పడవలయునని పారిశ్రామికులగు భృతకుల యోగక్షేమములకుఁ దోడ్పడుచట్ట మే తేరవలయునని కర్మకరుల శ్రమకాలమునకు నవధియుంట యవసర మని కార్మికులకు వ్యాధియు నిరుద్యోగపీడయు ముదిమియు దాపరించిన తఱి సముచిత రక్ష యుండవలయు నని కూలిపనిసేయు మగువకుఁ దగిన కాపుగడయు బాలెంత రాలికిఁ జాలినంతసెలవు నొసంగవలెనని విద్యార్థిదశ నుండు బాలురచే గనులలో మరలలోఁ బనిసేయింపరాదని కార్మికకర్షకులు తమ హక్కుల నిల్పుకొన సంఘములుగా నేర్పడవచ్చునని సేద్యగాండ్రపన్నుల బరువు, గుత్తవ్రేఁగు తగ్గింపఁజనునని మేరమీఱిన

సంపదపైఁ జావుపన్ను విధింపఁదగునని సేనావ్యయము సగము కోయవలయునని ప్రత్యేకనైపుణి గలవారికిఁదక్కఁ దక్కిన యధికారుల నెలసరిసంబళ మైదువందల రూపాయలకు లోపడవలయునని యుప్పు పన్ను తగదని స్వదేశ వస్త్రాది పరిశ్రమల రక్షింప విదేశవసనాదుల నిషేధింపవలయునని మత్తిల్లఁజేయు పానీయాదుల నాఁగ వలయునని దేశమునకు నష్టిరాని తెఱంగున మననాణెముల మార్పుంద వలయు నని ముఖ్యములగు పరిశ్రమలు గనులు పొగబండ్లు నౌకలు దొరతనమువారివై యుండ వలయునని మోయరానివడ్డీల నడ్డి హోలికుల యధమర్ణతం ద్రోయవలెనని పౌరుల కందఱకు సైనికశిక్ష నీవలయునని దాని కపూర్వమగురూపమునిచ్చి స్వతంత్రభారత ప్రభుత్వ లక్ష్యముల నెఱుకపఱిచి యాయాసమస్యలపట్ల దేశీయులకుంగల శంకలు తొలఁచిరి - దేశాభ్యుదయమునకు వలయు తీర్మానము లింకెన్నియో కావించిరి - పదంపడి కరాచీ మహాసభ పరిసమాప్తమయ్యె. 407

గీ. కాంగ్రెసుందోఁట కామనికారు వచ్చి, యొత్తుగా గుత్తిగాఁ బట్టెఁ గ్రొత్తచిగురు
నిర్భయమ్ముగ మూఁడువన్నెలపతాక, నెత్తె భారతీయుఁడు తనయింటిమీఁద. 408

క. పోలీసులు కాంగ్రెసుకా, ర్యాలయములు దోఁచి కొనినయర్థము వలువన్
నూలిని బత్రముఁ బడయఁగ, నోలాకుపడం దొడంగి రుద్యమకర్తల్. 409

గీ. యువలు స్వచ్ఛందసేవకు లుచితవసన, లాంఛనమ్ముల సైనికులంబలెన్ గ
వాతు సేయుచు విజయోత్సవములు నడుపఁ,బూనిరూరూరఁబండువుపొలుపువెలసె. 410

క. నిన్నటిదనుక నగేయము, లన్నకృతుల్ దేశభక్తి కాధారంబుల్
మిన్నదర నన్నిపల్లెల, నన్నిపురంబులను బాడి రన్నలు తమ్ముల్. 411

గీ. మగువలున్ మగవారును మదిర నమ్ము, నంగడులచెంత నన్యదేశాంశుకముల
విక్రయించెడు తావుల వినయసరణిఁ, జేయఁదొడఁగిరి పికెటింగు రేయి పవలు. 412

క. కారావిముక్తులై యూ, రూరికి సత్యాగ్రహులు మహోత్సాహమునన్
జేరఁగసాగిరి ప్రజ సుమ, హారమ్ముల నెదురునడిచి యభినందింపన్. 413

ఆ. కాంగ్రెసునకు నేఁడు కల్గినగెలు పఢి, కారులకు సహింపఁగాని దయ్యె
నకట! చెడ్డకాల మరుదెంచె మన కని, క్రుయ్యఁబాటీ వారు కుతిలపడిరి. 414

గీ. ఇంతలో దేశమునువీడె నిర్విః నతఁడు, పదవ నెక్కెదుతతికి బొంబయికి వచ్చి
నేత సత్యాగ్రహవిధాత నెమ్మిపొంగి, జాలువాఱంగ నెఱపె వీడ్కోలుపేర్మి. 415

వ. క్రొత్తరాజప్రతినిధి విల్లింగ్డనునకు గాంధియిర్వినుల నెయ్యతియ్యములు తెలియవు - మహాత్మున కిర్వినిచ్చిన వాగ్దానము లజ్ఞాతములు - పై పె చ్చితఁడు పెడసరకట్టె-కాన నయ్యెడన్ దేశమున 416

ఆ. పౌరశాఖ నేలువారియహంకార, మగ్గలింపసాగె నన్ని దెసల
సంధిదారి వేఱు సర్కారుదారి వే, ఱగుటఁజేసి కాంగ్రె సలఁతఁబడియె. 417

క. పోలీసువారిదురుసును, వేలలదాఁటినది; గుంటవీటను లాఠీ
కోలాహల మెగసెను లఘు, నాళిక లగ్నులను గ్రక్కి నలఁచెం బ్రజలన్. 418

## తోఁట నరసయ్య మగఁటిమి

మం. జాతీయచైతన్యజననియై వెలయు, బందరుపురిమధ్యభాగమం దపుడు
త్రిచ్ఛాయమగు జయంతి నెగుర్ప నెంచి, కొంకుజంకులులేక కోనేటికడకు
దూఁకెను నరసయ్య తోఁటాన్వయుండు, పోలీసు లీపని పొసఁగనీ మనుచు
నడ్డిననేమి సత్యాగ్రహవీర, శార్దూల మీనరసయ వారి నుఱక
యెక్కెఁ దెక్కెమువిూఁది కెత్తెఁ బతాక, మ్రొక్కెను జెండాకు మూరెనభక్తి
నించె మహాత్మగాంధికిజే యటన్న, రవళి హరిత్కందరములు మార్మ్రోయ
దిగివచ్చు నిర్వీరు ధీరులవోలె, బలసి దెందము లేనిభటులు లాఠీలఁ
గొట్టిరి వందలకొలఁది దెబ్బలకు, వ్రయ్యలైనది తోఁటవంశజునొడలు
కాల్వలై యితనిరక్తము పాఱిపాఱి, ముంచిన దారుణ్యమునఁ దటాకమును
జను లయో! నరసయ్య చచ్చె నటంచు, గగ్గోలుసెందిరి గాని పేర్గన్న
మల్లుఁ డీతఁడు మంజుమందహాసమున, లేచి రాకాసిపోలీసుల సరసఁ
జని సార్ధవత్సర సత్కార మంది, చేరెఁ గోరాపుట్టి చెఱసాలగడికి
నల్లవో! మున్ను చిన్నాపురినుండి, యితఁ డుప్పుదేరఁగా హేమాహెమీల
వంటిరక్షకభటుల్ పదునార్వు రెంత, పెనఁగియు నితనిగుప్పిలి వ్రయ్యవార్చి
లవణమ్ము లాగఁజాలక విన్నఁబోయి, కసిదీఱ కీజెట్టికన్నాకు నిలకుఁ
ద్రోసి మోఁదిరి జగాదుద్దుఁగోలలను, దుదకు వీరే లజ్జఁ దోఁగిరిగాని
నరసయ్యకడిమి చిన్నము జాఱదాయె, నితనికి నోనమాలేని రా, వచ్చ
కాఁపుగాఁ బాగోలుగద్దను బెరిఁగి, కుస్తీలునేర్చి పల్గురకునేరిపిన
నెఱసరియితఁడు; గాంధిమహాత్ముభేరి, సాబర్మతీసరస్వతి తీరమందు
మ్రోఁగినంతన పట్టములుగడించిన మ, నీషులు వెఱఁగంద నిర్భరబాధ
లోరిచి సత్యాగ్రహోద్యమసమర, యోధలుగా నెందఱో యిట్టివారు
వెడలిరి భారతోర్విని బల్లెపల్లె, నొరులమెప్పునకు వీ రోలాకుపదరు
పదవులకై వీరు బందికిఁజనరు,నిస్స్వార్థసేవకు నిరవద్యసేవ
కవతరించిన పురుషాగ్రణుల్ వీరు, మనదేశమున నెంతమంది నాయకులు
పుట్టరు మున్ను, బాపు వినా యెవండు, మేల్కొల్పె నిట్టి గ్రామీణప్రజాళి
నద్వితీయత్యాగ మవిరతసేవ, దంభదూరగ జీవితము నేర్చి నేర్చి
యింతకుఁ జాలినాఁ డెరవాదయోగి, మంతర మీతండ్రిమాట పల్లెలకు. 419

వ. మఱియు నానాఁడు 420

ఆ. పాదపలి రథోత్సవమ్మునఁ దేరిపై, గాంధిబొమ్మఁ బ్రజలు కట్టినంతఁ
గనలుగొని తుపాకులనుగాల్చి నల్వుర, రూపుమాపి రెచ్చిటోపివారు. 421

వ. ఇచట నింకొక్క కథ నావిష్కరింతు. 422

## రాజమహేంద్రవరము - జెండాప్లీడరు

గీ. అనఘ గోదావరీతీరమందుఁ గందు, కూరి వీరేశలింగాది శూరసింహ
లెదిగినపురమ్ము రాజమహేంద్రవరము, కాంగ్రెసున కపు డొండు దుర్గముగనిలిచె.423

క. ఆపీట దేవతాన్వయ, పావనుఁ దురుధైర్యవిజితపర్వతపతి వి
ద్యావనధి సకలసద్గుణ, సేవధి శ్రీరామమూర్తి చెలఁగు వకీలై. 424

ఆ. కాంగ్రెసున కితండు కడుఁగూర్చు గాంధి పే, రెత్తఁ గరఁగు నొరుల కెఱుకపడని
విధిని దేశదాస్యవిచ్ఛిత్తికై విత్త, మిచ్చు నగ్గలముగ నిల్లుమఱచి. 425

ఆ. కాకినాడపురిని కాంగ్రెసు కూడిన, నాఁటఁగోలె నితఁ డనారతముగ
నిలిపె మూఁడువన్నియలదాలు తనమొగ, సాలపై విహాయసంబు నొరయ. 426

మధ్యా. ఆనాఁడు ముస్తఫాలీ యనునతఁ డహంతమైఁ గన్ను
గాన కాంగ్లేయసామ్రాజ్యరక్ష తనకర్తవ్య మనుచు
నానావిధాలఁ గాంగ్రెసుగరిమము నణంపఁ గంకణము
పూని యప్పురిని బాలించుచుండెను బోలీసుశాఖ. 427

గీ. గాంధిటోపీని జూచినఁ గనలు నతఁడు, కాంగ్రెసుపతాక తోఁచినఁ గసరు నతఁడు
లెంకలనుబంపి వానిఁ దూలించుదనుక, నిద్రపోవఁ దతండు దుర్నీతి మరగి. 428

క. శ్రీరామమూర్తిజెండా, యీరక్కసదొర సహించునే? బలఁగంబున్
జీరెను బడగ నడంపం, బోరనఁ బొమ్మనెను బిరుసు పొంగులువాఱన్. (17-7) 429

వ. ఇన్నూర్వురుపోలీసు లపుడపుడ సాయుధులైవచ్చి కాంగ్రెసుబంటునింటిముందు బారులు దీరినిల్చిరి - మొనకాఁడు కడపడాఁటి లోనికిరాఁజూచుచుండ శ్రీరామమూర్తి వానిని వారించి నాయంగీకృతినందకయ నీవు లోనికిరాఁజనదు - అక్రమ ప్రవేశం బిది సహింప - నా నతండు 430

క. మీయింటిమీఁదిజెండా, తీయుమ! యిప్పనికి ననుమతింపనిచో నేఁ
ద్రోయుదు ననె, వాస్తవ్యుఁడు, నీ యధికారంబు చాలునే యిట ననియెన్. 431

క. నీచేయంజూచెదుపని, కేచట్టము నొప్పదనియె నిది వినకున్నన్
 ద్రోచెద నిన్నని వాకిలి, కాచెన్ దనబాహు లర్గళదియలు కాఁగన్. 432

వ. అంత నాదళవాయి కుహనాహాస్యమ్ము పఱపుచు 433

క. ఓహో! బాగున్నది నీ, వ్యాహారము! రాచసెలవు వలయునె నీకున్!
 సాహసమేటికిలే! భవ, దీహను జెల్లింతుననుచు నేగె భటాళిన్. 434

మధ్యా. పదివేలమందిప్రజ లపుడు వచ్చి మాబలము మీబలము
 యదలింతు మధికారుల నెదిరింతు మన్నా ! మాకు నీడు
 ముదల యబ్బిన వారితలలు నుగ్గుగా మోఁదెద మంచు
 నెద లెరియంగ శ్రీరామమూర్తి కట్టెదుట నిల్వంగ 435

క. దేవతవంశ్యుఁడు తగ దీ, భావం బీత్రోవ; గాంధిబలఁగమున కహిం
 సావిజయమ వలయును రో, షావేశము మాని తమ్ము లరయుం డనియెన్. 436

వ. ప్రజలీపల్కులతో శాంతించి వీధిలోనిల్చి ముందేమిజరుగునోయని వార్చుచుండఁ బోలీసుదొర ముస్తఫాలీఖాను "జాతీయపతాకోన్నయ మీవేటివారికిం గొండఱ కిష్టము కాదు - వా రీజెండానెత్తినవారినెత్తి వ్రచ్చినను దొరతనమువా రద్దుసెప్ప రనునమ్మికతో నటనట నత్యాచారములకు దిగిరి - కానఁ బ్రజాశాంతికి ముప్పుదెచ్చు కాంగ్రెసుపతాక నెవ్వరుం దమయిండ్లపై నెగురవేయరాదు" - అనునాజ్ఞ నధికారివలనం బడసి నాఁటి సంజతతి కేనూర్వురు భటులతో వచ్చి శ్రీరామమూర్తి భవనముపై నెగురుజాతీయ వైజయంతిని డించి జంకెనచూపులంజనియె - వాని తెచ్చినముదల యన్యాయ్యమయి నను దానికి రాచకంపు కలదు - కాన దేవతాన్వయుఁ డాయానం బ్రతిఘటింపక నిల్చి చెన్నపురియందలి జగాపాడిపట్టు వారి కీ దుండగమెల్లం దెలిపి వారి తీర్పు నర్థింప నాతగవరు లిమ్మేటి కనుకూలముగా న్యాయనిర్ణయము గావించి దొరతనమువారిపనుపుం ద్రోసివైచిరి-ధర్మువు జయించె-ఈశుభవార్త వెలువడినంతన రాజమహేంద్రవరమున నింటి కిరువదిగాఁ ద్రివర్ణపతాక లున్నమితములై కాంగ్రెసుపరువుం బెనిచె - నాఁటిసుత దేవత శ్రీరామమూర్తి "జెండాప్లీడరు"గా రూఢికెక్కె - అది యట్లుండె. 437

గీ. ఏలుబడివార లొడఁబాటు నేలిదమునఁ, జూచుచున్నారు ధర్మువున్ రాచినారు
 ఏమికర్తవ్య మని యొజ్జ కెల్లమంద, లములకాంగ్రెసుసంఘముల్ వ్రాసె నపుడు. 438

క. తొందరవలదు వలా దని, ముందాదెను గాని కాలము చనంజనఁగాఁ
 బొందున కిఁక నెడ లేదని, దెందమునన్ నిశ్చయించి దేశికుఁ డవలన్ - 439

గీ. అఖిలపక్షమహాసభ కరుగువాంఛ, వదలి తద్వార్త నేల్బడివారి కనిపె
 నపుడు వైస్రాయి యద్దాని నాంగ్లసచివ, మణికి నెఱిఁగించెఁ దడఁబాటుమల్లడింప. 440

గీ. అమ్మహామంత్రి తగురీతి నతనిఁ బదరి, గాంధి నెట్లైన నలరించి క్రన్న సర్వ
పక్షగోష్ఠికిఁ బంపుము పనికిరాని, పట్టుదలచూపకు మటంచుఁ బనిచె నాజ్ఞ. 441

గీ. దిగెను వైస్రాయిబింకము తగినపేర్మి, నొసఁగె నొజ్జకు విల్లింగ్డ; నెసఁగుచున్న
జగడము లడంగ నిర్విసుసంధితంత్ర,మనుసరించెద రధికారులని వచించె. (27-8) 442

వ. శాంతిప్రియతమై నతనిపల్కులు నమ్మి 443

## మహాత్ముఁడు సర్వపక్షసభకు లండనునకేగుట

క. ప్యారీలాల్ దేశాయియు, మీరాబెన్ దేవదా సమేయమనీషా
హారిణిసరోజినియుఁ దన, తో రాఁ దరినెక్కె జనహితుఁడు బొంబాయిన్. (29-8) 444

గీ. ఆశ్రమమునందుబలెనౌకయందుసైత, మనఘుఁడుమహాత్ముఁడఖిలకృత్యములుదీర్చె
నుభయసంధ్యల భగవంతు నుగ్గడించి, రాటమునుద్రిప్పి పిల్లల కాటగఱపి. 445

క. ఏడెను మున్నగుతావుల, నోడ నిలిచినప్డు దచటనుండుప్రజల్ కొం
దాడిరి పరతంత్రమహీ, పీడాహరణైక ధర్మపేశలు గాంధిన్. 446

క. మదినిడి మీచేసినపని, యిది కాంగ్రెసునాదరించుటే యని బాపూ
మృదువాక్కుల నిజవినయా, స్పదశీలము చాటి తత్ప్రజల నలరించెన్. 447

గీ. మార్సెలిసురేవున గురుండు మహికివచ్చి, రైలుమీఁద బొలోనుతీరమును గడిసె
మఱలఁ గడలిపై ఫోక్ స్టోనువఱకు నేగి, గట్టుపట్టి లండనుఁజేరెఁ గారునెక్కి. 448

క. ప్రాకారవైభవమ్ముల, నాకాశమునొరయుమేడ లమరినభూరి
శ్రీకు లనేకవిధమ్ముల, నాకారణచేసినను మహాత్ముఁడువారిన్ - 449

క. మన్నింపుఁడని వినయసం, పన్నతమై వేఁడి పేదప్రజపెంపునకై
పెన్నలఁత సైఁచు లిస్టరు, కన్నియవిన్నపముపట్ల గారముఁజూపెన్. 450

గీ. ఆపెయింటఁ దూరుపువాడ నలబలంబు, రేఁగుచు నతమ్ము తలనొప్పి రేఁచుగడ్డ
నందచందాలులేని గేహములనడుమ, నిలిచెదీన బాంధవుఁడు కావలయు ననుచు. 451

ఆ. ఇతనికేల మేడ లీఁతాకుగుడిసెలఁ, గూడులేక చలికి గుడ్డలేక
మందు మాఁకులేక కుందునిర్భాగ్యుల, నాదుకొనఁగఁ బుట్టినట్టిఋషికి. 452

ఆ. కొయ్యపావకోళ్ళు కొల్లాయమొలకట్టు, సొరుగుల్కు ముదుకబైరవాస
మలఁతిచేతికఱ్ఱ మొలత్రాటిగడియార, మొనర గాంధి కుట్టిలను గరంచె. 453

ఆ. తెల్లవాఱుసరికి దినదినమును దూర్పు, వీధిపిన్నవాండ్రు వేడ్క వచ్చి
చుట్టుకొంద్రు ప్రాంతచుట్టాలవలె గాంధి, నంజలింతు రొజ్జ కణంగిమణంగి. 454

ఆ. పాలుగొంద్రు గురునిప్రార్థనలోఁ బాట, సాగినపుడు చఱపు చఱచుచుంద్రు
తాతవోలెఁబరమదైవమ్మువలె గాంధిఁ, జూచుచుంద్రు తనివి నేచుచుంద్రు. 455

క. పిల్లలలోఁ బిల్లఁడుగాఁ, బెల్లు వినోదించు నెగురుఁ బింపిసలాడున్
దుల్లనిదిగుల్లు తొలఁగ స, ముల్లాసమునంది గాంధియును దేఱుకొనున్. 456

క. తక్కినసభ్యులు పెక్కురు, రొక్కము నేల్పాడి యొసంగ రోజెల్లఁ గడున్
మెక్కుచు మింటందిరుగుచుఁ, జక్కనిచుక్కలు నటించు చక్కికిఁ జనుచున్. 457

క. భోగరతులై మెలంగఁగ, నీగురుఁ దేరీతి విజయ మేర్పడు? సభ నే
లాగునఁ బల్కవలయు? నెటు, సాగఁదగున్ జర్చ? లనువిచారమునఁ బడెన్. 458

క. ఆరబ్ధమాయె సభ శశి, వారమున - మహాత్మమౌనవారమున; గురుం
దారో జజార్భకమువలె, వారును వీరును వచించువాక్కులు వినియెన్. (14-9) 459

వ. వెనుకటిసర్వపక్షసభన్ మనరాజ్యతంత్రము మైసూరు, హైదరాబాదు, తిరువాన్కూరు, బరోడా మున్నగు సంస్థానములతో బెరసి రాష్ట్రకూటముగా (ఫెడరల్ యూనియన్) రూపొందవలయునని నిర్ణీతమగుటంజేసి కేంద్రమునను రాష్ట్రములయందును శాసనసభ లెట్లేర్పడవలయు ననుచర్చతోసాగిన యీసభలో రెండవ నాఁడు బాపూ యొనర్చిన ప్రసంగ మతిగంభీరము - దానిం బ్రపంచపత్రికలన్నియుం గొనియాడె - మహాత్ముఁ డాయుపన్యాసమున నిట్లు పల్కె. 460

## సర్వపక్షసభ - మహాత్ముని గంభీర ప్రసంగము

ఆ. "కాంగ్రెసును సృజించి కడుకష్టముల కోర్చి, పెంచిపెద్దచేసి విశ్వమాన
వాభివృద్ధి నిచ్చ లాసచేసిన హ్యూము, దొరకు మొట్టమొదట దోయిలింతు. 461

(ఏ. ఓ. హ్యూము కృషి ఫలముగా 28-12-1885 మధ్యాహ్నము 12 గంటలకు బొంబాయిలో గోకుల్ దాస్ తేజ్‌పాల్ సంస్కృతకలాశాలాభవనమున డబ్ల్యు.సి బెనర్జీ యాజమాన్యమున మొట్టమొదటి కాంగ్రెసుమహాసభ జరిగినది)

క. భారతజాతికిఁ బ్రాణం, బై రాణఁ గడించెఁ గాంగ్రె; సద్దానికి మేల్
గోరి నిరంతరసేవా, భారము నేఁ దాల్తుఁ బరమభాగ్యం బనుచున్. 462

ఆ. కాంగ్రె సేమిచేసెఁ గాంగ్రెసునకు గమ్య, మెద్ది సిద్ధి దీని కెంతయొదవె
నని సదస్సువార లవహితులై తల, పోయవలయు దానిపోక లిపుడు. 463

ఆ. ఏను సభ్యకోటిసానుభూతికి నపు, దర్జతను గడింతు నది లభింప
దేని కాంగ్రెసేద యేనేద వైయక్తి, కప్రభావ మిచట గవ్వపాటి. 464

గీ. పెద్దబరువు నామూఁపునఁ బెట్టినారు, కాంగ్రెసుమహారథులు; ప్రజాకార్యమగుట
నెదురుచెప్పుట కోదితి నీశ్వరుండు, కలఁడులే నన్ను నడిపింపఁగా నటంచు. 465

ఆ. నిన్న మొన్నఁ గాదు నేఁటికి నలువదా, తేండ్లనాఁడె పుట్టె నీసదస్సు
జాతికెల్ల మధురసంక్రాంతులై ప్రతి, సమను దీనియుత్సవములు సాగె. 466

క. జాతీయసంస్థ యన నీ, రీతిని దినదినము నూత్న రేఖావళితో
నూతనచైతన్యముతో, ద్యోతకమగు సంస్థ యని యనుద్ధతి ననెదన్. 467

క. ఒకకులమున కొకమతమున, కొక ప్రత్యేక ప్రయోజనోద్గతి కిది పు
ట్టకనందలేదు భారత, సకలజన శ్రేయమునకె సంభవమందెన్. 468

ఆ. మొదట నాంగిలేయుమదియందె కాంగ్రెసు, వెలసెనని వచించువేళ నాకు
నొదవుసంతసమున కున్న దాయవధి? యు, దారచరితు లెల్లవారిహితులు. 469

గీ. భారతపితామహుఁడు దాదభాయి విమల, మతి ఫిరోజిషామెహతా సమస్తసేవ
లాచరించిరి శైశవమందు దీని, కలమనీషులు పారశీకులమువారు. 470

క. బదరుద్దీనుతయాబ్జీ, ప్రబదు కర్పితమాయె దీనిభావుకమున; కీ
సదసునకు నాంగ్లహైందవు, లొదవించిరి పెంపు సముచితోత్సాహమునన్. 471

ఆ. ఇఁక మహమ్మదీయు లీకాంగ్రెసును గొల్చి, రని వచింపనేటి కామహమ్మ
దాలి కాంగ్రెసునకు నధ్యక్షుఁడేకదా, కాకినాడ నాంధ్రకటకమునను. 472

క. పదునైదుమంది యుందురు, గద కాంగ్రెసుకార్యకర్తృగణమునఁ బెద్దల్
చదురుగల నల్గురుమహ, మ్మదీయులున్ బొలుతు రీయమాత్యులయందున్. 473

గీ. భారతక్రైస్తవులకు నపారభక్తి, కలదు కాంగ్రెసుపట్ల, నేకలుచ లేని
యన్న కాళీచరణుఁ డెవ్వఁ డాసదస్సు, కొలువులో నాతితేతినవలఁతి కాఁడె? 474

గీ. ఏల వారని వీరని యీ ప్రయాస, మెల్లమతములవారికి నెల్లతెగల
వారి కెల్లనమ్మకములవారి కిందుఁ, బ్రాతినిధ్యము కలదని పల్కవచ్చు. 475

క. మతజాతిభేదముల కిది, యతీత మనినంతఁ జాలునా స్త్రీపురుష
వ్యతిరిక్తతయును దీనికి, నతిదూరముగా మెలంగుననియున్ వినుతున్. 476

గీ. తొలుత నధ్యక్షురాలుగాఁ గొలిచినది బి, సెంటు కాంగ్రెసు; నావెన్కఁ జేసెనట్టి
సేవనమ్ము సరోజినీదేవి దీని, కామె నేఁడును గాంగ్రెసు నాదరించు. 477

గీ. కాంగ్రె సానాఁటినుండియుఁ గస్తినందు, చున్న దస్పృశ్యతాపాపము న్నలంప
జరిగెఁ గొన్నాళ్లు సంఘసంస్కరణగోష్ఠి, దీని కనుబంధముగ నెల్లదెసలయందు. 478

క. రెనడే సాంఘికసంస్కృతి, కనిశము కష్టించె, నతని యాదర్శములన్
మునుముందు నుడువఁజాలిన, దనియెద రస్పృశ్యతాపహ్మక్రియ నార్యుల్. 479

గీ. నాగపురమునఁ గూడిననాఁడు త్రచ్చి, కాంగ్రెసే తలఁదాల్చె నీకార్యభరము
హైందవమహమ్మదీయైక్య మాసచేసి, నట్ల యస్పృశ్యతం ద్రోయు టాసచేసె. 480

ఆ. అంటరానితనము గెంటుట కానాఁడు, పూనినట్టిదీక్ష మాన దిపుడు
ననిశ మీసదస్సు తనదుజాతీయమ, హాసభాఖ్య కర్హమగుచు బ్రదుకు. 481

ఆ. ఇదియకాక కాంగ్రెసిపుడు కా దేనాఁడొ, సలిపె నుడిగ మాంగ్లజాతికిని; మ
నస్వి శేఖరుండు నౌరోజి యిటఁ బార్ల, మెంటుసభ్యుఁడై శ్రమింపఁడోటు? 482

వ. భారతజాతీయమహాసభ సంస్థానాధీశ్వరుల సొంతగొడవలదెసకుం జనక వారికిని
సముచిత సేవనమొనర్చుట జగమెఱుఁగు - కాన నిది తనకోరు నధికారముల
కనురూపముగా శ్రమించినదని విజ్ఞులు కానఁగలరు-కొన్నితడవ లిది తన కోర్కులకుఁ
దగురీతిఁ గృషి చేయమియు నా కవగతంబ - అయినను 483

ఆ. ఈసభాచరిత్ర నీక్షింప జయములే, దక్కె దీనికృషికిఁ బెక్కుమారు
లొక్కదానికంటె నొక్కటి మిన్నగా, నుండు దీనిగెల్పు లొరసిచూడ. 484

క. ఇది యాంగ్లేయులదేశం, బది సంస్థానాధిపతులయవని యనెడి వే
ర్మి దలంప కఖిలభారత, పదమును దనసేవ కుచితపద మనుకొనుచున్ - 485

గీ. ఏడులక్షలపల్లెల నేకభుక్తి, నేకవస్త్రముతో దీనయై కృశించు
ప్రజకు - నోరెత్తఁజాలనిప్రజకుఁ గాంగ్రె, సండయై నేఁడు ప్రాతినిధ్యమువహించు.486

ఆ. వీరిమేలుకొఱకు విడనాడు నితరకా, ర్యములనెల్లఁ గాంగ్రె సని వచింప
నించుకేని సంశయింప; నియ్యది సేద్య, గాండ్రకొఱకె లెస్సగా శ్రమించు. 487

క. ఈరైతుల - యీపేదల, గోరము లడఁగించుపనులకుం బూనుచు న
వ్వారియభిమాన మిది య, వ్వారిగ నార్జించి సారవత్తన్ మెఱయున్. 488

గీ. కాంగ్రె సీనాఁడు తనచరఖాసమాజ, మాచరించునూడిగముతో నైదుపదుల
వేలవెలఁదులు తేటి జీవింపఁదగిన, పనులు కల్పించె నాదారుపల్లెలందు. 489

ఆ. ఇందుఁగలరు సగముమంది ముస్లిము పొల్తు, లని వచింప నిచటియాంగిలేయుఁ
దబ్బపడుట కేమి యదిర! మమ్మరె! యని, భారతీయుఁడైనఁ బల్కితీరు. 490

ఆ. అంటరానిమాసులని చెప్పఁబడువారి, మగువ లిందుఁ బెక్కుమంది కలరు
కాంగ్రె సిట్లు జాతికలిమికి బదలుచు, నడుగుపెట్టె జనపదాళియందు. 491

క. పల్లీపదములకెల్లను, మెల్లగఁజని రాట్నమొసఁగుమేల్ దెల్పి గొదన్
డిల్లపడుప్రజల నియ్యది, తల్లివలెం దనిపి తాను దనివిం బడయున్, 492

ఆ. అతివిశాలమైన ప్రతిభూత్వ మిట్లు కాం, గ్రెసు గడించెనని యెఱింగినప్పు
డీసదస్సువార లియ్యసేయరె యది, యిటకు నన్నుఁబంప నిడినయాజ్ఞ. 493

గీ. ఏపనులు సేయకుండిననేమి నైజ, గమ్యమున్ గనుగొన్నది కాంగ్రె; సఖిల
భారతీయులతలఁపులఁబనుల నొక్క, లక్ష్యమున కంటసిలఁజేసి లంకెవెట్టె. 494

ఆ. గాఢనిద్రఁజిక్కి కదలని కోట్లకొ, లందిభారతీయులకు వికాస
మాత్మగౌరవంబు నది కూర్చెనైకమ, త్యమును గఱపెఁ బ్రత్యయము ఘటించె. 495

గీ. పఱియవాసిన భారతప్రజలతలఁపు, దిద్ది దానికొసంగె జాతీయదృష్టి
గీతసాహిత్యశిల్పాది రీతులను స, మష్టిభావన నేర్పె ధీపుష్టి నొసఁగె. 496

ఆ. మొదటఁ జిన్న చిన్నముప్పులఁ దొలగింప, సాగినట్టి కాంగ్రె సీఁగె రాజ
నైతికాభివృద్ధి ననయించుపనులలో, దేశమెల్ల దానిదెసకు నడువ. 497

ఆ. రాను రాను దీవ్రరాజకీయేచ్ఛలు, కదురఁ బెనఁగిపెనఁగి కాంచె విజయ
మపజయంబుసైత మందకపోలేదు, మేరమీఱి తప్పుదారిఁద్రొక్కి. 498

గీ. సత్యము నహింసయును దనసాధనంబు, లని సదాతనధర్మంబు లనియు నమ్మి
యది వరించినలక్ష్యంబు నరయవలయు, విశ్వకల్యాణరతులు వివేకయుతులు. 499

గీ. రిత్తరిత్తసూత్రమ్ముల సృష్టికతన, నొఱగునది లేదు భారతీయులకు నెదియు
నుభయదేశమ్ములును దుల్యవిభవగౌర, వానురక్తుల మనుచంద మరయవలయు. 500

ఆ. ఇంగిలీసువార లిడినవాగ్దానముల్, బీఱువడినకతన విసిగివిసిగి
తిరుగఁబడితి వారిదొరతనమును మార్ప, నిదియెఱుంగవలయు నీసదస్సు. 501

గీ. పెద్దయుంగాల ముమ్మడిబేర మిద్ద, ఱాచరించి తుదిం జీలునపుడు లాభ
నష్టములలెక్క లరయుచందమున భార, తీయు లాంగ్లేయులిపుడు వర్తింపవలయు. 502

ఆ. ఇంగిలీసువారలే మాకు నధమర్ణు, లగుదురేని వారి కార్తిగూర్ప
నిచ్చగింప మేము; హృదయ ముదారత, కలదు మాకు మైత్రివలయు మాకు. 503

గీ. కత్తిజళిపించి బెదరించి కాక నిర్మ, లానురాగముతో మమ్ము నరసినప్పు
డాంగ్లరాజ్యపు టాయవ్యయమ్ము లేము, చక్కఁబఱుతుము చుట్టాలసరణినిల్చి." 504

వ. మహాత్మునభిభాషణమును సభాసదులు శ్రద్ధధానులై వినిరి - వారిహృదయము లాపల్కు లతో ద్రవించె - ధర్మదేవతపసుపున నొక దేవదూత విజయంచేసి భారతోర్వింగల తెల్లదొరతనపుటౌగాము లరసి తీర్పుసెప్పుచున్నవాఁ డని సభ్యులూహించిరి - వలయునే నపుడు వారందఱు దేశికున కనుకూలముగాఁదమసమ్మతు లిచ్చియుందురు - నాఁటి ధార్మికావేశము తాదృశము - కాని యాంగ్లేయులు రాజనైతికముగా నాఱితేఱినదిట్టలు- మహాత్మునిజాతీయవాదమునం గలదుర్బలస్థానముల నన్వేషించుతఱి హిందూమహమ్మ దీయులయు నిమ్నజాతులయు సమస్యలు వారికిదొరకె - వీనిం బ్రయోగించి కాంగ్రెసు నోడింపవచ్చునని వారెంచి యల్ప సంఖ్యాకవర్గముల నెట్లుతనిపెద వని తత్ప్రతినిధిని నిగ్గఁదీసియడిగిరి-ఇట నింకొక విశేషమున్ గలదు - మహాత్ముఁ డాంగ్లభూమిం ద్రొక్కక మున్నె యచటఁ గార్మిక ప్రభుత్వ మోడి సంయుక్త ప్రభుత్వ మేర్పడె - ఇందు సామ్రాజ్య వాదులబల్మి హెచ్చు - మాగ్డనాల్డే దీనికిని బ్రధానమంత్రి - అయిననేమి? పరిణామ విముఖుల మాట నితఁ డాలింపకతప్పదు - కాన నాంగ్లప్రభుత్వమువా రీపాచికం బఱపిరి-ఈసమస్యం బరిష్కరింప నొకయుపసంఘ మవతరింప దానిముందు మహాత్ముఁ డిట్లు వాక్రుచ్చె. 505

## సాంఘిక సమస్యను బాపూ ఖండించుట

క. ఈసాంఘికచర్చకు నిట, నాసనమిదనేల భారతావనియం దీ
యాసేధమునకు విఱుగుదు, రోసికొనందగదె నల్గురున్ సహృదయులై. 506

గీ. ఔర! యయ్యాయిసంఘాలవారి నిచటి, వారు ప్రేరేచి గోరంతపోరు మేరు
పర్వతమునంతది యొనర్ప బహువిధాల, జతన మొనరించుచుంట నాశ్రుతికి వచ్చె. 507

గీ. మోస మిది చేయఁగూడనిదోస మిది స్వ, తంత్రభారత రాజ్యాంగదర్శన స్వ
రూప మిట్టిదటంచుఁ దీర్చుటవినా త, దన్యవిషయమ్ము లిమ్మహి నరయనేల. 508

గీ. అంత దవ్వులనుండి యీయయ్య లిటకు, వచ్చు టీపిల్లజగడాలఁ ద్రచ్చుకొనుట
కా? ప్రభుత్వమువా రింతయర్థ మబ్ధి, పాలు గావించి రావింపనేల వీరి. 509

గీ. ప్రతినిధులు వీర లీనేలఁ బాయులోన, భారతోర్వీస్వతంత్ర తాకారసృష్టి
సలిపి యాంగ్లేయశాసనసభకుఁ దీర్పు, నొప్పగించి సౌహిత్యము నొందవలదె. 510

ఆ. శవపరీక్షవంటి దవు నిట్టిపని దీనఁ, దృష్టివడెదరేమొ యింగిలీసు;
లేను దనియఁజాల నెటుచూచినను స్వరా, జ్యమును వీరొసంగు రనియ తోఁచు. 511

ఆ. మండలాధికారి కుందుపెత్తన మెంత, యంతపాటి ప్రజలవం తొనర్చి
బుజ్జగించి పంపఁబూనిరి యాంగ్లేయు, లగుత! వారి కీప్సితార్థసిద్ధి. 512

ఆ. ఇట్టిబిచ్చమునకు నీకొసుకంటెను, మేలుగాదె వెతల దీలుపడక
కానలందుఁ గొంతకాలము కాంగ్రెసు, తిరుగుచుంట గుహల సురుఁగుచుంట. 513

గీ. సిక్కులను ముస్లిములను బార్సీలఁ గ్రీస్తు, మతమువారలఁ గూర్చిన మాటలందుఁ
గొంతయౌచిత్యమును గనుగొందుఁగాని, లేద పాడి మాలల దెస లేమనుడిని. 514

ఆ. అంటరానివారి - యంటఁదగినవారి, నడుమఁ గంపకోట నిడువిధాన
మిది; సహింపఁజాల నీవేఱిమి, నిరంత, రముగ మనునె తాఁకరానితనము? 515

గీ. నామరూపాలులేక హిందూమతమ్ము, క్రుంగి కూలిపోయిన నియ్యకొందుఁగాని
యంటరానితనమ్ము ఘోరాఘ మెల్ల, కాలముంటకు నొదఁబడఁజాల నేను. 516

ఆ. 'అంటరానివారి కనుకూల మీరాచ, పెత్తనం'బటంచు నొత్తిపలుకు
ప్రాజ్ఞు లెఱుఁగ రనెద భారతోర్విని-గాన, రనెద సంఘుసృష్టి నచటిదాని. 517

ఆ. ఈ ప్రపంచమెల్ల నెదురైన మత్ ప్రాణ, మప్పగించియైన నంటరాని
తనముపేర భారతసవిత్రికడుపునఁ, జిచ్చువెట్టువారిఁ జెనకినిల్తు. 518

గీ. సిక్కుల మహమ్మదీయుల చిక్కుదీర్పఁ, బ్రోద లెవరేని పూనినఁ బూనవచ్చుఁ
గాని యస్పృశ్యులసమస్య కాంగ్రెసే ప, రిష్కృతియొనర్పవలయు భరింపవలయు. 519

వ. ఇట్లుపసంఘసమావేశమున నస్పృశ్యవర్గసమస్యం దడవి పదంపడి మహాత్ముఁడు 520

క. జిన్నాయున్నగుపెద్దల, సన్నిధి కపుడప్పుడేగి స్వాతంత్ర్యము ము
న్మున్నువరింపుఁడు పదయుఁడు, సన్ననిశంకలఁ దొలంచుజతనము నవలన్ - 521

క. సాగింపుఁడు భారతమున, నేఁ గాంగ్రెసు నియ్యకొల్పి యీరలు తృప్తి
శ్రీ గాంచునట్లొనర్చెద, నీగడ్డన్ బెనఁగులాట యెగ్గగు మనకున్. 522

గీ. మాతృదేశగౌరవమును మనుపుఁ దాస, పడుఁడు జాతీయవైభవ, మెదరువచ్చు
పెదకుఁబోకుఁడు పదుగుర పెంపుకొఱకు,సలుపకుఁడు కోట్లకొలఁది పేదలకుఁ గీడు. 523

వ. అని యెంతవేఁడినను వారు దారికిరాక గొంతెమకోరికలు కోరుచుఁ బరమమూర్ఖతం దెలుపఁదొడఁగిరి - ఈ సందుమాచి సాంఘికసమస్య తేలినఁగాని రాజ్యాంగసమస్య తేలదని మార్గనాల్డు పల్కసాగె-ఇదియంతయుఁ బర్యాలోచించి యేను వలయిత గోష్ఠికి వచ్చుట కొండంతతప్పుచేయుట యని బాపూ తనవేదనం జాటె - మఱియు నేవో పన్నాగములకతన స్వరాజ్యసమస్య పరిష్కృతము కాదేని మఱల శాసనోల్లంఘనమే కాంగ్రెసుకర్తవ్యమని తనప్రతిష్ఠితప్రజ్ఞను మెఱయించె - వెండియు మహాత్ముఁడు. 524

గీ. ఎన్నికలయందు సమ్మతినిడ వయస్సు, చాలుc, జదువనిపేదకుసైత మెఱుక
కలదు, ప్రజలెల్లcజదువరుల్ గాcగనెన్ని, యుగములేగునొ యందాcకనోర్వననియె. 525

గీ. భారతావనియందు రూపాయవిలువ, కొంత కోయ హిందూమంత్రి కుత్రపన్న
ముక్కలొనరించెc దద్వాదమును గురుండు, పదపదమ్మున హేతువుల్ ప్రశ్నికొనcగ. 526

గీ. రాజదంపతు లర్థింపగాc జెలంగి, తనదుకొల్లాయకట్టుతోడన తదీయ
భవనమునకేగి మధురసంభాషణములc, దనిపె రాణిని జార్జిభూధవుని గాంధి. 527

గీ. నగరవాసులు కోరcగా నాలుగైదు, సభలకుంజని సకలవిశ్వంబునకును
దారక మహింస యనెరణదాహమున్న, పంచజనుcడు భూమాతకు భారమనియె. 528

గీ. గుణములను దాcచి దోసములను మఱింత, చేసిచేసి మేయోకన్య వ్రాసినట్టి
భారతప్రసూచరిత మబద్ధములకుc, బట్టుcగొమ్మసుcడీ! యని పల్కరించె. 529

## మహాత్ముcడు భగవత్తత్త్వమును బ్రవచించుట

వ. బాపూ నేcడు 'కొలంబియావణిజ్మండలి' వారి కోరిక నాదరించి శబ్దగ్రాహియందు
భగవత్తత్త్వము నిట్లు ప్రకటించె.

"నన్నుc జుట్టియున్న యీజగత్తునందలి చరాచరవస్తువు లన్నియు జననమరణాది
పరిణామములు చెందుచున్నను వీని కాదరువై నిర్వికారముగా నుండు చైతన్యమే
దేవుcడు.

అతcడు మృత్యువు నందcడు - అమరుcడు.
చీcకటికిc జిక్కcడు - జ్యోతిర్మయుcడు.
దుఃఖ మెఱుcగcడు - ఆనందమూర్తి."

ఈ మేలిపల్కుల కలరి మహాత్మున కావర్తకసంఘమువారు లక్షరూప్యముల పారితోషి
కము సమర్పింప నాచార్యుc దావిత్తముం బ్రజాసేవ కొసంగె - అంత 530

క. మాదేశమునకు రావే!, మాదేశమునకును రావె! మహనీయ! యటం
చాదరమునc బెక్కురు గురు, పాదునకున్ విన్నపములు పంపిరి ప్రాజ్ఞుల్. 531

గీ. భారతోర్వీపరిస్థితి తాఱుమాఱు, వడియె ననువార్త తన చెవిం బడినకతన
దేశికుcడు వారి కుచితసందేశ మొసcగి, శాంతిసౌఖ్యము గూర్ప నశక్తుc డాయె. 532

వ. మఱియు భారతసైన్యమును గూర్చినచర్చ వలయితగోష్ఠిం బొడమ నయ్యెడ నాచార్యుc
డిట్లుపల్కె. 533

## భారతసైన్యముగూర్చి బాపూప్రసంగము

మం. భారతోర్వీపరిపాలన సేయ, నర్హమౌబల మున్నయది కాంగ్రెసునకు
నిది సేనల విధింప నితర దేశముల, తోడిసమస్య లద్భుతముగాఁ దీర్పఁ
దగియున్నయది, భారతక్షితి నిపుడు, కలదండునడవడి కానిది, దేశ
మాక్రమింపఁగ నిల్పినట్టి దాసైన్య, మందలిసైనికు లాంగ్లేయులైన
హైందవులైన మా కన్య దేశజుల, కరణిఁ గన్పింతురు; కాంగ్రెసువారిఁ
బరదేశజులఁ జూచుపగిదిని జూడ, వలె ననుపారము వారి కేనాఁడొ
నేర్పి రాంగ్లేయు, లీనెతి విస్మరింపఁ, జాలరు వారాంగ్లశాసనమునకు
వశపడి యున్నంతవఱకు; నట్లగుట, నింగ్లీషువారు మా కీవలె సర్వ
దళములఁ బాలింపఁ దగిన పెత్తనము, నాంగ్లసైనికులతో నన్నలు ! మీర
లిఁక మనజాతి మహిష్ఠతకొఱకుఁ, గాక భారతభూమిఁ గలవారి పెంపు
కొఱకె - యంగీకృతికొఱకె నలంగుఁ, దని చెప్పవలయు మా యభ్యుదయమ్ము
పాటింపవలయుఁ గోపములు తాపములు, మఱచి కమ్మనిమైత్రి మాదెసఁ బూన
వలయు నియ్యది స్వప్నవాంఛయౌఁగాక, యెన్ని త్యాగంబులకేని తెగించి
యెంత కాలము పోక కేని సహించి, పోరెద మీవాంఛ పూర్తిగాఁ దీఱ
మాసేనలోఁ దెల్లమూసి లేకున్న, నదలము మేము మా కాత్మరక్షణకుఁ
దగుచేవ యున్నది ధైర్యంబు కలదు, మారాజపుత్రులు మాసిక్కుయువలు
మాముస్లిములు ఘూర్కమగలు మామహిని, రక్షింపఁగల రెట్టిరాయిడిలేని
గద్దగాఁ గాపాడఁగల, రస్త్రవిద్య, నాతితేతినజోదు లతిమానుషప్ర
తాపదీపితులు శాత్రవనుతిపాత్రు, లెన్నేనిరణముల నిద్ధజయమ్ము
లందిన వీరానారాయణుల్ రాజ, పుత్రులు, వీరు తెంపును బెంపుఁ జూపి
సకలావనీప్రశంసల నందుకొనిరి, దేశమున్ బాలింప దిగులేమి మాకు
నీవలె నాంగ్లేయు లెల్లహక్కులను, రావలె యశము వారలకును మాకు. 534

వ. ఇంతలో సర్వపక్షమహాసభ ముగియవచ్చె - దానితుదిసమావేశమున నాంగ్లేయుల
నుద్దేశించి కాంగ్రెసుప్రతినిధి యిట్లనియె. 535

## వలయితసభలో మహాత్ముని తుదిపల్కులు

గీ. "రాయబారాలతోడఁ దర్కములతోడఁ, దియ్యగా మెత్తగాఁ బల్కు తెలివితోడ
రాదురాదు స్వరాజ్యము రాదు దీని, రాకకున్ సాధనము వితరణము యనెద. 536

క. అందఱు మెచ్చునినిర్ణయ, మిందేర్పడ దనినపెద్ద లిది మఱచిరి నా
డెందము సైఁపనితీర్పుల, క్రిందన్ నాయొప్పమిని లిఖింప రిదేమో! 537

క. నే ననఁ గాంగ్రెసు కాంగ్రెసు, నానెనుబదియైదుపాళ్ళనరులప్రతిభు, వీ
కానంబడువర్గములకు, దానికిఁ గలయంతరంబు దలపోయవలెన్. 538

గీ. తానొనర్చిన సేవలు త్యాగములు క, తమ్ముగా దానికింత పెత్తనము వచ్చెఁ
బ్రభువులకును భూస్వాములకుభయమైదు, షీనిధులకును బూఁటగాఁజెలఁగునిదియ. 539

ఆ. అలఁతియలఁతి సంఘములపక్షమున వచ్చి, రీసదస్యు లిటకు, నెల్లప్రజల
పెంపుగోరుసంస్థ పంపఁగా వచ్చిన, వాఁడనేను గానవలయు దీని. 540

క. మత జాతి వర్ణ భేద, ప్రతిరోధి మదీయసంస్థ, పల్లీనగర
ప్రతినిధి నా నిదియ తగున్, శతమున నొక్కటిగ నెంచఁజన దిద్దానిన్. 541

క. ఏనాఁటికైన సార్వజ, నీనంబగు కాంగ్రెసే, యనిందితధర్మా
స్థాన మగుకాంగ్రెసే తమ, తో నఖిలము చర్చచేయఁదొడఁగున్ గనుఁడా! 542

ఆ. భారతంబునందు మాఱటదొరతన, మేర్పరింపఁ గాంగ్రె సెదురుసూచు
నని తలంత్రు కొంద ఱది శాంతిమై నగ్గ, పదునయేని దాని విడువ నేను. 543

గీ. హేతిపట్టఁగ నాకాంగ్రె సిష్టపడక, పట్టెసత్యము నకట! యీ పట్టుసైత
మోర్వరానిద యంత్రు మీ రుడుకుగంద్రు, గాని యెవ్వారు వారింపఁగలరు దీని. 544

గీ. అంతటిమగండు స్మట్సు సత్యాగ్రహంబు, నణఁపఁజాలక లొంగినాఁ డాఫ్రికోర్వి;
ఘూర్జరంబున నిది గెల్పుగొనియె దీని, మెచ్చి రాంగ్లేయులును గొందఱిచ్చగించి. 545

గీ. అదను తప్పకముందె మీరరయవలయుఁ, గానవలయుఁ గాంగ్రెసువారిగమ్యమదిస
మగ్రమైన స్వరాజ్యమ యాంగ్లజాతి, పెత్తనము లేని మాజాతిపెత్తనంబ! 546

ఆ. పొందుతో స్వరాజ్యమందుట నామత, మిది ప్రపంచమెల్ల నెఱిఁగియుండు
నదియుఁగాక ముప్పదైదుకోటులప్రజ, లున్న దేశమునకు యుద్ధమేల. 547

గీ. పట్టుదల చాలు, నా కిది గిట్ట దనుచు, నుదువునేరువు దీని కేర్పడినఁ జాలుఁ
జిరతరాభ్యాసమున జయశ్రీ గడింపఁ, దగినకలితన మిమ్మహాధాత్రి కొదవె. 548

గీ. కాంగ్రెసే కారణం బీవికాసమునకు, నీసమర్థత; కేఁబదియేండ్లఁగోలె
నిమ్మహాసంస్థ దేశీయహితము కోరి, పడినపా ట్లెవ్వ రెఱుఁగ రీపుడమియందు? 549

క. నను నమ్మినట్లు కాంగిరె, సును నమ్మరు మీరు మిగులఁ జోద్యం బిది యొ
క్కనిమేషమైన నను దా, నిని వేర్వేఱుగ మదిన్ గణింపకుఁ డయ్యా! 550

ఆ. అదిమహాసముద్ర మం దొకతుంపర, నగుదునేను నన్ను నాదరింతు
రైన దానిసైత మాదరింపుఁడు మీరు, మిమ్ము లోక మపుడు మెచ్చఁగలదు. 551

గీ. కాంగ్రె సిచ్చినపెక్కువ గాక నాకు, లేశమైన గొప్పతనమ్ము లేదులేదు
కాంగ్రెసును ద్రోసి నా కిదుగౌరవంబు, పాటికెక్కదు చీకినపరకవోలె. 552

ఆ. కాంగ్రెసునకు మీరు గౌరవ మొసఁగుచో, నుక్కడంగు విప్లవోద్యమంబు
దీని నణఁప మీకు దిన దిన మేర్పడు, నలఁత దప్పు నెడఁదకలఁత దప్పు. 553

ఆ. చంపుతో జయమ్ముసాధింపఁ జూచు నీ, విప్లవానురక్తుల ప్రమేయ
సాహసంబు గన్న చదురులు మీకైనఁ, దెలియ కేమి వీరి తెగువపెంపు. 554

గీ. తమప్రమాణవాక్యమ్ములఁ దమలిఖించు, కమ్మలను వీరు తమరుధిరమ్ముతోడ
వ్రాయుచుందురు చిల్లిగవ్వకు నొసంగు, విలువయుం దమమేనికి వీర లిదరు. 555

ఆ. నిజమనోరథమ్ము నెఱవేఱుదనుక వీ, రాసపడరు శాంతి, కది విరోధి
కబ్బనీరు నల్గురా పదురా వీరు, కలరు వేనవేలకొలఁదిమంది. 556

గీ. ఏలజాగు స్వరాజ్యమునిందు మొండి, పట్టువదలుఁడు గోదుమరొట్టె మాకు
వలదు నెఱపెత్తనంబ కావలయుఁగాని, యాంగ్లసోదరులార! శాంత్యర్థులార! 557

ఆ. రక్షలుంట యవసరం బగునే నవి, యుభయదేశములకు నొప్పవలయు
నిచ్చగించుఁ గాంగ్రె సిత రేతరక్షేమ, మదియ మీకు లక్ష్యమగునుగాక! 558

క. ఎన్నెన్నో ప్రళయంబులు, తన్నడఁపందొడఁగ భారతక్షోణి తదా
పన్నతను సైఁచి బ్రదికెను, విన్నంబడ దెల్లియైన విలయంబులకున్. 559

ఆ. ఏను బిన్నవాఁడఁగా నఱువదియు రెం, డేండ్లభారమును సహించుముదుక;
నగుట నాదరింపుఁ దస్మదుక్తులను న, న్న నిపినట్టిసమితి యాశయమును". 560

వ. వలయితసభ సమాప్తమాయె - అయ్యవసరంబున (1-12-31) బాపూ సభాపతి
మార్గనాల్డునకుఁ దనప్రశంస లర్పించుచు నిట్లు నుడివె. 561

ఆ. "అన్న! వీడిపోవుచున్నాము మన; మెడ, మదుగులై కలంచు మనపథమ్ము;
లెట్టిబెట్టిదంబు లేచిన సైరింప, వలయు మేలిబ్రదుకు వలచునరుఁడు. 562

ఆ. ఇపుడు తెల్పుఁజూల నెల్లి నాపయనించు, మార్గ మిట్టి దనుచు మానసించి
యది కఠోరకంటకాకీర్ణమైన సు, మోపపన్నమైన నుఱను నేను. 563

గీ. బొత్తిగా నీవు మెచ్చునిపోక కేను, సమ్మతింతునుగాక నీ సజ్జనత్వ
మభినుతించెద మఱువకుమయ్య! నీకు, నాయురారోగ్యభాగ్యము లమరుఁగాక!" 564

ఆ. అంత మార్గనాల్డు 'శాంతిభంజక కార్య, చింతవలదు నీకుఁ జెప్పఁదగిన
పాడి కలదె లోకబాంధవ!" యనె నమ్ర, గతిని గురునికరయుగమ్ము పట్టి. 565

## బాపూ భారతోర్వికి రాక - దేశ మల్లకల్లోలముగా నుంట

వ. పదంపడి మహాత్ముఁడు లండనునగరమునం దనకున్న మిత్రసందర్శనాది కర్తవ్యములు వేవేగ నిర్వర్తించుకొని స్వదేశాభిముఖుఁడై (5-12-31) వచ్చుచు దారిలో స్విడ్జర్లండు తత్త్వవేత్త రొమేన్‌రోలండుతో గోష్ఠిసల్పి యిటలీనియంత ముసులోని పలుకరింప నతనితో నుచితప్రసంగమొనర్చి కడలిపైఁ బ్రొద్దులుపుచ్చిపుచ్చి బొంబాయిరేవున (28-12-31) నరుణోదయవేళ నోడదిగె - అమ్మేటి సర్వపక్ష మహాసభకుం జనివచ్చుసరికి భారత దేశ రాజకీయపరిస్థితు లల్లకల్లోలముగా నుండె - లండనులో నాంగ్లప్రభుతకును మహాత్మునకును భావైక్య మేర్పడలేదనియు నాంగ్ల రాజకీయరంగమున మఱలఁ బరిణామ విముఖుల (కన్సర్వేటివుల) బల మగ్గలించెననియు నిచటి విల్లింగ్డనుదొరతనమువా రెఱిఁగి కాంగ్రెసు నెట్లయిన నిఁక నణఁగఁ ద్రొక్కవలయునని నిశ్చయించిరి - దేశమున నిర్బంధములు శిక్షలు లాటీదెబ్బ లారబ్ధములాయె - పికెటింగు నిరుద్ధమాయె - అటనటఁ గాంగ్రెసుసంఘముల పునర్నిర్మాణములును రాజకీయసభలును నిషిద్ధము లయ్యె-బార్డోలిసీమం బన్నులు రాఁబట్టుతఱిఁ బోలీసు లొనర్చినదుండగముల విచారింప నియ్యకొన్న యేలుబడి వారితీర్పు ధర్మవిరుద్ధముగా నుండె - గింజవిలువ నాసిరిల్లుటం జేసి శిస్తు లీఁజాలని సంయుక్తరాష్ట్రకర్షకుల నధికారు లధికారులై కారింపఁ దొడఁగిరి - ఇప్పట్ల సేద్యగాంద్ర కందగానున్న నెహ్రూ టాండను షేర్వాణీ మున్నగు కాంగ్రెసు ప్రముఖుల నేలుబడివారు బంధించిరి - బంగాళమునఁ జిటగాంగు మున్నగు తావులఁ బ్రజల నదలింపఁ బోలీసువారు దారుణహింస పఱపిరి - సరిహద్దు రాష్ట్రమున నచ్చుశీలు రగు సత్యాగ్రహుల నేలిక లాగ్నేయాస్త్రముంబోనిశాసనముతో నణఁచి తన్నాయకు నబ్దుల్ గఫూర్‌ఖాన్ నరికట్టిరి-యావద్భారతమునఁ దొంబది వేలమంది సత్యాగ్రహుల బందిగ ములం గ్రుక్కి గ్రుక్కింపఁజాగిరి - ఇట్టి బెట్టిదపు గడియలలో మహాత్ముఁడు మాతృ భూమికిం జేర 566

గీ. ఉచితరీతి నహింసాప్రయోగకుశలు, నొజ్జ నాకారణయొనర్ప నుత్సుకత న
నేక రాష్ట్రసత్యాగ్రహు లేకమైరి, బొంబయిని జలరాశికచ్ఛంబునందు. 567

ఆ. గురుఁడు కుఱ్ఱవానికరణి మేలములాడి, తట్టెఁ గొంతమందిదండమీద
గ్రుద్దులిడి కరంచెఁ గొందఱ లాఁగెఁద, యాబ్జివాలుగడ్డ మల్ల నగుచు. 568

ఆ. సాగె నుత్సవమ్ము సడిసన్న వీధుల, జయజయారవములు సందడింప
భూపులకును బంధ్లుపులియుచందానఁగ, రంబు మెఱసె సంబరంపుసొంపు. 569

ఆ. ఎవని కీమహస్సు? భువినెల్ల గెల్చిన, యోద్ధకా? యనూన కోర్విఁనేలు
ప్రభునకా! మహీశుఁ బఱచినమంత్రిశే, ఖరునకా? య దేమి కాదుకాదు. 570

క. ఒకజోగికి నొకసన్నా, సికి నొక సుఖవాంఛలేనిజీవికి నొకలో
క కుటుంబసౌఖ్యమునకై, సకలార్తులు సైంచి సంతసంపదు మునికిన్. 571

ఆ. ఎంతసాధు వైనసేమి యీతఁడు సదా, బదలు రెండుజాలనడుమఁ జిక్కి
మొకటి రాచవారియుడుటు వేఱొక్కటి, ప్రజలపరువుసెఱుచు బానిసమ్ము. 572

ఆ. ఆత్మదేశముక్తి నార్జింప విశ్వమా, నవసుహృత్త పెంప నవయు నితఁడు
ఇలకు వచ్చె నీతఁడీ రెండుపనులకే, బ్రదుకు నితఁడు వీనిపంటకొఱకె. 573

క. నగరమ్మున వసియించెడి, మగవా రానాఁడు రాజమార్గములందున్
నెగడంగఁ జుక్కలబాటకుఁ, దగిలెడిసౌధములమీఁదఁ దనరిరి మగువల్. 574

గీ. అజమమైదానమున జగదద్భుతమ్ము, గా మహాసభ కూడె లోకస్తుతుండు
గురుఁ డుదాత్తగభీరవాక్కుల సదస్య, కోటిముంగడఁ దనహృదిన్ జాటె నిట్లు. 575

ఆ. "శాంతికొఱకు సర్వశక్తులు పఱపెదఁ, బ్రజల నరక వెతలపాలుసేయ
నింత జెడియనీయ హిందూమతమునుండి, యంటరానివార లనెడిప్రజల. 576

క. ఒడ్డెద నాప్రాణము లీ, యడ్డంకి తొలంగి ధర్మ వది తలయెత్తన్
పెద్దరితనమున్ జెందెద, నొడ్డెక్కెద నీవిపత్పయోనిధివలనన్. 577

క. అల్పాల్పలాభములతో, నిల్పను సమరంబు, దళము నియతంబగుచో
గెల్పునకు శంకకలదా, జల్పాకులనుడుల నుఱక సాగుఁడు ! తమ్ముల్. 578

వ. అయ్యెడ నానారాష్ట్రములవలన వచ్చిన కాంగ్రెసు ప్రముఖులు తమతమభూముల యందేలుబడివారు సాగించుచుండగముల మహాత్మునకుఁదెల్పి కర్తవ్యముంజూపవేఁడిరి - తెనుఁగువారు తమసీమన్ నేలపన్ను మిన్నంటె ననిరి (రీసెటిల్‌మెంటు వలన) - ఈవినుకలికి మూన్నాళ్లు పట్టె - సుభాషచంద్రవసువు మున్నగు పెద్దలు వంగాది రాష్ట్రములఁ బ్రయుక్తములైన యసాధారణశాసనములం (ఆర్డినెన్సులు) దనదృష్టికిఁ దేర బాపూ లేనినవ్వు తెచ్చుకొని 579

క. మంచిది! విల్లింగ్డనుదొర, పంచెనె సంవత్సరాదిపండువుకాన్కల్
కాంచితిని దనివి నని త, ర్కించె మదిన్ జేయఁదగినకృతి యే మనుచున్. 580

గీ. ఎన్నఁదగినసత్యాగ్రహి యీతఁడగుట, సమరమునుమాన సకలమార్గములుసూచుఁ
దుదకు గృతంతరములేనిహదను గదియ, నాలసింపక మంటలనైన దూఁకు. 581

క. అట వలయితసభ చందం, బిట నేల్బడివారిచంద మీతనిఁగదుసం
కటమునఁబెట్టెను బరు వు, త్కటమై దేశికునెదంద తల్లడకుడిచెన్. 582

వ. పరిస్థితు లెంతగడ్డుగా నున్నను 583

గీ. కస్తి నుద్విగ్న చిత్తుఁడు కామి నొజ్జ, నిర్వికారతఁ గృత్యంబు నిర్ణయించు
నతనికిన్ దనయందుఁ ద న్ననుసరించు, ప్రజదెసం గల దతులితప్రత్యయంబు. 584

ఆ. ఇతనిబాట నిప్పు దతిగంభీరంబగు, పరిఖ యెద్రిచె; దీనిఁ బ్రజలతోడఁ
బూడ్చిపూడ్చి సేతువును గట్టవలయునా, కట్టకున్న నొద్దుపట్టువెట్లు? 585

ఆ. ఇట్టితలఁపు లిట్టిబెట్టిదమగునురి, యాట లొజ్జయెదఁద నలలవోలె
నెగురసాగె ఝంఝయేర్పడె నెనలేని, దూఁకుతోడఁ గడిఁదితాఁకుతోడ. 586

## దేశపరిస్థితులఁగూర్చి వైస్రాయికి గాంధికి నడిచిన తంత్రీవార్తలు

వ. ఎట్టకేలకు మహాత్ముఁడు తేఱి రాజప్రతినిధి కిట్లు తంత్రీవార్తపంపె.(29-12-31) 587

ఆ. అయ్య! నిన్న భారతావనికిం జేరి, తెలిసికొంటి రాచ తెఱఁగునెల్ల
నదిర! పాడియా నిరంకుశశాసన, చ్ఛటలతోడఁ బ్రజల స్రగ్గఁజేఁత. 588

క. వాయవ్యమహిఁ దుపాకులు, మ్రోయంబనియేమి సత్యము నహింసనమున్
బాయని మన్మిత్రగణం, బాయాచెఱసాలలందు నలయఁ బనేమి? 589

ఆ. వంగభూమి నంతవల్లడిపాల్ సేయ, నేల తీవ్రశాసనాళిఁ బఱపి
యిట్టియేలుబడినిబట్టి ప్రభూ! మన, చెలిమి సడలెనంచుఁ దలఁపఁదగునె? 590

ఆ. ఏమిసేయవలయు నిపుదు కాంగ్రెసు? మిమ్ముఁ, గదిసి దీనికష్టగాథ దెలుప
మానసించినాఁడ మన్నింత్రె నారాక, పంపుఁడుత్తరమ్ము వార్చియుండు. 591

వ. దీనికి విల్లింగ్డ నిట్లు మాఱాడె. (31-12-31) 592

ఆ. తంతివార్తచేరె సంతసమందితిఁ, బాడిదప్పి యెట్టిపనియుఁ జేయ
వంగ రాష్ట్రమందు వింగడము లొనర్పఁ, దెగిరి ప్రజలు మీకుఁ దెలియదేమొ. 593

గీ. అచట సర్కారువారికార్యము లొనర్చి, బ్రదుకువారిఁజంపుట పరిపాటియయ్యె
నొక్కయుద్యోగులనె చంపి యూరకుండి, రా దురాత్ములు? చంపిరి సాధుజనుల. 594

గీ. దుండగులచేష్ట లాఁపనిదొరతనంబు, మంచిదని మీరు నన రంచు మానసింతు
నన్న! విధిలేక యచట శాంత్యర్థ మెట్టి, చట్ట మవసరమో దానిఁ బెట్టినాఁడ. 595

ఆ. ఎల్లప్రజలతోడ నెల్ల తెగలతోడఁ, గలసిమెలసియుండఁ దలఁతు నేను
వలయు నిట్టిమైత్రి వచ్చు రాజ్యాంగ మీ, జగతి బీఱువోక సాగుకొఱకు. 596

గీ. మైత్రియును సహకారమున్ మన్ననయును, వలయు నని యొందొరులు మదిన్ వలచినపుడె
యొదవునవిగాని యొకఁ దేటి కొకఁడుకోటి, కద్దదిద్దముగా లాఁగునపుడు రావు. 597

గీ. కేవలవిరుద్ధగతిని గాంగ్రెసు చరింప, నేలుబడి దాని సైఁచుట యెట్లు సెపుఁడు
సైఁచుటకు శక్తిలేమిఁగా జూచువారి, సరణి నొప్పరికించుచో ధరణి చెడదె. 598

గీ. ధరలు దిగజారి సంయుక్తధరణిఁ గాంచు, లలజడింబడఁ గొంతప న్నణఁపఁదలంచె
నపటి వేల్సుడి; యిదిమెచ్చ కరి సమస్త, మెగురఁగొట్టింపఁ గాంగ్రెసు తెగువచేసె. 599

క. కుల వర్గ విరోధమ్ములఁ, గలిగించి యరాజకార్తి ఘటియించి ప్రజన్
నలఁచుపని సాగ దానిం, దొలఁగింపక గుఱ్ఱువెట్టుదొరతన మేలా. 600

క. వాయవ్యరాష్ట్రము గఫూర్, నాయకతన్ విజ్జృంభిగినది యేలుబడిన్
ద్రోయుటకు నియ్యకొన్నది, 'కో' యని మతకలహములను గూర్చినదికదా! 601

ఆ. వారితోడిచెల్మి వలెనని యధికృతుల్, పడినపాటులెల్లఁ బడటఁ గలిసె
నాంగ్లమంత్రివర్యుఁ దాడినపల్కులఁ, ద్రోసివైచెఖాను దుడుకుఁ జూపి. 602

గీ. అతఁడు పూర్ణస్వతంత్రత యనుట తక్క, నితరమున్ బల్కఁ దేసభ కేగినను; ప్ర
భుత్వమును గూల్చుఁడీ యనుబోధనంబు, తక్క వేఱొండు నేర్పఁ డీదంట ప్రజకు. 603

ఆ. రాజకీయ సంస్కరణముల నాసీమ, నలవరింప నితని చెలిమి వదయఁ
గరముదస్నె నపటిదొర; నిరాకృతి వినా, యితఁడు సామరస్య మింపఁడాయె. 604

క. శ్రుతిమించి రాగమునఁ బడె, నితనిదురుద్యమము; శాంతి యిట్టింకెను దత్
క్షితి; నింక లాభములే దని, ప్రతిషేధించితిని ఖాను భటయుక్తముగన్. 605

గీ. ఇతఁడు కాంగ్రెసుపనిసేయ నియ్యకొనుట, యితనిసేవలఁ గాంగిరె సియ్యకొనుట
నాచెవికివచ్చెఁ గాని యీనదతవారి, నేలుబడి సైఁచుచో శాంతి తూలపోవు. 606

ఆ. భారతోర్వియందు లేరు కొన్నాళ్లు మీ, రఖిలపక్షగోష్ఠి కరుగుకతన
నపటిమీప్రసంగ మాలించినాఁడ మీ, యచటినడతనెల్ల నరసినాఁడ. 607

ఆ. అగుట మీరలొప్ప రని యెంతు సంయుక్త, రాష్ట్రముల గఫూరురాష్ట్రమునను
గాంగ్రె సాచరించుకార్యము; లీయూహ, సమ్మతింతురేని మిమ్ముఁబిల్తు. 608

క. వెండియుఁ గాంగ్రెసువా రీ, మండలముల శిష్టివిముఖమతిఁ జేయుక్రియా
కాండమున కీరు పూఁటగ, నుందర యని విశ్వసింతు నుల్లమునందున్. 609

ఆ. అఖిలపక్షసభకు నరిగి మీచేసిన, పనినిగూర్చి తత్సభాజయమ్ము
గదుర మీ రొనర్పఁగలచేఁతగుఱించి మీ, తోడ ముచ్చటించువాఁడ నపుడు. 610

గీ. అగునుగాని సంయుక్తవాయవ్య వంగ, రాష్ట్రముల రేఁగినయశాంతి ఱాచుపొంటె
నేను బూనినచర్యపే రెత్తరాదు మనసమావేశమున లేశమాత్రమేని. 611

గీ. దేశమున శాంతిసుఖము వర్ధిల్లుకొఱకు, నుర్వి నిరుపద్రవమ్ముగా నుండుకొఱకు
మంచిపరిపాలనము నిర్వహించుకొఱకుఁ, గావలసివచ్చె నేఁ డిట్టికఠినచర్య. 612

## 1932

వ. పదంపడి బాపూ రాజప్రతినిధి కిట్లు తీఁగవక్కాణము పంపె. (1-1-1932) 613

క. "నాకమ్మకు బదులంపిన, మీకు నమస్కృతులు; పరమమిత్రతమై నే
వాకొన్ననుడులఁ ద్రోసితి, రీ కార్యము నన్ను మిగుల నేఁచెడిని బ్రభూ! 614

గీ. అంతయున్నతపదమునం దలరుమీకుఁ, దగినపని యౌనొకో యిది; తథ్యమెఱుఁగ
నారటంపడునాకోర్కి 'నడుగులోనె, యంచపద' మొనరించితి రక్కటకట! 615

క. ఏ నెంతయు మన్నించెడి, నానెయ్యురు తప్పుచేసినా రని నిజముం
గానకముం దెటులాడుదు, మీనిర్ణయ మెట్లు నేను మెచ్చెదఁ జెపుఁడీ! 616

గీ. మిత్రు లపవిత్రు లభియోగపాత్రులనుట, కొప్పుకొన్నను జాతికి ముప్పుగూర్చు
ఘోరతరశాసనమ్ముల తీరుసైత, మేను జర్చింపఁజన దందు రిడియుఁ దగునె? 617

క. ఈ కట్టిఁడిచట్టమ్ముల, నీకొని రానున్నహక్కు లేవో తడవన్
నా కిచ్చు వాదమకున్నది, యాకల్మిం దలఁచి మురియు, నదియెంత? ప్రభూ! 618

గీ. ఈనిరంకుశచర్యల నెదురకున్న, జాతి నిర్వీర్యమై క్రన్నఁ జచ్చితీరు
జాతిచచ్చినపిమ్మట సంస్కరణము, లేల యీనేల నేలఁగా నెవఁడు మిగులు? 619

ఆ. భారతీయుఁ డాత్మగౌరవ మెఱుఁగని, మొఱకు కాఁడు జాతి మూల్గి ముఱిగి
చావ నొప్పఁ డతఁడు సంశయాస్పదమైన, ఫలము నెంచి బాటతొలఁగఁడతఁడు. 620

క. సరిహద్దురాష్ట్రమునఁ గల, పరిస్థితులు కొన్ని తెలియఁబఱిచితి రవి య
క్కరణి వగుఁగాక యచటన్, బఱపిన యాజ్ఞలకుఁ గారణము లగునొక్కో! 621

ఆ. నాయకులనుబట్టి నాయమునకు నగ్గ, పడనియాన లునిచి ప్రజలసిరికిఁ
బ్రాణమునకు నిల్పు గానరానియవస్థ, తెచ్చిపెట్టి జనుల రెచ్చఁగొట్టి - 622

ఆ. నేతలైనవారి నిల్పినతఱి జన, ముత్సవమ్ముసేయ హుంకరించి
కత్తిలేని దుండగముచక్కికింబోని, ప్రజలపైఁ దుపాకిరవలు గుప్పి - 623

గీ. ఎన్నియో క్రూరచర్య లాయిలను దొరత, నమ్మువారు సాగించి రీనడవడికిఁ బ్ర
జాప్రవర్తనమే హేతువా? ప్రసిద్ధ, పదమునం గలమీ రిటం బాడి కనుఁడు. 624

క. సంపూర్ణస్వాతంత్ర్యం, బిం పనియె గఫూరుఖా; ని దెగ్గా? యది జ
న్మంపుఁజనవేకదా ప్రజ, కంపెదరా యింతమాత్ర నాతనిఁ జెఱకున్. 625

క. ఇది లాహోరునకాంగ్రెసు, కొడుకక వెల్వాతిచినట్టి కోరికయకదా
వెదరక యాంగ్లప్రభువుల, యెదుటన్ నేఁ జాటినట్టిదేకద నిన్నన్. 626

క. ఈ పెత్తన మడుగుటకెక, దా పంపెను నన్నుఁ గాంగ్రె సాగోష్ఠికి? మీ
కీపాలకువ యజ్ఞాతం, బా పొరపడినారె మీర? లాశ్చర్యమగున్. 627

ఆ. ఆధరిత్రినేలు నధికారి కొల్పున, కేను రా నటన్నఖాను చెడుగె?
యదిర! దోష మెట్టిదని రోయ కాతని, నీద్వఁదగునె బంది కేలువారు. 628

క. జాతిద్వేషమ్మునకు న, రాతి ననున్ ఖాను; తదపరాధ మతనిపైఁ
ద్రోతురు మీ; రటులగుచో, నాతనిఁ గోర్టునకుఁ బిల్చి యరయందగదా ? 629

వ. సంయుక్తరాష్ట్రవ్యవహారముపట్ల మీవిన్నపల్కులు కల్లలు - కాంగ్రెసువారచటఁ గరనిరాకృతిం బ్రేచిరనుట నిరాధారవార్త - నిక్క మేమన నేల్బడికిని గాంగ్రెసునకును రాయబారముసాగువేళఁ బన్ను చెల్లించునదను కదిసె - కర్షకులు కరగ్రాహులయొత్తడిం బడిరి - కాంగ్రెసువారపుడు దౌత్యము ముగియుదనుక శిస్తులీకుఁడని కాఁపులకుంజెప్పి యదుగకుఁడని యధికారులంగోరిరి - కాన మీ మాట లిట నెట్లునమ్ముదు ? - మఱియు 630

గీ. పంట సకలంబు భూస్వామిపాలుచేసి, యింట నుపవాసపుంబ్రదు కీడ్చియాడ్చి
తడవులంబట్టి యారైతు లిడుమపాట్ల, నెరియుచున్నారు జగమెల్ల నెఱుఁగు దీని. 631

క. పదుగురు నూర్వురు గాదీ, బదవలుపడువారు కోట్లపరిమితి నున్నా;
రిదియెఱిఁగి కాంగ్రెసార్తుల, కొదవలు తీర్పంగఁ బూనుకొనె నియ్యవనిన్. 632

గీ. ప్రజలవెతలార్పఁగా శ్రమంపదుప్రభుత్వ, మిది తనకుఁదోడుపాటుగా నెంచుఁగాని-
యిది యయావితలబ్ధిగా నెంచుఁగాని, త న్నెదుర్కొనుతీ రని తలఁచునొక్కొ! 633

క. ఆ పన్నులసేవకుఁ గా, కేపనికింబుట్టెఁ గాంగ్రె? సిది నిస్వార్థ
వ్యాపారముతోనకదా, యీపాటిప్రశస్తి నందె నింటన్ బయటన్? 634

ఆ. మఱియు నిచట నొందుమనవి ప్రభూ! దుర్భ, రార్థికార్తి తొలగఁ నన్నిదార్లు
త్రొక్కి ఫలములేక పొక్కుకర్షకుఁడు ప, న్నీయనక యేమిసేయఁగలడు? 635

గీ. శిస్తు చెల్లింపలేనని చెప్పుహక్కు, కలదు కాఁపునకున్ దబ్బుకఱవునందు;
దీనిఁ దొలఁగింపఁజాలినదిట్ట లేఁడు, సహజము సనాతనం బగుస్వత్వ మిద్ది. 636

ఆ. కారణంబులేని కలహము సృష్టించు, పనికిఁ గాంగ్రె సిష్టపదద యెపుడు
దీని దూఱుమాట కీను విల్లాను దానిఁ, ద్రోసి వైతు నేను దోస మనక. 637

క. ఇఁక వంగభూమిఁ గొందఱు, వికటాచారముల కంగవించుట విని ల
జ్జకు లోఁగితి నిటఁ గాంగ్రెసు, నకు మీకు విరుద్ధభావనలు లేవుసుఁడీ! 638

క. ఏతాదృ గధమధర్మము, నాతంకమువిడిచి తుడుచు టావశ్యక; మీ
చేఁతను గాంగ్రెసు మీకున్, జేతఃపూర్వకము గాఁగఁ జేయు నుపకృతిన్. 639

ఆ. ఔనుగాని విప్లవానురక్తుల హింస, నెట్లు తెగడుఁ గాంగ్రె సట్లె వారత
నమ్మువారిహింసనముసైత మెగ్గాడుఁ, గొంకులేక లవము జంకులేక. 640

వ. అసాధారణశాసనములం బఱపి మీ రానేల జరిపించుదుండగముల నియ్యాసేఁత కాంగ్రెసున కలవిగానిపని - ఇంతియకాక కాంగ్రె సీదౌష్ట్యముం దనయహింసతో మార్కొనకమానదు - పరస్పరసహకార మభిలషితవ్యమని మీరాడినమాట సమంజసమ-కాని మీతంత్రీవార్త నెన్నివిదుత లవలోకించినను గాంగ్రెసే మీకుఁ దోడ్పడవలయునని, మీరు మాఱుసాయమొనర్ప నక్కఱలేదని తలంచినట్లు తెల్లంబగు - ఇంతయేల - మీయెక్కటిచట్టముల యోగాములు తడవంజనదని మీ రంటిరికదా - ఇఁక మాకు మీసాయ ముందునని యూహించుటెట్లు ? - మఱియు 641

ఆ. కాంగ్రెసు సెచట నేది కావించునో దాని, కేన పూఁట ననుట మానఁజాల
నాశిరమ్మునందు నైతికముగ నిట్టి, బరువుకలదు గాని భారతమును - 642

ఆ. విడిచి యాంగ్లభూమి నడుగిడి యే నున్న, యపుడు కాంగ్రె సీమహాధరిత్రి
నెచటనెచట నేమియేమి యొనర్చెనో, యే ననూనకమ్ముగా నెఱుంగ. 643

గీ. అగుటఁజేసియ మీచెంత కరుగుదెంచి, జరిగినదియెల్ల నెఱిఁగి కాంగిరెసువారి
కుచితసందేశ మొసఁగంగ నుత్సహించి, నాఁడ నీనాఁడు సౌహృదానద్ధమతిని. 644

ఆ. ఇంతమంచితనము నేఁజూప మీరు నా, హృదయ మొల్లఁబోవురీతి నుంటి;
రైన నస్మదీయమగు నాశయమ్మును, దాఁపఁజాలఁ గృత్య మాఁపఁజాల. 645

క. అవకాశ మెంతయున్నను, సవరింపుఁడు మీ తెఱంగు, సంగాతిని ఓ
ల్చువిధాన నన్నుఁ బిల్వుఁడు, వివరింపుదు గాథలెల్ల విందును శ్రద్ధన్. 646

గీ. ఎల్లతావుల కవ్వల నేగి యచటి, యధికృతుల సహకారము నంది రెండు
దెసలు పరికించి సత్యము దేల్చుకొందు, సత్యమేకద నాకు రక్షకము సఖము. 647

క. నాపరిశీలనమునఁ బ్రజ, లే పాడికిఁ దొలఁగఁబాఱు టేర్పడుచోఁ దత్
పాపము నోడక చాటెద, మీపనిలోఁ దప్పులేమి మెఱయింతు నిలన్. 648

గీ. ఏను గాంగ్రెసుమంత్రులు నిటఁ బ్రమాద, పడితిమని సమ్మతించెద నుడువఁదగిన
దారికిం గాంగ్రెసును ద్రిప్పెదను దొసంగు, నొప్పుకొన్నపుడేవచ్చు గొప్పతనము. 649

ఆ. ఎవితరేతి మీకు సుపక్కృతిగాపించు, కోర్కె నెఱుక చేసికొనెడి నేను
దెలుపవలయు నాకుఁ గల నియమమ్ముల, నతకరింపరాని యభిరుచులను. 650

వ. అహింస నాకుం బరమలక్ష్యము – తమ సముచితవాంఛల దొరతనమువారు చులుకం జూచిననాఁడు పాలితులకు శాసనతిరస్కృతి కర్తవ్యమని నావిశ్వాసము – దౌష్ట్యము నెదుర్కొనుట కిది కత్తికంటె నుత్తమమగు సాధనమని నాయనుభూతిమైఁ గంటి – ఇట్టి నా నిర్ణయముల నెన్నఁడున్ విడువఁజాల – మీయధికారులతీరుం జూడ నిఁక నాకు దేశము నుచితమార్గమునం బ్రవర్తిల్లఁజేయువీ లుండదను శంక కల్గెడిని – కాన నా నమ్మిన యహింసతో సాగింపఁదగిన శాసనవిరుద్ధపద్ధతుల నుగ్గటిచి కాంగ్రెసు కార్యవర్గమువారికి వలయుమాట లిపుడు సెప్పితి – వారు నాపల్కులు పాటించి చట్టపుంద్రోఁతను దాత్కాలికముగా నిర్ణయించిరి – వారి నిర్ణయపుంబ్రతి దీనితోఁ గలదు. 651

క. మీరిపుడైనం దేర్కొని, నారాకకు నిచ్చగించినన్ గాంగ్రెసు నేఁ
దారటపడి కావించిన, తీరుపు నాఁగెదను శిష్టధిక్కారంబున్." 652

వ. అంత రాజప్రతినిధి మహాత్మున కిట్లు ప్రత్యుత్తరము పంపె. (2-1-32) 653

గీ. వచ్చె మీతంతివార్త; మావారిఁగూడి, త్రచ్చితిని దాని; మీనుదు లిచ్చగించి
కాంగిరెసుకార్యకర్తలు కయ్యమునకు, సిద్ధపడుట కదున్ గలఁచినది నన్ను. 654

గీ. ఆంగ్లమంత్రివర్యుఁడు భారతావనికి ని, తోడ్పడికంబగు రాజకీయాధికార
మొసఁగఁబడు నన నమ్మాట వెస ఫలింప, నచటనిచటను గృషి సాగునవసరమున-655

క. మామాటలు మానియతులు, కామక వినవలయు నేలికల్; వినకున్నన్
మే మెదిరించెద మనుతీ, ర్పేమెయి మీవారు చేసి? రిది వెత గూర్చున్. 656

ఆ. రాజకీయసంస్థ లీజాద నాడుట, పాడియౌనె; రాచవార లిట్టి
నుముల కడరి బెదరుపడుదురె పదిరేని, నదచునొక్కొ దొరతనంపుబండి. 657

గీ. భారతప్రభుత్వంబు మీపలుకు నియ్య, సేయఁజాలదు మంచిని జెద్ద నరసి
వలయుచట్టము లిడి చేసె వాని నిపుడు, మార్పనొల్లదు కాంగ్రెసుతీర్పు సూచి. 658

క. అది యిది కావించెదమని, బెదరించెడిమిమ్ము నెట్లుపిల్తును? మీరే
నిది పొసఁగునని తలంతురె, కుదురునె చెలికార మిట్టికొఱకొఱలందున్. 659

క. మీయుద్యమమున దేశ, శ్రేయమ్మున కెట్టిచెట్ట చేకుఱినను మీ
రే యగుదు రపుదు బాధ్యులు, చేయుదు జతనంబు లేను శిష్టిన్ నిలుపన్." 660

వ. మహాత్ముండు దీని కిమ్మయి మాఱాడె. (3-3-32) **661**

క. "మీతంతివార్త వచ్చెను, జోతలు మీకిదుడుఁ గాని స్రుక్కనఁబడితిన్
మీతలఁపు మాఱమికి మీ, చేతమునకు మెత్తఁదనము సిద్ధింపమికిన్. **662**

క. మొగమోదక మదిసెప్పిన, పగిదిం బల్కితిని దీని భయపెట్టుటగా
వగ చెదరు మీరు ప్రభులకుఁ, దగ పీతలపోఁత యనియెదన్ వినయమునన్. **663**

గీ. శాసనోల్లంఘనము కొనసాగునపుడె, జరిగె నిర్విను ప్రభువుతోసంధి మాకు
మఱచితిరె మీరు దీని? మీమంత్రిచయము, నడిగిచూడుఁడు గుర్తులేదండురేని. **664**

గీ. సంధికుదిరినపిమ్మట శాసనంబు, నుఱమి తాత్కాలికమ్ముగ నుదుపఁబడియెఁ
గాని సార్వకాలికముగా మానఁబడదు, జ్ఞప్తికిందెత్తు దీని రాజప్రతినిధి! **665**

గీ. అఖిలపక్షసమజ్యకు నాంగ్లభూమి, కేగుటకుమున్ను సిమ్లయం దేను మిమ్ముఁ
గలసినపు డీయొదంబడికను గణింప, నియ్యకో లిచ్చినారుగదయ్య! మీరు. **666**

క. అక్కఱకల్గినఁ బ్రభుతా, ధిక్కృతికిం జనెదననియ తెల్పితి మీతో
నక్కాలమునం; దీనుడి, వెక్కసమేయైన దౌత్యవిధి సాగెడిదా? **667**

గీ. శిష్టి నొప్పనివారికి శిక్షతప్పు, దని పలికియుంద్రు మీరప్పు; డైన నేమి
చట్టమును ద్రోసినంత శిక్షను భరింప, వలయునని యస్మదీయుఁ డెవ్వాఁడుకనఁడు. **668**

క. నాపల్కు లపుడు మీకుం, గోపము నొదవించెనేని గుంద్రసభకు న
న్నేపగిదిఁ బంపెదరు మీ, రాపరమాదరముతోడ నాదీవనలన్. **669**

ఆ. ఏలువారొనర్చు నెల్లపనియు నేను, బలికినట్లు జరుగవలయు ననుచుఁ
గోరినాఁడనొక్కొ కూదనిప ల్కిది, యెన్నఁడేని వలవ నిట్టివలపు. **670**

ఆ. అగునుగాని పాలితాదర మాసించు, దొరతనమ్ము ప్రజలకొఱకు దయ్యు
గఱువ లాదునుదుల గణియించి పరికించు, ననెద నిది యథార్థ మగుటఁజేసి. **671**

ఆ. ఏలువారి తెఱఁగు పోలనిదని ప్రజల్, దెలుప మీరు వారిఁ దేర్చుకొఱకు
నన్నువంటిఁ బిల్చి యున్నచిక్కులు చూపి, యతనితోడుపాటు నందవలదె? **672**

క. ఇదితక్క నితరభావం, బెదియు మదీయోక్తులందు నీరు వెలార్పం
జదురులు గారు, భవిష్యమె, పదుగురకుం జాటు నుభయపక్షౌచితులన్. **673**

ఆ. మఱలవినుతు నొక్కమాఱు కాంగ్రెసువార, లిఁక నహింసతోడనే కదంగి
నదుపఁగలరు శాసనతిరస్కృతిని, జక్క, వినుఁడు కనుఁడు శాంతివిరియుబాట. **674**

గీ. కాంగిరెసు రేపు సాగించుకయ్యమున జ, నించుమంచికిఁ బెద్దకు నేను నదియుఁ
బూఁటపడుదుము మీకిట్టిమాట పేఱ,నుదువఁ బనిలేమి యెఱిఁగియు నొడివినాఁడ. 675

## మఱలశాసనతిరస్కృతి - తీవ్రశిక్షలు

వ. మహాత్ముఁడు రాజప్రతినిధికంపిన యీతంతివార్తతో సమర మారబ్ధమాయె - మున్ముందు (4-1-32) దొరతనమువారు దేశికుని వల్లభాయిపటేలును బంధించిరి - పదంపడి నిరంకుశ శాసనముల యావద్భారతముం బ్రామిరి - కాంగ్రెసుసంఘము లక్రమ సంఘము లనిరి-జాతీయవిద్యానిలయములనుసైత మిందుఁజేర్చిరి - వీని సర్వస్వముం గొనిపోయిరి - నాయకులనందఱం జెఱలకుఁద్రోసిరి - దాదాపు లక్షమంది సాధారణ సత్యాగ్రహుల బందాలఁజేసిరి - దేశమునందున్న కారాగృహములు చాలమింజేసి రేకులపాకలతోఁ గ్రొత్తబందిగములు నిర్మించిరి-అవియు నిరవకాశము లగుచుండ 676

ఆ. ఎన్నఁదగినవారినే పట్టి యితరులఁ, గొట్టివిడువఁ బూనుకొనిరి; మనువు
చదువు నాగరికత సంపద గనక బం, ధితుల కిడిరి పరమనీచగతిని (సి. క్లాసు) 677

గీ. అక్కడక్కడఁ బదుగుర లెక్కకొఱకు, మొదటి రెండవతరములఁ గుదురుపఱిచి
తక్కసత్యాగ్రహులనెల్లఁ దగవుదప్పి, క్రుక్కినా రధమశ్రేణిఁ ద్రొక్కినారు. 678

ఆ. పరులసొమ్ము దోఁచి బ్రదుకుతెక్కలికాండ్ర, కొసఁగులేకిబువ్వ నొసఁగి రదిర!
సాధుశీలురైన సత్యాగ్రహులకు ప్రు, చ్చుల నణంప బదలుసువ్రతులకు. 679

గీ. వేని కపరాధశిక్షగా వేలకొలది, కాసులు విధించిరో సాహుకారటంచు
నతనికే నింద్యమగు తరగతి నొసంగి, రతనికే మ్రింగరానియాహార మిడిరి. 680

గీ. చేతులెత్తుట దింపుట చెప్పినట్లు, కూరుచుండుట మున్నగు కారనియతు
లంచితాశయులైన సత్యాగ్రహులకు, దుర్భరములయ్యె గౌరవధూర్వహులకు. 681

క. వీరికిని జెఱలనేలెదు, వారికి సంఘర్షణములు వచ్చెను వీనన్;
ఘోరతరదండనమ్ముల, బారిం బడి రపుడు దేశభక్తులు కదరే! 682

ఆ. లాఁగవలసివచ్చె నీగఱువలు నూనె, గాన్గ నఱితిమీఁదఁ గాఁడిమోఁపి
లాఁగ లేక నిలువ లాటీలపోట్లు భ, రింపవలసివచ్చె రేపు మాపు. 683

క. ఈరక్కసపను లన్నియుఁ, గారాకుడ్యములనడుమఁ గడచనుఁ గానన్
గోరంతయు వెఱవక యధి, కారులు సాగింత్రు వీనిఁ గఱకరు లగుచున్. 684

క. అక్కఱపడి కట్టిన చెఱ, లక్కట! నరకములు; గ్రీష్మమం దవి నిప్పుల్
గ్రక్కున్ జలికాలమునన్, బ్రక్క లెగురఁగొట్టి నొంచుఁ బ్రాణులఁ బెలుచన్. 685

క. ఈ రేకులపాకలలో, నూఱుగురకు నాలుగైదునూర్లను ప్రోయన్
మూరెను దుర్గంధము నా, నారోగము లవతరించి నలంచెన్ బ్రజలన్. 686

క. ఆఱుతువని యాఱుతువని, వేఱిమిలే కెల్లఋతుల వేధించెం బ్రజన్
ఘోరగ్రహణివ్యాధులు; దోరిరి పెక్కండ్రు రోగధూతాజసులై. 687

ఆ. మంచిగాలి లేమి గ్రుండిరి కొందఱు. శ్వాసకోశరుజల స్రగ్గిస్రగ్గి
బందిగమున దేశభవికమ్మునకుం జావు, బహుళజన్మసుకృతఫలము కాదె. 688

క. కారాగృహముల నేలెదు, వారలలో నూటి కొకండువంతున నుచితా
చారులు పొల్తురు తక్కిన, వారును రక్కసులు నొక్కవంశమువారల్. 689

వ. చెఱసాల లిట్లుండ వాని వెలుపల దుద్దుగఱ్ఱల వారిదుండుదుకు హెచ్చె - వీరిపోట్లు తిననియూ రానాఁడు దేశమునంగానము - ఊరేగింపులు సభలు పికెటింగులు సర్కారువారాక్రమించిన భవనములం బట్టుదండయాత్రలు సాగినవేళ సత్యాగ్రహులన కాక యాపన్నికలంజూడ గుమిగూడిన నిరపరాధులసైతము రక్తకిరీటములవారు తెగ బాఁదిరి - సత్యాగ్రహుల కీబహిరంగసమ్మానముగాక బందికింజనిన వెన్క మఱికొంత సంభావన ముట్టుచుండె-ఇంక నుదువరానివద్దన లెన్నో దక్కుచుండె-అధికారుల రాకాసి తనమునుబట్టి యాచిత్రవధము లనేకరూపములందాల్చె-వెండియు నక్కాలమున 690

క. కొట్టినఁ జంపినఁ బ్రజ లీ, పట్టువిడరు సొమ్ము నొడిసి పట్టిన నాఁడే
కట్టలమటఁబడి దండము, పెట్టెదరని కని తలంచి పెన్నధికారుల్ - 691

క. సత్యాగ్రహులకు ధనరూ, పాత్యయము విధింపదొడఁగి నైదంకెలుగా
నత్యాచారుల తెఱఁ గి, ట్లత్యుగ్రముగాక భిన్నమగునా తగునా? 692

క. ఈవిత్తము రాఁబట్టుట, కావీరుల యాస్తిపట్టి యది చాలనిచో
వావిరిదప్పిన యధికృతు, లావారలచుట్టముల గృహోదులుపట్టన్ - 693

క. తెగఁబడిరి కుంటపొల మొక, దుగులమ్మునకమ్మి రింతతో నాఁగ కిసీ!
తగులంబెట్టిరి పంటల, మొగసాలలతోడిగేహముల వాహములన్. 694

ఆ. మోయరానినష్టముల కిట్టివానికి, నగ్గపడిన వీరహాలికులకు
నెలవులయ్యె గుజరినేల సంయుక్తక, ర్ణాటమండలంబు లపు దయారె! 695

గీ. కోరికోరి స్వతంత్రతకొఱకు వీరు, కుడిచి రీకష్టముల సొమ్ముకొఱంతఁ గాక
కాఁడితో గెల్చి రానాఁడు కడిఁదివెతల, వేఁడితో గెల్చిరీనాఁడు విద్విషులను. 696

క. కాఁపులయందును గుజరీ, కాఁపులు సైఁచినవెతల్ జగన్నుతిపాత్ర
వ్యాపారములయ్యె నహో!, నాపల్కులు చాల వీ వనటలన్ దెలుపన్. 697

గీ. మోహనుండు జనించినభూమియందు, వల్లభుం డుదయించినవసుధయందుఁ
ద్యాగములపంట కావంత తఱుగుపడునె, విక్రమస్ఫూర్తికణమాత్ర వెలితియగునె. 698

క. శిక్షార్థ మపుడు తెచ్చిరి, లక్షలుగా నరుణమకుటలాంఛనుల దొరల్
రూక్షతమై జనపదముల, కక్షమబాధలు ఘటించి రప్పోలీసుల్. 699

క. ఈమూఁకల కగువెచ్చము, గ్రామమ్ముల నెత్తి నేలికలు మోపి కదున్
దామసులై రాఁబట్టి ర, సామాన్యధనమ్ము పేదసాదులు క్రుంగన్. 700

క. ఈరాకాసులు విడిసిన, యూరన్ స్త్రీపురుషగౌర వోపద్రవముల్
మూరన్ మిథునపురప్రజ, లాఱడిబ్రతు కోర్వలేక యారటపడుచున్ - 701

క. ధామములు విడిచి యాయా, సీమలకుం జనిరి దారిఁ జిఱుతలు వనితల్
బాములకోర్వక పెక్కు ర, యో మదసిరి విలయవేళ యొదవెన్ మహికిన్. 702

ఆ. ఎంతసెప్పనేర్తు నిమ్మేయు నానాఁడు, నీచదాస్యభరము నెట్టివైవఁ
బ్రజలు పడినపాట్లఁ బ్రభుతవారు తెగించి, పఱపినట్టి ఘోరపాపములను. 703

ఆ. చిచ్చువోలె నెల్లసీమల సత్యాగ్ర, హోద్యమంబు రేఁగె నూరితోడ
నూరు పంతగించె హుమ్మని సీమతో, సీమ ప్రతినపట్టెఁ జేవచూప. 704

ఆ. సాగినది స్వదేశసంస్థానములసైత, మాంగ్లరాజ్య మొల్ల మనెడికేక
గణుతిపాత్ర మిట భగల్ ఖండసంస్థాన, జనత వెలువరించు సాహసంబు. 705

వ. ఇఁక నేలుబడివా రానాఁడు ప్రయోగించిన యెక్కటిచట్టములు నిరంకుశ రాజ్య పతాకలు
– వీనినిబట్టి యధికారులు 706

ఆ. ఒకనియూరు పేరు నుద్యోగ మడిగి వాఁ, డిచ్చునుత్తరంబు మెచ్చులేక
నిజము తేలుదనుక నిల్పి రావంతపా, పంబులేనివాని బందిగమున. 707

గీ. ఎవనియిల్లైన నందలివివిధవస్తు, పటలితో నాక్రమించి; రేపల్లె విడిచి
యీపురిం బాసి యీయింటి నెడసి చనుట, యవగడంబని కొందఱ కానలిడిరి. 708

గీ. ప్రజలు తమకున్న శకటసంపత్తిలెక్క, చెప్పవలెనని రాచార్యు లెప్పుడనిన
నప్పుడేతెంచి ప్రభుభక్తిగుప్పి జనుల, దిద్దవలెనని ప్రకటించి రుద్దవిడిని. 709

గీ. తప్పుచేసిన వా రుండుకప్పమునకు, మొత్తమునకు విధింతుము విత్తశిక్ష
విత్త మీయనివారల విడక చెఱకుఁ, బంపి బాధింతు మనిరి దర్పము తొలంక. 710

గీ. తాము చెప్పినదే తీర్పు; దాని కెవ్వ, రైనఁ దలయొగ్గవలయును గాని పాడి
పట్టునకుఁ జెప్పికొనుహక్కు పడయరనిరి, నిందితుఁడు రామిచేఁ దీర్పు నిలువదనిరి. 711

ఆ. ఏలువారికొలువు చాలింపుఁడని పల్కు, వాఁడు స్రగ్గఁ జెఱను వత్సరంబు
చదువరానిరచన చదివినవాఁ డాఱు, నెలలు జందిగమున నలఁగు ననిరి. 712

ఆ. ఈడురానికుఱ్ఱవాఁడు కావించిన, నేరమునకుఁ దండ్రి నింద్యుఁడనిరి
తండ్రిలేనినాఁడు తద్వోషి కండగా, నిలుచువాఁడు దండనీయుఁ డనిరి. 713

ఆ. ప్రజలు దుష్టులైనఁ బంటకాల్వలు మూసి, పైతుమనిరి, కస్తి వచ్చినపుడు
పిలువఁబడినవాఁడు నిలఁబడి పోలీసు, వానిపనులు చేయవలయు ననిరి. 714

ఆ. మావచించినట్లుగా వర్తకులు కొన, వలయు వస్తు లమ్మవలయు ననిరి
యడిగినపుడు సరకులన్నియు నేల్పాడి, వారి కప్పగింపవలయు ననిరి. 715

ఆ. పదుర కుపకరించు పారశాలాదుల, నడుపువారు మేము నుడివినట్టి
పని యొనర్పవలయు నొనరింప రేని తత్, పాలనంబు సాగఁజాల దనిరి. 716

ఆ. ప్రజలపాలితంతివార్తల నాఁపిరి, మూఁతఁ జించి లేఖములను గనిరి
రైలులోని జనుల రండ! క్రిందికి నని, చఱచి నిలిపి రందు సైనికులను. 717

గీ. గుట్టుగాఁ బ్రజ లిండ్లలోఁ బెట్టుకొన్న, క్రంతలకు దూఁకి కదుదుండగములుచేసి
రాఁక పెట్టిరి పికెటింగు, నచ్చుకూట, ములఁ గలంచిరి కడిఁదిసంకెలలు పైచి. 718

గీ. పత్రికలనోరు కట్టిరి బాధ్యతాధ, నమ్మువేనవే లడిగి రన్యాయ్యమైన
నేరమును మోపి ధ్రమింగి రాభూరివిత్త, మప్పటియుఁ బూఁటసొమ్మున కానలిడిరి. 719

గీ. ఇంతరాకాసితనమున కేలువారు, సిద్ధపడినను నాయకుల్ చెఱలఁబడిన
దిగులుపడక కాంగ్రెసువారు డీలుపడక, నడిపినా రుద్యమమ్ము నానాముఖాల. 720

ఆ. ఒకని వెనుక నొక్కఁ డొదయఁడుగా వచ్చి, చక్క నడిపిరెల్లసంఘములను
పదుగు రెన్నుకొనుట పడక యానాఁడు పై, యుక్తికముగ నిర్ణయములు వెడలె. 721

వ. ఏశాసనముం దిరస్కరింపవలయు నన్నతర్క మప్పుడు కాంగ్రెసువారికిం బొడమదాయె – అసాధారణశాసనము లన్నివంద లవతరింప నదియా యిదియా యన్న చర్చతో వారి కేమిపని? – కల్లంగడులకడ విదేశవస్త్రాపణములయొద్ద నింగ్లాండునందీర్చిన దినుసు లమ్ముతావునఁ గాపుగడ యెల్ల రాష్ట్రముల కాంగ్రెసు వారికిం బ్రధాన కృత్యమాయె – మఱియు నపుడు సంయుక్తరాష్ట్ర సైరికులు నేలపన్ను కట్టరైరి – వంగ విహార హోలికులు ఘట్టశుల్కము నెగవేసిరి – మధ్యరాష్ట్రముల కాఁపులు పుల్లరి నీయరైరి – ఉప్పుఁజట్టమును గాంగ్రెసువా రెల్లసీమలం ద్రోసిరి – నిషిద్ధ సమావేశముల నూరేగింపుల వెడలించిరి – దండయాత్రారంభదినము, మోతీలాలు నెహ్రూనిర్యాణదినము మున్నగు

ప్రొద్దులకుం బెద్దతిక మెసఁగి యాయయినాళ్ళ విధిగా శాసనతిరస్కృతి కావించిరి- దొరతనమువా రాక్రమించిన కార్యాలయముల నాశ్రమములం బట్టి దండయాత్రలు సాగించిరి - వీరికి వలయుపను లొనర్ప నచ్చుకూటములు వెఱవఁ జేమరల (ట్రెపు, సైక్లోస్టయిల్) సాయమున నిషిద్ధకర పత్రాదుల వెలయించి నలుగడం బంచిరి - వేగరు లెంతజాగర్య నున్ననేమి - యీ పత్రము లదనం బ్రకటితములై యుద్యమ స్వరూపము నెల్లయెడలం దెల్లమిసేయఁ జాలె - రాచవారిలేఖాప్రేషకశాఖ తమకెదురని కాంగ్రెసువా రాయారాష్ట్రములయం దతినిగూఢముగా సొంతయంచె లేర్పఱిచిరి - అఖిల భారతజాతీయ మహాసభాకార్యాలయము రాష్ట్రములకు, రాష్ట్రములు మండలము లకు, మండలములు గ్రామములకు నిర్నిరుద్ధముగా నిరాలస్యముగా వలయువార్తలు చేర్పండొడఁగె - కాంగ్రెసు కార్యాలయము లెందున్న వోయని పోలీసులు వెదకి వెదకి వెలుకంబాఱిరి - సత్యాగ్రహు లాయాసభలు జరుగుతావులఁ దార్మాఱుగాఁ బ్రకటించి కృతకృత్యులై యధికారులఁ బ్రపామగ్నులఁ జేసిరి - ఇట్టి పరాభూతులం గుడిచినతఱి నధికృతులెంత రేఁగి యెంత బాధించిన నేమి? 722

గీ. మఱవరైరి మహాత్మునిమాట ప్రజలు, విడువరైరి యహింసను విన్ను విఱిగి
మీఁదఁబడుఁగాక పందలైఖేదమునకు, నెడఁద నిసుమంతయవకాశ మీయరైరి. 723

ఆ. కాన, నాల్గునాళ్లలో నిగ్గునని యధి, కారు లూహపడిన కయ్య మిట్లు
కదమలేక నడువఁదొడఁగె మాసములుగా, దిట్టలెల్లఁ జెఱలఁబట్టి యున్న. 724

గీ. పాడికిఁ దిలోదకములిచ్చి ప్రభుతవారు, దుండగమ్ములకుం బూనకుండు రేని
యింతకుం బదిరెట్లుగా నీరణంబు, సాగియుండును విశ్వ మజ్జారె! యనఁగ. 725

గీ. అష్టదిక్కులు మూసి సత్యాగ్రహప్ర, చార మవ్యంజితమ్ముగా జరుగుదశకుఁ
దెచ్చి రధికారు; లైనను దీలుపడక, కార్యకర్తలు తగుపన్నుగడలు గనిరి. 726

ఆ. ఎంత పొంచియున్ననేమి పోలీసులు, శాంతిసేనముందు చాలరైరి
తెల్లవాఱుసరికి దేశమెల్లఁ జరించి, వచ్చు నిది రహస్యవార్త వినిచి. 727

ఆ. వసువు కొంతయైన వలయు సత్యాగ్రహ, సంగరంబు నుచితసరణి నడుప;
నర్థ మెసఁగి రప్పు దజ్ఞాతసంపన్ను, లవిదిత గ్రహీత లందుకొనిరి. 728

గీ. వీసవీసమునకు లెక్క వ్రాసి యొక్క, రువ్వయును బీఱువోనీక చివ్వకొఱకు
వెచ్చపెట్టెను గాంగ్రె సావిలయవేళ, మెచ్చవలె దీని విశ్వ మామ్రేడితముగ. 729

ఆ. అతికరోరమైన యభ్యాసమునకు స, త్యాగ్రహమున కగ్గమైన కాంగ్రె
సేల గెలుపునంద? దిఁకఁ దెల్లదొరతన, మెన్నినాళ్లు నిల్చు నీధరిత్రి? 730

## విపరీతపరిస్థితులలో ఢిల్లీ కాంగ్రెసు

వ. అది యట్లుండె - ఈవిపరీతపరిస్థితులలో భారతజాతీయమహాసభా వార్షికసమావేశము ఢిల్లీనగరమున ఘటీకారగోపురము (క్లాక్ టవరు) నొద్ద (చాందినీచౌకులో) జరుప నిశ్చయించినట్లు కాంగ్రెసువారు ప్రకటించిరి - పోలీసువారి సభాస్థానమును విశ్వసింపక వేర్వేఱుతావులఁ బొంచిరి - సభాధ్యక్షుఁడు మదనమోహనమాలవ్యా నధికారులు మార్గమధ్యమున నిర్బంధించిరి - ఆయారాష్ట్రములవలన వచ్చు పెక్కండ్రు ప్రతినిధులను సైత మట్ల యరికట్టిరి - కాని 731

ఆ. ఆత్మబలసమగ్రు లైదువందలమంది, ప్రతినిధులు మహాసభాప్రదేశ
మునకు వచ్చినిల్వ రణచోదు తేఁడుగా, హస్తినగరికాంగ్రె సవతరించె.(1932 ఏప్రిల్)732

మం. అచటికిఁ బోలీసు లరుదెంచులోన, నధ్యక్షునిప్రసంగ మాఖ్యాతమయ్యె
వార్షికవార్తాళి వరియింపఁబడియె, రావలెఁ బూర్ణస్వరాజ్య మటంచు
శాసనోల్లంఘనసమరంబు మరల, సాగుట సంతోషజనక మటంచు
బాపూజీపిల్పును బాటించి దేశ, మభినంద్య మైనది యనుచు మహాత్ము
నేతృభావము వాంఛనీయ మటంచుఁ, బ్రతినిధుల్ నాల్గుతీర్మానముల్ చేసి;
రగ్గించిరి యహింస కనుకూలమైన, సమరంబు నడిపిన సరిహద్దుప్రజల
ముగిసెను బరిషత్తు; మూఁగెఁ బోలీసు, దళము; వెల్వెలఁబాఱె దానిమొగమ్ము. 733

వ. ఈసభకువచ్చు కాంగ్రెసుజోదులను సాదు లశ్వములచేఁ ద్రొక్కింతురనియు లఘు నాళికలంబ్రేల్చి కూల్తురనియు నెన్నేనిదారుణవార్త లయ్యేడ వెలువడియె-ఐనను ధీరత్వమున కండయగు కొండా వేంకటప్పయ్య మరణశయ్యనున్నమగువం బాసి ఢిల్లీ కాంగ్రెసునకుఁ గదలె - గుళ్ళపల్లి రామకృష్ణయ్య వేదాంతము నరసింహాచార్యు లాదిగాఁ గల కాంగ్రెసు ప్రతినిధులు గుంటూరిసీమవా రిరువం ద్రీనాయకుననుగమించిరి - హస్తినాసభ కాంధ్రరాష్ట్రముపాలిప్రతిభువు లందఱుంగలసి యఱువండ్రుగా నిర్ణీతులైరి - దేహళీఘట్టమున ధూమశకటముం దిగుటయ తడవుగా నధికారు లీయోద్ధల నరికట్టి చెఱసాలకు లోఁచిరి - అచటనున్న యున్నవ లక్ష్మీబాయమ్మ వీరికి స్వాగతముపల్క నమ్మగువసాహసమున కీభిరుదులు వెఱఁగందిరి - నాఁ డిట్లు నిరుద్ధులైనమగల సంఖ్య యాఱువేలం గడచె - మాతృధాత్రీ దాస్యనిబర్హణమునకై ప్రాణార్పణముగావింపఁ

## గుంటూరులో తెనాలిలో నిషేధాజ్ఞలనడుమఁ గాంగ్రెసుసభలు

దెగించిన దేశభక్తులను వీరిం దలఁచి యావద్భారత మావేశం బులకించె- రాష్ట్రములయు మండలములయు గాంగ్రెసు సభలు సైత మవు దీతెఱంగునన ప్రవర్తిల్లె- ఆంధ్ర రాష్ట్రసభ సంపత్కుమారాచార్యుల ప్రజ్ఞాసాహసకౌశల్యమునంజేసి గర్తపురమున లక్ష్మీనృసింహస్వామి దేవళము నెదుట మున్నూర్గురు ప్రతినిధులతో నేలుబడివారు

సిగ్గునందోఁగునట్లు నడచె - ఈసదస్సున కధ్యక్షురాలుగాఁ గాకినాడనుండి కదలిన కమలాదేవి కతిపయసఖీ మణులతో బెరసి పెండ్లికూఁతువోలె నిర్నిరుద్ధగా గమ్యస్థానము చేరి తఱివార్చికర్తవ్య మత్యద్భుతముగా నిర్వహించె - ఆమంచెర్ల శేషాచలపతి, నేతి వేంకటాచలపతి, పున్నయ్యశాస్త్రి మున్నగు కాంగ్రెసు కార్యకర్తలీ సభావిజయమున కయ్యెడ నెంతయుం బెనఁగిరి - పదంపడి గుంటూరు మండలసభ తల్లాప్రగడ విశ్వసుందరమ్మ యాజమాన్యమున నఱువండ్రు ప్రతినిధులతో నేఁబదినిముసములపాటు తెనాలి పురమున గాంధిచతుష్పథమున నెగ్గుట విస్మరింపరాని యుదంతము - ఆసమావేశమునఁ బోలీసుల లాటీదెబ్బల సరకుసేయక శాసనోల్లంఘన నిర్ణయములు పునరుద్ఘాటన మొనర్చిన అలపర్తి వేంకటసుబ్బయ్య, ఇస్మాయిల్ సాహెబు, రామస్వామిచౌదరి, పార్వతమ్మ ప్రభృతుల కడిమిం గని యధికారులు గ్రమ్మనడిరి - మఱియు నానాఁటి గుంటూరిగాంధిటోపీ చరిత్రయు నద్వితీయము నాఁజెల్లు - బ్రిటిషుపార్లమెంటునం దిది ప్రశంసితమాయె - కార్మపక్ష ప్రముఖుఁడు ఫెన్నరు బ్రాక్వే దీనిం దాల్చి శాసనసభకు రాకతో నిది నిషేధార్హమని మానసించు రచ్చ కన్నువిచ్చె - అయ్యది యట్లుండె. 734

## సాంఘికసమస్యను మహాత్ముఁ డెదుర్కొనుట

ఆ. ఆంగ్లమంత్రివర్యుఁ డానాఁడు వలయిత, గోష్ఠిసభ్యు లియ్యకొందురేని
పొసఁగునట్లు సాంఘికసమస్య తేల్చెద, ననెఁగదా మహాత్ముఁ దబ్రపడఁగ. 735

ఆ. కొంత అతనిమాటకుం దలనూఁపిరి, దేశదృష్టిలేని కోశరతులు
మార్గనాల్డు గాంధిమది యలందురునట్లు, సెప్పఁదలఁచె నిందుఁ జెడ్డతీర్పు. 736

క. అదియెఱిఁగి మహాత్ముఁడు తత్, సదమున "హిందువులఁ జీల్చుసన్నాహము నే
నెదిరించెద బెదరక నా, బ్రదు కర్పించెదను దీనఁ బడసెద గెలుపున్. 737

ఆ. అంటరానివార లైన హిందువులకా, వీర లన్యులనుట ఘోరపాప;
మంటరానితనము నణఁగింపఁ గాంగ్రెసు, పూనుకొనియె జయము దీని కొదవు. 738

క. ఏనంబేద్కరువైదుషి, నౌనందును గాని యాతఁ డస్పృశ్యుల ప
క్షానన్ నిలఁబడ నర్హుఁడ, నేనే యని పల్కు టొప్పు; నిది నన్ గలఁచున్. 739

ఆ. అంటరానివారి కందఱకున్ బ్రతి, నిధిని నేను; వీరినిర్ణయంబు
గొనెద రేని నాకు ననుకూలముగ నిది, వచ్చితీరు నన్ను మెచ్చితీరు. 740

ఆ. ఈసమస్తవిశ్వ మేలుపెత్తనము నా, కప్పగింతు మనుచు నండ్రుగాక
యంటరానివారిహక్కుల నేఁ ద్రోసి, వేయఁజాల నలఁతిసేయఁజాల. 741

ఆ. అంటరానివార లన్యమతమ్ముల, కిష్టపడిన నది సహింతుఁగాని
యూరనూర రెండుదారులై హైందవుల్, కాఁపురించు టేను సైఁపఁజాల. 742

గీ. అంటరానితనం బిట్ల యుంటకంటె, నామరూపము లణఁగి హిందూమతంబు
సమయుటే మంచి దనెడిసంస్మర్తలిపుడు, కలరు తన్మతమం" దని పలుకరించె. 743
(13-11-31)

క. ఈపల్కు లీప్రతిజ్ఞలు, బాపూజీ నిలువరింప వలసినసమయం
బాపాదిల్లెను దేశికుఁ, డీ పనికిన్ సిద్ధపడియె నెరవాడచెఱన్. 744

వ. అయ్యెడ నాంగ్లప్రభుత్వము నియమించిన లోథియన్‌వర్గము భారతదేశమున కేతెంచి సమ్మతిస్వత్వ (ఓటుహక్కు) మెట్టివారి కీయవలయు, నాయాశాసనసభల నియోజక వర్గస్థానము లెట్లు నిర్ణీతములు కావలయు ననుచర్చలు సాగింపఁదొడఁగె - అనతి కాలమున దీని నివేదనము సిద్ధమగు-ఇతరులు మీనమేషముల లెక్కించుచుండ నాంగ్లే యులు మెల్లగాఁ దమపని దిద్దుకొందురు-కాన నీగు ట్టైతింగిన మహాత్ముఁడు లండనులో నున్న భారతదేశ కార్యదర్శి సామ్యూలుహోరున కిట్లు లేఖవ్రాసె.(11-3-32) 745

## బాపూ భారతకార్యదర్శికి లేఖ వ్రాయుట

ఆ. "దొరతనమ్మువారు సరగ సాంఘికసమ, స్యను బరిష్కరింతు రనెడివార్త
నెఱిఁగినాఁడ నాకు నిపు డధికారు లొ, సంగు పత్రికలను జదివినంత. 746

గీ. నిమ్న జాతులవారి నెన్నికల వేఱు, సేయుచుం దీర్పు వచ్చుచో జీవితమ్ము
ధారవోసెద నంటి నద్దాని మార్ప, నఖిలపక్షసభాసదస్యత వహించి. 747

క. ఐనను మీప్రభుతకు నా, మానసమున్ మొదటఁ దెల్పి మఱి కర్తవ్యం
బే నూహించుట ధర్మువు, కాన మదీయములఁ గోరికల నిట వినుతున్. 748

గీ. ఏనుసైత మస్పృశ్యుఁడనే యటన్న, నమ్మకముతోడ వ్రాయుచున్నాఁడఁ గమ్మ
నన్యసంఘములకును నాయంటరాని, తెగలకుం గల దన్న ! యెం తేని వేర్మి. 749

గీ. విద్య లేకున్న సంపద వెలితి యున్న, నెన్నికలయందు సమ్మతి నిచ్చుచనవు
కావలయు దీని, కిదిలెస్స; కాని దీని, తానముల వింగడించుట తగదు తగదు. 750

ఆ. వింగడింతురేని విపరీతదశల హిం, దూమతమ్ము వారు తూలవలయు
నిది భరింపఁజాల నేను సంస్కృతికంటెఁ, బెద్ద కాదు రాచపేర్మినాకు. 751

ఆ. పిన్ననాఁటినుండి ప్రియపడి యస్పృశ్య, జాతివారిసేవ సల్పినాఁడ
నప్పుడపుడు వీరి కర్పించినాఁడ నా, కలిమినెల్ల మేనిబలిమినెల్ల. 752

గీ. మఱవకుండురయేని యీమాట మీరు, కానఁగలరు నాగగ్గోలుకారణంబు
నిది యహంకృతితో వచియించునట్టి, పలుకుగాదు సత్యముఁ జూచి తెలుపునుదువు. 753

ఆ. వేలకొలది వత్సరాలనుండియు నంట, రానితనము దుర్భరము సహోద
రులకు నంటఁగట్టి కులుకుహిందువులపా, పము తొలంగఁ బాచితములు లేవు. 754

గీ. రాజకీయముగా నంటరానివారిఁ, జేలఁదీయుట తగినపాచితము గాదు
నిమ్నజాతీయులు భరించు నీచదశకు, నిది ప్రతిక్రియ గాదు మేలెంచి కనిన. 755

ఆ. కాన నంటరానివానిఁ దాదృక్షులే, యెన్నుకొనుట వలయు నన్న తీర్పు
పుట్టునేని యేను గిట్టుదనుక బువ్వ, ముట్టనయ్య! దీక్ష నెట్టనయ్య! 756

ఆ. అగునుగాని బంది కఁనఁగిన నే నిట్టి, దారుణవ్రతమ్ము దాల్చినపుడు
దొరతనమ్మువారి కిఱుకట మౌ నని, కందుచుంటి భీతి నందుచుంటి. 757

క. పై పెచ్చు కొండఱకు నా, యీపురుషార్థము వివేకహీనునికృతిగా
రాపనులకుఁ దగనిదిగాఁ, దోఁపంగల దని యెఱుంగుదున్ బ్రియమిత్రా! 758

గీ. ఈతెఱంగు నామనుగడ నేక దేశ, మగును గాని క్రొంగ్రొ త్తపన్నుగడ కాదు
కదఁగు మని యంతరాత్మ ప్రేచెడిని నన్ను, నెవ్వ రేమన్న దీని నే నెదురఁజాల. 759

ఆ. నన్ను బందిగమ్మునకు వెలివానిఁగా, వించినను మదీయవిధిని మాన;
మీర లంతదనుకఁ దేరు న న్నని ధర్ము, వరసి తీర్పు నిత్తు రని తలంతు. 760

క. ఇదిగాక రే పవలు నా, యెద కలుగై సిలుగుగూర్చు నిమ్మహి నీనాఁ
దదవదమైన ప్రభుత; నా, బ్రదు కెపుడో దీనికొఱకు బలికావచ్చున్. 761

గీ. దేశభక్తుల నిచట బంధించుతీరు, దారుణం బాసురం; బధికారు లెంత
యవగద మొనర్తురో వారి కంత మెప్పు, పంచుచున్నది యేల్బడి పాప మనక. 762

క. అణఁగెను వాక్ స్వాతంత్ర్యము, మణఁగెఁ బ్రజాసేవసేయు మానినిపరు వే
చె నిరంకుశశాసనచయ, మెనలేనివిధాన దౌష్ట్య మెసరేఁగె నయా! 763

ఆ. వలదు బానిసమ్మువల దని లేచిన, ప్రాణి నతలమునకుఁ బంపఁ దెగిరి
రాచవారు; ప్రజలరాజ్యమా యిది ఖడ్గ, రాజ్యమా? భరింపరాదు దీని. 764

క. మనరెండు తెగల కింతకు, మునుపే పొర పొదవి నెయ్యము కదున్ సడలెన్
దినదిన మిట నీరక్కెస, తన మెసఁగిన వేఱదమ్ము తఱచై నొంచున్. 765

గీ. శాసనోల్లంఘనమునకు స్వస్తిచెప్పి, పాలకులగౌరవంబు నేఁ బడయనొల్లఁ
దదవులంబట్టి నా కిది ధర్మ వగుచు, నరనరమ్మునఁ బ్రాఁకియున్న దిగదయ్య! 766

క. ఏను బ్రజాస్వామ్యము నభి, మానించెడివాఁడఁ గాన మద్వాంఛలకై
పూనను సాయుధవిప్లవ, మేనాఁడును బశుబలంబు నెసకొల్పఁ జుమీ! 767

ఆ. పశుబలంబు నణఁచుబలిమి సత్యాగ్రహ, ధర్మమునకుఁ గలదు దాని కిష్ట
పడినవాఁ డొకొక్క యెడఁ జచ్చునందాఁక, నౌపవాస్యభరము సైఁపవలయు. 768

క. ఈవ్రేఁగు సైఁచులగ్నము, రావలె నని కోరఁ గాని రాచతికము నేఁ
దావిష్కరించునాజ్ఞలు, కావించెడిపనులు నన్నుఁ గదలించుఁ గడున్. 769

గీ. నిమ్నజాతిసమస్యకై నిట్రుపాస, మవధరించెద ననెడినే నట్టిదీక్ష
నధికృతులదౌష్ట్యములపట్ల నవధరింతు, ననియు మీకెఱిఁగించు టొప్పని తలంతు."770

వ. ఈపత్రమునకు హోరిట్లు మాఱుపల్కె. (13-4-32) 771

గీ. "నెచ్చెలీ! గాంధి! మీకమ్మ వచ్చె మీకు, నిమ్నజాతులదెసఁ గలనెమ్మి గంటి
రాజకీయముగా నంటరానివారి, వేర్పఱుప నొల్ల నన్నమీతీర్పు గంటి. 772

ఆ. ఈసమస్యపట్ల నే మౌచితియ కాక, సరకుసేయ మన్యసరణి యెదియు
దీనిమేలు కీడు తెలియ భారతభూమి, కరుగుదెంచె లోధియనుగణంబు. 773

క. అది యిచ్చుసూచనల కే, మధికంబగు విలువనిచ్చి యరయందగు న
య్యదనన్ మీతలఁపులపై, మది నిడుటయుఁ గృత్యమగును మాకు వయస్యా! 774

క. వాదము లన్నియుఁ దదవిన, మీఁదట నొకనిర్ణయంబు మెయికొందుము మీ
రే దీనికి సమకట్టిన, నీదారిన నిర్గమింప నీకొండ్రుకదా! 775

గీ. ఇఁక నసామాన్యశాసనసృష్టిఁ గూర్చి, యించుక వచింతు నెయ్యెడనేని ధర్మ
బద్ధముగ సాగునేల్బడిపాదు పెల్ల, గించుపనికిఁ బాలితు లుద్యమించినపుడు - 776

క. ఎక్కటిచట్ట మొనర్చుట, యక్కఱ యగునని తలంతు నైనను దమకున్
దక్కిన యధికారముతోఁ, జక్కటికిం దొలఁగి ప్రజలచనవు లధికృతుల్ - 777

గీ. సాగనీయక దూషితాచారములకు, నిష్టపడి రన్నచో నమ్మ నిట్టిమాట
యటనటం బ్రజ కావించునాగదముల, నణఁచుటకె కష్టపడిరి వా రని తలంతు. 778

ఆ. దొరతనమ్ముకారిపరువు కాపాడుట, కెన్నినాళ్ళు వలయు నన్నినాళ్ళె
సాగు నవనియం దసామాన్యమగు శిష్టి, నిలువ దవల నొక్కనిమిషమైన." 779

## సాంఘిక సమస్యా పరిష్కారము - మహాత్ముని యసమ్మతి

వ. ఈప్రత్యుత్తరము నవలోకించిన మహాత్ముఁడు క్షుభితహృదయుఁడై యెరవాడచెఱ నుండ నాంగ్ల ప్రభుత్వమువారు సాంఘికసమస్యా పరిష్కృతిపట్ల నొకసాధికార ప్రకటన మొన ర్చిరి (17-8-32) - దానింబట్టి నిమ్నజాతులవారు సామాన్యనియోజకవర్గములం దమసమ్మతి నీయవచ్చు-అభ్యర్థులుగా నిలువవచ్చు-మఱియుం గొన్ని ప్రత్యేక స్థానముల నిర్విదియేండ్లవఱకు వీ రనుభవింపవచ్చు-వీనియెన్నికలలో నంతరానివార నియోజకు లుగా నుండవలయు - ఈ నిర్ణయము దుర్నయము - కాని నిమ్నజాతి వారికి సాధారణ నియోజకవర్గములతోడిపొత్తుసైత మేర్పఱిచి యాతీర్పునందలి కుట్ర నాంగ్లేయు లపావృత మొనర్చి దీని నొకగోముఖ వ్యాఘ్రముఁగా సృష్టించిరి - లోకజ్ఞ శేఖరుఁడగు బాపూ దీనిగుట్టెఱింగి ప్రధానమంత్రి మాగ్డనాల్డున కిట్లు లేఖవ్రాసె. (18-8-32) 780

గీ. "నెచ్చెలీ! యింతకున్మున్ను నేను భార, తావనీకార్యదర్శికి నంటరాని
తెగలరాచ తెఱంగుపై దీర్ఘలేఖ, పంచితిని దాని మీరు నీక్షించియుంద్రు. 781

ఆ. ఇప్పు దదియుఁ జదువుఁ డీకమ్మవెంట; సాం, ఘికసమస్య మీర లొకవిధానఁ
దేల్చి దేశమునకుఁ దెల్పితి; రాతీర్పు, వలన వ్రాయవలసివచ్చె దీని. 782

క. మదిమదితో నొకసారికిఁ బదిసారులు మీరు సిద్ధపఱిచినతీర్పుం
జదివితి ధర్మువునకు న, య్యది దవ్వుగనుంటఁ బెద్దయలమట గంటిన్. 783

గీ. అఖిలపక్షమహాసభ నపుడు పెద్ద, లల్పసంఖ్యాకులసమస్య లరయు వేళ
నాయభిప్రాయములను గన్నారు మీరు, నాయొనర్చినప్రతిన విన్నారు మీరు. 784

గీ. ఆ ప్రతిజ్ఞను బాటించి యైదునెలల, నాఁడు భారతమంత్రికి నాలిఖించు
పత్రమునుబట్టి యిపుడుమత్ ప్రాణమొడ్డి, మార్పవలయును మీతీర్పుమంత్రిమౌళి!785

ఆ. ధర్మ మెఱిఁగి మీరు దారికివచ్చి మా, యిచ్చదీర్చి తృప్తి నిచ్చు దనుక
నీ రొకండుతక్క వేఱెద్దియుం దాఁక, కుందు మరణదీక్ష నుద్వహించి. 786

ఆ. కదు నలంగుచుంటిఁ గరినవ్రతమ్మున, కీయకొనుట వలసెనే యటంచు
వేఱుదారి కానిపింపదు ధర్మాను, గంతనైన నాకు నింతకంటె. 787

ఆ. నను విముక్తుఁ జేసినను జేయవచ్చు మీ, రప్పుడైన నాఁగ దొపవస్త
మిపుడు మిమ్ము నెదుర నిదియ సాధనమని, యాడఁదొడఁగె నన్మదంతరాత్మ. 788

వ. ఈ ప స్తాగామిమాసమున వింశదినమునం బ్రారంభమగు. 789

క. ఏ నీపనిఁ బొరపడుచోఁ, బూనినకార్యములనెల్లఁ బొరపడినట్లే
యౌ; నపు డీయుపవాసము, నానేరమికెల్ల దండనముగాఁ జెల్లున్. 790

ఆ. మఱియు నన్ను నమ్మి చిఱుతలవలె సదా, కలసివచ్చు కోట్లకొలఁది ప్రజలు
గోతఁబడక మేలుకొన్న వారయ్యెద, రేను దస్తుపూని మేను విడువ. 791

ఆ. అట్లుగాక మామకాశయ మనవద్య, మగునయేని యిమ్మహావ్రతంబు
తనరు నేనుమెచ్చు ధర్మమునకు యోగ్య, వికసనమ్ముగా నవిద్ధమగుచు.” 792

వ. దీనింగన్న రామ్సేమాగ్దనాల్డు మహాత్మునకిట్లు ప్రత్యుత్తరమువ్రాసె. (8-9-32) 793

## మాగ్దనాల్డు తన తీర్పును సమర్థించుట

ఆ. అన్న! గాంధి! మీర లంపినలేఖ, నా, కద్భుతమ్ము గూర్చె నార్తిఁ జేర్చె
మాతలంపులోనిమంచిని గనక మీ, రది శిక్షించియుండు రని తలంతు. 794

వ. హిందూసమాజమునకు దప్పుగా నెల్లకాల మస్పృశ్యుల నునుచుట మీ కిష్టము గామి
యే మెఱుంగుదుము - మాతలంపు సర్వహిందూజనసమ్మతం బనియు మాకుఁ దెలియు
- అగుటంజేసియ నిమ్న జాతిసమస్యం బరిష్కరించుతఱి మీయాశయ మెం తేనిదీక్షతోఁ
బరికించితిమి - అస్పృశ్యసంఘములవా రంపినమనవులం ద్రచ్చితిమి - వారియవస్థ
మీ కవగతంబ - వారికి శాసనసభలం దగినగౌరవ మొసఁగి పెంపుసేఁత మాకర్తవ్య
మని నమ్మితిమి - మఱియు 795

ఆ. అంటరానివారు హైందవజాతికి, దప్పుగా మెలంగఁదగిన సూత్ర
మెదియుఁ గూర్చు టొప్ప, దది మిమ్ముఁ గారించు, నని తలంచినార మన్ని యెడల.796

గీ. నేఁడు మావెల్వరించిన నియతిఁబట్టి, మాల లుందురు హిందూసమాజమందె
యగ్రకులములవారలయట్ల వీర, లనుభవించెద రెన్నికహక్కు లెల్ల. 797

గీ. ఇట్టి లుండియు నిర్వదియేండ్లదనుక, నందుదురు కొన్ని ప్రత్యేకమగుపదంబు;
లిపుడు వా రున్న దుస్థితి కీవిధాన, ముచితమౌనని యేల్పడి యూహచేసె. 798

గీ. హిందువులు వీరు నుమ్మడియెన్నికలను, సరిసమానులుగా నుంద్రు చనవులందుఁ;
బెద్ద తెగలవారయ్యెదఁ జిన్న తెగల, నెమ్మి నార్జింపవలయు నెన్నికలపట్ల. 799

ఆ. చదురు లున్నమాల సామాన్యహైందవ, స్థాన మాసచేయఁదగును గాన
నాతఁడపుడు కోరు టక్కఱయగు నగ్ర, వర్ణజనితు లైన వారి కూర్మి. 800

క. ఇతరేతర సౌహార్దము, జతపడినపు డుభయవర్గజయ మేర్పడు నం
చతిమాత్రం బరసి పరి, ష్కృతి యిది కావింప మీరు కినిసెదరేలా. 801

ఆ. మొదట నధికసంఖ్యముగ నున్నవర్గమే, పదయు జయము నూత్న పాలనమున
వర్గ మిది యదంప వందురుచున్నది, యల్పసంఖ్య మైనయట్టిజనత. 802

క. ఈదిక్కులేని ప్రజ - యీ, నాదారుజనమ్ము తనవనట దెల్పంగా
నేది యింక మార్గ మెక్కటి, పొదులు లేకున్నఁ ? బాడి పరికింపుఁ డిటన్. 803

క. హిందువులగువా రందఱు, కొంద ఱదుగువారి నెన్నుకొనవలె ననుతీ
ర్పుం దీర్చిన నపు డేమగు, నిందక పైవారిదాసులే గెల్తురుగా! 804

గీ. ఏమి నిమ్నజాతీయుల కిడినహక్కు, లీయలేదు ముస్లిములకు, నితరులకును
దగరు వారలు హైందవస్థానములకుఁ, దగుదు రస్పృశ్యు; లిది మీరు దెచ్చినారె? 805

గీ. ఇతరమతములవారి కిన్నిన్నిపీఁట, లంటి; మాలెక్క మించి యొందయినఁ బదయఁ
దగరువా; రిట్టియాంక్ష యీ తాఁకరాని, ప్రజలకుంగలదా? తేటి నిజముగనుఁడు. 806

ఆ. వీరిమంచి చెడ్డ వివరింప నల్గురు, వచ్చు వీలు గన్నవార మేము
దీని కోర్వలేక యీనిరశనదీక్ష, నడుప నిశ్చయించినారు మీరు. 807

క. ఇది యస్పృశ్యప్రజక, భ్యుదయాపాదకమె? యస్మదూహమ్ము విపత్
ప్రదమె ? యగుఁగాక యిప్పటి, ముదలను సవరింపఁజాలము భవద్దీక్షన్. 808

గీ. అణఁగఁద్రొక్కఁబడినజను లిష్టపడి మమ్ముఁ, గోరినపుడె దీన మాఱు పొదవు
మఱల వలతు మిమ్ము మాతీర్పు మీతీర్పు, నరసి తగినదారి కరుగుఁడనుచు. 809

వ. మహాత్ముఁ డీమాటల కిట్లు మాఱాడె. (9-9-32) 810

## మార్గనాల్డునకు బాపూ సమాధానము

గీ. "అన్న! యఱమరలేక మీ రన్నిదెసలు, పొఱఁజూచి నాకమ్మకు బదులువ్రాఁత
మెచ్చఁదగుచేఁత; యైనను మీరు నాదు, పస్తునకుఁ జెప్పినకతంబు కస్తి గూర్చు. 811

ఆ. ఎవరిమేలు చెఱుప నే నిల్లికిం బూని, నాఁడ నని వచించినారొ మీరు
వారి కేన ప్రతిభువ నటంచు నిన్నాళ్లు, నుదువుచున్నవాఁడ జదుపులేక. 812

గీ. అతికఠోర మీనిరశనవ్రతము నన్నుఁ, బతితమానవహితునిగా క్షితికిఁ జాటు
నని తలంచితిఁగాని తజ్జనకు భాస, హిష్టుఁగాఁ దెల్పునని యెన్నఁ డెంచనైతి. 813

క. కానిం దెవ రెట్లాడిన, మానను మద్వ్రతము; మాలమాదిగలకు మే
లీనేరదు మీకట్టడ, నానామార్గములఁ దరిచినాఁడను దీనిన్. 814

గీ. రెండు తావుల సమ్మతు లుండుఁగాక, యేమియొఱగు నస్పృశ్యుల కింతమాత్ర?
నదిర! హిందూసమాజము నిది కలంచి, చీలఁదీయు నధోగతిఁ గూలఁద్రోయు. 815

ఆ. అంటరానివారి కొంటరిపీఁటల, నిడుట హిందువులకు నెగ్గుసేఁత
యిడి విషప్రయోగ మిది వారి కెనలేని, చేటుఁగూర్చు భంగపాటుఁ జేర్చు. 816

ఆ. ఒక మతమ్మునంద యొదిఁగి జీవించెడి, రెండు తెగలవారి కుందుచిక్కు
చక్కఁబఱుప మీరుచాలరు మీ కెంత, ధర్మనిరతి యున్నఁ జేర్మి యున్న. 817

గీ. నిమ్నజాతీయులకు మీరు నేఁటికంటె, హెచ్చుగాఁ ఓఁట లిందు నే నెదురుసెప్ప
హిందువులుగా మెలంగుట కిష్టపడిన, దనుక వారిని విడఁదీయఁదగదు తగదు. 818

క. మీతీరుపు నేఁ డుండిన, రీతిఁ బ్రయుక్తంబయైన రేయుం బవ లీ
భూతలమున నణఁపఁబడిన, జాతులను సముద్ధరింప సర్వశ్రమముల్ - 819

ఆ. సైఁచినట్టి సంఘసంస్కర్తలకు రామ, మోహనాది పుణ్యమూర్తులకు న
పారమగు నవజ్ఞ మీ రంటఁగట్టిన, వార లగుదు రెఱుఁగవలయు దీని. 820

ఆ. ఇంత యింతనాఁడె హిందూసమాజమున్, దిద్దుకోర్కి నామదిన్ జనింప
నంటరానివారి కాప్తుఁడనై శక్తి, కొలది నూడిగమ్ము సలుపుచుంటి. 821

క. ఈసేవారతిమైనుప, వాసము పూనెదను గాని వారిపెనుపుపై
నీ సొదవి పూన; మీ రిటఁ, జేసినతర్కమును బెద్దసేయఁగఁ జాలన్. 822

క. అన్నా! మీయుత్తరమున, నెన్నోదోసంబు లుండ నే నం దొకదా
న న్నెఱయుదొసఁగులే వా, కొన్నాఁదను సూనృతానుకూ లాధ్వమునన్. 823

ఆ. పతితజనసమస్యపట్ల ననున్ బ్రేచు, గతి మదంతరాత్మ యితర నిర్ణ
యములపట్లఁ బ్రేవ దని పల్కుచు ముగించు, చున్నవాఁడ నేతదుత్తరంబు." 824

వ. మాగ్డనాల్డున కిట్లు వ్రాసి మహాత్ముఁడు ప్రాయోపవేశమునకుఁ గడంగుతఱి బొంబాయి రాష్ట్రపాలకునకుసైత మొక లేఖ నంపుట సముచితమని దానినిమ్మోయి రచించె. (15-9-32) 825

ఆ. "ఏను దాల్పనున్న యిల్లికి భగవదా, దేశమే కతంబు, దేవునాజ్ఞ
కెదురుసెప్పఁజాల నే; నిది వినయంపు; వ్రేఁగుతోడ విన్నవింతు నయ్య! 826

క. ఈపస్తును గొన్నిదినా, లాఁపుఁ దని మదీయమిత్రు లర్థింతురు; కా
నీ పనుపు మాఱినపుడే, యీపని చాలింప స్వామ్య మేర్పడు నాకున్. 827

ఆ. ఏమతమ్మువార లేజాతివారైన, నన్ను విశ్వసించుచున్నవారి
బుద్ధి మార్ప దీనిఁ బూనెద నాంగ్లాధి, కృతులఁగూర్చి కాద! యీతపమ్ము. 828

గీ. ముఖ్యముగ హిందువులదెందమునకు వెట్ట, దెచ్చి వారిని ధర్మువుదెసకు నడుప
నీకఠోరవ్రతమ్మున కియ్యకొంటి, రిత్తసివ మొదవింప సైరింప దీని. 829

ఆ. భగవదిచ్ఛ లేక జగమున నొకపోఁచ, యైనఁ గదలనేర దని మనీషి
మణులు వక్కణించుమాటను సర్వదా, విశ్వసింతు శంకవిడిచి యేను. 830

ఆ. లోకసేవకొఱకు నాకాయ మింకను, వలయునేని ప్రాణములను దీన
నిలుపు పేల్పు; వానితలఁపు వేఱైననాఁ, దెవఁడు కాచుఁ దనువు నీల్గకుండ? 831

ఆ. అంటరానివారి కగ్రవర్ణజులకుఁ, జుట్టతికము నొక్కచోటఁ జూపి
యెరవు నొక్కచోట నిఱికిరి పాలలో, హాలహలము గలిపి రేలువారు. 832

గీ. అగ్రకులములవారికి నంటరాని, వారి కియ్యెడ నొకసంధి కూరునేని
పూఁతపట్టీపగిది నది పుట్టరాదు, పుండు నణఁగించుమందుగాఁ బొదమవలయు. 833

గీ. వచ్చినయొదంబడిక రెండువర్గములకు, శుభము నీవలె నన్నచో సూనృతాను
విద్ధమై యుంట వలయు నిట్లిద్ధమైన, సంధియే సార్వ కాలికసఖ్య మొసఁగు. 834

క. ఇప్పటికే సస్పృశ్యత, తప్పక సంహృతియొనర్పఁదగుపాప మటం
చొప్పనిచో హైందవు; లీ, తప్పునకున్ బలిగ నొసఁగెదను మత్తనువున్. 835

క. ఉమ్మడియెన్నిక తమకు న, సమ్మత మని నిమ్నజాతిజను లాడినచో
నుమ్మలికపడక కినియక, కిమ్మన కొరు లుంట వలయుఁ గృతమతు లగుచున్. 836

ఆ. వలసినంతహక్కు గలదు గాంధిని నమ్మ, రా దనంగ మాలమాదిగలకు
నకట! నేను వారి నణఁచినగుంపులో, నెదిగినట్టివాఁడనే కదయ్య! 837

గీ. ఇంతపాడిపాడిగా రాచి యింతనీచ, దశకుఁ దెచ్చిన నద్దిరా! తాఁకరాని
ప్రజలు హిందూసమాజమున్ బాయకుంట, యద్భుతమ్ముల నద్భుత మనితలంతు. 838

గీ. అగునుగాక వీరిసమస్య నరయుపట్ల, నేలుబడివారు పెడదారి కేగినారు
మాలలను జీల్చి హైందవమతమునకు స, దాతనకళంకము ఘటింపఁ దలఁచినారు. 839

క. ఈవేఱిమి యస్పృశ్యుల, హావడి నణఁగించునేని యాత్మల హర్ష
శ్రీ పెంచునేని విముఖత, నావిష్కృతిసేయ దీని కణుమాత్రంబున్. 840

ఆ. పైకులాలవారిపనులు సేయుచు వారి, చెంత మాల లధివసించుకతన
నెదయరానిబంధ మేర్పడెనుభయుల, బ్రదుకులకును; వీనిఁ బాపుటెట్లు? 841

వ. హిందూ సమష్టికుటుంబమున నస్పృశ్యులుం బాలివాండ్ర - వీరు నేఁడీలంబిని గాదని వేఱుకాఁపురముపెట్టుట పొసఁగదు - తగదు - కానఁ బ్రాణములం గాన్క వెట్టియైన నీవిభాగము నెదుర్కొంట నాపాడియని విశ్వసించితి - మఱియు 842

ఆ. అంటరానితనము నణఁగించి మాలకు, మేలుగూర్చ నన్నుఁబోలెఁ ద్వణము
పగిది జీవితమ్ము బలివెట్టుసంస్కర్త, లీధరిత్రి నెందఱేని గలరు. 843

క. పాపముల నణఁప నెఱుకను, బ్రాపింప నుపాసముంట బహుమతములలోఁ
జూపట్టుధర్మ; విడి నక, లాపదలం బాఱఁదోలునస్త్రము నాకున్. 844

క. కల దుపవాసము నలుపం, గలయధికారమ్ము నాకుఁ; గష్టము లెన్నో
తలఁదాల్చి బడలి పడసిన, బల మిది, తచ్ఛాస్త్ర మేరుపదె మత్కృతమై. 845

క. నాపట్ల సానుభూతిం, జూపఁదలఁచి హక్కు లేనినుహృదులు పస్తుం
జేపట్టవలదు; సేవన్, బ్రాపింతురుగాక వారు పాత్రత నరగన్. 846

ఆ. అంటరానివారి యభ్యుదయమునకై, కలుచలేని యూదిగం బొనర్చి
నిలిచినట్టివారు నిరశనవ్రతమును, బూనవచ్చు నదను పొసఁగినపుడు. 847

క. ఇది నానిర్మలహృది నన్, గదలించుటఁ దొడఁగుపస్తు గాని యొకనిపైఁ
గదిరినకిన్కకు లోపడి, మొదలిడునది కాదు నిక్కమును వివరింతున్. 848

వ. నాబుద్ధి కిది యహింసాప్రకటనము - వెండియు, నహింసనవ్రతరక్షకుఁ బరమోపాయము - నాయీనిర్ణయముం దెగడువారితీ రోర్వలేక వాదోపవాదములుపెంచి దుందగము లకుఁ దెగించుప్రజలు నాచావుం ద్వరపెట్టినవారగుదురు - నాగెలుపుంగోరువారికి సంపూర్ణ సౌజన్యమువలయు." 849

ఆ. కమ్మనిట్లు వ్రాసి గాంధిమహాత్ముఁడు, వార్చియుండె నొపవస్తమునకు
నెల్ల లేనియిల్లి యిది యౌట నొజ్జ యే, మగునొ యని ప్రపంచ మారటించె. 850

గీ. నేలనాలుగు చెఱఁగులనిలుచగుబవ, 'లాఁపవె! మహాత్మ! యుపవాస' మనుచుఁబనుచు
తంతి వార్తలు దూఁకె నిరంతరముగఁ, బూరుషోత్తముచెఱ యున్న పుణ్యపురికి. 851

ఆ. ముఖ్యమంత్రిసేయుముదల మాఱకయున్న, నాఁపుటెట్లు గాంధి యౌపవాస్య;
మెల్లవారిగుండె తల్లడపడుచుండ, బాపుపాలఁబడియెఁ బస్తుగడియ. 852

(20-9-32 అపరాహ్ణము 12-30)

## మహాత్ముని యెల్లలేని యిల్లి

క. భగవత్ప్రార్థనతో శాం, త గభీరమనమ్ముతో నుదాత్తచరిత్రుం
దగపడె మహాత్ముఁ డిల్లికిఁ, దెగనీల్గెడిరాచవారి దిద్దెదుపనికిన్. 853

ఆ. అదిర! దీనబంధు వాండ్రూసు, పోలక్కు, లాన్సుబరియు నాంగలమునప్రజకు
గాంధి తెఱఁగు తెల్లగావించి తత్సాను, భూతికై శ్రమించి రాతతముగ. 854

ఆ. బాపుజయము కోరి ప్రార్థనల్ సేయుఁడీ, యతఁడు సర్వమానవాప్తమిత్రుఁ
డనఘుఁ డని ప్రసిద్ధులగు పెద్ద లానేల, ప్రజలఁ గోరి రపుడు ప్రకటనమున. 855

గీ. భారతక్షోణి నాప్రొద్దు ప్రార్థనోప, వాసడిన మాయె నెల్ల దేవళములందుఁ
గదలె "రఘుపతి! రాఘవ!" గానరవము, పూనె నూరూరఁబస్తు బాపూజనమ్ము. 856

వ. నాఁటిసాయంవేళ నధికారులయనుమతిం బడసి పత్రికా ప్రతినిధులు కొందఱు మహా
త్ముం గని యాద్యైప్రశ్నములు వెదలింప బాపూ వాని కిట్లుత్తరము లిచ్చె. 857

ఆ. "అస్మదీయమైనయాశ యణంచుట, కలవిగాని; దీశ్వరానుకంప
యొదవునేని నేఁటియుపవాస ముసు రుద్ధ, మించుదనుక సాగ దంచుఁ దలఁతు. 858

క. నాతోపా టుపవాసము, చేఁతకుఁ బ్రజ లచటనచట సిద్ధపడుట మత్
ప్రీతికి హేతువు కాదు వి, నీతుఁడనై మహికి దీనినిన్ వినిపింతున్. 859

గీ. మేరమీఱిన యీశ్వరప్రేరణమున, మస్తమునఁ దాల్చినాఁడ భీష్మవ్రతమ్ము
నన్ను లీహెచ్చరిక వచ్చినపుడుతక్క, రిత్తతత్తఱ దీని భరింపరాదు. 860

ఆ. సానుభూతికొందె మానసపరిశుద్ధి, కొందె నెవ్వరైన నొక్కనాఁడు
కూడుదినుట మానుకొనవచ్చుఁగాని నా, తెగువ కెల్లవారు తగరు తగరు. 861

గీ. నిమ్నజాతులవారి కెన్నికలనెన్ని, పీఁటలిచ్చిన నే నద్దుమాటసెప్పఁ
గాని వారికి వేర్వేఱుగద్దె లిడుట, సమ్మతింపఁగఁజాల దుస్తంత్ర మగుట. 862

క. ప్రత్యేకపీఠములతో, జాత్యున్నతి వొడమ; దిట్టిసరణిని గిడే
యత్యర్థముగా నేర్పదు, మత్యంచితు లొప్పుకొంద్రు మద్వాదంబున్. 863

గీ. ఆలుఅప్పలు పేర్చి తద్రాశిమీఁద, నిలిచి యున్నతిగన్నాఁడ నే నటంచుఁ
బలుకువాఁడు వెదంగు, దుర్బలత కాక, పాటవము వచ్చునా వానిపన్నకమున. 864

ఆ. అంటరానివారియందును వందల, కొలఁదిఁ గలవు తెగలు; కొన్ని కొన్ని
తెగలవారు కొంతతీరిరె కాని వా, రెంతమంది? నూటి కేవురుంద్రు. 865

క. తక్కిన తొంబదియేవుర, పెక్కువకై సర్వదా తపించెద నే; నీ
యిక్కట్లుఁ గుండువారికి, దిక్కు సెడినవారికిన్ బ్రతినిధి నటందున్. 866

గీ. దీనతామగ్నులైన యీ మానవులను, గేరళమున నోధ్రమున వీక్షించినాఁడ
నంటరానితనమ్ము గా కకట? చెప్ప, రానితనమును గలదు వీరలకు నందు. 867

గీ. అగ్రకులములవారు తీయమ్మునూపి, దిద్దితీర్చినఁ గాక ప్రత్యేకపీఠు
లిచ్చినకతాన వీరికి వచ్చుమేలు, లేదు మెఱవడియును లేదు లేశమేని. 868

గీ. ఏలువారు వేర్వేఱుగా మాలవారి, కొసఁగుపీఁటలఁ దీసివేయుట పాసంగ
మదుపవాసము నాఁపివై చెదను గాని, యిల్లి సఫలం బని తలంప నింతమాత్ర. 869

ఆ. అంటరానితనము నామూలముగఁ బెక, లింప దేశ మగ్గలించినపుడె
నాతపమ్ము పండినది యని నా పుట్టు, ధన్యమైన దనియుఁ దలఁతు నేను. 870

గీ. ఈమహాసంస్కరణమునకే ధరిత్రి, నిలిచియున్నాఁడ నేను; దీనికి మదీయ
సోదరులు పూనుదురుగాక వాదులాట, మానుదురుగాక వేవేగ మనసుకరఁగి. 871

గీ. వారివీరిశరీరముల్ వట్టివట్టి, కౌఁగిలింతల నలఁగుట కా దయమ్ము
వారివీరిమనస్సులు వదలరాని, హార్దమున కగ్గపడుటె మేలైనచేఁత. 872

గీ. ఈమహాభాగ్య మీయైక్య మేరుపడుట, యెప్పుడా యని యేఁబదియేండ్లనుండి
కలవరించెద నేను నేఁ దలవరించు, దారుణవ్రత మీసిద్ధి గూరుకొఱకె. 873

ఆ. మార్గనాల్గుతీర్పు మది కొకగాలమై, కదు నలంచుచున్న కారణమునఁ
బంతగించి చావుబ్రతుకులు తేల్చుకొ, నంగవలసివచ్చె నాకు నిపుడు. 874

ఆ. ఇట్టిరాచ తెగులుగుట్టుమట్టు లెఱుంగఁ, బెద్దపేరుగన్న వెజ్జ నగుట
గుణము నాకళించుకొంటి నప్పటికష్ట, వాడఁదగిన మందుజాడ గంటి. 875

ఆ. ఎన్నికలనువేర్మి మన్నాయెునర్చుచోఁ, దెగులు మరలినట్లు యగును గాని
యంటు వదల; దీరహస్యమ్ము గానక, వేగిరింపరాదు పెద్దవారు, 876

ఆ. ఉసురు నాది నిల్ప మసిపూసి మారేదు, కాయచేసి మరల గాఢనిద్ర
కొగ్గరాదు పెద్ద; లున్నక్రుళ్ళంతయుఁ, గడుగవలయు రోఁతపడక విడక. 877

గీ. నేఁడు హిందూసమాజము నిష్కళంక, రూపము వహింపవలయు నిష్పాపమైన
దీనిఁ గని సర్వజాతులలోనిమకిల, వదలవలయు నజ్ఞానమ్ము ప్రిదులవలయు. 878

క. నాసంకల్పము శౌచ, శ్రీసంయుత మైన దుష్టచింత మదాత్మం
బాసిన నిలఁ గలమనుజా, గ్రేసరు లందఱును నన్ను గెలిపింత్రుసుఁడీ! 879

ఆ. సాగితిని మదీయసంకల్పశుద్ధిని, నామతమ్మువారి, నరునిప్రకృతి,
నేలుబడిన నమ్మి యీజన్న మొనరింపఁ, గట్టికొంటి నేఁడు కంకణమ్ము. 880

ఆ. అంటరానితనము నణఁగించుచో మన, సంకటమ్ము లెల్ల సడలఁగలవు
రాజకీయగౌరవౌజస్సుకంటె ధా, ర్మికవికాస ముపకరించుఁ బ్రజకు. 881

ఆ. మనస్వరాజ్యసౌధమునకుఁ బునాదిగా, ధర్మ వుండునేని తరతరాల
దనుక నిల్వఁగలదు తద్భవనం; బిట్టి, మేడ కట్టవలయు నేఁడు ప్రజలు. 882

ఆ. వేలకొలంది వత్సరాలనుండి నెగుళ్ళఁ, బడిన కోట్లకొలంది ప్రజల కిపుడు
తమదిగుళ్ళు తొలఁగుతఱి వచ్చె ననుప్రత్య, యమ్ము గలిగె నిది శుభావహమ్ము.883

గీ. పట్టువిడక యీనమ్మికపై స్వరాజ్య, భవనమును గట్టవలె నేఁడు భారతీయు;
లజ్ఞు లధికారు లొనరించునపకృతుల నె, దుర్పవలయు వారికిఁ దెల్పి నేర్పవలయు.884

గీ. "మజ్జనకుజీవితమునైన మానుకొందుఁ, గాని మాలల నణఁగించు కార్య మొప్ప
నేర" నని సభలో నాకుమాఱుగా వ, చింపు మని నాకుమారుతోఁ జెప్పినాఁడ. 885

క. నామొఱలు దేవదేవుఁడు, కామక విసఁగలఁడు నన్నుఁ గావంగలఁడున్
నామే నింకను గొన్నా, ళ్లీమహి నిలఁగలదు నంచు హృది బోధించున్. 886

ఆ. కలదు నాకు బ్రదుకవలె నన్నకోరిక, కలదు బ్రదుకు నిల్పుబలిమి నీటి;
కుడక మానుచుందు మది కోరినపుడెల్ల, గాసికోర్తు జగము కరఁగువడఁగ." 887

## గాంధియుపవాసముచేఁ బ్రజలు ప్రభుత్వము కన్నువిచ్చుట

వ. బాపూ పూనిననిరుపవాసము దేశమునం దద్భుత పరిణామముల నొదవింపఁ దొడఁగె - ఇది యస్పృశ్యతాకల్మషము నూఁచముట్టుగా ఖండించుమహోద్యమమునకు హేతువై యావద్భారతముం గదల్చె - ఢిల్లీ కలకత్తామున్నగు పట్టణముల నంటరానివారికిం గోవెల లావిష్కృతములాయె - ఇట్టియావిష్కృతి కాటంకముతోఁచిన తావుల నుద్రిక్తులగు యువ లామరణాంతనిరశనవ్రతము నవధరించిరి - భోపాలునవా బీ హిందూ సమాజ సంస్కరణోద్యమమున కైదువేలరూపాయలు కానుకగానొసఁగె - సౌకతాలీ మతమైత్రికి మహాత్ముని కారావిముక్తికిం గృషిసల్పె - 'విన్‌స్లో' మున్నగు క్రైస్తవమతబోద్ధలు తమ కెన్నికలన్ వేఱుపాటు వలదనిరి - నిమ్నజాతి నాయకుఁడు మయిలై చివముత్తు రాజా (యం.సి.రాజా) తనవారికిఁ బ్రత్యేకనియోజకవర్గములు వల దని చాటి ప్రజా ప్రశంస లగ్గలముగాఁ బడసె-మితవాదివర్గ ప్రముఖుఁడు సప్రూ మహాత్మునివిడుదల కారటించె-హిందూ సమాజసంచాలకుల సమావేశ మవసరమని నమ్మి మాలవ్యా దానికివలయు కార్యక్రమము నిర్వహించె - అయ్యంతర్వాణి నాయకత్వమున నంబేద్కరు, మయిలై చివముత్తురాజా, రాజగోపాలాచార్యులు, రాజేంద్రప్రసాదు, బిర్లా, కుంజ్రూ, తక్కరుబాబా, సరోజినీదేవి, జయకరు మున్నగువారు మహాత్ముని సందర్శించి సాంఘిక సమస్యపట్ల దీర్ఘ చర్చలుజరిపి యెట్టకేల కొకదారికివచ్చి తమనిర్ణయమును మహాత్మున కర్పించి తత్సమ్మతినంది వెనువెంటన (24-9-32) దాని నాంగ్ల ప్రభుత్వమువారికిఁ బంప నయ్యేలుబడివా రాయొదంబడిక కనుకూలముగాఁ దమతీర్పు సవరింప నియ్యకొని యీయియ్యకో లాంగ్లభారతదేశముల నేకకాలమునంద (26-9-32 ఉదయము) వెలువడు నేర్పాట్లు గావించిరి - రాజప్రతినిధి కార్యవర్గ సభ్యుఁడు హేగు (హోము

మెంబరు) భారతశాసనసభన్ దీనిని బ్రకటించె - విశ్వకవి రవీంద్రుఁ డానాఁడ యెర
వాడకు వచ్చి మహాత్ముం గనియె - నాఁటి సాయంసమయమున (గం.5-15)

## మహాత్ముఁ డుపవాసము మానుట - 'హరిజన' పద ప్రయోగము

భగవత్ప్రార్థనానంతరము బాపూ తనదీక్ష నుజ్జగించి పారణచేసి గాసింబడిన లోకము
నకుఁ జిత్తశాంతిగూర్చె - హిందూసమాజ నాయకులిప్డు దంగీకరించిన తీర్మానమునుబట్టి
నిమ్నజాతులవారికిఁ బ్రత్యేకనియోజకవర్గము లుండవు - కాని సాధారణ నియోజక
వర్గములం గొన్ని ప్రత్యేకస్థానము లుండు-ఇవి ప్రభుత్వము వా రొసఁగినవాని కిబ్బడి
- ఈమార్పు మాలలకు సంతృప్తిగూర్చె - పంచములపెంపు పట్ల గాంధికి దుర్బుద్ధి
కలదన్న మాగ్దనాల్డునకు గుణపాఠము సెప్పె - మఱియు నీస్థానములలో నొక దానికి
నల్వురం దొలుతొల్త నంటరానివారెన్ను కొనవలయు - పదంపడి యానల్వురలో
నొకనిని హిందువులందఱుం గలసి వరింపవలయు - దీనం జేసి 888

ఆ. అగ్రవర్ణదాసు లస్పృశ్యులకుఁ బూఁట, లగుట తొలఁగెఁ బెద్దతెగలవారి
జడ్డు విడక బ్రదుకుసాగించునక్కఱ, యంటరానివారి కావహిల్లె. 889

గీ. మాల మాదిగ మున్నగు వేలకొలది, నామముల నిమ్మహిఁ జరించునవి కపుడు
హరిజనుం డనుపేరు మహాత్ముఁ డిడియె, నిదినయంతన యది రూఢికెక్కె జగతి. 890

### (హరిజనుడు - హరికిష్టుఁడు - హరిభక్తుడు)

ఆ. అతనిపల్కు వేద మతఁడు కిరీటము, వలవనట్టిచక్రవర్తి యిలకు
నతఁడు దేవదూత యతఁడు జగచ్ఛాంతి, దాత భారతీయనేత యతఁడు. 891

గీ. 'హరిజన' సమాఖ్యతో నతఁ డంటరాని, తనము నుక్కడఁగించి హైందవుల దిద్ద
వారిపత్రిక నొకదానిఁ గారనుండి, వెలువరింపఁ దలంచె నవ్వేళయందు. 892

క. అదుగటయ తదవుగా నే, ల్బాదివా రిపనికి నిష్టపదిరి, మహాదే
వుఁడు - తనతో బందిగమున, విడిసినపండితుఁడు కొంత వ్రేఁకన సైఁపన్ 893

## 'హరిజన' పత్రికావతరణము

వ. బాపూ 'హరిజన' పత్రికం బ్రకటింప నిశ్చయించె - తన కాలమంతయు హరిజన
సేవకు వెచ్చింపనెంచె - హిందూనాయకుల యెరవాడయొడంబడికను దేశికుఁ దంగీక
రించిన మఱునాఁడు (25-9-32) విద్వన్మణి మాలవ్యాయాజమాన్యమున బొంబాయి
నగరమున జరిగినసదస్సున "నిఁక హిందువెవ్వడున్ జనుషాస్పృశ్యుఁడుగా నుండఁ
దని, నేఁటియస్పృశ్యు లితరహిందువులంబలె బావులం బాఠశాలల రాజవీథుల నుపయో

గించుకొనవచ్చునని, యీయధికారము స్వతంత్రభారతమునం దవతరించు మొదటి చట్టమునందె నిబద్ధమగుననియు నిర్ణీతమాయె-బాపూ నిరశనవ్రత ముపసంహృత మైనంతన (26-9-32) తన్నగరమునం బ్రవర్తిల్లిన హిందూ నాయక గోష్ఠి నస్పృశ్యతా నివారణమునకు హిందూసమాజము పూంటపడుచున్న" దనుతీర్మాన మొనరింపఁబడియె - దానియందు ఘనశ్యామదాసుబిర్లాయాజమాన్యమున హరిజన సేవకసంఘ మావిర్భవించె - భారతసేవకసంఘప్రముఖుఁ దమృతలాలుఠక్కరు దీని కార్యదర్శిగా నియుక్తుఁడాయె - శాసనతిరస్కారవాసనలేని హరిజనోద్యమమిట్లు ప్రారంభమై దేశమందొక నూతనోత్సాహము నాపాదించె - అంత **894**

## 1933

ఆ. ప్రజలు దీనిదెసకుఁ బరువెత్త శాసన, ధిక్కరణరణమ్ము మొక్కవోయె
నపుడు పైకొనిన నిరంకుశాజ్ఞప్తులున్, గారణంబు లాయెఁ గయ్యు మణఁగ. **895**

క. కడుగుట్టుగఁ బనులన్నియు, నడుపవలసివచ్చె దారుణపుఁజట్టములన్
బడదుగదా సత్యాగ్రహి, కొదుదుడుకుల నైన మర్మ ముపధాశుచికిన్. **896**

క. మర్మంబునకు నసత్యము, వర్మము గావలయు, ననృతవాక్కులు బాపూ
ధర్మమునకు లోకోత్తర, కర్మమునకుఁ దగవు కానఁ గాంగ్రెసుపెద్దల్ - **897**

ఆ. పస్తువేళ గాంధిపజ్జ వసించి యా, గాము లరసియరసి కాంగ్రెసునకు
మొదటిచేంత చట్టమును ద్రోఁతయే కాని, తగదు తగదు గూఢతంత్ర మనిరి. **898**

క. కారాగృహమ్మునకుఁ జన, నేరనివా రూరియందు నిలిచి హరిజన
శ్రీరాకకు బదలుట యుచి, తారంభం బనిరి యొజ్జ యభినందింపన్. **899**

వ. కాంగ్రెసుతోడిపొత్తులేని జాతీయవాదులు ప్రధానకార్యకర్తలుగా హరిజనోద్యమము విరియసాగె - మహాత్ముని 'హరిజన' పత్రికయు నారబ్ధమై (1933 ఫిబ్రవరి నుండి) సనాతనవాదులకన్ను విప్పందొడఁగె - దేశమునం దొకవంక శాసనోల్లంఘనము సముచితమార్గముల జరుపంబడుచుండె - ఏలుబడివారి నిర్బంధవిధానము సైతము

### అసాధారణ శాసనములు - కలకత్తా కాంగ్రెసు

యధాపూర్వము ప్రయుక్తమగుచుండె - ఇట్టితతి నసాధారణశాసనవిరుద్ధముగాఁ గాళీ ఘట్టమునఁ గాంగ్రెసుమహాసభ (31-3-33) జరిగె-శాసనోల్లంఘన సంరంభము సడలుచున్నతతి నిది జరిగినను దీనిపట్లఁ బ్రజలు వెలువరించిన యుత్సాహము, కష్టసహిష్ణుత యతివేలముగా నుండె-పెక్కురాష్ట్రము లీసభకుం దమ ప్రతినిధుల నెల్ల నంపె-మదన

మోహనపండితుఁ డీ సభ కధ్యక్షుఁడుగా వచ్చుచుండ నధికారు లప్పటిని గత వత్సరపు
ఢిల్లీసభం బాలింప నరుదెంచుతఱింబలె మార్గమధ్యమున నాఁకట్టిరి-మఱియు 900

గీ. ఈసభకు వచ్చునప్పుడయు నిట్లె నిలుప, బడియె మోతిలాల్ పండితుభార్య, రుజల
రాపిడుల దస్సిన స్వరూపరాణి, సుకృత, సౌరభాశ్లిష్టజీవ సోదారవేణి. 901

గీ. సభకు నరుదెంచుచున్న దీసతి యటన్న, వార్త ప్రజ నపూర్వోత్సాహవశ నొనర్చె
నామె నరికట్టి రధికృతు లన్నవార్త, నిర్భరోద్రేకవైఖరి నిప్పుఁ జేసె. 902

వ. ఆనాఁడు కాంగ్రెసుసంఘమునకుఁదాత్కాలికాధ్యక్షుఁ డానేమహాశయుఁడాడిగాఁ గల
పెద్దలెందఱో దారినడుమ బందాలైరి - ఐనను సహస్రాధిక ప్రతినిధులు నిర్ణీత కాలము
నకు నిశ్చితస్థలమునకుఁ జేరిరి - సేన్ గుప్తభార్య నెల్లీ యధ్యక్షురాలుగా మహాసభ
సాగె - ఇంతలో నెఱ్ఱటోపీలవారు దూఁకి లాటీదెబ్బలం బ్రతినిధుల తలలు వ్రక్కలుసేయ
దొరఁకొనిరి - కాని 903

ఆ. తలలు వ్రీలుగాక జలజల నెత్తురు, కాఱుగాక ప్రజలు పాఱిపోక
నిలిచి వలసినట్టి నిర్ణయములనెల్లఁ, దీర్చి చదువుదనుకఁ దెరలరైరి. 904

క. లోపలివరుసల నాయకు, లేపీడం బడమికై బహిశ్శ్రేణులవా
రోపిరి దెబ్బల నన్నిటి, నాఁపిరి హృదయమ్ములేని యధికారితతిన్. 905

గీ. ఈమహాసభవారు నాల్గేండ్లనాఁడు, తమవెలార్చిన పూర్ణస్వాతంత్ర్యతేచ్ఛ
మరలఁ జాటిరి న్యాయసమ్మతమహాస్త్ర, మనిరి యేల్బడి వారిశాసనము ద్రోఁత. 906

గీ. గతచరిత్రనుబట్టి సర్కారువారి, యానలను ధిక్కరించు కార్యక్రమంబు
నభినివేశముతో నంద అన్ని దెసల, నడుపవలె నన్న తీరు పొనర్చి రంత. 907

ఆ. లాఁతినేలబట్టలను మాని ఖద్దరు, వలువ లెల్ల రూనవలయు ననిరి
యాంగ్లదేశవస్తు వాదరముంజూప, రాని దనిరి విలువఁ గాని దనిరి. 908

ఆ. గుండ్రబల్లసభను గూర్చిన రాజ్యాంగ, సూత్రమునకు విలువచూప మనిరి
తెల్లదొరతనమ్ముఁ దిరముగా నిట నిల్పు, తంత్ర మగుట నద్ది తగని దనిరి. 909

ఆ. అంటరానివారి కొంటరిపీఁట లే, ర్పడుట మాన్ప నొజ్జ పస్తుపూన
నది ఫలించుతీర్పు నంగీకరించిన, హిందువులకు మెప్పు లిత్తు మనిరి. 910

ఆ. అంటరానితనము హైందవసంస్కృతి, కపయశమ్ము దెచ్చు నట్టి దనిరి
ప్రజ లుదారదృష్టి పఱపి వేవేగ నీ, తప్పు దిద్దుకొనుట యొప్పు ననిరి. 911

ఆ. మును కరాచి కాంగ్రెసున భారతము స్వరా, జ్యము గడించినపుడు జనుల కెట్టి
చనవు లావహిల్లు నని రవి తప్పక, యొదవు ననిరి ప్రజ లహో! యనంగ. 912

## మహాత్ముఁడు మరల నుపవసించుట

వ. అది యట్లుండె - చెఱసాలనుండియు హరిజనపత్రికం బ్రకటించుచున్న మహాత్మునకు హరిజనోద్యమముపట్ల నగ్రవర్ణములవారు సవతితల్లిప్రేమం జూపుచున్నట్లు మిత్రులు త్తరములు వ్రాసిరి - ఈవ్రాఁతలు బాపూహృదయముం గలగుందుపఱిచె - పదంపడి తనకార్యకర్తలలోఁ జిత్తశుద్ధియు సేవానిరతియు నగ్గలమగుటకై మహాత్ముఁ డనశన వ్రతముం బూనె (8-5-33) - దీని కిరువదియొక్క ప్రొద్దు లవధిగా నిర్ణయించె - మఱియు నీదీక్ష నవధరించుచు దేశికుఁ డిట్లు పల్కె. 913

ఆ. "హరిజనోద్యమంబు నఖిలభారతమున, నడుప నియ్యకొన్ననాకు నన్ను
దనుచరులకు నిక్కమగు నిచ్ఛయును భావ, శౌచమును సమగ్రమై చెలంగ. 914

క. ఈయుపవాసంబున కే, నాయితపడినాఁడ నన్నుదాదర్శముపైఁ
దీయముగలవారలు నా, శ్రేయమునకుఁ బ్రార్థనమ్ముసేయుట వలయున్. 915

గీ. ఈకఠోరతపమ్మునం దేను మేను, వీడినను వీడకున్న నీవిధికి నన్నుఁ
బ్రేచినతలంపు నెఱవేఱ వేఁడవలయు, నీశ్వరు మదీయమిత్రు లెందెందు నున్న. 916

గీ. సత్యపుమొగమ్ము మూసినసర్ణపాత్ర, తొలఁగుఁగాక దూరమ్ముగాఁ దొలఁగుఁగాక
యని సనాతనవాదు లత్యంతభక్తి, నీశ్వరు నుతింత్రుగాక నన్నించువారు. 917

ఆ. కాంచనాదిమోహ కలితావరణ మిది, కప్పివైచు బుద్ధి నప్పసముగ
దీనిఁ జీల్పలేనివానికిఁ బాండిత్య, మెంతయున్న సత్య మెఱుకపడదు. 918

క. మతబద్ధంబగు నుద్యమ, మతిమాత్రజయమ్ము నంద నాధ్యాత్మిక వీ
రత వలయు, నిది యుపాసము, కతనన్ బాటిల్లు నని జగమునకుఁ దెలియున్."919

వ. పదంపడి నిరశనవ్రతనిష్ఠుఁడగు మహాత్ముని బరీక్షించి 920

ఆ. లేదు లేదు గాంధి కీదీక్ష ముయ్యేదు, నాళ్ళు పూనఁదగిన నలువు మేనఁ
బట్టు వదలఁదేని బాపూజి బ్రదుకుట, కల్ల యనియె బందిగంపువెజ్జు. 921

ఆ. అంత నేలువార లానాఁటిరేయి మ, హాత్మువదలి రెట్టియాన లిడక
గురుఁడు పిదపఁ బుణ్యపురి నొక దొరసాని, పర్ణకుటిని నిల్పి పలికె నిట్లు. 922
(ఈమె 'ఠాకర్సే')

ఆ. "నన్ను దొరలు విడిచినా రని పొంగ నీ, విడుపు నాకు మిగుల వ్రేఁగుగూర్చుఁ
జనదు నేఁడు నేను సర్కారుచట్టమున్, ద్రోయునట్టిపనులతోడ రేఁగ. 923

ఆ. పస్తు మానరానిపని నాకు; నుద్రిక్త, దశకుఁ దొలఁగియుంట ధర్మ విపుడు
నామనమ్ము హరిజనశ్రేయమును వినా, యన్యమును దలంచు టనుచితమ్ము. 924

ఆ. తలఁచునేని పస్తు దండుగుపని యగు, నైనఁ జెఱుపు జూచినట్టి నేను
బలుకు లొండు రెండు పలుకుట దుర్నివా, రంబ శిష్టిధిక్కారముఁగూర్చి. 925

గీ. ఈతిరస్కృతిపట్ల నాహృదిని భిన్న, భావము జనింపలే; దింపుఁ బొలువదని
నిర్భరత్యాగముల కోర్చి నిలిచినట్టి, ధీరులను బ్రశంసింతు సందియము లేక. 926

గీ. ఐన నీయుద్యమంబు రహస్యవిధుల, నడుచుట గణింపఁజాల; నీనదతకతన
నెగ్గువాటిల్లె నని; కిది యెఱింగి ప్రజలు, మంతనములేనిబాటలో మసలవలయు. 927

ఆ. కుట్రలేనిపనులకున్ బ్రజ హెచ్చుగా, రాకపోవుఁగాక చీకునందఁ
గాయమునకు బలుపు కావలయును గాని, వా పదేల రిత్తమోపదేల. 928

ఆ. ఏను గుణముఁ జూతుఁగాని గణముఁ జూడ, గుణముఁబట్టి చేఁత గొప్ప దగును
సైఁచిసైఁచి నేఁడు చాటితి నీనుడు, లివి పటేలు సైత మియ్యుసేయు. 929

ఆ. పస్తుముగియుదనుకఁ బ్రజ శాంతిమైనుంట, కుదురఁబోదు గానఁ గొన్నినాళ్ళు
పోరు నిల్పు టొప్పు, నాఱువారమ్ముల, యవధి వలయు దీని కని తలంతు. 930

ఆ. ఏలువారు శాంతి నిచ్ఛింతురేని ఘో, రాజ్ఞ లుడుప సిద్ధమగుడు రేని
యెట్టియాంక్ష లిడక యెల్లబందాలను, విడువవలయు బందివిడిదినుండి. 931

ఆ. పస్తు నోర్చి యొద్దుపట్టితినేని నా, కపుడు సర్వ మెఱుఁగ ననువు గల్గుఁ
గాఁగ్రెసునకు నేలికలకు హితం బాద, నానుకూల్య మొదవు నగ్గలముగ. 932

గీ. సంధికుదురని కాంగ్రెసు చట్టములను, ధిక్కరింప వెందియుఁ బ్రయత్నించునేని
తమ నిరంకుశశాసనాస్త్రములఁ బ్రభులు, పఱపవచ్చు శమమ్మును జెఱుపవచ్చు. 933

ఆ. దురభిమానములకు దూరదూరమ్ముగా, నిలిచి సంధిసుఖము వలచినప్డు
దేల తీఱు కుదర? దెడఁదక దా మిత్ర, వైరిభావములకుఁ గారణంబు. 934

గీ. వల్లభాయి గఫూరు జవ్హరమనీషి, మున్నగుమహారథులు కార మూల్గుచుండ
శాసనోల్లంఘనము నుపసంహరింప, విడివడినవారి కెవరికి వీలుకలదు? 935

ఆ. నన్నుఁ బట్టుకొన్న నాఁటి కాంగ్రెసుకార్య, వర్గసభ్యులిట్టిపని యొనర్ప
నర్హులనెద వారి నసువులతోఁ బూడ్చి, రేలువారు కీడు మేలు గనక. 936

క. ఇఁక నన్నుఁ బత్రికాలే, ఖకులు శ్రమంపఱుపకుండ్రుగాక ప్రజయుఁ దా
శిక పూని యాకుటీరము, నకు రాక మదీయజయమునన్ దోడ్పడుతన్. 937

గీ. అస్వతంత్రతమైఁ జెఱయంద యున్న, వానిఁగా నన్నుఁ దలపోయవలయు దేశ; మెట్టిచర్యలకైన నాగట్టితనము, చాల దీనాఁడు కోరెద శాంతి నేను. 938

ఆ. పస్తుముగిసి యేను బ్రాణాలతో నున్న, నేలువారిపంత మిట్ల యున్న నన్ను బందిగమ్మునకుఁ జేర్పుఁ దని విన్న, వం బొనర్చువాఁడఁ బాలకులకు. 939

## మహాత్ముఁడు వల్లభునివాత్సల్యము నగ్గించుట

క. చెఱసాలలోనినెయ్యురఁ, దొఱఁగుట నాసుఖమునెల్లఁ దొఱఁగుట యయ్యెన్ సరదారువల్లభాయిని, మఱవంగలనొక్కొ నిస్సమానచరిత్రున్. 940

గీ. అతనితో నుంట పరమభాగ్యము; పదాఱు, నెలలనుండి యమ్మేటియు నేను నొక్క యింట నుంటిమిము న్నెన్నఁడిన్ని నాళ్ళ, పొత్తు నాకయ్యుదారుతోఁబొసఁగదయ్యె. 941

ఆ. అతనిదేశభక్తి యతిమాన మని వాని, విక్రమంబు లోకవిశ్రుతమని యేను గంటిఁ గాని యెనలేనివాత్సల్య, మతఁడు నాఁచికొనియె నని యెఱుంగ. 942

గీ. అతఁడు నాపట్లఁ జూపినయట్టి యరులు, మాయురే ! జ్ఞప్తికిం దెచ్చె మత్సవిత్రి; నించుకబెదంద నాకుఁ బ్రాప్తించినను బ, టేలు రెపరెపవచ్చి నాపాల నిల్చు. 943

క. నాసుఖమున కెన్నఁడు నొక, వీసమ్మును వెత్తిరానివిధమున నతఁ డా యాసములు సైఁచు మును నా, చేసినసుకృతమ్ము లట్టిచెలికాని నిడెన్. 944

క. వల్లభుఁడు నితరమిత్రులు, నల్లవొ ! యొకకుట్రపన్ని నాపనులెల్లన్ మెల్లగ నొనర్చి పూచిక, పుల్లయు న న్నంటనీ రపూర్వ ప్రేమన్. 945

గీ. రాజకీయసమస్యలు త్రచ్చువేళ, వల్లభాయిపటేల్ రాచవారి నేఁచు చిక్కులను సానుభూతిమై వక్కణించు, నతనియౌదార్యమున కరిమైనఁ గరఁగు. 946

క. గుజరాతిని గల హలిక, ప్రజదెస నాతఁడు వెలార్చుప్రణయమ్మున క క్కజపడెద; నిడుమలన్ గిజ, గిజగొనువా రతనికంటికిన్ దైవతముల్. 947

వ. సత్యాగ్రహాచార్యుఁ డిమ్మెయిం బల్కినవెన్కఁ గాంగ్రెసున కానాఁడధ్యక్షుఁడుగా నున్న యానేమహాశయుఁ దాఱువారములపాటు శాసనతిరస్కృతి నాఁపిన ట్లాధికారికప్రకటన మొందు కావించె – దానిని గన్నంతన యేలుబడివా రిట్లు తమ తలఁపుం జాటిరి. 948

ఆ. "గాంధి నిపుడు మేము కదపుటఁజేసి చ, ట్టమును ద్రోసి బందిగములనున్న ప్రజల విడువ సిద్ధపడినయ ట్లెవరు నూ, హింపవలదు విశ్వసింపవలదు. 949

గీ. హరిజనోద్యమవిజయంబ యాసచేసి, పస్తునూనుదు నని గాంధి పల్కుకతన నతనిఁ జెఱనుండి వదలితి; మంతెకాని, మావిధానమునం దెట్టిమార్పు లేదు. 950

గీ. శాసనోల్లంఘనము నుపసంహరించు, వాంఛ కలదేని కాంగ్రెసువారియెదఁద
నిది కదుందెల్లముగఁ జెప్పరేమి వీరు, రాచకార్యాల నిట్టితెఱంగు చనునె. 951

గీ. ఏము బందిగమునవారినెల్ల నిండ్ల, కంపినంతన మాయాంక్ష లనుచితంబు
లక్రమము లని సమర ముపక్రమింపఁ, దలఁచెనా వెంది కాంగ్రెసు దారిదప్పి? 952

క. 'వదలము శాసనధిక్కృతి, మొదలిడుదుము తగిన కాలమునయం' దనుచున్
బెదరించెడి కాంగ్రెసుతోఁ, గుదురునొకో! సంధి చేసికొనుపని మాకున్. 953

గీ. బహుదినమ్ములు రిత్తగా బందిగములఁ, గాంగి రెసువారి నిలుప నే మంగవింప
మైన నుల్లంఘనముమాన రన్నుజంకు, తోఁచునందాఁక వారిని దొలఁగఁబోము. 954

క. పదినా ళ్ళని మానుట చా, లదు సంధికి; దీన నగుఫలం బల్పతరం;
బిది మాదృష్టిని మరలిం, పదు తీఱున కేము సిద్ధపడ మిప్పట్లన్. 955

వ. ప్రభుత్వమువారియభిప్రాయము నెఱింగినంతన కాంగ్రెసువారు తా మొందుసమావేశము జరిపి దేశపరిస్థితులనెల్ల నొక్కమాఱు సింహావలోకనమొనర్చుట మేలని తలంచిరి - ఇది మహాత్మునియిల్లి చెల్లినపదంపడి జరుపుట యుచితమనియుం దేల్చిరి - కాన శాసనోల్లంఘనవిరమణము నింకొకమువ్వారములమేర కానే పొడిగించె - దేశముకన్ను లన్నియుఁ బర్ణకుటిం గప్పె - అంత 956

గీ. మూఁడువారాలయుపవాసమును సహించి, గాంధి నిరుపద్రవమ్ముగా గట్టుపట్టె
నతని పారణవార్త విన్నంత నెల్ల. రంజలించిరి వేల్పున కళుకు మాని. 957

ఆ. హరిజనోద్యమంబు బిరబిరసాగె దే, వాలయములు విచ్చె నందఱకును
మదుఁగుదాల్చి మాల గుడిగంటగొట్టె గో, విందు! యాశ! దెంద మింద మనియె. 958

వ. అదియట్లుండె-రాజనైతిక పరిస్థితులం బరిశీలింపనెంచిన కాంగ్రెసుపెద్దల గోష్ఠి పూనా నగరమునఁ గూడె - (12-7-33) అందు సత్యాగ్రహము మరల సాగవలయునా? సాగుచో నది సమష్టిరూపముననా? యొండేని వ్యష్టిరూపముననా? యను చర్చలు హెచ్చిహెచ్చి యుపశమిల్లినవెనుక 'సంధికార్యమునకు మహాత్ముఁడు రాజప్రతినిధిని జూడ వలయు' నను తీర్మాన మంగీకృతమయ్యె - దానింబట్టి 'శాంతి మార్గము లన్వేషింప మీ చెంతకు రాఁదలంచితి - అంగీకృతి నొసఁగుఁ' దని బాపూ వైస్రాయికిఁ దీఁ గవక్కాణము పంప నయ్యేలిక 959

గీ. మొదట శాసనోల్లంఘనమును దొఱంగి, పిదప ననుఁజూడ రందని బదులుపల్కెఁ
గాదు నామాట వినుఁడనె గాంధి మరల, లేదు ఫలమని యవల విల్లింగ్ద నాడె 960

ఆ. జాతిగౌరవమ్ము సంరక్షగావింప, నదుపవలసివచ్చె నాఁడు మరము
సముచితంబు వ్యష్టిసత్యాగ్రహం బిపు, దని గురుందు దేశమునకుఁ జాటె. 961

గీ. పల్లియులవార లెందఱో ప్రభుత నెదిరి, దుర్భరాపత్ప్రయోధులఁ దోఁగితోఁగి
యుండ్రు వాకిండ్లు కోల్పోవ, నేల నాకు, మాత్ర మిల్లని యపు దొడ్డ మానసించి- 962

గీ. అల సబర్మతీసత్యాగ్రహాశ్రమంబు, ననువుగాఁ దనప్రేమించి నాశ్రమంబు
నిచ్చెదను దీసికొండని యేలువారిఁ, గోర నదియేమొ మాఱాడరైరి వారు. 963

## వ్యష్టి సత్యాగ్రహము - మహాత్మునిచెఱ - విడుదల

వ. పదంపడి మహాత్ముఁ డాశ్రమభవనములం బొలములం బంటల హరిజనోద్యమమున కర్పించి యాయావస్తువుల నయ్యయిప్రజాహితసంస్థలకొసఁగి (26-7-33) యాశ్రమ వాసుల కన్నిపనులుమాని సత్యాగ్రహమునకు రండని పల్కి వారిమైకోలువడసి వారు ముప్పదినల్వురు తనవెంటరాఁ గాలినడకతో (1-8-33) 'రాసు' గ్రామమునకుఁ జననెంచి యవ్వార్త నేలుబడివారి కానాఁడయెఱిఁగించె - ఇట్లు మున్ముందుగాఁ జాటి కావించుశాసనోల్లంఘనమె వ్యష్టిసత్యాగ్రహము నాఁజెల్లు - మఱియు మహాత్ముఁ డా నాఁడు దండియాత్రకుం జనుతఱి దేశము స్వతంత్ర మగుదనుక నీ యాశ్రమమునకు రానని శపథించుట పాఠకులు మఱవరు-నాఁటిసుత బాపూజీ తనయాశ్రమమునకు రాఁదయ్యెఁ - కాని రుగ్ణుఁడైయున్నమిత్రుం జూడ నొక్కపరి పెఱవానివలె వచ్చె - నేఁ డీ నిర్మాణము నాయాసంస్థలకుఁ బంచి మహాత్ముఁడైహికముగాఁ దనకున్న తుదిపొత్తును సైతము త్రెంచికొనె - ఇఁక గాంధి నీ లోకముతో బంధించునది యేమికలదు? - ఇతఁడు సంన్యాసి - కర్మఫలాశ్రితుఁడు గాని మహాయోగి - ఆచార్యుఁడిపుడు చూడనెంచిన 'రాసు' గ్రామము గుజ్జరి సీమలోనిది - దేశమున కిది కావించినత్యాగ మతివేలము - లవణసత్యాగ్రహము నాఁడు వల్లభాయిపటే లచటన నిర్బంధితుఁడయ్యె - నాఁటి నుండి యీపల్లియపే రాసేతుహిమాచలము ప్రసిద్ధినందె - ఇందలికర్షకుల నొక్కమాఱు కని తనియవలెనని బాపూ తలంచె - కాని తెల్లవాఱినవెనుక నీయాత్ర సాగునన నధికారు లా (31-7-1933) యర్ధరాత్రముననవచ్చి నిద్రావస్థనున్న గాంధిని సానుచరముగా బంధించి యెరవాద చెఱకుఁ జేర్చె. 964

ఆ. అందు నాల్గుప్రొద్దు లరికట్టి పదపడి, కదపి నీవు పుణ్యకటకమంద
యధివసింపవలయు నన గురుఁ డియ్యాన,ధిక్కరించెనపుడ వ్రక్కలించె.(4-8-33) 965

ఆ. ఏలువారు దీని నెట్లు సహింతురు, దురభిమానవహ్ని నెరియువారు
విడిచినంత నొక్కగడియలోఁ గ్రమ్మఱఁ, బట్టి రొజ్జ నాజ్ఞ నెట్టె ననుచు. 966

క. ఏఁడాదిశిక్షతో నెర, వాడచెఱన్ నిలిపి; రవల వ్యష్టిసమరమం
దీదంబోవని మగటిమి, తోడన్ బాల్గొనిరి ప్రజలు దొరతన మదలన్. 967

క. ఆయెడఁ గాంగ్రెసునకు నొక, నాయకుఁ డనువాఁడు లేఁడు నలఁగినబాటన్
బాయక యెవనికివాఁడే, నాయకుఁడై వ్యష్టిరణము నడుపం దొడఁగెన్. 968

ఆ. వేలకొలందిమందివీరు లీవృష్టిస, త్యాగ్రహమున బందికలిగి రపుడు
భారతీయుఁ డాతితేజీనబం టౌట, యెఱిఁగి తెల్లవోయి రేలువారు. 969

ఆ. అఱఁగనీక జగడ మానాఁడు సాగించు, ప్రజలతీరు తెలిసి బాపు తనిసె
నైననేమి గురుని హరిజనపత్రిక, యాఁగఁదగినయాజ్ఞ యపుడు వెడలె. 970

వ. "ము న్నీవు చెఱసాలలో నిరుద్ధుఁడవుగా (డిటెన్యూ) నుంటకతన హరిజనోద్యమము సాగింప నియ్యకొంటిమి - నేఁడో శిక్షితదోషివి-కాన నీవు దానినేఁత కంగీకరింపము" - నవి దొరతనమువారు గాంధికి నుత్తరువునొసంగిరి - దీనికిందనయసమ్మతిం జాటి బాపూ వెండియుఁ (16-8-33) నిరశనదీక్ష కొగ్గ - దీనింబాటింపక యేలుబడివారు బిఱ్ఱబిగిసిరి - మహాత్మునిశరీరపాటవము నానాఁటి కడుగంటఁ బొడఁగె - ఐదవ నాఁటి యుపవాసమున దేశికుఁడు పెద్దయు నీరసింప నధికారులు వెఱచి పూనాయందలి దేవిడ్‌సాసూన్ చికిత్సానిలయమున కాయయ్యం (20-8-33) జేర్చిరి - కాని యారోగ్య పరిస్థితులు విషమించుటంజేసి మహాత్ముని నిర్నిబంధనముగాఁ (23-8-33) విడిచిరి- అంత సత్యాగ్రహస్రష్ట 971

క. "ఇదియేమి? నన్నుఁ బట్టుట, వదలుట సాగించి రేలుబడివా; రింక నీ
బ్రదుకెట్లుత్రోయవలె? నా, మది తేఱుకొనంగ నెట్టిమైఁ గానవలెన్? 972

ఆ. పిల్లి యెలుకతోడఁ గల్లరిచెరలాట, మాడుగతికి వచ్చెనా ప్రభుత్వ?
మెంతనీచవృత్త మిది! సరే! నాకు నా, ధర్మ వున్న యదికదా యెనర్ప" 973

ఆ. అనితలంచి తనకు నధికారులువిధించు, శిక్ష కున్న గడువు చెల్లుదనుక (3-8-34)
బందినున్న వానిపగిదిన తానుంట, కృత్యమనుచు నిర్ణయించుకొనియె. 974

ఆ. అదిర! జగతి నెందఱర్హు లిమ్మెయిఁబాడి, మఱచిగెఱింగి బ్రదుకు మలఁచుకొనఁగ
దనకుఁదగినశిక్ష తాన నిర్ధారణ, చేసికొనుట తమము ద్రోసికొనుట. 975

గీ. గడువు పండ్రెండుమాసముల్ కడచుదనుక, శాసనోల్లంఘనాది భీష్మక్రియాళి
కియ్యకొని చెఱసాలకు నేగు టొప్ప, దని మహాత్ముఁడు తలఁచె నయ్యవసరమున. 976

క. అడిగినవారికి హితమున్, నుడువుచు నుద్యమము లోకనుతమార్గంబున్
విడకుండఁ గనుచు హరిజను, లదరుపనికి లెస్స బదలనగు నని యెంచెన్. 977

## బాపూ సేవాగ్రామమునఁ దిరపడుట

వ. సబర్మత్యాశ్రమము నుజ్జనచేసినవెన్క మహాత్ముఁడొకయునికిలేక గ్రామైకరాత్రముగాఁ దిరుగుచు నెందేని నిర్మాణకార్యక్రమమున కనుకూలించు పల్లె నుంట లగ్గని తలంపసాగె-

బాపూ ప్రియశిష్యుఁడు వదాన్యశిరోమణి జమునాలాల్ బజాజీయాగడ నెఱింగి తన కాఁపురెంచు వార్ధానగరమున కైదుమైళ్ళదవ్వున స్వస్వామ్యమునం గల 'సేగాఁ' వనుగూడెము నాచార్యుని దృష్టికిం దేర నాయయ్యయియ్యకోలు సూపె - పదంపడి బజాజు వలయు కుటీరముల నందు వెలయింప మహాత్ముఁడాతావునకు 'సేవాగ్రామ' మను పేరిడి యందుఁ గుదుర్కొని వెనువెంటన (7-11-33) యావద్భారత హరిజనయాత్రకుం గదలి పదినెలలు పర్యటించె ఈపయనమున దినదినము నటనట నేర్పడు మహాసభల నాచార్యుఁడిట్లు పల్కె. 978

## బాపూ హరిజనయాత్ర - సవర్ణుల కుపదేశము

ఆ. "మాల లంటరానిమానవు లని సవ, ర్ణులు తలంత్రు పాడి తొలఁగఁద్రోసి
నరుఁడు నరున కింతకొఱంత విధించుచో, నెట్లు సంతసించు నీశ్వరుండు. 979

క. ఈదురితమునకు శిక్షగ, నీదేశము రాజకీయహీనత గుదుచున్
జో దీదుర్దశ హరిజను, సోదరుఁగా నగ్రవర్ణజుఁడు కనుదనుకన్. 980

ఆ. అంటరానితనము గెంటిననాఁడు హిం, దూసమాజమునకు వాసివచ్చు
నన్యమతమువార లపుడు మాలను దమ, సరణి కాహరింపఁ జాలలేరు. 981

క. మతకలహంబులు తగ్గును, జతపడు జాతీయమైత్రి సాంఘికభేద
ప్రతతిసహాయతమై నిట, బ్రతికెడి తెలవానియేలుబడి వైదొలఁగున్. 982

ఆ. యుగయుగాలనుండి యున్న యాచారమౌ, నంటరానితనము నణఁపుఁ దనుట
వెఱ్ఱితన మటంచు వెక్కిరించెడిపెద్ద, లించుకంత వెనుక కేగవలయు. 983

క. గోమాంసము దినిరిగదా, భూమీసురు లొక్కనాఁడు పోలు నటంచున్
గామింతురె నేఁ డాపొల, సేమీ సహగమన మున్న దేకద తొలుతన్. 984

క. నరబలియున్ గలదుకదా, వరుఁ డీల్గిననాఁడు మఱఁదివలనన్ దనుజున్
దరుణి కని పెంచెనుగదా, చిఱుబిడ్డ కొకప్డు పెండ్లిచేకూరెఁ గదా! 985

క. ఆయాచారంబులు కల, వా యిప్పుడు? నేలప్రొద్దు లరసి తగినమా
ర్పీయకొనవచ్చు నని బుధు, లే యనిరికదా వివాదమేటికి నింకన్? 986

గీ. ఉండవలయు నస్పృశ్యత యుండవలయు, నని సనాతనహిందువు లందురేని
యదియె హిందూమతమహీరుహమునుజంప, వేరుపురుగౌను రేపుదుర్వారమౌను. 987

క. తెఱవుఁడు దేవాలయములఁ, జెఱువుల బావులను బడులఁ జిరదీనదశా
భర మోసరిల్లఁ బిల్వుఁడు, హరిజనసోదరు సవర్ణహైందవులారా! 988

ఆ. ప్రేమలేనిమతము పెరుఁగదు, సమతాద, వీయమైన మతము విస్తరిల్ల
దగ్నివోలె నీర్ష్య యణఁచు నా్శ్రయమును, మానుఁదయ్య! దురభిమానమిఁకను" 989

వ. ఈ యాత్రలో మహాత్మునిపట్లఁ బ్రజలు ప్రకటించిన యాదరానురాగము లసాధారణ
ములు - అవి లవణసత్యాగ్రహదినములం దలఁపించె - హరిజనోద్యమమున కానాఁ
డెనిమిది లక్షలరూప్యములు ప్రజ లర్పించిరి - ఆర్థికమాంద్యము దళముకొని, గింజ
విలువ దిగజాఱి సైరికు లల్లాడుచున్న దుష్కాలమున నింతయావి పరమాద్భుత మాయె-

## మహాత్ముఁడు కావూరిలో వినయాశ్రమమును బ్రారంభించుట

ఈ పర్యటనమున నీరచయిత కాణాచియగు కావూరికి మహాత్ముఁడు విజయంచేసి
గొల్లపూడి సీతారామశాస్త్రి, తుమ్మల బసవయ్య, తదర్థాంగి దుర్గాంబ, మద్ది వేంకట
రంగయ్య మున్నగు దేశారాధకుల శుభసంకల్పమునకు వితరణమునకుఁ జిహ్నమగు
వినయాశ్రమమును (23-12-33) దన దీవనలతోఁ బ్రారంభించె - ఆశ్రమవాసు
లానాఁడు మహాత్మునకు సమర్పించిన స్వాగతపత్రము సర్వదా పఠనీయము - కాన
దానిసారము నిట నుదాహరింతు. 990

గీ. "తాపసోత్తమ! మాపట్ల దయ వహించి, వచ్చి తీపర్ణకుటికి నీవనికి నీవు
మా కొనర్చినయుపకృతి మఱవఁజాల, మందుకొనవె మాపచరించు వందనములు. 991

ఆ. మకరరాశియందు మార్తాండుఁ డీఁగెడి, మేలిప్రొద్దునందుఁ గాలుమోపి
తాశ్రమమున; నీదునడుగులు సోఁకి యీ, పుడమియెల్లఁ బుణ్యభూమి యయ్యె. 992

ఆ. ఏము నిన్ను ఁ గనుట యెం తేనిధన్యత, నందుకొనుట; నీమహస్సు తాఁకి
యిచటిప్రాణులెల్ల రుచిరములయ్యె నీ, వృక్షములును గ్రొత్తవెలుఁగు వడసె. 993

ఆ. ఇందు నీవు శంకు విడిన 'యాత్మోల్లాస, భవన' మార్గధర్మభా సమగ్ర
మిహపరార్థజనక మిద్ధవిశ్వప్రియ, తా లతాలవాల మేలకాదు? 994

గీ. ఈవు నేఁడు గద్దయెత్తినచెఱువు పీ, యూషతులిత జీవనౌక మగుట
నాటినట్టితరు వనంతశాంతిప్రద, చ్ఛాయ మగుట పరమసత్య మనఘ! 995

క. ఈతావున నీవెత్తిన, జాతీయపతాక సర్వజనచిత్తములన్
స్వాతంత్ర్యవాంఛ రేఁపును, భీతి నణఁచుఁ ద్యాగనిరతి పెనుచు మహర్షీ! 996

ఆ. ఏము సత్యమున కహింసకుఁ దొలఁగక, యుచితధర్మమునకు నుత్సహింతు
మఖిలమతములను సమాదరమునఁజూతు, మియ్యకొనము దంబ మెన్నఁడేవి. 997

ఆ. ఎల్ల ప్రాణులకును హితము కోరెదము రు, గ్ణులకు మందులొసఁగి యెలమిగూర్తు
మజ్ఞులకు వివేకమందింతు మాహార, పద్ధతులను దిద్దఁ బదెదమయ్య! 998

ఆ. చేతిపనులు నేర్పఁజూతుము ప్రజలకు, ఖదరువలువ నెపుదు కట్టుకొందు
మంటరానితనము గెంటెద మామిష, మంటుకొనము సురకు నగ్గపదము. 999

గీ. దేశమునకు నాత్మకుఁ బరాధీనవృత్తి, నణఁప నాయాసపడియెద మాశ్రమములు
నాల్గు పాలించి సజ్జీవనము గడింతు, మానచేయఁగలారము బాసపెంపు. 1000

గీ. మమ్ము మాయాశ్రమమ్మును మాసమస్త, సంపదలను మీసంపత్తిసరణిఁ గనుము
చక్కదిద్దు; మాశ్రమము ప్రశస్తచరిత, వఱలుచందము చూడు మీబరువు నీది. 1001

గీ. అన్న! నీధర్మనిష్ఠ నీ వనుభవించు, ధార్మికానందమును మాకుఁ దలకొనంగఁ
నెట్టిమనుగడ వలయు నాగుట్టు దెల్పి, యుద్ధరింపవె మముఁగర్మయోగిచంద్ర! 1002

క. ఏవెల్గు నీకు మార్గము, నావిష్కరణంబొనర్చు నావెల్గున మా
యీవత్తుల వెలిఁగింపవె, కావిరిచీఁకట్లు మమ్ముఁ గారింపమికిన్. 1003

ఆ. తండ్రి! నీవుపదయు తాత్త్వికసౌహిత్య, మించుకంత మాకుఁబంచిపెట్టు
మీవు నదుచుబాట నీవెంట నరుదెంచు, చనవు మాకుఁ గూర్చు కనికరించి. 1004

క. ఎటుచూచినఁ ద్యాగము ప్ర, స్ఫుటమ్ముగాఁ దోఁచునట్లు పుణ్యపురుష! మా
యటమటపుంబ్రదుకుల ది, ద్దుట నీపని, లాఁతియొజ్జ దొరకఁదు మాకున్. 1005

క. నీమనుగడ నిత్యజయో, ద్దామముగా ధర్మమార్గదర్శకముగ ను
ర్వీమంగళహేతువుగా, రామునికృప నలరుతన్ జిరమ్ము నిలుచుతన్." 1006

వ. ఆశ్రమవాసు లిట్లు ప్రకటించిన యాదరానురాగముల కనురూపముగా బాపూజీ తనకృత జ్ఞత చాటి నిర్మాణకార్యక్రమమున కాచార్యపీఠమై వినయాశ్రమము తెనుఁగుమాగాణమున రాణింపవలయు నని శుభాకాంక్షలు పల్కె. 1007

క. కావూరిశివాలయ మపు, దావిష్కృతిచేసె గాంధి హరిజనులకు; నాం
ధ్రావని నిప్పుని కొప్పిన, దేవళముల నిదియ మొదటిదేవళ మయ్యెన్. 1008

గీ. గాంధిబలఁగమునం దగ్రగణ్యుఁడైన, గొల్లపూఁడి సీతారామకోవిదుండు
తీర్చిదిద్దిన దగుటచే నేర్చె నిట్టి, తెలుఁగు కావూరు జాతీయధీబిదారు. 1009

వ. తదనంతరమ్మున బాపూ సూత్రయజ్ఞమునం బాల్గొని సేవాపరాయణమగు ప్రజంగనితనిసె
- అంత 1010

మం. కర్షకనేత రంగాప్రార్థనమున, నిడుఁబ్రోలిలో రామనీఁదువిద్యాల
యమును వయోజనవ్యాప్తనిరక్ష, రాస్యతా నిర్మూలనాసంగమును జ
యారావమధ్యమునందు నొజ్జలకు, నొజ్జయైన మహాత్ముఁ దుత్థితప్రీతి
నావిష్కరించి నిస్స్వార్థసేవాప, రాయణుఁడైనట్టి రంగామహత్త
కని విని కృషికలోకశ్రేయమునకు, బడలునేతలకు మేల్బంతిగా నతని
భావించి యాతనిబలిమి కాంగ్రెసున. ఒబ్బుట గణనీయమని విశ్వసించి
తత్ప్రజాసేవ కెంతయుసాయపడుచుఁ, గారా నివాసాదికష్టంబు లోర్చు
చాంద్రనారీసమా జాదర్శపాత్ర, శీలసంపన్నయై చెలఁగుభారతికి
రంగాసతికి వినమ్రతాభిరామ, కాశాసనములిచ్చి యావీరవనిత
యాత్మీయసుతవంటి దని యుగ్గడించి, సభ్యుల కెనలేనిసంతుష్టి గూర్చె. 1011

వ. పదంపడి బాపూ తాళ్లపాలెపు హరిజనులవేఁడికో లాదరించి తత్పల్లికిం గదలి దారి యెుఱగద్దముగా నుంటంజేసి కారు మాని పదయాత్రతో గమ్యమునకుంజేరి శ్రీరామాశ్రమ మను హరిజనపాఠశాల నచట నావిష్కరించి జియ్యరుదాసు మున్నగు హరిజన కార్యకర్తల కాశీస్సులొసఁగి సవర్ణహిందువు లాపల్లెవా రిచ్చిన చిఱుదిండి నీకొంట నగ్గించి మరలి నిడుఁబ్రోలికి వచ్చె - ఈపయనమున నయ్యాక్రోశత్రయము నడిచి చూపఱ కాహా పుట్టించె - తదనంతరమున జాతిపిత 1012

ఆ. అంటరానితనము నణఁగింప దక్షిణా, పథమునందుఁ దగినపట్ల కేగె
నెచటికేగు నొజ్జ యచటిదేవళములో, నడుగుమోపి సాగసె హరిజనుండు. 1013

## 1934

ఆ. కేరళోర్వియందుఁ "గేలప్ప" హరిజన, శ్రేయ మిచ్చగించి సేయుతపము
పండిపండి తెఱవఁబడె 'గురువాయూరి', గుడియు సర్వజనులకొఱకు నపుడు. 1014

క. ఈపనిసంధిల్లనిచో, బాపూ పాటింపవలయుఁ బస్తును; మునుతా
నీపగిది మాటయిచ్చుట, నాఁపెను గేలప్ప నిరాటు నసమగ్రదశన్. 1015

## బీహారుభూకంపము - మహాత్ముని సేవ

వ. మహాత్ముని యుపవాస మిట్లు తొలఁగుటం జేసి దేశము హర్షావేశమునందె - క్రొత్త సంవత్సరము (1934) శ్రేయస్సౌరభములతో నారంభమాయె - కాని సుఖము వెంటఁ గష్టముండునన్నట్లు నూత్నవర్ష మడుగిడి పదునైదునాళ్ళు నిండియునిండకమున్నె (15-1-34 సాయం 2-15) ప్రళయభయంకరమగు భూకంపము వాటిల్లి బీహారు రాష్ట్రము దద్దతిల్లె - ఒక్క తెప్పపాటున దానియాకృతి గుర్తింపరాని వికృతి నందె -

ఇరువదివేలమంది ప్రజ లీయుత్సాయమునం బ్రేల్చిరి - రెండుకోట్లజనులీయిదుమం బాలుపడసిరి - పదిలక్షలయిం డ్లీవెదంద నదంగారె - పంద్రెండులక్షల యెకరాలనేలం గలపంటలు మంటం గూడుకొనియె - బావులు చెర్వులు కాల్వలు నదులు భూగర్భము నుండి యెగసినయిసుమునం బూడి రూపుసెడె - మఱియు 1016

ఆ. పతులు లేనిసతులు పితరులువోయిన, కుఱ్ఱవాండ్రు ప్రజను గోలుపడిన తల్లిదండ్రు లార్తి నల్లాడి శోకింపఁ, గరఁగిపాటె నచటికటికఱాలు. 1017

ఆ. సిద్ధపడియె నార్తసేవకు భారత, భూమియం దెసంగుసీమలెల్ల నాల్గువేలమంది నడిచిరె పిన్నలు, పెద్దలును బిహారు నుద్ధరింప. 1018

ఆ. పల్లెపల్లెనుండి పది నూఱు వేయిగా, వచ్చె రూక లుద్దవడి విహార ధరణిపాలఁ బడినదురవస్థ నణఁగింప, నవియుఁ గోటికంటె నగ్గలించె. 1019

క. కూలినమేడల మిద్దెల, మూలుగు ప్రాణులను మనుప మోసెను జవహర్ లా లపుడు మట్టితట్టలు, కాలువలై చెమటనీరు కాఱుచునుండన్. 1020

గీ. ఒజ్జ తనహరిజనయాత్ర నుజ్జగించి, వచ్చె నాపన్నమహికి సేవలనొనర్పఁ (11-3) గార్యకర్తలు గాంధిరాకను జెలంగి, బడ లెఱుంగక కూర్చిరి ప్రజకు సుఖము. 1021

ఆ. గుండె ఱాయిచేసికొని మహాత్ముఁడు కద, గండ్ల నలమటించుగ్రామములను బట్టణములఁ జూచి ప్రజలపాపములెయా, యాపదను ఘటించె నని వచించె. 1022

క. హరిజనుల నంటమియు నీ, దురితమ్ముల నొకకఠోరదురితం బనియెన్ నరునాత్మయుఁ దచ్చేష్టల, కరణిఁ బ్రకృతియందు మార్పుగావించు ననెన్. 1023

క. ఈకతమున మనతలఁపులు, లోకహితమ్ములుగ ధర్మలుబ్ధంబులుగాఁ బ్రాఁకవలె ననియె నిచ్ఛలు, వాకులు కార్యములు వేఱువదరా దనియెన్. 1024

## పూనాలో మహాత్మునిపై బాంబు

వ. పదంపడి బాపూ విపన్నస్థానముల నార్తినివారకసంఘముల నేర్పఱిచి నెలనా ళ్ళా రాష్ట్రమున నిల్చి రాజేంద్రప్రసాదుమున్నగు నాయకులకు వలయుసందేశ మొసఁగి యచ్చోటు వాసి హరిజనసేవాకార్యములందవిలి యయ్యాతావులకరుగుచు నొక నాఁడు (25-6-34) పూనాచేరి పాకీపనివాండ్రసభం బ్రసంగించుచుండ 1025

ఆ. అంటరానితనము నణఁగించు టోర్వని, ముష్కరుండు పాపమూర్తి యొకఁడు కసికిలోఁగి గాంధిదెస కొకబాంబును, బఱపెఁ గాని యది యపార్థమయ్యె. 1026

ఆ. ఇన్నినాళ్ళనుండి హిందూధరిత్రిలో, నిట్టిచెట్ట యెందుఁ బుట్టవాయెఁ
బుట్టె నేఁడు పుణ్యపురియందు గాంధి; కిం, కెట్టిముప్పు నిడునొ యుప్పురమ్ము. 1027
(పూనావాఁడే గాంధినిగూల్చె)

గీ. దైవమనుకూలమై గుఱితప్పెఁ గాన, బాపు నణఁగింపలేదయ్యె బాంబు నేఁడు
భారతశ్రీవిధాత నిప్పగిది మనుచు, నీశ్వరున కేటికో క్కిడి రిద్ధమతులు. 1028

గీ. అంత నజమీరునం దొకహరిజనోద్య, మానురక్తుఁడు తన కెదురాడినట్టి
పండితాగ్రణిపై రేఁగి రెండువ్రయ్య, లగునటులొనర్చె నక్కటా! యతనితలను. 1029

క. ఈదుష్కథ విని బాపూ, వేదనపడి దోషియఘము విడ నేడుదినాల్
తాఁ దాల్చెఁ బస్తు; జీససు, మూదలగా నిట్టిచందమును నేర్పెనొకో! 1030

క. ఏతాదృక్షులబ్రదుకులు, పాతకులనుదిద్ది లోకభవికమ్మునకున్
హేతువులగు; వీ రీశ్వర, దూతలుగా కొరులుగారు దూరం బరయన్. 1031

## శాసనసభా ప్రవేశయుగము

వ. అయ్యది యట్లుండె - నాఁడు కారాగృహవిముక్తులై వచ్చిన రాజకీయ నాయకులు దేశమునం దావరించిన రాజకీయ ప్రతిష్టంభమునుగని దీనిందొలఁగించుటెట్లని వగచి ఢిల్లీనగరమునం దన్సారీయాజమాన్యమున నొక గోష్ఠిసల్పి (31-3-34) స్వరాజ్య పక్షమును బునరుద్ధరింపవలయుననియు రానున్న కేంద్రశాసనసభ యెన్నికలం బాల్గొని గెల్చి నిరంకుశములగు చట్టముల నడ్డి మహాత్ముఁడు వలయితగోష్ఠిం గోరినపెత్తనము రాక కావశ్యకమగుకృషి సాగింపఁజనుననియుఁ దీర్మానించి యానిర్ణయముపట్ల మహాత్మునభిప్రాయము నర్థింప, నాయయ్య "మీకు నే నడ్డు రాను, మీవిజయము కోరుదు, మీకార్యక్రమమున కనుకూలముగా వ్యష్టి సత్యాగ్రహము నాఁపుదు" నని (7-4-34) పల్కె - అన్సారీ, భూలాభాయి దేశాయి మున్నగుపెద్ద లీపల్కుల కలరిరి-పదంపడి కాంగ్రెసుసంఘము స్వరాజ్య పక్షమును దనయంతర్భాగముఁగా జేర్చుకొని తాన శాసనసభాప్రవేశమున కాయిత్తపడె - ఏల్బడివారు కాంగ్రెసుసంఘములపైఁ దమమోపిన నిషేధము తొలఁగించిరి - కాంగ్రెసువారు కొందఱానాఁడు సామ్యవాది సంఘములని యువజన సంఘములని విద్యార్థిసంఘములని క్రొత్తక్రొత్తపక్షముల సృజింపసాగిరి - వీరికి సత్యాహింసలపట్లఁ బ్రత్యయములేదని బాపూ సంశయించి కాంగ్రెసు నాదర్శమును జాటువాక్యమున "శాంతియుతమైన, న్యాయబద్ధమైన" యను మాటలకు మాఱుగా "సత్యసహితమైన, యహింసాత్మకమైన" యనుమాటలుండ వలయునని బొంబాయిలో జరిగిన కాంగ్రెసుమహాసభం దీర్మానము నుపాదింప నది నెగ్గని దాయె - అంత మహాత్ముఁడు కాంగ్రెసుసభ్యత్వము నిఁక వదలి వలసినతతిఁ

గాంగ్రెసున కేను హితముసెప్పెద నని (అక్టోబరు 1934) ప్రకటించె - ఇట్లొనర్చుట కతనదేశము గడిదేఱుననియు నది యెల్లకాలము తండ్రిచాటుబిడ్డవలెం దనమఱుగునం దుంట లెస్సకాదనియు బాపూ తలంచె - మఱియు నాచార్యుండయ్యెడ సత్యాగ్రహ మాధ్యాత్మికసాధనమని దానిని లౌకిక మార్గమునం బ్రయోగించువారు విఫలులయ్యెదరని నేం డిట్టి ప్రయోగములుజరిగి యది దుర్బల మాయెనని స్వరాజ్యమునకై సత్యాగ్రహము తగదనుసమ్మిక నేండు నా కేర్పడినదని దానిగుట్టెన యెఱుంగుదును గాన దానిం బఱపు నధికారము నాకొక్కనిక కలదనియుం జాటె - అంత శాసనోల్లంఘనయుగము వోయి శాసనసభాప్రవేశయుగమేతెంచె-కాంగ్రెసువా రెన్నికలకయ్యమున దూంకి పెక్కు రాష్ట్రముల నఖండ విజయము నార్జించిరి - (1934 చివర) అంత 1032

## 1935

## కాంగ్రెసు సభ్యత్వముమాని మహాత్ముండు గ్రామపరిశ్రమసంఘము నేర్పఱుచుట

ఆ. మును మనీషిమౌళి మోతిలాలుంబలె, నేండు భూలభాయి నేతయగుచు
నడుపందొడంగె శాసనసభావిభాగంబు, కాంగిరెసుయశమ్ము కదలుకొనంగ. 1033

వ. మహాత్ముం డానాండు పల్లెలపెంపే భారతదేశము పెంపని నమ్మి యఖిలభారత గ్రామ పరిశ్రమసంఘము నేర్పఱిచి (1935 ఫిబ్రవరి) దంపుడు బియ్యము తిరుగటిపిండి గానుంగనూనె వడుకునూలు చేనేంతయు విరియునట్లు బదలందొడంగె - ఈ సంఘమున కున్న కట్టడంబట్టి 1034

ఆ. అంట్లుతోముచుండె నదిర! కుమారప్పు, తోడం గలసి యొక్క నాండు గాంధి
మసిని మున్గియున్న మగనివాలకము క, స్తూరిబాయి చూచి స్రుక్కి కినిసి - 1035

ఆ. క్రన్న వచ్చి భర్తకరమునంగల పెను, హండి నొడిసి "పోవయా మహాత్మ!
పోవయా! కుటీరమున"కని గర్జింప, నాథుండొక వెడందనవ్వు నవ్వి - 1036

గీ. ఓకుమారప్పు! ధన్యుండవోయి! నీవు, లెమ్ము పా మ్మనునిల్లాలు లేమింజేసి
యేను గృహశాంతి వలచి యీరాణిగారి, యాజ్ఞ లెట్టివియైన మాఱాడంజాల. 1037

క. కావున నింక నీయవ్వయు, నీవును బాత్రముల దిద్దుం దేనేగెద, నా
భావింపనివిదుమర నిపు, డీవెలందుక నా కనుగ్రహించిన దనియెన్. 1038

వ. అది యట్లుండె - మహాత్ముం డక్కాలమున సాత్త్వికాహారము సత్యాహింసాది దైవసంప దలం గూర్చుననియుం బ్రజాసేవకుండు వీథులం దుడిచి తనయూరు గరగరగా నుంచుట నేర్పవలయు ననియుం గృత్రిమమార్గములం బదయు సంతాన నిరోధము విషయ వాంఛలం బెనిచి యాత్మవికాసము నణంచుననియు మత ద్వేష జనకమగు సారస్వతము

బహిష్కార్యమనియు నాయాధార్మికసమస్యలన్ గుఱిచి హరిజనపత్రికలో వివరింపం
దొడఁగె-విద్యావిధానమును సవరింపవలయునని వృత్తి బద్ధమగు ప్రాథమికవిద్యను దీర్చి
- ఇది వార్ధావిద్యావిధానమని, మూలవిద్యయని రూఢికెక్కె - దీనిం బ్రయోగింప నూతన
విద్యాసంఘము నేర్పఱిచె - దేశికుం డిట్లు ప్రజలతోడిపొత్తు వీడక రాజనైతిక పరిస్థితుల
మఱవక హరిజనోద్యమమును గుటీరపరిశ్రమ ప్రచారమును సాగించు చుండ 1039

గీ. వచ్చె నాంగ్లప్రభుత్వమువారిముద్ర, లన్నియు గడించి నూత్న రాజ్యాంగశిష్టి
మార్గనాల్గు ము న్నాడినమాడ్కినైన, లేక యిది నేతిబీరపోలిక జనించె. 1040

క. తెలవారల సామ్రాజ్యము, కలకాలం బిచట నిల్పుకరణిని దంత్ర
జ్ఞులు పన్నినగారడ మిది, బలు పావంతయును లేనివా పిది కదరే! 1041

ఆ. రాష్ట్రపాలకునకు రాజప్రతినిధికి, నెల్లలేనిచనవు లిడి యొసంగి
మంత్రికిచ్చె నామమాత్రాధికారము, తినుము పొట్టపెంచుకొను మటంచు. 1042

క. ఇతఁ డౌనన్నది కాదని, ప్రతిపల్కెడిహక్కు రాష్ట్రపాలకున కిడెన్;
అతఁ డాంగ్లజాతిలాభ, ప్రతిషేధకు డగుట జరుగుపని కాదుగదా! 1043

ఆ. చట్ట మిది స్వదేశసంస్థానములఁ గుందు, జనత కెట్టిమేలు చాటదాయె
నినుపకాళ్ళ క్రింద నీప్రజ నజ్జున, జ్జగుట దీనిమదికిఁ దగులదాయె. 1044

గీ. ప్రజలతోఁగాక రాష్ట్రసభాసదస్య, చయముతోఁ గేంద్రసభసృష్టి జరుగుననియె
సేవయును విత్తమును దెల్లవానియిచ్చ, కగ్గపడియుండు ననియె నియ్యది తెగించి. 1045

వ. వెండియు రక్షణ లనుపేర నిది యడుగడుగునం బ్రజాస్వామ్యము నణఁచె - పాలితుల
వికాసము నోర్వనిసంస్థానములం దూర్చి కేంద్రమున సమష్టి రాజ్యాంగపద్ధతి నేర్పఱిచె
- ఇఁక నిది చేసినమే లేమన 1046

గీ. శాసనోల్లంఘనాదు లుత్సాహజనక, కార్యములు లేక విసుగుతోఁ గాలమీడ్చు
ప్రజలఁ గదలించె నుద్రేకపఱిచె దేశ, దుర్దశ నడంపఁజాలినత్రోవఁ జేర్చె. 1047

## 1936

## లక్నో కాంగ్రెసు

క. నిరసించె దాని లక్నో, పురి జవహరుయాజమాన్యమునఁ గూడిన కాం
గిరెసుమహాసభ; గాంధియు, విఱిచెం బెదవిని నిరర్థవిధి యిదియనుచున్.(ఏప్రిల్ 36)

క. ఐనను వచ్చినపెత్తన, మౌనని రాఁదగినదాని నడుగుట మే లం
చానాఁడు పేరుగన్నప్ర, జానేతలు కొంద ఱాడసాగిరి సభలన్. 1049

గీ. కాంగ్రె సలిగి కూర్చున్నచోఁ గానివారు, శాసనంబులొనర్చి దేశమును ముంతు
రాంగ్ల రాజ్యమునకుఁ గోట లగుదు రింత, చెట్ట సైరించుటెట్లని రిట్టివారు. 1050

వ. మఱియు నాపెద్దలు 1051

గీ. "సమ్మతినొసంగుభాగ్య మీశాసనమునఁ, బెక్కుమందికిఁ దక్కె నేచక్కినైనఁ
గాంగ్రెసునకు నగ్గలముగాఁ గలదు బలఁగ, మెన్నికలఁ గాంగ్రెసే తలయెత్తనోపు. 1052

ఆ. అపుడు ఔమ్ముసఱచి యది నేన ప్రజలకు, నంద నని వచించుహక్కు వదయు
నది నిజాశయంబు లానాఁడు దేశానఁ, జాటనేర్చుఁ గొంకు జంకు లేక. 1053

గీ. కేంద్రమునపెత్తనం బది కీస గాని, యగ్గలము రేపువచ్చు రాష్ట్రాధికార;
మేల వెనుకాదవలె మన; మెన్నికల జ, యించి యాటకట్టించుట మంచిదికద! 1054

గీ. ఎన్నికల నియ్యకొన్నచో నిపుదు వచ్చి, నట్టిచట్టము నియ్యకొన్నట్టు లగునె
తనకు దేశానఁగల బల్మిఁ గనుటకైన, నిలువవలయును గాంగ్రె సెన్నికల నేఁడు" 1055

వ. అని నానాప్రకారముల దేశముం బ్రబోధింప మరల నెహ్రూపెద్దతికమున జరిగిన ఫైజుపూరు కాంగ్రెసుమహాసభ (36 డిశంబరు) రానున్న యెన్నికలఁ గాంగ్రెసువారు పాల్గొనవలయు ననుతీర్మాన మంగీకరించె-వెనువెంటన (1937 మొదట) యెన్నికల సమరము సాగె - అంత 1056

## 1937

## ఎన్నికలు - కాంగ్రెసు గెల్పు

క. జే! జే! మహాత్మగాంధికి, జే! జే! యని దెసలు మాఱుసెలఁగఁ బలుకుచున్
బౌఁజులుగాఁ గాంగ్రెసువా, రాజికి నడచిరి త్రివర్ణమైనపతాకన్. 1057

క. ఊరూర సభలొనర్చిరి, వీరతమైఁ గాంగ్రె సనుభవించినబాధల్
చారూక్తుల వివరించిరి, కోరిరి స్వాతంత్ర్యసిద్ధికొఱ కీకోలున్. 1058

ఆ. పచ్చ పెట్టె కోటు బాపుజీ కోటు కాం, గ్రెసున కోటు జాతియుసురుపీల్చు
తెల్లదొరతనమ్ము దెగటార్ప నో టని, యడిగి రింటికింటి కరుగుదెంచి. 1059

క. కొసప్రాణముతో మూల్గెడి, ముసలమ్మయు దండమూని మున్ముందుగ నో
టొసఁగన్ వీధికి వచ్చెను, గుసుమించినగాంధిభక్తి గునగున నడుపన్. 1060

గీ. వంగపాంచాలముల సింధువసుధఁ దక్కఁ, దక్కుసీమలఁ గాంగ్రెసత్తతిని గెల్చె
జనపదమ్ములు నూతనోత్సాహవీచి, డోలికల నూఁగె నేలికల్ డీలుపడఁగ. 1061

గీ. మంత్రిపదవిని బూనుటా? మానుటా? యను, టన్న చర్చ జనించె నయ్యవసరమునఁ
బూనుటే మంచిదని వల్లభుండు ప్రసాదు,మున్నగుమహాశయులచిత్తములకుఁదోఁచె. 1062

వ. కాని కాంగ్రెసునందలి సామ్యవాదులకు సాచివ్యము తగదనుతలంపు గల్గె - దానను భయ
వర్గముల సంఘర్షణము హెచ్చె - అయ్యెడఁ బదవీస్వీకార వాదులు మహాత్ము
నాశ్రయింపఁ (1937 మార్చిలో) జట్టమునకులోపడి ప్రెగ్గడలు కావించు పనులఁ దమ
ప్రత్యేకాధికారములం బ్రయోగించియడ్డుతగులమికి రాష్ట్రపాలకులు పూఁటపడుదు రేని
మంత్రిత్వము నవధరింపవచ్చు" నని బాపూ సూచించె - దీనికిఁ బ్రభుత్వమువారు
'ససేమిరా' యనుటంజేసి కాంగ్రెసువా రధికారమునకు దవ్వుదవ్వుల నిల్చిరి - రాచవా
రితరపక్ష సభ్యులం గీలుబొమ్మమంత్రులఁ గావించు కొని (1-4-37) శాసనసభం
గూర్పక పరిపాలనము సాగించిరి - దీనం జేసి 1063

క. దిగజారె నేలుబడివా, రి గౌరవము దీనివెంటఁ బ్రిదిలెను బింకం
బిఁగ నేమిసెప్పవలె? వా, రగు ననిరి మహాత్మువల్కు నాదురవస్థన్. 1064

ఆ. ప్రెగడలైరి కాంగిరెసువార లపు డాఱు, రాష్ట్రములఁ బ్రజాళి యంపిలంగ (7-7)
నవల మెల్లమెల్ల యస్సాము సరిహద్దు, రాష్ట్రములను గనిరి రాచబలిమి. 1065

వ. మహాత్ముఁ డానాఁడు కాంగ్రెసుమంత్రు లగువారు 1066

గీ. పన్నుల నణంచి ఋణములబరువు డించి, కర్షణస్వామ్యమునకు నిల్కడ ఘటించి
హాలికునకు మేలుగావింపవలయుఁ గూలి,వానిరాఁబడి హెచ్చింపవలయు ననియె. 1067

ఆ. దుష్టశాసనములఁ దొలగింపవలయుఁ గా, రాగృహముల నలఁగు రాజకీయ
బంధితులను విడువఁబనిచి వారిపొలాలు, వారి కప్పగింపవలయు ననియె. 1068

ఆ. కల్లు నల్లమందు గంజాయివాడుక, నుచితశాసనముల నుడుపవలయు
వేలలో నొసంగు వేతనములఁ గోయ, వలయుఁ బేద నేదవలయు ననియె. 1069

గీ. పట్టములఁ జంక నిడుకొని పొట్టకొఱకుఁ, బట్టణమ్ములఁ దిరుగాడునట్టివారి
గోడు పోకాడుమార్గంబు చూడవలయు, వట్టివెచ్చము తగ్గింపవలయు ననియె. 1070

ఆ. మనకు శీఘ్రముగ సమగ్రస్వరాజ్యము, వచ్చునట్లు బదలవలయు, స్వార్థ
మాసచేయకుంట యత్యుత్తమంబగు, బ్రదుకుగా నెఱుంగవలయు ననియె. 1071

## 1938

## కాంగ్రెసుమంత్రుల పరిపాలన

వ. ఆచార్యుఁడిట్లు కాంగ్రెసుమంత్రులకు హితోక్తులు పల్కుచు వారి విజయము నాకాంక్షించు చుండ నయ్యమాత్యులు తమతమరాష్ట్రముల నిర్మాణాత్మకక్రియలు పెక్కులొనర్పసాగిరి - దేశస్వాతంత్ర్యమునకై హింసామార్గముద్రొక్కి ద్వీపాంతరవాసదండన మనుభవించు చున్న యువలనుసైతము వారు కారావిముక్తులఁ గావించిరి - అస్పృశ్యతానివారణము మద్యపాననిషేధము కుటీరపరిశ్రమపోషణము మున్నగు మేలిమేలిపనులు ప్రారంభించిరి - ప్రజలలో జాతీయోత్సాహము రేకెత్తించిరి - స్వరాజ్యతృష్ణ పెనిచిరి - స్థానిక సంఘములు పురపాలకమండలు లానాఁడు కాంగ్రెసువారి యాజమాన్యమునకువచ్చి మంత్రుల కార్యక్రమమున కండగానిలిచె - ఇంతలోఁ గాంగ్రెసుమహాసభ ఘూర్జరము నందలి హరిపురమున జరిగె (1938 ఫిబ్రవరి) చెఱసాలనుండి యపుడే వచ్చినబోసు దేశికుని సూచనపై దీని కధ్యక్షుఁడాయె - మహాత్ముఁడే యీసదస్సునకుఁ బ్రారంభోత్సవ మొనర్చె - జాతీయ విద్యావిధానమునుగూర్చియు సంస్థాన ప్రజాసమస్యలను గూర్చియు గర్షకోద్యమమును గూర్చియు నీపరిషత్తువారు తగునిర్ణయములుగావించిరి - సభ జయప్రదముగా ముగిసె - కాని క్రమక్రమముగా బోసు బాపు నెదుర్కొనందొడఁగె- ఇతని కానాఁటిరాజ్యాంగపద్ధతి సంతృప్తి నీదాయె - కాంగ్రెసువారు శాసనసభలం బాసి తీవ్రతరజాతీయావేశముతో నాంగ్లప్రభుత్వమును డీకొని సంపూర్ణస్వరాజ్యమును వెనువెంటన సాధింపవలయునని యతఁ డారటింపసాగె-సామ్యవాదు లితనికిఁ దోడైరి - బోసు వెలువరించు వేఁడివేఁడి పల్కులు ప్రజకు రుచించె - మఱియు 1072

## 1939

క. ఆనాఁడు ప్రెగడతనముం, బూనిన కాంగ్రెస్సువారిపోకడ ధర్మ
గ్లానికిఁ గారణ మగుటయు, నీనేత వచించునుడుల కిదె నాదరమున్. 1073

ప. ఇట్టితతిఁద్రిపురికాంగ్రెసు వచ్చె (మార్చి) - దీనియధ్యక్షతకు బోసు పట్టాభి సీతారామయ్య పోటీపడిరి - విజయలక్ష్మి బోసునువరియించె - పట్టాభిసీతారామయ్య యోటమి నాయోటమి యని యానాఁడు బాపూ నుడివె - బోసువాదము మహాత్ముని బాధించు చున్నదని లోక మానాఁడు లెస్సగుర్తించి నిట్టూర్చె - కానఁ ద్రిపురి కాంగ్రెసులో నధ్యక్షుని వర్గమువారి తీర్మానము లన్నియు వీఁగి గాంధిపక్షము వారి నిర్ణయములెల్ల నెగ్గె - తనకిష్టముగాని కార్యక్రమమును సాగింపనొల్లక బోసు కాంగ్రెసు పీఠమును వదల రాజేంద్రుఁ డాగద్దియకు వచ్చె - బోసు వేఱుదారి పట్టె. 1074

## రాజకోట సమస్య

ఆ. దేశికుఁడు సుబాసు తెఱఁగునకుం జెక్కు, నాళ్ళనుండి కలఁగి నలఁగుచుండ
రాజకోటలోని రాచతిరికంబు త, దీయహృదయశల్య మాయె నకట! 1075

ఆ. రాజకోట ఘూర్జరక్షోణి నున్న దే, శీయరాజ్యములఁ బ్రసిద్ధరాజ్య;
మం దమాత్యుఁడై మహాత్మునిపిత కరమ్, చందుగాంధి యశము సంతరించె. 1076

క. కావలయుఁ బ్రజాస్వామ్యం, బీవలయును మా కటంచు హింసకు నెడయీ
త్రోవం దగునాందోళన, కావించిరి నాఁడు ప్రజ లకంపితదీక్షన్. 1077

గీ. కాంగిరెసుపన్నున జగామగండు వల్ల, భాయి వీరికి నేతగా వచ్చినిలిచె
నక్కజమ్ముగసాగె సత్యాగ్రహంబు, డిక్కుతోఁపక యొప్పె సంధికి నృపుండు. 1078

ఆ. ప్రాంత శాసనమ్ముఁ బరికించి సవరించి, వల్లభుండు జనము లుల్లసిల్ల
సరణి సంతరించె సంధిపత్రంబును, వల్లె యని విభుండు వ్రాలుచేసె. 1079

ఆ. మఖనుబుట్టి పుబ్బ మణఁగిన దన్నట్లు, ధారణీశ్వరుండు దారిదప్ప
నణఁగెఁ గ్రొత్తచట్ట మైదాఱునెలలలో, సాగె మరలఁ బ్రజల సంగరంబు. 1080

గీ. ప్రజకు నుత్సాహమొదవింప వచ్చిచేరె, నమ్మ కస్తురిబాయి సత్యాగ్రహమున
నామె నపుడప్డ చెఱసాల కగ్గపతిచి, యేలుబడివారు తనిసిరి జేల లగుచు. 1081

ఆ. రాజకోట నిట్లు రాఁజినయనలంపు, సెగలు తాఁకి గాంధిచిత్త మెరిసెఁ
దిమ్మఁదనము పెద్ద దిగజాతియున్నను, గురుఁడు కదలె రాజకోటదెసకు. 1082

ఆ. పిన్ననాఁటినుండి పృధివీశ్వరుఁడు తన, మిత్రుఁ డగుటఁ గీడు మేలు తెల్పి
యతని దిద్ద నొజ్జ యత్నించెఁగాని త, దుక్తి కొప్పఁడాయె నొదయఁ దదిర! 1083

గీ. సంధిసూత్రమునందలి శబ్దములకుఁ, గొన్నిటికి రాజు సూచించెఁ గ్రొత్తయర్థ
మదియశాస్త్రీయమనెగాంధియవనినాథుఁ, డదియశాస్త్రీయమనెమంత్రిననుసరించి. 1084

మం. గత్యంతరములేక గాంధి యవ్వేళ, నుగ్రోపవాసంబు నూని కూర్చుండె (3-3)
నారోగ్య మఁడగి యూఁగాడెడివృద్ధు, బాపుజీ యెటులౌనొ పరమేశుఁడేమి
సేయునో యని ప్రజల్ చింతాపయోధి, నణఁగిరి; సంధివాక్యములకుఁ దగిన
యర్థము సార్వభౌమాధికారంబు, గలవారు తేల్చుచోఁ గాదాద నని మ
హాత్ముఁడు సూచించె; నాచార్యుమాట, పాటింపవలె నేలుబడివా రటంచు
నన్ని రాష్ట్రంబుల నలజడి రేఁగె, మంత్రివర్గము లీసమస్య యిట్లున్నఁ
ద్యజియింతు మధికార మని పల్కసాగె, హస్తినాపతి వచ్చె ననుకూలగతికి

మానుఁ దుపాసంబు మానుఁ దటంచు, గాంధికిఁ దీఁగవక్కాణమ్ము పుచ్చెఁ
బాడి పరీక్షింపఁ బంపె గ్వాయరును, భారతన్యాయాధిపతిశిరోమణిని
బ్రాయోపవేశంబుఁబాసె నాచార్యుఁ, (7-3) దయ్యగండముతప్పె ననిదేశమలరె
న్యాయాధిపతినిర్ణయము నచ్చెఁ బ్రజకుఁ, దలయొగ్గె మేదినీధవుఁడు తీర్పునకు. **1085**

వ. ఐనను మహాత్ముఁ "డీపరిష్కారమునం దేను ఢిల్లీపతిసాయ మర్థించుట యతనికి లోపడి బ్రదుకురాజున కొత్తడితెచ్చుట కాదా" యని వెనువెంటన యూహించి యట్టిపని యహింసారాధకున కనుచిత మని పెద్దయుం బరితపించి తేనిం గని **1086**

క. ఓరాజ ! నేఁడు పుట్టిన, తీరుపు నీచిత్తమనుమతింపనిచో నీ
వారీతిన చేయు మనన్, బోరన నృపకుల మెలర్చి పొగడె మహాత్మున్. **1087**

ఆ. వచ్చె రాజకోటవదలి సేవాగ్రామ, కుటికి గురుఁడు శిష్యకోటి తనియ
నొదలు మిగుల స్రుక్కియున్నను వేవేగ, హరిజనోద్యమాదులందుకొనియె. **1088**

## ద్వితీయప్రపంచయుద్ధము - కాంగ్రెసువారు సాయపడమి

ఆ. రాజకీయగగనరంగ మవ్వల ద్వితీ, యప్రపంచసంగ రాభ్రపటల
పిహితమై భయమ్ము పెనిచె శాంతిప్రియ, లోకమునకు ధర్మధీకమునకు. **1089**

వ. ఆనాఁడు జర్మనీనియంత హిట్లరు రష్యా నణఁపంజూచుచుండె-ఇతని కిటలీనియంత ముస్సోలినీ తోడయ్యె - ఆంగ్లేయులు గోడమీఁదిపిల్లివలె నుండి జర్మనీరష్యాల నడుమ నీర్ష్యాద్వేషములు హెచ్చింపసాగిరి - విధిలేక రష్యా హిట్లరుతోఁ బరస్పర సహకారసంధి కంగీకరించె(24-8-39)-అమ్మఱునాఁ డింగ్లాండుపోలెండులకు నితరేతర సాహాయ్యము పట్ల నొడఁబాటు కుదిరె - వెనువెంటన పోలెండున విడిసియున్న మీసేనల నుపసంహరింపవలయునని బ్రిటను జర్మనీ కొక హెచ్చరిక యొనరించె - హిట్లరు దానిని సద్దసేయఁ దాయె - పదంపడి (3-9-39) ఇంగ్లీషువారు జర్మనీపై సమరముం బ్రకటించిరి - నాఁడే రాజప్రతినిధి హిందూదేశముసైతమింగ్లీషువారి పక్షమున నిలిచి ప్రజాస్వామ్య సంరక్షణమున కనిసేయు నని నిరంకుశముగాఁ బ్రకటించె - భారతీయసైన్యముల సింగపూరు మున్నగు తావులకుఁ బంపె - కేంద్రప్రభుత్వాధికారము లాయారాష్ట్రముల హెచ్చించె - అంత **1090**

క. దారుణ మీరణకథ విని, పేరలజడి నందె గాంధి; పృథివిని సత్యం
బాతెనె యహింస యడఁగెనె, మూరెనె మదమానదంభమోహము లనుచున్. **1091**

క. మది కలఁతంబడ దేశికుఁ, డెదియుం దోఁపనియవస్థ నెంతయు నలఁగెన్
నదులైపాఱునె మానవ, రుధిరం బని వగచె నిర్నిరుద్ధవ్యథుఁడై. **1092**

ఆ. ఏదియెట్టులైన నింగ్లీషువారికి, నపజయంబు కూడదని తలంచె
నైననేమి మెచ్చఁదాయెఁ దదీయసా, మ్రాజ్యవాదసరణి మనుజమౌళి. 1093

ఆ. ఈయవలె స్వరాజ్య మీనేల కిపు డింగి, లీసువా రటంచు నాసచేసె
నీయరేని కాంగ్రె సెదిరించి పదయుట, మంచిదౌనె యని తలంచె నొజ్జ. 1094

క. ఈరణమున నాంగ్లేయులు, వారికిహితులైన ఫ్రెంచివారుం జెడుచో
భారతము పదయుప్రభుతా, గౌరవమున కెంతవిలువకల దని యెంచెన్. 1095

ఆ. చిత్రచిత్రభావసేవధియై డిల్ల, పదుమహాత్ముఁ డపుడు వెడలెఁ దంతి
వార్త వచ్చుకతన వైస్రాయిచెంతకు, మోయరాని యెదఁదమోపుతోడ. (4-9) 1096

క. ఆదొర మహాత్మునకుఁ దగు, నాదరము నొసంగి "దుర్భరాపద రణ మా
పాదిల్లె నేఁడు; దేశం, బాదుకొని ప్రభుత్వజయము నాసింపవలెన్. 1097

ఆ. కాంగ్రెసునకుఁ దగినగతిఁ బల్కి యది సమ, రానుకూలవిధుల ననుసరింప
సహకరింపుమన్న! జగమున ధర్మంపు, వాసి నిల్పఁ బోరువైపు మనది". 1098

ఆ. అనుడు నొజ్జ యిట్టులనెఁ "బ్రభూ! నామేన, నెల్లయెదలఁ గల దహింసనార్చి;
యిట్టినేను జాతిహృది నిపు డెఱింగింపఁ, బాలుపడుట పరువు కోలుపడుట. 1099

క. నాతోడ రాయబారము, లీతతి నెట్లమరుఁ? గాంగ్రెసే తన కింపౌ
రీతి వివరింపవలెఁ ద, న్నేతల రావించి వారినియతిం గనవే! 1100

వ. వైయక్తికమగు నాసానుభూతియు నైతికసహాయతయు నేఁ డింగ్లాండు ఫ్రాన్సు దేశముల పట్లన యుండు – మానవ సమాజమును దానవధర్మముదెస కీడ్చు నీ సంగ్రామ మీశ్వరానుగ్రహమున నవలంబితముగా నణఁగారుఁగాక! అట్లుగాక లండను మహానగరమునందలి పార్లమెంటుభవనము, వెస్టుమినిస్టరు యాబీ, సెంటుపాల్సు కెథీడ్రలు మున్నగు చరిత్ర ప్రసిద్ధనిర్మాణములపై శాత్రవ వైమానికదళములు బాంబులం బ్రేల్చునేని యే నాదుర్వార్త వినఁగలనా? – తద్దృశ్యము నూహించునంతమాత్రన నాగుండె జలదరించుచున్నది–అమంగళము ప్రతిహతంబగుఁగాక!"–అని మరలివచ్చి(5-9-39) తన ప్రయాణవిశేషములం బ్రకటించె–పిమ్మటఁ గాంగ్రెసు నాయకులాచార్యుని సమక్షమున సేవాగ్రామమునఁ గూడి(8-9-39)యైదాఱునాళ్లు దేశపరిస్థితులు చర్చించి 1101

గీ. "భారతము కత్తిపట్టుటా? పట్టకుండు, టా? యటన్న సమస్య నయ్యవని నుండు
ప్రజలు పరికించి తేల్చుకోవలయుఁ గాని, పరు లపాత్రు లిటం బరిష్కరణమునకు. 1102

గీ. హిందూదేశపు సాయం, బందుట కింగ్లాందు దేశ మాసించినచో
ముం దుభయ దేశగరిమము, లందుల్యతగూర్చి యవ్వలం గోరఁదగున్. 1103

క. పోలెండునం బ్రజాపరి, పాలనమేర్పఱుపఁ గత్తిపట్టితి నని ధ
ర్మాలాప మాడు నింగ్లాం, దేల స్వరాజ్యంబు నిదదు హిందూమహికిన్? **1104**

గీ. ఇంగిలీసువార లిటఁ దేటతెల్లగా, భారతాత్మ తనియఁ బల్కరేని
కాంగ్రె సెట్లు కోరఁగలదు దేశీయుల, బవరమునకుఁ దోడుపడుఁ దలంచు." **1105**

వ. అని (14-9-39) తీర్మానింప లిన్‌లిత్గో భారతస్వాతంత్ర్యమును గూర్చినచర్చ యుద్ధానం తరమునం దప్పు నిప్పు దేమియుం బొసఁగదని (17-10-39) యసంధిగ్ధముగాఁ జాటె. **1106**

మం. అంతఁ గాంగ్రెసువార లని కేమి సాయ, పదఁజాల మని తేటపఱిచి రేల్బడికి
హస్తినాపురసభ కరుగరా దనుచుఁ, బనిచి రానతి తత్సభాసదస్యులకుఁ
బాకమ్ముసెదెఁ గానఁ బదవులవీడుఁ, దని రాష్ట్రమంత్రుల కాజ్ఞలొసంగి (22-10)
రదుగడుగున వీరి కడ్డంకులిదుచు, వలదు స్వాతంత్ర్యము వల దిపు దనుచు
ముస్లిములీగును మూఁపునఁబూని, నాఁడు బంపిల్లె జిన్నా దారితప్పి
యిది కృత్యమని నిర్ణయింపఁగాలేక, కాంగ్రెసు మిగులఁ ద్రొక్కటపడసాగె. **1107**

వ. కొన్నాళ్ళ కది తేతి యలహాబాదున (19-11-39) సమావేశమై యాంగ్ల ప్రభుత్వము వారు భారతదేశమును స్వతంత్రదేశమ్ముఁగా గుర్తించి యఖిల రాజకీయపక్ష ప్రతినిధుల తో నొకరాజ్యాంగనిర్మాణపరిషత్తును నిర్ణయింపవలయునని తీర్మానించె. **1108**



# మ హా త్మ క థ

## మూడవ భాగము

### 1940

మధ్యా. అంత నాచార్యుఁ డీనిర్ణయము భారతావనీవిభుని
చెంతకుఁ బంపి కాంగ్రెసు తరిచి వెలార్చినకోర్కి యిది గ
ణింతువే యనుడు ససేమిరా యని నిరసించె నతఁ; డ
హంత పైకొన్నపల్కులఁ గలంచె మహాత్మునెదంద. (15-2) 1

## రామఘర్ కాంగ్రెస్ శాసనోల్లంఘన నిర్ణయము

వ. విఫలప్రయత్నుండగు బా పానాఁడు శాసనోల్లంఘన మింక ననివార్యము కాఁబోలు నని విచారపడసాగె – పరిస్థితులిట్లుండ నబుల్ కలామాజాదు నాధ్వర్యవమున రామఘర్ కాంగ్రెసుమహాసభ (19-3-40) యారబ్ధమాయె – ఏతదధ్వర్యువు విద్యా దవతంసము – విమర్శ కాగ్రేసరుండు – వీనుమిగిలిన వేదాంతి – మేధానిధి – సకల సంస్కృతి పరిజ్ఞాత – మహమ్మదీయ ధర్మమర్మవేత్త – రమణీయమూర్తి – నిరంతర స్మితప్రసన్న వదనుండు – జాతీయవాదిమూర్ధన్యుండు – సాహాయ్యనిరాకరణముఁ దొట్టి కాంగ్రెసు నారాధించుచున్న నిష్కళంక దేశసేవకుండు – ఇమ్మేటి యుపన్యాస మించుక వివరింతు. 2

క. "మన రాజకీయరథ మీ, దినమున విషమోర్వి నేగుదెంచుచు నుంటన్
బెనుసంకట మేర్పడె మన, కనూనజాగర్య వలయు నది పాయగిలన్. 3

ఆ. అదమఱచి తప్పటడుగువైచిన మన, కతలమునకు జాఱుగతి ఘటిల్లు
వేయికనుల దారి వీక్షసేయుచు మన, మిపుడు లక్ష్యభూమి నీఁగవలయు. 4

గీ. హిట్లరు ముసోలినీలు నేఁ డెగసిపడి ప్ర, జాస్వతంత్రత నణఁగార్చుసరణి దూష్య
మగునుగాని యాదరణీయమగు నె బ్రిటను, వారు పాటించు సామ్రాజ్యవాద ఫక్కి. 5

గీ. వలయు నాకు స్వతంత్రత వలయు ననుచుఁ, బలుకునధికార మున్నది భారతోర్వి
కీపలుకు లెక్కసేయని యింగిలీసు, దొరల కీదేశ మిపు డెట్లు తోడుపడును? 6

గీ. ఆఫ్రికాకెనడావంటి యధినివేశ, రాజ్యముల వేఁడినట్ల యీరాచవారు
భారతము నేలవేఁదరు బవరమునకు, సాయమొనరింపుమా! యని సరస ఫణితి. 7

క. ఎవరికిఁ జెప్పక భారత, భువి నాలంయినకు నీద్వఁ జోలునె? నేఁ డీ
యవనికిఁ గలవద మెట్టిది, యవురా! జానిసము దీని కనివార్య మెకో! 8

గీ. ఎనఁగవలయుఁ బ్రజాస్వామ్య మెనఁగవలయు, సమర మిద్దానినిల్పన సాగు ననుచు
వక్కణించిన యింగ్లీషువారిపల్కు, లాసియాఖండమున కొప్పవా? కెబాసు! 9

ఆ. తెల్లవారిపాదితెఱఁ గెటులుండుఁగా, కోర్వ దిఁకను భారతోర్వి దాస్య;
మిపుడు మంత్రిపదవులే వీడెఁగాని రే, పెట్టిత్యాగమైన నిచ్చగించు" 10

వ. ఈమహాసదస్సు దేశము శాసనోల్లంఘనమునకు వేవేగ నాయిత్తము కావలయుననియు
మహాత్ముఁడేయాసమరమునకు నాయకత్వము వహింపవలయు ననియుఁ దీర్మానింప
నయ్యెడ సత్యాగ్రహవిధాత యిట్లుపల్కె. 11

## సత్యాగ్రహ నేతగా బాపూ పల్కినపల్కులు

గీ. "అన్నలార! యే నింతకుమున్ను ప్రజల, పాత్రత నొకింతలోటు కన్పడిన నోర్చి
కయ్యమున కియ్య కొంటిని గాని నేఁడు, సై ఁపలే నావగింజంత లోపమున్న. 12

క. పోరాటము సాగించెడి, భారము తలఁదాల్చినట్టిపదవా లేయే
తీరులు విధించు వానికి, వారక యాయిత్తపడుట వలయు భటులకున్. 13

క. మీ రింతకుము న్నెఱుఁగని, ఘోరాపద లిప్డు దెదురుకొనవలయుఁజూడీ!
తీఱము లింటన్ బయటన్, మూరిన వీనాఁడు ధైర్యమును సదలింపన్. 14

గీ. ఏలువారికి మనకోర్కె లిపుడు తేట, తెల్లగాఁ బల్కితిమి వారి తెఱఁగు వార
లట్ల చాటిరి రణబాధ నలయుప్రభుత, నెదురుచో నెన్ని యోచిక్కు లొదవి తీరు. 15

ఆ. ఉచితమైనబాట నుద్యమ మేగుచో, బయటిబెడఁద కేను భయమునెంద
నింటిబెడఁద వచ్చె నీనాఁడు దీని! సై, రించు టెట్లు జయము గాంచు టెట్లు? 16

గీ. కాంగ్రెసున కగ్గపడె నధికార మనియ, నర్హులిందుఁబ్రవేశింతు రకట! నేఁడు
కలరు ప్రతిరాష్ట్రమందు లక్షలకొలంది, క్రొత్తసభ్యులు కాంగ్రెసుకూటువలను. 17

ఆ. స్వప్రయోజనమ్ము సాధింపఁజూచు ని, మ్మూఁక మనకుఁ బెద్దముప్పు గూర్చు
వలదటంచు దీని వారించునా ప్రజా, స్వామ్యమునకుఁ బుట్టి స్రగ్గుసంస్థ. 18

ఆ. నిప్పువోలె మనము నిలఁబడి దేశీయ, కాంక్ష వెల్లడింపఁగలిగినప్డు
దెదురు సెప్పఁజాల దీగుంపు నైతిక, బలము లేక తిచ్చపాటుసెందు. 19

గీ. ఎన్నికల కాలమునఁదక్క నితరవేళ, మనము దీని మొగమ్ము గన్గొనమి నిక్క
మెద తెగనిపొత్తు లేనిచో నెట్లడంప, నేరుతుము దీని లంపులమారితనము. 20

గీ. మఱచితిమికదా మనము నిర్మాణకార్య, సరణి పల్లెలమేల్కొల్పు సరణి లోక
సేవ కహింసమహిమిక తెల్లసేయుసరణి, ప్రాథమికసభ్యుఁ డెట్లు లోపమును మనకు. 21

క. మనలో ముఠాలు పెరిఁగెను, గనఁబడ దావంతయేని క్రమశిక్షణ మే
చెను జిన్న పెద్ద తగవులు, మునుకొనె నీరస మసూయ మున్నగుకంపుల్. 22

వ. మనవా రాంతరంగిక వ్యవహారములపట్ల నహింసం ద్రోసిపైచిరని తోఁచెడిని - ఏ నెట కేగినను దీనియానవాళ్ళు గోచరించుచున్నవి - మూలమునకు ముప్పువచ్చు నట్లు మనవారు పౌఁజాలుదీరి పోరుట ప్రజాస్వామ్యలక్షణ మగునందురా? మన కాంగ్రెసు కేవలప్రజాస్వామ్యసంస్థ కాదు - ఇది సమరమునుసైతముసాగింపవలయు - సమర యాత్రలోఁ బ్రజాస్వామ్యము నిలువనేరదు - సేనాపతియాదేశమే శాసనమగును - సైనికులెల్లరున్ దానిని శిరసావహింపవలయు - నేఁడు నేను మీ సర్వ సైన్యాధిపతిని - నన్వంటి దుర్బలుఁడు సర్వసేనానాయకుఁడుఁ దగుట మనచరిత్రం గానము - నాకున్న బలము ప్రేమమాత్రము-ఒకరీతింజూచిన నది వలఁతి - వేఱొండు భంగిం గనిన నది యలఁతి - ఏను మనసార నెల్లమానవులం బ్రేమింతు - ప్రేమమునకుం దోడగునది సైరణ - కాన మీరు నాకెదురాడక తాల్మిమైన న్ననుసరింప వలయు - నా చెప్పినపను లొనర్పవలయు - ఒండేని యేను సత్యాగ్రహము నారంభింపనొల్ల - మీ రపుడు లాఁతినేత నాశ్రయింపవలసివచ్చు - అట్టిపని జరుగకుండును గాక! 23

గీ. కారకుంబోవ నీనాఁడు మీరు సిద్ధ, పడితి రిది మంచిదేకాని బండిగమున
కరుగుటకుముందు సముచితత్యాగ మాచ,రించి చెఱకీగుహక్కు నార్జింపవలయు. 24

ఆ. బొంకు మానవలయుఁ బోనాడవలె హింస, భయము కినుక మమత పాయవలయు
నితర దేశవస్త్ర మీఁగవలయు నీవి, లేనివార లందలేరు శుభము. 25

ఆ. వినుఁడు సూనృతంబ వేల్పు నా; కదియ కే, శవుఁ డనంగఁ బరమశివుఁ డనంగ;
నేను సత్యమున కహింసకుఁ బూజారి, నన్నులార! ప్రాంతలెన్ను నాది. 26

గీ. ఏను మీవంటినరుఁడన కానఁ దప్పు, లపుడపుడు సేయుచుండు 'మహాత్మ' బిరుద
మర్థమగును నా కని కలనైన నఁదలఁపఁ, గొంద ఱిదివాడుచో లజ్జఁగూరుచుండు. 27

క. భగవద్దృష్టికి నేత, జ్జగతీజనులెల్ల రొక్కచందమువారే
యగుదురు; సమానరాగం, బగపఱచును వేల్పు మనుజులందఱియందున్. 28

గీ. హరిజనులు జన్నిగట్లు మహమ్మదీయు, లితరులును మన్నతికి నొక్కగతిన తోఁతు
రేను జుల్క వచింప జిన్నానుగుఱిచి, యతఁడు నాతమ్ముఁగుఱ్ఱలయం దొకండ. 29

క. న న్నీసోదరుఁ 'డాజమ్, జిన్నా' తనజేబునందుఁ జేర్చుకొనినచో
మిన్నందుదు నాచేసిన, పున్నెంబులు పండివచ్చెఁబో! యనుకొందున్. 30

వ. నాపల్కు విశ్వసింపనిమహమ్మదీయుఁ డీదేశమునం దొకఁడేని లేఁడనిచాటి యేను మునిసినకాల మింతకుము న్నొకటి కలదు - కాని నేఁడు నా కీభాగ్యము లేమి కెంతయున్ వగతు-ఉర్దూపత్రికలన్నియుం జదువఁట నాకయితి గాకున్న యది - నన్నుం జెడనాడు పల్కులు వానం జెక్కు లుండవచ్చు - ఈవ్రాఁతల కేను దురపిల్లను - మహమ్మదీయు లాదరించు మతగ్రంథము ఖురాను నాచదువనిది కాదు - దానింబట్టి హిందూముస్లిముల నల్లా వింగడింపఁడని చెప్పనోర్తును - భారతమంత్రి జెట్లండుప్రభువునకు గాయమేర్పడిన తఱి నెంతో కుందితిని - అయ్యభిఘాతము నాకే తాఁకినట్లు భావించితిని - మీ కేను వలయుచో దీని యంతరార్థము నెఱుంగుఁడు - ప్రత్యర్థులడెందమున సౌహృదము నొదవించుటయ నాలక్ష్యము - నే నాంగ్లేయుల సామ్రాజ్యవాదము నెదిరింతును - కాని తత్సామ్రాజ్య యంత్రసంచాలకులు నాపగతు రని తలంపను - వారికీడు కోరను - వారి మది మార్పు వలతును. 31

ఆ. మైత్రికొఱకు వేఁగు మన్మానసము సదా, మీ రెఱుంగవలయు నీరహస్య
మెన్నివిడుతలైన నేగెద వైస్రాయి, చెంత కుచితమని తలంతునేని. 32

గీ. స్మట్సుతో మున్ను సమరంబుసల్పనిలిచి, కయ్యమును మానుకొనువీలుకలదెచూడు
మన్న! యని తీఁగవక్కాణమంపినాఁడ, నతని కాగ్రహమనివార్యమయ్యె నపుడు. 33

క. అది న న్నవమానించుట, కద యని గాసిల్లనైతిఁ గాలము గడవన్
హృదయములు కలసినవి మా, కిది లోకమెఱుంగు నోర్మి యింతయొనర్చెన్. 34

ఆ. సంధి కెదురు సూచుసర్దారు సాధించు, లాభమేమి యని తలంపఁజనదు
దేశమునకు నష్టిదెచ్చెడిసంధి కే, నేయవస్థనైన నియ్యసేయ. 35

ఆ. ఏనుమాతృభూమి నితరుల కమ్మెడి, వాఁడఁగాను దీనివాసికొఱకు
బలిమికొఱకుఁ గానిపని యొక్కటియుఁ జేయ, నిచ్చగింప నమ్ముఁడీ! మదుక్తి. 36

ఆ. నాయొనర్పురణమునకుఁ బ్రాపు రిపుదెస, నిష్కళంకమైన నెమ్మి పఱపు;
టిది హుళిక్కియైన నెట్లాఫ్రికాగడ్డ, నంతవారి నెద్రిచి కాంతు జయము? 37

క. పోరాటమునకు నిత్తఱి, మీ రర్హులుగామి నిజము మీతో సమరం
బారంభించుట యోటమి, కోరుట యగు నెట్టు లియ్యకొందు నవజ్ఞన్. 38

క. రాటనమునకును మనపో, రాటమునకుఁ గలదు విడువరానిచెలిమి; యీ
మాట సరిక్రొత్తదగునా, నేఁటి కిరువదేండ్లనుండి నేఁ బల్కెడిదే! 39

గీ. ఒరులు దీనిఁ బరిహసించుచున్నకొలఁది, నాకు హెచ్చెరాట్నముమీఁదినమ్మకంబు
కానిచో రైలునందును దీనిఁద్రిప్పు, చుందునా? యంతమూర్ఖుఁడనొక్కొ నేను. 40

గీ. వెజ్జు వలదని చెప్పినన్ విడువనైతి, రాటవ్వుంఱని; మీరు నామాట నమ్మి
భక్తిమై నూలువడుకుఁడు రక్తిమైధ, రింపుఁడీ ఖద్దరును జాలిపెంపు వలన. 41

వ. కాంగ్రెసుసంఘములనెల్ల సత్యాగ్రహసంఘములుగా మార్చుఁడు-అస్పృశ్యతా విముఖులై దినదినము నూలువడుకుచు నప్పసముగా ఖద్దరుధరించువారిని సత్యాగ్రహుల పట్టికలోఁ జేర్పుఁడు-అపాత్రులగు సత్యాగ్రహు లొకవేయిమంది లభించుటకంటెఁ బాత్రులు పది మంది చిక్కుట లెస్సయని నమ్ముఁడు - దౌర్జన్యమున్నంతదనుక సత్యాగ్రహము సాగుట దుశ్శకము-కాన మీ రహింసా పరాయణులరై విజయంబువడసి నిరంతరసంప్రహారము లతో విసిగివేసారియున్న విశ్వమునకు నూతనసందేశము నొసఁగుఁడు." 42

ఆ. అనిన సభ్యులెల్ల రగు నగు నని మహా, త్ముని నుతించి రంత ముగిసె గోష్ఠి
యదనుసూచి ప్రభుతనెదిరింప బాపుజీ, వేచియుండెఁ గొమ్ము గాచియుండె. 43

క. పదపడి హిట్లరుదెబ్బకు,. నదవదమై ఫ్రాన్సు లొంగ నాంగ్లధరిత్రిన్
గదుముటకు జర్మనీవా, రి దళమ్ములు పేర్చె గర్వరేఖాస్ఫూర్తిన్. 44

వ. అయ్యవసరంబున 45

## కాంగ్రెసువారి వ్రతభ్రష్టత

గీ. జగము కంపిల్లఁగా హిట్ల రెగసి యాంగ్ల, ధారణి నదంచుచో నిఁక భారతోర్వి
కెట్టిగతి పట్టునో యని బిట్టుకలఁగి, నలఁగి కాంగ్రెసుపెద్దలందఱును గూడి - 46

వ. రాజగోపాలాచార్యులవాచావైభవమునకు లోఁగి యాంగ్ల ప్రభుత్వమువారు యుద్ధా నంతరము హిందూదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగ నిపుడంగీకరించి వెనువెంటన కేంద్రమునఁ దాత్కాలికజాతీయప్రభుత్వము నేర్పఱుతు రేని హింసాహింసలఁ బాటింపక సమరమునకు సాయపడుదు మనియు మహాత్ముఁడీనిర్ణయమున కప్పలివాఁ దనియుఁ బూనాలోఁ (27-7-40) దీర్మానింప నేల్బడివారానిర్ణయమును లెక్కసేయరైరి - కాన వ్రతభ్రష్టతవినా కాంగ్రెసున కబ్బిన ఫల మావంతలేదాయె - అంత నాకాంగ్రెసు47

ఆ. లజ్జఁగూరి తాల్మి నుజ్జనచేసి యా, బానిసము భరింపరాని దని తె
గించి ప్రభుత నెదుర నెంచి మహాత్ముని, శరణుసొచ్చి తప్పు సైఁపుమనియె. (17-9) 48

ఆ. చెడినకొడుకు శక్తు లుడిగిన పిమ్మట, బిక్క మొగముతోడఁ బితను జేరి
శిరమువంచి నిల్చు తెఱఁగున బాపుజీ, కడకు వచ్చి నిలచెఁ గాంగ్రె సపుడు. 49

ఆ. తండ్రి కొడుకొనర్చు తప్పును మన్నింప, కేమిసేయు? ప్రేమ నె ట్లడంచుఁ?
బిన్ననగవు మెఱసి విన్నన పోకార్చి, యొజ్జ కాంగ్రెసునకు నొసఁగెఁ జనవు. 50

క. ఐనను దుర్భరసమర, గ్లానింబడి నవయునేలికల నొంచుపనిం
బూనుట కిది తఱిగా దని, మానసమునఁ దలఁచె ధర్మమర్మవిదురుఁడై. 51

## వ్యష్టి సత్యాగ్రహము వినోబాతోఁ బ్రారంభమగుట

వ. కావున భారతస్వాతంత్ర్య సంగ్రామమున కానాఁడు విస్తృతరూప మీయనొల్లక వ్యష్టి సత్యాగ్రహమ తగునని తేల్చి సత్యాగ్రహు లహింసాపరాయణులై నిర్మాణ కార్యక్రమ ప్రియులై సర్వదా ఖద్దరుధరించువారై యుంట వలయునని యానవెట్టి తనయంగీకృతి నందినవారే ముందుగా దొరతనమువారి కెఱుకచేసి బహిరంగస్థలమున సత్యాగ్రహము సాగింపవలయునని నిర్ణయించె - మఱియు సత్యాగ్రహికి "బ్రిటిషువారి యుద్ధ ప్రయత్నములకు జనధనము లంపి సాయపడుట తప్పు - సర్వ సమరముల నహింసా మార్గమున నిరోధింపవలయు - యుద్ధమున కిడియే ప్రతిక్రియ" యను ప్రమాణవాక్యము నేర్పఱిచె - తన పోరాటపుసుద్దిని మున్ముందుగా (27-9-40) రాజప్రతినిధికిం దెలిపె - ప్రథమసత్యాగ్రహిగా వినోబాభావే నెన్నుకొని యమ్మహనీయునిగూర్చి యిట్లు నుడివె. **52**

గీ. "అతఁడు నాతరువాత నాయంతవాఁడు, చక్క వివరించు నతఁ దహింసామహత్త్వ
మతఁ దహింసకుఁ బ్రతిరూప మనఁగఁ జెల్లు, నతఁడునాకద సత్యాగ్రహాత్మ నెఱిఁగె **53**

గీ. అతఁడు నిర్మాణకార్యము లవధరించి, నిచ్చ లేమాఱుమూలనో నిలిచి బడలు
నతనియేకాగ్రతకు నుండ దవధి యతఁడ, హింసకర్త్రకుఁ దగుట సహింపఁ డనిని." **54**

వ. వార్ధాసమీపమునం గల 'పవనా' రనుపల్లియం గాఁపురించు సంయమిచక్రవర్తి వినోబా యుద్ధప్రతికూలోపన్యాసముతో (17-10-40) సత్యాగ్రహము నారంభించె - అమ్మనీషి చెఱకేగినంతన యావద్భారతమున వ్యష్టిసత్యాగ్రహము కదలె - కాలక్రమమున నిరువది వేలమంది సత్యాగ్రహులు బందా లైరి - ఆంధ్ర దేశమునం దీనాఁడు పురాప్రసిద్ధులుగాక కాసు బ్రహ్మానందరెడ్డి, వెనిగళ్ళ సత్యనారాయణచౌదరి, ఆనము చెంచుసుబ్బారెడ్డి, కందుల ఓబులరెడ్డి, బొల్లవరము వెంకటసుబ్బారెడ్డి, పిడతల రంగారెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, అనంతశయనమయ్యంగారు, నీలము సంజీవరెడ్డి మున్నగుయోద్ధలు సత్యాగ్రహ సమరమునం బాల్గొని చెఱల కగ్గంపడిరి - వాక్స్వాతంత్ర్యము లక్ష్యముగా నేర్పడిన యీసౌమ్య సత్యాగ్రహమునుసైత మోర్వమింజేసి దొరతనమువారు ప్రపంచదృష్టిం దేలిక పడిరి - సత్యాగ్రహ మారబ్ధమై యేఁడాది కడచె - ఇంతలో నంతర్జాతీయ రాజనైతిక పరిస్థితులం దీవ్రతర పరిణామమ్ము లేర్పడె. **55**

## 1941

## జపాను సేనల విజృంభణము

ఆ. నెఱయఁ జెడియె జర్మనీకిని రష్యాకు, నివ్వటిలిన రాచనెయ్య మపుడు
దుర్మదాంధమైన శార్మణ్యవాహిని, నెగసె నరుణకేతునిఘ్న మహికి. **56**

వ. ఐరోపాయందలి దేశములు పెక్కులు జర్మనీకి దాసో౽హమనె-ఇటలీ జర్మనీకి బాసటగా నుండె - ఇఁక నాసియాఖండమున జర్మనీకిఁ జుట్టముగా నున్న జపాను చీనాతో రణ మొనర్చుచుండ నమెరికా బ్రిటనులు చీనా కండగా నిల్చె-పదంపడి (7-11-41) జపా నీరెండురాజ్యములపై సమరముం బ్రకటించి చీనాయందలి ప్రాగ్దక్షిణభాగములతో పాటు జావా సుమత్రా మున్నగుదీవుల నాక్రమించె - ఇఁక భారతదేశము కేంద్రముగా సమరము సాగించుట తప్పదని యింగ్లీషువారు గుర్తించిరి - భారతీయులతోడి సంధి మీ కవసర మని యమెరికాయధ్యక్షుఁడు వీరిని మందలించె-పిమ్మట(3-12-41) నైరాశ్యపూరితు లైన దొరతనమువారు కారాగృహములఁగల సత్యాగ్రహుల నందఱ విడుతుమనియుఁ గాంగ్రెసువారి నెయ్యము నర్థింతు మనియు నొక ప్రకటన మొనర్చిరి - ఇంతలో (7-12-41) జపానువా రమెరికావారి నౌకాశ్రయమును (పెరల్ హార్బరు) బట్టిరి - రంగూనుపై విమానధాటి జరిపిరి - అంత నాజాదు, నెహ్రూ, రాజాజీ మున్నగు కాంగ్రెసు నాయకులు సమరాగ్నిజ్వాలలు భారతదేశపుఁ బొలమేరదనుక వచ్చుటం గని బెంబేలుపడి దేశరక్షణము ప్రధానముగా నెంచి బార్డోలిలో (1941 డిశంబరు 23-30) సమావేశమై కేంద్రమున జాతీయప్రభుత నేర్పఱుతురేని యుద్ధమున కెల్ల భంగులం దోడ్పడుదుమని తీర్మానించి మహాత్ము నిబాధ్యతనుండి తప్పించిరి-దేశ పరి స్థితు లిట్లుండ 57

## 1942

## క్రిప్సు రాయబారము

గీ. ఉరవణించి జపానువా రోటలేని, సంగరమ్ములఁ బట్టిరి సింగపూరు(15-2)
పడగలెత్తిరి రంగూనుపట్టణమునఁ, (7-3) దెల్లవారిమొగమ్ములు తెల్లసిల్ల. 58

ఆ. ఆంగ్లమంత్రివర్యుఁ డగుచర్చి లంత న, హంత వీడి కాంగ్రె సనికి సాయ
పడువిధాన సంధినడిపిర మ్మని క్రిప్సు, నాప్తసచివు ననిచె హస్తిపురికి. 59

గీ. రాజనీతిజ్ఞమౌళి నా రాణగన్న, క్రిప్సు ఢిల్లీకి వచ్చి కాంగ్రెసును లీగు(23-3)
నితరపక్షములం బిల్చి యేలువారి,తీరు వివరించి పరమగంభీరసరణి - 60

వ. "యుద్ధమైనంతన దేశీయులు నిర్మించుకొను రాజ్యాంగప్రణాళిక నాంగ్లప్రభుత్వ మంగీక రించును - దీనినొల్లని రాష్ట్రము స్వతంత్రముగా మనవచ్చు - (ఇది దేశ విభజనమున కనుకూలించు పెద్దమాట) జాతీయప్రభుత్వ మిపు డేర్పడు - సమర నిర్వహణాధికారము రాజప్రతినిధి వహించు - భారతీయు లనికిం దోడ్పడవలయు" అని సంధివాక్యములాడ నివి పరిహాసపాత్రము లని బాపూ తన యభిప్రాయముం బ్రకటించె-పదంపడి క్రిప్సు విఫలప్రయత్నుఁడై (12-4-42) స్వదేశమునకు మరలె - భారతీయులలో నిరుత్సాహ మగ్గలించె - కాంగ్రెసుయోధులు మరలఁ దన్నాశ్రయింప మహాత్ముఁడు వారి కభయం బొసంగి 61

ఆ. కుటిలరాజనీతికోవిదులై భార, తోర్వి నణఁచి బ్రదుక నూహసేయు
నింగిలీసువారిభంగి నిఁ కెన్నాళ్ళు, సైఁతు నని క్రుధాపరీతుఁ డగుచు - 62

క. హరిజన పత్రికలోఁ దన, పరితాపము కినుక తేటపఱుపం దొడఁగెన్
గురుఁ డెల్ల ప్రయోగించెడి, దుర మెట్టిదొ యని జనాళి తొట్రుపడంగన్. 63

## క్విట్ ఇండియా

వ. అంత నాచార్యుఁ "డాంగ్లేయాధికారు లీపుడమిం బాయవలయు-వా రేగినవెన్క దేశీయులే తమబ్రతుకు నిర్ణయించుకొందురు - వారికిని భారతీయులకును సుఖాపాదకమగు కృత్యం బిదియ"-అనునిర్ణయమునకు వచ్చి "భారతదేశమును వీడుము" (క్విట్ఇండియా) అనుమంత్రము **(14-7-42)** నుచ్చారణమొనర్చె - ఇది దేశమునలుమూలలం బ్రతిధ్వనించి ప్రజాహృదయము నుజ్జ్వలత లూఁగింపసాగె - బొంబాయిలోఁ గూడిన కాంగ్రెసుసంఘమువా రీనినాదమున కనుకూలమగు తీర్మానమును **(8-8-42)**గావించిరి - రాజగోపాలాచార్యప్రభృతులు కతిపయనాయకు లీనిర్ణయము నంగీకరింపక యేత దుద్యమమునకు దవ్వైరి - ఎవరినమ్మిక వారి దని మహాత్ముఁడు భావించి యానాఁ డచటిప్రజల నవలోకించి యిట్లు వాక్రుచ్చె. 64

మం. "వినుఁడు! సోదరులార! వినుఁడు! నానడుపు,సమరమ్ములం గడసారి దీసమర
మిదియు నహింసతో నెసఁగు సంగరమ,యిదియు సత్యము నాశ్రయించు సంగరమ
యిందు హింసావిధు లికొందు రేని, కనలేదు సప్రాణుఁగా నన్నుమీరు
సంధికార్యమ్ములు సాగించి కయ్యా, మేర్పడమికి శ్రమియింతు మున్ముందు
వైస్రాయి నాకోర్కి వాటింపఁడేని, సమరాకృతిని మీకుఁ జక్క వెలార్తు
నేను బానిసనుగా నేను స్వతంత్ర, పౌరుఁడ నని ప్రతిభారతీయుండు
తలపోయవలయు నీతరుణమ్మునుండి, యెట్టిత్యాగంబునకే నియ్యచేసి
దేశదాస్యంబును దెగటార్పవలయు, మగువలు మగవాండ్రు మది భీతిలేక
పాల్గొనవలయు నీబవరమ్మునందుఁ, బంద కెన్నఁడు లేదు బ్రదికెడి హక్కు
పిఱికివాఁ డుర్వికి బెద్దయున్ బరువు, "చేయుము లేదా నశింపు" మటన్న
వీరోక్తితో విశ్వవీధి కంపిల్ల, నడుచులగ్నము వచ్చినది నేఁడు మనకు." 65

క. మిడుఁగుఱులంబలె బాపూ, వెడలించిననుడులు ప్రజకు వీరావేశం
బడరింప దాస్య మపుడే, కడచని నట్లెలమి గనిరి కాంగ్రెసుపెద్దల్. 66

వ. జాతీయోద్యమము నణఁపం ద్వరపడుచున్న దొరతనమువా రాకస్మికముగా నతిని గూఢముగా నాఁటిరేయి నాల్గవజామున మహాత్ముని సపరివారముగా నరికట్టి పూనా చెంతఁగల యాగాఖాను భవనమునకుం జేర్చిరి-కాంగ్రెసు కార్యవర్గసభ్యుల నందఱం

బట్టిరి-ఆవెనుక రాష్ట్రమండలి నాయకుల నెల్లవారి నక్కడ నిర్బంధించి చెఱసాలలకు నెట్టిరి-తెలుఁగునాట గుంటూరిలో దేశభక్త లక్ష్మీనారాయణులను నిడుఁబ్రోలిలో ఆచార్య రంగాను వినయాశ్రమమున సీతారామశాస్త్రిని కడపలో ఆంధ్రకేసరిని బంధించి బందిగమునకుఁ బంపిరి - ప్రజలలో నుద్రేకము పెరిఁగె - వారికష్ట ముపదేష్ట లేఁడాయె - వా రహింసను మఱచిరి - రైలుపట్టాలు తొలఁగించిరి - వార్తావాహితంత్రులు త్రెంచిరి - వంతెనలు పడఁగొట్టిరి - ప్రభుత్వ భవనముల కగ్గిపెట్టిరి - బహిరంగ విప్లవము సాగించిరి - సర్కారుబంటుల దౌష్ట్యమున కవధి తొలఁగె - ప్రజా రుధిరమును వారాకంఠముగాఁ ద్రావిరి - గ్రామముల దోఁచిరి - మానవతను వదలిరి - మానినుల కెగ్గు గావించిరి - పరాభవ మోర్వలేక ప్రజలు పోలీసుల నఱఁచిరి - సైనికులఁ జంపిరి - ప్రతిప్రభుత్వములు నెలకొల్పిరి - కని విని యెఱుఁగని యరాజక స్థితిని సృష్టించిరి - ఉత్తరభారతమున నరుణయు జయప్రకాశనారాయణయు రామ మనోహరలోహియా మున్నగు వీరులుం బ్రతిలేని సాహసోత్సాహములతో రగుల్కొల్పిన క్రాంతిజ్వాలలు జగత్తునకు నివ్వెఱం గూర్చె - తెలుఁగునేలం దెనాలి బెజవాడ భీమవరము మొదలగుతావులఁ బ్రజలుసాగించిన యాగష్టువిప్లవము చరిత్ర ప్రసిద్ధము - ఈ విప్లవమునం దెనాలినగరమునఁ బోలీసుల తుపాకికాల్పుల కెదురొడ్డి జాష్టి అప్పయ్య, ప్రయాగ రాఘవయ్య, గాలి రామకోటయ్య, తమ్మినేని సుబ్బారెడ్డి, భాస్కరుని లక్ష్మీ నారాయణ, మాజేటి సుబ్బారావు, శ్రీగిరిలింగము-తమ క్రొవ్వేఁడి నెత్తుతో రణ రంగముం దడిపి (12-8-42) వీరశయనము నందుట విస్మరింపరాని విక్రమగాథ - వెండియు 67

క. ప్రతిహింసారతమగు భా, రత దేశమునందు నాఁడు ప్రతిపూరుషుఁడున్
ప్రతిమహిళయుఁ దానే తన, గతి యిది యం చరసి నడిచి కలఁచెన్ బ్రభుతన్. 68

క. ఇఁక నోర్వ నాంగ్ల శాసన, మిఁక దాస్యనిబర్హణంబె కృత్యము నాఁకం
చకుతోభయమై యిమ్మహి, సకలము తలయెత్తి యపుడు శౌర్యము చాటెన్. 69

## మహాదేవదేశాయి నిర్యాణము

ఆ. దేశమిట్టులుండ దేశికుతోఁ జెఱ,సాలఁ గాఁపురించు సాధుచరితుఁ
దకట! దివికిఁజనె మహాదేవదేశాయి, పండితప్రపంచ మండనుండు. 70

క. కారావాసమునం దొక, వారము కడచనకమున్నె వాటిల్లినయీ
ఘోరాపదకు మహాత్ముఁడు, తీఱనిదిగు లందెఁ గొడుకు త్రెళ్లినకరణిన్. 71

వ. మహాదేవుఁడు బాపున కాంతరంగిక కార్యదర్శిగా సారథిగా సహచరుఁడుగా సము పార్జించిన గౌరవ మపారము - మహాత్మునిసమగ్రజీవనకథ నిమ్మనీషి సప్రమాణముగా

నిర్మింప సమకట్టియుండ విధి యి ట్లదయం బాయె - ఆకస్మికముగాఁ దన చేతులలోఁ గన్ను మూసినపుణ్యరాశి దేశాయికి వలయు నౌర్ధ్వదైహిక క్రియలం గవోష్ణబాష్పముల నాచార్యుఁడు పూర్తిగావించి తదీయార్తి మెల్లమెల్ల దిగమ్రింగుచుండ. 72

క. ఆయావార్తాపత్రిక, లాయనకుం దెల్పె దేశ మలజడినుంటన్
హా! యని యిసిరో! యని వైస్రాయికి నపుడొజ్జ యిట్లు వ్రాసెనుగమ్మన్. (14-8) 73

## దేశదుర్దశను గూర్చి బాపూ వైస్రాయికి వ్రాఁత

మం. దారితప్పితి వేల ధరణీశ! ప్రజల, దుర్భరాపదలలోఁ ద్రోసితివేల
యంత తొందరయేల యాగ్రహమేల, పోలునా నీ కిట్టిపొరపాటు నృపతి!
నీతోడ మాటాడి నీవు నాపల్కు, సమ్మతింపనినాఁడె సత్యాగ్రహంబు
సాగింతు నంటి నాసమయమునందె, ప్రజకుఁ గయ్యముతీరు ప్రకటింతునంటి
హింసలేనిరణంబ యిదియు నటంటి, నారాక నొల్లక నామాట వినక
యది యుచితం బిది యనుచితం బనక, నిదురించుమన్ను బంధించితి వేమి
ప్రజకు నాకును బొత్తు పాపితివేమి, కర్తవ్య మెఱిఁగింపఁగల నేత లేమి
నిచ్చవచ్చినచేఁత కెగఁబడె జనత, దేశంబు నణఁగింపఁ దెగిరి నీబంటు
లగ్నులు కురియించి రకట! యూరూర, నసురులై జరిపి రత్యాచారములను
గ్రూరతమై రెచ్చఁగొట్టిరి జనులఁ, జెఱిచిరి శాంతి నిసీ! సైఁపరాని
చెట్టలు దాపరించెను భారతోర్వి, కీవు కాంగ్రెసుకోర్కి నీకొన్న నింత
పుట్టునా నాజీప్రభుత్వము దుష్ట,మని జగత్కంటక మని కాంగ్రె సెపుడొ
పల్కెఁగదా ప్రజాస్వామ్యమే తగిన, యేల్బడి యని కాంగ్రె సెన్నఁడో చాటెఁ
గద ప్రభూ! సామ్రాజ్యకాంక్ష లేకున్న నింగ్లీషువార లీయిల నస్వతంత్ర
జగతిఁగా నుంతురా జరిగిన దేమొ, జరిగె నీ విపుడైన శాంతత నంది
వేవేగఁ గాంగ్రెసువీరుల చెఱల, వదలించి సంధికై వలయు యత్నంబు
లొనరింపవే శక్తియున్నది నీకుఁ, బగమాని చెల్మికై బదలవే యలుక
సకలసంతాపసంజనక మీసత్య, మీవెఱుంగవె పంతమేల నామనవి
పాటింపవే కూచిపనుపులనెల్ల, నుపసంహరింపవే యుర్వి దావాగ్ని
కీలలఁ జిక్కి బెగ్గిలి పల్లటిల్లు, నౌగాము లరసి యాయలజడి మాన్పి
శాంతిచేకూర్పవే జగమున; కేను, బల్కెద నీమిత్రుపగిది నీపల్కు
లుచితమార్గమున నిన్నునుచు నీశ్వరుఁడు, మంచికై ప్రేచి నిన్ మనుచుదైవతము. 74

వ. రాజ ప్రతినిధి యీవ్రాయసముం జదివి దోసమంతయుఁ గాంగ్రెసువారిద యనియు వారే ప్రజకు హింసాపాఠమును నేర్పిరనియు జర్మనీ జపానులగెల్పు వారి కభిమత మనియుఁ గాని నాఁడు క్రిప్సురాయబారముం ద్రోయరనియు నిట్టివారి నణంచుట

యెగ్గుగాదనియు నసత్యాహంకృతులకు మూడలయగు ప్రత్యుత్తరము ననిచె - కాంగ్రెసుపై
నతఁడుమోపిననింద సైఁపలేక 75

క. నీపల్కులు దబ్బఱలని, రూపించెద నీకు సత్యరుచి గలదేనిన్
నాపనికి నొప్పుమని ఢి,ల్లీపతికిన్ మగుడ నొజ్జ లేఖను బంపెన్. 76

## లిన్‌లిత్గోధోరణి సైరింపలేక గాంధి పస్తుపూనుట

క. భూధవుఁడు దీని కుచిత స, మాధానము నీయఁడాయె; నపుడు తడీ యా
సాధుతను దెగడ ననశన, బాధాభర ముద్వహింప బాపూ తలఁచెన్. 77

వ. అంత నాయయ్య తనధర్మువు పాటించి 78

క. వ్రతనిర్ణయ మిది రాజ, ప్రతినిధికిం దెలుపఁ గపటిపథ మిది కారా
చ్యుతికొకయె త్తిది, యని 'లిన్, లితుగో' పరిహాసమాడె లేకివిధానన్. 79

## 1943

వ. పదంపడి గత్యంతరముగానక ముయ్యేదునాళ్లు మేరగాఁగల యొపవస్తమును మహాత్ముఁ
డారంభించె(10-2-43)- ఈనాఁడు దేశికుఁడు శల్యమాత్రావశిష్టుఁడు-అయిననేమి?80

మం. సాగుచున్నది యోగిసత్తముతపము, వ్రేఁగుచున్నది సర్వవిశ్వప్రజాళి
సదిసన్న వెజ్జు లాసంయమిన్ జూచి, యోర్వలేఁ డీనిట్లు నోర్వలేఁ డనిరి
మెలమెల్ల యొకనాఁడు మృత్యువాచార్యుఁ, గదిసెఁగాని యెదుర్పఁగా జంకిపఱచె
నేమగునో గాంధి యెల్లి యటంచు, నొక భారతమె కాక యుర్విసమస్త
మలమటగుడిచి మహాత్మునివిడువఁ, దగునని ఘోషించె ధరణిఁ బేర్గన్న
పత్రికలన్నియు బాపుజీ నిపుడు, చెఱసాలనుంచుట చెడుచేఁత యనియె
నఖిలపక్షసదస్సు హస్తినన్ గూడి, యొజ్జనువదలుట యుచితమౌ ననియె
నెవ రెంతవేఁడిననేమి వైస్రాయి, మనసులో నిసుమంతమార్పు రాదాయె
గాంధి యీ బెడఁదలోఁ గనుమూసెనేని, రాపెల్లఁ దొలఁగు సామ్రాజ్యంపు మేర
చెదరకనిలుచు నీజిత్తులమారి, నణఁచుట, కిదె మంచియదనని యతఁడు
మొఱకుఁదనమ్ములో మునిఁగె నానాఁడు, వారక యీయుపవాసంబునందు
సత్యాగ్రహవిధాత సమయునం చెంచె, నాచార్యుదహనాదు లాబందియంద
జరుపఁదెగించె నాసమయానఁ బ్రజలు, చెలరేఁగి యల్లరిసేయమి కెల్ల
దెసలఁ గాపుంచెను దిట్టలౌబంట్ల, నెంత చేసిననేమి యీశ్వరుకరుణ
నాత్మశక్తిసమగ్రుఁ డగ్నిపరీక్ష, కోర్చి పూర్తి యొనర్చె నుపవస్త మొజ్జ
యాపదుద్ధర్తకు నాశ్రితానీక, వరదాతకున్ భగవంతున కెఱఁగి

సుకృతవితర్ది కస్తూరి యొసంగు, ఫలరసం బించుక బాపుజీ త్రావె
నఖిలవిశ్వము పొంగె నమ్ముహూర్తమున,నుద్విగ్న భారత మూపిరిపీల్చె(3-3-43) 81

క. ఈసఫలత విని లిన్‌లిత్, గో సిగ్గిలియుండు గర్వగుఁడు చర్చిలు ప్రా
నై సగ్గియుండు భారత, ధీసచివుం డమెరి మింటిదెసఁ గనియుండున్. 82

వ. ఉన్నతాధికారము వహించిన యాంగ్లేయులలో 'లిన్‌లిత్గో' వలె మహాత్ముని చిత్తశుద్ధిని శంకించినవాఁడు, జాతిపితను బాధించినవాఁడు వేఱొండులేఁడు - ఒక మహాజాతికిఁ బ్రతినిధిగా వచ్చినమానిసి యింతయలంతిగా నుంట కదుంగడు శోచనీయము - అసత్యాశ్రయములగు నితనిపల్కులు బాపూహృదికి ముల్కులై లోకమున కేవగూర్చె - అయ్యది యట్లుండె - మహాత్ముఁ డుపవాసక్లేశమునోర్చి యెద్దుపట్టుటం జేసి ప్రజలలజడింబాసి యుప్పొంగినమాట నిక్కమ - కాని వారింబాయని వెత లింకెన్నియో కలవు - సంగ్రామభయము నిరంకుశ ప్రభుత్వము దుర్భరక్షామము దేశీయుల నానాఁడు తల్లడపెట్టందొడఁగె-వంగభూమిం గఱవురక్కసి విలయతాండవమొనర్చి యేఁబది లక్షలమంది యన్నార్తులఁ దనపాట్టం బెట్టుకొనె - పోలీసురాజ్యమున నెందఱో జనులు మడసిరి - పెక్కండ్రు పరాభూతులైరి - దాదా పాక లక్షమంది బందిగములం బడిరి - పల్లెలు పట్టణములు శాంతికి మొగమువాఁచి యుండె - మహాత్ముఁడు ప్రజల నడుమ నున్నంగాని యీదుర్దశ తొలఁగదని సప్రూ జయకరుమున్నగు పెద్దలాయయ్యవిడుగరం గోరుచు నేల్బడివారికి విన్నపమునంపిరి - కాని రాజప్రతినిధి దారికిరాఁడాయె - కాంగ్రెసుతోడిపొత్తు వీడి యాగస్టు విప్లవమునంజేరని రాజాజీ యపుడు రాజకీయప్రతిష్టంభము నెట్లయినం దొలఁగింపవలయునని తన ప్రజ్ఞం బఱపి యొజ్జం గారాగృహమునఁ గలియుట కధికారులయనుమతిం బడసి యాగాఖాను భవనమున(6-4-43) మహాత్ముని సందర్శించి "బాపూ! 83

## రాజాజీ దేశవిభజన దృష్టి

క. ఎన్నాళ్ళు శ్రమంపడినను, జిన్నా నీమాట కియ్యసేయఁడు జిన్నా
కు న్నీకును భావైక్యం, బున్నపుడే యాంగ్లజాతియుద్ధతి తగ్గున్. 84

గీ. అడుగడుగునందు భారతీయస్వరాజ్య, లబ్ధి కడ్డమువచ్చువలంతి కితని
కుచితమగుతృప్తిగూర్చి యీయుర్విసేయు, త్యాగము ఫలించుపని కొగ్గఁదగదెనీకు.85

వ. ప్రజాభిప్రాయము లెస్సగా ననుకూలించు రాష్ట్రములతో సైనికాది వ్యవహారముల భారతదేశమునకు లోపడియుండు పాకీస్థాన మేర్పడినం బొడముకీడేమి" యన మహాత్ముం డరసియరసి తద్వాదమునకుఁ దలయూఁపె - రాజాజీ తన సంధిస్వరూపమును వెనువెంటన జిన్నా కెఱుకసేయ నతఁ డందలికట్టడల కొడంబడక సర్వస్వతంత్రరాజ్యమ

తనకు వలయు ననియె - ఇంతలో లిన్‌లిత్‌గో పదవికి సేనాని వేవెలు(18-6-43) వచ్చె - ఇతఁ డెట్లేని దేశమున రాజనైతిక శాంతి నాపాదింపవలయునని యారటంపడఁ దొడఁగె-ప్రజ లీతని తీరుంగని యుంచింపుక తెలుకొన సాగిరి-పరిస్థితు లిట్లుండ 86

## 1944

## కస్తూరిబాయి నిర్యాణము

సీ. అఖిలప్రపంచమాన్యత సంతరించిన, గాంధికిల్లాలైన గరిమ మిన్న
యఱువదేఁడులనుండి యగ్నిసమ్మితుఁడైన, పతిని మెప్పించిన ధర్మశీల
మతకులభేదముల్ మఱచి మానవజాతి, సేవలోఁ దనివిగాంచిన వెలంది
భారతస్వాతంత్ర్య పరిలబ్ధి కెన్నేని, వెతలు సైరించిన వీరనారి
హైందవసతీసమాజ మహత్త్వమునకు, మొదటిమూడలగా నిల్చు ప్రముఖ నేర్పి
సుకృతములనేలుకొన్న కస్తూరిబాయి, కటకటా! చెఱసాలలోఁ గన్నుమూసె. (22-2)

ఆ. అత్యుదారజీవనాలంబమై గాంధి, జాతికెల్లఁ దండ్రియైన తనకు
మగనిబాటవిడని మగువయై కస్తూరి, తల్లియయ్యె నెంతధన్యురాలొ! 87

ఆ. మాల కన్నమిడియె మాలయెంగిలి నెత్తెఁ, గడిగె మాల - కాలుమడిపనంటి
కూఁతువోలెఁ బెంచుకొనె మాలపిల్ల నీ, తల్లిప్రేమమునకు నెల్లకలదె? 88

ఆ. పెక్కుమార్లు చెఱలయిక్కట్లు సైరించె, సబల ప్రక్కలించె నందుశిలల
ముదుక యగుట బందిబ్రదుకున కీనాఁడు, తాళలేక తల్లి తల్లడిల్లె. 89

ఆ. గుండెజబ్బుతోడఁ గుమిలి మహాశివ, రాత్రినాఁడు పతికరమ్ములందె
కాయ ముజ్జగించి కస్తూరి గాలిలోఁ, గలసి దివికిఁ బంచె గాంధితావి. 90

వ. మహాత్ముఁడీ సహధర్మచరీవియోగమునఁ గ్రుంగి యశ్రువులురాల్చియు వెనువెంటన తెలుకొని కస్తూరిచనుట భగవదిష్టము కావచ్చు-ఈశ్వరుఁ డెన్నఁడుం దప్పు సేయఁడుఁ కదా - లోకసేవావ్రతుఁడ నగునా కీవిశ్లేషము విషాదహేతువు కారాదు- అని యెదఁ దం గుదురుపఱుచుకొనియె - కాని 91

క. లోకం బీవార్తను విని, శోకహతం బాయెఁ దల్లిసుచరిత్రము నెం
తో కొనియాడె సదస్సుల, నాకాంక్షయొనర్చె మాత కక్షరపదమున్. 92

మం. మాలవీయాదు లీమానినిపేర, నాపన్నసత్త్వాల కందగా నుండఁ
జానలవిద్య కాశ్రయముగా నిలువ, బహువైద్యశాలలు పాఠశాలికలు
పట్టణంబుల కెడపడినపల్లియల, లేవడితో నుమ్మలింపపల్లి యలఁ

జాడుకొల్పుట మేలిపనియని తలంచి, నడుముగట్టిరి కాంచనము సమకూర్పఁ
గస్తూరిపైఁగల గాంధిపై నున్న, భక్తిచే రక్తిచేఁ బ్రజ సమర్పింపఁ
గూర్చిరి కోటి కెక్కుడుగా ధనమ్ము, తీర్చిరి తల్లికీర్తికి మందిరములు. 93

గీ. కస్తురీ! నీవు బందిగా నస్తమింప, దేవిగా నిన్నుఁగొల్తు నుతింతు ననుమ
బాపు మున్ను ఛలోక్తిగాఁ బల్కెఁగాని, యెట్లుపల్కిన వితయౌనె ఋషివచస్సు. 94

వ. కస్తూరీస్మృతి కార్యనిర్వహణమున కేర్పడిన ధర్మకర్తృమండలి మహాత్ముం దన కధ్య
క్షుఁగా నెన్నుకొనియె - సేవాపరాయణులైన సుచేత మున్నగుమగువలపాలిందు హెచ్చు
- వీరు బాపూసూచనల ననుసరించి నారీప్రపంచ సుఖవికాసముల కుపకరించు ప్రసవ
చికిత్సాశాలలు మూలవిద్యామందిరములు దేశమునం దెల్ల యెడల నిర్మింపఁబూనిరి
- అమ్మ మేనువోయినది - చరిత్రంబమరమైనది - అది యట్లుండె. 95

## చలిజ్వరమునకుఁ జిక్కిన గాంధికిఁ గారావిముక్తి

ఆ. బందిగముననున్న బాపును జలివేఁకి, చెనకి పీల్చి పిప్పిసేయఁ దొడఁగె
నకట! నిరశనవ్రతాదుల నలఁగిన, గాంధి లేవలేని గతికి వచ్చె. 96

గీ. వదలవలయు మహాత్ముని వదలవలయుఁ,జాలఁడిఁకఁ దండ్రి చెఱ నోర్వఁజాలఁడనుచు
గోల పెట్టిరి ప్రజలు గగ్గోలుపడుచు, వెజ్జులునుఁ బోయిరి యొజ్జనరసి. 97

వ. కస్తూరిచికిత్సపట్ల నధికారు లసడ్డచూపి రనునింద లోకమునం గలదు - కాన గాంధి
నేఁడేమగునో యని రాజప్రతినిధి బెదరి నిర్నిబంధనముగా జాతిపితను విడువం
దలఁచి వలయునుత్తరువు లనిచె - అంత బొంబాయినుండి కారాగృహ శాఖాధికారి
భండారి పూనా వచ్చి (5-5-44) సాయంవేళ మహాత్ముని సందర్శించి 98

క. బాపూ! మిము మీవారిని, రే పేకట్టడయు లేనిరీతిని విడుతున్
నాపాలి కిట్టియానతి, యీపూఁటన వచ్చె నిభపురీశుఁడు పంపన్. 99

గీ. అనుడు నబ్బురమంది మహాత్ముఁ డది య, థార్థమా పరిహాసమా యనియె నేల
సంశయింతురు నాపల్కు సత్య మని వి, నీతిమైఁ బ్రీతిమై వక్కణించె నతఁడు. 100

క. వెండియు మీయారోగ్యము, నిండుట కిటఁ గొన్నినాళ్ళు నిలచుతలఁపు మీ
కుండినచో నిల్వుండని, భండారి వచించె నాప్తబంధువుకరణిన్. 101

వ. మఱియు నమ్మేఁటి మహాత్మా! మీరచటి కిఁక రాకుఁడు - మీయానుకూల్యమును గూర్చిన
చింతలతో నాతల నరసె - దానిదెస కొక్కసారి చూడుఁడు - అని పల్క నాచార్యుఁ
డప్పటికిఁ దేఱుకొని చిఱునవ్వునవ్వి యన్నా! యే నీవీటఁ గొన్ని ప్రొద్దులున్నను నాకు

మీరిచ్చు పయనపుసొమ్ము ముట్టెనా? యనఁ దప్పక ముట్టెనని ఛండారి పల్కె -
మేలు! మేలు! పూనాలో రెండుమూఁడుదినము లాఁగెదనని బాపు నుడివె. 102

క. పదపడి రాటము తకిలీ, కదురు వలువ చట్ట చెంబు కంబడి యనుచున్
నిదురింపక గురుబలఁగం, బడియు నిడియు వెదకి సర్దె నారేయెల్లన్. 103

వ. తనపరిజన మిట్లుండ మహాత్ముఁడు నాపై దేశ మెన్నోయాశలు పెట్టుకొని యున్నది -
వానిందీర్చుట నాకలవియగునా - ప్రభుత్వమువారు న న్నేల విడువ నెంచిరి -
విడుమరకు నారుజయే హేతువా - సత్యాగ్రహి నిష్కళంకుఁ డగున యేని వానికిఁ
దెగులుసోఁకునా - అని పరిపరివిధములం దలపోయుఁచొడఁగె - పదంపడి 104

ఆ. తెల్లవాఱె నర్కుఁ దల్లనల్లన మింటి, కెక్కఁదొడఁగె నెండ నిక్కఁదొడఁగె
బాపుగదికి వచ్చె ఛండారి, చేకట్టు, నూఁది కదలె మౌన మొసఁగ నొజ్జ. 105

గీ. అంతనయ్యధికారి మహాత్మ! కొంచె, మాఁగుఁడుపదేనునిముసమ్ము లాఁగుఁడనుచు
నెలమిమైఁ బల్కి ఘంటిక లెనిమి దగుడు, నంజలించి బాపూముక్తి కనుమతించె. 106

వ. అయ్యవసరంబున భిషజ్మణిగిల్డరు మీరాబెన్ మనూగాంధి ప్యారేలాలులతోఁ జెఱసాలం
దొలఁగుచున్న మహాత్ముఁడు కస్తూరీమహాదేవులు తలంపునకురా నలందుఠి తెప్పునం
దెప్పితి “స్వతంత్రతాబలిపీఠముకడ నసువులర్పించిన వీరు ధన్యులు - వీరియశం
బజరామరము - రుగ్మయగుకస్తూరి కారావిముక్తికై తహతహలాడెడిది - ఆపనిజరిగిననాఁ
డింతమంచిదా వామె కబ్బుదుకదా-” అని మానసించి సానుచరముగా మగువయు
మంత్రిసమాధుల సందర్శించి వానిపైఁ గుసుమగుచ్ఛము లునిచి ప్రార్థనలు గావించి
దొరతనమువారి యాంత్రికయానముపై సాధ్వి ఛాకర్సీనివసనమగు ‘పర్ణకుటి’కిం
జేరె. 107

క. ఆయనవిడుదల విని ప్రజ, పాయనిసంతసము నంది భారతదేశ
శ్రేయమున కడ్డపడునాం, గ్లేయులబిరు సిఁక నడంగులే యని తలఁచెన్. 108

క. బాపూజీ! నీతిమ్మన, యేపాటికివచ్చెఁ దెల్పవే యని హోర్ధ
శ్రీ పొంగఁ దంతివార్తలు, చోపెను వేల్వేలు సత్యశూరునికడకున్. 109

క. ఈవు శతహాయనమ్ములు, జీవింపుము భారతమును సేవింపుము సం
భావింపు మహింసనమును, గావింపుము సర్వమనుజకల్యాణమ్మున్. 110

గీ. అని మదనమోహనుఁడు వార్త ననుప ననఘ!, యేల మజ్జీవితావధి నిరువదైదు
వత్సరమ్ములు కుంచితి వానిఁజేర్చి, దయను ననుఁజూడు మని గాంధి తంతిపంపె. 111

ఆ. గురుని గనుట కపుడు గుంపులు గుంపులై, జనులు రాఁదొడంగి రనుదినమ్ము
తెలిపి తెంపులేనితిరునాళ్ళ తాఁకున, కొల్లఁబోయి గాంధి తల్లడిల్లె. 112

## ఆరోగ్యమునకై బాపూ జూహూచేరుట

వ. పర్ణకుటీనివాసమునం బైదునాళ్ళు కదచియుఁ గడవకమున్నె మహాత్ముఁ డారోగ్య భాగ్యముం బడయ బొంబాయికుఱఁగటంగల 'జూహూ' ప్రాంతముచేరె - ఆపు దా పయ్యుం గాచుపని తనపాలిదిగా సరోజినీ దేవి నిర్ణయించుకొని బెబ్బులి తన బిడ్డంబలె మహాత్ముని బరిరక్షింపసాగె - బాపుం జూదవచ్చువా రీదేవియానతి లేక లోనికింజనరాదు - ఆనాఁడెంతవారికైన నీయాజ్ఞ దుర్లభమాయె - కాన నెందఱెందఱోగఱువలు జూహూ వచ్చి రిత్త మరలుచుండ 113

ఆ. వచ్చె నొక్కనాఁడు వాడినమెయితోడఁ, జినిఁగి మాసియున్న చీరతోడఁ
బదియు నాలుగేండ్ల ప్రాయమ్ముతోడ దే, శికుని జూద నొక్క చిఱుతవాఁడు. 114

ఆ. ఒడిఁగియొదిఁగి యాతఁ డుదయముఁదొట్టి సా, యమ్ముదనుక వార్చె నాజ్ఞకొఱకు
దేవిమనసుకరఁగె దేశికుఁగని పుల,కించెఁ గుఱ్ఱఁ దవధరించె భక్తి. 115

ఆ. మూఁడునాల్గురూప్యముల విల్వగల మేలి, పండ్లసజ్జ నొజ్జపజ్జ నునిచి
మ్రొక్కె నయ్యచరణములకు శిరమ్ముతోఁ, జొక్కె జన్మఫలము దక్కెననుచు. 116

ఆ. గాంధిచెంతనున్న ఘనుఁడొక దప్పు ద, నాదరమ్ము దెల్పునాదుతోడ
నుగ్గడించె నెవ్వఁడో జోగి వీఁడని, యేర్చె బాలునెడఁద నీవచస్సు. 117

క. ఆకుఱ్ఱఁ దంత బాపూ!, నీకు నసత్యమువచింప; నే బిచ్చపుఁగూ
డీకొనులేకిని గాను స, దా కూలియొనర్చి బ్రదికెదన్ గరువమునన్. 118

ఆ. చెమట నోడ్చియోడ్చి చేకూర్చుకొన్న ధ, నమ్ముతోడ విలిచినాఁడఁ బండ్లు
నీకు వీని నొసఁగి నే ధన్యతగడింపఁ, జూతు నాదరింపవే తపస్వి! 119

ఆ. అనుదు గాంధి యోయి! యటులైన నీవ నీ, కష్టఫలము గొనుట కిష్టపడెద
నారగింపు పండ్ల నంజకుమని తన కిడినకాన్క చిఱుత కీయఁబోయె. 120

గీ. వాఁడు తక్కువచదివెనా? వలదు తండ్రి! వలదు ఫలములు నాకు; నీవంటి పుణ్య
పురుషుఁ డివి తిన్ననాఁడు నాపొట్టనిండి, నట్ల యగునని చనెసస్మితాస్యుఁ డగుచు. 121

## సుభాష్చంద్రబోసు వీరగాథ

వ. బాపూవిడుదలవేళ కధికారులు పఱుపుశిక్షలతో నాపాదించు నవమానములతో దేశము కదుంగదుబీభత్సమై యుండె - ఐదేండ్లనాఁడు కాంగ్రెసుపొత్తువీడి వేఱు దారిపట్టి దేశరక్షణ శాసనముబారిం బడి తనయింటన బందాగానుండి ప్రచ్ఛన్న వేషమునఁ గావలికాండ్రఁ గను మొఱఁగి యతిభారతుఁడై జర్మనీ జపానుపాలకుల యాదరానురాగము లార్జించి

స్వాతంత్ర్యహిందూసైన్యమనుపేర మలయా బర్మా భూముల భారతీయదళము నేర్పఱిచి సింగపూరున స్వాధీన భారతప్రభుత నెలకొల్పి దానిం బ్రసిద్ధరాజ్యములకొన్ని గుర్తించు నట్లు కావించి యాంగ్లేయుల కగ్గపడి వగచు మాతృభూమిపై దాడివెడలి యస్సాము పొలమేరల నాంగ్లసైన్యముల నెదిరిచి 'యిన్ఫాల్' కొండకొమ్మున విజయధ్వజము నాటిన వీరమూర్ధన్యుండు బోసు విధివిపర్యాసముకతన ననతికాలమునందె పరిపంథివాహినీ నిష్కాసితుం డగుటయుం బత్రికాస్వాతంత్ర్య మడంగుటయుం బన్నులభారంగు హెచ్చు టయు వంగభూమిని దారుణక్షామ మేర్పడుటయు వేలకొలందిప్రజలు కారావాసమున గ్రమగ్గుటయు దానిం గ్రుంగదీసె - బనను దెల్లదొరతనమున కది లొంగక తనమగం టిమిం గాపాడుకొన నెల్లభంగుల నలంగుట మానదాయె - జయప్రకాశ నారాయణ మున్నగు రహస్య కార్యకర్తలాగప్తు విప్లవము నప్పటికిని విడువరైరి - జాతిపిత యట్టిలఱి విముక్తుండగుట దేశమునకు నూతనోత్తేజము నొదవించె - మహాత్ముండు భారత స్వాతంత్ర్యనౌక నిరుపద్రవమ్ముగా నడువం జుక్కాని చేపట్టె - ఆయనవిడుదల తాత్కాలిక మనియు ననారోగ్యము హేతువుగా నది పొసంగినదనియు నాం డమెరీ పరుసనిపల్కు లాడె - పదంపడి బాపూ జయకరుపాలి కిట్లొకకమ్మం బనిపె.(20-5-44) 122

ఆ. గాంధి ముక్తుండయ్యెం గష్టకాలం బింక, నిలువదని యెలర్పు నేండు దేశ
మన్న! నీవిచార మది యెట్టిదో కాని, యేను మెచ్చంజాల నీవిముక్తి, 123

క. విడుదలయిది నాకవమతి, నిదెననియుం దలంతు, రోగమేర్పడమికి నేం
గదుంబెనంగినాండ గానీ, కద కనివార్యంబ యయ్యెం గద గదము చెఱన్. 124

క. తెగు లడంగినంతనే నను, మగుడన్ జెఱ కనుపవచ్చు మహినేలెడివా;
రగునని భారతదేశపుం, బ్రెగడ వెలారిచినపల్కు వినియుండువుగా! 125

గీ. చెఱకు నంపనినాండు నాచేయందగిన, చేంత యెట్టిదియని చర్చ చేసికొంటి
విబుధమౌళి! "భారతమును వీడు" మనిన, తీర్మ విడనాడరాదని తేల్చుకొంటి. 126

క. ఇప్పట్ల నీవు నాతలం, పొప్పకపోవచ్చుం గాని యుసుఱుసుమా నా
కప్పలుకు నెచ్చెలీ! యది, ముప్పుల నణంగించుమంత్రముగదా మనకున్. 127

క. పదంపడి మహాత్ముండుం జూహూనుండి (15-6-44) పూనాకరిగి డిన్షామెహతా ప్రకృతిచికిత్సాశాలనాశ్రయించి రాజప్రతినిధి కిమ్మెయి నొక లేఖనంపె(17-6-44)128

మం. ఓయన్న! భారతీయులు పెఱవార, లీనేలం గలచిక్కు లెదయించి ప్రజల
దేర్చుటకై ప్రయత్నింపు మటంచు, ననుం గోరుచున్నారు నైక లేఖముల
నేను గోల్మానుటకు నెంతకాలమ్ము, చెల్లునో; విధి మేలుచేసి వైకంబ

యారోగ్యభాగ్యము నందుదుఁగాక, యొంటరినై యేమి యొనరింప నేర్తుఁ
గాంగ్రెసునకు నండగా నిల్వఁదగిన, చదురులందఱు చెఱసాలలోఁ గలరు
వారలఁజూడక వారితో మంచి, సెద్దల తడవ కేఁ జేసెడిచెయిది
కాసంతలేమి నిక్కముగాన వారి, నీక్షసేయఁగ నాకు నిమ్ము సమ్మతిని
బంది నున్నపుడె యీపని కపు దేలు, వైస్రాయిముదలను వలచితిఁగాని
నాకోర్కిరిత్తయైనది ప్రభూ! నాఁడు, నేఁడు బందా కానినేను జాతీయ
సభకు నమాత్యులై నడిసన్నవారి, సరస నౌగాములు చర్చించివత్తు
నీకొనుమయ్య! నా కీవు మైకోలు, పంపకమున్ను నీపజ్జ కే వచ్చు
టక్కఱయందువే నరుదెంతు నెడఁద, విచ్చి నాతలఁపులు వివరింతుఁ బెక్కు
ప్రొద్దులపయన మిప్పుడు సైఁచుబల్మి, లేదు నాకు మఱాకు లేవడిన్ దీని. 129

గీ. వేవె లీకమ్మఁ గన్గొని 'యీవు నేను, భిన్నభిన్న మార్గంబుల నున్నవార
మన్న! జయకరుపాలి కీ వంపినట్టి, వ్రాయసము చాలు నీదుభావము నెఱుంగ. 130

క. మనకలయికచేఁ గాంగ్రెసు, మొనగాంధ్రకు నీకు యోగముఘటిల్లిన నాఁ
డొనగూడు లాభ మింతయుఁ, గనిపింపద నాకు నెంతగా నారసినన్. 131

గీ. 'భారతమ్మును విడు' మను తీరుమాన, ముద్ధరింపదయా! యేతదుర్వి; నది య
నేకసంకట కారి యం చెంతుఁ బ్రజకు, మప్పరానినిర్ణయ మని మానసింతు. 132

క. నీకుం దగునారోగ్యము, చేకూరినవెన్క నుభయచిత్తమ్ములకుం
గాఁకం గూర్చనిపదకము, నేకము సూచింపు; దాని నెలమిం ద్రత్తున్. 133

వ. అని(22-6-44) సగౌరవముగా నుత్తరముపుచ్చె - దానింగాదని మహాత్ముఁడు ముస్లిము లీగుతోఁ బొత్తువడయం జూచె - ఈకృషి నేఁటిద కాదు - కారాగృహము నంద దీని కాచార్యుఁ డంకురార్పణము కావించె-దేశవిభజన మేర్పడనివదువున జిన్నాతో నేఁడు మరలఁ జర్చలు మొదలిడె - కాని జిన్నా భారతముం జీల్చుట తప్పు దనుటంజేసి యీజతనం బాఱడివోయె - అయ్యవసరమ్మున బిర్లా తాతా మున్నగుపారిశ్రామిక ప్రముఖులు బాపూసన్నిధి కేతెంచి మాతెగవాఁ డొకఁడు తన కార్యవర్గమునందుంట వలయునని రాజప్రతినిధి కోరెడిని - దీనికి మీ రే మందురు - అని వేఁడ జాతీయము కానిరాచఱికము కందగానుండుట మాతృభూమి కెనలేనికీడుగావించుట యని మహాత్ముఁడు నొక్కిపల్కె - మఱియునాచార్యుఁ దానాఁడు పూనాపురమునం గూడిన కాంగ్రెసు కార్యకర్తలసభ నిట్లుపన్యసించె. 134

## మహాత్ముండు కాంగ్రెసు కార్యకర్తలకిచ్చిన సందేశము

గీ. సత్యమునకు నహింసకు శత్రువైన, చేఁత కెద్దాని కే నియ్యఁజేయఁజాల
నైన నొరు లాచరించుకార్యముల మేలు, గీదులను ద్రచ్చుపని కిచ్చగింపనిపుడు. 135

మం. అగుఁగాక! యన్నలారా! యొక్క ముక్క చెప్పనెంచితి మనచేయుచెయ్వముల
నెంతగా సత్య మహింసయు నిముడు, నంతగా మనకు లభ్యంబగు గెల్పు
మనసాధనము శౌచమహితమై యుంట, నుచితచైతన్యము నొందిరి ప్రజలు
మతిసెడి ధర్మువున్ మఱచిననాడుఁ, కఱకరినై వీరి గర్హించినాఁడ
నీదేశమందు రెండేఁడులనుండి, గతిదప్పి మనవారు కావించుహింస
తెఱఁ గెఱుంగుదును బందిగముననున్న; నధికృతుల్ ప్రజచేసినట్టి యాగడము
గోరంతయైనను గొండంత యంద్రు, తమయొనరించినతప్పు హిమాద్రి
పాటి యగుంగాక బహ్వల్ప మంద్రు, ప్రజలు చేసెడి చెట్టపనులకుం గతము
కన్పించుఁ గాని సర్కారువా రాచ, రించెడుహింస నిర్హేతుక మనెదఁ
బక్షపాతములేని పల్కులు నావి, ప్రజలు ప్రభుత్వమ్ము పచరించుపనుల
నరయుదు నేను సత్యాహింసనముల, నస్మదీయార్హత యది యెట్టిదైన
నన్ను మీ రెంతయు నమ్ముకొన్నారు, సత్యమ్ము దెస నహింసావిధిపట్ల
నాకేర్పడినరక్తి నాకున్నభక్తి, నాబలిమికిఁ గారణంబని తలఁతు
రాజనైతిక కార్య రంగమునందు, సత్యమునకు నహింసకు నిసుమంత
తావులేదని పల్కెదరు కొంతమంది, యే నీయకొనఁజాల నీనిర్ణయంబు
నీ రెంటిని సమాశ్రయించినమనుజు, లేదేశమందైన నే పనినైన
విజయ మందెదరని విశ్వసించెదను, సరియ! యే నిపు దేమిసాగింపనేర్తు
నాగష్టుతీర్మాన మది ప్రయోగించు, చనవు నాకుం జెఱసాలకుఁ జన్న
నాఁడ తొలంగె నీనాఁడు నే నెద్ది, కదపిన వైయక్తికమ యగు నద్ది
కాంగ్రెసుకార్యంబు కాఁజాల దద్ది, కాంగ్రెసునకుఁ బూఁటఁ గాను నే నిపుడు
కాంగ్రెసుసేవలోఁగల యెల్లవాఁడు, తనకుఁదానే నేతృతను సమార్జించె
సత్యంబునకు నహింసకు దవ్వుగాక, యెల్లరు తమ నిశ్చయించిన సరణి
సాగింపఁదగు నేఁడు స్వాతంత్ర్యసమర, మస్మదాత్మకు ననహాయోద్యమంబ
తగునని తోఁచు నీతరుణమ్మునందు, నీశ్వరుపై భారమిడి జంకువీడి
మనకృషి మనము కామక సల్పవలయు, మనశక్తి దెస మనమదికి విశ్వాస
మేర్పడవలయు నిదే కార్యసిద్ధి, హేతువు నాఁజెల్లు నెట్టియిక్కట్లు
క్రమ్మిన గగ్గోలుగనఁ దెన్నఁదగిన, సత్యాగ్రహి యటంచు సవినయరీతి
వచియింతు మనకృషి వంధ్యమైనప్పు, దాదుర్దశకు మనయందలితప్పు
గాక యింకెయ్యది కతమగుం జెపుఁడ!, మనప్రయత్నంబు గ్రమ్మనఁ బండనపుడు

పొక్కుచు దిగజారిపోరాదు మనము, మజ్జీవితమున నిమ్మాడ్కి నేనాఁడు
గ్రుంగియెఱుంగ దిక్కులుఁజూచి యెఱుఁగ, భగవదాశ్రయమును బాసియెఱుంగ. 136

వ. అయ్యదియట్లుండె - నేఁడీదేశమునఁ దాండవించుచున్న దుర్భిక్షముం దలంచినంతన నాగుండె లవియు - వంగకర్ణాటము లేపీడన్ మిగులఁజెడియెడిని - ఆఁకటిమంటలం జురచురవోవు ప్రజల నేలఁబడివారు సమరంబనుసాకునఁ గడుంగడుమాడ్చి మన్ను సేయుచున్నవారు - లక్షలకొలఁది గ్రామీణు లన్నార్తులై రోగబాధితులై తమ దెసకుం జూచిన వారలేక యేఁకారి యేఁకారి యసువులంబాసిరి-ప్రజాప్రభుత్వమ యీదుర్దశం దొలఁగింపఁగలదు - మనకిప్డ దట్టిభాగ్యము మృగ్యము - కాన సాహాయ్యనిరాకరణమే కర్తవ్యము - అహింసన మొక మేటిపోటుముట్టు - ప్రయోగమునం దది శాసనధిక్కృతి, సాహాయ్యనిరాకరణము నా నిరుఁదెఱంగుల నుండు - చట్టముంద్రోఁత కందఱు చాలరు - దానఁ గృతార్థత వడయనెంచినవారి కాత్మబల మగ్గలముగానుంట వలయు - సహాయతా నిరాకరణమున కెల్లరుం దగుదురు - దీనిరహస్య మెఱిఁగినవా రన్ని చిక్కులం ద్రెంచుకొననోర్తురు. 137

గీ. గాంధి యిట్లు మహారాష్ట్రకార్యకర్తృ, మండలికి వించి భారతమహికి శాంతి
గూర్పవలెనన్నఁజెఱలలోఁగుములుచున్న, యనుచరులఁగంటయక్కఱయనితలంచె. 138

క. ఈపని కీకొనుమని ధీ, ల్లీపతికిన్ మరలనంపె లేఖను; వేవెల్
బాపూతలంపునకుఁ దగు, రూపున నపుడైన నుత్తరువు నీఁడాయెన్. 139

## మహాత్ముఁడు చర్చిలునకు వ్రాసినలేఖ

క. కీలకమంతయుఁ జర్చిలు, కేలన కలదనియు నతనికేవ్రాఁత కదున్
మేలనియు నెంచి గురుఁ డీ, లీల బ్రిటన్ మంత్రిమణికి లేఖము ననిచెన్.(17-7) 140

గీ. "ఈ దిగంబరసంన్యాసి నిలకుననఁచు, టుచితమని నీవు ననుఁగూర్చి యుగ్గడించి
తన్న! యీమాట నేమాడ్కినన్న నేమి, యస్మదీయాత్మ కిది హర్ష మావహించె. 141

వ. ఏను దిగంబరసంన్యాసిగా బ్రదుకం జిరకాలమునుండి పెనఁగుచున్నవాఁడ - కాన నీ వీబైరాగినినమ్మి యాంగ్లేయులయు భారతీయులయు నూడిగమునకు వీనినుపయోగించుకొనఁ గోరెద." 142

ఆ. ఒజ్జ యిట్లువ్రాయ నొకరెండునెలల కా, దిట్ట నీదు కమ్మ ముట్టెననియె
నాముకొన్న మాసి యామాత్రగాక యిం, కెంతవ్రాయు? ధర్మ వెంతరోయు? 143

వ. అదియట్లుండె - జలచికిత్సం గొంత తేఱినపదంపడి పూనాపజ్జంగల పంచగనికింజని విశ్రాంతినందుచున్న బాపూసన్నిధి కాగష్టువిప్లవము నతినిగూఢముగాఁ దీవ్రతరముగా

నడిపినయరుణయు నచ్యుతపట్వర్ధను మున్నగువారును గుట్టుగావచ్చి వినీతిపై నిల్చిరి - వీ రేల్పుడిపాదుం బెకలింప నెన్నేనివిద్రోహములకుఁ దెగిరి - వీరి యాగడఁ దెల్పిన వారికిఁ బెదపెద్దయుదుగర లిత్తుమని సర్కారువా రెల్లదెసలం దెల్లమియొనర్చిరి-కాని వీ రజ్ఞాతవాసమునం గుశలతవదసిరి-సత్యాగ్రహాచార్యుఁడు వీరితోనపు డిట్లు నుడివె.144

క. దాఁపతికముతోఁ జెసెడి, దేపని యగుఁగాక పాపమే యది యనెదన్
గోపనమున మనపెంపున, కాపత్తివినా తదన్య మాపాదిలునే? 145

ఆ. చాటులేక పనులుసాగింపవలె బర, వసముతోడ మిమ్మువంటివలఁతు;
లపుడె యలఁతి వారి కలవదు నుత్సాహ, మపుడె దేశమునకు నబ్బు ముక్తి. 146

ఆ. అనిన నొజ్జపల్కు లౌనని కొందఱు, బయలుమెఱసి శిక్షపడిరి గాని
యరుణవంటివార లజ్ఞాతవాసంబు, మానరైరి శాంతి గానరైరి. 147

## రుగ్నయగు నరుణకు బాపూ హితోపదేశము

ఆ. అరుణ రుగ్నయయ్యె నతిసార మాచానఁ, గ్రుంగఁదీసి బ్రదుకుకొసకుఁ దెచ్చె
వచ్చె గురునిచెవికి వార్త యియ్యది; మనం, బెరియ గాంధి యామె కిట్లువ్రాసె. 148

క. అరుణా! నీ తెగువకు న, చ్చెరువందితిఁ గాని రుజకుఁజిక్క నలఁగి యు
క్కఱి నేఁడు నీవు దుర్దశ, కిరవగుటన్ వింటిఁ గంటి నెంతయు నెగులున్. 149

క. మఱుఁగునఁబడి నీ వుసుఱుం, దొఱఁగుట కే నియ్యసేయ దుహితరొ! సరగన్
దెరవీడిరమ్ము నినుఁగనఁ, దొరపడుచున్నాఁడ బెంగతో నున్నాఁడన్. 150

గీ. అమ్మ! నినుఁ బట్టియిచ్చినయట్టివాని, కేలుబడివార లిడుకట్న మీవ పడయు
మొసఁగు మాసొమ్ము హరిజనాభ్యుదయమునకు, దొసఁగుసూ! కనుమఱువుగా దురమునేఁత. 151

క. నీనమ్మిక వేఱగుచో, నే నొ త్తడిసేయనొల్ల నిను; సర్వశుభా
స్థానమగుపథము నీశ్వరుఁ, దే నీ కెఱిఁగించుఁగాక! యేగుము దానన్. 152

## బాపూ సేవాగ్రామము చేరుట

వ. మహాత్ముఁ డిట్లెంతహెచ్చరించినను దనప్రచ్ఛన్నసరణి నరుణ విడువదాయె - ఈ యమ్మ కచ్యుతపట్వర్ధను తోడుగానుండె - బాపు వీరిపట్లఁగినియక చేతులు కాలినంగాని యనుభూతియేర్పదదనియు నది యావశ్యకమనియు నిర్ణయించు కొనియె - అంత నాయయ్య పంచగనినుండికదలి రెండేడ్లనాఁడు తా నుజ్జనచేసిన సేవాగ్రామము చేరి (3-8-44) బావురుమనుచున్న యిల్లాలికుటీరముంగని క్రేళ్ళు వాఱునంగదకుఁజిక్కి యొక్కింతతడవునకుఁ దేఱి యాశ్రమవాసుల యోగక్షేమం బారసి యూఱటనందుచుండ

నాగష్టునెలం దొమ్మిదవదినము తఱిసె - అది 'క్విట్టిండియా' వార్షికోత్సవదినము - ప్రజ లానాఁడు దుండగములదెసకుం జనరాదని యధికృతులం గలఁచుపను లేవియుం గావింపరాదని నిర్దేశులు కొలఁదిమంది మాత్రమ నాఁటికార్యక్రమమునం బాల్గొనవలయు నని యేలుబడివారి దుశ్శాసనముల సత్యాహింసలతో నెదుర్కొనవలయుననియు బాపూ దేశమునకప్పు డెఱుక పఱిచె - సుశిక్షితులగుబొంబాయిపౌరు లిర్వదియేవు రీసూచనకు విధేయులై యైదు జట్లుగా నేర్పడి కాంగ్రెసుజెండాలతోఁ జౌపాటియందలి లోకమాన్యుని విగ్రహమునొద్దకుఁజని మౌనప్రార్థనలు, పతాకావందనములు జరుపందొడఁగిరి - వీరికార్యక్రమము తెలిఁగు నంతకుమున్న రక్షకభటశాఖాధికారుల కెఱుక చేసిరి - కాన వారు హుటాహుటిం జనుదెంచి కాంగ్రెసుబంట్లనందఱ బంధించి కొంపోయిరి - సత్యాగ్రహం బిది చిటిపొటిదైనను దేశీయులయం దొక నూతన చైతన్యము నొదవించె - ప్రభుత్వమువా రిన్నాళ్ళనుండియు నిరంకుశముగా సాగించు దమన నీతి భారతీయుల మగఁటిమి నణఁపలే దనుసత్యమును జాటె - అయ్యది యట్లుండె - సేవాగ్రామమున మహాత్ముఁ దయ్యాయిపనులతో నుక్కిరిబిక్కిరియగుచుండ మహాదేవదేశాయి ద్వితీయ వర్ధంతిదినము (15-8-44) కదియంబడె - నాఁటి కాచార్యున కందిన కమ్మ నొకం డిట్లువ్రాసె. 153

## దేశాయి వర్ధంతి

మం. ఓమహాత్మా! విను మొకవిన్నపంబు, నీమేలు కోరి నీనెమ్మిని గోరి
దేవికస్తురి, మహాదేవదేశాయి, సైఁచినకష్టముల్ జగమెల్ల నెఱుఁగు
నిద్దఱు నీతోడనే బంది నిల్చి, రిద్దఱు నీకొఱకే వీడి రొడలు
కస్తూరి గొప్పదే కాని తత్తుల్య, లెందఱో జన్మించి రీభారతమున
మతి మహాదేవునిమాద్రివాఁ డెవఁడు, పుట్టె నీదేశానఁ బుట్టునా యిఁకను?
సర్వసంగ త్యాగ చతురుఁ డతండు, మహనీయనియమ సమగ్రుఁ డతండు
బహుముఖప్రజ్ఞా విభాసి యతండు, బ్రదికిన కాల మల్పంబ యౌఁగాక
శాశ్వతంబగుసేవ సల్పె నతండు, నీతోడ నుంటకు నీ కిష్టమైన
పనులుసేఁతకు నొదంబడఁడే నతండు, దిగజాఱఁ డింతలో దివికేగఁ దనెద
నుద్యోగమున కతఁ డుత్సాహపడిన, నున్నతోన్నతపీఠి నుండెడివాఁడు
మేరమీఱినకల్మి మెఱసి సౌఖ్యములు, గుప్పి యింటిని దిద్దుకొనుచుండువాఁడు
కొడుకునకున్ గొప్పగొప్పపట్టములు, చేపడుచదువులు చెప్పించి తనివి
కిమ్ముగా నుండువాఁ; డీదారి మాని, నీదారి కేతెంచె ని న్నాశ్రయించె
నీయాత్మ కాత్మగా నిల్చి పేరందె, నుతురీతి నీతనిఁ జూచితి వీవు
నిదిసమస్తము శస్తమేయగుఁ గాని, కస్తూరిసంస్మృతికై బయల్పడిన
నిధి కధికారిగా నిల్చిననీవు, దేశాయికీర్తి వర్ధిల నేమిచేసి
తేమిచేయఁ దలంచి తెతిగింపవయ్య, వార్చియుండెద నీదువచనముల్ వినఁగ. 154

వ. మహాత్ముఁ డీవ్రాయసమును మహాదేవ సంస్మరణార్థ మాశ్రమమునం దేర్పడిన సదస్సునం జదివినపదంపడి యిట్లనియె. 155

గీ. ఇతనివాదము సముచిత మిందుఁ గస్తు, రికి మహాదేవునకును జోలిక కుదిర్చి యనినపల్కులు నాహృదయమున నాటి, యెన్ని యోభావముల నుదయింపఁజేసె. 156

గీ. పందిరాలెను గస్తూరి, పక్వదశకు, వచ్చుతటి మహాదేవుఁడు వదలె మేను వందయేండ్లు జీవింపఁగావలయు నన్న, పట్టుతో నుండువాఁ డితఁ డిట్టులాయె. 157

గీ. ఇతనిజీవితకావ్యమం దెన్నియేని, కల వసంపూర్ణమైనసర్గము, లితండు కుంచివ్రాసినగాథలఁ జెంచివ్రాసి, ప్రకటమొనరింప బహువత్సరములు వలయు. 158

క. ఎన్నేండ్లో బ్రదికెద నని, మున్నెపుడో యీసమస్తమును దెల్లముగాఁ బన్నెదనని భావించిన, యన్న యితం; డీతలంపు లాఱడివోయెన్. 159

వ. తన చావున కీవలినాఁ దయ్యాయిగఱువలతో నేనుగావించిన చర్చలసారమెల్ల నితఁ డుసంతనచేసియుంచె – ఈపత్రముసైత మితని చందుగునం జిక్కె – దేశాయివ్రాలేనుదక్క నొరులు గుర్తింపఁజాలరు – చిన్న చిన్న కాగితములపైఁ గుదించి వ్రాసిన సుద్దుల కితం దెట్టిరూపు నాపాదింపనెంచెనో యది దైవమునకే యెఱుక – జరామరణములు లేనివానింబలె మహాదేవుఁడెల్లవేళల నేడే నొక సత్కార్యమున బ్రుంగుడువడి యుండు – తనలక్ష్యమున కొప్పునిపని కెన్నఁడేని దేశాయి సమ్మతించు వాఁడు కాఁడు – కాన వీనికావించిన యెల్లచేఁతయు నత్యంత రమణీయముగాఁ దోఁచు – నిరంతర శ్రమములగు నిట్టి సాధకుల తలంపులెల్ల సఫలంబులగునేని వీరి మనుగడ లగాధములగు – జగమ్ము తాఱుమాఱగు–కావుటం జేసియ దయానిధి యగు పరమేశ్వరుఁ డీలోకము నం దనకోర్కి యొండ పండవలయునను తీర్మానమునకు వచ్చె – అది యట్లుండె. 160

క. నాదండ నుంటఁజేసి మ, హాదేవుఁడు నష్టపడినయది యించుకయున్ లేదని తన్నుతి కొగ్గిన, సోదరు లెఱుఁగంగవలయు సూనృతరక్తుల్. 161

ఆ. ఇతఁడు ధనము ధాన్య మేనాఁడు కోరిన, వాఁడు కాఁడు భక్తివశతఁ దక్క నన్నుఁ గనకముందె నావంటిభక్తుల, నరసి వారిచెల్మి నందినాఁడు. 162

గీ. ఇతనిదాహము నాచెంతనేని తీఱ, దితనికి శమమ్ము నాకడనేని పొదమ దెంతకాలము సైఁతు నీవంతననుచు, వెడలె దేశాయి బ్రహ్మమున్ వెదకికొనుచు. 163

గీ. ఇతఁడు వీడినపనులు పూరితియొనర్ప, నితనిభక్తికిఁ దగినయున్నతి గడింప బడలవలె నేను దేశాయిపట్లఁ జేయఁ, దగినసమ్మాన మిది యని తలఁతు నిపుడు. 164

క. దేశాయిపేర నొకధన, కోశము నిర్మించుకంటె గొప్పది యిది; స
ద్వేశునికృపచేతన యీ, యాశయము ఫలింపవలయు నభినంద్యముగన్. 165

గీ. ఇతనిలక్ష్యము భారతక్షితికి ముక్తి, యితని కోరిక తన్నుఁ దా నెఱిఁగికొనుట
విసువ కీరెండుపనులు కావించుకంటె, నితరసంస్మృతిచిహ్న మింకేమి కలదు? 166

క. ధనరూపస్మరణాంకము, ఘనమన్నను దానికేను గా; నప్పనికీ
తనిమిత్రులు తగుదురు, పిత, తనయునిసత్కృతికి నొరులద్రవ్య మదుగునే? 167

క. కస్తూరిపేర వెలసిన, దస్తువ కేఁ గతము కామితధ్యము; దానిన్
శస్తముగ వెచ్చపెట్టుట,క స్తుంకృతిచేసి కంటి నాధ్యక్షమ్మున్. 168

ఆ. ఎవ్వరైనసుజను లీమహాదేవు సం, స్మృతికి నిధినిగూర్చ నెంచినప్పు
డుందు నేను వారి కొడయఁడనై నన్నుఁ, బిలుతురేని వారు వలతురేని. 169

వ. వెండియు మహాదేవునకు రహటచాలన మనుదినంబును ముఖ్యకృత్యముగా నుండె - తనవిధియని తప్ప నామెప్పువదయంగోరి యితఁ డీపని కావింపఁడు - దీన తామగ్నమై యల్లాడు ప్రజకు రాట్న మే శరణ్యమని నావలె నిమ్మనీషియు విశ్వసించె-కాన దేశీయులు దేశాయిపేర నొకనిధిం గూర్చుటకంటె నితని కింపితమగు నిర్మాణ కార్యక్రమమును జేపట్టుట లెస్స. 170

క. గురుఁ డిట్లుపల్క సభ్యులు, పరితుష్టిం గనిరి నూలిపనిసేయుటకున్
హరిజనసేవాదులకున్, గరమాదర మొసఁగి తృప్తిగని; రాపిదపన్ - 171

## గాంధి - జిన్నా సమావేశము చెడుట

గీ. రాజకీయప్రతిష్టంభ రజ్జుదళన, లిప్స హెచ్చెను ముస్లిములీగునకును;
తరలి కాంగ్రెసుతో సమాధానపడుము, నడువు మని యది నేత జిన్నాను వేఁడె. 172

క. అతఁ డొజ్జకు నాదృతిమై "గత చరితన్ మఱచి సంధికల్మికి ననుకూ
లతఁ జూపి దేశదాస్య, క్షతి గూర్పఁగదే యటంచుఁ గమ్మ లిఖించెన్.(20-8) 173

గీ. చీల్చి పాలించువెరవులోఁ జేవదేలి, నాంగ్లమంత్రుల కీవార్త యార్తి గూర్చె
భారతమ్మును శాసించుభాగ్య మణఁగి, పోక వారు సైఁతురె బుద్ధిపూర్వకముగ. 174

గీ. లీగు కాంగ్రెసులకు మైత్రి సాగినంత, నేమి యొఱగు? సంస్థానము లేలుదొరలు
వలయుననుదాఁక భారతావనికి నబ్బు, నా? స్వతంత్రత; యనిపల్కిరపుడువారు. 175

గీ. అదియుఁగాక హిందూమహి నణఁగఁద్రొక్కఁ, బడినవారెందఱోకలరదలుకొనుచు
వారిమే లేముగాక యెవ్వారు చూతు, రనిరి ధర్మువునకు దాసులైనకరణి. 176

వ. వారి కడుపుమంట యెట్లున్నను బాపూ జిన్నాల సమావేశమునంజేసి దేశమునకుఁ గొంత మేలు చేకుఱునని ప్రజ లుత్సాహపడం దొడఁగిరె-ఒక్క హిందూమహాసభవారు మాత్ర మీ కలయిక కిష్టపడరైరి - సమావేశకాల(9-9-44) మావిష్కృతమైనంతన తత్సభకుం జెందిన కోడెకాండ్రు కొందఱు సేవాగ్రామమునకు వచ్చి మతావేశ ముట్టిపడ మహాత్ముని జిన్నాకడకుఁ గదలనీమని యఱచుచు బాపూవసించు కుటీరపువాకిండ్ల మూఁటి నరికట్టి నిల్చిరి - వారు తేఱి తమ మది మార్చుకొని నన్ను యాంత్రికయానము నధిరోహింప నీరేని యే నొక్కండన వారి నడుమ నడచి వర్ధాఘట్టముఁజేరి రైలెక్కెదనని సత్యాగ్రహ విధాత ప్రకటించి ముహూర్తము తఱిసినంతన కదలందొడఁగె - హిందూ మహాసభవా రపుడు తమ మొఱకుఁదనము నుజ్జగింపక యొజ్జం గిఱికొని నిలువరింపఁ బోలీసుదొర వారల నిర్బంధించి తలబిరుసు మానని తన్నాయకుని బరిశోధింప నతని దుస్తుల నొక బాఁకు బయల్పడె నంత నయ్యధికారి యోహో! నీవు ప్రాణార్పణమునకుఁ దెగించి కూచికైదువుతో వచ్చినవీరుఁడవా? మంచిది - నీప్రకటించినమగఁటిమి లేకున్న నేమి? అంతపనికి సాహసించివచ్చితి నన్న తృప్తియైనను నీకుఁ దక్కినదిలే - అని మేలమాడ నబ్బందెకాఁడు. 177

క. 'నా కిపుడు తృప్తి యెట్లొయిఁ, జేకుఱు? నసువంటి యొకఁడు చెనఁటిని గాంధిన్
బోకార్చినసుదినమ్మునఁ, గాక' యటంచనియె నెంతగడుసరివాఁడో! 178

వ. పదంపడి దళవాయి వానింగని మహాత్ముం బరిమార్చుపని నీవంటి పిన్నవాండ్ర కేల? - సావర్కారుంబోని మీపెద్దల కప్పగింపఁజనదా? - అన మానాయకులాచేఁతకొగ్గుట గాంధి కధికాదర మొసంగుట యగు- ఇతనిం జంపుట కీబంటు చాలు నని వాఁడు తన యనుచరుఁడగు నాథూరామ్ వినాయక్‌గోడ్సేను గానిపించె - భవిష్యకాలమునం దాహింసన మాగోడ్సేపాలిద యయ్యెనుగదా! - ఏమాట కెంతప్రాణముండెనో దైవమునకే యెఱుక - అది యట్లుండె-మహాత్ముఁ డానాఁడు బొంబాయిచేరి (9-9-44) జిన్నా భవనమునకుఁ జనినంతన యయ్యిరువురకును 179

క. కరచాలనములు నడిచెను, బరిరంభణములు ఘటిల్లెఁ బ్రతికృతిపనియున్
జరిగెను గుశలప్రశ్నము, లఱగొఱలేకుండసాగె నాప్తులు తనియన్. 180

మం. ప్రారంభమయ్యె సంభాషణకార్య, మది పదునెన్మిదియహములు నడిచెఁ
దొలునాఁడు నీవు హిందువుల కాంగ్రెసున, - ప్రతిభూత్వమును బూనివచ్చినయట్ల
భావింతు నని జగద్బాంధవుతోడ, జిన్నా వచింప నోచెలికాఁడ! నేను
వైయక్తికమ్ముగా వచ్చితిఁగాని, హిందువుగాఁ, గాంగ్రె సెన్నుకొన్నట్టి
పూఁటగా రాలేదుపో! నీవు లీగు, ప్రతినిధిగానొండె భవదీయచిత్త
గతియ తెల్పెడిపెద్దగానొండె నిపుడు, నాతోడ నాలపన మొనర్పవచ్చు

నా్రమోల నీచెప్పునది నిరర్థకమ, యగు ననుతలఁపు నీయాత్మలో నున్న
నిపుద వచ్చినదారి నేగెదనయ్య!, మన్మానసము నీవు మార్చెదవేని
బ్రదికినన్నాళ్ళు నీబల్మికై పాటు, పడెదఁజుమా! యని బాపుజీ పల్కె. 181

వ. ఎట్టకేలకు వారిచర్చ లారంభమాయె-అందు జిన్నా దేశము విభక్తమై పాకీస్థానము పుట్టితీరవలయుననియు నదియు హిందూస్థానము నొక ముహూర్తముగన సర్వతంత్ర స్వతంత్రత నందవలయుననియు విభజనమునకు ముస్లిములుగానివారిసమ్మతి తగ దనియు సంస్కృతి, భాష, కళలు మున్నగువానింబట్టి హిందూమహమ్మదీయులు భిన్నభిన్న జాతులవా రనియు వీరు వేర్వేఱుగా మనుగడసాగించుట సముచిత మనియుఁ దెగించి పల్కె - మహాత్ముఁ డాంగ్లేయు లీదేశమునకు స్వాతంత్ర్యము నొసఁగి యోడయెక్కిన పిదప ముస్లిములు హెచ్చుగానున్న రాష్ట్రములలో సర్వమత ప్రజాభిప్రాయము తెలిసికొని యది యనుకూలించిన గడ్డలతోఁ బాకీస్థానమును సృజియింపవచ్చుననియు మైత్రితోఁ గాక బల్మిమై నేర్పఱచు రాజ్యములు శాంతి సంపన్నములై మనుట కల్లయనియు ద్విజాతిసిద్ధాంత మర్థరహితమనియు దీనిపేర విడివడుటకంటె నన్నదమ్ములవోలె హిందూమహమ్మదీయులు వేఱుపడుట యభయ శ్రేయోమూల మనియు నపుడు సైతము దేశరక్షణ విదేశవ్యవహారము వాణిజ్యము స్వల్పసంఖ్యాకుల కాపుగడ మున్నగువానిపట్ల నిర్వురు నొకకట్టుపాటు కావించుకొనుట వలయుననియుం దెలిపె - 'నీతీరు గుఱ్ఱము ముందు బండి నునిచిన ట్లున్న' దని జిన్నా! మహాత్ము నపహసించె - 'తాఁబట్టిన కుందేటికి మూఁడేకా'ళ్ళని మొండిచఱచి నిల్చె - విఫలశ్రముఁడైనబాపూ పదంపడి (1-10-44) సేవా గ్రామమునకు వచ్చె. 182

గీ. అమ్మహాయోగిజన్మదినాభినంద, నోత్సవము దంబరములేని యొప్పుతోడ
నడిచె నమ్మఱునాఁడు బెర్నార్డుషాది, తజ్జ్ఞు లంపిన ధన్యవాదములతోడ. 183

మం. అనేమహాశయుఁ డపుడు సింహళమ, హీరాజధానియం దేర్పడినట్టి
బాపూజయంతిసభన్ బ్రసంగించు, నతఁడిట్లుపల్కె "మహాత్ముఁడు భార
తీయుల కెలమి సంధింపన కాక, ఖండఖండమ్ములఁ గలమానవులకు
నున్నతి చేకూర్ప నుదయించినాఁడు, భారతోర్వీముక్తి బాపులక్ష్యంబు
నాఁ జెల్ల దది సాధనమ యనవలయు, నజరాజుసమ్మోహనాస్త్రమువంటి
దగును మోహనుని సత్యాగ్రహాస్త్రంబు, నడిసన్న యాత్మశిక్షకు నోఁచువారె
పరఁగింపనేర్తు రీపటుతరాస్త్రమును, గడియింప నేర్తు రుగ్గడువుగా గెల్పు." 184

## కస్తూరిబాయి గొప్పతనము

వ. ఆనాఁడు మహాత్ముఁడు కావించిన మేలిపని యొండుకలదు - చెఱసాలనున్న తతిం గస్తూరి సనాతనసంప్రదాయమును బాటించి కారాగృహప్రాంగణమునం దొక తులసిం

బాఁతి దాని కనుదినం బర్చనాప్రార్థనములు సెల్లించె - బాపూ విడివడి వచ్చునపుడు తదనుచరులు తత్తులసి మొక్క నొకదాని నత్యంతభక్తిమైఁ దెచ్చి యింతదనుకం దమ వెంటన యునిచి ప్రోదిగొనుచుండిరి - నాఁ డామొక్కను 185

ఆ. కళదొఱంగియున్న కస్తూరికుటిముందు, నాటె నొజ్జ శిష్యకోటి బలయ
నిప్పువంటి బ్రదుకు నేర్చి తన్ గొలిచిన, వెలఁది నెంచి విడిచె వేఁడియూర్పు. 186

గీ. సోక్రటీసు రామానుజసూరివరులు, శ్రుతులుకలియనియాంగ్రతో మతులు వ్రస్సి
పడినబాధలు లేవుగా బాపుజీకి, సాధుతామూర్తి కస్తూరి చాన యగుట. 187

క. పాతివ్రత్యము దుష్కృత, భీతియు హరిభక్తి యతిథిబృందావన మీ
నాతి సదా మఱవక హిం, దూతన్వికి సంతరించెఁ దొలఁగనికీర్తిన్. 188

గీ. మానసికదుర్బలతలేని మగువ యగుట, దేవికస్తూరి పరువవ్వుంజేవచెడని
వయసుననె బ్రహ్మచర్యజీవనము పూని, వల్లభునికోర్కితీవకు నల్లువెట్టె. 189

గీ. తీవ్రతరసంస్మరణదృష్టిఁ దిరుగుగాంధి, కెగ్గుసేయంగ నెందతో యొగ్గు టెఱిఁగి
వేయికన్నులతో నాత్మవిభునియుసుఱు, కాచి కస్తూరి జగమును గాచె నదిర! 190

ఆ. ఎన్నఁదగినవిద్య యీమెకు రాదు రా, కున్న నెట్టిలోటు కన్న దీమె?
చదువు కతముగాదు సద్గుణమ్ముల కని, యెఱుకపఱిచె మగువ కీసవిత్రి. 191

క. స్త్రీ లెందఱో మహాత్ముని, యాలమునన్ దూఁకి పగఱ నదలిచిరికదా
మే లిది యొదవుట కమ్మయుఁ, జాల నలంగినది బాపుచాటునఁ జనుచున్. 192

ఆ. ఇంతిలో వివేక మేర్పడకున్న చోఁ, దాఁక రానితనము తలఁగదన్న
కీలెఱింగి సతిని మేలుకొల్పినది క, స్తూరి కీర్తి కెపుడు నారటిలక. 193

ఆ. వెలఁది మొదట మగనివిశ్వజనీనత, కొప్పలేక యెదురుసెప్పెఁ గాని
విభునిపేర్మి నొక్కపీసము తగ్గించు, టెఱుఁగదాయె నోర్మిఁ దొఱఁగదాయె. 194

గీ. మఱువుఁడు మదీయదోషముల్ మఱవుఁడనుచు, బందిఁగలయెల్లవారికిఁ బ్రణతులిడుచు
రామనామమ్ము పల్కుచు సామియొడిని, మస్తకము నుంచి కస్తూరి మహిని వీడె. 195

వ. అగ్నికార్యముదీర్చుతతి మహారాష్ట్రప్రజలయాచారము ననుసరించి బందీబృంద మీయమ్మ కుక్షిపైఁ బచ్చగాజులు నూవులు టెంకాయమున్నగువస్తువు లునిచిరి -బాదినెత్తుప్రొద్దున గాజులన్నియు దానం బగులకయుండె - మహాత్ముఁడు వానింగని యింతమంటం బడి చిట్లని యీసూడిగములు కస్తూరిసతీత్వమునకు మేలిమూదల యని కొనియాడె - మనూగాంధి మొదలగుచాన లాగాజుల దేవీ ప్రసాదముగాఁ బంచుకొనిరి - అమ్మ కెంతేనియూడిగము కావించిన కుమారి మనూగాంధికి మహాత్ముఁ డానాఁడు తన యిల్లాలి

దంతపుగాజులు తులసీమాల కుంకుము బరణి పావ లాదిగాఁగల వస్తువులనిచ్చి రామపాదుకలం గొల్చిన భరతునివలె నీ వీ పరికరముల నారాధించి యుత్తేజనము నందుమని దీవించె - అదియట్లుండె - నేఁడు కస్తూరీనిధి నేపనులకు వెచ్చింపవలయు నన్న చర్చ రా నాచార్యుఁ డిట్లనియె. 196

మం. కల్లకొదులు లేని గరిత కస్తూరి, హెచ్చుగాఁ జదువనియింతి కస్తూరి
యగుఁగాక నావెంట నంజక నిల్చి, యఖిలోద్యమమ్ములయందుఁ బాల్గొనియె
సకలకష్టంబుల సైరింపనేర్చెఁ, దెగువలో ధృతిలో నతీవయశమ్ము
నాఁచిన భారతనారి కస్తూరి, కావున స్త్రీవిద్య కదలుకొనంగఁ
బొలఁతికి నార్థికపుష్టి చేకూర, నబలకు మందు మాఁ కబ్బి పెంపొదవఁ
బసివాండ్రగోరాలు పరుగువాఱంగ, జాతిమతాదులసంగతి మఱచి
వెచ్చింపవలయు నీవిత్తమునెల్ల, ననిన మేల్మేలని రాగోష్ఠివారు. 197

క. పదపడి కస్తూరీస్మృతి, నిధి పాలించుటకుఁ బేదనెత్తురు పీల్వన్
బెదరనిసాహులు తగ రని, పదురం దొమ్మండ్రు సభను బల్కిరి పెలుచన్. 198

ఉ. తీ ర్పిది ధర్మదూర మని దేశికుఁ డెంచి సదస్యులార! యె
ట్లేర్పడె నింతసొమ్ము? ధనహీను లొసంగుటఁజేసి యందురా?
యోర్పు వహించి నిక్క మెదియో కనుఁగొందు, ధనాఢ్యులున్‌జగ
త్తర్పణకారికార్య పరతంత్రత నుందు రటం చెఱుంగుఁడీ! 199

క. దొరతనమువారి యల్కకు, గుఱియై చెఱఁబడిన గాంధికొమ్మయశంబున్
దిరపఱుప నింతధన మి, చ్చిరి సాహులు; వీరి కీవిచే నెది యొఱగున్? 200

క. పైపై చ్చేలెడివారల, కోపమునకు వీరుకూడ గుఱి కావచ్చున్
వ్యాపారుల కాదాయము, చేపదునా దొరలకరుణ చెడినన్ జెపుఁడీ! 201

గీ. ధనికులందును మానవత్వమ్ము కలదు, ధనికులందును ధర్మతత్పరత కలదు
వార లార్జించుకల్మికి వారి ధర్మ, కర్తల నొనర్పవలయు లోకం బెలర్ప. 202

గీ. వసువుగలవారి నాదారువాండ్రమంచి, చెడ్డలకుఁ బాలికాఁపులఁ జేత వలయు
నపుడు సాహులసాధ్వస మణఁగిపోవు, నపుడు పేదలక్షుత్కీల మాఱిపోవు. 203

చ. ఎవనికిఁ జేఁదగున్ గలిమి? యెల్లరు విత్తము గోరువారె, నేఁ
డు వసువులేక సాహులఁగదున్ జెడనాడుదరిద్రుఁ డర్థముల్
కవిసిననాఁడు భోగములు కల్గిననాఁడు ధనాఢ్యుఁ డిట్టునా?
జివసెడి కుందుపేదలను జీరి సమస్తము ధారవోయునా? 204

చ. సిరిగలవారితోఁ జెలిమిసేయుట నాయెడఁ బెద్దలోటుగాఁ
దలఁతురు కొంద; ఱీనెనరు దబ్బఱ వెంపర లేనిమన్నదన్
వలచినవాని కొప్పదని వాదొనరింతురు గాని దీనికిన్
వెల నిడనోప; నించుకవివేకము చాలదు ధర్మువున్ గనన్. 205

గీ. ఎద నుదారత లేనినాఁ డెంచు నరుఁడు, ధర్మము నధర్మమును విటతాటనముగ
నేల పలుమాట లెవ్వఁ డహింసనార్థి, యతఁడు కలవారిఁ ద్రోయరా దని వచింతు. 206

ఉ. సాహులు సర్వసంపద విసర్జనచేసి బికారులైనఁ దత్
స్నేహము నియ్యకొందు నని సెప్పెడిమానిసి నెట్లుమెత్తు శ్రీ
మోహము నెల్లవారలు సమూలముగాఁ బెకలింపఁజాల రీ
సాహస ముగ్రమౌతపము సల్పినసంయమి కే వశంపడున్. 207

గీ. ఒకనికడ నెంతసంపద యున్న నేమి, యతఁడు తద్ధర్మకర్తగా బ్రతుకునాఁడు
నలఁగి మన మిట్టిధనపాలకుల సృజింప, వలయు నుర్వి నుద్దీప్తివచ్చునట్లు. 208

గీ. ధనము గలవాని దిద్దుపద్ధతిని మాని, చంపఁజూచుట మతిలేనిచంద మనెద
గుట్టెఱుంగక బంగారుగ్రుడ్లకొఱకు, బాతువును జీల్చినతఁ డేమిబావుకొనియె. 209

గీ. అగుటఁ గస్తూరిస్మృత్యర్థ మర్థమిడిన, ధనికులును దన్నిధిం గాచు ధర్మకర్తృ
మండలిని గొంద ఱుంట సమంజసంబ, యనుదు వెలవెల్లనై రచ్చ యౌదుగఱచె. 210

## మిత్రులకోర్కిపై మహాత్ముఁ డుపవాసము మానుట

వ. పదంపడి మహాత్ముఁడు దేశముదెసకుం జూచి తృతీయవర్గమువారగు నాంగ్లేయు లిట నుంటజేసి మతసమస్య జటిలమాయె-ముస్లింలీగు తోడ్పాటున జాతీయ ప్రభుత్వము నేర్పఱుచు నవకాశము నానాఁటికి సన్నగిల్లెడిని – ఇఁకఁ గర్తవ్యమేమి? – దేశీయమగు దొరతనముకాక ప్రజాక్షేమమున కెయ్యది యత్నించు? – వంగ రాష్ట్రమునం దన్నార్తులై యన్నిలక్షలమంది మ్రందుటకుఁ బ్రజాప్రభుత్వము లేమి కాక పప్పుబియ్యాలు లేమి కారణమా? – బేరగాఁడు మితిమీఱిన లాభమునకు, నధికారి లంచమునకు, నేలుబడి దారుణశాసనములకు నాయితంపడిననాఁ డకించనుఁడు చావక బ్రదుకఁగలఁడా – అని పరిపరివిధమ్ముల వగచి ప్రజలలోఁ జైతన్యము నాపాదింప నుపవాసమ సాధనమని నమ్మి యుల్లికి జతనుపడుచుండ. 211

క. ఇదివిన్నమిత్రు లెంతయు, బెదరి నిరాహారనియమపీడను గురుఁడి
ప్డెదిరింపఁజాల డీయన, మది మార్పం బాటువడుట మనవిధి యనుచున్ – 212

సీ. ఆచార్యుఁ దతిసి మహాత్మ! దుస్సహమైన, యిడుమలఁజిక్కి రెండేండ్లనుండి
శాంతి గోల్పడినదేశం బిపుడిపుడె ని, ర్మాణకార్యక్రమ రక్తికతనఁ
దేఱుచున్నది ప్రభూ! దారుణంబగు నిర, శనదీక్ష నేఁడు పూనినఁ గృశించి
యున్ననీ వేమగుదో యొండు పుట్టుచో, భారతక్షితి యెట్టిపాట్లఁ బడునొ
యేలదూఁకెద వగ్నిలో నేము నీకుఁ, జెప్పనేర్తుమె యైన మాచిత్త మిట్లు
కలఁతనం దెడి నాగామికష్టసుఖము, లరయవే! యనివేఁద నిట్లనియె నొజ్జ. 213

ఆ. అన్నలార! దేశ మాఁకటిచిచ్చుతో, మ్రగ్గుచుండె నకట! మఱవరాని
బన్నములకుఁ జిక్కి విన్నఁబోవుచునుండె, దిక్కులేక మిగుల స్రుక్కుచుండె. 214

ఆ. ఇపుడు నేను బ్రజలయిక్కట్లలోఁ బాలు, పడయవలయు వారిఁ బల్కరింప
వలయు వారితోడఁ గలసిపోవలయు నీ, పనులు సాగఁ బస్తుపట్టవలయు. 215

వ. ప్రజాహృదయమును మేల్కొల్పుట కొపవస్త మనుసాధనమును వేల్పు నా కనుగ్రహించె -ఇచట మీదారి వేఱుకావచ్చు-నాదారిమాత్ర మిది-ఏ నీదారిం జనకతప్పదు-వివేకము లేనివిక్రాంతి నావిష్కరించి జపానువారు జగత్తును వడఁకించిరి-కాని యహింసావాది మగంటిమిత్రమోల వారిపౌరుష మేపాటిది? నేఁటియాటవికధర్మ మహింసతో నిర్మూలితమై ప్రపంచమునఁ బ్రేమసామ్రాజ్యము సుప్రతిష్ఠితము కావలయు-నా యిల్లికతనం బ్రజా సముద్ర మల్లకల్లోల మగునని యేను విశ్వసింపఁజాల-నాజతనములన్నియుం బ్రజాక్షేమ కరములగుననియ తలంతు. 216

ఆ. గాంధి యిట్లుపల్కఁగా నెయ్యురు మఱొందు, నుడువలేక డిల్లపడిరి గాని
ప్రకృతి యపుడు వీరిపాలిదై బాపుజీ, జీర్ణకోశమునకుఁ జేటుదెచ్చె. 217

వ. అయ్యవసరమునం దొకభిషక్కు 218

క. ఆయుర్వేదచికిత్సన్, నాయంతటివాఁడు లేఁ డనా! యనుచు భవ
చ్ఛ్రేయము విశ్వంబునకున్, శ్రేయ మనుచు వచ్చె బాపుజీ సన్నిధికిన్. 219

ఆ. అతఁ డొసంగుమందు నాచార్యుఁ డారోగ్య, కాంక్షఁజేసి మ్రింగెఁ గాని దాని
కతన డాఁగియున్న యతిసార మెసరేఁగి, తండ్రి లేవ లేనిదశకు వచ్చె. 220

వ. ప్రజ్ఞానిధి రాజగోపాలాచార్యు లపుడు సేవాగ్రామమునకు వచ్చి శల్యమాత్రావశిష్టుఁడై యున్న గాంధిని గని నిట్టూర్చి బాపూ! నీ విట్లు లోచెడియున్నతతి నిరశనవ్రతము పూనుటకంటె నిష్క్రియత్వము పాటించుట లెస్స - ధర్మసాధనములం దనువు ప్రధమ గణ్యము కదా! - పరికింపుము - నావుడు మహాత్ముఁ దగ్గలముగా నంతర్వీక్షణమునకుం గడఁగి 221

మం. ఏనొనర్చెడిపని యీశ్వరునిచ్ఛ, కగ్గమైయున్నదో యస్మదిచ్ఛకు వి
ధేయమైయున్నదో తేల్చుకోవలయు, నాకోరికనుబట్టి నాకృషియుంట
నిక్కువం బగునేని నేఁ బెడదారిఁ, బడినయట్లేకదా! బంధముల్ హెచ్చి
శాంతి డిందుటకాక సమకూరునర్థ, మింకేమికలదు నా యీతప్పునడను
భగవంతునిచ్ఛనుబట్టి నాచేఁత, సాగునయేని యీశ్వరునికారుణ్య
మెల్లవేళల నన్ను నెఁడబాయకుండు, నిడుమలు ననుదాయ నెంతేని వెఱచు
సత్యమిమ్మెయి నుండ శారీరకార్తి, నాపాలఁబడనేల నను నొంపనేల
యెఱిఁగితి గారణం బేటికిఁ దర్క, మే నూఁచముట్టుగా నీశ్వరుమ్రోల
నాత్మార్పణము సేయనైతి నిస్సంగ, జీవనవిజయంబు చేపట్టనైతి 222

వ. అనియూహించి యుపవాసనిర్ణయమును మార్చుకొని విశ్రాంతి వలచి (4-12-44 - 31-12-44) వ్రాఁతపనులన్నియు వర్జించె - వార్తాపత్రికలు చదువుటయు వదలె - నూలుదీయుటమాత్ర ముజ్జగింపక యనుదినం బాపని కొక గంటకాలము వెచ్చించు చుండె - అంతలోఁ గ్రిస్మసుపండువు రా నాచార్యుఁ డానాఁ డాశ్రమవాసులఁ నుద్దేశించి మన మాత్మాభిముఖులము గావలయు సత్యమని నమ్మినపనికి వలయుచోఁ బ్రాణార్పణ మొనర్పవలయు జీసస్సును స్మరించుకొని య య్యుదారుఁడు సూనృతమునకు బలివోవుట గుర్తింపవలయు నని యొకయుదాత్త సందేశ మొసఁగె - అంత 223

## 1945

## ప్రపంచ సమరము ముగియుచున్నది

మం. ఆఱేండ్లనుండి సర్వావనీప్రజల, శాంతి చక్కాడినసమరంబు ముగియు
వేళ సమీపించె - విజయగర్వంబు, చేపడ్డదొరలు నిర్జితమహీపతుల
కురిశిక్షలు విధింప నుండిరివార్చి, యమెరికాకధ్యక్షుఁ డగురూజువెల్టు
తనువుచాలించె న త్తరుణమ్మునందు, నాతనిసతికి మహాత్ముఁడు సాను
భూతివాక్యమ్ము లంపుచు నీమగందు, చనుట నాకార్తిని సంతుష్టిఁ గూర్చె
నమ్మరో! మిత్రరాజ్యములను నేఁడొ, రేపో జయమ్ము వరింపనున్నట్టి
యదన నతం డిహత్యకజీవనమ్ము, కాదని చని నేఁటికయ్యముకంటె
భయదమౌ కలనికి బాటలుదిద్దు, సంగరానంతర శాంతిసమజ్యఁ
బాల్గొనఁడాయె నీపాపపు జేఁత, కతఁడు దవ్వగుట నా యానందమునకు
హేతువగు మ్మన్య మెంచకు మనియె (16-4-45) 224

వ. పదంపడి విదేశీపత్రికావిలేఖకుఁ డొకండు బాపూసన్నిధి కేతెంచి రణకండూతి రేఁగిన యక్షరాజ్యములవారిత్రు ళ్ళడఁగినది - ప్రపంచమున కిఁక శాంతిచేకూరఁ గలదు -

విజేతలగు నగ్రరాజ్యాధినేతలు 'శాన్‌ఫ్రాన్సిస్కో' నగరమునఁగూడి వెండియు నిట్టిబెట్టిదపు సంగరము లేర్పడమికి వలయుకట్టడలు గావింపఁగలరు – మీ రీసమావేశమునం బాల్గొని విశ్వశాంతికిఁ గృషిసల్పుట సముచితము – నావుడు నొజ్జ యిట్లనియె. 225

గీ. శాంతి నొదవించుటకహింసచాలుఁగాని, హింసయెటుచాలు? నాలమందిపుడు గెలుపు
గొన్నవారు జగచ్ఛాంతి గూర్తురన్న, మాట పాటింపలే నణుమాత్రయైన. 226

గీ. ఏను బాశ్చాత్యుల మనః ప్రవృత్తితీరు, గన్నవాఁడ ననేకమార్గముల నలఁగి
ధర్మ మన్నది వారి కర్థమ్మునెదుటఁ, గన్పడదు కన్పడునుగాక గణుతిగనదు. 227

వ. అమెరికాయందలి సామాన్యమానవుఁడుసైత మధ్యక్షుని నమ్ముకొనియుండు – వాఁడు స్వతంత్రాలోచన మొనర్పఁడు – వాని కాయధ్యక్షుఁడు వణిజ్యా సౌకర్యములు కల్పించు – విదేశవిపణింజూపి లాభములు చేకూర్చు – చర్చిలిట్ల యాంగ్లేయులకు దోడ్పడు – నేఁ డీపెద్దలు శాంతిమార్గము లన్వేషింపఁబూనుట లెస్సయ – కాని తెల్ల నల్ల యను వేర్మిని వారు మానలేరు – పీడితుల నింకను బీడింతురు – ప్రపంచశాంతి నిట్టివా రాపాదింతు రనుట కల్ల – భారతోర్వీదాస్య మహింసా పద్ధతులందొలఁగు నేని పీడిత ప్రజల కీదేశ మాశాజ్యోతి నందింపఁగలదు – స్వాతంత్ర్య మహింసాలబ్ధమైననాఁడు – దేశీయుల కేర్పడుశాంతి దివినుండి మెలమెల్లగా నమృత వర్షముకురిసిన ట్లుండు – ఇతరంబగుశాంతి పెనుగాలివానంబోనిది యగు–మఱియు 228

ఆ. ఓటువడినవారె యుద్ధకారకు లప, రాధు లని సహింపరాని తీర్పు
వఱపి నేఁడు వారివపఁ దీయుటకు వార్చి, యున్న వారు గెల్పుగన్నవారు. 229

ఉ. చెల్లు నటంచు సంగరము చేసినవా, రని కియ్యకొన్నవా
రెల్లరు నేరగాంధ్రనుటయే తగుఁగాని యిదేమితీర్పు? మీ
బల్లిదు లగ్రరాజ్యపరిపాలకు లింతయహంత చూపినన్
జల్లునొకో జగమ్ము విరజాదులు మల్లెలు వారియొదలన్. 230

గీ. కలదె నిర్జితు భంగించుకంటె లోక, నింద్యమగు తప్పిదము రాజనీతియందుఁ
గత్తివిడిచినపగను సంగాతిఁబోలెఁ, జూడవలయు జేత చిరాకు వీడవలయు. 231

ఆ. అపజయమ్ము నంది యల్లాడువానికి, సేవచేయఁదగుఁ జుమీ విజేత
చేయఁడేని మరలఁ జెల రేఁగుఁ దార్తీయ, సంగరంబు జగము సంచలింప. 232

క. మూఁడవ ప్రపంచయుద్ధము, మూడనిచో నగ్రరాజ్యములవారిమదిన్
గూడిన చీఁకటితుట్టెలు, వీడవుకాఁబోలు నకట! విధితీ ర్పెదియో! 233

గీ. శాంతిసభకు నాకదలుట సముచితం బ, టంచుఁ బల్కెదు కాని యే నమెరికాకు
నాంగ్లభూమికి నెట్టిమే లాచరింతుఁ గత్తిగెల్పున సొగసెడిఖండములకు. 234

వ. ఆరెండు నేలలవారితీ రే నెఱుంగుదు - శాంతిసభకుం జన్నినాఁడు నన్ను వా రగ్గించి యాకాశమునకు నెత్తవచ్చు - అంతమాత్ర నొఱగున దేమి-ఏ న(గరాజ్యముల వారి కవగతమగుబాసలో నాశాంతి పారములు కఱపఁజాల - నాపల్కు భారతీయులకే యర్థమగు - కాన నాదేశముగుండ నితర ప్రపంచమువారితో ముచ్చటింపఁ జూతు - ఇదియ మేలిపని" 235

ఆ. ఒజ్జ యిట్లుపల్క నొకవేళ మీరు త, త్సభకుఁ జనిన నేమిచాట వలతు రనె విలేఖకుండు రణ మొప్పదని కాక,' యన్య మెది వచింతు ననియె గాంధి; 236

## సిమ్లా రాజకీయ గోష్ఠి

వ. అయ్యది యట్లుండె-రాజప్రతినిధి వేవె లానాఁడు భారతభూమింగల రాజకీయ ప్రతిష్టంభము సడలినంగాని జపానువారి నోడించుట సులభము గాదని చర్చిల్ ప్రభుత్వమునకు మాటిమాటికిం దెలుపసాగె - ఇంతలో(1945 మే) యూరపున సమరము సమాప్తమాయె - ఇంగ్లాండునం గ్రొత్తయెన్నికలు (1945 జులై 5) రానుండె - అట్టితఱి నన్ని పక్షములవారును భారతదేశ స్వాతంత్ర్యముపట్లఁ గొంతయాసక్తి వెలువరింపం దొడఁగిరి - రాచఱికమువా రీధోరణి గుర్తించి భారతోర్వి పరిపాలనవిధానమునఁ గొంతమార్పు గావింప నిర్ణయించిరి - దానిం బట్టి హిందూమహమ్మదీయ సభ్యులు సమాననిష్పత్తిలో నుండునట్లు జాతీయ ప్రభుత్వ మేర్పడవలయు - ఈ సభ్యులకు నిరుతెగల రాజకీయ నాయకుల మైకోలు దక్కవలయు - కానఁ గారాగారములనున్న కాంగ్రెసు కార్యవర్గమువారి నందఱనపుడు (15-6-45) రాజప్రతినిధి విడిపించె - తనయాజమాన్యమున (25-6-45 నుండి) సిమ్లాలోఁ బ్రవర్తించురాజకీయగోష్ఠికి రాఁ గోరుచు నిరువదియొక్కండ్రు పెద్దల నాహ్వానించె-ఆకారితులలో నాయారాష్ట్రముల ముఖ్యమంత్రులు, కేంద్రశాసనసభలయందలి భిన్న భిన్న పక్షనాయకులు, వెనుకఁబడిన కులములవారి ప్రతినిధి, సిక్కులప్రతిభువు, జిన్నా, గాంధియుం గలరు - కాని భారత జాతీయ మహాసభాధ్యక్షుఁడు లేఁడు - మహాత్ముఁ డీలేమికి నచ్చెరువంది రాజ ప్రతినిధి కిట్లు తంత్రీవార్త నంపె. 237

మం. మాన్యమహాశయా! మహికిసంతుష్టి, గూర్పనెంచిన నీదుగొప్పతనమ్ము
నగ్గింతుఁ గాని సభాహూతులైన, గఱువలందు నజాదు కన్పింపఁదేమి?
యతఁడు కాంగ్రెసునకు నధ్యక్షుఁ; డతఁడ, చాలువాఁ డమ్మహాసభహృదిం జాట
నాధికారికసమజ్యకదయ్యా! నీవు, నేఁడు సాగింపఁబూనిన పరిషత్తు
తత్సభం గాంగ్రెసుతలఁ పెత్తిఁగింపఁ, గలచన వతనికే కల; దమ్మనీషి
కాహ్వానమును బంపు టక్కఱ యనెద, నేను గాంగ్రెసువాణి నెత్తిఁగింపఁదగిన
ప్రతినిధి నని యీవు భావించియుండు, వన్న! యీనాఁడు నా కమ్మహాసభను

సాధారణంబగు సభ్యత్వమైన, లేదు కావున మిత్రులీల నీ కేను
వైయక్తికమ్ముగా వ్రాకుత్తు హితము, మఱియుఁ గాంగ్రెసు సర్వమతములవారి
సభ గాని హిందూప్రజాసభ గాదు, మఱవకు మీమాట మఱవకుమయ్య! 238

వ. వేవె లీతిఁగవక్కాణముం గనినంతన మౌలానా కాహ్వానము నంపి 'నీయుపదేశమును బెద్దయుం బాటింతు - నీరాక కెదురుచూతు'నని మహాత్మునకుం దెలిపె - పదంపడి కాంగ్రెసుకార్యవర్గమువారు బొంబాయి గూడి సిమ్లాసభను బాల్గొనుట కియ్యచేయుదు నేలుబడివా రీనాయకులకుఁ బ్రత్యేక ధూమశకటములు, విమానములు సిద్ధపఱిచి తక్కుంగల సర్వసౌకర్యము లాదరానురాగముల సమకూర్పఁ దొడంగిరి - నేఁటి జర్మనీ - భారతదేశముల పరిస్థితులం గని బుద్ధిమంతులు హింసాహింసల కీడుమేళ్ళు గుర్తించిరి - ప్రజలు గుంపులు గుంపులుగావచ్చి కాంగ్రెసు పెద్దల కాయాఘట్టముల స్వాగత సత్కారములు కావించి తనిసిరి - అహింస కపూర్వమగు విజయము లభించె. 239

మం. తనకోరు మూఁడవతరగతిపెట్టె, గూర్చుండి కదలెను గురుఁడు సిమ్లాకు
నమెరికాపౌరుఁ డయ్యదన మహాత్ముఁ, దెక్కినపెట్టియ నీఁగె నొక్కరుఁడు
నిజసుకృతమ్ము పండినయట్లు తలఁచి, పరిచితి కల్గినపదపడి గాంధి
కాతఁ డిట్లనె మహాత్మా! మీకు నిద్ర, పట్టినట్లే కనంబడదాయె - నెండ
హేతువు కావచ్చు నీదురవస్థ, కిమ్మోయి నలఁగుచు నీపయనంబు
సాగించి మీ రెట్లు సభను బాల్గొంద్రు, చల్లఁదనమ్ము పంచారించుపెట్టె
కలదుకదా! కొంతకాల మద్దానఁ, బవళింపుఁ దని మిమ్ముఁ బ్రార్థింతు ననినఁ
బ్రకృతిదత్తంబైన పరితాప మిద్ది, నను సైఁపనీవె యన్నా! దీనితాఁకు;
నిది నిత్యమై నిల్చునే కొంతతడవు, కారించి యీవేఁడి కడచన్న వెనుక
వచ్చుఁ జల్లనిగాలి; వాడినమేని, కున్మేషమును గూర్చు నుల్లమున్ దేర్చు
నస్మన్మహీసహ జావస్థలైన, వెట్టచల్వలతోడ వియ్య మీపాటి
కలుగనీవే నాకుఁ గస్తి యించుకయు, లే దిపు డని మందలించెను గాంధి. 240

వ. ఇ ట్లెండవానలఁ బాటింపక భారతభాగ్యవిధాత సిమ్లాచేరి రాజకుమారియమృతకౌరు నెలవున విడిసి స్నానపానములైనంతన వైస్రాయింగని సముచితసంభాషణ మొనర్ప నమ్మేటి సంతరించి సభాచర్చలయం దీవు పాల్గొనుట లెస్స-నాతలఁపుం బాటింపవే! యని వేఁడ మహాత్ముఁ డన్నా! యేపక్షమునకుం బూఁటకాఁపను గాని యేను గోష్ఠి కెట్లువత్తు?- ఐనను సమావేశం బిది ముగియుదనుక నివ్వీటి యంద యుండి నాబుద్ధికిం దోఁచిన కార్యపద్ధతులు నీకు సూచింతు - దీనం దనిసనుమని సగౌరవంబుగాఁ బల్కె - అంతట 241

ఆ. సాగె రాజకీయసభ వీనుమిగిలిన, వర్గములను దిద్దువారితోడ(25-6)
రీతిదప్పి కాంగిరెసు హిందువులమురా, నాఁ దొడంగె లీగునాయకుండు. 242

గీ. ఖానుసాహేబు మున్నగుగఱువ లేము, ముస్లిములమయ్యుఁగాంగ్రెసు మోపుఁబూని
వచ్చితిమికదా! తావకవాద మెంత, నాయ మని పల్కి రపుడు జిన్నా నెదిర్చి. 243

గీ. కాంగిరెసు హైందవసదస్సు కామి నిక్క, మనియె వేవెలు విజ్ఞు లాహా యనంగ
నెవ్వ రెవ్విధిఁ బల్కిననేమి లోభ, విద్ధమతి మొక్కలమ్మును విడువఁగలఁడె? 244

వ. మహాత్ముఁ డానాఁ డాగామిజాతీయ ప్రభుత్వమున మహమ్మదీయుల కెన్నిగద్దెలేర్పడు నన్ని హిందువులకుసైత మేర్పడవలయునని కాంగ్రెసు పట్టుపట్టరాదనియు నెహ్రూవంటి సవర్ణ హిందువుల కొందు రెండుపీఁటలిచ్చి తక్కినవానిని జాతీయదృష్టి గల హరిజనులు, హిందూక్రైస్తవులు, పార్సీలు, సిక్కు, లాంగ్లేయులు మున్నగు వారికి, నారీమణులకు నొసంగుట లెస్సయనియు నిట్లుకావించిననాఁడు జిన్నా మ్రోఁగించు 'హిందూరాజ్య' మనుమ్రోఁతశ్రోతల కెల్లిద మగుననియు సూచించె - అల్పసంఖ్యాకవర్గములవారి ప్రాతినిధ్యము హెచ్చునేని వారందఱు కాంగ్రెసున కందయగుదు రని జిన్నా వెఱచి బాపూసూచనకు నడ్డుదగిలె-ఇతఁ డింతకుమున్ను తనలీ గల్ప సంఖ్యాకులపాలి కల్పవృక్ష మని పెక్కువిడుతలు చాటి తరుణము వచ్చుసరి కిట్లు మొండిచేయి బయటఁబెట్టె - తుట్టతుద కాగోష్ఠిలో హిందూ మహమ్మదీయుల సమానప్రతిభూత్వమ యంగీకృత మాయె-కాంగ్రెసువా రపుడు మహమ్మదీయస్థానము లేనింట రెండు లీగునకుఁ జెందని ముస్లిముల కీవలయునని జిన్నాను గోరిరి - జిన్న 'ససేమిరా' యనియె - రాజప్రతినిధి యితనితీరుం దెగడియుఁ దనయధికారముం బఱపి సమస్యం బరిష్కరింపకయ సమావేశమునకు స్వస్తిచెప్పి(14-7-45) 245

క. కొందంతయాసతోఁ జలి, కొండను సంధించినాఁద గోష్ఠిని, జిక్కుల్
ఖండితములుగా కకటా!, పందద సభ; దీని కేనె బాధ్యుఁద ననియెన్. 246

వ. మహాత్ముఁ దపు దమ్మేటి కొక లేఖ వ్రాయుచు 247

మం. అంతసంతుష్టితో నారబ్ధమైన, గోష్ఠి యాఱడివోయి కూర్చె నుమ్మలిక
నిట దోసమెల్ల నాదే యందు వీవు, నమ్మదు దేశ మన్నా! నీదుపల్కు
దూఱదు వేవెలూ! దోషిఁగా నిన్ను, నిన్నాళ్ళనుండి పెంపేదఁగా దమకు
లోపడి చెఱసాలలో నున్నవారి, కధికార మొసఁగుట కాంగ్లప్రభుత్వ
నేత లీకొనలేమి నేఁటిసదస్సు, భగ్నమయ్యె నటంచు భారత మెంచు
నిది సత్య మిది దాఁప కెటిఁగింతు ననియె. 248

గీ. అన్నలార! నిర్మాణకార్యక్రమంబు, మనకుఁ గలదుకదా! మంచుమలసదస్సు
రిత్తవోయిన దని విచారింపనేల, పూనుఁ దుత్సాహ మని నిజాప్తులను దేర్చె. 249

## సవర్ణవివాహమున హరిజనపురోహితుఁడు

క. తెండుల్కరు బహువిద్యా, పండితుఁడు మహాత్ముఁ దేగుబాటం జను ధ
న్యుం డిందుమతిని విదుషిని, బెండిలియాడంగ నపుడు ప్రియపడి నతుఁడై 250

ఆ. ఈవు జరుపవలయు మావివాహం బని, యాశ్రయించె గాంధి నఘవిదూరు
గురుఁడు తనిసి తెల్గుహరిజనుఁ బనిచెఁ బు, రోధగాఁ బ్రభాకరుని సమర్థు. 251

గీ. ప్రభుకులమ్మునవారు దంపతులు గాఁగ, యాజ్ఞికతఁ బూనె నయ్యరే! హరిజనుండు
బ్రాహ్మణాధ్వర్యవము పటాపంచలయ్యె, బాపుజీవిప్లవమ్ము సంభావ్య మయ్యె. 252

క. హరిజనుల కింతకంటెను, గరువం బిం కేమికలదు? గాంధివినా యె
వ్వరు తెచ్చిరి సాంఘికసం, స్కరణం బీదృశము కలియుగంపుఁజరిత్రన్? 253

గీ. పరిణయం బిది జాతీయభాషయంద, నడిచి సంస్కృతపుంబస నడఁచివైచె
దేశభాషలపెంపు నర్థించువారు, మెత్తు రీతీరు యోచనాయత్తు లగుచు. 254

ఆ. ఏల సంస్కృతము 'త దేవ లగ్న' మ్మని, 'అదియె మంచితరుణ' మనుట యెగ్గె?
వెఱ్ఱి ముదిరిముదిరి విప్రులు నెత్తికిఁ, దెచ్చినారు కుతిక నొచ్చుబరువు. 255

గీ. జ్ఞానవిజ్ఞానముల నేర్పు మాననీయ, రచన లెన్నేనిగలవు గీర్వాణవాణి
నభ్యసింపఁగవచ్చు నయ్యయిమెఱుంగు, లాసపడువార లభ్యాస నలసియలసి. 256

వ. అయ్యదియ ట్లుండె - వధూవరు లానాఁడు పురోధసునియిచ్ఛ ననుసరించి. 257

మం."ఈనాఁటి మే మిరువుర మొక్క బాటలోఁ బయనించి బ్రతుకనెంచితిమి
మౌనము పస్తు గోమాతృపూజనము, శౌచార్జనము రుగ్ణసంసేవనమ్ము
తంతునిర్మితి శ్రమదానం బనంగఁ, జను సప్తయజ్ఞముల్ జరిపితి మర్థి
నాపస్సుమర్చయు నాచరించితిమి, భౌతికానందముల్ పదయుటకొఱకుఁ
గాదు పెండిలియని గట్టిగాఁ దలఁతు, మే మాలుమగలమై యిట నార్తసేవ
కీవికి ఫలసంగ మించుకలేని, చేఁతకుఁ బ్రియపడి జీవింప వలతు,
మొండొరులకు సాయ మొనరించుకొనుచు, సేవామయంబగు జీవిక నుందు
మెదతోద నుడితోడఁ గృత్యమ్ముతోద, నిద్దఱ కిద్దఱ మెపుడు తోడౌదు
మస్మన్మహీసేవ కగ్రాసనమ్ము, కామసౌఖ్యమునకుఁ గడపీఁట నిడెద
మస్పృశ్యతను మెచ్చ కందఱతోడఁ, గలసి సాపడి వర్ణగణనమ్ము లేని
పెండ్లి చుట్టఱికముల్ పెద్దచేసెదము, మగువయు మగఁడు సమానగౌరవము
కలవార లని నమ్మఁగలము సంతతము, సేవ్య సేవకదృష్టి చెద నన్నుఁజెలుల
కైవడి సాగింపఁగలము జీవితము, సప్తపదీతంత్రసరణికిం బ్రతిగఁ
జాలును సప్తయజ్ఞము లని యెంతు", మని బాసలొనరింప నలరె సదస్సు

వికసించెఁ గస్తూరిబిభుని నెమ్మొగము, మహనీయుఁ దతఁడు దంపతుల నిద్దఱను
జేనూలిదండఁ గై సేసి యీ వెలఁది, పోఁగుతో మీకు మేల్‌పొత్తు గూర్చితిని
జంపతులార! యీసరమును బ్రాణ, కల్పమ్ముగా రక్షకావించుకొనుఁడి
యిది త్రెంపరానిబొం దిది శౌచచిహ్న, మిది ధార్మికపతాక యిది సుఖాలంబ
మీ రొనర్చినబాసలెల్లఁ బాటించు, బలిమి రా నీశ్వరుఁ బ్రార్థింపుఁ డెదఁద
మఱవకుఁ డీభవ్య మహితయజ్ఞమ్ము, తొలఁగకుఁడీ! జగత్తు నుతించు తెరువు
నని క్రొత్తజంటపై నక్షతల్ గురిసె, జయజయధ్వని సమజ్యను వెల్లివిరిసె. **258**

## మహాత్ముని ప్రకృతి వైద్యసేవ

క. ఈపెండ్లి ముగిసినంతన, బాపూ తలపోసె వల్లభాయిని మివులన్
రాపాదు నంత్రగతరో, గాపత్తి నణంచుటెట్లు లని పలువగలన్. **259**

గీ. ప్రకృతివైద్యమె వల్లభునకు ననామ, యమ్ము నీఁజాలు నంచు మహాత్ముఁ డెంచె
నేమి సోదర! నాచెంతనే వసించి, కనుము జలవైద్య మనుదు నొప్పెను బటేలు. **260**

వ. వెనువెంటన బాపూ బార్డోలిసర్దారుతోఁ గదలి పూనానగరము భిషజ్మణి దిన్షామెహతా
సాగించు ప్రకృతివైద్యశాలకుఁజేరి వల్లభునకు వలయుచికిత్స గావించు తఱి మెహతా
తన నిర్మింపఁదలఁచిన ప్రకృతివైద్యకళాపీఠమ్ముపాలిటి ధర్మకర్తృమండలి యం దొక
సభ్యుఁడుగా నుండ నొజ్జం గోర నాయయ్య వల్లె యనె - సర్దా రపుడు మహాత్ముం
గని **261**

గీ. నీకు దెబ్బదియాతేండ్లు నిండవచ్చె, నిట్టివయసున విశ్రాంతి నిచ్చు సేయుఁ
గాని జంజాటమొల్లఁదు మానవుందు, బాపుజీ! పేర్చుకొనె దేమి బరువు లీవు? **262**

ఆ. అనిన గాంధి యిట్లు వినిచె వైద్యం బిది, నమ్మినాఁడఁ బిన్న నాఁటినుండి
లాఁతిపనులు పెక్కు నాతల నుంట నీ, యిచ్చ తీఱదాయె నింతదనుక. **263**

ఆ. ఇచట నేఁటికబ్బె నీశ్వరుకరుణ నా, వాంఛ దీర్చుకొనెదువలను సఖుఁద!
యెదఁద లేనిచేఁత యిడుమనిడుం గాని, వలచిసేయుకర్జ మెలమి గూర్చు. **264**

వ. పదంపడి మహాత్ముఁ దాచికిత్సాశాలమేలు గోరి కట్టుపాట్లు పెక్కు లేర్పఱిచె - పేదలసేవ
కీ వైద్యనిలయ మనతికాలమునంద యాయిత్తపదు నని ప్రకటించె - నిరాడంబరముగా
నిర్మలముగా నిరస్త ధనవద్దరిద్రవ్యత్యయముగా మనప్రకృతి చికిత్సాలయము సాగ
వలయు ననియు నిం దెట్టిలోటు వాటిల్లినను నన్ను నేనుక్షమించు కొనఁజాలననియుఁ
గార్యకర్తల కెచ్చరికచేసె-వారు బాపూనియమములకు లోఁగియుంట కంగీకృతిం జూపిరి
- వారిసాయమున గాంధిమహాత్ముఁడు రోగార్తులకు నూడిగముగావించుచు **265**

ఆ. ప్రకృతివైద్యశాల పట్టణముననుంట, తగదు; లేమిఁజేసి నొగులుగుదుచు
పేద యెట్లువచ్చుఁ జేఁటకు?మితిలేని, వెచ్చ మెట్లుమోయు వీట నిల్చి? **266**

గీ. ప్రకృతివైద్యుఁడు రుగ్ణునిపజ్జకరుగు, టుచిత మగుఁగాని యాతనియొద్ద కార్తుఁ
దేగుదెంచుట తగదు; వె జ్జిది యెఱింగి, మెలఁగినప్పుదె ప్రజ కింత మేలు గూరు. **267**

గీ. పట్టణమ్మునఁ గలయాసుపత్రివైద్యుఁ, దణఁచు సూదులుగ్రుచ్చి పైకొనినతెగులు
ప్రకృతివైద్యుఁడు శుద్ధజీవనవిధాన, బోద్ధయై రోగి కారోగ్యపుష్టి గూర్చు. **268**

ఆ. ఇట్టిబ్రదుకుచంద మెఱిఁగింప నెఱుఁగంగఁ, దెగులుగొంటునెలవు తగును గాని
తగదు లాఁతిచోటు తగదని తలఁలించెఁ, బ్రకృతివైద్యశాల పల్లెదెసకు. **269**

వ. "ఉరిలీకాంచన" మనుపేర నాపల్లె పరఁగు-మూఁడువేలప్రజ లాకుప్పమునఁ గాఁపురింత్రు-చెచ్చెరంజను పొగబం ద్లచట నాఁగవు - పండ్లు కోకొల్లగాఁ జిక్కు - దాత లయ్యూర గాంధికి వలయునేలను రొక్కమును మనికిపట్టుల నొసంగిరి - జలవైద్య మారబ్ధమాయె - వ్యాధితులు రాఁదొడంగిరి - బాపూ వారి తెగులు తెఱఁగు పరికించి చికిత్సావిధానముల నిర్ణయించుచుండె - అందు రామనామము మొదటిది - తక్కినవి తొట్టిమునుక, యెండబుడుక, పుల్లనిచల్ల, పలుచనిపాలు, ఫలరసమున్నగునవి - మహాత్ముఁడొకనాఁ దపటువుల కిట్లునుడివె. **270**

క. మేనికి నెడఁదకు నేర్పడు, గ్లానుల కన్నిటికి నొకఁడె కారణముసుఁడీ!
వాని నణఁగించుమందుల, నాణెంబైనయది రామనామంబచుఁడీ! **271**

ఆ. ప్రకృతివైద్యమునకుఁ బ్రాణ మియ్యది దీని, మఱచి గెల్పువదయుమనిసి లేఁడ
యిదియు నొదవ దెల్లయెదల; దీనికినైనఁ, గలవు కొన్ని కూచికట్టుపాట్లు. **272**

ఆ. నాల్క నాఁగలేక నానావిధాన్నముల్, మేరనతకరించి మెక్కువాఁడు
తిండితప్పు నెఱిఁగి తెగులురామికి రాముఁ, దలఁచుగాక ముప్పు దాఁటలేఁడు. **273**

గీ. చిత్తశుద్ధి సమార్జింపఁ దత్తఱించు, మానిసికి రామనామంబు మందుగాని
తెగఁదిని తెగుళ్ళఁజిక్కి చింతిల్లుమాసి, కొపవస్తమె శస్తమౌ నౌషదంబు. **274**

గీ. పస్తుసాగింప సైరింపఁ బ్రార్థనమ్ము, తోడుపడుఁగాని తినరానికూడు దినుచుఁ
గూటి కిబ్బడిగా మందు గుడుచునట్టి, నరుని గావదయా రామనామజపము. **275**

గీ. రోగిదుర్వ్యసనాసక్తి నాఁగలేక, యురక మందులుమేపువె జ్జుభయులకును
జేటు గదియించు గౌరవశ్రీఁ దొలంచు, మోయరానిబ్రేఁగ్గై సంఘమునుగలంచు. **276**

ఆ. రామనామ మిట్టిరట్టుసేయక రుజ, నోహటిల్లఁ జేయు నుల్లమునకు
వెలఁదితనము గూర్చు వికృతులఁ దూల్చి యా, శ్రితుని దేర్చు నుచ్చగతికిఁజేర్చు. **277**

గీ. రామనామానువిద్ధమౌ ప్రకృతివైద్య, మెతఁడుపాటించు నతఁడు నూఱేండ్ల కాదు
నూటయిరువదియేఁడు లేనొవ్విలేని, బ్రదుకు సాగింపఁగలఁ డని పలుకనేర్తు. 278

వ. యజ్ఞదీక్షానిరతుం జెనక యముఁడేని వెనుదీయు - తనకు దగ్గఱించిన పితృపతిం
గనిమున్నొకదీక్షితుం డిట్లనియె. 279

క. ఏమోయి ధర్మరాజా! యీమాత్రయు నీవెఱుంగవే! మఖవిధియం
దే మున్గియుంటినిగదా! యేమెయి నీవెంటవత్తు నిపు డజ్ఞగతిన్. 280

ఆ. పొమ్ము! పొమ్ము! నీదుపొత్తున మనునిచ్చ, లేదు తీఱుపాటులేదు నాకు
నన్నుఁగదియఁబోకు నాకడ్డురాఁబోకు, మందమతి నవజ్ఞ సెందఁబోకు. 281

ఆ. అనుదు వెల్లఁబాఱి యముఁడు తా వచ్చిన, దారిపట్టె; సవనతంత్రమెల్ల
నిర్వహింప నూటయిర్వదియేండ్లు జీ, వించె యజ్వ యెట్టివెలితి లేక. 282

వ. ఈ కథ నుపనిషత్తునం జదివితి - దీనిమర్మముం గనుట మనకర్తవ్యము. 283

ఆ. ఫలమువలపు లేక పనులొనర్చుచు నూట, యిరువదైదుశరద లిలను నిల్చి
చనవుగలదు మానవుల కందఱకు; బ్రదు, కింత యాసచేఁత యెగ్గు కాదు. 284

ఆ. నరునిమేను తోడినరునకు మేల్గూర్చు, పనికి సృష్టిసేయఁబడియెఁ గాని
మంచి చెడ్డ జోలి మఱచి దుర్వ్యసనాళి, కగ్గపడనుగాద! యన్నలార! 285

మం. అనవుడుఁ "బ్రారబ్ధ మది దాఁటరాని, యెల్లకదా! నూటయిరువదై దేఁడు
లే నుందుననుచు నీ వెట్లాడనేర్తు, వోయయ్య!" యని రోగి యొకఁడు ప్రశ్నింప
"నెట్టిప్రారబ్ధము నేని మానవుడు, చక్కాడఁగలఁడు నిస్సంగశస్త్రమున
సేవకు, నిజధర్మసేవ కసంగ, హేతి నార్జించి నూటిరువదై దేండ్లు
మహి నిల్వఁగా సర్వమనుజు లాసింపఁ, దగు ననె మోహనదాసపండితుఁడు. 286

వ. వెండియు మహాత్ముఁ డపుడపుడు తన్నాశ్రయించి యున్నరోగుల కీచికిత్సంగూర్చి
కావించిన యుపదేశము లమూల్యములు-ఒకనాఁ డొజ్జ "శరీరము పంచభూత నిర్మితము
కాన దీని చికిత్స పంచభూతములతోడన జరుగవలయు - రోగి కాతపస్నానములు
మట్టిపట్టీలు నిర్ణయించుట కిదియె కారణము-పృధివ్యాదిభూతము లత్యల్పరూపమునం
దపారశక్తి సంపన్నములు - అవి సజీవములు - అం దాకాశ భూత మత్యద్భుతము
- బ్రహ్మరహస్యము గన్నవాఁడ దీనికీ లెఱుంగనోపు - దీని తోడిపొత్తు హెచ్చినకొలఁది
మనకు సుఖశాంతులు వశంపడు - నింగికిని మనకును నడుమ నడ్డుగోడ లుండరాదు-
అనంతమగు నీవిహాయసము బ్రహ్మ మనంజను - ఇది మనకెంతసన్నిహితమో యంత
దవీయము - దీనం గలియుటే ముక్తి - ఈ చేరిక నద్దగించుమేనిం ద్రోసిరా జనవలయు"
- నావుడుం దెగులుగొంట్లు తనిసి మహాత్మా! మానిసితిండి తెఱఁగు వివరింపవే
యనుటయు నాచార్యుం డిట్లనియె. 287

గీ. కాయగూరలతిండి యుక్తమ్ముగాని, యనుచితము మానవున కామిషాశనమ్ము
శాకములఁదిన్న నైతికశక్తి వొదము, భౌతికబలం బొదవు మాంసభక్షణమున. 288

గీ. ఆత్మ వికసించుతిండి యోగ్యమ్ముగాని, కండ లెదిగెడి రక్కెసతిండి యేల
యవని యొసఁగుఫలాదుల నారగించి, మనుట కే సృష్టఁ డైనాఁడు మానవుండు. 289

ఆ. ఎఱచి మెక్కువారియెడ శాకభోక్తలు, సానుభూతి చాటఁజనును గాని
యేవచూపు టొప్ప దెంతయు నణఁకువ, మెఱసి దిద్దవలయుఁ బెఱలతీరు. 290

గీ. ప్రకృతిధర్మవిరుద్ధమౌ బ్రదుకు వీడి, నపుడ నరునకు నారోగ్య మావహిల్లు
మానసికము శారీరక మైనసుఖమ, నిక్కమగు ననామయ మని వక్కణింతు. 291

గీ. ఆత్మసంయమ మేనరుఁ దభ్యసింపఁ, దతఁడు పశుతుల్యుఁ డనెద; లోభానుజీవి
కెంతసంపద కూడిన నేమి వాఁడు, హేయదారిద్ర్యభారమ్ము మోయుశరుఁడె. 292

వ. ప్రకృతిజీవనరహస్యముల ని ట్లామయగ్రస్తుల కెఱుకసేయుచు నురిలీకాంచనమున బాపూ కాఁపురించుచుండె-ఇంతకుము న్నాంగ్లదేశమునం బ్రవర్తిల్లిన (5-7-45) యెన్నికలలోఁ గార్మిక పక్షమువారు గెల్చిరి-వెనువెంటన (15-8) జపానుసమరం బణఁగె- మిత్ర మండలివార యీ యుద్ధమున విజయమునందిరి - నేఁ డిగ్గందునం దధికారము చేపట్టిన కర్మకరపక్షమువారు తడవులంబట్టి భారతదేశ స్వాతంత్ర్యము నభిలషించువారు - కాన వీ రీ నేలంగల రాజనైతిక ప్రతిష్టంభము నుచితరీతిం దొలఁగింతు మని (21-8-45) ప్రకటించి రాజప్రతినిధిం దమభూమికి రావించుకొని యతనితో నయ్యాయి చర్చలు కావించిరి - మరలివచ్చినవేవె లనతి కాలమునంద కేంద్ర, రాష్ట్రశాసనసభల యెన్నికలు జరుగుననియు రాష్ట్రములలో మరల మంత్రులధికారము వహింతురనియు నూతనరాజ్యాంగశాసనము నాపాదింపం బరిషత్తేర్పడుననియుఁ గేంద్రమునఁ దాత్కాలిక జాతీయప్రభుత్వ మవతరించు ననియు(19-9-45) నట్లీప్రభుత్వమువారి యుద్దేశముల తెఱఁ గెఱింగించె - రాష్ట్రములన్నియు నెన్నికలకలనికి సమాయత్తమగుచుండె - ఇట్టితఱి మూన్నెలలనుండి ప్రకృతివైద్యపరాయణుఁడై పూనాచెంతనున్న మహాత్ముఁ డారోగ్యపుష్టితో స్వస్థానమగు సేవాగ్రామమునకు వచ్చి యనుచరులమేలుగీ ళ్ళరసి 293

## క్షామపీడంబడిన వంగదేశమున బాపూ పర్యటనము

ఆ. కఱవుకతన లీగుపరిపాలనమ్మున, వగలసెగలఁ గుందు వంగమహికిఁ
గదలెమోహనుండు కారుణ్యఖనియైన, మనముతోడనాప్తజనముతోడ. (30-11) 294

గీ. అతనిపొగబండి యెచ్చట నాఁగు నచట, నుగ్గడించుచు జనతాపయోధి పొంగె
భక్తిమై సమర్పించిరి ప్రజలు హరిజ, నాభ్యుదయకృత్ క్రియాళి కుపాయనములు. 295

క. ఒకవెండితట్ట నేలము, నకుఁబెట్టుదు నైదువేల్ ధనంబు లభించెన్
ప్రకటత్యాగపరాయణ, యొకతుక తనతొడవులెల్ల నొజ్జకు నొసఁగెన్. 296

వ. మఱియు నమ్మగువ మహాత్మునకు నంజలించి తండ్రీ! నాకు భక్తివిశ్వాసములఁ బ్రసాదింపవే! యనివేఁడ నమ్మా! వేల్పొకండ యట్టిపని కావింపనోపు నని బాపూ విన్నవించె - అయయ్య కాళీఘట్టమునుజేరి సోదేపురాశ్రమమున విడిసి రాష్ట్రపాలకుని (గవర్నరును) జూడం జనియె - నేఁడు వంగదేశమునఁ బ్రజాప్రభుత్వములేదు - నాజిముద్దీన్ మంత్రివర్గము పతితము - ముస్లింలీగు దెబ్బతిన్నది - కావున నధికారమంతయు రాష్ట్రపాలకుని కగ్గపడియె - ఇతనిపేరు కేసీ - మహాత్మునకు నితనికి సంభాషణములు సాగె - బాపూగఋవతనంబు నితఁడాకళించి రాజనీతివేత్తగా ఋషిగా నుద్దిలేని పెద్ద యని మహాత్ముం గొనియాడి 297

క. దొరతనముపట్లఁ గాంగ్రెసు, పరుసనిమాటలు వెలార్చు బాపూ! తగ దీ
తెఱఁ గని భావించెద నీ, వెఱుఁగనిధర్మంబు లుండునే యని పల్కన్ - 298

గీ. కాంగ్రెసీనాఁడు తనహక్కుగాస్వరాజ్య, మందుకొనుఁగాని యీవిగానందుకొనదు
హక్కుగలవాఁడు యాచకునట్లు నుడువు, టెట్లుపొసఁగును దేవురిం పితని కేల? 299

వ. అని మహాత్ముఁడు మోమోటలేనిసరణిం బ్రత్యుత్తరమొసంగె - దేశప్రభు వపుడు 300

క. ఈనేలకున్ స్వతంత్రత, యీనెంచెను గార్మపక్ష; మెపుడో కా దీ
యానంద మనతికాలము, లోనన యిట నొదవు నింతలో దురు సేలా? 301

ఆ. అనుడు మంచిమాట యంటివిగాని నీ, నుడువు తెఱఁగు బయలుపడ దొకింత
యెంతకాల మోర్చి యెండమావులవెంటఁ, బఱచుఁ బ్రాణి యనుచుఁబలికె నొజ్జ.302

వ. ఈపర్యటనమున మహాత్ముఁ డొకనాఁడు రాంపూర్ నాఁ జనుపట్టణమునకుం జనుదు నచట నొకపరమాద్భుతఘటన జరిగె - దాని నపుడ (24-12-45) వర్ణించి 'పాదధూళి' యనుపేరఁ బ్రకటించితి - కాని నేఁ డారచన నిందుఁ జేర్చి ధన్యతా సమగ్ర నొనర్తు.303

## మహాత్ముని పాదధూళి తెమ్ము

గీ. అది దురాశాపిశాచీసమర్చనప్ర, భూత వనబృహద్భాను హేతివదన
హుతదయాధర్ములకు నరాకృతినివిష్ట, దుష్టరక్షస్సులకు జగద్ధూమకేతు
వులకుఁ గేతువులకు వణిక్కులకు నిలయ, మది నిరంకుశక్షామ దురంతదుర్భ
రాగ్రహావేశ వికటాట్టహాస జవన, గమనవిన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన, రాశి బలివోయినట్టి నిర్భాగ్యదేశ
మది మహాభూత వేతాళ మదవతీప, రంపరా రూక్షఖడ్గ నిర్యత్ ప్రభాస

ముజ్జ్వలద్దంష్ట్రమై మృత్యు వుగ్ర దీర్ఘ జిహ్వా లార్చుచు వాహ్యాళిచేసినట్టి
రంగ మది మదిఁ గరఁగించు వంగభూమి -
సత్యకంకటధరుఁ డహింసాతపస్వి, శాంతిరణవీరమండలీ చక్రవర్తి
మోహనుఁడు విశ్వకల్యాణమూలమూర్తి, జాలికిన్ నెలవైన యానేలఁ జూడఁ
గదలె భగవానుఁ డా ర్తరక్షాచికీర్ష -
గుండెలో నగ్నిగోళముల్ మండిప్రేల, నూర్పులో మూఁడులోకమ్ములూఁగియాడఁ
జూపులో నెయ్యతియ్యాలసోన లురలఁ, బలుకులో నవజీవసంపదలు పండఁ
బల్లియలు పట్టణంబు లాప్రభువు సూచె -
తతిసె ఋషిరాజు రాంపురద్వారవేది, బలసె నా బాలవృద్ధప్రపంచ మతని
నెరసె నాశాద్యుతుల్ ప్రజానేత్రవీథి, మొరసె జయజయధ్వని దిశామూల మదరఁ
గురిసె యోగీంద్రుశిరముపైఁ గుసుమవృష్టి -
పౌరు లేతన్మహోజాత పారవశ్య, మగ్నులై యున్న వేళ డింభకుఁ డొకండు
పరుగుపై వచ్చి తత్సభాప్రాంగణమ్ము, దాసి జర్జరితమ్ము కూర్పాస మూడ్చి
మూటకట్టఁదొడంగె నచ్చోటిదుమ్ము -

(అదిచూచి యొకఁడు)

ఏమిరా వెఱ్ఱిపాపఁడా! యీప్రజాస, ముద్ర మిటు పొంగి మిన్నులుముట్టుచుండ
దృష్టిసారింపవైతి వాదిశకు నీవు, సాగి దర్శింప వాకర్మయోగిచంద్రు
నేల ముడిచెద వీపాంసుజాల మెత్తి-

(కుఱ్ఱవాఁడు)

అయ్యగారూ! నమోవాక; మమ్మహాత్ముఁ, గంటి నేనఃపిశాచికం గదలు మంటి
హరిజనత్రాత నాస్వామియడుగు సోఁకి, పరమపావిత్ర్యలక్ష్మీ విభాసియైన
యీరజోరాశి జననికై యెత్తుచుంటి —

అమ్మ న న్నీ సదస్సున కనుచువేళ, దివ్యపూరుష చరణమైత్రిని గడించి
పతితపావన పాదసంపర్క మంది, సుకృతసురభిళమైన పాంసువును దెచ్చి
దుఃఖనిస్తారకంబైన ధూళి దెచ్చి, యస్మదీయము పరితాప మార్పుమనియె
మామకీనము దుర్దశ మాన్పుమనియె —
ము న్నొకమహాత్ము నడుగుదుమ్మునకు నోఁచి, కఠినశిల పూవుఁబోఁడియైకదలెనంట
ఘోరజానుషబంధముల్ కోసెనంట, బాబయా! యిమ్మహాత్ముని పదమునంటు
దుమ్ముచే గెల్వలేమె? మా దుర్విపత్తి —
దీనబాంధవురూపమ్ము దెల్పు మంచు, వేషభాషావిశిష్టతల్ వినుపుమంచుఁ
జేష్టితమ్ములు వర్ణించి చెప్పు మంచుఁ, దల్లి ననుఁబంప జన్మసార్థకత యొదవె
సాక్షిగా వచ్చెఁ గనుము బాష్పస్రవంతి —
నాసవిత్రి నాసోదరి నగ్నలగుచు, గుడిసె నున్నారు జేనెఁడుగుడ్డ లేక

కుములుచున్నారు బ్రతుకుబ్రేంగునకు నోడి, యడలుచున్నారు ప్రత్యక్షమైన వేల్పు
దెసకుఁ గనువిప్పలేని దుస్థితికి లోఁగి —
జనకుఁ డెందుండె నందువా జరరకోశ, మెరియుచున్నది నీకు నుత్తరమొసంగ
నంబలియు లేక రోగాల నడ్డలేక, యాలుబిడ్డలకన్నీటి నార్పలేక
స్రుక్కి మము దిక్కులేని పక్షులను జేసి, యతఁడు దుర్భిక్షవహ్నికాహుతిగ మాఱి
పోయె నసిపత్రశిక్షావిధేయ హేయ, విత్తదాసుల కొకనవ్వు విసరి, కొసరి
పిలుచు నమరేంద్రుగద్దెపైఁ గొలువుదీర....

(పృచ్ఛకుఁడు)

పతియలైబ్రీలె నాగుండె బాలకా! త్వ, దీయకథ లీదృశంబులా! దీనతాని
మగ్నులకు మీకు మిముఁవంటిమానవాళి, కిట్టిదుర్యోగ మింక లిప్తయేని నిల్వ
దిట్టిదుష్కాల మింక నెన్నఁడేని డాయ, దిది పరాధీనతాఫలం బిది నికృష్ట
దాస్యఫల మస్వతంత్రతా దారుణాంధ, తమసమును జీల్చ మాతృగణదమనజన్య
ధన్యత గడింప నేఁడు సోదర్యులెల్ల, నడుముగట్టిరి ప్రాణముల్ ముడుపుగట్టి
రడఁచి రాత్మీయకులమతాహంకరణము, విడిచి రీర్ష్యామషీమయ వీక్షణమ్ము
నలఁది రుప్పొంగి వీరగంధావలేప, మగ్గలించి రహింసా రణాంగణమున
నెత్తిరి త్రివర్ణశోభి తామృతపతాక, నొత్తి రొక్కుమ్మడిగ దేవదత్తకుహర
మంతిపుర ముజ్జగించి శౌర్యాచ్ఛ రేఖ, లింతు లెసరేఁగి వీరతాయెతులు గట్టి
కుసుమపూవన్నెవల్వముల్ కుస్తరించి, మాతృసేవాపరాయ ణామ్లానదీక్ష
శిక్షితాత్మలు ధీరలక్ష్మీసనాథ, లపరదుర్గలు రుద్రాంబ లగుచు నగుచుఁ
గలని కహమహమికతోడఁ గదలివచ్చి, రెవ్వ రీయోధ్ధమండలి నెదిరినిల్చు
ద్రఢిమ గలమగ, లెవ్వ రీతరుణభార, తస్రవంతీ నిరాఘాటధాటి కోర్చు
దమ్ముగల బంటు, లదిగో స్వతంత్రతార్క, మండలారుణరోచిస్సమాజ ముదయ
పర్వతప్రస్థభూమిఁ గ్రొంబసిఁడిజల్లు, చల్లుచున్ విజయోత్సవసమయసిద్ధి
సూచకము గాఁ బ్రసన్నతల్ పూచి దెసల, వెల్లివిడిచె హుటాహుటి నిల్లుసేరి
తల్లి కీమేలు పల్కి చూతప్రవాళ, తోరణము కట్టవోయి! మందారకుసుమ
హార మిది తాల్పవోయి! దీర్ఘాయురర్ధ, భారములు మోయవోయి! నవ్యస్వతంత్ర
భారతము నేలవోయి! బంగారుతండ్రి! 304

వ. అదియట్లుండె - కాంగ్రెసుకార్యవర్గమువా రాచార్యునుపదేశములం బదయ నానుకూల్యం బేర్పడుననుతలంపునఁ దమగోష్ఠి నపుడు వంగనగరమున సాగింప మహాత్ముఁ డా సమావేశమునఁ బాల్గొని కాంగ్రెసువారు నిర్మాణకార్యక్రమము పట్లఁ గడుంగడు మక్కువ మెఱసిసత్యాగ్రహపాటవము నధికాధికముగా నార్జింప వలయుననియు రానున్న యెన్ని కలయం దపమార్గమునం జనక యొకరువ్వయేని వెచ్చింపక నెగ్గవలయుననియు నదియ

నిక్కమగుగెల్పనియు బల్కె సభ్యు లుత్తేజితులైరి - పదంపడి బాపూ శాంతినికేతన తీర్థమును సందర్శింపఁ గదలె. 305

## రవికవిలేని శాంతినికేతనమును బాపూ పరామర్శించుట

చ. రవికవి యన్న నెంతయుఁ గరంగు నితండు; జరానుషక్తుఁడై
దివి కరుదెంచునాఁడు గురుదేవుఁడు "శాంతినికేతనంబు నీ
వవహితచిత్తవృత్తిఁ గనుమా! ధనలోపము లేనిపీఠమై
యవరితదీప్తి నందునటు లారయుమా!" యని కోరె నీతనిన్. 306

క. ఆయయ్య చన్నపిమ్మట, నాయాపోరాము లెగసి యద్దినకతన్
దాయఁడు శాంతినికేతన, మీయనఘుఁడు పాయఁ దెడఁద నేఁచెడికలఁతన్. 307

ఆ. ప్రొద్దుక్రుంకుసరికి బోల్పూరుకడఁబోగ, బండి దిగియె విశ్వబాంధవుండు
వినయమూర్తులైన విద్వాంసు లెందఱో, కూడి రచట నెదురుకోలు నడుప. 308

గీ. లేవు జేజేలు చప్పట్లు లేవు లేవు, సద్దులెవ్వియు నమ్మహాజనమునందు
నెందుఁజూచిన సంయమమే తనర్చు, నెందుఁగన్న ననుద్వేగమే తలిర్చు. 309

ఆ. మోవరానిదుఃఖమునకుఁ గారణమైన, చెట్ట మూఁడినంతఁజుట్ట లంద
యొక్క చోటఁ గలియునోజ గభీరంబు, నార్తమగుచు దృశ్య మది పొసంగె. 310

క. మునిచీఁకటివేళకుఁ బ్ర, న్ననితోఁటం దనరుప్రార్థనావేదికి వ
చ్చినగాంధి యచటిశాంతికిఁ, దనిసె నహో! పుణ్యభూమి దాసితి ననుచున్. 311

క. రవికవిపాటల నయ్యెడ, సవరనికంఠమున శిష్యసంఘము పాడన్
నవశక్తి వొడమె గోష్ఠికిఁ, గవిచంద్రులపల్కు లమృతకల్పములు గదా! 312

వ. ప్రార్థన ముగిసినవెనుక మహాత్ముం డిట్లు నుడివె. 313

గీ. తల్లిలెక్కమాటునఁ బుల్గుపిల్లవోలె, నీకళాపీఠ మెదిగె రవీంద్రునీడ
నేఁడు లేఁ డిట నేతన్మనీషిమౌళి, మనకు నిది పెద్దకొద యైనఁ జనదు వగపు. 314

క. ప్రతిమర్త్యుడు నొకదినమున, మృతినందుట తప్పు, దెల్ల రెఱిఁగిన దిది; పం
డితులార! గురునిపని పూ, రితిసేయుఁడు పూనుఁ డొజ్జఋణమును దీర్పన్. 315

వ. గురుదేవుఁడు ప్రబోధించినపాఠములలో శాంతియు విశ్వమానవసౌభ్రాత్రమును గణనీయములు-వీనిని బ్రపంచవ్యాప్తములఁ గావింపవలసిన బాధ్యత శాంతినికేతనాచార్యులయందగ్గలముగాఁ గలదు - భగవంతునియెడ సజీవమగు విశ్వాస మున్న నాఁడ యిట్టిపని సాగు - రవీంద్రునివంటిమహనీయు లీలోకమున మాటి మాటికిం బుట్టరు - నేఁ

డామహాపురుషుఁడు లేనిలోటు పూరింప నేయొక్కఁడుం జాలఁడు - మీరు మీలగ్గుకంటెము న్నీనికేతనము పెంపు పాటింపవలయు-దేశికుని యాశయముల కపుడే ప్రాతినిధ్యము వహింపఁగలరు - రవీంద్రుని గొప్పతన మనన్యసాధ్యము - దీనిం గనుటకు మీ రొకతపశ్చర్య సాగింపవలయు - సర్వమానవప్రేమము నభ్యసింపవలయు - మఱియు. 316

చ. ధనమునుగూర్చి మీరు పరితాపము నందకుఁ డాదరార్ద్రమౌ
పని యొనరించునాఁడు మనపాలికి విత్తము తాన వచ్చు నా
యనుభవ మర్వదేండ్ల దిటు లాదుటకుం గత మన్నలార! మీ
మనములఁ దేర్చుకొండు ఋజుమార్గమునం బయనింపుఁ డింపునన్. 317

వ. నైతికమూల్యములఁ బాటింపమింజేసి ప్రజాహిత నిర్మాణము లణఁగారుఁ గాని ధన లోపమునం గూల వని నమ్ముఁడు - మీవిద్యార్థులలో భక్తివిశ్వాసములు లేవని కుందకుఁడు - మీయం దున్ననాఁ డవి మీయం తేవాసులయందును గుదుర్కొను నని తలంతు. 318

## మహాత్ముని పా మేమిచేయును?

ఆ. గాంధి యిట్లు నుడివి కాళీపురమ్మునఁ, జొచ్చి తన్నుఁ జూడవచ్చినట్టి
కరిపురీంద్రుతోడఁ బరమరహస్యముల్, తడవి యాత్రమోర్వి నడుగుమోపి- 319

మం. ఊఱటనందుచు నొకనాఁడు తేనె, పండించు తోఁటలోపలఁ దారుచుండ
నమ్మహర్షికి నెదురైవచ్చెఁ బడగ, నాడించుకొనుచు దీర్ఘాహిరాజమ్ము
బాపుజీ! పెనుఁద్రాఁచు, బాపుజీ! తొలఁగు, మని సుశీలానయ్య రదలుచు నార్వఁ
దనదారి నది పోవుఁ దలఁకకు మనుచు, నవ్వె మోహనదాసు నదక మానకయ
ఫణి మహాత్ముని నిలంబడి చూచి చూచి, యే మనుకొన్నదో యీరమం దీఁగె
పులియైనఁ బామైన బుణ్యసౌరభము, వీ తెంచుదెసకు రా వెఱచుఁ గాఁబోలు
ప్రాణులన్నింటను బరమాత్మ యుంట, నిది చిన్మయం బౌట నిట నేల శంక. 320

## గాలివానంజెడినతావులు మహాత్ముఁడు పరికించుట

వ. అంత నాగష్టు విప్లవమునాఁ డధికారుల కసాయితనమునం బదరాని యిడుమలం బడుటయ కాక పెనుగాలివానతాఁకున నెంతయుంజెడిన మహిషదళపత్తనమునకు (26-12-45) నాచార్యుం దరిగె-మిధునపురమండలమునందలి దీప్రోలు-ఝుంఝూ విప్లవముతఱి నిచటివరిచేలం బశుమానవకంకాళములు నెలలతరబడినిల్చి పూతి గంధికటాహములై నానారోగజనకము లాయె-సత్యాగ్రహవిధాత యీకథ లాలించి కటకటంబడి ప్రార్థనసమావేశమునం దిట్లు నుడివె. 321

ఉ. పెక్కువిధాల మీ రనుభవించినబాధ లెఱింగి పెద్దయుం
జొక్కితిఁ జక్కటిన్ విడి ప్రభుత్వము రక్కసచేంత కొగ్గినన్
మిక్కిలితాల్మిఁ జూపితిరి మీ; రిది మెచ్చెదఁగాని కిన్కకుం
జిక్కివివేకమున్ విడిచి చేసితి రెగ్గులు కొన్ని యేనియున్. 322

గీ. కృత్స్నముగ నహింసాతత్త్వ మెఱుఁగ కిట్టి, తప్పులొనరించితిరి; మీరు దారిదప్పి
దొరతనము నెట్లు దూఱనేర్తురు? నలంగి, కాంచవలయు జయమ్ము నలంచికాదు. 323

ఆ. మనయహింసనము సమగ్రమ మైననాఁ, డేల మనకు జివ్వయేల నెవ్వ
యన్నలార! హింస యదురుగుండియవాని, తెలుఁగుచుండు దీని మఱవకుండు. 324

ఆ. మన మహింసతోడ మహికిఁ బారము నేర్ప, నవయు చుంటి మిన్ని నాళ్ళనుండి
మీరు నన్నుఁ దొడరనేరనిచో ముక్తి, లేదు గౌరవమ్మురాదు మనకు. 325

ఆ. ప్రజలచంద మేలుబడివారిపతికంటె, మంచిదైననాఁడు మనకు జయము;
కటువులైన నేమి పటుసత్యములు గాన, నొడువుచుంటి నిట్టినుడులు మీకు. 326

క. న న్ననుసరించువారిది, చిన్న నెపంబైనఁ దెల్లసేయక మానన్
బిన్నటితతినుండియు నా, తెన్నిట్టిది; సఖులతప్పు దిద్దితి దీనన్ 327

వ. పదంపడి (31-12-45) మహాత్ముడు 'కాంటాయి' నాఁ జనుపురమ్మున కరిగి యచటి ప్రజలమేలుగీ ళ్ళరసి ప్రార్థనాస్థలముం గదిసి యానేల యదుగునఁ బసరములయు మనుజులయు దట్టెము లొకవేయి మూయంబడియున్న వని తన ప్రసంగమునం దిట్లు పల్కె. 328

మం. ఇది కదునబ్బురం బిచట దున్నయును, నరుఁడును నొక్కగుంటకు రాక జరిగె
నాపద మూఁడునాఁ దన్ని జంతువులు, నేకంబగుట కంటి మీచేఁతకతన
నీకలయిక ప్రాణులెల్ల నొకండ, యనుమహాసత్యంబు నావిష్కరించె
గడ్డిపోఁచవు నీవు గర్వింప కనుచు, నమ్రత గఱపె మానవున కీ బెడఁద
యాకథం గలగుట్టు నెఱఁగిననాఁడు, శాంతిసంపన్నమై జగము రాణించు. 329

## 1946

వ. మహాత్ముఁ డీయాత్రం బ్రజలు కట్టుపాటులేక హింసాహింసలఁ బాటింపక మేర మీఱిన యావేశమునం దన్ను సందర్శింపవచ్చుటచూచి స్వరాజ్యము ప్రాప్తించి ననాఁ డీక్రమశిక్ష లేనిసమాజ మేమగునోయని వగచి యీయవగుణం బణఁగుట పొంటె బహిరంగ ప్రార్థనయు నందుఁ దాళబద్ధముగా రామనామసంకీర్తనమును సాగించి వీనివలనిలగ్నుం గని తనిసని దేశీయులందఱు నిట్లు నియతజీవనపరాయణులగుదురేని లక్షమంది హిట్లరు లెత్తివచ్చియు మనరాచతికము నాహరింపఁజాలరని వల్లభున కొకలేఖ వ్రాసి

యామండలమును వీడిసోదేపురాశ్రమమునకు వచ్చి(15-1-46) నిర్మాణకార్యక్రమ మునుగుఱించి యగర్వాలా వెలువరించినరచనకుం దొలిపల్కు వ్రాయుచు నందస్పృశ్యతా నిర్మూలనము, మతసంఘసామరస్యము, మద్యపాననిషేధము, ముదుకవలువ, కుటీరగత వస్తుసృష్టి, గ్రామశుద్ధి, ప్రాతిపదిక విద్యావ్యాప్తి, పెద్దవారిచదువు, మహిళాజనాభ్యు దయము శౌచారోగ్యములు ప్రాంతీయవాణీవికాసము, జాతీయభాషాప్రచారము, కలిమి లేములసవరింత, కర్షక సంఘనిర్మాణము, కార్మికజనోద్ధరణము, గిరిజనసంస్కరణము, కుష్ఠరోగులకూడిగము, విద్యార్థులపెంపు - నాఁ జరఁగు నష్టాదశనిర్మాణకార్యములతీరు వివరించి వీనిం బ్రజ లాదరించిననాఁడు శాసనోల్లంఘనముతోఁ బనియుండదనియె - పదంపడి యస్సామునం దైదాఱుదినములు సంచరించి కలకత్తాకువచ్చి యచటి చెఱసాలం గల దేశభక్తుల సందర్శించి యనునయించి దక్షిణభారతహిందీ ప్రచార సభా రజతోత్సవములం బాల్గొనఁ జెన్నపురికిం గదలె. 330

## మహాత్ముఁడు హిందీయుత్సవములకు మదరాసురాక

గీ. ఒజ్జ యెక్కినపొగబండి యొద్దెనేల, నీఁగి యద్దమరేయికి నాఁగెఁ గటక
ఘట్టమునయందు, గాంధిని గనుట కచట,నెగఁబడెన్ బ్రజ సంయమ మింతలేక.331

క. ఈమాలలు నీగోలలు, నేలా నాకయ్యలార! కృతమతు లగుచున్
బాలింపుఁడు క్రమశిక్షను, జాలింపుఁడు విలువ లేనిసత్కారంబుల్. 332

గీ. దిద్దుకొనుఁడు మనమ్ముల హద్దెఱింగి, బ్రదుకుఁ దీచందమే నాకు ముదముగూర్చు
నిగ్రహబలమ్ము లేనిమానిసి యెదుర్పఁ, గలఁడె యణ్వస్త్రముల నిర్వికారుఁడగుచు. 333

క. అని తత్ ప్రజ నాచార్యుఁడు, సునిశితవాక్కుల నదల్చి చొక్కెను నిద్రన్
దెనుఁగుంబ్రోలికి వాల్తే, రున కయ్యనఘుండు వచ్చెఁ బ్రొద్దుపొడుపునన్.(20-1)334

ఆ. గాంధిపథము లోకకల్యాణకర మని, విశ్వసించి యెల్లవెతలు సైఁచి
మాతృదేశముక్తికై తద్దయును వార్చు, తెలుఁగుజోదు లేగుదెంచి రటకు. 335

ఉ. శిక్షితచిత్తులై యమిని జేరి జొహారులొనర్చి జాతిదా
స్యక్షతిగూర్పఁ బుట్టినమహాత్మ! జయంబగు నీకటంచు ర
మ్యాక్షరపంక్తిఁ బల్కి బహుళార్థ మహింసనసంగరక్రియా
దక్షునకున్ వినీతి నుపదానమొనర్చిరి వా రుదారులై. 336

చ. ఇరువదియైదువేలజను లియ్యెడఁ జూపిన దేశభక్తికిన్
మురియుచు నంధ్రసేన తనమూలబలం బని విశ్వసించుచున్
గురుఁ దరుదెంచుచుండఁ దెనుఁగుంబ్రజ లయ్యయిఘట్టభూములన్
బరమపవిత్రుఁ గన్గొనిరి బాపు నలర్చి రుపాయనమ్ములన్. 337

వ. తుని రాజమహేంద్రవరము హేలాపురి బెజవాడ తెనాలి చీరాల నెల్లూరు గూడూరు మున్నగు నంచెల నయ్య సాఁచినచేతం దెఱపి లేనిధనవర్షము కురిసె- మదరాసుచేరిన పదంపడి(21-1-46) కనూగాంధిమొదలగు ననుచరులు నలువంద్రాచిల్లరసొమ్మును లెక్కింప రెన్నాళ్లు పట్టె - అవిత్తమువిలువ యేఁబదియైదు వేలరూపాయలకు మించె-అది యంతయు నాచార్యున కాంధ్రు లర్పించిన యుడుగర - అయ్యదియట్లుండె. 338

ఆ. గాంధిఁ జెన్ననగరఘట్టమునం జూడ, వేలకొలఁదిప్రజలు వేచియుండి
రది యెఱింగి పెద్దయలసినయొజ్జ తద్, ఘర్షణమ్ము నోర్వఁగాఁ దలంకి- 339

గీ. వీటి కైదాఱుక్రోసులవెనుక బండి, దిగి హుటాహుటిఁ ద్యాగరాణ్ణగరి కేగి
యచటి హిందీప్రచార స భాధికృతుల, కతిథిగా నిల్చెఁ గర్తవ్యమతిని బొల్చె. 340

వ. బాపూ మదరాసునం దపుడు పండ్రెండునాళ్లుండి హిందీ ప్రచారసభవారి రజతోత్స వములు నడుపుట, రాష్ట్రభాషాపరీక్షల నెగ్గినవారి కాయాపట్టముల నిచ్చుట, నిర్మాణ కార్యకర్తల సంశయములుతీర్చుట, ప్రార్థనాసమావేశములఁ బ్రజాహృదయములకుఁ బ్రసన్నతం గూర్చుట మున్నగుపను లాచరించి దక్షిణాపథమున జాతీయభాష వెల్లి విరియం బెల్లుగా శ్రమించు విద్వన్మణి హిందీప్రచారసభామంత్రి మోటూరి సత్య నారాయణ కాశాసనము లొసంగి పదంపడి కదిలి - 341

గీ. హరిజనప్రవేశమ్మున కడ్డులేని, మధురగుడిఁ జూచి తనిసి యమ్మాడ్కి నలరు
'పళని' కోవెల దర్శింపఁ బయనమయ్యెఁ,దనరు నది పెనుఁగొండనెత్తమునయందు.342

గీ. ఆఱువందలమె ట్లెక్కి యలసియలసి, చేరవలయు మహీధర శిఖరమునకు
గాంధి కీగాసి తగదని కార్యకర్త, లెంచి మోయఁదలంచి రయ్యిద్ధచరితు. 343

క. ఆయెడ నయ్యను జడసము, దాయము నల్గడను బలసి దండడిపెట్టన్
"మాయురె! ప్రజ లీయొప్పుమిఁ, బాయనిచో నేను గట్టుపై కరుదేరన్ - 344

గీ. ఈ మొదటిమెట్టునం దుండియే జొహారు, వొకటి వేల్పునకర్పించి యొండుదెసకుఁ
జనెద నామెచ్చుదేవుఁడు జనత నుండుఁ, గాని నిలువఁడు పాషాణఖండమందు"345

క. అని బాపుజీ వచించుడుఁ, గనెఁ గర్తవ్యమును మూఁక గడగడతోడన్
మునిమౌళికిఁ దెరువిచ్చెను, జనె దేవళమునకు జాతిజనకుం దవలన్. 346

గీ. జరిగె నొకగోష్ఠి గుడిముందు; హరిజనాద, రమ్ము మెఱసినతత్ ప్రజక మ్మహాత్ముఁ
దెలమిమైఁ దనమెచ్చుకోల్ వెలువరించి, యీడులేనియుత్సాహము నేర్పరించి -347

ఆ. "తాఁకరానితనము తగదనుకొన్నంత, నన్ని తెగలు కూడితిన్న యంతఁ
జక్కఁబడదు చిక్కు, సకలకులమ్ములు, బెరసి పెండ్లిపొత్తు మరగకున్న - 348

గీ. హరిజనులయందు నేను నొక్కరుండ ననుచు,నెపుడు ప్రతిహైందవుండు నిర్ణయించుకొనునొ
యపుడె యస్పృశ్యతాభూత మపసరిల్లు, నపుడె శుచితామయసమాజ మవతరించు. 349

ఆ. ఏసవర్ణకన్యయేనియు హరిజను, కేలు పట్ట నిచ్చగింపనప్పు
డాకెపెండ్లి కస్మదాశీస్సులను బంపఁ, జాల" ననియె ధర్మసార మొడిచి. 350

వ. తరువాత నాచార్యుఁడు దక్షిణభారతముం బాసి సేవాగ్రామమునకుం జనుచు (5-2-46) బెజవాడ నాంధ్రరాష్ట్రహిందీప్రచారసంఘ భవననిర్మాణమునకుఁ దన దీవన లొసంగి తెనుఁగువారి కి ట్లొక సందేశమును వ్రాసియిచ్చె. 351

మం. "ఆంధ్రులపట్ల నాకాశలు మెండు, వారక వారు నావాంఛలఁ దీర్తు
రస్పృశ్యతాపిశా చాహంత నణఁచి, హరిజనులకు గుడులన్నియుం దెఱచి
ప్రతినికేతనమున రాట్నమ్ముద్రిప్పి, కదగండ్ల నుడిగించు ఖద్దరు గట్టి
జాతీయమైత్రి నిచ్చలు నాసచేసి, తల్లిపల్కున ప్రోదతనము నార్జించి
రాష్ట్రభాషకు నాదరము వెల్వరించి, తెనుఁగువారలు భారతీయదాస్యమ్ము
నదలింపఁగలరు న న్నలరింపఁగలరు." 352

## భారతీయులలో స్వరాజ్యతృష్ణ పొంగుట

వ. పదంపడి జాతిజనకుఁడు తనమనికిపట్టునకుం జేరె - ఇంతకుము న్నీదేశమున శాసన సభల యెన్నికలు సాగుతతి(1945 చివర) రాజప్రతినిధి వేవె లాంగ్లప్రభుత్వమున కొకకమ్మవ్రాయుచుఁ గ్రాంగె సెన్నికలయం దెనలేనిగెల్పు నందుచున్న దనియు, నది బలీయమగు ప్రజాపక్షమనియు, దానిం జులుకఁజేసిననాడుఁ సంస్థానాధిపతులును మన కండగా నిల్వరనియు, దేశీయులహృదయమ్ముల స్వాధీనతాతృష్ణ పెల్లుబికి పర ప్రభుతా వైముఖ్య మతివేలముగా నేర్పడెననియు, నేఁడు భారత జాతీయమహాసభం దనుపకున్న విపత్కరపరిణామము లెన్నేని రావచ్చుననియు నందుల్లేఖించె - మఱియు నయ్యెడ జబ్బల్‌పూరు, పూనా మున్నగుతావుల సైనికులుం దిరుగఁబాటు దెసకు మ్రొగ్గిరి - వీరి ప్రతినిధులు పూనా కేతెంచిన మహాత్ముని బ్రచ్ఛన్నవేషమునం గదిసి సాయుధ విప్లవమున కనుజ్ఞ కోరిరి - కాని సత్యాగ్రహాచార్యుఁడు వీరిం దనుపునా?- వెండియు విధివైపరీత్యమునం బరాజితమైన సుబాసుదళము నేలుబడివా రీనాఁడు బర్మానుండి పట్టితెచ్చి తదధికారులశిరమ్ముల రాజద్రోహాద్యపరాధములు మోపి యభియోగము సాగింపదొరఁకొన దేశమునం గ్రోధావేశములు హెచ్చె-ఈవీరులపట్ల సానుభూతిచూపఁ గాళీఘట్ట విద్యార్థులు సాగించిన యూరేగింపునం బ్రజలయుద్రేకములు పెరుఁగఁ బోలీసులు పదునాల్గువిడుతలు లఘునాళికలం బ్రేల్చవలసె - దీనం బ్రభుత్వపరిపాలన మవ్వీటం గొన్నినాళ్ళు మ్రాన్పడె - ఇట్టితతి నాంగ్లమంత్రివర్గమునఁ బేరెన్నికగన్న క్రిప్సు

గాంధికొక లేఖ(1945 డిశంబరు) వ్రాయుచు "రాఁబోవుమాసముల హిందూదేశ సౌభాగ్యముం దీర్చిదిద్దుట కేము గావించుకృషికి మీబాసట వలయుననియె - అంత (1946 జనవరి) నాంగ్లప్రభుత్వము పనుపున దాని చిత్తశుద్ధిం దెలిపి భారతీయుల యుదుకుం జల్లార్ప సర్వపక్ష ప్రతినిధులు పదుం డ్రీనేలకు వచ్చి (పార్లమెంటరీడెలిగేషన్) గాంధి, గఫర్ఖాను, జిన్నా మున్నగు బలుమానుసులతో రాచకర్జములం దడవిత మగడ్డకుం (1946 ఫిబ్ర) జనిరి - వీరు మద్రపురిం గలమహాత్ముని (23-1-46) జూచినతతిఁ "డెల్లవా రీధాత్రిని మైత్రిమై విడిచిచనుట లగ్గు - సర్వప్రపంచమునకు నిది శాంతి గూర్చు - స్వాతంత్ర్యము స్వశక్తిసంపాద్యము గాని పరప్రసాదాసాద్యము కా" దని యయ్యె తనగఱువతనముం జాటె - అయ్యది యట్లుండె. 353

ఆ. నాలుగేండ్లనుండి నానావిధవ్యథా, హతులఁ జిక్కి కాంగ్రె సఱఁగియుండ
నదియ మంచిసమయ మని లీగు తనతీరు, పొగడువారిఁ బెనిచి పుంజికొనియె 354

గీ. చీల్చి పాలించునేర్పు నార్జించుకొన్న, వలఁతు లాంగ్లేయులును సాయపడిరి దీని
కిమ్మహింగల ముస్లిముల్ నెమ్మిఁజూపి, రిందు నూటికిఁ దొంబదిమందిదనుక. 355

వ. అగుటంజేసి వాయవ్యరాష్ట్రమునందక్కఁ దక్కినయెల్లసీమలం గేంద్రముననను మహమ్మదీయులకుఁ గలపీఁటల దాదా పన్నింటిని ముస్లిములీ గాక్రమించె - మిగిలిన సర్వ పీఠములఁ గాంగ్రెసు వశపఱిచికొనియె - ఇది యెన్మిదిరాష్ట్రములం దన పతాక నెత్తె - సింధు వంగ రాజ్యములలో లీ గధికారమునకు వచ్చె - పాంచాలమున మిశ్రప్రభుత్వ మేర్పడె - వంగభూమికి లీగురాచఱికము రా నాంగ్లేయ సభ్యులు తోడగుట యిట మఱువరానికథ - ఇఁక బ్రకృతము ననుసరింతము - తొల్లి - రాజప్రతినిధి కావించిన ప్రకటనముంబట్టి యతని కార్యవర్గము జాతీయ మగుటకును నవీనరాజ్యాంగ శాసన మేర్పడుటకును సుముహూర్త మిపు డాసన్నమాయె - ఈ పనులు సాగింప రాజప్రతినిధి యొకండ చాలఁడని యాంగ్లప్రభుత్వమువారు మానసించి తమ యమాత్యమండలిం గలగఱువలు ముప్వురు వైళంబ హిందూర్వికివచ్చి వేవెలుతోఁ గలసి వలయు రాచ మార్పు లేర్పరింతురని 19-2-46 యొకవెల్లడి కావించిరి - పరిస్థితులిట్లుండ బొంబయి రేవున భారతీయనౌకాదళమునం దీనాఁ డొకప్రకంపనము రేఁగె - తద్దళాధి కారియగు నాంగ్లేయుఁడు నావికులం బరాభవించుటకతన నీవిప్లవ మెగసె - ఉద్రిక్తులైన సైనికు లిరువదిమూఁడోడల నగ్గపఱుచుకొనిరి - వల్లభుఁ డీవల్లడి నణఁప నెంతయుం బడలి గెలుపునందె - ఈ విప్లవముకతన ఢిల్లీ, కరాచి, బొంబాయి, చెన్నపురి, కాళీ ఘట్టము మున్నగు నగరములప్రజ లేసరేఁగి యవగడములకుదిగి యధికారుల విధించు రూక్ష శిక్షలకుఁ జిక్కి మిక్కిలినలఁగిరి - ప్రచ్ఛన్నవాసముననున్న సమాజవాదు లరుణాదు లీ తిరుగఁబాటునకు నూఁపొసంగిరి - మహాత్ముఁ డీయెదురుపా టాత్మవినాశకమని రోసె - ఏదియెట్లున్నను విప్లవం బిది యేలుబడివారి కలజడిగూర్చె - వారు భారతీయు

లిcకం బరతంత్రత నోర్వరను నిర్ణయమునకు వచ్చిరి - కావున నాంగ్లేయ మంత్రిమండ లికిం దలకట్టయిన యట్లీ తనశాసనసభ నొకప్రకటన మొనరించుచు (15-3-46) "భారతావని తనకు వలయు రాజ్యాంగస్మృతి తాన సృష్టించుకొను - ఇది యాంగ్లేయరాష్ట్ర మండలి (బ్రిటీషు కామన్‌వెల్తు) నుండుటయొండె నుండమి యొండె దీనియిచ్ఛ ననుసరించు - ఇం దనేక భాషలు పెక్కుమతములు పలుతెగలు కలవని యేనెఱుంగుదు - అల్పసంఖ్యాకవర్గములవారిదెస మనకెంతయు నాసక్తి కలదు - వీరికాపుగడకు వలయుమార్గమును గంట మనవిధి-వీ రధికసంఖ్యాకులపైc బెత్తనము సాగింపకుండున ట్లరయుటయు మన కర్తవ్యము-సంస్థానాధిపతులు భారత మహీపురోగమనము నడ్డగింప రని నా నమ్మిక - వీరిసమస్య పరిష్కరింపcగలవారు ప్రజల" యని వక్కాణించె. 356

## ఆంగ్లమంత్రిత్రయము భారతరాజ్యాంగచర్చకై వచ్చుట

క. శరవేగమ్మునవచ్చెడి, పరిణామంబుల గురుండు బహుజాగర్యన్
బరికించుచు నొకప్రార్థన, పరిషత్తున నిట్లునుడివెc బ్రాజ్ఞత వెలయన్. 357

ఆ. తమ్ములార! భారతసవిత్రిదాస్యమ్ము, తలcగుమేలిగడియ తఱియcబడియె
బ్రిటనురాచవారిప్రెగడలు ముగు రీధ, రిత్రి కేగుదెంత్రు రేపొమాపొ. 358

గీ. ఇచటిపెద్దలభావమ్ము లెఱిcగి మనకు, నీcదగినపెత్తనము నిర్ణయింత్రువారు
వలదు కాసంతశంకయు వారిపట్ల, నరమరిక బలహీనత కానవాలు. 359

క. మనయింటికి నధమర్ణుcడు, తనయప్పుం దీర్ప రా నుదారత నతనిం
గను టొప్పుcగాని మును వాc, డొనరించిన తప్పు లెంచు టొప్పునె సెపుcడీ! 360

వ. అంతనాంగ్లప్రభుత్వమున భారతదేశమంత్రిగా నున్న పెథిక్ లారెన్సు, వాణిజ్యా మాత్యుc డైన స్టాఫర్డు క్రిప్సు, నౌకాశాఖాసచివుcడగు నలెగ్జాండరు మనరాజ్యాంగ సంస్కరణముల యోగాములం దదవ(23-3-46) ఢిల్లీకివచ్చి యాయాయధికారులతో మంతనములు సాగించి మహాత్ముని యమూల్యాభిప్రాయ మెఱుcగంగోరి యాయయ్య కాకరణ పంపుడుc బుణ్యపురినున్న బాపూ హస్తినకువచ్చి(30-3) పాకీగూడెమున వాల్మీకి గుడి కుఱంగటc గాపువెట్టె. 361

ఆ. ఇటకువచ్చుమార్గ మెంతయు నిఱుకట, మైననేమి జవహరాదినేత
లేగుదెంచి యిచటనే మహాత్మునితోడc, ద్రచ్చుచుండి రుచితతంత్రసరణి. 362

ఆ. ఇచటనే మహర్షి నీక్షించె నాంగ్లమం, త్రిత్రయమ్ము నూలుదీయువాని
నిచటనే స్వతంత్రహిందూమహీరూప, కల్పనం బొనర్చి గణుతిగాంచె. 363

గీ. ఇచటనే నూటయేఁబది యేండ్లనుండి, పఱచుదాస్యంబు ద్రోసిరి భారతీయు
లిచటనే సత్యమునకు నహింసకును ల,భించె విజయమ్ము సర్వప్రపంచ మలర. **364**

వ. నిరాడంబరమైన యీపాకీవాద రాజప్రతినిధిభవనమ్ముతోఁ బ్రతిస్పర్ధించుట యపూర్వవిశేష మనం జను-మఱియు నీ పల్లెయం దాచార్యునిప్రార్థనాసమావేశమున కేర్పడినతావునంద రాష్ట్రీయ స్వయంసేవకసంఘము (R S S) వారు తమదుడ్డుగఱ్ఱలసాము సాగించిరి - వీరికి మహాత్మునకుంబలె సర్వమత సామరస్యము గల భారతదేశముతో నక్కఱలేదు - హిందూధర్మమున కవమతికావించిన మహమ్మదీయుల నణఁపంజాలిన మాతృభూమి కావలయు - అది యట్లుండె - మంత్రిత్రయమువారిరాయబార మిట సాగుచున్న తఱి జాతీయవారము రా నద్దాని తొలినాఁడు (6-4-46) బాపూ తనకాఁపురించు హరిజనవాటికయంద సూత్ర యజ్ఞము సాగించుడు నెందఱెందఱో కాంగ్రెసుపెద్ద లేతెంచి యమ్మేలిపనిం బాల్గొనిరి - వారిలో జవహరలాలుసైతము కలఁడు - రాట్నముపై నతఁడు నూలు దీఁత చూపఱకుం గనుపండువుసేసె - నాఁటిరేపాడి ప్రార్థనా సమావేశ మున మహాత్ముఁడు ప్రసంగించుచు **365**

## జాతీయవారమున బాపూ ప్రసంగము

ఆ. కదుఁ బ్రసిద్ధిగన్న కాల మియ్యది భార, తస్వరాజ్యసమర తంత్రచరిత;
నీ ధరిత్రిఁ దొల్లి యెనలేనిస్వాతంత్ర్య, తృష్ణ పొంగిపొరలె దీనియందె. **366**

గీ. హిందువులు ముస్లిములు నపు డెట్టివేర్మి, లేక యొకతల్లిబిడ్డలలీల మనిరి
తెల్లదొరతనముం ద్రోయ నెల్ల రంగ, సాఁచి నడిచిరి బుజములు రాచుకొనఁగ. **367**

ఉ. నెత్తురుపిండియైనఁ దమనేలకుఁ బట్టినబానిసమ్ము వి
చ్ఛిత్తియొనర్ప యత్నములు చేసిరి మోసిరి ఘోరబాధ లా
పొత్తును గాంచినంతన ప్రభుత్వము తత్తఱవోయె నమ్మహో
దాత్తసుహృత్త్వ నాస్మృతిపథమ్మును బాయదు పాయ దెన్నఁడున్. **368**

గీ. అకట! మనపట్ల దేవున కలుకవొడమె, నేము నేఁటికి ముస్లిము లేము వేఱు
హిందువులు వేఱనుచుఁ గొందఱెగసి వాదు, సేయఁదొడఁగిరి పెదదారినీయకొనిరి. **369**

గీ. హిందువులు ముస్లిములు సిక్కు లేకమై స్వ, తంత్రభారతసిద్ధికై తపమొనర్ప
వలయు హింసాప్రవృత్తిని వదలవలయు, నరమరలు వీడవలయు నెయ్యమును మరగి.

క. ఈ వారమ్మున రాట్నము, రే వగ లాడించి తమధరించువలువకున్
గావలసినంత నూలిని, రావింపఁగవలయు దేశరమ వికసింపన్. **371**

వ. జాతీయవారపు టాద్యంతిమదినమ్ములఁ బ్రజ లుపవసించి చిత్తశుద్ధి నార్జింపవలయు – భగవదనుకంప సంపాదింపవలయు” – నని వక్కాణించి తన మొదలిడిన సూత్ర యజ్ఞము నిరంతరముగా సాగించుచుండ నేప్రిలు పదుమూఁడవదినము వచ్చె-నాఁటి వేఁడికోలు ముగిసినవెనుక బాపూ జలియన్‌వాలాబాగునం దాపాదిల్లిన చిత్ర వధమును సభాసదులయెఱుకకుఁదెచ్చి యపుడావిర్భవించిన సత్యాగ్రహమునం జేసి దేశమునం దపారమగుశక్తి వొడమెనని దానినణఁచుఁ బరప్రభుత్వము హింసా విధి నాశ్రయించినదని యది నలువదికోట్ల ప్రజలున్న మహామహిని ఋజుమార్గమునం బాలించుట దుశ్శకమని విశ్వసించినదని నేఁ డాదొరతన మస్తమించు లగ్నము సమీపించినదని మంత్రిత్రయము వారి సదాశయము పట్ల నాకరమరిక లేదని జయప్రకాశనారాయణాది తీవ్రవాదు లిపుడు కారావిముక్తులగుట యీప్రెగ్గ దల చిత్తశుద్ధి కొకతారకాణయని వీరికి వివేకముం గూర్చుచున్న పరమేశ్వరునకు మనభక్తిం జాటవలయునని మతమైత్రికి ఖాదీపెంపునకు జాతీయవార మేర్పడినదని యీమైత్రి హిందూమహమ్మదీయులయందు కాక యాంగ్లే యులయందును బాటింపఁ దగునని యహింసామయంబగు సందేశ మొసఁగి శ్రోతలం దనిపె – మఱియునయ్యెడ 372

## స్వతంత్ర భారతసేనపై నభియోగము

ఆ. బోసుదళమువారిపై సర కారెఱ్ఱి, కోట నడుపుతగవు పూఁటపూఁట
కుగ్రమగుట నేతదుర్వి యట్టుడికిన, కరణి నుడుకఁబాఱెఁ గలఁగి నలఁగి. 373

మం. అభిశస్తులకుఁ గాంగ్రె సండగానుండ, నిలిచె భూలాభాయి నిందితపక్ష
వాదిగా శేముషీవైభవోదాత్తుఁ; దెన్నఁదగ్గ స్వతంత్రహిందూదళాధి
కారులు కొంద ఱక్కటికమ్ములేని, దండురచ్చ విధించు దారుణశిక్ష
కగపడి నిహతులై రంతకుమున్నె, బాపుజీ యీఘోరవార్త నాలించి
మది కల్పవారాశిమాడ్కి ఘూర్ణిల్ల, “నిదియేమి? హింస కే నెదురొడ్డుఁగాక
విస్మరింప సుబాసువీరుల తెఱఁగు, దేశాభిమానంబు తెగువ ధీరత్వ
మేరాళముగఁ జాటి రీపోటుబంటు, లిపుడు బంధితులైన యీజోదులంద
ఱీనేలఁగల ప్రజకెల్ల నారాధ్యు, లీదొరతనమున కెనలేనిబల్మి
యుండిన నుండుఁగా కుచితానుచిత ప, రామర్శమును మాని రక్కెసతెంపు
చేసి తచ్ఛక్తిని జిమ్మిననాఁడు, విపరీతఫల ముద్భవించు” నటంచు
వైస్రాయి కొకకమ్మ వ్రాసె నేనాఁడొ, నేఁ డిభపురియందు నిల్చినకతన
సర్వసేనాపతిస్థాన విభాసి, ‘నాచినుటె’ క్కనునతని మహాత్ముఁ
దీక్షించి తనతలం పెఱిఁగింప నతఁడు, బాపున కనుకూలపద్ధతిం బలికె
నంత వల్లభునితో నరిగి సుభాసు, దళమువారిని జూచెఁ దండ్రి బందాల

"మతకులభేదముల్ మఱచినమాకు, నన్నదమ్ములరీతి నలరారుమాకు
నేంటి కీసర్కారు నెఱి సుజ్జగించి, యిది ముస్లిముల కిది హిందువుల కని
తేనీరు విడివిడిఁ దెత్తు రయ్యారె! భిన్నత్వమును నేర్పఁ బెనఁగుదు రదిర!
వల దిట్టివేఱిమి వలదని యెంత, సెప్పిన విన కిట్లుసేయుదు రయ్య!
పదనొల్ల కీవలం బదనొల్ల కేము, గంగాళములరెంటఁ గల టీని గలిపి
క్రోలుచుందుము పంచుకొని పూఁటపూఁట" ననుదు బాపూ పరమానంద మంది
మెచ్చెద మిమ్ము మీ మేలెంతు ననుచుఁ, గడలుదుఁ గటకటాకమ్ములఁ జిక్కి
చావురక్కసితోడ సరసమ్ములాడు, మగలు నిర్భయముగా మధురమ్ముగా, దె
సల్ మాఱుమ్రోయఁగా జనగణమన మ, హాగీతమును బాద నచటిసర్కారు
దళపతియును సమ్మదంపడి సొగసె. **374**

వ. పదంపడి మహాత్ముఁడు "స్వతంత్రహిందూసేనా" స్రష్టను మహావీరకులాంలంకృతిని మోహనసింగును గనియె - ఇతనికిందీటగు ఘటర్ఙ్జని లోకనాథుని హబీబుర్ రహమానును జూచె - రహమాను నేతాజీతో విమానమునవచ్చుచుండ దైవదుర్విపాకమునంజేసి యంత్రయానం బది కూలి బోసు మృతినందుటయు నితండు బ్రతుకుటయు ఘటిల్లె - విమానపుమంటలలో నేతాజీచేతులు నితరప్రతీకములుకొన్నియు మిగులఁ గాలెననియు నట్టిదుర్భరస్థితినిసైతము సుభాసు తనసేమము నడిగెననియు నమ్మేటి తుదిమాటలుగా "నేను జనుచున్న వాఁడ -నాదేశము స్వతంత్రమగుదనుక సమరము చాలింపరాదు - అని వినిచె ననియుఁ గంపమానగాత్రమున రహమాను పలుకుచుండ శ్రోతలయొదళ్ళ గగ్గురుపాటు తోఁచె - ఆచార్యుఁ డంతట షానవాజుమున్నగు మొనగాండ్రఁ గాంచి వారిధైర్యాదుల నగ్గించియు "మీరహింస నాశ్రయించుట లెస్స - మానవుఁడు చంపుట కాక చంపఁబడుట నేర్వవలయు - స్థితప్రజ్ఞునితీ రెఱుంగుట యిట నుపకరించు - దేశముకొఱకు- గత్తిపూనుటకంటెఁ జీఁపురుపట్టుట లగ్గు" - నావుడు నబ్బలుమగ లానుదుల నంగీకరించిరి - మఱునాఁటి ప్రార్థనసమావేశమున బోసు మరణించెనన్న నమ్మిక నాకేర్పడెనని మహాత్ముఁడు పల్కె - అయ్యెడ నొకసభ్యుఁడు పాడినపాటవిని యొజ్జ కదుంగరఁగి తద్భావమాంగ్లమునకు బరివర్తముసేయించి యయ్యనువాదమును భారతదేశకార్యదర్శి లారెన్సునకుఁ బంపె-దాని సారముం దెనుఁగున నావిష్కరింతు. **375**

మం. "దిగులు రోగము లేని తీర్థ మీ దేశ, మన్నతోక్తిలేదు దురాశలే దిచటఁ
బ్రవహించు నిందు శుభ్రప్రేమగంగ, సంతుష్టి నుండు నిచ్చటిప్రాణులెల్ల
నిట నందఱుమనస్సు లేకీభవించు, నిటఁ గాలగమనంబు స్మృతికి నేతేర
దిచట నారటములే దిటలేదు కొఱఁత, స్వప్రయోజనవాంఛ జనియింప దిచట
బాధకు లిట లేరు బాధితుల్ లేరు, సేవ్యసేవకభేద చిహ్నముల్ లేవు
వెలుఁగున్నయది కాని వేఁడిలే దిచట, కలదు నీయందె యాకమనీయదేశ

మిదియె స్వరాజ్య మిదే స్వదేశంబు, సర్వదా దీనికి జయమగుఁగాక!
సర్వథా దీనికి జయమగుఁగాక! మనసార దీని నేమనుజుండు కోరు
నతఁడ దీనిరహస్య మాధిక్య మెఱుఁగు," **376**

## మంత్రిత్రయమువారి తీర్పు

**ఆ.** కూర్మి హేతువాదకుశలత సత్యమ్ము, సంయమంబు మెఱసి జాతిజనకుఁ
దాంగ్లమంత్రిచయము నలరించుచు స్వతంత్ర, భారతావతరణ పరత నుండ - **377**

**ఆ.** మొండిపట్టుపట్టి ముస్లిములీగు నా, యకుఁడు మహినిజీల్లా నలయుచుండె
నొజ్జ నన్నుఁ దునుమ నోర్చెదఁగాని దే, శమును వ్రక్కలింప సైఁప ననియె. **378**

వ. ఆనాఁ డాయయ్యె పరప్రభుతాభారము తొలంగుటయ పరమార్థమనుతలంపున జిన్నా సాహెబు మాతృభూమిం బతియవాపుటకంటెఁ దాన జాతీయప్రభుత్వమును నిర్మించుకొని యావద్భారతము నేలవచ్చుననియు బల్కె - ఎంతయుదారతచూపిన నేమి? - జిన్నా మంచిదారికి రాఁడాయె - మంత్రిత్రయమువా రపుడు సిమ్లాయం దొకగోష్ఠిని నిర్ణయించి కాంగ్రెసువారి నల్వుర లీగువారి నల్వుర నాసమావేశమున కాహ్వానించి బాపునకుఁ బ్రత్యేకాహ్వానము పంపిరి - ఏడునా ళ్లీసభ నడిచినను (5-5-46) సమాధానము కుదరమిం జేసి యమాత్యులు ఢిల్లీకివచ్చి తమ కుచితమనితోఁచినయ ట్లొకతీర్పు (16-5-46) వెలువరించిరి - దానన్ దేశవిభజనము తగదనిరి - భారతావనికెల్లఁ గేంద్రప్రభుత్వ మొకండయుంట వలయుననిరి - సేనయు విదేశ వ్యవహారములును ధూమశకటాదులును దీనికి లోపడుననిరి - రాష్ట్రశాసనసభ లంపినప్రతినిధులు రాజ్యాంగ పరిషత్సభ్యు లగుదు రనిరి - కాని ముస్లింలీగువారిం దనుప నీనేలంగల రాష్ట్రముల మూఁడుకూటములుగాఁ జీల్చుచు సింధు పాంచాల వాయవ్యభూము లొకసమితి యనిరి - వంగకామరూపము (బెంగాలు, అస్సాము) లొకకూటు వనిరి - తక్కినసీమలన్నియు నొకవర్గ మనిరి- కీడులోమేలన్నయ ట్లేరాష్ట్రమైనను దనకూటమునంజేరిక యనివార్యముకా దనిరి - మఱియుఁ గేంద్రమునఁ దాత్కాలికజాతీయ ప్రభుత్వ మేర్పడుననిరి - దీనింగని రాష్ట్రకూట నిర్ణయమువినా కదమతీర్పంతయు మంచిదని కాంగ్రెసు (20-5-46) తనతనివిం జాటె - కూటువలుమూఁడుం దప్పనిసరిగా రూపెత్తవలయు ననుసవ రింతతో లీగువా రీతెగుదెంపు నీకొనిరి-హిందువులయు సిక్కులయు బలం బగ్గలముగాఁ గల కామరూపపాంచాలములు తమయాన కణఁగియుండుటకువీలుగా వీ రీసవరణ కోరిరి - అయ్యది యట్లుండె - కాంగ్రెసున కధ్యక్షుఁడగు నాజాదు కతిపయరాజనైతిక సమస్యలఁగూర్చి యానాఁడు ప్రత్యేకాభినివేశమునమంత్రిత్రయముతోఁ జర్చలు సాగించు చుండ బాపూ ప్రార్థనసభ(18-6-46)కేతెంచిన ప్రజ లాచర్చలవలని ఫలం బెఱుఁగం దహతహచాటిన నది నా కవగతముగానివిషయం బని మహాత్ముఁ డనుదు నప్పల్కు నకు సభాసదులు మిగులనైరాశ్యముం దెలుప నాచార్యుఁడు. **379**

## మహాత్ముండు ప్రజలనైరాశ్యము దొలంగించుట

సీ. భగవంతుఁ డఖిలప్రపంచశాసకుఁ డని, కాలచక్రము వానిపాలిదగుచుఁ
దిరుగాడునని తగుతఱిని జేంతకు నాతఁ, డుచితంబగుఫలంబు నొసఁగు ననియు
నమ్మి భక్తుండు సహనము వీడ కీశ్వరు, కరుణ కాలక్షించుఁ గాన వాని
మదికి నైరాశ్య మన్నది పుట్ట దేనాఁడు, నుత్సాహమును భక్తుఁ డుజ్జగింపఁ
ఆ. దన్నలార! మీరు విన్నారుకద మిత్రుఁ, డిపుడు పాడినట్టికృతిని; గరికి
నక్రమునకు సాగినరణంబు వర్ణింపఁ, బడియె నీబెడంగుపాటయందు. 380

క. వాగపరాకృతి వ్యాసుఁడు, భాగవతమ్మున రసప్రభాసురకవితా
ప్రాగల్భ్యము దీపింపఁగ, నీగజరాణ్ముక్తిచరిత సృష్టియొనర్చెన్. 381

క. ము న్నొకమాతంగము దగ, గొన్నదియై సరసి నీరుక్రోలుచునుండన్
గ్రన్న నొకమకర మేనిక, మన్నియకా లొడిసిపట్టి మడువున కీడ్చెన్. 382

ఆ. బలిమిచూపి మొసలిపట్టును వదలించు, కొనఁగఁ బెద్దతడవు పెనఁగె నేన్గు
నక్రవిక్రమంబు నానాఁటికిని హెచ్చు, నంతకంత కణఁగె హస్తిచేవ. 383

ఆ. అపు డహంత వీడి హరినాశ్రయించె నీ, దాసు నేలవే! దయాసనాథ!
యొరునివేఁడ ననుచు మొఱవెట్టెఁ గరిరాజు, కరఁగి వచ్చె భక్తవరదుఁ డంత. 384

గీ. ఆపదలఁ జిక్కి యల్లాడునట్టిభక్తు, రావె! నాతండ్రి! యనుచు వాపోవుదీను
వదలఁ డేనాఁటికిని భగవంతుఁ డనఁగఁ, జాలు నీగజరాజమోక్షణ చరిత్ర 385

ఆ. అతనిపట్ల నిక్కమైననమ్మిక నభ్య,సించువాని నుద్ధరించుఁగాని
వేల్పు వెట్టికేక వెట్టనేర్చినవాని, యండ గాఁడు కీడు నణఁప రాఁడు. 386

వ. మన కర్తవ్యమును మన మూఁచముట్టుగా నెఱపి యీశ్వరుండొసఁగు లాభము నొందె
నప్టినొందెసంతుష్టిమై ననుభవింప నాయిత్తపడియుంటయ భగవంతుని దెసం బరిపూర్ణ
మగు ప్రత్యయమునిల్పుట నాఁ జను-జనకమహారా జీకోవకుఁజెందిన వాఁడు - తన
రాజధాని మిథిల కాలుచున్నదనువార్త వినియు నతఁడు చలింపఁ డాయె - ఈ నిర్లిప్తత
కీసమత కితని నిరంతరప్రబుద్ధతయ కతంబు - మిథిలాపతి మహాయోగి - యోగంబన
సమతా సముపేతమగు కర్మకౌశలము - మన మిట్టినేర్పు నార్జించి విపత్కాలములం
గుందక పరమేశ్వరుం దెగడక సర్వం బతనియిచ్ఛకు లోనైయుండు ననుతెలివితో నుంట
లగ్గు"-నా నెల్లమొగమ్ములు విరిసె-పదంపడి ప్రెగడలు మువ్వురుం దమభూమి కేగుచు
(28-6-46) స్వదేశసంస్థానములు స్వతంత్రముల యని మెల్లగాఁబల్క నీస్వతంత్రత
సంస్థానప్రజలదేకాని ప్రభువులదికాదని కాంగ్రెసువా రామాట కర్థనిర్ణయమొనర్చుకొని
మిన్నకుండిరి - రాజధానీవ్యవహారము లిట్లుండ 387

## బాపూజీ హత్య కొక పన్నాగము

గీ. లీగుదెచ్చినపెనుగాలి సాగిసాగి, రెండువర్గాలనడుమ సైరింపరాని
ఐవర మెగసి యహమ్మదాబాదు ఖేద, వివశ మగుట మహాత్ముఁడు విని కలంగి-388

గీ. శాంతి సమకూర్ప నచటికిఁ జనుచునుండ, బందిపట్టాలపైఁ బెనుబంద నునిచి
వేచి రాచార్యమృతివార్త వినుటపొంటెఁ,దులువ లద్దమరేయి దైత్యులకుఁ జెలులు(29-6)

ఆ. గాఢనిద్రనుండె గాంధిమహాత్ముండు, బందినడుపువాఁడు బందఁ జూచెఁ
దొలఁగిచనియె వేల్పుచలువ దేశమ్మును, గుంచివేయనున్న గొప్పముప్పు 390

వ. మఱునటినాఁటి ప్రార్థనాసమావేశమున బాపూజీ 391

గీ. ప్రాణి కే నాదమఱచియు హాని దలఁచి, యెఱుంగ నాకేలమూఁడెనో యింతచెట్ట?
యెంద ఱింతతెగించిన నేమి భగవ, దిచ్ఛ వేఱైనఁనాదు జయింపఁగలరె? 392

గీ. వేల్పు నాపాలనుంటఁ దప్పినది గండ, మితఁడు ననునూటయిరువదైదేండ్లు మనుపఁ
దలఁచెఁగాబోలు మనుచుచోఁ గొలుతు నస్మ, దాశ తీఱంగ భారతీయప్రజాళి. 393

ఆ. రామనామజప పరాయణత్వంబె నన్, గదియు జెట్టిదములఁ గడకుఁద్రోయు
నిది యసత్యమైన నీమందువేసంగి, నెట్లు వచ్చినాఁద నింతవప్పు? 394

క. మీరందఱు భగవత్కృప, కోరుఁడు మన్గదను డిద్దుకొనుఁడు విరోధిన్
సైరింపుఁ దహింసాహం, వీరులుగా మనుఁడు కనుఁడు విశ్వప్రేమన్. 395

క. పోలీసులు సైనికులును, వాలున్ జళిపించి నేల వాలించునటుల్
పోలనిపని కొగ్గుట సీ!, సీ! లజ్జాకరము పెద్ద సెప్పఁగనేలా. 396

## జాతీయమంత్రివర్గమునుగూర్చి కాంగ్రెసు - లీగుల ధోరణి

వ. అనియహమ్మదాబాదుపౌరులఁ దెల్పి యురిలీకాంచనమునఁ దా నింతకుమున్ను నెల కొల్పిన ప్రకృతివైద్యశాలం బరీక్షించి తన్నుఁజూడవచ్చిన గోవా ప్రజానాయకుల నగ్గించి "బుడతకీచులకు బెదరకుఁడు, మీకు నలువదికోట్ల భారతీయులయండ కల"దని వారి కాత్మబల మాపాదించి హస్తినకుం జేరె - అంతట రాజప్రతినిధి జాతీయమంత్రివర్గమును నిర్మింపనెంచి యందుఁ గాంగ్రెసువారును, లీగువారును సమసంఖ్య నుండవలయు ననియుఁ గాంగ్రెసుసభ్యులలో మహమ్మదీయులుండరాదనియుం జాట భారతజాతీయ మహాసభ యీసరణి కంగీకృతిం జూపదాయె - లీగు వారితోన దొరతనము నేర్పఱుపు మని జిన్నా వైస్రాయి కపుడొత్తడి తేరఁ "గాంగ్రెసీ దేశమునం బ్రధానరాజకీయపక్షము - దానిపొత్తులేని యేలుబడి కేను మైకోలుచూపను" అని వేవెలు నొక్కిపల్కె - జిన్నా

దీనికల్గి లీగునుబిల్చి(29-7-46) యింతకుము న్నది యాకొన్న మంత్రిత్రయ నిర్ణయముం ద్రోసిరా జనిపించె-దేశవిభజనము జరిగితీఱ వలయు ననియు నీసిద్ధికై యహింసాబద్ధముగాని ప్రత్యక్షచర్య(16-8 నుండి) సాగింపఁబడుననియుఁ దీర్మానములు సేయించె అంత **397**

## నెహ్రూ నాయకత్వమున జాతీయ ప్రభుత్వము

గీ. కాటకమ్మున స్వాతంత్ర్యకాంక్షకతనఁ, బల్లటిల్లెడి భారతప్రజలఁ దేర్ప
నొక సజాతీయరాజ్యంబ యోపు నన్న, సత్యము నెఱింగి యాంగ్లేయసచివసమితి-**398**

క. జిన్నావర్గం బెవ్విధి, నన్నను మనతీర్పు సూచి యలరినపక్షం
బున్నది కాంగ్రెసు; తద్బల, మెన్నందగినట్టి దగుట నీవు బిఱానన్ - **399**

క. తన్నాయకునిం బిలువుము, పన్నుము జాతీయమైన ప్రభుతను జాలం
బన్నది తగదని వేవెలు, సన్నిధికొకలేఖ నంపె సమయార్థమతిన్. **400**

మం. అపుడు కాంగ్రెసునకు నధ్యక్షుఁడైన, పండితజవహరుపజ్జకు వేవె
లొకకమ్మ నంపుచు నోయయ్య! నీవ, పూఁటగా నిలిచి ప్రభుత్వమున్ గూర్పు
మాలసింపక మంత్రులగువారిఁ దేల్చి, యిభపురమ్మునకు రావే! యని కోరె
చాఁగురే! బాపుజీసత్యంబు గెలిచె, నజ్జరే! నెగ్గె మహాత్మునహింస
కాంగ్రెసువారిత్యాగములు ఫలించె, కదచె భారతభూమిఁ గ్రమ్మినయిరులు
మెఱసె స్వతంత్రతామిహిరారుణాంశు, వలరారె నారీనరాస్యపద్మములు
గురునిదీవెన లందుకొని జవహరుఁడు, చేరె బొంబాయికి జిన్నాను జూడ
నేల్బడిలోఁ జేర నెంతవేఁడినను, లేశ మీకొనఁడాయె లీగునాయకుఁడు. **401**

వ. పదంపడి నెహ్రూపండితుఁడు రాజప్రతినిధిం గదిసి (12-8-46) లీగువారులేని తన యమాత్యులపట్టిక నయ్యధికారికి నొసంగె - అది యట్లీప్రభుత్వము నంగీకృతిం బడసి వచ్చినంతన(2-9-46) పండితుఁడు తాత్కాలిక జాతీయప్రభుత్వమును నిర్మించె - ఈ నిర్మాణమునంజేసి భారతరాజకీయచరిత్రం గ్రొత్తయధ్యాయ మారబ్ధమాయె-నేఁటి దొరతనమునం బదునాల్గుపీఁటలు గలవు వీన నైదు కాంగ్రెసునకు-నైదులీగునకు - నాల్గు లాఁతిపక్షములకునువిభక్తములు - లీగుపీఁటలలో మూఁడు స్వతంత్రులగు మహమ్మదీయుల కొసఁగబడి రెం డపూర్తములుగా నుండె - నాఁటిరేపు ప్రార్థనాసమావేశ మున మహాత్ముఁడు ప్రసంగించుచు నిట్లనియె. **402**

గీ. "కంటకకిరీటమునుదాల్చఁ గాంగ్రెసిపుడు, ముందటికివచ్చె స్వాతంత్ర్యమునువరించు
భారతీయులు దీనికి బలిమిగూర, సాయపడు టొప్పు స్వార్థప్రసక్తి విడిచి. **403**

ఉ. పక్షము లెన్నియున్న నవి భారతదేశవికాసలబ్ధికిన్
దీక్ష వహింపఁగావలయు దీనదశావశమైన సంఘమున్
రక్షయొనర్పఁగావలయు రాచెదునాఁకటి నోర్వలేక చిం
తాక్షతి నారటించుజనతన్ ముదితన్ బొనరింపఁగావలెన్. 404

చ. మతకులభేదముల్ మఱచి మానవతాపథ మాశ్రయించి భా
రతమును జూచున ట్లఖిలరాజ్యములన్ దిలకించి ప్రాణికిన్
హితముగఁ జేయుచేఁత పరమేశ్వరుతృప్తి కొనర్చుసేవగా
మతిఁ దలపోసి పెంపెనసి మానిసి ముక్తి గడించుకోవలెన్. 405

ఆ. వలదు శంకనందవల దాంగిలేయుల, మనముపట్ల మంచితనముపట్ల
శంకితునకు సుఖము సమకూర దేనాఁడు, నన్నలార! శాంతి యావహిలదు." 406

చ. జవహరు నాయకత్వమున సాగెను భారతరాజ్యతంత్ర మీ
యవనికిఁ బట్టినట్టిశని కంతిమకాలము వచ్చె దేశపుం
భవికముఁదక్క నన్యమును బాటియొనర్పక మంత్రు లందఱున్
మివుల శ్రమింపఁజొచ్చిరి సమీకృతభావబలం బెలర్పఁగన్. 407

## లీగువారిప్రత్యక్షచర్యతో బంగాళమున రక్తప్రవాహములు

ప. అయ్యెడియట్లుండె-ఈర్ష్యాజ్వాలల నెరియుచున్న లీగువారు మున్ను తాము తీర్మానించిన కరణిం గాళీఘట్టమునఁ ప్రత్యక్షచర్యకుం గడఁగి (16-8-46) బలాత్కృతిమై విపణి వీథులు మూయించి హరతాళము సాగించిరి-నాఁడు సుహ్రావర్దీ నాయకత్వమున లీగు మంత్రులే బంగాళము నేలుచుంటంజేసిదుండగీండ్రు కదుం గదు విజృంభించి దోపిడు లకు దిగిరి - హత్యలు కావించిరి - నాల్గునా ళ్ళీఘోర సమరము నడిపి నెత్రుటేర్లు పఱపి నాదిర్షా ప్రభుత్వమును దలఁపించిరి - ఈకొఱగాములలో నుభయవర్గములవా రైదాఱువేలమంది మ్రందిరి - దరిదా పిరువది వేల ప్రజలు గాయపడిరి - లీగు ముట్టించిన మంటలు బొంబాయికిం బ్రాఁకె -పాంచాలము నాక్రమించె - ముస్లిములకు బల మున్న తావులనెల్లం దరికొనె - ప్రాగ్వంగమునం దీజ్వాలలు (10-10నుండి) కదుంగదుఁ దారసిల్లె - ఢక్కా, చిటగాంగు, చాందుపురము, త్రిపుర, నౌఖాలీ మున్నగు మండలముల వేలకొలఁది హిందువులను సిక్కులం దుంటరులు చిత్రవధముపా లొనర్చిరి - ఎందఱెందఱో రమణీమణుల నపహరించిరి - పెక్కండ్రుజవరాండ్రను రక్కసబన్నము లతోఁ గాఱియపెట్టిరి - గుడులఁ గూల్చిరి - గ్రామములఁ గాల్చిరి - మతపరివర్తన చర్యలు జరిపిరి - ఈరక్కసులరాజ్యమునకు రాచవీడుగా నౌఖాలీమండల మేర్పడియె - ఇది యాకుఁదోటలతో గొబ్బెరతోఁపులతో జనుపచేలతో నడుమనడుమఁ దరఁ గలన్ నురుఁగులఁ దుఱఁగలించు చెఱువులతో మలఁకమలఁకలై యల్లిబిల్లి గొన్న

పంట కాల్వలతో నిండి యుద్యానవనముంబలె రమణీయముగా నుండు - కాని దీనం బ్రయాణసౌకర్యములు సున్న - ఒకయూరివార్త లింకొకయూరికిం జేర్చుట దుశ్శకము - పల్లె విడిచి పఱచుటయుం బ్రజకలవిగానిపని - పైపై చ్చది జడికారు - వరిచేలు వఱదనీటం దొప్పదోఁగియున్న తతి - దుండగీం డ్రీదురవస్థకుఁ దోడుగా నధికారుల ధిక్కరించి వార్తావాహితంత్రులు ద్రెంచిరి - వంతెనలు పడఁగొట్టిరి - కాల్వకట్టల నఱికిరి - ఱాబాటలకు గండ్లు వెట్టిరి - రాకపోకల కవరోధము లెన్నేని కల్పించి కల్పాంత నర్తనమునకుం దెగిరి - 'నవకోలా' గ్రామమునం దీతులువలు కొండ ఱొకనెలవుం జుట్టువారి ముస్లింలీగునకుఁ గాన్కగా నైదువందల విత్తము నీరేని మీబ్రదు కీనాటితో సరి యని యింటివారల జంకెన సేయ వారాధనము నొసఁగి దొసఁగు తప్పించుకొంటిమని తేఱుకొనుచుండ. 408

మం. బాఁకులు కత్తులు బరిసెలు పూని, వచ్చె నింకొకగుంపు వారిచేరువకు
గే స్తోకఁ దాదుండగీంద్రు శాంతింప, రెండుపల్కులు వెల్వరించెనో లేదా
కృత్తశిరస్కుఁడై కెడసె ధరిత్రి, నింటిపెద్దను వెంటనే పట్టి ధూర్తు
లలఁతియలంతివ్రయ్యలు చేసి; రంత, నాఁగక తత్సుతునసువులు దీసి
రద్దువచ్చినతల్లి నణఁచిరి; పిదప, నుద్ధతిమీఱ వేఱొకయిలుతేనిఁ
జక్కాడఁ జెదు గొందు చనుదేర నతని, కాగృహమేధికన్యక మ్రొక్కి మ్రొక్కి
చంపకు నాతండ్రిఁ జంపకుమయ్య! నాల్గువందలసొమ్ము నామేనితొడుగు
లర్పింతు నీ కని యార్తయై వేఁడ, మంచిది! కాన్కలిమ్మా! యని యెదమ
చేత నందుచుఁ గుడిచేతఁ దజ్జనకుఁ, ద్రుంచెను బేతాళుతోఁబుట్టు వతఁడు
నించెను గీములో నెత్రుకాలువలు. 409

## రాజేంద్రలాల్‌చౌదరి మున్నగువారిని దుండగీంద్రు చంపుట

వ. ఘోరవార్త యిట్టిది వేఱొండు వినుతు - నౌ కాళీ న్యాయవాదిసంఘమున కధ్యక్షుఁ డుగాఁ 'గర్బారా' పురవాస్తవ్యుఁడుగా రాజేంద్రలాల్‌చౌదరి యను మేటిమానిసి కలఁడు - రానున్న కాళీపూజ కితఁడు మేఁకనల్లకుమాఱు ముస్లింరక్తమును విని యోగింపనెంచె నన్న యసత్యవార్త యొకటి తుంటరులు లేవఁదీసిరి - షాపూరునం గాఁపురించు క్రించు గులాంసర్వారను గుండగొయ్యలదొర యీవదంతి విని కనలి 410

గీ. క్రన్న నేతెంచి నీవు నన్ గలియవలయు, నన్న ముదలను జౌదరి కందఁజేసె
నెద్దియోకుట్ర యిది యని యెంచి వాని,పాలి కేగక రాజేంద్రలాలు నిలిచె. 411

మం. ధూర్తనాయకుఁడు తోడ్తోఁ బందుగొఱికి, రక్కసబంట్లను రావించి యిపుడ
తరలుఁడు చౌదరితల ద్రుంచితెచ్చి, నాకిం దటంచు నానతివెట్టఁ దులువ
లాకస మగలున ట్లార్చుచుఁ బేర్చు, చెగురుచు దూఁకుచు హిందూకవోష్ణ

రక్తము దాహమాఱంగఁ ద్రాగవలయు, ననుచుఁ గర్వారాకు నరిగి భవాని
గుడి గూల్చి విపణులు కొల్లాడియాడి, వచ్చిరి చౌదరివసియించు వీథి(11-10)
కాత్మజుతో శాత్రవాళి నెదిర్చి, లఘునాళి కాగ్నిగోళమ్ములు ప్రేల్చి
కెడపె ముప్వురుదుండగీంద్ర రాజేంద్రుఁ, దదరి వీఁగిరి మల్క లల్లాయటంచుఁ
దప్పె నప్పటికిఁ జౌదరి కపాయమ్ము, పఱచిన పాలసుల్ పరిసర దుష్ట
నివహముతోడ వెండియు వచ్చి రెచ్చి, రాజేంద్రలాల్ మందిరంబును ముట్టి
వికటాట్టహాసముల్ వెదలింపఁ దొడఁగి, రపుడు గత్యంతర మగపడకుంట
నింటివా రిరుగువా రింతులు మగలు, తద్భవనమ్ముపై దాఁగఁ గట్టిఁడులు
ఱాలురువ్వుచు వారి రాపాఁడజొచ్చి రంత నాఁగక యింటి కగ్గిముట్టించి
రెగసె మంటలు పొగ లేచె దూలములు, వాసముల్ తలుపులు వాకిళ్ళు కాలి
గేహమ్ము కూలసాగెను, గప్పుమీఁద, హాహానినాద మవ్యాహత మాయె
రక్షింపుఁ దయ్యలు! రక్షింపుఁ దనుచు, బలువల ననదలు ప్రార్థింపఁదొడఁగి
రదలకుఁ దదలకుఁదని కూళ లపుడు, నిశ్రేణి నొకదాని నిర్మించి పురుషు
లందఱ డించి తదంబరములను, విప్పించి వారల వెలఁదులమోల
దయవీగి మానవత్వము బోనాడి, కోసిరి కటకటా! కుతుకలనెల్ల
భవనభర్తను దుంగపై వంగఁబెట్టి, ఖండించి తన్మస్తకమును సమస్త
వీథులఁ ద్రిప్పిరి వీడెల్లఁ గాల్చి రింతులఁ గొనిపోయి రెల్లదిక్కులకు
రాజేంద్రుసేవలో బ్రదుకుమహమ్ము, దీయుఁ దాయజమాను దేవిని దనదు
గీమున దాఁచి రక్షించెను సుజనుఁ, దాతల్లికూఁతుల నార్తి నల్లాదు
యువతుల నిద్దఱ నున్నతపార, శాలకుఁజేర్చి రక్షస్సులు నుదువఁ
జననిచేఁత లొనర్చి చంపిరి తుదకు, మఱునాఁటిరేయి క్రమ్మఱ వచ్చివచ్చి
పడియున్న శవములఁ బరికించి నఱకి, మొండెములను గోతములగ్రుక్కి త్రొక్కి
చెఱువులఁ బాఱవైచిరి నీచమతులు. 412

వ. మఱియొక దారుణోదంతము నావిష్కరింతు - రాయపూరునందొకవిప్రుండొకలఁడు.

గీ. అతఁడు వాగపరాకృతి యతఁడు కీర్తి, మెండుకొన్న నవద్వీపపండితుండు
దుండగీంద్రచరిత్రలతోడ మిగులఁ, గలఁగి కలి నిండెనే యని నలఁగి యతఁడు-414

మధ్యా. తనవిత్తమిరువదివేలతో నేగి దబ్బఱతెఱఁగు
వినిచి నా కండ యగు మని పోలీసుపెద్ద నర్థింపఁ
గనికరంబున దొర యభయమొసఁగఁ దత్కార్యాలయంబు
నన దాఁగె హతవిధిన్ దూఱుచు విపశ్చిదాభరణంబు. 415

క. దుండగు లిది పసికట్టి ప్ర, చండతమై వచ్చి పరుషశబ్దంబుల నెం
దుండె బుధుం దని కావలి, దండుమగని నిగ్గఁదీయఁ దలఁకి మనీషిన్ - 416

ఆ. వెలికిఁబంపె నతఁడు; వెనువెంటన పిసాళి, మూఁక విదురు బలసి ముల్లె నొడిసి
యీవు పూనవలయు నిస్లాము నా నొల్ల, నొల్ల ననియె హైందవోత్తముండు. 417

క. మొఱకుఁదనం బీఁగనిచో, నఱకెద మని రసుర, లెది యొనర్చిన లవమున్
వెఱవ ననెన్ విద్వాంసుఁడు, కఱకరి యొకఁ డపుడ సూరికంఠము ద్రెంచెన్. 418

వ. వెండియు నొకయూర వైద్యవృత్తిమై బ్రదుకు హిందూవృద్ధుఁ డొక్కరుండు కలఁడు - దుండగీం డ్రతనియిల్లు కొల్లలాడి యందలిదేవతాపటములఁ దుత్తుమురు సేయుతతి నొకగాజుముక్క తివ్వనంబఱతెంచి ధూర్తనాయకుని కాలన్ బాదుకొన 419

ఆ. వెల్లివొడిచె నెత్తు రల్లరిగుంపు వెల్, వెల్లఁబాఱె నేత పుల్లగిల్లె
వలదు బెగ్గలింపవల దని ముదివెజ్జు, గాజు పెంకు దీసి కట్టుగట్టి - 420

క. సర్వోపచారముల వెత, గుర్వణఁచి దళాధిపతికి గూర్చె సుఖం బీ
హర్వుఁ గని యిట్టిసజ్జను, లుర్విఁగలరె! రిపున కెవ్వఁ డుపక ర్తయగున్ - 421

క. అని కరఁగికరఁగి పదవాల్, తనవారల నచటినుండి తలఁగం బనిచెన్
మును కొల్లగొన్నమందులు, ధనధాన్యము లంద విడిచి తరలిరి బంటుల్. 422

వ. అహింస కిది యొకగెల్పు నాఁ దగు-వెండియు నటనట నాపన్న హిందువుల రక్షించిన మహమ్మదీయులును గొందఱు కలరు - రక్షితులలో మహాత్మునికార్యదర్శి ప్యారీలా లొకఁడు - దీని కేమిగాని ప్రాగ్వంగమునం దానాఁడు దుండగులు నిరపరాధుల కుత్తుకలుత్రుంచియు మతముమార్చియు మానినులఁ బరాభవించియు దేవాలయములఁ జెఱిచియు నిండ్లుకాల్చియు సొమ్ముదోఁచియు హిందువుల సిక్కుల క్రైస్తవులయెడఁ గావించినయకార్యము లిస్లాం చరిత్రకు మాయని మచ్చలు - అవగడము లిన్ని రేఁగు చున్నను సుహ్రావర్దీ ప్రభుత్వమునకుఁ జీమకుట్టదాయె-దేశమునం దానాఁటికానాఁడు భయసంభ్రమము లగ్గలించె - అట్టి దుష్కాలమున గాంధి యీకఠోరగాథలు విని423

## నొకాలీదుండగములు విని మహాత్ముఁడు వగచుట

ఆ. మిగులఁ గ్రుంగి క్రుంగి జగమున మానవ, త్వము సమస్త మిపుదు సమసెనొక్కొ
నేఁటిప్రహ్లదీంద్రు నాఁటిరాకాసులఁ, ద్రోసి రనుట దోస మగునె. 424

గీ. అకట! ప్రత్యక్షచర్యయన్నట్టిమాట, కర్థ మీహింసయా! హింసనావహిల్లు
నర్థమెయ్యది? లీగువా - రంతపెద్ద, లదిర! హింసనుబోధింతురా! తెగించి. 425

గీ. లీగుసభ్యులుగానిముస్లిములు! జంప!, గలుషమంటదు, కాఫరుల్గాన హిందు
వులు వధార్హు లటంచు మంత్రులుగనున్న, యన్న లే పల్కిరని పత్రికాళితెల్పు. 426

క. చాటుపనికంటెఁ బ్రకటన, పాటింపందగిన దనియు పల్కుదు నైనన్
జేటు గదించెడు ప్రకటన, యేటికి? విడువంగఁదగినదే యగు ననెదన్. 427

క. 'శాంతి' కదా 'యిస్లా' మన, నంతచదివినట్టివార లరయర దీనిన్
హంతలుగెల్తురె గెల్చిన, నెంతసుఖం బనుభవింతు రీమతిహీనుల్. 428

ఆ. పాడిదప్పి తులువపనులకు దిగుట ప, రాధికారమునకు నాయువిడుట
మోయరానిదాస్యమునఁ దల్లడిలుచు జీ, వచ్చవమ్ము లట్లు వసుధ నుంట. 429

గీ. భారతీయుల కిఁక నధికారమొసఁగి, యిల్లుసేరఁదలంచిరి తెల్లవారు
వారికత్తులు మనకుఁ గావలయునన్న, నెట్లు పొసఁగును వార లీయిలను విడుపు?430

గీ. వారు విడుతురుగాక యీ వసుధకపుడు, రాకయున్నె మఱొక్క పరప్రభుత్వ
మిస్సిరో! "దూఁకుఁ"దను నేత లింతమాత్ర, కానరా లాభలోభాంధులైనవారె? 431

ఆ. వంగభూమి నెంతవల్లడిపుట్టె! నీ, యగ్నిశిఖలు వేగ నాఱకున్న
మసనమగుట యబ్రమా తద్ధరిత్రి, లీ, గిదియెఱింగి శాంతి నించుఁగాక. 432

క. హిందువులీదౌష్ట్యము గని, పందలుకారాదు మగలపగిది నెదురుచున్
గ్రమ్మందవలయునందఱు, నపు, దందును హిందూమతం బనంత యశమ్మున్. 433

గీ. కూళల నహింసతో నెదుర్కొనుట లెస్స, కాని యెల్లరు చాల రీకర్జమునకు
నగుట మగువలు మగలు మానాదిరక్ష, కెదిరిదెస హింసపఱపుట యెగ్గుకాదు. 434

వ. అని దేశమునకు వలయు సందేశము నొసంగి వెండియు 435

ఆ. ఇచ్చలేనిచాన నితరమతమ్మున, జేర్చుఁగాక నీతి సెడినమూఁక
యాకె మరలివచ్చినపుడు ప్రాయశ్చిత్త, విధులు వలయుననుట వెఱ్ఱిమాట. 436

ఉ. నావుడు నీహితోక్తి యభినందన పాత్ర మటంచు నెందఱో
కోవిదవర్యు లాడి రిది కూళల బారికిఁ జిక్కి స్రుక్కి హిం
దూ వనితామణుల్ కుదుచు దుఃఖములన్ దొలఁగించుపొంటె సం
జీవిగ మాఱెధర్మపరిశీలన మివ్విధి నుందు నాపదన్. 437

వ. మన రాజనైతిక పరిస్థితు లి ట్లీఱతాఱలైన తఱి 438

## లీగుమంత్రులు జాతీయ ప్రభుత్వమునఁ జేరుట

క. జిన్నా వర్గమువారికి, మన్నియతన మున్నఁగాని మహి కుపశమ సం
పన్నతరాదని యట్లీ, మున్నగువా రెంచి కార్యమును సాధింపన్. 439

గీ. వేవెలును గోర నతఁడు రావించె లీగు, నాయకుని హస్తిపురికి; జాతీయమంత్రి
వర్గమునయందు మీరుంట వలయు నన్న!, శాంతిచేకూర్పవలయు దేశమునకనియె.440

వ. జిన్నాసాహె బపుడు కాంగ్రెసువారి మహమ్మదీయుఁడు ప్రభుత్వమునఁ జేరనిచో సచివులకు సంయుక్తబాధ్యతయుండనిచో లీగు సభ్యులు రాచతికమునకు వత్తురనుడు రాజప్రతినిధి యతనిధోరణి మహాత్మునకుందెలిపె - భోపాలునవా బిప్పట్ల మధ్యవర్తిగానేర్పడె - ఎట్టకేలకు జిన్నాకోర్కులలో మొదటిది నిరాకృతమై రెండవది యంగీకృతమయ్యె - అంత (15-10-46) లీగునాయకుఁడు తనసమర్పించిన మంత్రులపట్టికయం దొక హరిజనహిందువునుజేర్చి కసిదీర్చుకొనియె - ఇంతచేసియుఁ బ్రత్యక్షచర్య యథావిధిని సాగించుచుండె - మహాత్ముఁ డీకలయిక చావుకౌఁగిలింబోనిదని(20-10-46) తన వనటం బ్రకటించె -పదంపడి జాతీయప్రభుతయం దీఁగిన లీఁగుమంత్రులు నెహ్రూ వర్గమునకెదమదువుగానుండి తమపాలిశాఖలం దమయిచ్చవచ్చిన తెఱంగునఁ బాలింపఁ దొడగిరి - రాజ్యాంగనిర్మాణ పరిషత్తునం బాల్గొన మనిరి - దేశవిభజన మనివార్యమనిరి - సామ్రాజ్యవాదులగు నాంగ్లేయులు చర్చిలుప్రభృతులీధోరణి కనుకూలు రనుకంపుపొక్కె - వేవె లీమురావాఁ దగుటన లీగుమంత్రుల నదలింపఁదాయె - మఱియు దుండగుల కిచటి యాంగ్లేయులసాయమునానారూపముల దక్కుటయు వారి మానప్రాణవిత్తాదుల జోలి కీ పలుగాకిమూఁక చనక కృతమెఱుక చాటుటయు నిట గమనింపఁదగినకుట్ర - నెహ్రూపండితుఁ డీబండి నెట్లీడ్చునాయని యానాఁ డలమటపడందొడఁగె - అట్టితఱిఁ దూర్పుబంగాళమునందలి హిందూయువలు కొందఱు ముస్లింలీగు మంత్రివర్గమునఁ జేరుటంజేసి తుంటరుల దుండుడుకు హెచ్చుట గమనించి యాచేరికకు నియ్య కొన్న మహాత్మునిపైఁగినిసి ఢిల్లీకివచ్చి(21-10) హరిజనవాటికలో నడుచుచున్న బాపూప్రార్థన పరిషత్తునం దల్లరులుసాగింప మహాత్ముఁడు వారివేదన నెఱింగి తా నపుడు వంగభూమి నుంటయే కర్తవ్యమని యెంచి తన నిర్ణయమును (27-10) వేఁడికోలు రచ్చం బ్రకటించె. 441



# మ హా త్మ క థ

## నాల్గవభాగము

### మహాత్ముఁ డార్తవంగమునకు రాక

మధ్యా. ఓతండ్రి! దావాగ్నినడుమ నల్లాడుచున్న నౌకాళి
కేతేరకయ్య! నీ బ్రదు కమూల్య మీయిలకు; దురాత్మ
లాతతాయులు నిన్నుసైత మాసీమ నణఁచెదరేని
మాతిప్ప లెవ్వరుం బడ రని వెఱపుమై నెయ్యు రనిరి. 1

మం. అనవుడు నొజ్జ యిట్లనె నన్నలార!, పలుకు నంతర్వాణి పదపద మనుచు
నాఁపఁజాలను యాత్ర నరికట్టఁజాల, జిక్కు లెట్టివియైనఁ జేవ లేకున్న
రామునిమీఁద భారమ్మును వైచి, కదలెద రేప నౌ కాళీధరిత్రి
కోదక నావిధి యొనరింతు నచట, నిచట మీకర్తవ్య మీరు పూనుండు. 2

వ. మహాత్ముఁ డమ్మఱునాఁడ తనబలఁగముతోఁ గదలి కాళీఘట్టముఁజేరి (30-10) సోదేపురాశ్రమమున విడియుడు ముఖ్యమంత్రిసుహ్రావర్దీ బాపూదాపునకువచ్చి మహాత్మా! బక్రీదు సమీపమున నున్నది-అది గోవధమున కెదమిచ్చుపండువు - నేఁ దట్టికట్టిఁడి చేఁత సాగునేని మరల దుండగముల రేఁగవచ్చు - కాన నాప్రార్థన మన్నించి కొన్నినా ళ్లీవీట నాఁగుము - నా నొజ్జ యతనికోర్కి కియ్యకొని 3

సీ. ఒకనాఁడు తనచెంతనున్న తన్మంత్రిని, గనియేమయా! దుండగము లొనర్చు
గుండగొయ్యల నాయకుఁడవు నీవని పెక్కు, రందురు దీని కేమందు వనుదు
నతఁడు మహాత్మ! నిన్నైనఁ జాటున దూఱు, ప్రజలు లేరా? కల్లనిజము లరయు
పనిలేదు వారికి; ననుఁగాదు నినుఁగాదు, వేల్పునైనను వారు వెక్కిరింతు
ఆ. రోటలేదు వారినోటికి; నాఁగొంద, తైన నను మహాత్మ! యండ్రు; నిన్ను
నొక్కఁడైనఁ బిలుచునొకొ యిట్టులనె గాంధి, ప్రెగడ నమ్మకెదుటిపొగడుననియె. 4

క. తెగుదాఁక లాగక గురుం, దగు నగు నీవన్నదియు యదార్థంబ యనెన్
జగమంతిరి బాపూదెస, మిగులన్ వినయమ్ము నెమ్మి మెఱయం దొడఁగెన్. 5

వ. పదంపడి బాపూ హిందూమహమ్మదీయులు సమానసంఖ్య నుందున ట్లొక శాంతి సంఘమును నిర్మించి సుహ్రావర్దీ నద్దాని పెద్దను గావించి నగరశాంతిరక్షాభార మా సమితితలపై నిడియె - అయ్యెడం గొందఱు ముఖ్యమంత్రి నాయంకరము నిరర్థక మనియు నతఁడు ధూర్తపక్షమువాఁడనియు నొజ్జకు విన్నవింప మహాత్ముండనుమా

నము భీరులక్షణము కాన దాని కే నెదమీ ననె - లోకము తన్ను నమ్మిననాఁ డాకతాయి యందును మంచితన మేర్పడుననియె - మఱియు జగా(్రెగడతో బెరసి మతకలహముల కతనఁ బాకీస్థానము రామియకాక యవిభక్తభారతస్వాతంత్ర్యము సైతము నిలువదని మతపరిణామమొండె వివాహమొండె బలాత్కృతిపై జరుప రానివని మహిళలం దఱుముట నాగరికలక్షణము కాదని యొకప్రకటన మొనరించి. 6

## బీహారునం దల్లరులుసాగుట విని బాపూ తిండికోఁత

ఆ. వంగనగరి నుండ వచ్చె విహారమం, దల్లరులు ఘటిల్లె నన్నవార్త
యది యెదన్ గలంప నాచార్యుఁ డే మిది, యని ప్రధానమంత్రి కనచెఁ దంతి. 7

మధ్యా. జవహరుం దపుడు పటేలుమున్నగు సచివులతోడ
నవగడంబుల నారటించుమహికి బిహారున కరిగి
వివిధస్థలంబులు సూచి వైరముల్ విరిసి ప్రజాళి
నవయుట నిక్కంబ యనుచు నయ్యకు నడిపె నుత్తరము. 8

క. ఆలేఖ గన్నగురుఁడా, నేలకు బ్రల్లదము లణఁగి నిర్భరశాంతి
శ్రీ లభియింపనిచో నే, నీలోకము విడువఁ బస్తునీకొందు ననెన్. 9

వ. నెహ్రూ పటేలు లీభీష్మప్రతిజ్ఞ విని గుజుగుజవోయి 10

మధ్యా. ఓయయ్య! ప్రాయోపవేశ మూనకు మూనకు; మీవు
పోయిన మాకు స్వాతంత్ర్య మేల ప్రభుత్వ మ దేల
శ్రీ యేల జీవిత మేల సౌహార్దసిద్ధికై శ్రమము
సేయుదు మని కమ్మ నంపి రాయోగిశేఖరుకడకు. 11

వ. అంత నాచార్యుఁడించుక తేఱి తనప్రాయోపవేశము నర్ధోపవాసముఁగా సవరించి బీహారువారి నుద్దేశించి. 12

మం. ఓ యన్నలార! మీయొప్పునుగుఱిచి, కన్నాఁడ బంగారుకల లింతదనుక
నీనాఁడు నాకలలెల్ల బీర్వోవ, వంచించితిరి నన్ను వనటఁ ద్రోసితిరి
వంగోర్వికంటె మావసుధ మేలనుచు, మీరందురేని నే మెచ్చ నాపల్కు
తెన్ను దప్పినమాసి దెస మాఱుచేఁత, యసమర్థునకుఁ బంద కానవా లనెద
సైరింపఁజాల హింసావిధానంబు, మానవజాతికి మచ్చ యీచెయిది
దుండగమ్ములఁ జిక్కి దురపిల్లువారి, రక్షింప సేనలు రాఁ బనియేమి
పల్లదీంద్ర నడంచి ప్రజలె ముస్లిముల, కభయమ్ము నీవలె నండగా నిల్చి
కాదందు రేని రక్కసిబుద్ధి మాకుఁ, బోదందురేని, నే బొందిని విడుతు
సానుభూతి వెలార్పఁ జన దీరు నాకుఁ, గ్రించుల నోర్చుటే కృత్యంబు మీకు. 13

## బాపూ నౌకాళియాత్ర

వ. అని పగటినంతన బీహారుహిందువు లూఱడిల్లి యాయయ్యూపూనిన నౌకాళీ యాత్రకుఁ దొడగిరి - పొగబండిలో (6-11) నీయాత్ర సాగె - అహింసాతపస్వి వెంట నొక యమాత్యుఁడును మఱియిద్దఱుద్యోగులును సుహ్రావర్దీపనుపునం గదలిరి - దారిలో ముఖ్యమంత్రి కాణాచి 'కుస్తియా' యొద్ద మూఁగినప్రజం గని మహాత్ముఁ డిట్లనియె. 14

గీ. మును ఖలీఫాకు మూఁడినముప్పునణఁపఁ, దొడరినపు దావహిలినహిందూమహమ్మ
దీయసౌహార్ద మిపు దస్మదీయయాత్రఁ, దోఁచుగాక! విపత్తుల రాచుఁగాక! 15

ఆ. మతము లెన్నియైన మానవగణమెల్ల, నొక్కజాతి యనుట నిక్కువమ్ము
వీతహార్దమైనజాతి నిల్వదు మతం, బెదియు దాని కాయు వీయలేదు. 16

వ. జాతిజనకుఁ దారేయి చాందపూరుచేరి మఱునాఁడు 'లక్ష' మనుపల్లియకు వచ్చె - ఇచట శరణార్థిశిబిరము కలదు - బాపూ వచ్చినంతన శిబిరవాసు లాయయ్యను దర్శింపఁ దహతహపడం దొడఁగిరి - దీనబంధు వాప్రజలం గని 17

మధ్యా. ఈవంగభూమి నప్రశాంతమగుశాంతి యేర్పడుదనుక
నావచ్చుకార్యంబు ముగియ దీమాట నమ్ముఁడు; భయము
నావలికిం ద్రోసి రామనామము నాత్మ జపింపుఁ
దేవంతనైనఁ దూలించుమంత్ర మిదే యగుఁజుండు. 18

ఆ. కలఁడు భక్తునార్తి కదలించువే ల్పను, నమ్మకంబులేని నరుఁడు కుంది
పందతనము నంది పరువెత్తుకంటెను, నిహతుఁ డగుట మాననీయ మనియె. 19

వ. నాఁటి సంజప్రొద్దునకు మహాత్ముఁడు 'చౌముహాని' యనువీటికిం జేరఁ జారుచౌదరి యాజమాన్యమునఁ గొందఱు సత్యాగ్రహులు నపుద యటకు వచ్చిరి - సుచేతా కృపలానియు నేతెంచి తా నాయైగ్రామములఁ గన్న దుర్దశ లయ్యు కెఱుక చేసె - బాపూ తత్పురమున నిల్చి సేవాకార్యక్రమము నారంభింపఁ గార్యకర్తలు శవాదులం దొలఁగించి యం దొక ప్రార్థనారంగము నిర్మించిరి - మహాత్ముని మనువుం గాపాద నేలుబడివా రంపిన పోలీసులు, సైనికులు నానాఁడ చౌముహానీ కరుదెంచిరి - వీరిం గని ముస్లిము లుదరిపడిరి - హిందువులు తేఱిరి - బాపూ పెదవి విఱిచె - అంతటం బ్రవర్తిల్లిన ప్రార్థనాసదమున వేలకొలఁదిప్రజలు పాల్గొనిరి - ఇందు ముసల్మానులు పెక్కురు గలరు - మహాత్ముఁ దాసమావేశమునఁ బ్రసంగించుచు. 20

## బాపూ దుండగీంద్రగు ముస్లిములకు హితవు చెప్పుట

గీ. అలుకతో ఁగాక యార్తితో నస్మదీయ, భావముల వెల్వరింప మీప్రాంతమునకు
వచ్చి వచ్చినదాది యీవసుధ మల్క, లొనరిచినపాపముల వినుచున్న వాఁడ. 21

ఆ. నిక్క మిట్టులుండ నక్కటా! లీగువా, రొప్పరేమి తప్పుఁ జెప్పరేమి
సుప్రావర్ధియైన సూనృత మెఱుఁగఁడా? మండలమ్ములేలు మంత్రిమౌళి. 22

క. ఈతెఱఁ గిస్లామునవి, ఖ్యాతికిఁ బెనుమచ్చు; దుండగమ్ముల నది యే
రీతిని సైఁచు? ఖురా నీ, పాతకములు తగిన వనుచు భాషించినదా? 23

వ. ఏను ఖురానుచదువనివాఁడం గాను -'ఇస్లాము' నా 'శాంతి' - 'సలా మాలేఖు' మన 'నీకు శాంతియొదవుఁగాక' యని పల్కుట - త్రిపురమండలముననను నౌకాళి సీమ యందును దుంటరులు ముస్లిములు సాగించినఘోరహింసను బ్రశంసించుమత మీ జగత్తున లేదు-ప్రాగ్వంగమునం దధికసంఖ్యనున్న మహమ్మదీయు లిఁకనేని శాంతి ప్రియులై హిందూమహిళలపరువుం గావవలయు - నా నొజ్జతో వచ్చినప్రెగడ 'షంసుద్దీ నహమ్మదు' కరఁగి మఱునాఁటి (8-11) వేఁడికోలురచ్చ నిట్లువాక్రుచ్చె. 24

మధ్యా. మందిబలిమి కలదని యెగసి ముసల్మాను లొక్కయెడ
హిందువుల, మఱొక్కచోట హిందువు లితరులఁ జంపి
పొందులాభము సున్న, హింసకతన నిప్పుడమి నేర్పదదు
చందమామపతాకతో నలరెడిరాజ్యం బెన్నఁటికిని. 25

క. బలహీనులతల ద్రుంచెదు, తులువల మన్నింప దెట్టిదొరతనమైనన్
బలువలను మెచ్చునేల్బడి, నిలువదు నిలువదు మతంబు నిత్యం బగుచున్. 26

గీ. బలిమిమైనన్య కాంతలఁ బట్టుకొనుట, సురియచూపి మతమ్ముమార్చుటయు నుదుప
రానిమచ్చ లిస్లామున; కీ నికృష్ట, కృత్యములు మానవతకె దుష్కీర్తిదములు. 27

గీ. ఇచటిముస్లిము లందఱు హిందువులకు, దిక్కుగా నిల్చి శాంతి సంధింపవలయుఁ
జెన్నఁటుల నేతియేతి శిక్షించుపట్లఁ, బ్రభుతనెఱపువారికి సాయపడుట వలయు. 28

క. చీఁకటి యడంగి వెన్నెల, రాక పొసఁగుభంగి వంగరాష్ట్రమునందున్
రేకెత్తినపగ రూపతి, యాకల్పస్థిరసుహృత్త యగునని తలంతున్. 29

వ. మఱునాఁడు మహాత్ముఁడు నౌకాళీమండలమునం దడుగుమోపి మునుముందు 'గోపైర్ బా' గను జనపదమ్మునకు వచ్చె - ఇచ్చటికరణ మొకసంపన్న హిందువు - ఈ గణకు నింట నిరువదిముప్వురుప్రజ లుండ నిద్దఱందప్పఁ దక్కెల్లరం బ్రల్లదులు చంపి గుట్టవైచి కాల్చిరి - ఈకట్టిఁడిపని కావించిన క్రించుల కొక పట్టభద్రుఁడు నేత - వీనిచదు వేమయ్యె నని యయ్యవగచి నాఁటిరేయికి శరణార్థిశిబిరమున్న 'దత్తపారా' చేరి విపన్ను లకష్టసుఖము లరసి మఱుసటినాఁటి ప్రార్థనాసమావేశమునం దిట్లనియె(10-11) 30

ఆ. పరుసవేదికంటె బలిత మీశ్వరనామ, మది జపించునెడఁద నంటుకొన్న
కసటునెల్లఁ గడిగి కరుణ కాదెందము, నిక్కఁ జేయు ననుట నిక్కువమ్ము. 31

గీ. ఓముసల్మానులార! మున్మున్న కరణి, హిందువులు క్రైస్తవులునుమీయిరుగుపొరుగు
వారుగా వసియించుట మీరువలతు, రా?వచింపుఁడు హృదయముల్ త్రచ్చి త్రచ్చి. 32

గీ. ఏను హిందువులకు ముసల్మానులకును, జంటుగా బాంధవుండుగా బ్రదుకుచుండు
నస్మదీయోద్యమమ్ముల కండయైన, ముస్లిములు పెక్కు రీదేశమునను గలరు. 33

క. దుండగములతో నిమ్మహి, రెండై మీగాఙ్య మవతరింపదు; పగ చేఁ
బండినను మీయభీష్టము, పండదు మీకపుడు శాంతి పండదు యశమున్. 34

గీ. హిందువులతోడియునికి మే మిచ్చగింప, మందురా చెప్పుఁ డామాట నఱుకుమాని
నేఁడె వంగధరిత్రిని వీడి వీరు, చనెద రేమూలకో కుండ చట్టి పూని. 35

గీ. వెఱచువారికి సత్రముల్ విస్తరించి, యెన్నినాళ్లు సర్కారువా రన్నమిడుదు
రిడిన నది వీరి కేమిల గ్గమివాసి? యెవ్వ రీహేయజీవన మియ్యకొంద్రు? 36

గీ. ఏల వీరికి రాచవా రిడెడితిండి, యేల వీరికి నేలువా రిచ్చు రక్ష
యర్థిమై మీరె వీరల నాదుకొనుఁడు, నిర్భయుల నాచరింపుఁడు నెమ్మినింపి. 37

క. మీతల్లుల మీ యనుజల, నేతెఱఁగునఁ జూతు రట్లు యీ దీనజనుల్ -
మాతలఁ జెలియండ్రను గనుఁ, డాతంకము వీడి తెల్పుఁడా! మీతలఁపున్. 38

క. మీ తెల్పిననుడికిం దగు, రీతిన్ వివరింతు హితము రే పీప్రజకున్;
జేతస్సునకుం దొలఁగని, చేఁతకుఁ బల్కునకు నిచ్చసేయుదు రార్యుల్. 39

వ. బాపూ నేఁడు మిగుల నీరసించి ప్రార్థనాస్థలమునకు నడువలేక దోలి నాశ్రయించి వచ్చి హీనస్వరంబునఁ దనయార్తి నిట్లు చాటం గొలువువా రందఱు సాశ్రునయనులై దురటిల్లిరి - మఱునాఁడు (11-11) మహాత్ముఁడు వెదలి మూఁడుపల్లెలు పరికించె - అం దొకదాన నొక్కయింటన యెనమండ్రం బ్రల్లదులు వధియించిరి - గేములన్నియు బూడిదగుట్టలు గావించిరి - ఆకుఁదోఁటలు చెఱిచిరి - చిక్కినవారి నిస్లామునం జేర్చిరి - వేఱొకదాన నాచార్యుం దడుగుమోపినంతన కుర్కురమొండు తత్సన్నికర్షమునకు వచ్చుచుంబోవుచు నేదో మూఁగబాస వెలవరించుచుండ శాంతిసైనికులు దానిం బదరి తోలం దొడఁగిరి - బాపూ వారి నాఁపి వేఁపివెంటం జన నొక్కచో దాని యేలికపీనుగుతో బెరసి యేదుశవమ్ము లుండె - సారమేయము తెల్వికి విశ్వాసమునకు నప్డు దందఱు నచ్చెరుపడి మఱొక్కయూరికిం జనిరి - గుండగొయ్యి లందరిగుడిసెలు నూఱు నీఱుచేసిరి - గుడిలోని విగ్రహముల వ్రక్కలించి వీధికి విసరిరి - మహాత్ముఁ డీరక్కసపనులకుం బెద్దనిర్వేదించి మనశ్శాంతికై భగవద్గీతి నాలాపించె-పదంపడి యాయయ్య యయ్యాయి గ్రామములం గని వానికుడిచిన యిడుమలకు నిట్టూర్చి కదలి (14-11) కజిర్ఖి ల్లను పల్లియన్విడిసి ప్రార్థనసదస్సునం దిట్లనియె. 40

గీ. ప్రకృతిలో శాంతి యున్నను బ్రజమొగానఁ, గానరామిని గన్నీరు కార్తుఁ గాని
యెరులకన్నీరు తుడువలేకుంటి నేను, వడిసె నక్కట! మద్బాష్పవారికూడ. 41

ఆ. అశ్రువింకుఁగాక యగ్నిగోళంబుగా, నెరియు నస్మదీయహృదయకోశ,
మెన్నఁడే నెఱుంగ నిట్టిమతద్వేష, మిట్టిహింస యిట్టి చెట్టతాఁకు. 42

ఆ. నన్ను నివి నలంచినవి కాని రిత్తగా, వదలువాఁడఁ గాను వంగభూమి
నానిఘంటువందు నైరాశ్య మనుమాట, కానరాదు వేయికనులఁ గనిన. 43

మధ్యా. ఇచట ముస్లిములు హిందువులకుత్తుక లెన్నేని కోయ
నచట బీహారునహిందువు లణఁచి రదరి ముస్లిముల
నుచితమ్ముగాని చేఁతకు నిరుగడవా రొగ్గిననాఁడు
పచరింపరా దేరు సల్పిరి పెనుపాపం బనుచర్చ. 44

గీ. అది నిరర్థపరామర్శ మగును మాఱు, చేఁత తెఱఁ గెవ్వరైన నా చెంత నేర్వ
వలయు నపకారి కుపకృతిసలువుటయ జ, యమ్ము గూర్చు ప్రతీకార మని వచింతు.45

## కుమారి అమ్తుస్సలామ్ - మతమైత్రికిఁ జేసిన సేవ

వ. కజిర్ఖిల్లున కనతిదూరమున డాన్ఘరియా యనుకుప్పము కలదు - మహాత్ముఁ డాతావునకుం బోవ నిర్ణయించుకొనుడు నప్పొకకుమున్న తత్పరివారమునం గల మహమ్మదీయకన్య 'యమ్తుస్సలా' మాయూరికరిగి యిస్లామునకులాగిన హిందూవనితల నందఱ మఱల వారిమతమునం జేర్చి యమ్మగువలతో రామనామ సంకీర్తన మొనర్చుచు నెదురువచ్చి యొజ్జకు స్వాగతసత్కారములు గావించె - ఈ దృశ్యమతిరమణీయము - మహాత్ముఁ డచటం బల్కినప్రేమసందేశము నాకర్ణించిన ముస్లిము"లయ్యా! మీహితము శిరోధార్యము - కాని ముస్లింలీగువారి యనుమతిలేక మేమీనుడులం బాటింపఁజాలము - నావుడు జాతిపిత వెన్వెంటన నాఁటిపత్రికనువిచ్చి మహమ్మదీయులయవగడములం దెగడుచు జిన్నావ్రాసిన వాక్యములఁజూప నమ్మలకలు సెబాసని తనిసిరి - పదంపడి బాపూ బాధితులయు బాధకులయు నుల్లముల నిర్భయత యేర్పడవలయు నని, భీరుత్వము సర్వానర్థమూలమని వక్కాణించె - వెండియు మహాత్ముఁ డపు దర్ధోపవాస దీక్షం జేసి మిగుల వేసరుచుండియు నాతతాయులతీరు చక్కంబడ మిక్కుటముగా నారటంపడ సాగె - ఇది యిట్లుండ దుండగులు సర్వదా గాంధి మీదండనుండఁడని హిందువుల జంకింపఁదొడఁగిరి - దొరతనమువారు పోలీసులసంఖ్య తగ్గింపఁబూనిరి - ఎండలు ముదిరి కాల్వనీరు లంకలుదిగి పడవ లాఁగినచోఁ బాతిపోవుటెట్లని యల్పసంఖ్యాకు లల్లాడుచుండిరి - సుహ్రవర్ది యిట్టితఱి(19-11) వచ్చి మహాత్మునిజూచి మతమైత్రి నావహించి పునరావాసకార్యక్రమము నడుపుట మనకర్తవ్య మనుటయు46

మం. తనకోర్కియు నిదే కదా యని యొజ్జ, సమ్మదంబునఁ బల్కె సచివవరేణ్యా!
యొకముస్లి మొకహిందు వూరూర మనకు, వలయు శాంతికిఁ బూఁటవడునట్టివారు
హిందువు నేఁ జూతు నీవు ముస్లిమును, జూడుమా యన నవ్వె సుహ్రావర్ది యిట
నుందుమహమ్మదీయులు సర్వజనులు, హూచీపదరె హిందువులభయం బుడుప
వేఱుగా నొక్కని వెదకు ట దేల, బాపుజీ! యన నిట్టిపని యెల్లవారి
తలలపై నిల్పుట దండుగుమారి, పని గాన నామాట పాటించి త్రచ్చి
యి మ్మోరికొక్కరు నేఁగోరినట్టి, ముస్లిము నని మహాత్ముఁడు నొక్కిపల్క
దిగ్గన సుహ్రావర్దీ కొయ్యపాఱె. 47

వ. మహాత్మునినౌకాళీయాత్రలీగుపెద్దల కిష్టముగానిచేఁత - వా రాయయ్యకుఁ దోడ్పడ
వలదని ప్రాగ్వంగమునంగల మహమ్మదీయప్రముఖులకు వార్తలంపిరి - ఈయాత్ర
ననుమతించిన సుహ్రావర్దీ మంత్రివర్గ మీప్రబుద్ధులచే నిందితమాయె - కావుటంజేసి
నేఁడు సుహ్రావర్దీ కిట్టితికమక వొడమె - మహాత్ముఁ డీతనియవస్థం గని 48

## బాపూ తన దళముం జీల్చి తాను శ్రీరామపురికేగుట

ఆ. బాధలెట్టివైన భరియించి హైందవ, ప్రజలఁ గ్రుంగదీయుభయము నణఁపఁ
బల్లెపల్లె కొక్క బంటును బంపఁగాఁ, దలఁచె వెంటనున్నదళముఁ జీల్చి. 49

వ. తన యనుచరుల కీతలఁపుం దెలిపి 50

గీ. ఒంటిమై సేవగావింప నోడువారు, మల్క నా నల్కకుంజిక్కి మండువారు
చెల్ల రీజన్నమునకు, వా రిల్లుసేరు, టొప్పుననె నొజ్జ మొగమోట ముజ్జగించి. 51

వ. మఱియు నాయయ్య 52

మధ్యా. ఏకాకినై పైన మేను సాగింతు నీ మండలమున
నాకుం బ్రజలె తోడుఁగాగఁ జెల్లింతు నాసేవ నిచట
నీకొన్నముస్లిమునింట నిల్తుఁ దా నిడినయన్నంబు
స్వీకరింతును రాముకరుణ నార్జించి చేకొందు గెలుపు. 53

మధ్యా. ఈనాదు మానినుల్ కుదుచునవమతు లెఱుఁగుదు నిచట
దీనలై యనదలై వీరు వగతురు దిక్కులు వ్రీల
నేనును మీరు కొందఱు సమసినంత నీనెలంతలకుఁ
బ్రాణము లావంత జంకక విదుచుబలిమి రావచ్చు. 54

గీ. అపుడు ధూర్తులకును వివేకాదు లొదవి, కట్టిఁడితనమ్ముదెస రోఁత పుట్టవచ్చు
నచ్చమైనయహింస గెల్పందదేని, ధాత్రి నానాఁడు హిందూమతంబ లేదు. 55

వ. నాయహింసకు నేఁ దగ్నిపరీక్ష తారసిల్లె - నేనిందు బ్రదికిబయల్పడుట పునర్జన్మ మెత్తుటయ - అని తనవారి కెఱుకచేసి బలఁగము న్విడఁడీసి (20-11) నిర్మలకుమార బో సనువాదకర్తగా వేఱొక్కరుఁడు సంక్షిప్తలేఖకుఁడుగా వెంటనడువ శ్రీరామపురమునకుం గదలుదు దళమువారు వైష్ణవగీతము పాడి యశ్రుపూర్ణ నయనమ్ముల నాచార్యుకడ సెలవునందిరి - రాజేంద్రుఁ డావేళకు బీహారుతీరు చక్కంబడినదనియు దీనికై మీపూనిన సగనిట్టు మానుఁడనియు నయ్యకుఁ దంత్రీ వార్తనంపనిది భగవత్ప్రసాదముగా సరియైన తఱికి వచ్చినది-ఇఁక మృత్యుభయము సున్న-అని మహాత్ముం డలరి మూఁడుగంటల నడకతో గమ్యస్థలమునుజేరి నిజసేవసేయుచున్న యాభాగాంధినిసైతము ధక్కరుబాబా చెంత కనిపి వంట మున్నగు తనపనులు తాన కావించుకొనుచుఁ గఠోరదీక్షమై నిలిచె - అంత **56**

## కొందఱు ముస్లిములతలంపులో శుభపరిణామము

మధ్యా. శ్రీరామపురము చెంతఁ గలపల్లెల జీవించు ప్రజలు
బారులుబారులై వచ్చి భక్తిమై బాపును జూచి
పేరెలమిన్ జనుచుండ నం దొక పెద్దముస్లిమును
జేరి మీహృదయాల నీఁగ నేగుదెంచితి ననెగాంధి. **57**

గీ. పాప మావృద్ధు సిగ్గునఁబడి మహాత్మ!, యిచట ననరాని వినరాని హింస జరిగె
నిచట హిందువు లల్లాడి రిచట దిక్కు! లేనిదై ధర్మదేవత గ్లాని గుడిచె. **58**

గీ. ఎంతవల్లడి పుట్టిన నేమిసేయఁ, జాలుదురు దుర్బలులు నన్నుఁబోలువారు
విధి తలంచిన చేఁత నిర్విఘ్న మగుచు, నెరసినది దైవ మవిలంఘనీయముకద. **59**

వ. అనుటయు మహాత్ముం డాముదుకని కిట్లనియె. **60**

మధ్యా. ఔ నౌను విధి యనివార్యమనుపల్కు నంగీకరింతుఁ
గాని పురుషుండు కర్తవ్యమును మానఁగా దెన్నఁటికిని **61**
మే నెంతనలఁగియున్నను ముదిమిగ్రేఁగు మేరదప్పినను
నే నేలవచ్చితి నిచ్చటికి ధర్మనిష్ఠను గాక. **62**

ఆ. ధర్మనిష్ఠ మాని దైవమ్ముశిరముపై, సర్వభరము నిల్పఁజనదు నరుఁడు
నిల్పువాఁడు ధారణికి భార మిహపర, సుఖము లందఁ దట్టి సోముగాఁడు. **63**

వ. అంత నొకమౌల్వీ వచ్చి రేపు మాయాతిథ్యము నంగీకరింపవలయునని వినమ్రతమై నొజ్జ నర్థింప నాయయ్య వల్లెయని తత్పరిణామమున కుబ్బి యది భగవత్కారుణ్యమని నమ్మె - పదంపడి సాగిన ప్రార్థనసభకు వచ్చిన హిందువుల నుద్దేశించి జాతిపిత యిట్లనియె. **64**

మధ్యా. ఆపన్నహైందవులార! ధైర్యము నవధరింపుఁడు; వ్య
థా పొక్కకుఁడు; నాకు బ్రా పని తలంచి యేకాకి
నై పరమేశ్వరు నమ్మి నేఁ డిట కరుదెంచినాఁడ
మీపీడ తొలఁగునందాఁక నిల్తు నిమ్మేదినియందు. 65

గీ. కాఱుఁజీఁకట్లలో దారిగాన కేను, గదునలంగుచున్నాఁడను గాని డిగులు
పడక జంకక ముందటి కడుగువైతు, నెల్లకాలము కష్టము లెదురలేవు. 66

మం. గురుఁ డిమ్మెయిన్ భయాకులచిత్తులైన, హిందువులకు ధృతి నిడుచు దుండగులు
కావించినట్టి యాగడములు కనుచు, వినుచు నారోగ్యంపువెలితి పాటింప
కెల్లభూములనుండి యే తెంచుకమ్మ, లకు మాఱువ్రాయుచు లావఱి కుందు
తెగులుగొంట్లకుఁ బ్రకృతిచికిత్స సేయు, చాయూర నివసించునట్టి ముస్లిముల
నిరువంకప్రజలకు నితఁడు మానవుఁడు, కాఁడు దేవుఁడు పంపఁగా జగత్తునకు
వచ్చినదూత తత్త్వజ్ఞశేఖరుఁడు, వెజ్జులతలకట్టు వీనికెల్ తగిలి
నంతన రోగమ్ము లడఁగు నీసాధు, వాడినదే పాడి యనుబుద్ధి వొడమె. 67

వ. అంత హిందువులు సూచించినముస్లిములును ముస్లిములు పేర్కొన్న హిందువులును సమసంఖ్య నుండునట్లేలుబడివారు శాంతిసంఘముల నూరూర నెలకొల్పిరి - ఇవి వెఱచఱచిపఱచిన ప్రజకు ధైర్యము నొదవించుట శిబిరములవీడి వచ్చినవారికి వలయు సౌకర్యము లాపాదించుట దుండగీఁడ్ర పట్టికలు తేల్చి వారి నధికారులు దండించునట్లు చూచుట నష్టపడిన గృహాదుల లెక్కలు సంపాదించుట మున్నగు మేలిపనులు కావించు - వీనికి బాపూ శుభముపల్కె - అదియట్లుండె. 68

క. నౌకాళీదారుణకథ, లాకర్ణించినప్రజాళి యార్తి యుఁ గృపయున్
రేకెత్త బాధితులకున్, నైకవిధులఁ దోడుపా టొనర్పఁ గడంగెన్. 69

వ. పాంచాలరాష్ట్రమునుండి మహమ్మదీయశాఖకుఁ జెందిన ముస్లిము లియ్యెడ నైదు వేలరూపాయల నంపుచు నిట్లొకలేఖ వ్రాసిరి. 70

ఆ. "కులమతాదు లెంచ కలజడిపాలైన, జనుల కూడిగమ్ము సలుప నిచ్చ
లెదురుసూచుచుండు రిస్లాముధర్మము, నాశ్రయించి బ్రదుకునట్టివారు." 71

వ. అస్సామునుండి కొందఱుదాతలు విత్తముతోపాటు కుంకుము వనిచిరి - సూదిగములు పుచ్చిరి-వీరిలో ముస్లిములుపెక్కు - రుంటయగాక యొకయాంగ్లేయుఁడుం గలఁడు - మహాత్ముఁ డీవదాన్యత కలరె - కాని శరణార్థులందఱు నిట్టిసొమ్ముదిని సోమరులు కారాదనియు శక్తిమంతులు శ్రమించి బ్రదుకవలయుననియు వారికి దొరతనమువారు పని చూపవలయుననియు భావింపఁ దొడఁగె - మఱియు నాఁడు నౌకాళీమండలమున

ముప్పదిసేవాసంఘము, లాఱు చికిత్సాదళము లార్తుల కండగా నిలిచె-ఇవిగాక పల్లె కొకఁడు జీలి సాహాయ్యకార్యక్రమము సాగించువారిరువంద్రు కలరు - వీరి యుప చారములం బ్రజలు తెప్పిఱుచుండ బాపూ దీనింగని 72

క. తనకార్యకర్తృమండలి, యణుమాత్రయు జంకులేనియనువున సత్య
ప్రణయమున నహింసనమున, నణఁకువ నూడిగ మొనర్పనగు నని చాటెన్. 73

మం. నాఁ డెందటెందటో నౌకాళిసీమ, భవదీయనాయకత్వమున విపన్ను
సేవింతు మానతిసేయవే యనుచు, నయ్యకు విజ్ఞప్తులంపిరి గాని
భగవంతునెడ గాఢభక్తి లేనట్టి, యాత్మ విశ్వాస మన్నది నేర్వనట్టి
మూఁకయేటికి దీన ముప్పులువచ్చు, నని మానసించి ము న్నలసుభాస్చంద్రు
దళమునఁ బేర్గన్నదంటను సిక్కు, బిరుదును మతకులభేదంబు లుఱని
సాధుశీలుని నిరంజనసింగు నొకని, రమ్మనె సానుచరమ్ముగా నొజ్జ. 74

వ. స్వతంత్రహిందూవాహినిం బనిచేసినజీవనసిం గింతకుమున్నె మహాత్ముని యనుమతిం బడసి తన బలఁగమ్ముతో వచ్చి శరణార్థులకు నూడిగ మొనర్చుచుండె - సుభా సాంగిలేయులకు లొంగునాఁ దహింసావ్రతం బవధరించి బాపూనాయకత్వమున భారత మహీ ముక్తికై శ్రమింపుఁడని తన సైనికులకు హితమ్ము గఱపుటం జేసి నేఁడు వీరిట్లు నౌకాళీ మండలమున మహాత్మున కండగానిల్చిరి - వీరిదళములలో హిందువులు ముస్లిములు సిక్కులు క్రైస్తవులు గలరు - వీరు కాంగ్రెసు కోశమునుండి వీసమేనిముట్టక హిందూ మహమ్మదీయు లార్తసేవానిధి కొసంగు సొమ్ముతోడన తమదినవెచ్చము నవరించుకొను చుండిరి- నిష్కళంకుల కేతాదృశులకు వలయుకర్తవ్యములు నిర్ణ యించుచు నహింసా యోద్ధ శ్రీరామపురమునం దాఱువారములు గడిపి ప్రజా హృదయములం గరఁచె - మఱియు 75

ఆ. వీధినేగు యోగివిభునకు ముస్లిము, లిండ్లు వీడివచ్చి పం ద్లొసంగి
వినతులై రితండు విశ్వబాంధవుఁ డని, విశ్వసించి రెదఁద నిశ్వసించి. 76

ఆ. ఇతఁడు సత్యమూర్తి యితఁడు ప్రేమతపస్వి, యితఁడు పుణ్యపురుషుఁ డితఁడునిల్చు
నెడ వదంకు మోహ, మెరియు మచ్చర మని, యుగ్గడించె హైందవోత్కరంబు. 77

వ. ఒకనాడు (4-12) ప్రార్థనసభకుం బరిసరగ్రామములవలన నైదాఱువందలమంది స్త్రీ పురుషులు రామనామసంకీర్తనము గావించుచుం జేర బాపూ వారితీరుం గని 78

మధ్యా. ఇది భక్తియో ప్రదర్శనమొ యనునూహ మెసఁగఁ జిల్కవలె
మదిమది నుండి రాముని నుతించినమాత్రాన లెస్స
యెదియు రా దలజడిం జిక్కి యార్తిమైనీశ్వరు వేఁడ
నదరి పర్వెత్తును బ్రాణి నుడికించునాపద లనియె. 79

మం. ఆనాఁడు పేరందినట్టిపత్రికలు, బాపుజీనౌఖలీపదయాత్రకతనఁ
బ్రజలకు నాత్మవిశ్వాస మేర్పడియె, నాత్మబలం బెచ్చె నణఁగె భయంబు
మతవైరములు మటుమాయమై చనియెఁ, బలువలతలఁపులోఁ బరిణామ మొదవె
వాదవాదకు శాంతి వచ్చె నటంచుఁ, బెక్కురీతుల జాతిపితను గీర్తింప
నాయయ్యపొంగక యణఁకువ మెఱసె, మెచ్చె నహింస నా్రమేడితఫణితి. 80

వ. మహాత్ముఁడు తా నొంటిమై నుంట వలచె - కాని యీాతలంపు ఫలింపదాయె - రాక పోకల కానుకూల్యములేని మాఱుమూలపల్లియ నొక చిన్న కుటీరమున బాపూ నేఁడు కాఁపురించుచున్న నేమి - సమస్తభారతమున కాపల్లె మహాతీర్థమై వెలసె - విదేశీయులు సైత మాతావునకువచ్చి మహాత్ముని సందర్శించి తమరాజనైతిక సంశయము లాయయ్యకు వినిచి పరిష్కారమార్గములు తెలిసికొనుచుండిరి - హింస నాశ్రయించిన దేశమున కాత్మవినాశము తప్పదనియు హింసను బ్రేమంజేసి జయింపవలయుననియు బాపూ వారికి నుడువందొడఁగె. 81

సీ. అది క్రిస్టమసుపర్వ మతిసమీపమ్మునఁ గలకాల మగుట నగ్గలముగా ను
పాయనమ్ములు వచ్చిపడుచుండె గురుచెంత, సకలప్రపంచ దేశములనుండి;
వలువల తినుబండములవోనికట్నము, లనుచరులకు జాతిజనకుఁ డిడుచు
సిగరెట్లకాన్క దాఁచెను దన్నుఁజూడరా, నున్నపండితుఁడు నెహ్రూ కొసంగ
ఆ. బైబిలొక్కనాఁటిబహుమతులందు రా, నొజ్జ పొంగి ప్రేమ విజ్జునట్లు
సేయుకృతుల దీనికే యగ్రతాంబూల, మబ్బు ననె నుదారతాబ్ధి యగుచు. 82

ఆ. నరున కేగుణాలు కొరవడినను విల్వ, పెద్దచెడదు గాని ప్రేమలేని,
కరుణలేని, దాన పరతంత్ర మతిలేని, పూఁట నతఁడు గవ్వఁబోలఁ డనియె. 83

వ. నేఁ డయ్య విడిసిన శ్రీరామపురమున కనతిదూరమునం గల 'మధుపురము'న భారతవైద్య సంఘమువా రొకచికిత్సాశిబిరము నేర్పఱిచి రుగ్ణసేవ కావింపనెంచి దానిం దెఱవ బాపూజీ నాహ్వానింప నీశ్వరునిమించిన వైద్యుఁడు లేఁడని, మానవుఁడతనిమఱచి యతని సృష్టించిన ప్రకృతినిధిక్కరించి మానసికశారీరకరుజల ననుభవించుచున్నాఁడని యగదం కారు లొడలిచీడలకువినా యెడఁదతెగుళ్లకుఁ జికిత్స సేయరని యాత్మ దిగజాఱుచున్నతఱి మే నెన్నిమందులుమేపినం గోలుకొనదని నేఁడీసీమంగల పెద్దనొవ్వి భయంబని భగవ ద్విశ్వాసముతో నహింసాబద్ధమగు ధృతితోఁ దక్క నితరోపాయముల నీమానసిక వ్యాధి యడఁగదని వెజ్జు లీచూ పలవరించికొనినఁగాని లోకశ్రేయ మావహిల్లదనియు మహాత్ముఁ డాప్రారం భోత్సవ సభం బల్కి భిషక్కులకన్ను తెఱచె - హిందూవైద్యులసాయ మొల్లని ముస్లిము లట నుంట విని వారియజ్ఞతం దవ్వుగావించె - దేశీయవైద్య మాదరణీయ మనియె - మఱియు. 84

ఆ. గురుఁడు వేఁడికోలుకొలువుల నపు డాడు, నుడులు ధర్మువునకు విడువరాని
చుట్ట లగుచుఁ బ్రజలఁ జుట్టినయజ్ఞాన, తిమిరమునకు భానుదీప్తులయ్యె 85

వ. వానం గతిపయోక్తు లిట నావిష్కరింతు. 86

## ప్రార్థనసభలలో బాపూ పల్కిన సూక్తులు

మం. ఓడ కాత్మత్యాగ మొనరింపఁజాలు, నరుఁ డూరికొక్కఁ డున్నను లోటురాదు
దుందగంబు నహింసతో నడ్డి యాత్మ, బలిదానమొనరించు ప్రాజ్ఞుండు రిపులఁ
గరఁగించి శాంతికి గారణంబగు, ఈశ్వరుం దన సత్యమే! కాని భక్తుఁ
దేమూర్తి నీశున కిచ్చునో వేల్పు, తన్మూర్తి నతనికి దర్శనమిచ్చు
ఎచటనో లేఁడు వే ల్పెదయంద కలఁడు, వెలుపల నీశ్వరు వెదకఁడు జ్ఞాని
భగవదంకితమైనబ్రదు కేని దతని, ప్రార్థనమే జగత్ప్రభుఁ దాలకించు
భౌతికం బగుశక్తి పసతగ్గినపుడు, గర్వంబు సర్వంబు కదచన్నయపుడు
ప్రాణి నోదార్చి కాపాడుఁ బ్రార్థనము, వే ల్పొకఁడేసుఁడీ వేవురు లేరు
సర్వమతమ్ములసార మొక్కటియ, ఒక ద్రుమాన శతశాఖ లుదయించుకరణి
నొకమతమ్మున నెన్ని యో పాయ లొదవె, ధూర్తులౌ కొందఱుతురకల కతన
నణఁగిన దిస్లాముయశ మొకకొంత, ముష్కరుల్ మతయుద్ధములు రెండు పన్ని
క్రైస్తవధర్మంపుగరిమకు మచ్చ, దెచ్చిరి పాశ్చాత్యదేశాలవారు
అంటరానితనంబు నంగీకరించి, హిందువుల్ తమపాడి కిదిరి కలంక
భారతోర్వికిఁ బల్లె ప్రాణంబు గాన, నవని కూడిగము సేయఁదలంచువారు
చనవలెనటకు, నచ్చటఁ బేరుకొన్న, యజ్ఞానము నడంప నామయం బుడుప
బాటచిక్కులు దీర్ప బడలఁగావలయు. 87

వ. అదియట్లుండె-మహాత్మునాంతరంగిక కార్యదర్శిగా విద్వన్మణి ప్యారీలాలు పనిచేయు-బాపూ శ్రీరామపురమునకు వచ్చుతఱి నితఁడు తనవంతుపల్లెకు జేరకమున్న జ్వరము నకుఁ జిక్కి కజిర్ఖల్లున మంచముపట్టె - సేవాకేంద్రమునకు దాని కధిపతిగా నున్న చారుచౌదరి యాచార్యున కీవార్తఁదెల్పుచుఁ జికిత్సానిపుణయుఁ బ్యారీ లాలుసోదరియు నగుసుశీల నిటకుఁ బంపగోరెద నని యాకమ్మయందు వ్రాసె - జబ్బుపడుటయు నొకనేరమ యని విశ్వసించుమహాత్ముఁడపుడిట్లుప్రత్యుత్తర మంపె 88

క. విజయము వీరస్వర్గము, గజిబిజిలే కొక్కరీతిగా నెంచవలెన్
రుజ కదలువార లార్త, ప్రజలను సేవింపఁగా నపాత్రులుచుమ్మా! 89

ఆ. జబ్బు వచ్చినపుడు జనపదమునఁ జిక్కు, మందుతోఁ బ్రసాద మందవలయు
నొండెఁ బ్రకృతిసాయ మొందవలయు నొండెఁ, జావవలయు లోకసేవకుండు. 90

ఆ. గాంధిబలఁగమందుఁ గలవారిరోగాల, నణఁచుటకు సుశీల నంపరాదు
వంగభూమియందు వనరు గ్రామీణుల, నుద్ధరించుటకె నియుక్త యామె. 91

వ. ప్యారీలాలు కోలుకొన్న వెనుక నాకదకు నేతెంచునేని "చేయుము-లేదా-చావు" మను
మాటకుం గల యర్థమును లెస్సవివరింతు. 92

మధ్యా. వేఁకి నొదలు మఱచి పడియున్న లాల్ వెతఁ జూచి నిలువ
లేక చౌదరి గాంధిపాలి కనిచినలేకకు నొజ్ఞ
యాకరణిని మాఱుపల్క సిగ్గిల్లి రెల్ల సేవకులు
లోకసేవ కఠోరధర్మ మన్న యాలోచనం బడిరి. 93

మధ్యా. పదపడి రోగవిముక్తి  నల్లల్ల పడసి వృత్తాంత
మిది విన్నలాల్ నవ్వుకొని గురుఁ జూడ నేగి రేపాడి
పదయాత్ర సాగించుచున్న యాపన్న బాంధవుఁ గడిసి
యెద పొంగఁగా వందన మిడి యాయయ్య నెయిదుచునుండ. 94

మధ్యా. దారిలో సన్ననికొయ్యవంతెన తగిలెను - మంచు
నీరు దానం గ్రమ్మి మోపినయడుగు నిలువక సరగ
జాఱుచున్నను గాంధి లాఁతివానిచేసాయముం గొనక
నేరిమిమై నేగుచుంటఁ జూచి లాల్ నివ్వెఱఁ గందె. 95

వ. మహాత్ముఁ డానాఁడు తనమదిం గలఁచుకథల నక్కార్యదర్శి కిట్లు వినిచె. 96

గీ. ఎంతధీరత నేర్పిననేమి యిచటి, ప్రజలు పరువెత్తుచున్నారు భయమువిడక
యేలుబడివారిసేన లిం కెన్నియేని, వలయునని వేఁడుచున్నారు వారిమనుప. 97

ఆ. మనయహింస ప్రజలమది కెక్క దిది యొక, నేర మనుచు వారి నిందసేయ
నెల్లవారు చాల రీదారిత్రొక్కుట, కిది శితాసిధార నేగుటన్న! 98

క. ఐనను బరువంతయు భగ, వానునిపై నునిచి జంకువదలి యహిం సా
ధానమ తగునాశ్రయ మని, యే నీదీనులకు నేర్ప నీకొందు శ్రమన్. 99

ఆ. మందునగ్ని నడుమ నుండితి నీమంట, లణఁగిమణఁగి యిచట హార్ద మొదవి
కలసిమెలసి హిందువులు ముస్లిములు నిల్చు, గడియ వచ్చుదనుకఁ గదల నెటకు. 100

క. ఈయజ్ఞమునం దసువులు, పోయినఁ బోవచ్చుఁగాని పోవలెనని యేఁ
జేయను యత్న; మహింస య, జేయం బనుపార మిలకుఁ జెప్పన చూతున్. 101

ఆ. నాయహింస గెల్చెనా యిట,నది నేను, గన్న గెల్పులందు మిన్నయగును
ఘోరతిమిరవీథిఁ దారాడుచున్నాఁడఁ, గాని వెల్గు చూపఁగలఁడు ప్రభువు. 102

క. ఈకొండను బెకలించి యు, దాకరమునఁ బారవేయు మని ప్రభుఁ దన్నన్
నాకె ట్లిది వశపడు నని, చీకాకుం గుదువఁ దెంపుసేయక నిలువన్. 103

వ. మనీషిసత్తముండగు ప్యారీలా లీవాక్కులు విని తన కర్తవ్యమును లెస్సయెఱిఁగి బాపూసెలవు నంది తనపాలిసేవాక్షేత్రమగు భటియాల్ పూరునకుం జనె - ఇతఁ దాపల్లియకుం జేరిననాఁటిసంజప్రొద్దునఁ జిఱుచట్ట(బనియన్)తో వేఁడికోలు నేలం గూర్చుండ నార్తస్వర మొం డితనిచెవికి వచ్చె - అది దుండగీంద్రకుఁ జిక్కినవారి దని తెలిసినంతన ప్యారీలా లాదెసకుఁ బరువెత్తె - అంతలో నిరులు కవియు దెంచె - ధూర్తుల గాలించువారు వేసమునుబట్టి లాలుసైతము తులువమూఁకవాఁడ యని నమ్మి యతనిం దుదముట్టింపఁ గఱ్ఱలు కత్తు లెత్తిరి - అట్టితఱి దైవవశమునఁ బ్యారీలాలు నెఱిఁగినముస్లిములు సాక్షాత్కరించి కలరూపుందెల్ప బాధితవర్గమువారు పశ్చాత్తప్తులై లాలున కెల్లవగలం దోడ్పడుదుమనిపల్కుచు సిగ్గునంజనిరి - ప్యారీలాలు కావించు నూడిగము భటియాల్ పురమును దత్పరిసరగ్రామముల నెంతయు సవరించుటం జేసి 104

## ఒకమహిళ నవమానించినవానికి వింతశిక్ష

మం. హైందవస్త్రీపురుషావళియందు, ధృతిహెచ్చె దైవభక్తియు ముమ్మరించె
నస్పృశ్యతాపిశాచాహంత సమసెఁ, బ్రిదిలె నానాకుల భేద కుడ్యములు
ఏకపంక్తిని బ్రజ లెల్లరుం గుడుచు, నాచార మేర్పడె నద్భుతసరణిఁ
బ్రజలంద ఱొక్కచో భక్తిమైఁ గూడి, రాముని గీర్తించురహియావహిల్లె
గ్రామంబు లన్నియు గరగరలాయె, నేర్పడె మఱిఁగుదొ డ్లింటికింటికిని
గృతము దలంచి సిగ్గిలిరి ముస్లిములు, శాంతిసంఘమ్ములు సమకూర్పఁబడియెఁ
దప్పొప్పులను దేల్చు తగవరుల్ వెలసి, రొకనాఁడు చెలియోర్తియొంటిమైఁదనదు
పోఁకతోఁటను నిల్వ బుద్ధిలేనట్టి, మలక యొకండు తన్మహిళకు దాసి
యొఱగొడ్డెములు పల్క నువిద వేవేగ, నింటికిఁ జని తండ్రి కీ వార్త దెల్ప
నతఁడు ప్యారీలాలునంద కేతెంచి, వినిపించెఁ దులువ కావించినచెయిది
పదపడి లాలు తత్పాపిని బిలిచి, తమ్ముఁడా! యింతటితప్పు సేయుదు వె
లేరొకో సుతలు చెల్లెండ్రును నీకుఁ, బరకాంత నాత్మజపగిదిఁ దోఁబుట్టు
మాడ్కిఁ జూడనివాఁడు మనుజుఁడా? నీవు, దారికిరానిచోఁ దప్పక నీదు
తెఱఁ గధికృతులకుం దెల్పెద ననియె. 105

ఆ. అపుడు దోసకారి యదలంది నాబుద్ధి, గడ్డిదినియెఁ దిగితిఁ జెడ్డపనికి
నన్ను సైఁపు మింక నెన్నఁడు నొరునొంప; ననుచు లాలుపదము లంటవచ్చె. 106

ఆ. నే నెవండ సైఁప నీచేఁ బరాభూత, యైన చాన సైఁపనగును నిన్ను
నదియు నూరిలోనియతివల సముఖమ్ము, నందు జరుగుటొప్పు ననియె లాలు. 107

క. పంచాయితి పెద్దయు లా, లెంచినపని కిచ్చుగింత యిచ్చెను మహిళా
సంచయమునెదుట శీర్షము, వంచి నిలంబడియెఁ బాపవర్తను దదిరా! 108

వ. అపూర్వమగు నీసభ కిరుగుపొరుగుపల్లెల నుండియు నెందఱోవనితలు వచ్చిరి - ఈ న్యాయస్థానమునఁ బ్యారీలాలుతక్క నితరపురుషు లుండరాదనుకట్టడ కావింపఁ బడియె - క్షమాపణము నర్థించుతఱి తఱియుడు నిందితునకు వదఁకువొదమ లా లది సూచి సభం బాసె-అంత నాయింతు లపరాధిహృదయమున భగవద్భీతి కలుగం దగుపల్కు లాడి గెలుపందిరి - అప్పు దప్పులువ యెలుంగురాల్పాద 109

ఆ. అమ్మలార! దారుణాపరాధము నొన, రించినాఁడ నతివ నొంచినాఁడ
నిష్టమైనశిక్ష నిందు పాపమ్ములు, కడుగుకొండు బ్రదుకుమదుఁగు కొండు. 110

క. నావుదు నింతులు కొందఱు, తీవరపడి రపచితిన్ విధింపఁ; బలువు రే
నోవి మనకేల మల్క లె, కావింతురు తీర్పు ననిరి గఱువలు మెచ్చన్. 111

మం. ముస్లిముల సమజ్యముందర లజ్జ, బరువుతోడుత నిల్వఁబడె నేరఁబోతు
పాపపుణ్యంబులు పరికించి సభ్యు, లితని ని ష్టవమతి నెరియు వెలంది
మెట్లతోఁ గొట్టుట మేలని తీర్చి, రాతీర్పు వలదని రతివలు కరఁగి
యటులైన నవమానహతసహిష్ణుతను, బరిషత్తులోఁ గోరవలయు వీఁ దనిరి
ముమ్మాఱు నేలకు ముక్కును ఱాచి, ప్రకటింపవలయును బరితాప మనిరి
చెచ్చెర నచటన శిక్షలు ముగిసెఁ, గ్రచ్చఱఁ బ్రజలమొగమ్ములు విరిసె. 112

## మహాత్ముని యనుచరుల సేవలు

వ. ప్యారీలాలుంబలె నేఁడు నౌకాళీమండలమున కూడిగముగావించుచు మఱియార్వురు మహాత్మునను చరులు కలరు - అం దొకర్త సుశీలానయ్యరు - ఈమె వైద్యశాస్త్రమునం దాఱితేరినదిట్ట-ఇంకొకర్తి అమ్‌తుస్సలా మను మహమ్మదీయ యువతి - ఈమె బాపూ పెంపుడుకూఁతుగా సేవాగ్రామమున నుండు-వేఱొకతె సుసీలాపాయి - ఈకె విశ్వ విద్యాలయపట్టము వడసి కొన్నాళ్లు మహాత్ముని కార్యదర్శిత్వము నవధరించె - మఱొక్కతుక లలితకళానిపుణ ఆభాగాంధి - ఈ నెలంతమగఁడును బాపూమనుమఁ డు నగు కనూగాంధి యొండొకఁడు - కాఁగా మిగిలినవాఁ డాచార్యుని కార్యాలయమునం బనిసేయుకుఱ్ఱఁడు ప్రభుదాసు - మహాత్ముఁ డీనాఁడు విడిసిన శ్రీరామపురముపజ్జఁ గల చంగీర్‌గా మనుకుప్పము సుశీలానయ్యరు సేవాస్థానము-ఆయూర నత్యాచారము లకు లోనై కుందు కుటుంబ మొకటి యీామె కాతిథ్య మిదుచుండె - తనవైద్యధర్మము నీయమ్మ యెల్లరయెడ నొక్కమైఁబఱపి హిందూమహమ్మదీయుల యుల్లములు కొల్లలాడె - శాంతిసంపాదమున కెంతేనిశ్రమించె - రెండుతడవ లీవెజ్జురాలు చలివేఁకికింజిక్కి

మిక్కిలి నలఁగియుఁ దనవిధిం బాయక పల్లెపల్లెకుం బాయరానిచుట్ట మాయె అమ్తుస్సలాము ముస్లిములహృదయముల నెనలేనిమార్పురావించె - సుశీలాపాయి కర్పారాపురమున విధ్వస్తమైన రాజేంద్రలాల్ చౌదరి భవనము చెంతఁ దనకుటీరము నిర్మించుకొని నారీమండలమునకు వలయుధైర్యసాహసాదులు కఱపుచు రానురాను ముస్లిములకును దీర్పరిగా నాహూత యగుచుండె-అభాగాంధి వంగీయుల యాఁడు బిడ్డ యగుటం జేసి భాషాబాంధవమున నౌ కాళీప్రజల నగ్గలముగా నగ్గపఱుచుకొని భర్తృసాహాయ్యమునఁ బెక్కు తావుల నిర్మాణకార్యక్రమము లారంభించె - ప్రభుదాసు గ్రామసమ్మార్జనమున మునిఁగె - ఇతరకార్యకర్తలలోఁ బ్రథమగణ్యుఁడు థక్కర్‌బాపా - ఇతఁడు పతితజనోద్ధర్త - భారతసేవకసంఘసభ్యుఁడు - ఎనుబది యేండ్లముదుక - ఈయయ్య హరిజనాధిక్యముగల హేమచారునం దునికి నేర్పఱుచుకొని తరుణుఁ డుంబలె నలసటయెఱుంగక నిరంతరసేవాభరము పూనె - ఉత్తమశీలుఁడగుబాపా సమర్పించువార్తలు, లెక్కలు దొరతనమువా రెదురాడక యంగీకరించిరి-కృపలానీసతిసు చేత యాఁడుసింగమువోలెఁ జొరరానితావులకుఁ జొచ్చి యనాథలబాధలఁ దలఁగించె - సుబాసుదళమునం బనిచేసినపోటుబంటు జీవనసింగు ప్రజకు నిర్భయత నేర్పందొరఁ కొనె - ఇఁక సాధనబోసు కావించు నిస్స్వార్థసేవన మిట మఱవరానిది - బోసు త్యాగమూర్తి - పవిత్రతారాశి - చావుబ్రతుకులు మఱచి మతవైరములం ద్రోయ రేయుంబవలు నలఁగినధన్యుఁడు - వంగప్రభుత్వమువా రీసేవామూర్తులఁ గని యచ్చెరు పడి తమసాగించు సాహాయ్య కార్యక్రమమును, దానికి వలయువిత్తమును వీరి కొప్పగించి మంచిపనిచేసితిమని తనిసిరి - కాని యీతనివి పెద్దకాలము నిల్వమి విచార్యము - అదియెట్లన నౌకాళీ మండలమునం దేలుబడివారు నెలకొల్పిన శాంతిసంఘములు రానురాను గర్తవ్య నిష్ఠవదలి జీవచ్ఛవములాయె - వీని నారంభింపవచ్చినమంత్రియుఁ గార్యదర్శియు నాల్గునాళ్ళలో వెనుదిగిరివత్తుమని రాజధానికిం జని (27-11) మాటఁ దప్పిరి - మహాత్ముఁ డియ్యెడం బెద్దవిసిగి సుహ్రావర్దీ కిట్లొకలేఖ నంపె(3-12) **113**

## సుహ్రావర్దీతీరు మహాత్మునిగలంచుట

మం. సచివసత్తమ! శాంతిసంఘము లిచట, నిద్రించుఁ గర్తవ్యనిష్ఠ వోనాడి
ప్రజ వీని విశ్వసింపద యింతదనుకఁ, దక్కువపడదు ధూర్తశ్రేణియుదుటు
వలదని యే నెంతవారించినను జ, నమ్ము పర్వెత్తుచున్నది భీతి గూరి
యపహృతస్త్రీల నీరైరి ప్రల్లదులు, హత్యలు దోఁపిళ్ళు నణఁగారవాయె
స్వచ్ఛందసేవకుల్ సాగించుపనుల, కెటఁ గన్న నడ్డంకు లేర్పడుచున్న
వింతకంటెను దూష్య మెయ్యది యుండు, నింతకంటెను శోచ్య మెయ్యదికలదు. **114**

వ. ఈకమ్మ చేరకమున్న (2-12) శహీదు (సుహ్రావర్దీ)గాంధి కిట్లువ్రాసె. **115**

గీ. బాపుజీ! మతమైత్రికై బదలుచున్న, నిన్ను మెచ్చెదఁ గాని యీనెయ్య మీపు
నిక్కముగ నాసచేయుచో నెమ్మిలేక, వగచుబీహారునకు నేగవలయు నిపుడు. 116

క. నీవారు ముస్లిముల కై, న్నో విధములవెతలు కూర్చుచున్నారఁట గ
ర్వా విష్టసైనికులు గ్రా, మావళి నేద్చింతు రఁట దురాచారములన్. 117

క. చెఱిచిరఁట వీరు ముస్లిమ్, తరుణుల; మౌల్వీలఁబట్టి దంచిరఁట భయం
కరపరిపాలన మిది యవ, సర మని హిందువులు పల్కఁజాగిరఁట కటా! 118

గీ. నీవు నీబంట్లు నౌకాళినేల నున్న, నెన్ని చెట్టలువుట్టునో మున్నుమున్ను;
లేదు నీ వెఱుఁగనిపాడి లేదు నాదు, పల్కు వినుము సమీచీనపథము గనుము. 119

వ. మహాత్ముఁ డీలేఖంగని జగాన్రెగడ కిట్లు మాఱుపల్కె. (5-12) 120

మం. ఇంతకుమున్నె నాయిరవు బిహారు, కాని ప్రాగ్వంగము కా దని నీవ
పలుమఱు పల్కి తాపాఠంబ నేఁడుఁ, జెప్పితివి బిహారుసీమ నాయున్కి
శ్రేయం బనుచు మానసించిననాఁడు, పరులసూచనతోడఁ బనియుండ దేన
చనెద నచ్చోటికిఁ జనెద వేవేగ, నామాట నమ్ము మన్నా! నీదుమాట
లన్నియు నుచితము లని విశ్వసింప, నాసేవ లందెడి నౌకాళిగుఱిచి
యనృతవార్తలు నీకు నందించి రెవరొ. 121

వ. వెండియు నీకమ్మవెనుక(22-12) నొజ్జ యింకొకకమ్మ నిమ్మోయిం బనిచె. 122

గీ. ఏను నౌకాళీలో నుంట నెట్టిచెట్ట, లెగసెనో తేల్పవయ్య! సహేతుకముగ
గూఢచారుల నిల్పి నాగుట్టుమట్టు, తెలిసికొని కన్నదోసంబు తెల్పవయ్య! 123

ఆ. రిపులప్రేమ మాహరించుటయ మదీయ, జీవితాశయమ్ముగా వటించు
నన్ను లెస్సకలఁచినది నీతలంపు నా, తెఱఁగు నింతలోనె మఱచితోటు? 124

వ. పదంపడి(24-12) వేఱొండులేఖ వ్రాయుచు శహీద్సుహ్రావర్ది! దేశబంధు చిత్తరంజనదా సున్న నాఁడు మనము కాంగ్రెసుపనికై ఫరీద్పురమునం గలియుట గుర్తునకుఁదెచ్చి కొనుము - నాఁడు నాప్రోలంగలవారిలో నీవ నిరంతరముగా నూలుదీసితివి - నేను ని న్నపుడు సంబోధించువట్ల నెదియో దూరబంధుత్వమును సూచించువదము నుపయోగించుదు నది తగదని, బిడ్డా! యను మని న న్నీవు కోరితివి - నేఁటికేని నీ వప్పటిశహీదుగా నున్నాఁడవనియ తలంతు - నాకొడుకు వంగరాష్ట్రము నేలుచున్నాఁ దని గర్వింతు - బీహారు నీ వూహించిన ట్లీనాఁడు లేదు - ఉన్నను దానివోలె బంగాళము సైత మార్తింబడుట నీ కానందకరము కాదుకదా! లోకమున కేను వెల్లడింపకున్నను నౌకాళీప్రళయములో నెన్నఁ దగినమార్పు రాలేదని నమ్ముము - దీనిం దొలగింప నొకమంత్రి నప్పసముగా నిట నిల్పుట నీకనిష్టధర్మము - నా నమాత్యసత్తముచిత్త

మించుక మెత్తఁబడె - కాని రాచకార్యములు పెక్కు లనివార్యము లుంటంజేసి నౌకాళి కొకఁ ప్రెగడం బంపఁజాలనని యొజ్జకు (25-12) విన్నవించె - వంగప్రభుత్వముకల్పించు ప్రతిష్టంభమును దీనిం గని యావద్భారత శాంతిసంధాన భారము వహించిన సర్దారు పటేలు కడుంగడుఁ బరితపింపసాగె - మహాత్ముఁ డానాఁ డతని కొకయుత్తరము వ్రాయుచు 125

క. కలఁగకు తాల్మింబాయకు, నిలువవు కలకాల మెవ్వనికినే నిడుమల్
తొలుత నొకదెబ్బదిన్నను, గెలుచును ధర్మంబు, సాదు గెలుచును దుదకున్. 126

క. నాసత్య మహింసయు నెం, తో సున్నితమైనతులను దూఁపంబడు నేఁ;
డీసుగుణమ్ముల జేయము, లేసేగియు వీని కంట దిల తొట్రిలినన్. 127

ఆ. వీనికొఱకు బడలునే నోడవచ్చును, గాని యివి జయంబ కాంచు నెపుడు
నాకు నపజయమ్ము రాకమున్నె సమాప్తి, వచ్చుఁగాక భక్తవరదుకరుణ 128

క. ఇచ్చట నే గెల్చుటయా, చచ్చుటయా తేలవలయుఁ జచ్చినచో నా
వచ్చినపని సాధింపఁగ, నిచ్చుత వేతొకవలంతి నీశ్వరుఁ డిలకున్. 129

వ. అనినం బటేలునకును దదనుయాయులకు నమ్మాట లలజడిఁగూర్చె - అది నూతన రాజ్యంగ నిర్ణేతృపరిషత్తు ఢిల్లీనగరమున నారబ్ధము కావలసిన సమయము - నాఁడు ముస్లింలీగువారు దేశవిభజనము తప్పదని పాకీస్థానము పుట్టినపుడు తన రాజ్యాంగ స్మృతి నది నిర్మించుకొనును గాన నేఁటిపరిషత్తునఁ జేరదని తమవితండవాదమును యథాపూర్వము సాగింపదొరఁకొనిరి - ఇట్టిక్లిష్టకాలమున నొజ్జ హస్తిన నుంట మేలని కాంగ్రెసువారు భావించుచుండ బాపూ నౌకాళీమండలమున నింటింటికిం జని తనప్రేమ సందేశము వినిపింపసిద్ధపడుచుండె - నెహ్రూ కృపలానిమున్నగువా రపుడు శ్రీరామ పురమునకువచ్చి యాచార్యునకు లీగుధోరణితెల్పి దాని నంగీకరించిననాఁ డస్సాము, సరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానము, పాంచాలము దెబ్బతినుట తెల్లమి కావించి యదు గడుగునం బొడము రాజనైతిక సమస్యలఁ బరిష్కరింప ఢిల్లీకిరమ్మని విన్నవింప బాపూ వారికి వలయుహితమ్ముపల్కి యేను నౌకాళిన్ విడువఁజాల ననుడు నగ్గుఱువ లెదురాడలేక నిట్టూర్పుచుం దమ వచ్చినదారిపట్టిరి (30-12-46) - ఆనాఁడ మహాత్ముడు సర్దారున కిట్లొకలేఖ నంపె. 130

మధ్యా. కత్తికిం గత్తియే తగునని ప్రజకుఁ గఱపె దీ వనుచుఁ
జిత్తము యుష్మదీయ మధికారమాసించు నె ప్డనుచు
నిత్తఱి నెందఱో నుడువఁగా వింటి నిది నిక్కమైన
రిత్తకురిత్త యౌనుగద మనము సైరించినవెతలు. 131

మధ్యా. లీగు నూరక దూఱెదవంట, యొకమాట లేదంట యన్ని
తేగము లోర్చి పేర్గన్న కాంగ్రెసుదిట్టలనదుమ,
నేగతికిం బోవునో మనమహి; నేఁ డెటుగన్న నిరులు
మూఁగియున్నవి; సోదరా! యణంకువ మూల మున్నతికి. 132

గీ. తగినచెలికాని మత్సన్నిధానమునకుఁ, బంపి నీమదితీ రెఱిఁగింపవయ్య
రుగ్ణుఁడవు నీవు రాకు; మారోగ్యదృష్టి, నగ్గలముచేసికొమ్ము నీ కగు శుభమ్ము. 133

మం. పదపడి గాంధి యప్పట్టును వీడి, యయ్యాయితావుల కరిగి విపన్న
జనతకు నుడుకువ సంధింపఁదలఁప, నవ్వార్తవిని దిగులంది శ్రీరామ
పురి కూరియూరి కాఁపులువచ్చిగురుని, జూచిపోఁదొడఁగి; రీచూపఱయందు(31-32)
గలరు వందలు వేలుగా ముస్లిములు, మ, హాత్ముని నమ్మరాదని యొక్కనాఁడు
సంశయించినవారు జాతిపితన్ వి, రోధిఁగా భావించి రూక్షవాక్యములు
విసరినవా; రహో! వీరు నేఁడిట్టి, పుణ్యచరిత్రుండు పుట్టఁ డిందనుకఁ
బ్రేమార్ద్రకుఁడు సంభవింపఁ డిందనుక, నితఁ డున్నచో నుండు నీశ్వరుఁ డితఁడు
నిలుచుచోట నహింస నిలుచు, నితండు, కలచోట సత్యంబు కలదు ధర్మంబు
కలదు కలదు, శాంతి కలదు సంపత్తి, కల దెల్లభాగ్యముల్ కలవని యొజ్జ
నగ్గింపసాగి రజ్జా! యనం దొడఁగి, రల సుప్రావర్దియు నపుడ మహాత్ముఁ
డొకవంగమంద కా దుర్వి నెందయిన, గృతకృత్యుఁ డగునని గెల్పొందునని లి
ఖించెఁ బత్రికలకు; గిల్బిషదూరుఁ, డెల్లకాల మణంగునెట్లు? తన్మెచ్చు
ప్రజల కంజలిచేసి బా పవు దేను, సర్వజ్ఞుఁడను గాను సందియంపదక
నాలోపములుదెల్పి నాకు మేల్సేయుఁ, దాత్మశుద్ధికి దయ్యునతనికిఁ దప్పు
లెఱిఁగించువారలే యెన్నఁ గాఁదగిన, యాప్తులు నా రచ్చ నశ్రువుల్ గురిసె. 134

## 1947

గీ. వచ్చె మఱునాఁడు క్రైస్తవవత్సరాది, మెచ్చె జీసస్సు మనుగడమేల్మి నయ్య
పాడెఁ దద్భక్తుఁ డొకరుండు పల్కినట్టి, ప్రేమగీతి సభ్యులహృదుల్ ప్రిదులురీతి 135

మధ్యా. తరువాతినాఁటి వేఁబోక నొజ్జ ప్రార్థన మైనవెనుకఁ
బరిజనం బనుసరింప నుపవాసాదిబాధలకతనఁ
దఱిగినమెయితోడ నధికమైన యాత్మబలంబుతోడ
నరిగెఁ జండీపురంబునకు రామనామాలప్తితోడ. (2-1-47) 136

వ. ఈయాత్రలో నొజ్జకు నిరంతరమగుసేవ గావించుభాగ్యము కుమారిమనూగాంధికి
లభించె - ఈపె గాంధికి వ్రేలువిడిచిన మేనగోడలు - ఈమెకు బంద్రెండవయేఁట

(1940లో) మాతృవియోగము వాటిల్లుడుఁ గస్తూరిబాయి తల్లిగా నేర్పడె - ఆగష్టు విప్లవమునాఁ డీపదునాలుగేండ్లకన్య నాగపురకారాగృహమునఁ గాలముం ద్రోయుచుండ నాగాఖానుభవనమున రుగ్మయై నలఁగుకస్తూరి తనసేవ కీబిడ్డవలయునని కోరుడు నధికారు లీపాప నాయమ్మపజ్జకుఁ బంపిరి - కస్తూరి దివికేగిన దాది మహాత్ముఁడే మనూకుమారికి మాతయై స్నానపానముల తెఱఁ గెఱిఁగించె - ఆహారవిహారములతీరు తెలిపె - ఆరోగ్యసూత్రము లుపదేశించె - చదువుసంధ్యలు బోధించె - కట్టకడకుఁ జీరసింగారించుకొనుజాడయు నేర్పె - అతఁ డెందఱికో తండ్రియయ్యెఁగాని యీపిల్లకే తల్లియయ్యె - ఈపె కారియవాడునం దున్నతఱి నౌకాళీయాత్ర సాగ నాచార్యుండు తీఁగవక్కాణమునంపి యీకూఁతుం దనకుఱంగటికి రావించుకొనియె - మనూకుమారి యీయాత్రం దా నందినయనుభూతుల నిట్లు నుడివెడిని. 137

## బాపూ యాత్రనుగూర్చి మనూగాంధి వివరణము

ఆ. "అంతకార్యభార మవధరించియుఁ దన, కనుదినమ్ము గీత నయ్య కఱపె
లాఁతి కుపకరించుచేఁత యజ్ఞం బనె, రహటవృత్తి యజ్ఞరాజ మనియె. 138

క. జన్నముసేయక యెవ్వం, దన్నము దిను వాఁడు చోరతార్జితధనమున్
దిన్నట్టిపాపి యగు ననె, నున్నది సర్వంబు హరికి నొప్పించు మనెన్. 139

గీ. ఎవఁడు స్వార్థము విడనాఁడు నెవఁడు స్వపర, భేదమును విస్మరించు లభించు నతని
చిత్తమునకుం బ్రసన్నత, చేయు నతఁడు, నిక్కమగుసేవ యని వక్కణించెగురుఁడు. 140

గీ. ఫలముగోరక పెఱవానిబాగుపొంటె, నెవ్వఁడు శ్రమించు నతనికి నించుకేని
హానివుట్టదు భగవానుఁ డహరహమ్ము, వానిమే ల్గోరుననె యోగివల్లభుండు. 141

గీ. బాధితక్షోణియం దొకపల్లెనుండి, యొండుపల్లెకు రేపాడి యొజ్జ వెడలు
గంటలే దైనయంతన కాలినడక, మొదలుపెట్టును హరిగీతములు చెలంగ. 142

గీ. పయనమున రెండునిముసాలపాటి జంపు, పాదమినను సైఁపలేక బాపూ నలంగు
నేన యొకనాఁడు జాగునహేతు వైతి, నోటువోయితి మిగుల నారాటపడియు. 143

వ. మహాత్మునివస్తువులు కొన్ని తాను గఱ్ఱపట్టుదనుక ముదువం గానివి-వానిని సంతరించుటలో నా కానాఁ డైదునిముసములజడ నాయె - అంతట బాపూ నాదెసకుఁ జూఱుకుం జూపులు పఱపుచు నిట్లనియె. 144

క. ఏమిమనూ! గాయకులును, గ్రామీణులు నెంతమందికలరో కను; మీ
వేమఱుట వీరిడెందం, బేమెయిఁ జీ కాకువడునొ యెఱుగుము బేలా! 145

క. ఏ నోర్వఁజాల నిఁక, నా, పైనముసాగింతు నీవు పదపడిర; మ్మి
ట్లే నిత్యము సేయకు నీ, మేనన్ బరుగెత్తుబల్మి మిక్కుట ముంటన్. 146

ఆ. అట్టితలఁపు నింద్య మనవరతమ్ముగా, నియమపాలనమ్ము నెఱపవలయుఁ
దగదు తెప్పపాటుతడవైనఁ; బనిపట్ల, జడత గుండెలోనిశరము నాకు." 147

ఆ. ఊరి కొక్క బంటు నునిచి సేవావిధుల్, తీర్చుచున్న కతన దేశికునకు
హెచ్చెఁ గార్యభార మేను నిర్మలబాబు, తక్క నెవరు కలరు తండ్రిచెంత. 148

వ. మహాత్ముని కార్యాలయమునం దైదాఱుగురు చేయఁదగినంతపని సర్వదాయుండు - నేఁ డీచేఁతనెల్ల బాపూనిర్మలబాబులే కావింపవలసివచ్చె - నిర్మలున కాంగ్ల వంగభాషలు తక్క లాఁతిబాసలు రావు - కాన హిందీ గుజరీ మరాటి మున్నగు నుదులం దీర్పఁ దగినవ్రాఁత లాచార్యునకుం దప్పవు - మఱియుఁ దన్ను సందర్శింప వచ్చినపెద్దలతో మాటాడుటయుఁ బ్రార్థనాప్రసంగములను సరిచూచి పత్రికల కొసంగుటయు నయ్య కనివార్యములు - నిత్యజీవితమున కావశ్యకమగు నుపకరణముల ననుదినమ్మును మూటగట్టుట నావం తైనను మహాత్ముఁ డిందును బాల్గొనువాఁడు - ఈ సామగ్రీ సముదాయమున వంటగిన్నె మొదలు పురీషపాత్రము(కమోడ్) దనుక నొకవందవస్తువు లుండు - ఇవిగాక భగవద్గీత, బైబిలు, కురాన్ షరీపు మున్నగు గ్రంథములకును నెహ్రూ పటేలువంటి కాంగ్రెసునాయకులు పంపిన లేఖలకును గుదురుగా నొక కకపాల కలదు - దీనిసవరింత నాకృత్యంబ యైనను గురుఁ డీచంకసంచి పట్లసైతము శ్రద్ధాళు వగువాడు - నొకాళీయాత్రలో బాపూ పడినపాట్లును గుడిచిననొవ్వియుం దా నొక గఱువకు వ్రాసినయాకమ్మం గనిన నవగతమ్ములగు. 149

క. అన్నా! యిట నేదెసకుం, గన్నను భయదాగ్నిశిఖలు కన్పించెడి, నీ
చెన్నఁటిప్రొద్దుల నేను వి, పన్నులకున్ శాంతిగూర్ప బదలుచునుంటిన్. 150

గీ. ఇచటఁ జిక్కదు సత్య, మహింస దొరక, దణఁగినది ధర్మదేవత యనద యగుచు
నా యహింసకు సత్యమునకుఁ గఠోర, తరపరీక్షావసర మిప్డు తారసిల్లె. 151

ఆ. నలఁగినలఁగి యిందు గెలు పందవలెనని, వచ్చి కూరుచున్న వాఁడ నిచట
నల్లనల్ల భగవదనుకంపకతన ముం, దడుగువైచుచుంటి నార్తమహిని." 152

గీ. ఇంతభారము తల ధరియించి కలఁగు, దేశికుం డెంతతడవు నిద్రింపఁగలదు
కోడికూయకమున్నెపైకొన్న కటికి, చలిని గనువిచ్చి నన్ను మేల్కొలుపుచుండు. 153

ఆ. బాపుపట్ల నెంతభక్తి నాకున్నను, సేవకై తపించుచిత్త మున్న
నపుడు తూఁగువీడి యాసీతువునఁ బని, కొగ్గలేక నలఁగుచుంటి నేను. 154

మం. ఒక్కనాఁ డెగతాళి కోతండ్రి! నీవు, నేఁడు వేకువదాఁక నిదురింతువేని
నను దయంజూచిన నారాయణునకుఁ, గొట్టెద భక్తిమై గొబ్బెరకాయ
ననుదు నెప్పటివేళ కయ్యి నన్ దెలిపి, కోరఁడు వేల్పు నీ కొబ్బెరముక్క
నెఱదాత యతఁడు దీనికి లుబ్ధుఁ డగునె, దీపమ్ము వెలిఁగించి తేవమ్మ! కమ్మ
వ్రాసికోవలె నని వల్క సిగ్గిలితి. 155

వ. సుప్తికిం దొడఁగుతతి బాపూ దీపము నుడిగించువాఁడు-నే నపుడు మహాత్మా! మను మనుభవించు జాముపాటికూర్చున కింతసేయనేల - వర్తి నించుక దిగ జార్చుట చాలదా? - యనుదు నాయయ్యి మంచిప ల్కాడితి - అంతచమురు నాకెవరిత్తురు? నాగడించుసొ మ్మొకరూకయేని లేదుకదా - అదియునుంగాక యాగడ్డ నెందఱో హతులైరి - పెక్కండ్రు బాధితులైరి - పలువురు పరాభూతు లైరి - మన సేవ కీసీమం గొలఁ దిలేదు - కానఁ గాలమును రిత్త వెదలింపరాదు - వీలున్నదనుక మనము నిదురప్రొద్దు తగ్గించుకొని సేవాసమయమును బెనుచు కొనుట లెస్స-ఈమేను తిరముగానిది - దీని నార్తసేవకుం బెద్ద బదలింపవలయు - భక్తి నా నిట్టిసేవయ కాని తులసిపూసలు రుదురక్కలుం గదలించుట కాదు - ఊర్ధ్వపుండ్రాదులు దిద్దుట కాదు - నొసట గీఱు నామములు దీర్చి తోడిమానవునెదం జురకత్తినాటుట జూటుఁదనం బగు - భక్తి నా నాత్మసమర్పణమ-సేవా రూపమగుభక్తిని మేనితోఁ బ్రకటింపలేనినాఁడు మానవుఁడు మానసముతో నైనం జాటవలయు - వెండియు 156

మం. ఆదునప్పుడు పాదునదనఁ గూర్చుండు, తతి లేచునెడ నీరుద్రావెడిపట్ల
నన్నముం దినుసమయమునఁ గాల్‌గదపు, వడిఁ జూచుచో సర్వవసుధాసుఖమ్ము
నాసింపవలెఁ దన కబ్బినయట్టి, యూదె మెట్టిదియైన నోదక దాని
నెఱవేర్పవలె మనూ! నీ వింతమాత్ర, నేర్చినఁజాలు మన్కిని దిద్దుకొనఁగ
ననవుడు నొజ్జకు నంజలిచేసి, త్రచ్చితి నతనిబోధనము వేమాఱు
మెచ్చితి నతఁ డంతమెల్లగా నొరుల, నిద్రకోటమిరానినెతిఁ బల్కుతీరు." 157

వ. అయ్యదియట్లుండె - మహాత్ముఁడు చండీపురమున కరుగుతతి 158

మధ్యా. దారిలోనున్న పల్లియలవారు తద్దర్శనాపేక్ష
బారులుగా నిల్చి రెండుమతములఁ బాటించువారు
పారవశ్యము నంది రార్తబంధువు బాపు దాయంగ
భారతమాతృదాస్య మణఁచిన ఋషిప్రభుఁడు కన్పడఁగ 159

వ. వంగవసుధ నేలువా రీయాత్ర నయ్యకు సైనికరక్షణము కల్పించుదు భగవద్రక్షవినా నా కన్యగోపనమేల యని బాపూ సవినయమ్ముగా నెంతవారించినను సైనికులాచార్య్య విదువక తమతలనున్న రాచముదల నాదరించిరి - మహాత్ముఁడు చండీపురమ్మున నైదునాళ్ళుండి

బ్రదుకునందలి యొదుదుదుకు లోర్వంగల యాత్మబలము నచటి ప్రజ కొసంగందొడం గె - అల్లరులతోఁ దనసర్వస్వముం గోలుపోయిన యంధురా లొకర్తుక యొకనాఁడు వచ్చి బాపూదర్శనము కోరఁ గొంద ఱిది యెట్లుపొసంఁగు నని నవ్విరి - మహాత్ముఁడు వెలిచూపునకంటె లోచూపు దొడ్డది - అదియ నిక్కమగు చూపు - నాఁ బరిహ సించినవారి మోములు విన్నఁబోయె - ఁకుంబొలఁతి బాపూపల్కున కలరి తన యంతర్విలోకనమున నహింసాతపస్విం జూచి ధన్యాస్మి యనుకొనుచుం జనియె - అది యట్లుండె - ఒక్కనాఁ డచటి ప్రార్థనసభ నాచార్యుఁ డిట్లనియె 160

## మహాత్ముఁడు పాదరక్షలు మానుట

ఆ. మున్నువారణాసిమున్నగు తీర్థాల, కరుగువారు చెప్పు లవధరింప
కాత్మశుద్ధి పదయ నది యొకనియతిగా, నమ్మిచనిరి కాలినడకతోడ. 161

గీ. కాశివంటిక్షేత్రములంద కాక వేల్పు, కుదురుకొనియెఁ బ్రతిప్రాణిహృదయవీధి
హృదయ మావిలమై యుండునేని దానఁ, గలజగత్పిత మెచ్చఁ డా కాఁపురంబు. 162

క. కావున మత్పదయాత్రం, బోవలెఁ బ్రజయెదఁద నున్నముతికి; భయంబే
యీవేళం బెనుకస్తై, జీవులఁ గారించు శాంతిచెదఁగా నిచటన్. 163

ఆ. బాధితులు భయమ్ముపాసినఁ గసితీర్చు, కొనుట వలయు నన్న కోర్కి విడిచి
ప్రహ్లదీంద్ర భావపరివర్తనము నిచ్చ, గింతు; రాతలంపు గెలుచు నపుడు. 164

క. ఓరిమితోడ నధైర్యవి, దూరంబగు మనసుతోడఁ దొదరుఁడు నన్నున్
నారాకకు మీబ్రదిమికి, నారోజున సార్థకత్వ మాపాదిల్లున్. 165

వ. మఱియు నాసభనున్న ముస్లిములు కొందఱు రామనామసంకీర్తనము సాగినంతన లేవందొడఁగ నిదియేమని మహాత్ముం డనుడు నల్లా ఖుదా నామములందక్క నింకొక్క పేర నే మీశ్వరుం బిలువ మని వారనిరి - పిన్నటనాఁటినుండియు- దన యాత్మోన్నతికి మూలమైన రామనామమును మాను టెట్లని యపుడు బాపూ వగచి లాఁతిమతమువారి నొంచుట మంచిదికాదని హిందువులకుండెల్ల వారు రామభజనము నాఁగిరి - పదంపడి మహాత్ముఁడు చండీపురమునుండి (7-1) మాషీంపురము నటనుండి (8-1) ఫత్తేపురముం జేరె - ఈ పయనమును వర్ణించుచు మనూ కుమారి పల్కినపల్కు లిట వివరింతు. 166

గీ. బాపు శ్రీరామపురమును బాసి పాద, యాత్రతోఁ బల్లియలఁ జూద నాసచేసె
నపుడు చలిగాలి పగలు రే యనక విసరు, వానయును సారెసారెకు వంగుచుండు. 167

వ. అయ్యవసరంబున యాత్రావిభాగముం బరిపాలించు సతీశబాబు 168

గీ. గ్రామములలోనిగుడిసెలు కాల్చి బూది, చేసిరిగదా చెనంటులు రేసిరేసి
యక్కటా! చెట్లక్రింద మహాత్ముఁ డెట్లు, నిలుచు నీతెమ్మలో నని నెగులుగుడిచి - 169

వ. తనప్రజ్ఞావైభవముం బఱపి యొకమదతగుడిసెం దీర్చె-ఇది కిటికీలు వాకిండ్లు తలుపులు చాఁపలు కంకట్లు మున్నగు వసతులం దనరి కళాదేవతామందిరము నా వెలసె-ఈ సంచారకుటీరముతో మహాత్ముఁడు శ్రీరామపురముపజ్జంగల చండీపురము నుండి (7-1-47) తననౌఖాళీయాత్ర సాగించె - యాత్రారంభమున నయ్యామగువ లయ్యకుం గుంకుమబొట్టు దిద్దిరి - పదంపడి భగవత్ప్రార్థన మొనర్చిరి - 'వైష్ణవజనతో' గేయమును బాడు మని బాపూ నన్నపు డెచ్చరించె - నే నాపాట నాలాపించుతతి 'వైష్ణవజన'కు మాఱుగా నొకసారి 'ముస్లింజన' యొకతూరి క్రైస్తవజన యొకపరి 'శిఖ్ఖుజన' యొకమఱి 'పార్సీజన' యనుముక్కలుంచి పాడు మని నాతోఁ దానుం గొంతుగలిపె-మఱియు170

మం. చండీపురమునుండి జగదాప్తమౌళి, పాదరక్షలు వీడి పయనింపఁదొడఁగె
నిదియేమి బాపుజీ! యీబాధ నెట్లు, భరియింతు ననవోనిపదములు నీవి
ఱాలు ఱప్పలు ముండ్లు రాపాడుబాట, నఱకాలు మోపెదే యని యపు దేను
విలపింప మనము కోవెల కేగువేళ, వారక చెప్పులు వదలమా చెప్పు
మోసి మనూ! పవిత్రోర్విలో నడుచు, తఱి మెట్లుతాల్చుట తగదందు రార్యు
లీనేల నేదోస మెఱుఁగనిసతుల, బాలురు వృద్ధులఁ బాలసుల్ చంపి
రీగడ్డ యేపాప మెఱుఁగనిప్రజల, యస్రానఁ దడిసి పుణ్యక్షేత్ర మయ్యె
దేవాలయమువంటి తీర్థమే యయ్యె, నమ్మీ! దరిద్రనారాయణస్వామి
పజ్జకుఁ జనుచున్న భక్తుఁడ నేను, సిగ్గు దాఁచుకొనంగఁ జినిఁగినగుడ్డ
మూరెఁడైనను లేనిముప్పునఁ గుములు, తల్లులు నివసించుధరణిపై నడుచు
తెరువరి నేను తద్దీనలఁ జూడఁ, బెద్దయుం ద్వరపడుబిడ్డను నేను
పరమపవిత్రమౌ పయనమ్ము నాది, చెప్పుల నెట్లు సైఁచెదనమ్మ! యిపుడు?
ధర్మువుం గనుమని తండ్రి వచించె, నపుడు నాచెవిఁ దాఁకినట్టిరవమ్ము
కరుణ కిల్లైన వాక్యముల రవమ్ము, గింగురుమని నేఁటికిని మాఱుసెలఁగుఁ
గృపచక్కటికి నేఁటికిని జోపు నన్ను 171

వ. రేపాడి యేడుగంట లైనంతన బాపూ నామూఁపుపై నొకకేలుంచి యొండు కేలం గోల నూఁది తనదళంబునకు ముంగలిగాఁ బోఁకతోఁటలనడుమ నడుచుచు విశ్వకవి రవీంద్రుఁడు రచించిన

మం. "ఎన్ని కేకలుపెట్టి యెంతవేసరిన
నొకఁడైన నీతోడ నుంటకు రాక
పిఱికియై మొగము దప్పించునుగాక
యొంటిగానే సాగవోయి! ముందటికి -

సాటివారెల్లరు సత్యంబు నుడువఁ
దాలిమిలేక త త్తఱపడువేళ
నెలుఁగె త్తి సాహస మెసరేఁగ నీవె
చాటు మోదీనుఁడా! చాటు! నీతలఁపు -

దుర్గమమై నొంచుత్రోవలో సాగ
వెఱచి నిన్నందఱు విడుతురు గాక
నీపాదములముండ్లు నిండారుఁగాక
నీనెత్రుతో దారి నింపుచు నీవ
చనుము నిర్భాగ్యుఁడా! చనుము ముంగడకు -

కాఱుమబ్బులు క్రమ్మి కటికిచీఁకట్లు
అంపిల్లు భయదశర్వరి నేగునీకు
దీపంబు చూపించు దిక్కు లేకున్న
నదలక నీహృదయానలజ్వాల
దరికొల్పుకొని దానితాఁకున నీదు
హృది నొకదానినే యేఁచుచు నగుచు
నడువు మభాగ్యుఁడా! నడువు! ముందఱకు.''-

వ. అను నుదాత్తగీతము నాలాపించె - నాటంగోలె మాదళ మనుదినమ్మును యాత్రా రంభమున నీపాట పాడి పదంపడి గమ్యగ్రామముం జేరుదనుక నాయాభజనకీర్తనల నుచ్చైస్స్వరమున నాలపించుచు నెడనెడ రామనామమును సంస్మరించుచుం జను - అదియట్లుండె - నేఁటి పయనమున 172

ఆ. ఎచటజరిగె హత్య లెచట నెమ్ములగూండ్లు, కానిపించె నెచటఁ గాలిసెడిన
గుడిసె లుండె నచట గురుఁ దాఁగి ముంగడ, కేగుదెంచె నూర్పులెగయుచుండ. 173

గీ. ఎడఁద రేఁగినసెగల సహింపలేక, వగ్గుతపసిమొగము వసివాళ్లుసెందె
నేను గొంతెత్తి జానకీజానిగీతి, పాడినంతన యది తేటపడె నయారె! 174

## సతీశబాబు సృష్టించిన సంచారకుటీరము

వ. ఆనాఁడు మాదళము 'మాషీంపురము' చేరినంతన సతీశబాబు సృష్టించిన సంచార కుటీర మావిష్కృతమాయె - మహాత్ముఁడు దానిలోనికిం జని మూలమూలయుం బరిశీలించి వేన్నీటఁ దనకాళ్లు కడుగుచున్ననాతో నిట్లనియె 175

మం. ఎంతవేసారె సతీశుఁ! దాసక్తి, యెంతవెలార్చె నాయిలు తీర్చిదిద్ద!
నిది కుటీరంబని యెట్లు వ్రాక్రుత్తు, నొకమహాభవనంపు టొఱ పిందుఁ దోఁప

భారవాహులు గాసిపదమి కెన్నెన్ని, పాళ్లుగా విడఁదీసె బా బీగృహంబు
బాలకుఁడే నొక్క భాగంపుఁబ్రేఁగు, నవలీల సైఁచున ట్లాయితపెట్టె
నింతయర్మిలిచూపునే! రాణగన్న, పండితుండు సతీశబాబు నాపట్ల
ఏ నింతహోర్దము నెట్లుసహింతు, నెల్లవారికి భాగ మిం దుంట పాడి
సాగింతు నిట వైద్యశాల నీనాఁడె, యీకుటీరము దాని కిరవగుఁగాక
నాసుఖంబునకేమి నాయింటికేమి, చాలు మూరెఁడునేల చాలు నే నిలువ
నదియును దుర్లభ మైనకాలమున, నేచెట్టుక్రిందికో యేగి కూర్చుందు
తనసుఖం బెఱుఁగనితరువు - పరోప, కృతి సేఁతకే జనియించినతరువు
వలదు నాదరికి రావలదని నన్ను, నెట్టునా? తచ్ఛాయ నెమ్మిమై నిలుతు
రాముఁడే కలఁడు నన్ రాపాడునిడుమ, లణఁగింప నాకు నీ కాచింతయేల **176**

వ. మఱియు గ్రామసేవకు వచ్చినమనము నిరహంకృతిమై నప్రయత్నముగా నతర్కితముగా నుపపన్నమగు వసతితోఁ దనియుట వలయు-ఇది నేర్చిననాఁడు జానపదులు మన మేలుగీ ళ్ళరయుచు మనలఁ దమయన్న దమ్ములబలెం గనుట వింత కాదు - వారి కుటుంబములపాలికాఁపుల మగుటయ మనసిద్ధికి మూదల **177**

ఆ. ఒజ్జ యిట్లుపల్క మజ్జరే! పండిన, బ్రదిమి యిట్టులుండుఁగద యటంటిఁ
దన్ను మెచ్చుఁదగినతతి వచ్చెనా యని, బాపు నన్నుఁ దేఱిపాఱఁ జూచె **178**

వ. మఱునాఁ డామదతగుడిసె నయ్యూరనవిడిచి మాదండు ఫత్తేపురమునకుం(8-1) జనుదు నచటిప్రజలు మమ్ముఁ బెద్దయునాదరించి తమనెలవుల మాబస లేర్పరించిరి - దుండ గీంద్రగీములయందును మేము విడియుట పొసఁగె - దీనంజేసి వారి రాకాసిదెందముల నద్భుతపరిణామము ఉదయించె-తమ పాపములకుఁబ్రాయశ్చిత్తమీలోకమునంద జరిగె నని వా రశ్రువులురాల్చిరి-తన మనుగడ ధన్యతం బడసె నని మహాత్ముఁడు కరఁగె.''

క. పదపడి 'దాస్‌పారా'జన, పదమునకుం జనుదు నన్ను పానాదులతోఁ
దుదలేనిభక్తితో గురు,ని దన్పె నొకమల్క లేమినెవ్వం బడియున్. **180**

క. అపల్లెపెద్ద ముస్లిము, బాపూ మొనతోడ వచ్చిపడునని విని యే
యాపదవుట్టునొ యని యెట, కో పరువెత్తెను భయాదు లుల్లము నేఁచన్. **181**

ఆ. అయ్యకడకు వచ్చినట్టి ముసల్మాను, లీవు సేనతోడ నేగుదేర
నిచట నెట్లువొాదము హిందూమహమ్మదీ, యానురాగ మోమహాత్మ! యనిరి **182**

ఆ. అపుదు సుహ్రావర్ది కాచార్యుఁ డొకకమ్మ, వ్రాసె "నేల పోటువారు నాకు
నస్మదీయశాంతియత్నముల్ పండ వీ, దండు నన్ను బలసియుండు నేని. **183**

క. నాప్రాణమ్మున కిట నే, యాపద వచ్చినఁ బ్రభుత్వ మద్దానికి న
న్నా! పూఁటకాదు కా దని, వే పత్రము పంపువాఁడ వేఁడిన'' ననుచున్. **184**

క. జెనని కాదనియు సమా, ధానం బీలేఖమున కతం డిడఁడయ్యెన్
గాని పటేలున కంపిన, దానికి మా తిపుడు రాక తలకొనుదెంచెన్. 185

వ. అందు సర్దా రిట్లు వ్రాసె. 186

మధ్యా. బాపుజీ! నీలేఖ చదివి పెద్దయు బాధ నందితిని
నీపొరపా టేమియుండు నందు? నన్నృతవార్త లెవ్వ
రో పల్కఁగా నీవు కుంది రచియించియుండువు దాని
నాపట్ల నీకున్నకూరిమి తతిమినన్ సైఁపలేక. 187

మధ్యా. బొత్తిగాఁ జెల్లనినిందలుకద! ప్రభుత్వము సేయ
నుత్తలంపదుబుద్ధి నాకుఁగల దంటయును, లీగు నొక ని
మిత్తము లేకుండ దూఱుపని యేను మెత్తు నంటయును
గత్తికిఁగత్తి యన్నాఁడ ననుట వాక్యము ద్రుంచుటకద! 188

వ. తాత్కాలిక జాతీయప్రభుత్వమునుండి తప్పుకొందునని నెహ్రూపండితుఁడు మాటిమాటికిఁ గావించురిత్తబెదరింపులు నాకు రుచింపవు - కాంగ్రెసుపరువు నివి చెఱుచుచున్నవి - వీరిచే మనము రాజప్రతినిధిదృష్టిలో నెల్లిదులమైతిమి - ఒక్కనాఁ డతఁడు నేను నాశాఖను వదలవలయు నన్నతలంపు చాట నప్పటికప్పుడే పరిత్యాగపత్రము వ్రాసి యిచ్చితి - దీనికిం దగినఫలముదక్కె - అధికారము నాశ్రయించుకొని యుంటంజేసి మహాత్మా! నా కేమియొఱగు? - నేను మంచము పట్టినరోగిని - ప్రెగడతనంపుబెడఁద దవ్వయిననాఁ డేను కోలుకొని సుఖింపఁ గలను-కాంగ్రెసునాయకులు కొన్ని సమస్యలపట్ల నేకీభవింపమి నేఁటికథ కాదు కదా! - నీ చెవికి వచ్చిన నేరములం గామక నాకెఱిఁగింపవేఁడెద - నాతీరు దిద్దుకొనుట కది తోడ్పడఁగలదు. 189

మం. సర్దారుకమ్మను జదివి తదీయ, చిత్తశుద్ధికి సంతసించి గురుండు
కదలె జగత్పురాఖ్యగ్రామ సరణి, నమ్మార్గమును గొంద ఱమలమ్ముఁ జేయఁ
జెఱిచి రమేధ్యముఁ జిమ్మి కొందఱు; మ,హాత్ముఁ డీపనికి నత్యానంద మంది
మసటుకుప్పలనెల్ల మట్టితోఁగప్పి, మనవచ్చుదారిలో మలమునుగుప్పి
కొంతకోపమును బోఁగొట్టుకొన్నారు, కొంతపాపమును బోఁగొట్టుకొన్నారు
వీరు; నా ననుచరుల్ వెఱఁగంది రంత, నయ్యూర జరిగె సాయంవేళ సదము
వనితలు పెక్కురు వచ్చి రచ్చటికి, హతభర్తృచరణమ్ముంనందలి యెమ్ము
స్మృతికిఁ జిహ్నముగ దాఁచినచాన యోర్తు, సభకుఁ దదస్థితోఁ జనుదేర నొజ్జ
యవ్వెలందిని గని యమ్మ! యీచిన్నె, నేలపాటించెద విది భౌతికంబు
నశ్వర మిది శాంతినాశన మిది వి, సర్జింపు మిది ధృతిసాధించి మృతులు
మరలమి నెఱిఁగి నెమ్మది రాము నిల్పి, పదయు ప్రతిష్ఠతప్రజ్ఞ నాఁ గొలుపు
నిస్తరంగపయోధినెఱిని గన్పించె. 190

గీ. అంతగాంధి 'లాంచారు'న కరుగ నచటి, ముస్లిములు స్వాగతోత్సవమును ఘటించి
పెద్దచేసి రయ్యనఘుని; బిడ్డ లమ్మ, లమ్మహమ్మన నుంట ధన్యతకుఁ బంట(11-1)191

వ. నాఁటి ప్రార్థనసభకుం జనుచున్న మహాత్ముఁడు దారిలోఁ గొన్ని పీనుంగులం గని వీని చరిత్ర మెట్టిదని యడుగ నిస్లామునంగీకరింపక నిహతులైన యకించనవైష్ణవుల శవము లివి యని యొకండు పల్కె - ఆచార్యుఁ డావైష్ణవులధీరతన్ మిగులఁ బ్రశంసించె - మఱునాఁ దయ్యు కార్వారా షహపూరులు సూచె - పదంపడి భాటియాల్‌పురమునం దిఁగి నాల్గయిదుగీముల కేగి యందలిముసల్మానుల యోగ క్షేమము విచారించుచుండ నొక గేస్తు 192

## బాపూ ముస్లిముల రాణివాసమున కాహూతుఁ డగుట

క. తనరాణివాసముం గన, మనూకుమారికను బిల్వ మతి నేనో యం
చనె జాతిజనకుఁ; డించుక, వెనుకాడి గృహస్థుఁ డొప్పుఁ వెడలిచెఁ దుదకున్. 193

ఆ. అంతిపురమువారి యానందమున కపు, డెల్లలేదు మదిని గల్ల లేదు
జరిగినట్టి హింస తెలిఁగెల్ల నయ్యకు, వినిచిరశ్రువారి విరియ సతులు. 194

క. ఛాయాచిత్రము గురుతోఁ, దీయించిరి క్రమ్ముకొన్నతిమిరము వాయన్
దీయనితలఁపులఁ దనిసిరి, మాయఘములు దుల్లెననిరి మనుజోత్తముతోన్. 195

మధ్యా. ఆయూరిముస్లిము లంద ఱుద్యతులై పల్లె వీడి
పోయినవారి రావించి సాయము పొనరింతు మనిరి
మాయపరాధముల్ పెక్కు లున్నవి మన్నింపు మని కృ
పాయోగిముందు సిగ్గిల్లిరి నేస్తము పండె నల్గడల. 196

క. అల్లరినాఁ దణఁచినగుడి, యిల్లెనది నేఁడు గాంధి; కిరువంకలవా
రుల్లములు పొంగఁ గోవెల, నెల్లవిధమ్ములను దీర్చి రెప్పటివోలెన్. 197

క. అందఱు యంగీకారము, నంది ప్రతిష్ఠించె మరల నాచార్యుఁడు త
న్మందిరమునందు వేల్పును, గ్రందుకొనెం బ్రార్థనాదికథ్వను లచటన్. 198

వ. మఱునాఁడు బాపూ నారాయణపురమునకుం జేరె - ఈపైనముపట్ల మనూకన్య వ్రాసిన వ్రాఁత లిట నావిష్కరింతు 199

## బాపూ సబ్బుబిళ్ళను మఱచిన మనూగాంధికి శిక్ష

గీ. స్నానమొనరించుతతి నయ్య సబ్బుబిళ్ళ, ముట్టనొల్లక కఱకుఱాముక్క వాడు
నెల్లవస్తువులను సంచి నిడుచుదాని, మఱచితిని భాటియాల్ పూరు తొఱఁగునపుడు. 200

వ. నారాయణపురం బనుపల్లియకుం జేరినపిదప నేనీపరా కెఱింగి సిగ్గిల్లి విన్నంబడి బాపునకుం దెలిపి వణఁకుమై నిల్వ 201

ఆ. తప్పుచేసినపుడు తప్పదు శిక్ష, నీ, వొంటి నేగి నిన్న నున్నచోట
నెమకి శిలనుదెమ్ము, నిర్మలబాబు నా, కోగిరంబు దీర్చి యొసఁగఁగలఁడు. 202

క. పరుసనిప ల్కాడితినని, పరితాపముపాలుగాక పద; మియ్యది నీ
మఱపునకు మందు, బ్రదుకున, కొఱ పిడుదండన'' మటంచు నొజ్జ వచించెన్. 203

వ. అయ్యవసరమునం దేను "బాపూ! మన కార్యకర్తలిట నెందఱో కలరుకదా - వారిలో నొకండు నావెంటవచ్చుట కనుమతింపవే!-.'' అని దీననై వేఁడ మహాత్ముఁ 'దెందుల'కని నొక్కిపల్కె-నే నయ్య కపుడు మఱుమాట సెప్పనోడి చెచ్చెరం గాలాడించితి-కాని 204

గీ. పోఁకతోఁటలు కొబ్బెరబ్రూఁకు లేచి, కానవలెఁ గానిపించు నొఖాళిసీమ;
క్రొత్తవా రిందు నడయాడఁ జొత్తురేని, తెరువుదప్పి కలంగు టబ్బురము గాదు. 205

క. అదిగాక చిచ్చు రేఁగిన, హదనన్ ముస్లిములపల్లియల నీఁగుచు ని
ర్వదియేండ్లదాన నొంటిన్, గదలుటయా దైవ మెంతకఱకరి యయ్యెన్! 206

గీ. దుండగీం డ్రెట్టికీ డొనర్తురొ యటంచుఁ, దల్లడిల్లితి - రాముని దలఁచుకొనుచు
తేపు వచ్చినదారి పరీక్షచేసి, కొంటి - నిన్నటినెలవును గంటి నెట్లొ 207

మం. ఆవిదదలయింటియవ్వ యాఱప్పు. నేడెసకో వైచె నిదియేటి కనుచు
వేయికన్నులతోడ వెదకితి దానిఁ, గడ కొకగుంటలోఁ గన్పించెఁ గల్లు
మేరువు చేపడ్డమెయి నేను దనిసి, నారాయణపురంపు నడవఁబట్టితిని
క్షుద్వహ్ని నుదరమ్ము చుమ్మలుచుట్ట, దుర్భరం బగునెండతో శిరం బుడుకఁ
దంఢ్రియూడెమునకు దవ్వైతి నన్ను, యలమటచే గుండె యసురుసు ర్గాఁగ
నొంటిగంటకు వచ్చి యొసఁగితి ఱాతి, నొజ్జకు వెక్కుచు నుత్తలంపడుచు. 208

వ. బాపూ నన్నపు దూఱడించుచు "బిడ్డా! నేఁడు నిన్నుఁ బెద్దపరికించితి - నాల్గు గంటల పాటు నడిపించి లెస్స యలయించితి - నీవు నానిశితపరీక్షలో ను త్తీర్ణవైతివి - నన్ను మిగుల నలరించితివి - ఇరువదైదేండ్లనుండి యీయుపలము నాతోనున్నది - చెఱసాల యందేని యిది నన్నుం బాయదాయె - ఇట్టియశ్మం బదృశ్యంబైన నాకేకాదు దీనినిచ్చిన మీరాకును వగపువచ్చు - మా కీవెత తప్పించి మంచిపని చేసితివి - మన కక్కఱపడువస్తు వెంతయలంతిదైనను దాని నొప్పరికింపజనదు-నీ వీప్రయాణమున రామనామము జపించియుందువు - ని న్నదియ రక్షించెనని విశ్వసింపుము - కష్టకాలమునందకాక సర్వదా రాముని సంస్మరింపుము - రాముఁడు భయత్రాత - సుఖదాత - శాంతివిధాత -'' నావుడు నాయానందము సోడుముట్టె. 209

గీ. తన్నుఁ బ్రేమించువా రాత్మధర్మమునఁ బ, రాకువడి దిద్దుకొనుపట్లఁ బ్రాణములను
బాసినను గుందఁదొజ్జ సంబరము కుదుచుఁ, గత్తిపైసాము గాంధితోఁ గలసిమనుట. **210**

వ. పదంపడి బాపూ రామదేవపురమ్మున కరిగె – సురేంద్రనాథటో సనుభూస్వామి నిచట దుండగీంద్రు చంపిరి –నేఁ డీయూరిమహమ్మదీయులు మహాత్మునకు స్వాగత సత్కార మాచరించి పెక్కుపండ్లు కాన్కవెట్ట నాకువలసినది మీప్రేమ – ఈ పండ్లు నాకేల – అని బాపూ వారి నెల్లరకును బంచె-తరువాత (19–1) మహాత్ముఁ 'దటకోరా'యను కొటికకుం జనె – అందు నడిచినకథను మనూగాంధి యిట్లు ప్రకటించె. **211**

## మహాత్ముని పాకీపని

ఆ. భారతోర్వి నుండుపల్లెలు ముఱికికి, నిక్క లన్నమాట యేలసెప్పఁ
బదయఁగల్గెఁ దూర్పుబంగాళమునఁ గల, యూరు లిందుఁ బ్రథమగౌరవంబు. **212**

క. లోపలిశౌచమ్మునుబలె, బాపూ వరియించు బాహ్యపరిశుద్ధిని; ద
ల్లోపం బెచటం దోఁచిన, సైఁపక సమకట్టు దానిసవరింతలకున్. **213**

క. అతం 'దటకోరాఁ' దన, చేత మలంబెత్తి వీధిచెలువము పెనుపన్
జాతివలె నిల్చెఁ బ్రజ, యీ, రోఁత నెటుల్ సైఁచునో గురుం దనుకొనుచున్. **214**

వ. ఇంచుక వెనుకచిక్కివచ్చుచున్న యే నయ్యం గడిసినంతన యీపాకీపనికి నివ్వెఱ పడి బాపూ! వీ విట్టిచెయ్దమున కేలపూనితివి – నన్ను నేమింపఁజనదా – నా కింతలజ్జ రావింపఁదగునా – అనుదు నాచార్యుండు హసన్ముఖుఁడై మనూ! **215**

మం. ఇట్టిపనుల్ సేయునెడ నాకు నొదవు, ముదము నెఱుంగనిముగ్ధవు నీవు
నినుఁబిల్చి యిది కరణీయ మటంచు, నెఱుకువచేసి చేయించుటకంటె
నేన యిప్పని సేఁత యెంతయుసుఖము, కాదందువా నేఁదు గ్రామశౌచమ్ము
దెస నావెలార్చినతివుట, నాపడిన, పాట్లు గ్రామీణులభావముల్ మార్చి
చేయింపవా వీరిచే నిట్టిపనుల, నెల్లిరేపాడి నీ విచటికి వచ్చి
వాడవాడయుఁ జూచి వచ్చినమార్పు, నాకెఱిఁగింపుము'' నా మంచి దంటి. **216**

ఆ. గురుఁడు పనిచినట్ల మఱునాఁడు కదలి యా, పల్లెలోని వీథులెల్లఁ గంటి
నకట యెచటిమైల యచటన పడియుండె, సైఁపరానిగొలు సందడింప. **217**

గీ. అయ్య కీవార్త సెప్పనేలా యటంచు, నడుముగట్టితి నూరెల్ల మదుఁగు సేయ
నపుడు ప్రజలును నాఁకు దోడైరి యెల్లి, మేమ తెరువూడ్తు మనిలజ్జమెఱయ ననిరి**218**

వ. ఈవృత్తాంతముం దెలిసినంతన మహాత్ముఁడు కదుంగదు సంతసించి "మంచిపిల్లవే! నాపాలి సుకృతము నాఁచికొంటివేమి నీకెంతయాసవొదమె! – మేలు! మేలు! – అని

నన్ను గారవించుటయకాక "యోసీ! మనూ! మలమూత్రాదులనింపి వీథులం ద్రోవలం గంపురేఁచుదురభ్యాస మీ దేశమునందకాక మన కారియవాడునసైతము కలదు - పలుపల్కు లేల - భారతభూమి నెల్ల దెసలంగలదు - కారియ వాడునం దీదోసమును నణంపవలయు ననుకోర్కి కొండికనాఁడు నా కుగ్గడువుగా నుండెడిది-కాని యే నచటం బెక్కేండ్లునిలుచుట పొసఁగదాయె - అది యట్లుండె - నిన్న నేను గసటుం దొలం గించుట చూచి నీ వల్గితివేమి - తిండిలేని నాఁడు నాపొట్ట నిండనికరణిం జీం పురుపట్టనినాఁడు నాయెదఁద పందదు సుమీ" - అనుడుం గన్ను విప్పితి. 219

క. మఱునాఁ దనుగంతలతో, గురుఁడు సిరండీకిం జేరుకొనె; నిట సేవా
పరతంత్ర మానినీ లో, కరత్న మమ్తుస్సలాము కలదు నలగుచున్. 220

మధ్యా. సర్వదా! మతమైత్రి వలచును ఖురాను చదువు నీనెలంత
పర్వెత్తు నెచట నశాంతిమై బ్రజ పనవు నచ్చటికి
గుర్వాజ్ఞ శిరమునఁ బూనుఁ గ్రొవ్విరిగుత్తిచందాన
నుర్విహితమ్మున కెట్టిత్యాగమే నోడక సల్పు 221

క. కాళీఘట్టము వహ్ని, జ్వాలావళిం జిక్కి పొక్కుసమయమ్మునయం
దీలేమ నవాంబుద మనం, జాలెన్ సృజియించె శాంతిసస్యశ్రీలన్. 222

## అమ్తుస్సలామ్ నిరశనదీక్ష

వ. దేవుళ్ళకొలుపులలో నుపయోగించు ఖడ్గములు మూఁడు సిరండీగుడిని గలవు - దుండగములు రేఁగిననాఁ డాలరులు వీనితోడన హిందువులకుత్తుక ఉత్తరించి యవ్వల వీనిం గొనిపోయిరి - అమ్తుస్సలా మీకత్తుల నిందని ముస్లిముల నర్థింప వా రొప్పమియ కాక యాకె నెన్నే నిదుర్భాషలం గక్కసపెట్టిరి-అంత నిమ్మగువ పస్తుంబూన దుడుకంద్రు బెదరి రెండుకటారుల నిచ్చి మూఁడవదానిం గొన్న వాఁడు మఱుఁగువడియుంట నది చిక్కలేదనిరి - అదియు వచ్చినంగాని నిద్రు నుజ్జగింపనని యమ్తుస్సలాము పట్టుపట్టి గ్రుక్కెఁడునీరైనం గ్రోలక కేవల శుష్కోపవాసము సాగింపఁదొడఁగె-నేఁ డీతపమునం దిరువదియైదవప్రొద్దు నడుచు చుండె - ఈమె యేమగునో యని యలందురుచున్న ముస్లిముపెద్దలు బాపూసన్నిధి నీవృత్తాంతమెల్ల వినిచి 223

మధ్యా. మానింపవే పస్తు; నిలువఁజాల దీమగువప్రాణ మింక
నీనేల రెండుమతాలవారికి నెడఁదలు కలియ
నానాశ్రమమ్ము నవధరింతుము; నా నమ్మి యొజ్జ
చానకుం దనచేతిమీఁదుగ ఫలరసంబు నొసంగె. 224

వ. అంత(22-1) నాచార్యుఁడు గ్రామాంతరమునకుం జనుతతి మనూకన్య "ఈశ్వర అల్లా తేరేనామ్ సబ్కోసన్మతి దే భగవాన్" అను క్రొత్తపాట పాడ మహాత్ముం దలరి దానిం

ప్రార్థనవేళ ననుదినముం గ్రోల్చుట వలయునని మురే మనుపల్లెకుం జన నది యెదారిలోని జలాశయమువోలె నాయయ్యకుం దోఁచె - అచటి మౌల్వీయొకం డానాఁడు మహాత్మునిదనయింటనిల్పికొని యాతిథ్యాదులం దనిపి తనిసనె - అతఁడు జాతిపిత నంతిపురికిం గొనిచనఁ గొందఱువెలందు లాతపస్విముంగడకు రా నోడిరి - మౌల్వీవారి కపు డి ట్లనియె. 225

మధ్యా. ఇది యేమి తెల్వి? మనసుకృతం బెదో యీనాఁడు పండి
కదియించెఁ బరమభాగవతునిన్ మనకాఁపురంబునకు
నెదలేనిమనవారు కొంద ఱేపాప మెఱుఁగనివారిఁ
జదిపిరి పొరుగునన్ బ్రతుకు హైందవజనుల వేల్వేల. 226

క. ఆ పాపులకుఁ బవిత్రత, నాపాదింపఁగ మహాత్ముఁ డరుదెంచినవాఁ
డీపుణ్యపురుషుఁ జూడక, లోపల నుందురె! తమస్సులో మ్రగ్గుదురే! 227

వ. అనుటయుం గ్రొత్తపుట్టువు నందిన ట్లలరుచు 228

గీ. యవనికాంతరమున నున్న యువిదలెల్ల, రొక్కటన్ వచ్చి గాంధికి మ్రొక్కి నిల్చి
రయ్య వృద్ధులచెంత భయమ్ము, సిగ్గు, వలదు వలదని వారి దీవనల ముంచె. 229

క. సాయంకాలపుసభలో, నాయూరి మహమ్మదీయులందఱు భక్తిశ్రీ యెసఁగ రామభజనము, సేయన్ గుదికొన్న సందెచీఁకఁటి పఱచెన్. 230

వ. పూర్ణస్వరాజ్యదినమునాఁడు (26-1) బాపూ 'బన్సా' యనుపల్లెకుం బోవ నచటి వారు జాతీయపతాకోన్నయమున కాయయ్య నర్థించిరి - కాని మతమైత్రి యేర్పడు దనుక నిట్టిపని సేయనని మహాత్ముఁడుపల్కి యటనట విడియుచు 'నామకి'యను నూరికిం (30-1) జేరె - అచటివిశేషములు మనూకన్య యిట్లు వక్కాణించెడిని. 231

## రామనామమే రోగమునకు మందు

క. "ఒకనాఁడు మహాత్ముం 'డా, మకి'నాఁ జనునూర విడిసి మతవైరములన్
గకవికలై చెడినప్రజా, నికరమునకు మతియు ధృతియు నేర్పుచునుండన్ - 232

ఆ. ఏను మేఁకపాల కింటింటికిం జని, యడిగియడిగి విఫలయత్న నైతి
బిక్కమొగముతోడఁ బిత కీకొఱంతను, వక్కణించి యేమిది క్కటంటి. 233

వ. ఆచార్యుం డపుడు మేఁకపాలకుమాఱు కొబ్బెరపా లీవచ్చు నని వానిం దీయుతీరు తెల్పుడు నే నాపయస్సు నలవరించి బాపున కొసంగుడు నవి యఱుగమింజేసి పొసనములు సాగి మహాత్ముని కాలుసేతులు చల్లవడియె - తల దిరిగె - తెలివి దప్పె

- అంత నేను విహ్వలతం దోఁగి సమీపగ్రామమునంగల సుశీలను జికిత్సావిశారదను రావించుట మే లని తలంచి యామె కొకకమ్మ వ్రాసి నిర్మలబాబుం బిలిచి తత్కరమునం దాలేఖ నిడుచుండ నొజ్జ కొంతతేఱి నాజతనం బెఱింగి యిట్లనె. 234

ఆ. "రామనామజపపరాయణవై నీవు, నిలక వారి వీరిఁ బిలువఁ గడఁగి
తోసి!గోల! నాకు నొకరాముఁడే వైద్యుఁ, డతనిజపమె సముచితౌషధంబు 235

మం. నాసేవనంబు నెన్నాళ్ళు వాంఛించు, నన్నాళ్ళు నను రాముఁ డవనిపై నిల్పు
వీఁ డేల భువి కని వే ల్పెంచునేని, పెఱతావునకు నన్నుఁ బిలుచు నాప్రభువు
సతతంబు రాముని జపియింతునేని, నామది రామమంత్రము నిండునేని
చావను రుజతోడఁ జావను నేను, జగమునఁగల సర్వజనుల కీపల్కు
వర్తించు, నీవిధి వర్తించు నమ్మ!, అన్న పానముల విహారాదికముల
నరుఁడు చేసినతప్పునకు శిక్ష తప్ప, దగుఁగాక యూపిరి యాడునందాఁక
మానరా దతఁడు రామస్మరణంబు, చిలుక పల్కినరీతి శ్రీరాముపేరు
పల్కుట చాలదు భక్తిమై నిత్య, నియతిమైఁ బల్కుట నేర్చుకోవలయు." 236

వ. ఇవి మహాత్ముఁడు తనచావునకు సరిగా నేఁడాదిముందు వెలువరించినసూక్తులు - నాఁ డన్నట్లు చరమక్షణమ్ముదనుక బాపూ రాముని మఱవఁడాయె - ఆయన నోటినుండి తుదిసారి మొరసిన రామనామము (రామ్, రా-మ్) నాలించు దురదృష్టము నాపాలిద యని యపుడూహింపనైతి - దై వేచ్ఛ నెవరు కానఁగలరు? 237

మధ్యా. పదపడి పెక్కుపల్లియలపాలి విపత్తులఁ గనుచు
నదవదపడువారిఁ దేర్చుచుం జనునయ్యె నొక్కరుఁడు
దెది సేయువాఁడు నియోక్త యౌ టొప్పు నెఱిఁగింపు మనిన
గొదకొని చెమరోడ్చువాఁడ యని దేశికుఁడు వక్కణించె. 238

## పూలదండకంటె నూలిదండలెస్స

వ. అదియట్లుండె - మహాత్ముఁడు చనిచని (17-2) దేవీపురం బనుగ్రామముం జొచ్చె - ఇచట జరిగినకథ మనూకన్య యిట్లావిష్కరించె. 239

క. సేవాధర్మభరమ్మున, దేవీపురమునకుఁ గదలె దేశికుఁ డొకనాఁ
డీవార్తవిన్న పౌరులు, మాత్రవతములు పండెనని సుమాళముతోడన్ - 240

వ. చాలాసొమ్ము వెచ్చించి పలువన్నెల కాగితములు పట్టుదారములు సుమహారములు మున్నగువానిం దెచ్చి తమవీటిం గైసేసి నేతిదివియలు వెలిఁగించి స్వాగతసత్కారము పట్ల దంబముం జాట బాపూ మిగులఁగోపించి ముఖ్యకార్యకర్తం గని 241

గీ. ఈ యలంకారములబ్రదు కెన్నిగడియ, లుందు నందువు? మఱిసెడెనొక్కొ నీకు?
నాలుకలుసాఁచుమంటలనడుమ నున్న, నాకు నేఁ డీబడాయిపన్నాగమేల? 242

గీ. పూలదండల మాఱుగా నూలిదండ, లిన్ని కొనితెచ్చి నామెడ నిడితివేని
యింతకోపము నా కుదయింపకుండు, నింత తాపము న న్నలయింపకుండు. 243

వ. సూత్రదామములు నేఁడు సింగారమునకును రేపు వలువకుం జాలు 'తీర్థము-స్వార్థ' మన్నట్లు నూలిదండ లిరుదెఱంగుల నొదవు - మఱియు నీకు నాయం దాదర మున్న నాపల్కినపని కావింపవలయు - అది నాతృప్తికి హేతు వగు - ఇన్ని హత్యలు జరిగిననేలలో నింతవిత్తము రిత్తగా వెచ్చించుతలఁపు నీకెట్లువొడమె? నీవు రాణకెక్కిన కాంగ్రెసుయోద్ధవు - లెస్స చదివిన వాఁడవు - కారాగృహమ్ముల నలఁగినవాడఁవు - ఖాదీ కట్టినవాఁడవు - ఇన్ని మెఱుఁగు లుండియు వై దేశిక యంత్ర సిద్ధమగు పట్టుదారము నీయలంకారముల కెట్లువాడితివి? నినుబోంట్లు రే పధికారమునకు వచ్చి యెందనుకఁ జెడుదురో యన్న శంక నన్ను బీడించెడిని. 244

ఆ. అనుడు నతఁడు లజ్జమునిఁగి యానాఁటి క్తై, సేఁతలెల్లఁ దొలఁగజేసె నపుడ
దంభదూరజీవితము నేర్చి గురుఁ డిట్లు, దిద్దె భారతీయు దినదినమ్ము. 245

వ. అంత బాపూ నౌకాళీమండలమునుండి త్రిపురసీమం గాలుమోపి విరామపురం బను పల్లెకుఁ (19-2) జేరె - నాఁడు మహాశివరాత్రి - కస్తూరి మూఁడవమృతదినమది - మహాత్ముఁ డాప్రొద్దు నిరాహారదీక్ష పూని ప్రజలు తనకొసంగినపండ్ల నచటిపిల్లలకుఁ బంచుచుఁ గస్తూరికిఁ దినుటకంటె నొరులకుఁబెట్టుట లెస్సతనుపు గూర్చు - ఆయుదారత కెల్లలు లేవు - నా ననుచరు లశ్రువులు జార్చిరి - వారు కస్తూరిచిత్రమును మేలిమేలి పూలదండల నూలిదండల నలంకరించి తత్సముఖమునఁ గూర్చుండి గీతాపారాయణ మారంభించిరి - షష్ఠాధ్యాయము సమాప్తము కాకమున్న బాపున కిల్లాలితుదిగడియలు తలపుఁనం దగిలి ధ్యాననిష్ఠ హెచ్చె - తనతొడపైఁ దలమోపి ప్రాణములువీడిన కస్తూరి తక్క నన్య మెద్దియు నయ్యెకుంగానిపింపదాయె-ఆతల్లిమనుగడ భారతనారీసమాజమున కొజబంతి - మహాత్ముఁ డాసాధ్వి నెట్లుమఱవంగలఁడు! అది యట్లుండె - విరామ పురంబున - 246

## మహాత్మున కొక యపవాదము

ఆ. కాఁపురించువారు కైవర్తు; లానాఁటి, తులువమూఁక వీరివలలఁ ద్రెంచి
బ్రదుకుఁదెరువు చెఱిచె; నదయు లూరక లాఁతి, కెగ్గొనర్తు రనుట కిదియ చాలు. 247

గీ. గురుఁడు నేఁ డొకజాలరిగుడిసె నొదిఁగి, పండుకొన్నాఁడు మోకాలిబంటివలువ
నర్ధరాత్రమునకుఁ జలి యగ్గలించి, వడవడవడంకె బాపు హోవడికిఁ జిక్కె. 248

వ. అపు డయ్యుచెంత మనూకన్యతక్క నొరు లెవ్వరును లేరు - ఆమె యెన్నిబట్టలు కప్పిననేమి బాపూవణఁ కణఁగక మేను కొంకరలువోవం దొడఁగె - వేన్నీటి సంచియు నిబ్బంది తతివచ్చుసరికిఁ గన్పింపదాయె - మనూకుమారి పెద్దతదవు కాలుసేతులుపట్ట నించుక వెట్ట వచ్చినది కాని యొజ్జ దానం దేఱుకొనలేకపోయె - ఆయన కెట్లయినను వేఁడి పుట్టింపవలయు ననుతలంపున నాలేమ తచ్ఛరీరము నానుకొని పవళించె - అంతనిర్వు రును గాఢనిద్రకుఁ జిక్కి వేఁడికోలు వేళకుం గనులు తెఱచిరి - బ్రహ్మచర్యనిష్ఠ నున్నవాఁ డి ట్లొకయువతి నంటిపన్నుంట తగదని యనుచరులు కొందఱానాఁ దాక్షేపింప బాపూ నిష్కళంకమగు బ్రహ్మచర్యము నెదుట, నిరవధికమగు నహింసముందు మానసికవికారము లెవ్వియు నిల్వనేరవు - నన్ను శంకింపకుఁడు - నాయూర్ధ్వరేతస్కత నిర్దుష్టము - నావుడు నాక్షేపకులు చక్కంబడిరి - కాని మహాత్ముఁ డీమాత్రన యాఁగక తనయాప్తుల కీనిందం దెలుప నిన్ను శంకింతునేని నన్ను నాకనులుం జెవులుం గికురించినట్ల భావింతు నని కృపలానీ పల్కె - నీపవిత్రత పరిపూర్ణము - నిప్పునకుఁజెదలంటునా? - యని బాదుషాఖాను నుడివె - బాపూ మగవా- దనుమాట మఱచి తత్సన్నిధిం బరమ రహస్యములు చర్చింతు నని యొకసాధ్వీమణి వక్కాణించె - అది యట్లుండె. 249

ఆ. అవల 'బిష్కటాలి' కరుదెంచె గాంధి య, య్యూరివారిచింత లొత్తగిల్ల;
నచట బూదిచేసి రజ్జులు సడిసన్న, గ్రంథనిలయమును మదాంధు లగుచు. 250

ఆ. ఒజ్జవచ్చుదారి నున్నగ్రామకుఁన కొక, పగటు కట్టి "రీవు తగవు మాకు
నిచటువీడి వెంటనేపొమ్ము పాట్నాకుఁ, గదలవేని చెదెదు గాంధి!" యనుచు 251

వ. అంత నాచార్యుఁడు హరిజనులు హెచ్చుగాగల పల్లెకు హేమాచారునకుం జని యచటి జనుల బాగోగుల నరయుచు నాఱునాళ్లుండె - పతితజనసేవాస్విన్నుఁడు థక్కరుబాబా హరిజనుల యిదుమలనకాక వారిలోఁ బేరుకన్న బాల్యవివాహాది సాంఘిక దురాచారము లనుసైతము తనచెవికిం దేర జాతిజనకుఁ డాప్రజకు వలయు హితోక్తు లాడి స్వయంకృషి ముఖ్యముగా నవలంబితవ్య మనియె. 252

## మహాత్ముని బీహారుయాత్ర

గీ. కరుణ కిరవైనగాంధి బంగాళమందు, నార్తసేవాపరాయణుఁ డగుచు నిట్లు
నలఁగుతఱి లీగువారు పేరలుకఁ బంపి, రుత్తరమ్ముల నమ్మహోదాత్తమతికి. 253

వ. అందు మాంఘీరు (బీహారు) నుండి వచ్చిన యుత్తర మిట్లుండె 254

ఆ. ఘోరనరకబాధ గుడుచు బీహారు-ము, స్లిముల కీవు పెద్దసేయుకాంగ్రె
సించుకంతసాయమేని గావింప దీ, వార్త నీదుచెవికి వచ్చెనొక్కొ! 255

వ. ఆలిఘరునుండి వచ్చిన కమ్మతీ రిది. 256

ఆ. హంత లగుదు లేక హతు లగుఁదని నీవు, పలుక నలుక హిందువులు తెగించి
కలుచలేని ముస్లిములఁ జంపఁదొడఁగి రీ, యవగడము బిహారునందుఁ గనుమ! 257

వ. పాటలీపుత్రమునుండి వచ్చినలేఖం గలపల్కు లివి. 258

క. బీహారుప్రభుత్వము ఖల, మై హిందూధూ ర్తకోటి నాఁగక ధర్మ
ద్రోహ మొనరించెనిస్సీ!, యీ హింసారతవిభుత్వ మేలప్రజకున్. 259

ఆ. నీకుధైర్యమున్న నీతియుండిన దీనిఁ, దిట్టవలయు మట్టుపెట్టవలయు
రాష్ట్రపాలకుం దరాజకక్రియ లాఁపి, జనులఁ గాచునట్లు చాటవలయు. 260

క. దొంతరగ వచ్చు లేఖల, కెంతయు నొచ్చెన్ మహాత్ముఁ డీదృశముల; కే
నంతర్వాణి వచించిన, యంతన బీహారు చొత్తునని ప్రకటించెన్. 261

వ. పదంపడి బాపూ విహారభూమిం గదలినదుండగములకలరూ పెఱింగిరమ్మనిమున్ను సుభాసుదళమున మొనకాఁడుగా, నేఁడు తన కనుచరుఁడుగానున్న నిరంజనసింగు నానేలకుఁబంప నతండు మరలివచ్చి లీగువారిపల్కునం దసత్యము హెచ్చైననుబీహారు దొరతనము కొన్ని తప్పులు కావింపకపోలే దని యయ్యకు నివేదించె - మహాత్ముఁ దంతఁ గర్తవ్యపరాయణుఁడై విహారరాష్ట్రమంత్రులలో నొకఁడగు సయ్యద్ మహమ్మదు నకుం గమ్మవ్రాయ నతఁడు నిప్పుకలుక్రక్కు మాఱుఁగమ్మం బనిచె - దానిం జదువుతఱి బాపూనయనము లశ్రుసాగరము లగుటం బరివారము బోరు మని యేడ్చె - అంత నాపన్న బంధువు బిహారునకుం బోక యనివార్యమని నిశ్చయించుకొని 'చాందుపూరు'నం బ్రవర్తిల్లిన ప్రార్థనాసభయం దిట్లనియె. (3-3-47) 262

క. ఏకారణంబు న న్నీ, నౌకాలికిఁ దెచ్చె నదియ నడిపెడి హింసా
వ్యాకులవిహారమున కిపు; దేక స్తియుఁ బుట్టఁగూడ దిట మీసేవన్. 263

గీ. అన్నలార! హిందూశరణార్థు లిచట, వెఱపు సుంతయు లేక జీవింపవలయు
నధికృతుల్ ప్రజ లార్తుల కండదండ, లగుచు నిచ్చలు శాంతికి నలయవలయు. 264

వ. అంత నాసభలోనివాఁ డొకండు లేచి 265

గీ. ఆలుబిడ్డల నాస్తిని గోలుపడిన, మనుజుఁ డాబాధ లెమ్మోయి మఱచునయ్య!
బాధితులు బాధకులు పాణిపాణికలిపి, యెట్లుమెలఁగెదరయ్య! ఋషీంద్ర! సెపుమ!

వ. అనవుడు నొజ్జ యిట్లనియె 267

క. కయ్యమ్మును మఱచి ప్రజల్, నెయ్యమ్మును గోరకున్న నిలువదు దేశం;
బెయ్యెడఁ జూచిన దయ్యని, దయ్యమ్ములు జడలువిప్పి తాండవమాడున్. 268

మం. పదపడి యారేయి పదిగంట లగుడుఁ, గదలె బాపూ బలఁగంబుతోఁ దరిని
దెలవాఱుసరికి సోదేపూరు చేరి, భక్తిమై నీశ్వరుఁ బ్రార్థించి ధూమ
శకట మాదరువుగా సాగించె యాత్ర, ముడిచె నాయాఘట్టముల వచ్చుకాన్క. 269

గీ. ఛాత్రతతితోడఁ బాటలీపుత్రమునకుఁ, జేరినమహాత్ముఁ దచ్చటఁ బేరుగన్న
వెజ్జు సయ్యద్ మహమ్మదు వేశ్మమునను, విడిసె గంగాతరంగిణీవేలయందు(5-3)270

ఆ. కడుగభీరమైనగతితోఁ బ్రసన్న తా, చారిమమ్ముతోడఁ జాగిపోవు
జహ్నుతనయ కూర్చుశాంతితో నొజ్జ నె, చ్చెలులఁ బల్కరించి సేమమడిగె. 271

క. మీరాకం దొలఁగెను మా, భారంబని గఱువ యొకఁడు పల్క నహింసా
వీరుండు గఫూరును మా,పో రేపో వచ్చునని ప్రభుం దెలిఁగించెన్. 272

గీ. ఎచటి కేగిన నౌఖాలి నీబిహారు, మనిచె ననుపల్కు వినిపించు ననెఁ బ్రసాదు
గాంధి తద్వాణి నంతర్ముఖత్వ మూని, త్రచ్చె నిట్టూర్పుబుసబుసల్ దందడింప. 273

గీ. హిందువులు పెక్కు రీహింస నెద్రిచి కాచి, రల్పసంఖ్యాకవర్గము ననె నొకండు
దుండగము లాఁపఁ గాంగ్రెసుదొరలుమిగుల, బెనఁగలేదని వాక్రుచ్చెఁ బెద్దయొకఁడు.

క. సరిహద్దుగాంధిపనుపున, నరుదెంచి బిహారుభూమి నార్తులసౌఖ్యం
బరసెడివా రర్పించిన, చరితం గని గాంధి యశ్రుజలములు గురిసెన్. 275

వ. మహాత్ముఁ డంతటం దన్ను మొదటిపగతుఁగాఁజూచు లీగు పెద్దల నవాబిస్మాయలు సయ్యదబ్దులజీ జనువారి నాయాతెగుళ్ళకుఁజిక్కి మంచముపట్టినవారింగని ప్రకృతి చికిత్స కొప్పించి కాళీఘట్టమువలన జలవైద్యు నొకనిని రావించి యారుగ్ణుల సేవింప నియమించుడు లీగునాయకులు బాపూజీసౌజన్య సానుభూతులకు లెస్స కరఁగిరి – పదంపడి మహాత్ముఁడు బీహారుమంత్రిమండలి సమావేశమునకుఁ జని "మీరు విచారణసంఘము నిందనుక నియమింపమి ముస్లిములీగువారినింద నంగీకరించినట్ల యగుఁగదా" యనుడు ముఖ్యమంత్రి సిన్హా "మే మాపని కావింతుమేని లీగువారు దానివలని రాజకీయ లాభమునందుట కెల్లతంత్రములం బన్నుదురుకదా" యని తనభయముం బ్రకటించె – అంత నాచార్యుఁడు "బాధితు లట్లు సేయుటయు వింతకాదు – ఐనను సత్య మెప్పటికిని దాఁగదు – కదచిన యఱువదేండ్ల యనుభవము నా కీపాఠముం గఱపె – నౌకాళీయాత్రయు నాయీ విశ్వాసముం బెనిచె – లీగువారు నేఁడో రేపో తమతప్పు నెఱింగి సిగ్గిల్లఁగలరు – మీ రిది తెలిసి బీతుం బాతురేని కర్తవ్యమునాదరింపఁగలరు" నా నమాత్యప్రముఖుఁడు "మహాత్మా! మేము దుండగముల నాఁగంబూనమి నిక్క"మనియె – పదంపడి యొజ్జకడుంగడు వేదన కుడిచి వెనువెంటన తేఱి 276

గీ. నేఁటిబీహారుహత్య లానాఁటి దయరు, దుండగమ్ములఁ దలఁపించుచుండె ననుడుఁ
దాళలేక రాజేంద్రుఁడు తగినపనియ, జరిగె నందురు పెక్కు రీధరణి ననియె. 277

గీ. అంత నట్లనువారు పాపాత్ము; లేను, దెరలివచ్చుట వారల దిద్దుకొఱక
చావుబ్రతుకులఁ జూడ నీజన్న మందు, ధర్మువున చూతు మానవత్వమున చూతు. 278

వ. అని మహాత్ముం డనుటయు 279

ఆ. అనఘ! నిన్ను మేము ననుసరింతుము కృత్య, మానతి మ్మొనర్తు మనెఁబ్రసాదు
నాఁడు చాంపరాన్‌రణమ్మున కెవరు నిన్, బిలిచి పనిచి రనియెఁ బిత బిఱాన. 280

ఆ. ప్రొద్దుక్రుంకె వేలుపును వేఁడికొనరచ్చు, కెల్లవారు వచ్చి రుల్ల మలర
ముమ్మరముగ ముస్లిములు చేరి రంతర్థి, నుందునట్టి లేమపిందుతోడ. 281

వ. మహాత్ముం డపుడు ప్రార్థనానంతరప్రసంగమునం దిట్లు నుడివె. 282

ఆ. "అన్నలార! ఘోరహత్యలు జరిగె నీ, దేశమందుఁ గీర్తికోశమందుఁ"
గాంగ్రెసీయఘమ్ము కావింపలే దని, పల్కుఁగాక దానఁ గుల్క నేను. 283

గీ. ప్రల్లదీంద్రు మతావేశపరులు బెరసి, చేసి రీదోస మనిన సంతోస మంద
మందు లెవ రెగ్గొనర్చిన మందలింప, వలయుఁ గాంగ్రెసు మోహంబువదలి కదలి. 284

క. ఇచ్చట నిది యార్జించిన, యుచ్చైస్థ్సితి కొలఁదికంద; దుర్వింగల స
ర్వోచ్చయములకు మతంబుల, కచ్చంబగుసేవ సేయ నది యుదయించెన్. 285

ఆ. దానితీరు సూచి దానిసేవా త్యాగ, నిరతి సూచి ప్రేమపరత సూచి
శిరము నూఁపవలయుఁ బరపక్షములుసైత, మపుడ యది జయమ్ము నందినట్లు. 286

గీ. అతఁడు పదుగురఁ జంప నేనార్యురన పొ, కార్చితిని వానికంటె నే ఘనుఁడననుట,
బుద్ధిగఱపె బీహా ర్వంగభూమి కనుట, దుర్వివేకము నేలు హిందువులమాట. 287

గీ. హింస భీరుతకుం జిహ్వ;మిది ప్రశస్తి, నీయఁజాలదు సంస్కృతి; కెచట నసుర
ధర్మ మిది రేఁగు నచట నుదాత్తమాన, వత్వ మెసరేఁగవలె శాంతివత్సలతను. 288

ఆ. చంపువారిఁ జంపి సంధిసుఖంబును, బదయుకంటె శాంతివిదక నరుఁడు
విధిని నిర్వహించువేళ మే నూద్చుట, పోలుఁగాదె మహికి మేలుగాదె?" 289

వ. అంత నాచార్యుండు సత్యాన్వేషణ పరాయణుఁడై లీగునాయకుల నమాత్యులం గలిసి
కొనియె - దుండగముల పాలంబడిన మహమ్మదీయులు మహాత్మునిజేరి తమగోడెల్ల
వెళ్ళఁబోసి కొనిరి - మిత్రసేవా సంఘమువారు తమనివేదిక నొజ్జ కర్పించిరి -
అధికారుల యలసతయు సమర్థుఁడగు హిందూనాయకుఁడు లేమియు గణనీయమగు

సహాయకసంఘ మేర్పడమియు బాపూపనుల నడ్డగించుచుండె - రాజేంద్రుఁ డా యయ్యతోఁ గర్తవ్యమున్గుతిచి లెస్సతడవె - మహాత్ముం డపుడు "నేనింతదనుక నెట్టికార్యక్రమమేని నిర్ణయింపనైతి - కాని యెుండురెండు సమస్యలపట్ల నంతిమ నిశ్చయమునకు వచ్చితి - కొన్ని కట్టడలతో ముస్లిముల నొక్క యెడకుం జేర్చుట కియ్యకొందు - ఐనను వారి కాయుధము లిచ్చుటయు వారిం గావ ముస్లిమ్‌పోలీసుల నిల్పుటయు నా కంగీకార్యములు కావు - కాని వారికి నిరుపద్రవకరమగు రక్షణము కల్పింతు" - నావుడుం బ్రసా దాపల్కులకు సమ్మతి చాటి "యయ్యా! నేఁటిదనుక మహమ్మదీయులు హెచ్చుగానున్న తావుల దౌష్ట్యములు సాగె-వా రల్పసంఖ్యలో నున్న చోట్ల వారి మానప్రాణములు హిందువులే కాపాడిరి - దీనింబట్టి మాకర్తవ్యము నిర్ణయింతురేని దానిం దలఁదాల్తు" నా నొజ్జ "ఱేపటి కొకనిర్ణయమునకు వత్త" మనియె - మఱునాఁడు హోలీపండువు రానుండె - దానం దమ కెట్టిచెట్ట మూడునోయని ముస్లిములు బెదరుచుండ బాపూ వారింగని 290

ఆ. అన్నలార! భగవదనుకంప నమ్ముఁడు, మానుఁ డఱుకు జఱుకు మర్త్యుఁ జూచి
నొడివినాఁడ నిట్టినుడుల నౌఖాళిలో, హింసపాలఁబడిన హిందువులకు. 291

క. అని హిందూ ప్రజలం గనుఁ, గొని ముస్లిముతమ్ము లిపుడు కుదుచుభయంబున్
వనటను బాపుఁడు రేపటి, దిన మందఱపండు వౌగతిన్ మెలఁగుఁ డనెన్. 292

మం. మఱునాఁడు దీనసమాజబాంధవుని, గన దుండగమ్ముల గగ్గోలుపడిన
ప్రజలు కొందఱు వచ్చి బాపుజీ! నీదు, రాక మాకీశ్వరురాకయు; నేఁడు
మదిమదిఁ గంటిమి; మాభాగ్య మిట్లు, పండిన దనుడుఁ గ్రైవారముల్ మాని
సంతుష్టి మాని యిచ్చుటఁ బద్దవెతలఁ, దలపోఁత మాని యీతావును వీడి
పదఁదు నౌఖాలికిఁ బదఁదు మీరంద, ఱీనేలయందు నే నెన్ని నాళ్ళుందు
నానేలయందు మీ రన్నినాళ్లుండుఁ, దచటిమూర్ఖులఁ దేర్పుఁ దచటిపశుత్వ
మణఁపుఁ దార్తులసేవ నలయుఁదు మైత్రి, కఱపుఁదు ప్రజకు; నౌఖాలిని మీరు
నిల్చినతఱి నెట్టి నింద్యప్రవృత్తి, యిచట రేఁగిన దానియెగపు నాఁకట్ట
నాప్రాణముల నొడ్డి నలఁగెద నమ్ముఁ, డనుడుఁ జిత్తము చిత్త మనిరి ముస్లిములు
ఆనాఁటిరేపాడి నాత్మీయనియతి, నుడుగక నడకకు నొజ్జ సాగంగ
నమ్మాహర్తము వార్చి యారటసెందు, హైందవభిక్షుకుఁ డంధుఁడు వృద్ధుఁ
డొక్కఁడు తనసంచి నున్నరొక్కమ్ము, నాల్గణాల్ గురుచరణముల కర్పించి
సాఁగిలిమ్రొక్కి యోస్వామి! యీసొమ్ము, దుండగమ్ములఁ జిక్కి దురపిల్లువారి
నిధి కంపవే దయానిధి! యని వేఁడ, నానందపారవశ్యము నంది గాంధి
తనవెంటవచ్చు మిత్రమ్ములఁ జూచి, యీసొమ్ము నాల్గణాలే యగుఁగాక
నాల్గుకోట్లను మించినది యనఁ జెల్లు, నీపేద తనకున్న యెల్లధనంబు

నిచ్చుట యిట గణ్య మిట విశేషంబు, వేవేలుగలవాఁడు వే యిచ్చుకంటెఁ
బావులా నితఁ డీగి పరమదానంబు, చాఁగురే! యని యొజ్జ సప్రేమసాద
రావలోకనముల నంధునివీఁపు, దట్టి యన్నా! మహాదాతవు నీవు
కృపగలవారిలో నీశ్వరుఁ డుండుఁ, గరుణయే వలయు లోకమునకు నేఁడు
ప్రేమమే వలయును బృథివికి నేఁడు, ప్రేమశూన్యులు నేఁడు పెరిఁగి రందందు
నక్కట! కాఁడు సేయఁ గడంగి రవని, మానవత్వంబును మఱచిరి చెఱిచి
రసహాయులను, శాంతి నణఁచిరి రెచ్చి, నీవు కరంగుట నేర్పితి వదిర!
నిన్నుఁ గీర్తింతుఁ గానీ నేఁటినుండి, విడువు మీ నెతిలేనిభిక్షుకవృత్తి
నిచటి కాంగ్రెసుపెద్ద లేదేని మంచి, పని చూపి నీ కన్నపానము లిడెద
రనుడు నంధునిమొగ మమ్లాన మయ్యె, నతఁడు దాసితి వేల్పు నని తనిసనియె. 293

వ. నాఁటిసాయంవేళా ప్రార్థనసభయం దాచార్యుఁ డిట్లభిభాషించె. 294

సీ. "రామాయణక్షేత్ర మీమహి; సీతమ్మ, తల్లిపుట్టిన పుణ్యధాత్రి యిదియ
యిచటివారలు విద్య లెఱుఁగకపోవచ్చు, దీనులు కావచ్చుఁ గాని వీరి
హృదయమ్ములకుఁ దృప్తినిడు నమ్మహాకావ్య, మిదిపాప మిది పుణ్య మిది యకృత్య
మిది కృత్య మనుతెల్వి నెఱిఁగించుఁ గావున, నుద్రిక్తులై పాడి నుజ్జగించి

గీ. యేతదుర్వీజనుల్ కొంద ఱింతదనుక, నాచరించిన యొగ్గుల నరసి నేఁడు
సిగ్గుపడి యింక లగ్గులుసేయ నుద్య, మింతురని విశ్వసింతు నార్జింతు శాంతి. 295

గీ. హిందువులయిండ్ల నుదువ నూహింప రాని, వెతలుకుడిచెడి ముస్లిముసతులు బంధ
ముక్త లగుదురు తమదోసములను బదుర, నదుమనంగీకరింత్రు దుందుదుకువాండ్రు.

గీ. కొల్లగొట్టిన సంపదనెల్ల వెదకి, పుచ్చి త్రవ్వినగుంటలు పూడ్తు రిపుడు
సిగ్గుపడువారు తమతప్పు లుగ్గడింప, వచ్చెదరు నాకడకు నొంటిపాటు సూచి. 297

గీ. సత్యవీరుని రాఘవుఁ జాటుపుణ్య, కృతికి రామాయణమున కాదృతియొసంగు
ప్రజల కీనేలవారి కీపనులు చేఁత, యరిది కాదని తలఁతు నాయలఁత డింద. 298

ఆ. అన్నలార! యొకరహస్యము వినుతు "ని, ప్పుడమి నున్న హిందువులను దెగడ
వలదు సైఁప మిట్టివాక్కుల" నని తీఁగ, వక్కణంబు నేఁడు వచ్చె నాకు. 299

క. ఈతంతివార్త మామక, చేతమ్మును గలఁచుఁ దప్పుచేసినవానిన్
దాఁతు నసువాఁడు నరుఁడా, యాతఁడు తనమతమునకు సహాయుం డగునా?" 300

వ. ముఖ్యమంత్రి సిన్హా యపుడు "బాపూ! వంగరాష్ట్రమున హిందూయువతుల కాపాడిల్లిన
యవమాన పరంపరం దెల్పెడికరపత్రముల నిచటిహిందూమహాసభవారును భూస్వా
ములుం బ్రచురించి పంచుటంజేసి ప్రజలకు సివమెక్కి దుండగములు జరిగె – జరిగినది

యంతయు నౌఖాలీహింసకు బ్రతీకారమ" యనుదు "నగుఁగాక - మనకర్తవ్యము మన కనివార్య"మని మహాత్ముఁడు నొడివె - వెండియు "నిట్టితఱిం జట్టములకంటెఁ బశ్చాత్తాపంబ పెద్ద యుపకరించు - మీ రాత్మ పరి శోధనము గావించుకొని పరిశుద్ధులు కండు - హిందువులకు నిక్కంబగుబరవస మున్ననాఁ డన్యులకుం గీడువాటిల్లదని నమ్ముఁడు - ప్రాణుల మానసికదౌర్బల్యమే హింసకుం బ్రేరించు - ము న్నీ దేశమున కే నూడిగ మొనర్చితి - ఇది నాచరమ సేవ యగునేమో - నేఁటినావిధినిర్వహణము చావునకుం దాయుటయ - సత్యజ్ఞానధైర్యములపై సర్వ మాధారపడియుండు - ఇవి లేనినాఁ డీరాష్ట్రమున కననేల భారతావనికే ముక్తిచిక్కదు - బీహారు సరిగా నున్ననాఁడు సింధుపాంచాలాదులు శాంతిమై నుండు" - నా నాచటిపత్రికావిలేఖకు "లయ్యా! ప్రార్థన సమయమున రాజనైతిక చర్చలు తగునా" యనుదు నాచార్యుండు "రాజనీతియు మతమ్మును విడఁదీయరాని చుట్టముల" యని మహమ్మదీయశరణార్థులనిధికిం జేయి సాఁప సభ నున్నవా రొండొరులం ద్రోసికొని ముందటికివచ్చి తమకానుకలర్పించుతఱిఁ జినిఁగినచీరకొంగున ముడిచిననేబులఁ గంపమానకరమ్ములతో నతివ లొసంగుట దయ నీయదృశ్యముగా నుండె - వెండి బంగరు రవణమ్ములుగాక రెండువేల రొక్క మాసమా వేశమున దేశికునకు లభించె-పదంపడి మహాత్ముఁడు వేఱొండు గోష్ఠిని 301

## మహాత్ముఁ దహింసామహిమం జాటుట

ఆ. "ఎల్లరోగముల కహింసయ మం దిది; మంచి దననిమతము మహిని లేదు
హిందువులకు దీని కెనలేనినెయ్యమ్ము, కలిమి తోఁచు యుగయుగాలనుండి. 302

గీ. ఒక మహాశాస్త్రమయ్యె హిందూర్వి కిది మ, హర్షు లతితీవ్రతపముల నవధరించి
బడలి రీయోగమున సిద్ధిఁ బడయుపొంటె, నిలిచిరి చరిత్రలో దీని నేస్తకాండ్రు. 303

క. కవు లీ ఋషులతపమ్ములు, ప్రవిమలములు సాగి సాగి పర్వతరాజ
చ్ఛవి కింతటిధావళ్యము, సవరించినవండ్రు మధురశబ్దవిధాతల్ 304

క. ఈదృక్ష యగు నహింసకు, నాదర మీనాఁడు లేమి కదలెద నరు క్ర
వ్యాదుని జీవనములలో, భేదం బిఁక నేమికలదు వివరింపంగన్. 305

ఆ. మానవత సజీవమై నెగ్గుట కహింస, నుద్ధరించు టొప్పు బుద్ధిమంతు
లీసుఁ గూర్మితోడ, హింస నహింసతో, గెలువవలయు మాసి నిలువవలయు. 306

క. జనకునివంటి మనీషా, ఖని ఋషిపుంగవుఁడు పుట్టుగన్న విహారా
వనిఁ గాన యహింసనమిం, కనెందుఁజివురింపఁగలదు క్రన్నన" ననియెన్ (11-3-47)

## బీహారు దుండగములకుఁ గారణములు

వ. అయ్యది యట్లుండె - నేఁడు బీహారునం దలయెత్తిన యల్లరులకుఁ గల హేతువులు కొన్ని యిట వివరింపవలయు - కాళీఘట్టమున బేరులుగాఁ గర్మకరులుగాఁ బది లక్షలమంది బీహారుహిందువు లుందురు - ప్రత్యక్ష చర్య ప్రారబ్ధంబైననాఁడీ ప్రజలు పెక్కంఁద్రు చిత్రవధ మొనర్పంబడిరి - హతశేషులు మాతృభూమికిం బాఱి వచ్చి దుండగములతీ రతిశయోక్తులతో నెల్లయెడలఁ జాటిరి - దీనికిందోడు నౌఖాలీ దౌష్ట్య వార్తలు ఘోరాతిఘోరములుగా విహారదేశవాసులచెవికిం దాఁకి హృదయమ్ముల గాయ పఱిచె-పుండుపైని గారముచల్లినట్లు లీగువారి దేశవిభజనోద్యమము పరిణమించె - హిందూమహాసభంబోని మతసంఘము లపుడు వెల్వరించిన కరపత్రములు మంట లకు గాడ్పువోలెఁ బనిచేసె - ఆయాపత్రికలు పాఠకులకుఁ జుట్టెక్కించె - మఱియుఁ గలకత్తాదుండగములు సాగినంతన బీహారుహిందువులఁ గూల్చినంగాని పాకిస్థాన మేర్పడ దనుకరపత్ర మొకండు పాటలీపుత్రమునఁ బంచి పెట్టంబడె - లీగువారు తమమూఁ కల కాయుధప్రయోగ విధానము నేర్పుచున్నా రనియు సుశిక్షితమగు - నమ్మొన లదాటుగావచ్చి హిందువులకుత్తుకలు కోయు ననియు వార్తలు వచ్చె - అట్టి తఱి 'శరణ' మండలముఖ్యపత్తన మగు చాప్రా యందు ముస్లిము దుండగులు రేఁగి హిందూమహిళలం బట్టి కట్టిఁడిచేఁతలకుఁ బాల్పఱిచిరి - ఈ యత్యాచారములపట్లఁ దమసంతాపము దెల్ప నపుడ దాపరించిన దీపావళిని హిందువు లంధకారమయముగాఁ గడప (24-10-46) లీగుసభ్యుం డొకఁడు దీనిం గేలిచేసె - మఱునాఁ దవ్వీటన యగ్ని దరికొని వెంటవెంటన పెక్కుతావులకుం బ్రాఁకి ప్రళయతాండవ మొనర్చె - కీడులోమే లన్నకరణి నీపైశాచికావేశ మైదాఱునాళ్ళక యణఁగారె - ఆసురచర్యలు విజృంభించినతఱి మానవతాదృష్టి గలతావులం దమప్రాణముల సరకుసేయక యెంద ఱెందఱోహిందువులు మహమ్మదీయుల న్మనిచినఘట్టములుం గలవు - వానం గొన్ని యిట వివరింతు. 308

## బీహారు హిందువులు కొందఱు ముస్లిములఁ గాచుట

క. ఒకయూరిముస్లిముల కు, త్తుకలను గోయం దెగించి దూఁకినమూఁకన్
గకవికలొనర్చి రాకు,ట్టికఁ గలయాదవులు సందడించినకడిమిన్. 309

చ. నలువదిమందిముస్లిముల నర్మిలిమైఁ దనయింట నుంచి వా
రలగొద తీర్చుచున్ గృషికరా జొకఁ డిర్వదినాళ్ళు కాచె న
య్యలఘుని గొట్ట ధూర్తు లయిదార్తదవల్ మొనకట్టి సిగ్గునన్
దొలఁగిరి గ్రామమెల్ల నకుతోభయమై బఱిమీఁద నిల్వఁగన్. 310

గీ. హిందువులుముస్లిములునొక్క యెదనుగదలి, మూర్ఖుల నెదిర్చి యిర్వదిముగురఁజంపి
పలువురను బాఁదిపంపిరి భారతీయు, లంద ఱొకజాతివారలే యని రయారె! 311

క. అవమతియొనర్చె హిందూ, యువతికి మతిలేనిముస్లిమొకఁ డొకయూరన్
దవశిఖికైవడి హిందువు, లవలన్ దీం(డ్రించి శితశతాయుధధరులై - 312

గీ. పల్లియం గల మల్కలనెల్లఁ జంప, నెంచి రొకయింటి కగ్గి ముట్టించి రకట!
పట్టి రొకముస్లిమును మంటపాలుసేయ, మట్టి రక్కటికము నెద వట్టిపోవ. 313

క. ఈరక్కసతెగువం గని, సైరింపక రాజపుత్రసతి యోర్తుక హిం
సారతుల వేఁడె నసదా, చారము వల దన్నలార! చనుఁడా! యనుచున్. 314

ఆ. దుండగీం(డ్రదురుసు తొలఁగమి నాచాన, తాన నదుముకట్టె దగ్ధయగుట
కపుడు విన్నఁబోయి రసురలు వచ్చిన, దారిఁ జనిరి లజ్జ మూరిఁబోవ. 315

వ. సౌజన్య మిట్లు కొన్ని యెడల నుఱికినను దౌర్జన్యంబ యానేల నపుడు రాజ్యముచేసె. 316

క. ఆనాఁడు కాళికానగ, రానన్ గలయొజ్జ జనక రాజర్షి మహిన్
దానవధర్మం బెగసిన, వైనము విని మేరలేనివనటం బడుచున్ 317

## నెహ్రూ ప్రభృతులు బీహారుదుండగీం(డ్రకు బుద్ధిసెప్పుట

క. ఇఁక నే నీజగమున నుం, టకు నక్కఱలేమి నిజ మనా! యామరణాం
తిక మగు నుపాస మీకొని, సుకమందెద దెంద మిట్లు చోపు నటంచున్ - 318

ఆ. భారతోర్వి నేలు పండితునకు లేఖఁ (31-10-46), బంప జవహరుండు పదరిపదరి
"ప్రభుత సైఁప దిట్టిపాపపుంజనులకు, సాహసించినట్టి ద్రోహితతిని" 319

వ. మహాత్మా! దివి నుండి భువి కగ్నిగోళములం బఱపి యీమూఁకం బోకార్తు" నని యాచార్యునకుఁ బ్రత్యుత్తరము వ్రాయ నొజ్జ దానిం గని "యోయీ! యాగ్నేయాస్త్ర ప్రయోగము పరప్రభుత్వమునకుం జెల్లునుగాని జాతీయప్రభుత్వమున కెట్లుసెల్లు? - అహింసావిధానముం జేసి దేశమును దిద్దలేనిప్రజానాయకులు తమ గద్దిల విసర్జించుట పాడి" - అని నెహ్రూ నెచ్చరింప నతండు తనపరుసనకు సిగ్గిల్లి తేఱినవెనుక వల్లభాయి పటేలు లియాఖతాలీ మున్నగుమంత్రులును రాజ ప్రతినిధియుం దోడరాఁ గలకత్తాకేగి వంగరాష్ట్రమునం జాగినయాగడముల తెఱం గెఱింగి కలఁగి నలఁగి యధికృతులకుం బ్రజానాయకులకున్ వలయుమాట లాడి పదంపడి బీహారునకుం జని (3-11-46) దారుణహింసా నిఘ్నములైన తావులం జూచి నిట్టూర్చి దుండగీం(డ్ర గర్హించి పాటలీ పుత్రమున (6-11-46) జరిగిన మహాసభ నిట్లు నుడివె - "అయ్యలార! 320

ఆ. ఇంట బయటఁ జిక్కులెన్నేని మనల నేఁ, డె(డ్రిచి కలఁచుచుండ నీర్ష్యలేని
బ్రతుకు నేర్వుఁడని సభన్ మీకు వినిపింప, వలసివచ్చె నా కవారితముగ. 321

క. సామాన్యనాగరిక ధ, ర్మామోదములేని మనికి నాసించునరుం
దేమహిమకైనను ద్రేఁ గగు, నీమాటలు సెప్ప లజ్జ యేఁచెడి నన్నున్. 322

ఆ. ఇరుగుపొరుగువారియిండ్లు కాల్చుట మెదల్, నఱకి నెత్రుటేర్లఁ బరిపి కుల్కు
టేమిపౌరధర్మ? మిది సంస్కృతి గడించు, కొన్నవారు మెచ్చుకొందురొక్కొ! 323

క. మతిసెడినవార లొకదెస, గతిదప్పి యకృత్యములకుఁ గడఁగి రటంచున్
బ్రతికారం బింకొకదెస, నతగులపై బఱపు టుచితమందురె ప్రాజ్ఞుల్ 324

క. కేవలదౌష్ట్యము సాగెడి, నీవసుధన్ నేఁడు; దీనియే పణఁగింపన్
సేవావ్రతనిష్ఠులు త్యా, గావేశితచిత్తులంద ఱలయన్వలయున్. 325

క. వైయక్తికముగ మాదృశు, లీయవనిన్ బదలఁజాల రిది యెన్నక మీ
రాయత్తపడుఁడు లోక, శ్రేయమునకు గేయమైన జీవితమునకున్." 326

వ. రాజేంద్రుం డపుడు సభాసదుల నిట్లనియె. 327

గీ. అన్నలార! బీహారున కున్నకీర్తి, పొలిసె నేఁటికి మంటలోఁ గలిసె నకట!
యిచట రేఁగినదౌష్ట్యమ్ము లెంచినంతఁ గొలఁది కందనిరీధ నన్ గుంచివైచు. 328

క. ఇఁక నీగడ్డను హింసా, త్మకచర్యలు సాగరా; దమానుషధర్మ
ప్రతిరోధమునకు నేల్బడి, యతీవతీవ్రయోగ మనుమతిసేయున్. 329

ఆ. ప్రభుత నంతదనుక రావించుప్రజకుఁ బే, రెంతచేరు సౌఖ్య మెంతకూరు?
స్వపరిపాలనమ్ము వాంఛించువా రింత, మొఱకు లగుట దాస్యమునకుఁ దగుట. 330

ఆ. మఱియు నొక్కమాట మఱవకుఁ డీనేల, నసురవృత్తిక్రన్న నణఁగకున్న
మనకు గాంధి దక్కఁ డనవద్యుఁ డతఁడేగ, నో గ దెంత మూఁడునో కనుండు! 331

వ. పదంపడి కృపలానీ యిట్లు వాక్రుచ్చె. 332

ఆ. చేయరానిపనులు సేఁత శత్రువులకు, మేలుసేఁత తల్లినేలపాలఁ
జెట్టసేఁత కానఁ జిత్తమ్ములను బ్రజల్! కడిగికొనుఁడు క్రోధ ముడిగి మనుఁడు. 333

వ. ఇట్టిసభలు పలుతావులం బ్రవర్తిల్లె – వీనికి సేద్యగాంధ్రు హెచ్చుగావచ్చి నెహ్రూకోర్కిని బాటించి చేతులెత్తి యిఁక హింసదెసకుం జనము చన మని శపథములు కావించిరి – అవెన్కఁ బరిస్థితులు శాంతించినట్లు నెహ్రూ మహాత్మునకు (8-11-46) లేఖవ్రాసి హస్తినకుం జనియె–బీహారుదొరతనమువారు శరణార్థులకు వలయు సాయ మగ్గలముగాఁ గావింపఁదొడఁగిరి–ఇట్టిదశలో బాపూ తద్రాష్ట్రమునకు వచ్చి యచటఁ దనచావో బ్రతుకో తేల్చుకొన నెంచి నష్టిపాలైనపల్లెలం బట్టణములం గనుఁగొంట కుపక్రమించి మునుముందు పాట్నా కనతిదూరమునం గల జనపదమ్మునకుం(12-3-46) బోవ

గీ. వాలుగడ్డముగల ముదివ గ్గొకండు, వచ్చి యాయయ్య కెఱఁగి నెవ్వగలఁబడిన
చుట్టములఁ జూప బూడిదగుట్టలైన, నెలవులను జూప నొజ్జగుండియ కరంగె. 335

గీ. కూలె నచటిమసీదు, గ్రంథాలయమ్ము, కాలె సాహిత్యభారతి కళవళింపఁ
దూలె విద్యాలయమ్ము దుండుడుకునదక, నీకొని తనర్చు పలుగాకిమూఁకకతన. 336

వ. మహాత్ముఁ డానాఁటిమునిమాపురచ్చం బ్రార్థనా మందిరమును గూల్చుట కదుం గదునింద్య మనియు నొకచో దేవళముం జెఱుప మఱియొకచో మసీదు నణఁచుట చెల్లదనియు గుడికిని మసీదునకును జర్చికిని వింగడములే దనియుఁ గరుణామూర్తి యగు బుద్ధభగవానుఁ దుదయించిన విహారభూమి యీనాఁటికి హింసారంగమగుట శోచనీయం బనియు నాగష్టువిప్లవమున (1942) దేశ మహింసాపథముం బాయుట కతన నిట్టికట్టిఁడితనం బేర్పడెననియుం బల్కె - మఱునాఁడు (13-3-46) బాపూ 'పార్సా' యను కుప్పమునకుం జనుచుండ దారిలో 'సిపారా'గ్రామప్రజ లాదీనబాంధవు నాఁపి రొక్కపుసంచితో సమ్మానించుదు మహాత్ముఁ డాజాలెమును విచ్చి చూద నయ్యారి వారిచేవ్రాళ్ళతో నిండిన కమ్మ యొండు కాన్పించె - అందు 337

## దుండగీండ్రు మహాత్మునిముందు సిగ్గిల్లుట

గీ. బాపుజీ! మాయొనర్చిన పాతకముల, సైఁపుమయ్య! మనోవ్యథఁ బాపుమయ్య
తప్పుసేయని ముస్లిముతమ్ములను వ, ధించి సిగ్గిల్లుచున్న నిందితుల మేము. 338

గీ. మతదురావేశమున బుజుమార్గ ముజ్జ, గించి రక్కసితనము వరించి చెడిన
క్రించులకు మాకు శాంతి లభించుటెట్లొ, మస్తకమునెత్తుకొని మేముమనుటయెట్లొ! 339

క. గాసిల్లెడి ముస్లిమ్‌ప్రజ, కీసామ్మును వెచ్చపెట్టవే కరుణాబ్ధీ!
నీసందర్శనమున మము, రాసెదు నవివేకధీ పరాస్తం బగుతన్." 340

వ. అని వ్రాసిననుడులం గని హింసకుఁడు పశ్చాత్తాపమునం గుములుట యహింసా దేవత కొకవిజయ మని బాపూ తలంచి యానాఁటి ప్రార్థనాసమావేశమున నీదేశ మునం దేమూల నెట్టిచెట్ట రేఁగినను మతకులవ్యత్యయములేక ప్రజలంద ఱద్దానికి బాధ్యులనియు దెబ్బకు దెబ్బతీయుట బలహీనుల తెఱంగనియు నహింస బలవల్లక్షణ మనియు నిది కాదనినమ్ముచారు తమనమ్మిక నావిష్కరించుట సముచితమనియు సత్యశ్రవణమున కేను గక్కసపడననియు నహింసాప్రయోగము రిత్తవోవుటం గనుటకంటెఁ జనుటయ మేలుగాఁ దలంతుననియు నాకలలుగన్నసత్యము నన్వేషించుపట్ల భారతా వనియం దేసీమనైన మరణింతుననియు మాతృమహీశ్రేయస్సు బీహారుతీరుపై నాధార పడియున్నదనియు నుడివె. 341

గీ. అంత ముస్లిములీగువా రయ్యచెంత, కేగుదెంచి "భయార్తులై యిండ్లువదలి
కదలి శరణాలయమ్ములఁ గాఁపురించు, ప్రజలు బాపుజీ! తమతమ పల్లియలకు-**342**

క. చనవచ్చు నందురా యిఁక, ననఁ "దాఁకుఁడు కొంతకాల మయ్యయితావుల్
కని వచ్చినపిమ్మట నా, యనుభూతిం బట్టి కర్జమది వినిపింతున్. **343**

ఆ. బాధితులకు నాత్మబలమున్నఁ దులనేని, ప్రత్యయమ్ము వేల్పుపట్లనున్న
నిపుడ చేరవచ్చు నిండ్లకు వారు, నే, నడల నిట్టిచేఁత" కనె గురుండు. **(15-3) 344**

వ. అంత లీగుసభ్యులకోర్కి ననుసరించి దుండగీంద్ర ననుసరించి దుండగీద్ర శిక్షించుటను గూర్చి రాష్ట్రపాలకునితోడను మంత్రులతోడను మహాత్ముఁడు కొంతచర్చ జరిపె - ఇం దమాత్యులయుపేక్షకతన నల్లరు లగ్గలించె ననుసత్యము బయల్పడె - పదంపడి తన పర్యటించినపల్లెలం బొడమినయనుభూతి హేతువుగా నిర్వాసులగువార లిఁక సొంత యిండ్లకుఁ జేరవచ్చునని బాపూ విశ్వసించె - అది యట్లుండె - మహాత్ముఁడు బీహారునకు రాకమున్నె 'సరిహద్దుగాంధి' నాఁ బేరందిన యబ్దుల్ గఫూర్‌ఖాను కాంగ్రెసువారి ప్రార్థనమునం జేసి యాసీమకు వచ్చి దుర్గమగ్రామమ్ముల మత మైత్రీసంపాదనమునకు నలఁగుచుండె-ఆచార్యుఁడు (5-3-47) పాటలీపుత్రమునం దడుగిడె నన్నవార్త నితండు విని **345**

## గఫూర్‌ఖాన్ చాటిన విశ్వప్రేమ

గీ. బాపుజీ! వచ్చితివె! కూచిపగలసెగల, నల్లకల్లోలమైన బీహారుమహికి;
మంచిపని చేసినాఁడవు మనయహింస, కిది పరీక్షావసరముగా నేరుపడియె. **346**

ఆ. అక్కటా! మతమ్ము నండగాఁ గొని రాచ, బలిమి గోరువారు పలుకరాని
పాపములకు నిష్టపడిరి నేఁ డిస్సిరో!, రోఁతగూర్చు రాజనీతి క్రుళ్ళి. **347**

గీ. అని మహాత్మునకుం గమ్మనంప నితని, సరసకుం జేర్చుకొనె నహింసాతపస్వి
ఖాను గురువెంటఁ బత్తన గ్రామములకు, నడిచె మచ్చరికంపుహోవడి నడంప. **348**

ఆ. తరతరాలనుండి కఱకుఁదనమ్మున, వీనుమిగిలినది పఠానుజాతి
నేఁటి కది యహింసఁ బాటించె నీసరి, హద్దుగాంధిపల్కు లవధరించి. **349**

గీ. నవ్యచరిత సృజించె వాయవ్యభూమి, నబ్దులుగఫూరుఖాను ప్రేమాశ్రయమ్ము;
వఱలు నీశ్వరసేవకవ్రాత మనెడి, పేరనీతనిబలఁగ మపారమగుచు. **350**

గీ. ఇతఁడు బీహారునన్ దనయిచ్చ మెచ్చు, ప్రజలతో నొకదళము నేర్పఱుచుకొనియె
నలుగడన్ దరికొన్నమంటలు శమింప, బదలెఁ దనదండుతో స్థితప్రజ్ఞుఁ డగుచు. **351**

వ. గిరీంద్రముం బరిగణింపనిధీరతయు నహింసావిధానమునం దచంచలమగువిశ్వాస మును నిస్స్వార్థప్రజాసేవయు నిర్వ్యళీకమగుమాటయు హిందూమహమ్మదీయుల పట్ల వేఱిమిలేనికూరిమియు నితని నుత్తమపదమ్మునకుఁ జేర్చె - చేసినవెనుకం జెప్పుట యిమ్మేటి కలవాటు - కాన ఖానుపల్కులు ఓహోరుమంత్రులకుం బరమ ప్రమాణము లైనవి - ఈ ప్రెగ్గడలు తనపట్ల నునిచినవిస్రంభము నబ్దుల్‌గఫూరెన్నఁడుం గోలుపోవఁ దాయె - ఎల్లలంగడచిన దుడుకుఁదనములో సరిహద్దుగాంధి వాణి రామబాణముంబలెఁ బనిచేసె - పాటలీపుత్రమునం బ్రవర్తిల్లిన యొక మహాసదస్సున బాదుషాఖా (గఫూర్ ఖాను) నిట్లు నుడివె. 352

సీ. "పైశాచికోన్మాదభరమున హిందూర్వి, తనగీమునకు నిప్పు తాన పెట్ట
నఖిలరాష్ట్రమ్ముల హాహారవంబులు, నెగసిన వీనాఁదు నింగి ప్రిదులఁ
గాఱుఁజీకటికోనగా మాఱె భారత, మార్తమై నాచిత్త మలమటించు
వెలుఁగున కస్మదక్షులు మూలమూలకుఁ బరుగెత్తి తెప్పవాల్పకయు నెమకు
నిస్సిరో! యీర్ష్యలెసరేఁగి త్రెస్సె నీతి, సూత్రములు రాజనైతిక క్షేత్రమునను
కట్లు సడలిన వధికారకాంక్ష కకట! గట్లు దాఁటిన దధమరక్షఃప్రవృత్తి. 353

క. ఏ నిపు డీశ్వరసేవగ, మానవసేవం బొనర్తు మమ తాహంతా
ధీనత విడి ప్రజలెల్లరు, పూనందగు నీభరం బపూర్వక్షమితన్." 354

వ. పదంపడి సభాసదులగు హిందువులు ముస్లిములు సిక్కులు పరస్పరాలింగన పారవశ్య ముతో దాఁపునం గల మసీదున కేగి ప్రార్థనలుసల్పిరి - దీనిం గనుఁగొన్న వారి కానాఁటి ఖిలాఫత్తు నన్నహనము తలఁపునం బాఱె-సత్యారాధకునివాక్కున కింత చేవ యుండు - ఖా నెచటికేగినను మతమైత్రి యిట్లు వెల్లివిరియసాగె - ఇతని పల్కినపల్కులో విశ్వప్రేమమువినా క్రొంగ్రొత్తసొగసు లెవ్వియు లేవు - ప్రేమకు వశంపదని ప్రాణి కరఁగనిచేతనము లేదుకదా! - అది యట్లుండె - వేఱొందు సమావేశమున గఫూ రి ట్లుపదేశించె. 355

సీ. "ఏక జాతీయులౌ హిందువుల్ ముస్లిము, లీదేశమున నెల్లయెడల నుండు
రొకచోట హిందువులకు మందితఱి చుండ, నుండు మల్కుల కది యొందుచక్కి
నీరాష్ట్రమున వంగధారణిన్ రేసిన, దౌష్ట్యముల్ తక్కినతావులందుఁ
దలయెత్తుచో మహాప్రళయ మీజాతికి, నావహిల్లినయట్ల యగుఁగదా! ప్ర
జానియుక్తులు మంత్రులు సాఁకుచున్న, రాష్ట్రముల మతవైరముల్ రాక యెంత
సిగ్గుచేటు! స్వరాజ్య మాసించుజాతి, యింత దిగజాఱుచో లోక మేమిపల్కు? 356

గీ. ఓర్మి కిస్లాము పేరందె నొక్కనాఁడు, నేఁడు పేరందె నీర్ష్యావినింద్యవృత్తి;
కితరమతములవారిరీ రెంచియైన, ముస్లిములు దిద్దవలెఁ దమమొక్కలమ్ము." 357

వ. పదంపడి మహాత్ముని మౌనదినమునాఁటి (16-3-47) సాయంప్రార్థనగోష్ఠిలో సరిహద్దు
గాంధి యిట్లు నుడివె. 358

క. రే పీ భారతదేశం, బేపోకడఁ బోవు ననుచు నెంచినకొలఁదిన్
నాప్రక్కఁ జిమ్మచీకఁటి, యేపారును గాని తోఁప దించుకవెలుఁగున్. 359

క. విలయాగ్నిజ్వాలలఁ బడి, తలఁకెడి నీనాఁడు భారతం; బీమంటల్
మలుగనిచో సర్వమతం, బులవారుం జెడుట నిజముపో! యని వినుతున్ 360

ఆ. నిక్కమైనముస్లి మెక్కడ వెతలుందు, నక్కడన వసించి యార్తసేవ
కొగ్గవలయుఁ గాన నున్నాఁడ నేఁడు మీ, నడుమ నన్నలార! బడలువడుచు. 361

గీ. "ఇఁకనుబదునైదు నెలలలోనేము భార, తావనిఁ దృజింతు" మనిపల్కి రాంగిలేయు
లగుట మనపూఁట హెచ్చె; నెయ్యమునఁ బొదము, పెంపు కయ్యమునం బ్రభవింపఁ
బోదు. 362

క. పాకీస్థానము వలె నను, నాకాక్షం బడినవార లల్లరిదెసకున్
బోకుంట లెస్స; హింసను, జేకూరినప్రాభవమ్ము చెఱుచును శాంతిన్." 363

## బీహారు ప్రజల హృదయములు కరఁగినవి

వ. తరువాత మహాత్ముఁడు తనబలఁగముతో 'మసౌరీ' యనువీటికిం జని (17-3-47)
యచట జరిగిన దారుణ దౌష్ట్యములం దెలిసికొని పెద్దయుంగలఁగి నాఁటి ప్రార్థనా
సమావేశమునం దిట్లుపలికె. 364

ఆ. "ఇటఁ గఠోరదౌష్ట్య మెసరేఁగె నాగుండె, కనలు నీవిపన్న జనులఁ గన్న
మొఱకుఁబనులు ముస్లిములె మునుముందు సా, గించిరఁట కటా! తెగించి యిచట.

గీ. అసి నెవరు ముందుగా దూసి రనుసమస్య, నాకు ముఖ్యముగా; దసంఖ్యాకు లింత
పరుసలై దోసమెఱుఁగని ప్రజలనెట్లు, కూల్చి రనుచింతయే నన్నుఁ గుంచుఁగాని.366

గీ. చెట్టచేసినవారికి శిక్షసెప్పఁ, గదలివచ్చిన తీర్పరిం గాను నేను
నడుతు మానవతావాది నాఁగఁ బతిత, సంఘసంస్కర్త యన నిందు శక్తి కొలఁది. 367

గీ. తప్పుచేసినవా రనుతాపవహ్నిఁ, బడి పవిత్రత నందుకైవడి శ్రమింప
నిటకు వచ్చితి; దోషుల నేఁచుపనికిఁ, జూచుచున్నారు బీహారురాచవారు. 368

గీ. బాధితుల్ తమకుడిచిన బన్నములను, వారి కెఱిఁగింపవచ్చు సాధారములను
బందిగమ్మున నగచాట్లుపడుట కాదు, మదిని సవరించుకొనుట నామతపుశిక్ష. 369

ఆ. ఆర్తసేవకొఱకు నర్పింపుఁడీ విత్త, మన్నలార! కరుణ నాదరించి
యిరుగుపొరుగువారితృప్తిలో మీతృప్తి, యిమిడియుండు సత్య మిది కనుండు." 370

వ. మహాత్ముఁ డిట్లు పల్కుదు నప్పరిషత్తునం గలస్త్రీపురుషు లెందఱెందఱో ముందటకి దూసికొనివచ్చి బాపూ సాఁచినచేతం దమకాన్కల నునిచిరి - వారి మొగమ్ములయం దపుడు విరిసిననొచ్చుకోలు చిన్నెలం దిలకించినంతన యయ్యె కరఁగె - మఱునాఁ (18-3-47) దవ్వీట విధ్వస్తములైన గేహములం గనుట కాచార్యుండు కదల నతనిని వేలకొలఁదిపౌరు లనుసరించిరి - వారి యదుగులతాఁకునంజేసి యెగసిన దుమ్ము ద్యావాభూముల నిండి నివ్వెఱగూర్చె - ఆనాఁటి తొలుసంజప్రొద్దునం గూడిన వేఁడికోలురచ్చం గారుణ్యమూర్తి గాంధి యిమ్మెయిన్ వాక్రుచ్చె. 371

గీ. కరఁగి చెఱువయ్యె నాగుండె కఱకుఁజేఁత, లిప్పురిం జెల రేఁగిన వీక్షసేయ
మతదురభిమాన మిస్సిరో! మానవులను, దానవులఁజేసెనట్టి! యుద్దామ మగుచు. 372

క. బీహారున నింకొకపరి, ద్రోహము లీదృశము లెగయఁ దోద్తో నస్మ
ద్దేహమ్ము నూడ్తు హింసా, మోహము గలవారిమధ్యమున బ్రతుకేలా? 373

క. ఓపరమేశ్వర! నన్నీ, పాపంబులఁ జూచి కుంద బ్రదికింపక నీ
దాపునకుఁ జేర్పవే యని, యాపూఁట నుతింతు వేల్పు నాశ్రితశరణున్. 374

వ. మఱియు నానాఁటి మలుసంజకైవారమునకు బాపూ విజయముచేయుతఱి రెండు కమ్మ లాయయ్యచేతికి వచ్చె - అం దొకలేఖమ్మున 375

ఆ. "సెయిను" గ్రామమునకుఁ జెందినవార మే, మనఘ! నుదువరాని యవగడంబు
లీధరిత్రి జరిగె నిది మాకు దుర్భర, చింత గూర్చు గడఁది సిగ్గు దార్చు. 376

గీ. హిందువులము ముస్లిములము నేకగర్భ, జనితులవిధాన మాయూర మనెద మేము
లేవు మతకలహమ్ములు రావు రాజ, నైతికావేశములు మా కజాతవైరి! 377

ఆ. ఇంతచిచ్చు రేఁగి యీసీమ తాఱుమా, త్రైననాఁడుసైత మన్నదమ్ము
లట్ల యుంటి మేము చిట్లవు పెట్లవు, మాయెదంద లిద్ధమైత్రిఁ దడిసి. 378

గీ. ఏము గర్వింతు మీవార్త లిపుదు నీకు, నెఱుకగావించుభాగ్యంబు దొరకుకతన
మాసుహృత్తతిరమ్ముగా మనఁగఁదగిన, దీవనలొసంగవే యహింసావ్రతేంద్ర!" 379

వ. అని వ్రాయంబడె - దీనితోపాటు శరణార్థులనిధికిం గొంతవిత్తముసైత మాచార్యున కర్పితంబాయె - ఇఁక రెండవలేఖ తెఱంగు వినుతు - ఇది 'బార్హీ' గ్రామీణులు వ్రాసిన జాబు - దీనిరచనయు మొదటికమ్మం బురుడించె - మహాత్ముఁ డీయుత్తరములు చదివి తనతనివిం జాటె - దేశమునఁ గొందఱు కావించినత ప్పందఱుచేసిన దోసం

బగునని గురుం దటనటం బల్కుట యీజానపదులప్రాంతలంబట్టి యథార్థమయ్యె - అది యట్లుండె - మఱునాఁడు (19-3-47) పాట్నామండలమునకుఁ జెందిన కాంగ్రెసు కార్యకర్తలు 'బీరు' నాఁ బరఁగుచోటం గూడుదు బాపూ తద్గోష్ఠియం దిట్లు వక్కాణించె.

ఆ. అల్లరుల నణంప నారటపడినవా, రిందుఁ గలరె? యున్న నెందఱుంద్రు?
దౌష్ట్యములకు మాకు. దగులాటలే దని, చెప్పువారినుడికి నొప్ప నేను. 381

ఆ. అకటఁ తొంబదేండ్లయవ్వను జిదురుపల్, సేయుచుండ బుద్ధిసెడినమూఁక
యెట్లు చూడనేర్చి రీకాంగిరెసువారు, చూచి యెట్లు బ్రదుకు సైఁచి రదిర! 382

## మహాత్ముని శపథము

ఆ. ఇచట శాంతిగూర్పనే నేగుదెంచితి, నది యసాధ్యమైన నంతరింతు
నిది మదీయశపథ మీమిన్ను విఱుగును, గాక నాప్రతిజ్ఞ కాఁక లేదు. 383

ఆ. ఏను విరతిగోర కితరుల కుడుకువ, లేశమాత్ర మిదక దేశమెల్లఁ
బర్యటించి కంటఁబడిన దట్టైమునెల్ల, నుడుగువాఁడ నెట్లుమడిసి తనుచు. 384

క. ఇట మంట లావరింపం, గటకటఁబడుచున్న వారిఁ గాచెడిదనుకన్
ద్రుటిమాత్రమైన నా కూ, అట చిక్కద, మన్మనమ్ము రగిలెడి నొవ్విన్. 385

గీ. అపుడు నౌఖాలిఁ గన్నదృశ్యములు నన్ను, నిట్ల కలఁచి యశాంతిమై నెరియఁజేసె
నది కతమ్ముగఁ జెప్పులువదలి కాలి, నడకతో నూరినూరి కప్పుదమిఁ జనితి. 386

క. అట్టియవస్థయ నా కి, ప్పట్టున రావచ్చు, నన్ను బలఁగంబు కికు
ర్వెట్టినచో దాని న్విడి, కట్టెదఁ బయనమ్ము నొంటిగా నిటఁ దిరుగన్. 387

ఆ. శాంతిగూర్పు టొండెఁ జచ్చుట యొండెఁ బ్రా, ప్తించువఱకు సంచరించుచుందు
నీవిహారభూమి కే నథమర్ష్ణండ, నగుట నెంతకైన నంగవింతు. 388

## ఒకనాఁటి బీహారు

మం. చాంపరాన్ సమరంబు సాగించినపుడు, న న్నీధరిత్రి ప్రాణమ్ముఁగాఁ జూచె
నస్మదీయజయమ్ము నర్థించి వెతల, నెన్నింటినైన సహించెఁ దెగించి
భారతక్షోణి నాపఱిపిన మొదటి, సత్యాగ్రహం బది; సడిసన్న దేశ
భక్తిమై రాజేంద్రబాబు గోరక్ష, బాబు వ్రజకిశోరబా-బాదిగాఁగ
నెందఱోనాయకు లెన లేనిసుఖము, లనుభవించెడిపెద్ద లఖిలభోగముల
విడిచి యానాఁడు నావెనువెంట నడిచి, పదురతోఁ గుడిచిరి పసలేనికూడు
కడిగిరి తమతిన్నకంచముల్ తాము, యుదికిరి తమవల్వ లోడక తాము

యేవగూర్చెడిచేంత లెన్నేని చేసి, పేదవారలలోనం బేదలై వినయ
మూర్తులై కాంపులముప్పు లదంపం, గదు గాసిచెంది రాకథ లెట్లు మఱుతు?
నపరాజితంబగు నాసంగరంబ, బీహారునకుం దెచ్చిపెట్టె నుద్దీప్తి;
నాయౌరసత్వము నావిష్కరింప, నిం కొక్కమా జీమహీప్రజల్ నదుము
కట్టుదురా? యిచ్చకములను మాని, నిందుమనమ్ముతో నిలుతురా? యొండె
వదలుదురా యొంటివానింగా నన్ను?, వదలిననేమి నే వదలను వీరి
వదలను బీహారు వదల నాసేవ, వంగభూమికి సర్వభారతక్షితికి
నూదె మొనర్తు నీయుర్వినే నిలిచి, హిందువుల్ ముస్లిము లీనేలం జెలిమి
నుందురా యుందరా యుచ్ఛృంఖలముగ, రేంగినపో రీధరిత్రి నింకైన
నడంగునా యడంగదా యన్నది తేల్తుం, బ్రజలలో సద్భావబల మావహిలినం
బ్రజలలో సత్యానురక్తి యేర్పడినం, బ్రజలలో హార్దానుభవము పాటిలిన
నిచట జయంబు రా నేమి యబ్బురము?, పోలీసు లాయుధంబులకొసల్ చూపి
యిట శాంతి చేకూర్తురే కలకాల? మీ శాంతి కోరువా రెట్లు స్వతంత్ర
భారతమ్మున కాసపడెదరో యెఱుంగ, నింగ్లీషువారితో నిన్నాళ్ళనుండి
జరుపునాలముకంటెం జాల బెట్టిదము; నాం దగు నేంటిరణం; బది యొరుని
తప్పుపై నెఱపుయుద్ధం; బిది తనదు, నెగ్గుపై బఱపుపో; రిందు జయంబు
రా దలంతులతోద రా; దైననేమి, విశ్వ మోహో! యను విజయ మియ్యదియు. 389

వ. పదంపడి సమావేశము సమాప్తమాయె - బాపూ హృదయవేదనను గుర్తించిన బాదుషా ఖాను మున్నగుననుయాయు లెనలేని విషణ్ణతం జిక్కిరి - ఆనాం దొజ్జ పలుపల్లెల పెద్దలతో బాధితులసమస్యం దద్గతదవి కర్తవ్యములు నిర్ణయించి మఱునాండు 'మాసోరీ' చేరి (20-3) ప్రార్థనాసమజ్యం ది ట్లుపన్యసించె. 390

ఆ. నిన్న నేండు కంటి నన్నులార! దురంత, బాధలన్ దపించు పల్లెపట్ల
నకట! వానికుడుచునార్తి నీ నాల్కతోం, బలుకనొల్ల నేద్పు బలియుం గాన. 391

గీ. హిందువుల్ తమకాల్చిన యిండ్లవిలువ, ముస్లిముల కీయందగు సిగ్గుముంపుతోద
గతచరిత్రను మఱచి బెగ్గలము మాని, మనవలె మహమ్మదీయు లాజనపదముల. 392

ఆ. ఇచట మేలికర్జ మెది సాగినను దాని, మహిమ నిందు నెల్లమండలముల
మొదటిమంచిచేంత మొక్కలీం బ్రనుతాప, వహ్నిం జిక్కి బాష్పవారి విడుట. 393

## పాంచాలమున దుండగములు సాగుట

వ. ఆర్తసేవాపరాయణుండై యిట్లు బాపూ శ్రమించుచుండ నట్లీ మున్ను (20-2-47) కావించిన ప్రకటనమునం జేసి ముస్లిములీగువారు సంపూర్ణాధికారముం బదయం

బాంచాలమునఁ బ్రత్యక్షచర్య నతిదారుణముగా సాగించిరనియు నౌఖాలీలో మరల నది సాగింపఁ జూచుచున్నారనియు నుదారజన హృదయవిదారకవార్తలు వెలువడియె – వీనం గనలిన బిహారుహిందువులు కొందఱు మరలఁ గత్తినెత్తం దలకొనుచుండ మహాత్ముఁ డీయవలక్షణముల విని క్రుంగి యుభయవర్గములకున్ వలయుహితోక్తులు పల్కి యుద్రేకములు తగ్గించి యవ్వలినాఁ (21-3) 'దసాదిహో' యను కొట్టికకుం జనఁ బరిసరగ్రామములవలన వచ్చినమహమ్మదీయు లాయయ్యం గని వినీతిమై నిట్లు విన్నవించిరి. **394**

మం. "బాపుజీ! ముస్లిముల్ బంగాళమునను, దోఁచినసొమ్ము హిందువులకు నిడిన
నిచటి హిందువులు మాయిరవులఁ గొల్ల, గొట్టినకల్మి మాకు నొసంగుదురఁట
యభియోగములను మే మణఁగించుకొన్న, మాతోద నిఁక వారు మచ్చరింపరఁట
నౌఖాలి నీపరిణామముల్ జరుగ, వలెనఁట" నా నొజ్జ వారక వగచి
ముం దున్న హైందవముఖ్యులఁ జూచి, ముస్లిములందఱు మూర్ఖులైనపుడు
హిందువులంద ఱట్లేమాఱవలెనె? సిగ్గిల్లఁదగినట్టి చెయువులు వంగ
ధరణిఁ జాగినమాట తథ్యమ కాని, యిచటిహింసలు వాని కేపాటి తగ్గుఁ?
బాంచాలమునవస్థ పాంచాలమునకు, వదలక యానేలవా రేలతడవ?
భారతీయులభావపథ మింతనీచ, గతికి రాఁజెల్లునా? కటకటా! మతము
పశుధర్మమునకుఁ దోడ్పడఁ జూతురేమి? యాసీమలో ముస్లి మెవఁడు కీడ్పడిన
నయ్యపకార మే నందిన ట్లెంతు, నే నేలవచ్చితి నీనేల కిపుడు
చెదిరినయెదఁదలఁ జేర్పనకాక, నాకోర్కి తీఱనినాఁ డీపాలాన
మరణింతుఁ గాని క్రమ్మఱి పోవనొల్ల, ననుదు సభ్యులు మెచ్చి రాచార్యుపల్కు
తమపాపములకుఁ బెద్దయు నొచ్చుకొనిరి. **395**

వ. నాఁటిసాయంసభ 'గోర్వను' గ్రామమునం బ్రవర్తిల్లె – అచట మున్ను జరిగిన దుండగము లతిఘోరము లగుటంజేసి వానియాగడ నెఱింగినబాపూ **396**

క. కదువగవు నంది తునుమం, బడినప్రజల కాత్మశాంతి పాటిల్లుటకున్
మదుఁగుమది నీశ్వరునిగొ, ల్వుఁడా! యనుచు వేఁడి హిందువుల ముస్లిములన్- **397**

క. ఈ కాలినగేహము లీ, యేకారెడిసతులు పాప లిట నేచినహిం
సాకృత్యములం దెల్పెద, రేకరణిన్ నరుఁడు వలచె నియ్యాశరతన్. **398**

క. గంగన్ మునిఁగినఁ బాప మ, దంగదు బాధితులచెంగటన్ నిలఁబడి మీ
యంగద లణఁగించెద మను, చుం గొంటెలు పల్కినపుద సురుగున్ దొఱఁగున్. **399**

గీ. ముస్లిముల గౌరవప్రాణములను గావ, నిలిచి రెచ్చినధూర్తుల యలుకమంట
మాఁడి మసియైన హైందవుమదివెలంది, తనము నగ్గింతు బాష్పాంబుధారలొలుక. **400**

క. నిందితులై సర్కారున, కందనివా రిపుడు కొంద ఱగ్గపడుట నా
దెందమును దనిపె; దుండగు, లందఱు నిటు లొంగవలయు నధికారులకున్. 401

ఆ. ప్రభుతవారికంటఁ బడ జంకువారు నా, దండ నేర మొప్పుకొంద్రుగాక
యొండె నన్మదనుచరుండు గఫూరున, స్నిధి నిజంబు వక్కణింత్రుగాక. 402

## మహాత్ముండు దుండగములపాలైన తావులు చూచుట

వ. అని హితోక్తులుపల్కి మఱునాఁడు (22-3) పాటలీపుత్రమునకుం జనుచుండ నయ్యార్త
శరణ్యునిరాక విన్న 'పిపల్వా' గ్రామమహిళ లయ్యెంతకు వచ్చి 403

గీ. తుంటరుల్ తమభర్తలఁ దునిమి రనియుఁ, గన్నువిప్పని పాపలఁ గదపి రనియు
వేశ్మములనెల్ల బూదిగావించి రనియుఁ, జెప్పికొని యేడ్చి రాకటా! శిలలు కరఁగ.404

వ. దుఃఖభారమునఁ గ్రుంగినమహాత్ముం డపుడు 405

క. మాటలతో ననుతాపము, చాటితి మని తృప్తిపడక సరగన్ బ్రజయా
రాటము నణంచుచేఁతలఁ, జాటుం డని హిందువులదెసం గని వినిచెన్. 406

ఆ. దుండగములకంపుతోడిపా త్రెఱుఁగని, పల్లియలకు వీరిఁ బంపుఁ డనియె
భువిని దివిని జేఁత యవుఁగాని నరకముం, జేఁత తగునె యనె ఋషిప్రభుండు. 407

క. ఆయమ్మలఁ గని మీదయ, నీయకథల్ నన్నుఁ బెద్దనెగులున ముంచెం
బో! యనె గతమున్ మఱచుట, శ్రేయం బనె ఖలుల సైఁపుసేయుండ! యనెన్. 408

వ. పదంపడి బాపూ పాటలీపుత్రముచేరి నాఁటిసాయంకాలమునం దచ్చోట జరిగిన ప్రార్థనా
సమావేశమునఁ బ్రసంగించుచు నిట్లనియె. 409

ఆ. "అన్నలార! కంటి నాసురధర్మముల్, సాగి చెడిన పెక్కు జనపదముల
మానవత్వ మింత మడఁగినదా యని, యదలి యదలి చచ్చినంత యైతి. 410

క. బనన్ నవశకదీప్తులు, కానంబడెఁ బ్రజలయం దకార్యప్రవణం
బైనప్రదు కెంచి వారలు, నానం బడి రార్తులైరి నవసి రయారే! 411

గీ. ఏను జెప్పినపని చేయ నిష్టపడిరి, యిడిరి బాధితనిధికి నెక్కుడుగ సొమ్ము
ముస్లిముల పునరావాసమునకు వార్చు, చున్న తెఱఁగు లిఖించిరి యుత్తరముల. 412

గీ. ఎందఱెందఱో హిందువుల్ హింసకులను, నిలువరించి మముం గాచి రలఘుమతులు
ధన్యులమమేమనుచుఁగొన్ని తావులందు, ముస్లిములుపల్కి రానందముద్రమెఱయ.

గీ. చేసితిమి పాపములు కృపంబాసి నిరప, రాధులను జంపితిమి సైఁపరాదు మమ్ము
దండితులఁ జేయుఁ డని దొరతనమువారి, కగపడిరి కొంద ఱనుతాప మగ్గలింప.414

ఆ. డాఁగియున్న వారు తమతప్పులను గ్రన్న, నియ్యకొందు రనియ యెంతు నేను
దోస మొప్పుకొనుట తుంటరికే కాదు, రాష్ట్రమునకుఁగూడ రాణదెచ్చు." 415

వ. మఱుసటినాఁడు (23-3-47) ముస్లిములీగునం బేరుగన్న వాఁ డొకండు మహాత్ముం గని మీరాక యిచటి మహమ్మదీయులకు నుత్తేజము కూర్చెనని ప్రశంసించె - బీహారునం దిట్లు శుభపరిణామ మేర్పడుచుండఁ బాంచాలమునం దాగడములు సాగెనని వల్లభుఁ డాచార్యునకు లేఖవ్రాసె-అది మహాత్మునెడఁదం బెద్ద కలఁచె-పదంపడి (26-3) బాపూ దుండగములనాఁడు తద్దయుంజెడిన 'జహనాబా' దను వీట విడిసి యచటి కనతి దూరమునం గల 'బెలాయి'యను పల్లెకుం జని (27-3) యది పద్దపాట్లు పరికించు చుండ నొకగేస్తు మహాత్మునిచెంతకు వచ్చి 416

క. ఈగోదదిబ్బలో నా,పైదలి కల దెన్మిదేండ్లపాపఁడు కలఁడే
నాదరువులేనిపక్షిని, నాఁదలఁకెన్ బిత సబాష్పనయనద్వయుఁడై. 417

వ. తరువాత నాల్గడుగులు ముందటికిం జని

క. ఈపూతిగంధి యే మని, బా పనుదున్ ముస్లి మతఁడు పదిపీనుఁగు లీ
కూపమునం గలవు ప్రభూ!, పాపంబులు మావి యిట్లు పండిన వనియెన్. 418

గీ. కడుపుచుమ్మలువాఱఁ దత్కథలు విన్న, గాంధి నరుఁడిట్లునరుఁ జంపఁ గడఁగు నేని
చానివాఁ డెట నుండు రాచతీక మింత, ఘోరమా? యనినిట్టూర్చి క్రుంగఁబడియె. 419

వ. అంత నాచార్యుఁ 'దమాత్వా' యనునూరి కరిగి యచట లీగువారి యాజమాన్యమున సాగుచున్న శరణాలయముం గని యందలి బాధితులకు హిందూద్వేషము కఱపంబడుట యెఱింగి బోద్ధలగు లీగునాయకులం బిలిచి 420

క. మీచందము నాడెందము, రాచెడి నిది మిమ్ము దుర్భరవిపత్తులకున్
లోఁచుఁజూఁడీ! మతగరిమము, నేఁచుఁజూఁడీ! హింస నెవ్వఁ డీప్సిత మందెన్. 421

క. పాకీస్థానము వచ్చిన, రాకున్నను మనము సామరస్యార్థులమై
యేకోదరుల ట్లుండుట, యే కృత్యం బనియె సత్యమే గెల్చుననెన్. 422

వ. మఱియు నాఁటిమలుసంజ 'నోక్రీ' యనుపల్లియం బ్రవర్తిల్లిన ప్రార్థనసభలో 423

ఆ. అన్నలార! వేవె లరిగె రాజప్రతి,నిధి పదమ్మువీడి నిజధరిత్రి;
కతనివ్రేఁగు మోయనరుదెంచెఁగార్మక, ప్రభుత పంప 'మౌంటుబాట' నిటకు (22-3)

క. కదపటివైస్రాయిగ నే, నదుగిడితిన్ భారతోర్వి; నన్ని చనువు లి
య్యెడఁ గలప్రజలకు నిడి నే, వెడలెద ననె నతఁడు మీరు విన్నారుకదా! 425

ఆ. సంశయమ్ములేని సవరణలేని ప, ల్కది; నిక్కృష్టదాస్య హతధరిత్రి
కుదుకువను గదించు నుడి యది; మనమది, మాఱుకున్న రెత్త మడఁగు నదియు. 426

ఆ. ఇచట హింసనేచ్చు యిట్లు ఱంపిల్లుచోఁ బ్రజలు తెల్లవారిఁ బాయలేరు
నిలుఁడు నిలుఁడు ప్రల్లదుల నాఁగి మాభయం,బుడుపుఁ దనుచు వారి నడుగఁగలరు.

వ. అవు దందుపాటైన స్వర్ణావకాశము గప్పు కావచ్చు - నేఁడు నేఁ గనుచున్నదృశ్యము లను వినుచున్న వార్తలను బట్టి యిచటి మహమ్మదీయులు హిందువులవాగ్దానములు విశ్వసింపమి యబ్బురము గాదు-కులమతానురాగములు మాని దుందగిం(డ్రం)బట్టి దిద్దుట కీరాష్ట్రమునందలివా రందఱుం దొడరవలయు - అపహృత బాలికల వారితలి దండ్రుల కొప్పనసేయవలయు - ఇతరేతరస్పర్థలతో రక్కెస పనులుసేఁత కదుంగదు నింద్యము - దోసకారి త న్నవమానించుకొనుటయ కాక తనమతమును సంఘమును మాతృభూమినిసైతము పరాభవించినవాఁ డగు. 427

ఆ. ఒజ్జ యిట్లుపల్కి 'యోక్రీ'ని విడి తన, బసకువచ్చి దారినొసఁగఁబడిన(27-3రాత్రి)
రొక్కమిచ్చి దీని లెక్కింపుఁడా! యని, పనిచె దస్సియున్న యనుచరులను. 428

ఆ. చిన్నతప్పు వచ్చెఁ జిల్లరలెక్క న, య్యదియు సైఁపఁజాల ననియె గాంధి
యతనితీవ్రదృష్టి కదలె మానూకన్య, 'హునరు' శిరము వంచుకొని వగర్చె. 429

మం. మఱునాఁటి(28-3) తేపు తన్మహినార్తులైన, ప్రజలుకొందఱువచ్చి బాపున కెఱఁగి
మాపాలివేలుపుమాడ్కి వచ్చితివి, మాపీడ మాజంకు మఱఁపజొచ్చితివి
కదుధన్యులము మేము; కాని యీనేల, నల్లరుల్ సాగి పాడైనపల్లియల
రాచవార్నిలిపిన రక్షకభట ద, ళమ్ముల ముస్లిముల్ సగపాలుదనుక
నుంట మేలని యెంతు మోపుణ్యపురుష!, యేల్బడివా రిట్టియేర్పాటు సేయఁ
దోద్పదు మన నొజ్జ దూష్య మీతలఁపు, దీనికి నే సమ్మతింప - నిక్కరణి
నౌఖాలినున్న హైందవులు పల్కినను, వల దిట్టిచూ పని వారింతు వారిఁ
దగ దిట్టి(బ్ర)దు కని తరలింతు వారి, నెల్లి పాకీస్థాన మేర్పడునేని
తత్సేన హైందవదళముగా నుంట, వలయుఁగదా మీరు వల్కుటంబట్టి;
యది సాగునా చనునా తమ్ములార!, తడవుఁ దొగాములు తలఁ కుజ్జగించి
యిత రేతరప్రేమ మెసఁగ జీవింప, హిందువుల్ ముస్లిము లియ్యకో ల్బాపు
టొకటి వినా వీరియున్నతి కన్య, మార్గము లేదు నామాటలు వినుఁడు! 430

క. నావుడు నౌఖాలీకథ, లీవసుధన్ మాటిమాటి కీ వెత్తినచో
రావా చిక్కులు హైందవ, భావమ్ములు కలఁగి వక్రపథమునఁ జనవా - 431

వ. అని బాధితులు ప్రశ్నింప నాచార్యుఁడు 432

గీ. ఇచటి హిందువుల్ చేసిన యెగ్గు మాటి, యచట ముస్లిముల్ సల్పినయవగడంబు
చాటితి నటందురా? వేఁదు సత్యమునకుఁ, బెనఁగు వానికి మతకులప్రీతి యణఁగు.

క. తేవలె నని వంగధరి, త్రీవృత్తాంతమ్ము లేను దే నేనాఁడున్
రావచ్చు నయ్యవి ప్రసం, గావసరమ్మునఁ బ్రయత్న మది లేకున్నన్. 434

గీ. ఐన నిచటి ముస్లిము లొప్పు రని తలంచి, యేను నౌఖాలిఁ బంజాబులో నెసంగు
నల్లరులు నాచెవికి వచ్చినపుడు వాని, నుఱక నోర్మూసికొని యెటులుందుఁ జెపుఁడి!

క. పదుగుం బేకయు బెరసిన, వదువున నీగాథ లుండ వదలుట యె ట్లే
ర్పదు నొక్కదాని? నన్నలు!, చిడిముడిసెందక సమీక్షసేయుం దనియెన్. 436

## బీహారు హిందువులను బాపూ హెచ్చరించుట

వ. నాఁటిమధ్యాహ్నమునం దనపాలికి వచ్చిన యయ్యాయి గ్రామములవారిం గని 437

గీ. కడిగికొనుఁ డన్నలార! మీయెడఁద లసలు, కొన్న వవినేఁడు పైకొన్నకుత్రపనుల
నేము దోసంబు వీసంబు నెఱుఁగ మనుచుఁ, జెప్పినను మీనుడిన్ విశ్వసింపఁజాల. 438

గీ. హిందు వొక్కఁడు సల్పినహింస కెల్ల, హిందువులు బాధ్యులే యని యెంతు నేను
ధర్మ మతిసూక్ష్మదృష్టిమైఁ దచ్చు టొప్పు, నిహపరసుఖమ్ములకునిదియే కతమ్ము. 439

ఆ. అన్యుఁ డెది యొనర్ప నలుగు నరుండు తా, నది యొనర్పఁగూడ దన్యుపట్ల
నఖిలధర్మములకు నాధార మిది విశ్వ, శాంతి కిది యమోఘసాధనమ్ము. 440

క. మీమనములు శుద్ధము లని, మీమాటలు సత్యగంధమిశ్రము లని యే
నీముస్లిములకుఁ జెప్పుదు, నా? మదిమది మీకు నిష్టమని పల్కుదునా? 441

వ. అని బాపూ నిగ్గఁదీసి యదుగ 442

క. జానపదు లాడి రశ్రు, స్నానముతోఁ గంపమానసంహననముతో
మానుదులు నమ్ము తండ్రీ!, పోనొల్లము కరుణలేనిపోకద కనుచున్ 443

## రాజప్రతినిధి కోర్కిపై బాపూ హస్తినకుం గదలుట

గీ. ఆర్తబాంధవుఁ డిట్లు బీహారుధరణి, శాంతి నెలకొల్ప మిగుల వేసరుచునుండ
వంగపాంచాలములఁ జీల్పవలయు నన్న, నిర్ణయమొనర్చెఁ గాంగ్రెసునేతృసమితి. 444

క. అవిభక్తభారతమ్మున, కవిరతకృషి సేయుఁ గాంగ్రె; సది యీనాఁ డె
ట్లు వరించె విభజనం బని, జవహరునకు వ్రాసె జాతిజనకుఁడు కమ్మన్. 445

వ. అధికారధూర్వహుఁడై యున్న నెహ్రూ దానిం గని 446

క. బాపూ! పరిస్థితులు మ, మ్మీపని కొప్పించె నిత్యహింసానిఘ్నం
బై పజ సచ్చుట కోర్వక, కాంపురమును వింగడింపఁ గాంగ్రెసు వలచెన్. 447

వ. అని ప్రత్యుత్తరము నంప నాచార్యుఁ దేడియుం దోఁపక నలంగుచు నపుడ రాజ ప్రతినిధి త న్నా కారణసేయుదు నయ్యూయిముఖ్య కార్యములు పూర్తి కావించుకొని (30-3) హస్తినకుం గదలె-విమానమునం దీపయనము సాగింపు మని మౌంటుబాటను కోరినను గోట్లకొలందిభారతీయులకు లభింపని సౌకర్యము నాకేల యని మహాత్ముఁడు ధూమశకటమున మూఁడవతరపుఁ బెట్టియయంద చని వఱువాతబండి దిగి యది తననడకతతి యగుటం బదయాత్రతోడన ఢిల్లీయందలిపాకీవాడకుఁ జేరె-ఈనడక బాపూ శారీరకమానసికవికాసమునకు ముఖ్యకారణము నాఁ జెల్లు - అది యట్లుండె - అనాఁడు (31-3-47) 448

## ఢిల్లీలో జరిగిన యాసియాసభకు మహాత్ముని యుపదేశము

మం. ప్రొద్దు వాలినవెన్కఁ బోయి మహాత్ముఁ, డీక్షించె నాదరం బెసఁగ వైస్రాయి
నతఁడు బాపూపట్ల నత్యంతభక్తి, చాటి తజ్జీవితసరణి నెఱింగి
తనిసనె, నతనియుదాత్తత గాంధి, నలరించె; నిర్వురు నపుదు లోఁతులకుఁ
జనక సామాన్యచర్చలతోడ నాఁగి, రంత సరోజినీయాజమాన్యమున
నవ్వీటఁ గూడిన యాసియాసభను, బాల్గొని యిమ్మెయిం బలికె దేశికుఁడు. 449

క. మనసంస్కృతి సత్యాహిం, సనజనితంబై జగత్ ప్రశంసలఁ గనె శాం
తి నిదానముగా సౌహృద, ఖనిగా వినయాశ్రయమ్ముగా నిది వెలసెన్. 450

గీ. ప్రాంతచుట్టఱికమ్ములఁ బాటిచేసి, మనము నేఁ డిట్లు కలియుట మంచిచేఁత
మనకు నిఁక ననిదంపూర్వమైత్రి యొదవి, యది జగత్తుష్టికారణ మగునుగాక! 451

క. ఐరోపారాజ్యమ్ముల, వారు రగిల్చినరణాగ్ని వడిసెద నిపుడే
యూఱట గనుచుంటిమి మన; మారాచఱికమ్ము లిఁక నహంకృతి విడుతన్. 452

క. పడమటివారికి లోపడి, కదు నింద్యంబైనబ్రదుకు గడపితి మిఁక నా
సడి వోయి మనకు మహి నె, య్యెద కేగిన మేలిగద్దె లేర్పడుఁగాతన్. 453

గీ. భౌతికబలమ్ము సుఖదాయియై తనర్పు, జాతి కాధ్యాత్మికంబగు శక్తివలయు
నేఁటికయ్యములకు నెల్ల చేటులకును, హేతు వీశక్తి లేమిగా కెద్ది సెపుఁడి! 454

ఆ. తెల్లవానిపట్ల నొల్లమి మనకు లే, దతని రాజ్యతృష్ణయందుఁగాక
తృష్ణ యది ఘటించు నెన్నేనిసమరముల్, సమరములు ప్రపంచశాంతి నడఁచు. 455

గీ. విశ్వమైత్రికి మనమైత్రి వేఱుకాని, దగుట నిది చూచి పాశ్చాత్యు లదలఁజనదు
సంశయంపదరాదు, సంశయిత సుఖము, పొందుటకుఁ జాలఁ దెంతవిభూతియున్న.

ఆ. ఇన్నిరణము లిన్ని యారస లిన్నిరా, జ్యంబు లిన్నివింగడంబు లేల
జగము సర్వ మొక్కశాసనసభకు లో, పడి సుఖింప మీరు బడలు టొప్పు. **457**

గీ. ఆముకొని యేప్రభుత్వమే నబలమైన, దేశమును ద్రొక్కుచో భారతీయుఁడోర్వఁ
డితఁడు పదయుస్వతంత్రత కుతిలపడెడు, ప్రజలఁ దేర్చుటకే ధర్మరక్షకొఱకె. **458**

క. తన సత్యాహింసలతో, డన వీఁడు జయమ్ము నందుట జగం బెఱుఁగున్
మనుముం దైన నితం డీ, గుణములకు విధేయుఁడై తగున్ మన్ననకున్. **459**

ఆ. పట్టణమునఁ గాదు భారతదేశాత్మ, పల్లెపట్టునంద తెల్లమగును
రక్షసేయు నేడులక్షలయూరు లీ, జాతి కున్నపరువు నీతిబరువు. **460**

ఆ. తతయశస్సు గన్న ధర్మప్రవక్తలు, మనధరిత్రిఁ బుట్టి మన్నవారె
మఱల మనము సర్వమహికిఁ దత్సందేశ, వాణి నిపుడు వినుపవలయుఁజుండు. **461**

ఆ. సత్యవాణి యది ప్రశంసనీయప్రేమ, వాణి యది మతమ్ము వర్గ మనెడి
మచ్చలేని విశ్వమానవతావాణి, యది జగాన కదియె యమృతవాణి. **462**

ఆ. కలవు నేఁడు సాంఘికద్వేషములు రక్త, దాహములును భారతప్రజాళి;
నకట! వీన లజ్జనందెదఁ గాని యీ, మంట లెల్లకాల ముంట కల్ల. **463**

గీ. సభ్యసోదరులార! నశ్వరములైన, దోసముల వీని మఱచి మే మాసచేయు
సత్యమునుగైకొనుందహింసనువరింపుఁ, దఖిలవిశ్వంబునకుఁ గూర్పుఁదమృతసుఖము.

వ. లోకబాంధవుఁ డగుమహాత్ముఁ డిట్లుపదేశింప సభాస్తారుల హృదయాబ్జములు విచ్చె- పరిషత్తున మైత్రీనిర్ణయములు పుట్టె - పరాధీనమగు జపాను తప్పఁ దక్కు దేశములెల్ల నీసభకుం దమప్రతినిధుల నంపె-ఉదారాశయుండగు గాంధి రాకం జేసి యీసదస్సునకు వన్నెహెచ్చె - సమతాదృష్టిమై నెల్లరాజ్యములు వర్ధిల్ల వలయునని బాపూ వలచు - జాతిద్వేషము హింసాప్రవణతయు నతనికి నేవ పుట్టించు-కావుటం జేసియ రణోన్మాదము వలదని యానాఁడు హిట్లరునకును వాని నెచ్చెలి టోజోకును (జపాను నియంత) లేఖలు వ్రాసె -ఉభయపక్షములకు బుద్ధిసెప్పి చిత్తశుద్ధితో మధ్యవర్తిత్వము నెఱపి యుద్ధప్రళయమును వారింపు మని యమెరికా నర్థించె - ఎంతచేసిననేమి - రాగద్వేషపరాభూతమ్ములగు చేతమ్ములు తిమ్మనం బడయ నాతేండ్లు సెల్లె - అది యట్లుండె. **465**

క. మఱునాఁడు పటేల్ మున్నగు, గఱువలు రేపాడి వచ్చి గాంధికి హింసన్
దురపిల్లు భారతావని, చరితమ్మును వినిచి వనట చాటినవెనుకన్- **466**

## మౌంటుబాటను మహాత్ముని బ్రశంసించుట

గీ. ఒజ్జ వైస్రాయికడ కేగ నుద్దిలేని, వినయముం బ్రకటించె సజ్జనుఁ డతండు
సాగినవి రాజనైతికచర్చ లిరువు, రకును శీతల సురభి శారామవేది. 467

వ. అయ్యెడ రాజప్రతినిధి మహాత్మున కిట్లనియె. 468

గీ. అదిర! హింసకులొంగని యాంగ్లతంత్ర, మగ్గపడె నీయహింస కోయన్న! నేఁటి;
కెల్లి మాపోక కిదియకా హేతు; వెన్ని, సిలుగు లోర్చితివో దీన సిద్ధివడయ. 469

ఆ. అగునుగాని భారతావని నేఁడింత, చెడినదేమి గోతఁ బడినదేమి
రాజకీయమైత్రి రా నెదికృత్యమో, కాన్పుమయ్య! పోరు మాన్పుమయ్య! 470

## గాంధివేఱు - కాంగ్రెసువేఱు

వ. పదంపడి బాపూ లెస్సయాలోచించి నేఁటితాత్కాలిక జాతీయప్రభుత్వమును జిన్నా తన యిచ్చవచ్చినవారితో నిర్మించుకొనవచ్చుననియు నందలియమాత్యు లెల్లరు మహమ్మదీయులైనను గాంగ్రెసు నిందింపరాదనియు నమ్మంత్రిమండలి సేయు నిర్ణయముల బాగోగులను దనవైయక్తికాధికారముతో రాజప్రతినిధి పరిశీలింప వలయుననియు రాచదండుతక్క లాఁతిపౌఁ జెద్దియు నిట నుండరాదనియు (లీగువారి నేషనల్ గార్డువంటిది) దేశము స్వతంత్రము కాకమున్నె నిరాక్షేపమగు విభజన విధానమును రచించి జిన్నా సాహెబు వైస్రాయికి సమర్పింపవలయు ననియు నీతీఱున కతఁ డంగీకరింపఁడేని యీబరువుం గాంగ్రెసు మోయవలయు ననియుఁ దనమదిం దోఁచినపరిష్కారమార్గము సూచింప మౌంటుబాట నిది కుతంత్రములేని యుదారవిధాన మని మెచ్చె-కాని 471

క. జవహరునితలఁ పెఱుంగుట, యవసర మనె; నతఁడు కాంగ్రెసౌ ననుచో నే
నెవఁడ నెదురాడ నని తన, యవరోధము దెల్పె మృదుల మగుశబ్దములన్. 472

వ. తదనంతరమ్మున 473

ఆ. గాంధి విన్నఁబోయి కళవళపడి యిఁక, నస్మదాశయంబు నడుగనేల
దాని కెంతవిలువ దక్కు? నేఁ గాంగ్రెసు, తోడిపొత్తు లేనివాఁడ నైతి. 474

ఆ. ఇపుడు భారతోర్వి నేలుకాంగ్రెసువారె, తగినవారు నీకుఁ దగవు సెప్ప
దేశసేవ నాతితేతీనవారు స్వ, రాజ్యయోధకుంజరములు వారు. 475

క. నాకే నేఁ బ్రతినిధినై, నీకోరినయపుడు వక్కణించెద హితమున్
వేకువ బీహారునకుం, బోకకు నాయిత్తపడితిఁ బొమ్మనవె ప్రభూ! 476

వ. అని (11-4) రాజప్రతినిధికి నుత్తరముఁవ్రాసి మఱునాఁడు పాటలీపుత్రమునకుం జనుచు వల్లభున కి ట్లొకకమ్మ లిఖించె. 477

క. "అన్నా! మనతలఁపులలో, నెన్నో భేదములు పుట్టె నిఁక దేశమునం
బన్నినచిక్కుల నేలిక, సన్నిధిఁ జర్చింప నాకుఁ జన దని తలఁతున్. 478

ఆ. ప్రజలమేలు కోరి పక్షపాతములేని, సరణి కేగి నావచస్సు నరయు
మాప్తులైనవారి నడుగు మెదో నెగుల్, గాంధి నేఁచు నని తలంపఁబోకు. 479

గీ. ప్రజలఁ బాలించుచున్న నీవంటివార, లేను గనలేనిమేలుగీ ళ్ళెఱుఁగఁగలరు
మీవహించుభరమ్ము నామీఁదనున్న, నాడియుందును మీరు మాటాడినట్ల. 480

క. మనదేశం బభ్యున్నతి, గన నిపు డే నెట్టియూడిగం బొనరింపం
జనునో యని తర్కించెదఁ, దన కింకొకచేఁత సేయఁ దగులము లేమిన్. 481

# గుడిలో ఖురాను చదువకుము

వ. అయ్యది యట్లుండె - ఈ పయనమున బాపూ హస్తినకుఁ జేరుసరికి రావల్పిండి నుండి వచ్చిన కాందిశీకులు వినిచినహింసావార్తలకతన ఢిల్లీప్రజలు కొఱకొఱ లాడు చుండిరి - ఇట్టితరి(31-3) హరిజనవాటికంగల వాల్మీకిదేవళమున జరిగిన ప్రార్థనా సమావేశమునం దాచార్యుఁడు ఖురానువాక్యముల కొన్ని చదువం దొడఁగ హిందూ మహాసభాసభ్యుఁ డొకండు లేచి చప్పట్లు సఱచుచు 482

క. హిందువులు కొల్చుదేవుని, మందిరమిది; యిచట నన్యమతవాక్కులు ప
ల్కం దగ; దనుడున్ సభ్యులు, కొంద ఱతనిదెసకుఁ బండ్లుకొఱుకుచు దూఁకన్- 483

ఆ. వలదు వల దటంచు వారి వారించి యీ, గోష్ఠి నొకఁడు 'కాదు, కూడ' దనిన
నాఁపివైతుఁ బ్రార్థనారంభ మని సము, దారసరణిమై మహాత్ముఁ డనియె. 484

మం. పదపడి ప్రత్యర్థి బాపుజీకడకుఁ, జని యెదో తర్కింప జతనంబుసేయ
నాఁగవోయీ! యని యతని సదస్యు, లాఁపిరి కోపారుణావలోకముల;
నొజ్జ యీజగడంబు నోరువలేక, "శాంతింపుఁ డన్నలు! శాంతింపుఁ" డనుచు
నెదిరికి నెదురుగా నేతేరఁదొడఁగె; నింతలో సభ్యులు హిందూమహాస
భా కార్యకర్తను బయటికి నెట్టి, రాచార్యుఁ డీచేఁత కలమటనెంది
"యాతఁ డల్కకుదాసుఁడై యున్నవాఁడు, వెత్తికి నల్కకు వేర్మి హుళిక్కి
వలయు నల్క నణంచు వానికి మృదుత, వలయుఁ బ్రసన్నత వలయుఁ దితిక్ష;
బీహారునం దిట్టి పిచ్చిగోవాళ్ల, నెందఱనో కంటి నెరిసితి లజ్జ;
నేతాదృశులత్రిక్క నెఱుఁగుఁ; దనింద్య, సరణిఁ బొం" దని సభాస్తారులఁ దేర్చె. 485

వ. రెండవనాఁటి(1-4) వేఁడికోలురచ్చ సాగినంతన మహాత్ముఁడు కొలువుం గలయఁ జూచి ఖురానుచదువరా దనువారు నేఁడుం గలరా యన నొక్కయువ లేచి నిన్నటివాదమ యారంభించె - బాపూ వాని నుద్దేశించి. 486

గీ. అన్న! యిది హరిజనుల దేవాలయమ్ము, కలరు పెద్దలు దీనిమే ల్గాంచువారు
నన్ను వారించునధికార మున్నధర్మ, కర్త లీకొన్నపని కీవు కనలఁ దగునె. 487

క. పాకీపని కావించిన, నాకును నలుసంతపెత్తనము గల దిచటన్;
నీ కేల రిత్తవాదం, బీకొందువె మలము నెత్త నీవున్ జెపుమా! 488

సీ. అనుటయు నాపిన్నఁ దాఁగక యాగుడి, నెవరుకట్టించిన నేమి భగవ
దారాధన మొనర్పుహక్కు హిందువులకు, నెల్లరకుం గల దిచట; నేను
హైందవుఁడను ఖురా నిందుఁ బాఠ్యము గాని, దనునధికార మున్నట్టివాఁడ
నీ వెటకేని పోయి వరింపు మద్దాని, నాచెవి సైఁపనినాద మద్ది
యని యెవో రజ్జులకు నొగ్గ జనత పెద్ద, గోలతో గేలిచేసి యాకుఱ్ఱవాని
నోరు మూయించి బాపుజీ! మీరుచదువుఁ, డీ! ఖురాను, వీనికిజంక నేల యనియె.489

గీ. గాంధి యప్పు డప్పుడుచును గని సదస్యు, లిన్నివందలమంది యా నన్నదాని
నీవు కాదందువా వీరినోవి కోరు, టుచితమా యనఁ దాళి కూర్చుండె నతఁడు. 490

క. పదపడి వేఱొకకుఱ్ఱం,డదరులు గ్రక్కుచు మహాత్మ నడిగె మసీదున్
గడసి యట నీవు గీతన్, జదువనికారణ మదేమి సామీ! యనుచున్. 491

మం. అతనియావేశంబు నతనియుద్వేగ, మరసి యాచార్యుఁ డిట్లనెఁ దమ్ముఁవాఁడ!
శాంతింపవయ్య! నీసరణి హిందువుల, మతమును బెనుచునా మఱచునుగాని
తాల్మికి హిందూమతం బున్కిపట్టు, వలచు విశాలభావం బిది సతము
కలఁ డిట బాదుషాఖా, నీమనస్వి, మేనఁ బ్రత్యణువున మెఱయు నీశ్వరుఁడు
ఖానునందును నీకు గారాము లేదె; యితని బాసయు రుచియింపదే నీకు
భావ ముత్తమమైన బాసచేవచ్చు, కీదేమి సోదరా! కినియక తదవు;
మీ వియ్యకొనుదన్క నేను ఖురాను, వినుపనింతియు కాదు వినుము నీకంటెఁ
బసివాఁడు వలదన్నఁ బ్రార్థనసేయ. 492

వ. అంత నాపిన్నవాఁడు నీవు పాంచాలమున కేలపో వని యొజ్జను నిగ్గఁదీసియడుగు చుండఁ బ్రజ లుద్రిక్తులై వాని జఱవ నాయి త్తపడిరి - బాపూ వారిం బదరి యోయీ! ప్రార్థన సాగింపుమందువా యని ప్రత్యర్థి నడుగ నతఁడు ఖురాను మాని మొదలిడు మనియె - పదంపడి మహాత్ముఁడు సదస్యుల నూఱడించి సభం బాసి తనబస కేగి దానం బ్రార్థనగావించుకొనియె - మూఁడవనాఁటి (2-4) కైవారపుంగొలువున ముప్పు

రాచార్యు నవరోధించిరి - వారి యడ్డపాటును మన్నించి బాపూ తనయున్కికిం గదల సభాసదులు వేఁడికోలు జరుపుఁ దని యయ్యె నర్థించిరి - ఒజ్జ వారికోర్కికి లొంగక

ఆ. ఎద్రుచువారిబలంగ మీనాఁడు హెచ్చె నీ,జగడ మెంతదనుకఁ జనునొ రెచ్చి
పోరుకతన నెన్నిపోరాము లొదవునో! కనుఁడు కర్జ; మేల కయ్యిమిచట. 494

మధ్యా. నన్ను రామభజనమ్ము నొనరుచువాని నౌఖాలిసీమ
నెన్నఁడు నెవ్వారు నడ్డగింపర యిమ్మె దెగించి
విన్నారు కొంద ఱాపాట లోర్మిని విడువక నిల్చి
చన్నారు కొంద ఱారవళి సైఁపక సదసును వీడి. 495

క. అది వోలుఁ గాని యవగద, మిది తగునా యెవరు నేర్పె రీపిన్నల కీ
చదు వకటా! యని కుందుచు, నెదవ్రేఁగునఁ దా వసించునింటికిఁ జనియెన్. 496

వ. నాలవనాఁటి (3-4) వఱువాత నాచార్యుఁ డోహో! యహింసకు ననుదినం బగ్ని పరీక్ష మూఁడుచున్నది - ప్రజలింత మొండితన మేలచూపెదరో - అని తలంచుచుం గనువిచ్చి మ్రోలనున్న మనూకన్యం జూచి యోసీ! మనము సత్యాహింసలకై సాగించుపోరాట మావంత పరాకుపడినం గెలువదుసుమా యనియె - అపుడ యేతెంచిన మౌలానా సాహెబునకు దైవము నన్నుఁ బెద్దకాల మీలోకమున నిలువనీ దని నుడివె - తదనంతరమున రాష్ట్రీయస్వయంసేవకసంఘనాయకుఁ డొండు మహాత్ముం గదిసి మీప్రార్థనా కార్యక్రమమున కిఁక నుపరోధము లెవ్వియుం బొడువ వని నమ్మఁబల్కి చనె - కాని యానాఁటిసందెజామునం బ్రవర్తిల్లిన కైవారపురచ్చలో నొజ్జ యథాపూర్వము ప్రశ్నింప నొకకోడెగాఁడు చేయెత్తె - అంత హిందూమహాసభాసభ్యుఁ డొకండు లేచి సదస్యుల నుద్దేశించి 497

ఆ. అన్నలార! యొక్కపిన్నవాఁ డెదిరిన, విడుతు ననియె గాంధి వేఁడికోలు
మనము దారిదప్పి మాటాద మూన్నాళ్ళ, నుండి ప్రార్థనమ్ము మొండిపడియె 498

క. మన కిది లజ్జాకరమగు, పనిసుం; డిఁకనేని పాడి పరికించి మహా
త్మున కడ్డవాట్లు వేయమి, చను ననె వినయప్రభా ప్రసాధితవాణిన్. 499

ఆ. శాంతి విరిసె నంత సభ; నహింసావిజ, యమ్ము గని మహాత్ముఁ దలరు గుడిచె
నడచెఁ గీర్తనమ్ము నానామతస్తుతి, వాక్యరవము కొలువువారిఁ దనుప. 500

వ. ప్రార్థనానంతరమున బాపూ సభవారిం గని యిట్లనియె. 501

క. "మున్నాళ్లీకై వారము, మన్నాపదె నని సదస్యమండలి హర్ష
స్కన్నము కారా దీశ్వరుఁ, దున్నాఁడుకదా తదాత్మ నుజ్జ్వలుఁ దగుచున్. 502

క. పెదవులతో భగవంతుని, పదములు మొరయించుకంటె భక్తుఁడు శుచియై
హృదితో నీశ్వరుఁ దలచుట, యధ్బతఫలకారి యందు రధ్యాత్మవిదుల్. 503

ఆ. నాల్గునాళ్ల నుండి న న్నడ్డగించిన, వారికతన మేలె వచ్చె నాకుఁ
బగలు రేయు నాత్మపరిశోధనమ్ముతోఁ గడపి కార్యసరణిఁ గంటిఁ గాన." 504

వ. పదంపడి ప్రార్థనాసభలు నిర్నిరుద్ధములుగా సాగె - అయ్యవసరమునంద జాతీయ వారముసైత మేతెంచె - నాఁ డొజ్జ మతకలహముల నహింసతో నణఁపం దెరువులు వెదకఁదొడఁగె - అయ్య కపుడెన్నిన్ని యొకమ్మలు మతావేశపారాయణప్రేషితమ్ములు దైనందినముగా రా దొరంకొనె - ఒకనాఁటి సంకీర్తనసదస్సున బాపూ తల్లేఖలపై మహమ్మద్ గాంధి, జిన్నా బానిసీఁడు గాంధి, మతద్రోహిగాంధి మున్నగు విలాసము లుంట తెలిపి 505

గీ. అయ్యలార! వినుండు "మహాత్మ" బిరుద, మిచ్చి రింతకుమున్ ప్రజ; లిపుడు వారె
యొసఁగి రీపట్టములఁ దన; కొక్క మొగిన, గారవించెద వీని వింగడము గనక. 506

ఆ. మఱియు మాననీయమతకర్తలు తపించి, వినుచుసత్యవాణి విశ్వసింతు
నన్నుఁ దూలనాడునరు సైఁచునోర్మి రా, నహరహమ్ము హరికి నంజలింతు. 507

## నన్నుఁ జంపునపుడును రామనామమే పల్కెద

గీ. ఘాతుకుం డెవఁడేని నన్ గాల్చినపుడు. రామనామముగా కన్యరావ మెదియు
మ్రోఁగ దీయధరమ్మున మ్రోఁగు నేని, నన్నుఁ దెక్కలికానిఁగా నెన్నవచ్చు. 508

ఆ. హిందువులకు నేను హితుఁడనో రిపుఁడనో, చాటఁగలదు నేను జచ్చు తెఱఁగు
దురభిమానమునకు దూరదూరంబగు, నెఁదద యున్నవాఁడె యెఱుఁగు నిజము. 509

గీ. కాదు మానవునకుఁ బ్రతీకారవాంఛ, చనదు పగదీర్చుకొనవలె ననుతలంపు
చెల్లుఁ దత్కార్యములు జగద్వల్లభునకె, నిఖిలశక్తిసనాథుఁడై నెగడుదొరకె. 510

ఆ. నరుఁడు కోరరాదు పరమేశునధికార, మల వెతింగి యతఁడు మెలఁగవలయు
యేను గోరు నిట్టిహింసను గనుబ్రదు, కి మ్మటంచు వేల్పు నెఱిఁగియెఱిఁగి. 511

## ఢిల్లీ నుండి పాట్నాకు

వ. అని తనహృదయవేదన సూచించి బీహారుదెసకుం బయనముగట్టి తన్నిర్ణయంబు నొక ప్రార్థనసభ నావిష్కరింప సదస్యులు కొంద ఱయ్యా! నిరంతరహననములం జొలి వోయి విహ్వలించుపంజాబున కీ విపుడు చనవా? యని యమ్మహాత్మునడుగ నచటిసిక్కులు హింసాప్రయోగమున దేశవిభజనము నరికట్టుదురఁట - తాదృశులు నా పలు కెట్లు

పాటింతురు? వారినేల కే నేగినం బోదముల గ్గేమి - నేఁడు పాంచాలమునం దెగసిన మంటలు వంగవిహారరాష్ట్రములకుం బ్రాఁకుదేరకుండునట్లు సూచుట నాకర్తవ్యమని నమ్మితి - నే నిందు జయింతునేని నావాణి మతోన్మాదమున కగ్గపడినముసల్మానులను సిక్కులం దేర్చి పంజాబునఁ బ్రజాజీవనము నుద్ధరింపఁగల దని బాపూ వచించి(12-4) బీహారునకుం గదలె. 512

మం. పాట్నాకుఁ జేరినపదపడి గాంధి, యార్తులమేలుగీ త్వరయుచు నుండఁ
"గాంగ్రెసుపెద్దలు కరిపురిన్ జరుపు, సభకుఁ దప్పక నీవు చనుదేరవలయు
నాచార్య!" యని జవహరుఁ దమ్మహాత్ము, పజ్జకు నొకవిన్నపమ్మును బంపెఁ
దనదారి కాంగ్రెసుదారి వేర్పడిన, భగవానుపై సర్వభారంబు నునిచి
తరలె భారతరాజధాని కాయోగి, వచ్చెఁ బాకీవాంద్రవాద కాత్యాగి (1-5-47) 513

## పాట్నా నుండి ఢిల్లీ - పాకీవాదకు

వ. వెనువెంటన తనసన్నిధి కేతెంచినమహామంత్రి నెహ్రూపండితునితో రాజనైతిక చర్చ కావించుచు భారతజాతీయమహాసభవారు దేశము విభక్తము కామికిం బెనఁగవలయు - పాకీస్థాన మేర్పడునేని యందలియల్పసంఖ్యాకవర్గములు సుఖింపవు - జిన్నా యిప్పట్లఁ బల్కుపల్కులు నమ్మరానివి-అని బాపూ నుడివె - పుడమింజీల్పనిచో శాంతి యాపాదిల్లదని జవహరుండనియె - చీల్చుచో నశాంతి హెచ్చునని మహాత్ముఁడు వల్కె - ఎట్టకునేని కాంగ్రెసువారు (3-5-47) విభజనమునకుం దలయూఁపిరి - తా మింతకుమున్న (47 మార్చిలో) మెత్తఁబడిన వేర్మితీర్మానముపైఁ జెఱగనిముద్ర వైచిరి - తోడ్తోడన ఢిల్లీరాజకీయవాతావరణము వేఁడెక్కె - మతావేశము పెరుఁగం దొడఁగె - జాతిపిత కీమార్పులు పెద్దయుం గలఁత గూర్ప దద్రక్తప్రసారత్వర హెచ్చె - ఇట్టితఱింగూడినవేఁడికోలురచ్చుకుఁ బ్రజ లగ్గలముగా వచ్చిరి - వారిలోఁ గొందఱు ఖురానువాక్యములు పఠింపరా దని గందరగోళము సాగింప 514

క. బాపూ హిందూస్తానికి, నాపల్కుల ననువదించి యనుచితభావం
బీపదములఁ గలదా యన, నోపఁడ మాఱాడ రచ్చ నొక్కరుఁడైనన్. 515

గీ. వీనులొగ్గి యనూక్తంబు వినియు మఱల,సభ్యు లద్దిరి మూలమున్ జదువఁదొడఁగ
మాయురే! యేతదుక్తులు మఱవరాని, వేల వల దందు రని వారి నెద్రిచి యొజ్జ-516

గీ. వంగభూమిని బాంచాలవసుధయందు, ముస్లిములు కొంద ఱవగడములకుఁ జొచ్చి
ప్రజల నేఁచిరి గాన ఖురాను చదువ, రాని దనుట సమీచీన మౌనె చెపుఁడి! 517

క. బీహారున హిందువులును, ద్రోహమునకుఁ దెగరె? వీరిదోసము గీతా
మాహాత్మ్యమ్ము నణఁచునె? స, మాహితమతి నరయుఁ దన్న లౌగాము లనెన్? 518

## దేశవిభజనమునకు బాదుషాఖాను వగచుట

వ. అంత మహాత్ముఁడు బీహారునకుం జన నుద్యుక్తుఁ డగుచుండఁ గాళీఘట్టము హింసా నిష్ఠుమై యలందురుచున్న దనువార్త వెలువడె - బాపూ దీనం గలఁగి కలకత్తాకుఁ (7-5) గదలు తటి బాదుషాఖాను దీనతామగ్నవదనుఁడై గాంధిం గని 519

మధ్యా. "ఏనాఁడు కాంగ్రె సహింసను నిజమహీదాస్య మణఁపఁ
బూనె నానాఁటిసుత యది పోయినపోకడ కొప్పి
యేను నావారు బదలితి; మోజగా నెంచితిమి నిను;
నీనెమ్మి నార్జించి తనిసితిమి వేల్పునెనరు గన్నట్లు. 520

మధ్యా. భారతక్షోణిని జీల్పఁ గాంగ్రెసువా రియ్యకొన్న
కారణమున నీధరిత్రితోడిసంగాతము లేని
పౌరుల మైతిమి; లీగుదొరలకుఁ బదదు మాగాలి;
యాఱనిచిచ్చు మాయెదఁద రేఁగిన దకట! మహాత్మ! 521

వ. మాభవితవ్యము దైవంబ యెఱుఁగు - అది యెట్లుమాఱినను మీ రున్నంతదనుక మా కెట్టిచింతయు లేదు - మేము మీబంట్లము" - నావుడు బాపూ లోలోన మిగుల నారటపడి స్వాతంత్ర్యము రాక నిక్కము - కాని యీ వీరుఁడు బానిసముం గుడుపు తప్పదు - అయినను గఫూర్ఖాను భగవద్భక్తుఁడు - భక్తున కార్తియెక్కడిది? అతఁడు సమదుఃఖసుఖుఁడు - నిత్యసంతుష్టిమంతుఁడు- మానావమానములను మిత్రామిత్రుల నొక్కమై గానంగలదిట్ట" - అని తన్నుఁ దా నాశ్వసించుకొని వంగనగరమునకుఁ జేరి (8-5) రాజప్రతినిధి కొక లేఖ వ్రాయుచు భారతదేశమును విభజింపరాదనియు విభజన మావశ్యకమగునేని నేఁటిదొరతనమువా రేఁగినవెన్క దానిం జెలిమినొండెఁ బగనొండెఁ బ్రజలు సాధింపవచ్చు ననియుఁ దాత్కాలికజాతీయ ప్రభుత్వమును గాంగ్రెసువారో లీగువారో నడుపంజనుగాని యిరువుం జాగించు టొప్ప దనియు నాంగ్లేయులు సదాశయు లగుదు రేని స్వదేశసంస్థానములపైఁ దమకున్న పెత్తనమును సైతము స్వతంత్రభారత ప్రజ కప్పగింపఁదగుననియు నల్పసంఖ్యాక వర్గముల మేలుగీ ళ్వరయ నొకపాడిపట్టు రూపెత్తవలయుననియుఁ దాము పదవయెక్కు దనుక నిచటిశాంతిని బరిరక్షించుట తెల్లవారికర్తవ్యమనియుఁ బౌరశాఖాధికారులు (ఐ.సి.యస్. వారు) దురభి మానములు వీడి నేఁటిసుత జాతీయప్రభుతకు లోఁగి ప్రజాసేవ కావించుట సమంజస మనియుఁ నందుఁ దేటపఱచె - వైస్రాయి దీనింగని మహాత్ముని విజ్ఞతం గొనియాడి "దేశముంజీల్చుట మేలిపని గామి నిక్కమ - కాని కాంగ్రెసువారే నేఁ డీవిటతాటనమున కారటించుచున్నారు - జాగైనచో లీగువారు వేఱువల దందు రేమో యన్న శంకయు వీరికిం గలదు - వీరి చందము నట్లీప్రభుత్వమునకు నివేదించి వీరు బాపూబాటకు

వచ్చునట్లు నాయోపినంతవట్టు శ్రమింతు'' -అని తన గఱువతనముం జాటె - అది యట్లుండె - మహాత్ముఁ డపుడు సతీశచంద్రదాస గుప్తప్రతిష్ఠితమును ఖాదీకేంద్రము నగు సో దేపురాశ్రమమున విడిసె - రవీంద్రుని జయంతియు నానాఁడ తటస్థించె - నాఁటి సాయంప్రార్థనప్రసంగమున బాపూ విశ్వకవిం బ్రస్తావించి యిట్లనియె. 522

## రవీంద్రుని జయంతిలో బాపూ ప్రసంగం

ఉ. భారతమాతృగర్భమునఁ బ్రాజ్ఞశిరోమణు లాత్మవిత్తముల్
భూరితపఃప్రదీప్త ఋషిపుంగవు లిద్ధకవిప్రభుల్ మహో
దారమతప్రవక్తలు ప్రజాభ్యుదయప్రవణుల్ జనించి రీ
ధారణి కద్వితీయమగు ధన్యతగూర్చిరి తీర్చి రజ్ఞులన్. 523

మధ్యా. ఈవసుమతికి వీ రిడినసందేశ మెనలేనికల్మి
నావలెఁ; దద్వాణి కాద మొసఁగినన్ మన మెట్టి
హావడి నెఱుఁగక శాంతిసంపన్నమై హవణిల్లు
జీవనమును గాంచి లోకమిచ్చు జేజే లందఁగలము. 524

క. రవిరచనలు సాహిత్య, చ్ఛవితో వెల్వడినయుపనిషత్తులు, తాదృ
క్కవితాస్రష్టల కీర్తికి, నవతవినా రాదురాదు నవఁత లవమ్మున్. 525

వ. పదంపడి మహాత్ముఁడు తనసన్నిధి కేతెంచిన ముఖ్యమంత్రి సుహ్రావర్దిం గని యీ రాష్ట్రమునం దేచినహింసాచరణమ్మునకు నైతికంబుగా నీవ పూఁటవు నా సర్వ రాష్ట్రముల యందుం జాగినయాగడముకెల్ల నీవ బాధ్యుఁడ వని యతం డెదు రాడె - లీగునాయకుని పల్కుల నొజ్జపాటింపక ప్రసన్నతం బాయక తమ సంస్కృతిపెంపు వలచువారు మైత్రి కాముకు లగుట వలయు ననియుఁ దానును జిన్నాయుం గలసి శాంతికై కావించిన విన్నపమును మన్నింపఁదగుననియు నతనికి హితమ్ముగఱపె - ఇంతలో మనూకన్యకు వేఁకి సోఁక మహాత్ముం డాకెకు నిరంతర మగుసేవ యొనరింపన్ దొరఁకొనె - ఇట్టియెడ నాశ్రమమునకు విచ్చేసిన వెజ్జు విధాన చంద్రరాయి నలఁగినలఁగియున్న గాంధిం జూచి 526

ఆ. భారతోర్వికెల్లఁ బ్రాణంబ వైన నీ, వింతనీరసించి తేమి తండ్రి!
తగదు కార్యభరము తగదు నీ కూఱట, పెద్దవలయుఁ గొన్ని ప్రొద్దు లనఘ 527

## నేను విశ్రాంతి నెట్లు కోరుదును?

మం. అనుదు మహాత్ముఁ డోయన్న! నాబలిమి, తగ్గినమాట తథ్యమ కాని చూడు!
నాముందు నావెన్క నాకెలంకులను, మచ్చరించుచు నిన్నిమంటలు రేఁగఁ

జల్పార్ప కెట్లు విశ్రాంతి నర్థింతు, నుడుపక శాంతి నేయోజ గడింతు
నవనిఁ బాలించునాయకులు నామాట, పాటింప రీనాఁడు ప్రజలును మెచ్చ
రీ నేల వారికి నిఁక నాకతాన, వచ్చు మే లెయ్యది; వారు నన్ విడిన
నావిధిం బాయక నాసేవ విడక, నిల్చుటో కూలుటో నేఁ దేల్చుకొందు
నెల్లజగంబుల నేలు కారుణ్య, థాముని రాముని దలపోసికొనుచు
నీదేహమును బాయుటే నాకు నిష్ట, మీకోరికను జగదీశుండు తీర్పఁ
గలఁ డన్న నమ్మిక కలదు నామదికి. 528

వ. అనినం జికిత్సకుఁడు మాఱాడనేరక జాతిపితకర్తవ్యనిష్ఠకు విస్మయంపడె - ఆచార్యుఁ డవ్వలం గాళీఘట్టమునకు వచ్చి దుండగములు రేఁగిన తావులం గని యందలిప్రజకు వలయుసందేశము నొసఁగి పైనము సాగించి పాటలీపుత్రమునకుఁ (15-5) జేరి మూత్రపిండవ్యాధికిం జిక్కిన మనూగాంధికి శస్త్రచికిత్స సేయించి యిప్పట్లఁ దనప్రకృతి వైద్య ముడివోవుటం గలఁగి తనవారికావించిన సేవాకార్యములు పరిశీలించుచుండ.

## నెహ్రూకోరికపై మహాత్ముఁడు ఢిల్లీకి రాక

సీ. గడియగడియ కొక్కకైవడి మనరాచ, మెలికలు మొలకెత్త నిలుపులేని
దెందాల నిటఁ దల్లడిల్లుచుండిరి నేఁడు, కాంగ్రెసుపెద్ద; లాంగ్లప్రభుత్వ
సచివమండలితోడఁ జర్చలు సాగించు, తలఁపున వైస్రాయి తరలెసీమ;
కతఁడు వైళమ భారతావని కేతెంచి, చాటు నట్లీమంత్రిచయముతీర్పు
నిపుడు నీప్రాపు మా కెంతయేనివలయు, నాఁకసెప్పక రమ్ము ఢిల్లీ కటంచు
జవహరుఁడు నమ్రతాద్యుతుల్ సందడింపఁ, బంపె నుత్తర మాజగద్బాంధవునకు. 530

మధ్యా. తనవచనంబు కాంగ్రెసువలంతులఁ దన్పంగఁ జాల
దని గురుఁ డెంచెఁ గాని సచివాగ్రణియైన మనీషి
మనము నలంప నొల్లక ప్రయాణపుమల్లడి లెక్క
గొనక కరేణుపత్తనము చేరుటకున్ సమకట్టి - 531

వ. ఆయాసంఘములును దొరతనమువారు గావించుపునరావాసకార్యక్రమమునకు వలయు మెఱుఁగులు దిద్ది ప్యారీలాలు మున్నగుననుచరులకుఁ దగుసూచన లిచ్చి భిషఙ్మణి సయ్యద్ మహమ్మదు మొదలగుసహృదయులం బేర్మిమైఁ బలుకరించి మానవ హృదయ మ్మునఁ గల మంచితన మార్తులం గాచు నని నమ్మి (24-5) హస్తినకుం గదలె - ఇది బీహారుం దుదిసారిగా విడుచుట యని తాఁ దలంపఁడు-కాని దైవయోగమునం గొట్టకొస కట్ల జరిగె - అయ్యది యట్లుండె. 532

గీ. దేహళీనగరమ్మును దేశికుండు, చేరిచేరకమున్నె వచ్చినవి జాబు
లీవు ప్రార్థనతతి ఖురా నెత్త కనుచుఁ, గొందఱు లిఖించినవి త దస్పందమతికి. 533

ఆ. సాగె వేఁడికోలుసభ; ఖురాన్ చదువకు, మన్నవాఁ డొకండు నందు లేఁడు
కమ్మ లట్లు దూఁకెఁగద యిదేమని గాంధి, వెఱఁగుసెందియపుడువినిచెనిట్లు. 28-5

గీ. "నల్లజెండాలతో వచ్చి నాఖురాను, చదువునకు నడ్డవాట్లువేసెద మటంచు
నాకు బరుసనిలేకలన్ బంపినట్టి, హిందువులు రారు సభకు నేఁ డేమికతమొ? 535

గీ. నల్లజెండాలతోఁ గాదు పొల్లవదని, దుడ్డుఁగఱ్ఱలతోడన దూఁకి వారు
నన్ను నలినలి గావించినను ఖురాను, పఠనమును మాన నీశ్వరప్రార్థనమున. 536

గీ. ఎవ్వఁ డేయె గ్గొనర్చిన నేను బెదరి, పిలువఁ బోలీసువారి నీకొలువుదెసకు
వలయునని నేఁడునన్నుఁ జంపువాఁడు రేపు, పరితపించుట మందాక్షపడుట నిజము."

వ. అంత నాసదస్సునందలిహిందు వొకండు లేచి"బాపూ! మతోన్మత్తుఁ డెందేని రేఁగి విశృంఖలవిహారము సాగించిన నేమిసేయవలయు" ననమహాత్ముఁడు "వానిం బట్టి యున్మాదివైద్యశాలకుఁ బంపవలయు - అతనితోఁ బెనఁగుతరి వీరులవోలె మనము చత్తుమేని మనచావు వానిపిచ్చికి మందగు - ఇది రాచపిచ్చిగాని మతోన్మాదము కాదు - దీని నణఁగించుతెఱంగు వేఱు - నేఁడు ముస్లిములు నన్ను బలసి బాఁకులుమెఱసి పాకీస్థానము నంగీకరింపవా యని గ్రుడ్లుతిమిరేని మునుముందు నాదేహముం జీల్చి పంచుకొని పదంపడి మనదేశముం జీల్పుఁడని చిఱునగవునం బల్కెద - మన మందఱ మిట్లు నుడువంగల్గిననాఁడు వారి వెఱ్ఱి యుఱ్ఱింకు" - నావుడుం బృచ్ఛకుఁడు దీర్ఘాలోచనమునం బడియె - తదనంతరమున 538

మం. ఒకనాఁటిరేపాడి యొజ్జతో నడుచు, రాజేంద్రుఁ డిమ్మహీప్రజలకు శాంతి
కఱవాయెఁ బ్రాణసంకటము ఘటిల్లె, నవనిని విభజించునందాఁక శమము
చేకూర దని లోకసేవలో మిగులఁ గీరితిగన్న కాంగ్రెసువారు తలఁతు
రేమందు వీవు తండ్రీ! యని పల్క, గాంధి యిట్లనె "శాంతి కదిసినవెనుక
భారతోర్విని బాయపఱుచుట యుచిత, మగుఁగాని వేర్మి నేఁడంగీకరింప
నేర్పదు నెన్నేనియిదుమ; లరాజ, కస్థితి రేకెత్తి కట్టడల్ సమయు
నాసురంబగువృత్తి యదరు నీగడ్డ, నల్పసంఖ్యాక ప్రజావళి బ్రదుక
లేక యల్లాడును లీగు రాజ్యమునఁ, గాందిశీకులసంఖ్య కడుకొను నిచటఁ
గూటికి గుడ్డకు గుడిసెకుం బెద్ద, యిఱకటం బగు; దేశ మేలెడివారు
మిన్ను సూతురు రిపుల్ మేలమాడెదరు, ధర్మైకదృష్టిమైఁ దర్చి వచించు
పలు కిది యిది శాంతి పండించుపలుకు." 539

## గఫూర్‌ఖానునకు బాపూ ధైర్యముసెప్పుట

వ. పదంపడి మహాత్ముఁ డాప్రత్యూషగమనమువలనం దనమనికికిం జేరుసరికి నాయయ్యుం జూడ గఫూర్‌ఖా నందు వార్చియుండె- అతఁడు బాపుం గన్నంతన వివర్ణ వదనముతో

మహాత్మా! జగం బింక మమ్ముఁ బాకీస్థానపుం బ్రజలలోఁ జేర్చును గాంబోలు - వాయువ్య
రాష్ట్రమునకు బెలూచిస్థానమునకు నెట్టియిక్కట్లు వొదమె! - మా కీడుర్దశం గర్తవ్యమేమి?
- గతియెద్ది? - నా నొజ్జ యిట్లు నుడివె. (31-5) 540

క. నైరాశ్యము కలదె యహిం, సారతచిత్తునకు బాదుషా! నీకును నీ
వారికిఁ బరీక్షతతి యిది, ధీరత వాటింపఁదగిన దినమిది సుమ్మా! 541

ఆ. వలదు వసుధఁ జీల్పవలదని ప్రకటింప, వచ్చు మీరు జంకువదలి నేఁడు
చేయుటో నశించుటో యని యెన్నఁడో, తేల్చుకొన్నమీకు దిగు లదేల. 542

క. వీలగుచో మీరాష్ట్రము, నాలోకించెదఁ తదుర్వినదుగిద నా క
య్యేలుబడివారు యానతి, ఏలా యని తలఁతు వేర్మి నెద్రుతును గానన్. 543

క. అనుమతిపత్రము నందక, చనుదెంచితివేమి యని రుషన్ నను నెవఁడే
నణఁచినఁ దాదృఙ్మరణము, గనినందులకున్ ముదంబు గాంచెద నన్నా! 544

గీ. దైవ మెదురుతిరిగి భారతమును జీల్చు, నేని యేను బాకీస్థానమే నివాస
భూమిగాఁ జేసికొని ప్రొద్దుపుచ్చువాఁడ, నిన్ను వంటిమనీషుల నెమ్మితోడ.'' 545

వ. నాఁటిసంజప్రొద్దునం బ్రవర్తిల్లిన ప్రార్థనాసమావేశమునం దొకయువ లేచి బాపూ! 546

గీ. మానవలయు నీ విచట ఖురానుచదువు, పంపవలయును జిన్నాను బందిగమున
కోహటిల్లక లీగుపై యుద్ధమునకు, సాగవలయు హిందూవీరసమితి బలయు. 547

మం. అని మిన్ను ప్రీలున ట్లార్వఁగా నగుచు, నాచార్యుఁ డిమ్మెయి ననె "వెఱ్ఱివాఁడ!
జిన్నాను బట్టుచోఁ జెలయుఁ దత్కీర్తి, యగ్గలించుఁ దదీయమైనబలంబు
దేశంబునకు ముప్పుఁదెచ్చు నీతలఁపు, గఱువలదెసఁ బేర్మి కలదేని నీకు
విద్య వివేక మబ్బినదేని నీకు, బిగియింపు మతని నీప్రేమపాశమున
మార్చు మా జిన్నాను మైత్రీబలానఁ, గర్తవ్యమిది పురోగతికి హేతు విది.'' 548

వ. మఱియు నమ్మఋసటినాఁటి (1-6) వేఁబోక నొజ్జ సెజ్జంబాయుచు 549

## రానున్న చీఁకటి చూడఁజాలను

ఆ. "అస్మదీయజీవితాశయ మగ్నిప, రీక్షపాలఁ బడియె నిపుడు నన్ను
ననుసరించువార లగపడరు పటేలు, వదలెఁ బండితుండు వదలె నదిర! 550

క. నామాటలు నమ్మక వీ, రీమహి విభజింపఁజూతు రిది దేశీయ
క్షేమాపహ మిది మదిమది, లేమిడి నొదవించు ప్రక్కలించున్ నరతన్. 551

క. రానున్న కాఱుఁజీఁకటు, లే నీకనుదోయితోడ నీక్షింప నిసీ!
మే నిది నాకు వలాదు కృ, పానిధి! యని దేవదేవుఁ బ్రార్థింతు నిఁకన్. 552

గీ. ఒంటిపై నుండియు నిజమ్ము నుగ్గడించు, దిటవు నా కీశ్వరుఁడు ప్రసాదించుగాఁక!
యెక్కటితనమ్మునను హర్ష మే జనించు, నామనమ్మున; నిది జగన్నాథునెనరె! 553

క. ఇఁక విశ్రాంతిం గనఁ గా, శికిఁ బొమ్ము హిమాలయమ్ము చేరు మనుచు నా
కెకసక్కియపుంగమ్మల, నొకకొందఱు పంపఁదొడఁగి రుద్విగ్నమతుల్. 554

ఆ. వారితీరు సూచి వాఁడిప ల్కాడను, గాని భారతోర్విఁ గాఁపురించు
నెల్లమానవునకు నిల్లు తిండి లభించు, దనుక నాకు విరతి దక్కఁబోదు. 555

గీ. కటకటా! నేఁడు బాదుషాఖాను కుడుచు, నలఁత గనలేక పొరిఁబొరి నలఁగుచుంటి
నేను గన్నీరు విడుచుచో ఖాను కుప్ప, తిల్లు బావురమని దురపిల్లు స్రుక్కు. 556

ఆ. అతఁ డఖండభారతావని నాసించు, నతఁడు సర్వమతము లాదరించు
నతఁడు ప్రేమమూర్తి యతఁడు మానవజాతి, కీర్తి కభ్రచుంబికేతనమ్ము. 557

క. వచ్చినస్వాతంత్ర్య మిలన్, వ్రచ్చుటచే నీరసించి వసివాళ్ళందున్
లొచ్చువడున్ మనపేర్మి జ, గచ్చయమున; జనుల నెల్లకఱవులు నొంచున్. 558

క. ఈవేళ నను౦ గలంచు మ,హావేదన జనత కర్థమగు నావేళన్
నావాక్కుల నయ్యెడ సం, భావింతురు దొరతనమ్ముపట్టినదిట్టల్ 559

వ. ఏది యెట్లయినను భారతమహామహిం జీల్పవలె నని తహతహపడినవారిలో గాంధి యనువాఁడు లేఁడని ప్రజలు గుర్తించుట నాకు వలయు - నాధన్యత కది మూదల'' - అనినం గుఱఁగటంగల యనుచరులు నిట్టూర్పులు సారించిరి - అదియట్లుండె.

## వేవేలు నూత్నరాజ్యాంగప్రణాళికను వెలువరించుట

మధ్యా. ఆనాఁటి మాపటివేళ సాగిన ప్రార్థనసభను
ధీనిధి జాతిజనకుఁడు భారతదేశస్వరాజ్య
భానుండు వొదములగ్నంబు దగ్గఱెఁ బ్రజలు! ప్రెగ్గడల
యానలఁ దలఁదాల్చి శాంతికాముకులై మనుఁ డనియె. 561

మధ్యా. పదపడి విచ్చేసె నాంగ్లసామ్రాజ్యపాలకు లిడిన
పదకంబు చేకొని మౌంటుబాటను భారతక్షితికిఁ
బెదపెద్దవారిఁ గాంగ్రెసును లీగును బెనిచెడివారిఁ
గదియించె రాచఠీవి కులికెడి తనకమ్రసౌధమున. 562

వ. ఆసభం దాఁ దెచ్చిననూత్న రాజ్యంగప్రణాళిక నతండు వెలువరించి దీని నంగీకరించి దేశశ్రేయ మాపాదిల్లఁ జేయుఁ దని ప్రజానాయకుల నర్థింప (2-6) వా రాయాయిచర్చ లైనవెనుకఁ దమయంగీకృతిం జాటిరి - మున్ను (16-5-46) నిర్ణీతమయిన యమాత్య త్రయప్రణాళిక నేఁటిసవరింతలతోఁ దలక్రిందాయె - ఇది దేశవిభజనమున కురరీకృతిం జూపె - కేంద్రప్రభుత్వములు రెంటిని సృజియించె - అవి నేఁ (15-8-47) దధినివేశ ప్రతిపత్తిమై నొదవి తమకావించు నూతన రాజ్యాంగ స్మృతి ననుసరించి యిచ్చవడినపుడు సర్వస్వతంత్రరాజ్యము లగు ననియె - స్వదేశ సంస్థానములు వీనన్ దేననైనం జేరవచ్చు నొండె స్వతంత్రతమై మనవచ్చు నని సూచించె - దీనంజేసి సంయుక్తభారత మేర్పదమి నెఱింగి బాపూ నిట్టూర్చియు వెనువెంటన ప్రసన్నతనంది మఱునాఁటి (3-6) వేఁడి కోలు రచ్చ నిట్లువక్కాణించె. **563**

## దేశము నెవరు పాలింపవలయును?

మధ్యా. నూటయేఁబదియేండ్లఁదొట్టి మనపొందునోవికి భంగ
పాటునకుం గతమైనదయ్యము బానిస మడఁగు
పూఁట చేరువయయ్యె నన్నలార! యీపుడమిని నేర్మి
పాటించి పాలించుకొనవలయును రేపటినుండి మీరు. **564**

మం. జవహరుఁడైన నాజాదైన ధర్మ, పటువు పటేలైన బాబురాజేంద్రుఁ
డైన జిన్నాయైన నమృతకౌరైన, మీరెన్ని నప్పుడే మేలిగద్దియల
నిల్చి శాసింతు రీనేలను; వారి, పదవి మీచేతిది; బదలి జీవించు
మీరలే శాస్త్ర లీమేదినికెల్ల; సేవాపరాయణచిత్తు లౌవారిఁ
బంపుఁడీ సభకు మీప్రతిభూత్వ మూన, వారు సంపాదించువాసిలో నపయ
శస్సులో మీకును సమకూరుభాగ; మిల విభక్తముగాక యీపెత్తనమ్ము
రాదాయె; మౌఢ్య మీ రారాపు దెచ్చె, నైన దేదో యైన; దాగోదు మఱచి
పచరించుకొనుఁ డాత్మపరిశోధనంబు, నపజయం బెచట మీకంటునో దాని
సవరింప నెది సేయఁజనునో తదీయ, సంశీలనమె మీకుఁ జక్క బోధించు
మతకులభేదముల్ మఱచి మీరిపుడు, దక్కినట్టి స్వతంత్రతను గాచుకొనుఁడు
రాజనైతికవాదరంహస్సు లుడిపి, యావహింపుఁడు పేద కభ్యుదయమ్ము
శిక్షితచిత్తులై జీవింపుఁ డెల్ల, తంటా లహింసావ్రతమ్ముతో సమయు
సత్య మహింసయు స్వాతంత్ర్యసిద్ధి, దనుక నారాధ్యసాధనములుగాని
పదపడి వానితోఁ బనియేమి యనుట, వినిపించు నీనాఁడు పెక్కండ్రనోటఁ
దగదు మీ కీమనస్తత్వ మెన్నఁటికి, నపనయింపకుఁడు సత్యాహింసనముల
నాదరింపకుఁ దాసురాచారములను, రావింపకుఁడు ప్రజన్ రాచుకయ్యములఁ
బో రెఱుంగనితిండి బొక్కెఁడే చాలుఁ, గపట మంటనికల్మి కాసైనఁజాలు" **565**

వ. మహాత్ముఁడు వేఱొండు ప్రార్థనాసమావేశమున "సోదరులారా! భారతదేశమున కిఁక మహారాజులువోయి ప్రజారాజులు వత్తురు - మన మనతి కాలమున రాష్ట్రపతి నెన్ను కొనవలయు - ధీరయు సుశీలయు సమ్మార్జనాజీవయు నగు మగువ తత్పీఠము నెక్కునేని మిక్కిలి సంతసింతు - గాలించుచో నిట్టివెలంది యబ్బక పోదు - నెహ్రూ పండితునివంటివాఁ డీమహిళకుం గార్యదర్శిగా నుండి వలయు శిక్షణ మీవచ్చు - ఈమె కాంగ్లభాష రానక్కరలేదు - కార్యశూరతయు నుదారభావనలును సేవాసక్తియు నున్నం జాలు-కారాగృహవాసక్లేశాదు లనుభవించిన కాంగ్రెసుపెద్దలే గద్దెల కర్హు లనుట యే నంగీకరింపనేర - వీ రాయైసమరములఁ బాల్గొని ధైర్యసాహసములఁ బ్రదర్శించుట యెఱుఁగుదురు గాని పరిపాలనా దక్షతం గానరు - కానఁ బ్రజ్ఞాప్రతిభలు గలవారిం బెఱవారిని సైతము ప్రభుత్వమున కాహ్వానింపఁదగు - వృద్ధులగు కాంగ్రెసునాయకులు పల్లెపట్టులం గాఁపురించి ప్రజాజీవనమును సంస్కరించు టొప్పు - ఇట్లు సేయనినాఁ దవినీతి పరాయణు లధికారమునకు వచ్చి కులమతవాదములు రేఁపి దేశముం జెఱుతురు - ప్రజాస్వామ్యమునకు మచ్చదెత్తురు - నావుడు సభాసదులు బాపూ దూర దృష్టికి నుదారతకు నెంతయుం దనిసిరి - పదంపడి యొకనాఁడు సామ్యవాదులు కొందఱు తన్ను సందర్శింప జాతిపిత వారి కిట్లనియె. (8-6-47) 566

## సామ్యవాదులతో మహాత్ముని గోష్ఠి

ఆ. "వర్గతత్వములను వదలి దేశక్షేమ, మరయవలయు నహరహంబు మీరు
శాంతిలేనిబ్రదుకు సాగింపలేక పె,ల్లారటించు నేఁటి భారతమ్ము. 567

క. నిచ్చలు రంధ్రాన్వేషణ, మిచ్చయగున్ మీకు నొరులయె గ్గగపడినన్
జెచ్చెర దాని కలంకృతు, లిచ్చి సమావిష్కరింతు రెల్లజగానన్. 568

మధ్యా. ఇంతకు నది సత్యమౌనొ కాదొ యం చిసుమంత యరయ
కెంతయు గోల గావింత్రు విమర్శనేచ్ఛకు మీకుఁ
బొంతనము హుళిక్కి నేఁటిదొరతనంబునకు సాయపడ
సంతనకట్టరు మీ రది చనెడిసరణి దూష్యంబె? 569

ఆ. మీకు నచ్చుపనులు లేకుండెనా నేఁటి, మన్నెతనమునందుఁ గొన్నియైన
వాని నాదరింపవచ్చుఁగదా ప్రజా, సేవకుల మటంచుఁ జెప్పుమీరు. 570

ఆ. నేఁడు జవహరుండు నిల్చినపదవి మీ, కగ్గపడిన నేమి యాచరింతు?
రెల్లవారి తృష్ణలెల్ల నీడేర్తురా, నేర్తురా యమాస నెలను జూప? 571

ఆ. నేర్మియున్న నేఁడు నెహ్రూ పటేల్ మోయు, బరువు మీరు మోయవలయునొండె
వారి కడ్డవాట్లువైచుట మాని తో, డ్పడుట కనుమతింపవలయునొండె 572

ఆ. ఆస యున్న దేని యధికారమెల్ల ని, ప్పింతు మీకు రండు పీఁటలెక్క
వ్రేఁగు మీశిరాన వేయుటయే మేలి, కర్జమనుతలంపు గల్గు నాకు. 573

ఆ. మాకు వలదు బరువు మాసాయ మద్దాని, మోయునట్టివారి కీయనొల్లు;
మందురేని మానుఁ దన్మృతప్రచార మీ, మాత్ర కిష్టపడిన మాకుఁ జాలు. 574

వ. మీ సిద్ధాంతము గణనీయమ కాని మీనడవడి దానికి విరుద్ధము - సత్యాసత్యములయు ధర్మాధర్మములయు భేదములు మీ రెంఋంగరు - కాన నిట్టి విపర్యాస మేర్పడె - రష్యా మీ కాధ్యాత్మిక శరణము - మీయీవిశ్వాసము నన్ను విషణ్ణుఁ గావించు - మీరు భారతీయసంస్కృతిం ద్రోసి రష్యావారి జీవనవిధానము నాహ్వానింతురు - నా కీధోరణి రుచింపదు - నా తిండి యెట్టిదైన నది నా కమృతము - నేను దానితోడన మనెద - పరాన్నము నాకు వికటించు - నాయారోగ్యము నది సెఋచు - నా ప్రాణములం దొలఁచు. 575

ఆ. కుఋలార! మిమ్ముఁ గొమరులకై వడిఁ, దలఁచి యింతవట్టు పలికినాఁడఁ
బెదవినుండి వచ్చినది కాదు హృదయంపు, టిరవునుండి వచ్చె నీవచస్సు 576

గీ. చనవు మీకడఁ గలదు నాకని తెగించి, మందలించితి మిమ్ము నిమ్మాడ్కి నమ్ముఁ
దవసరం బున్న నాచెంత కరుగుదెందు, వలయు నాకును మీసాయ మలఁతియైన.''

వ. అయ్యెడ జిజ్ఞాసు ఒక్కండు మహాత్మా! యీసామ్యవాదులు నీవలె నార్థిక సమతం గోరుదురు - కులమతభేదములు గర్హింతురు - కాని వారి నీ వాదరింపవు - కారణ మేమి - నా నొజ్జ 578

ఆ. వారి వాంఛితము లుదారములే కాని, పన్నుగడలు శాంతిభంజకములు
హింస నెదురువాని నీరాజనీతి యె, మ్మయి నలర్చు మిత్రమా! వచింపు. 579

క. "కోరను రాజ్యము స్వర్గము, కోరఁ బునర్భవమురామి కోరను వెతలం
గూరి తపించెడిప్రాణుల, గోరమ్ముల నక్కడంపఁ గోరెద నెపుడున్.'' 580

వ. అని ప్రాతఃప్రార్థనమునం బల్కు నస్మదాదులకంటె వీ రధికులా - నేఁ డీలోకమున నిక్కమగు సామ్యవాది కలఁడేని వాఁడు గాంధిసుమా! - యనుడుం బృచ్ఛకుని మోము వెలవెలంబాఱె - అది యట్లుండె - ఒక్కనాడు (28-7) 581

## కాంగ్రెసిఁక నేమి సేయును?

క. సకలశ్రమంబులకు నీ, యకొని స్వరాజ్యమును బడసినది కాంగ్రెసు, తా
నిఁక నేమిసేయు నని సభ, నొకఁ దర్థించుటయు నద్వయుం డి ట్లనియెన్. 582

మం. అనుయోగ మిది మంచి; దలరితి దీనఁ, దమ్ముఁడా! కాంగ్రెసుతలఁపు లీదేతి
దేశదాస్యము నివర్తిల్లెను గాని, పాయవద్దదికదా భారతధాత్రి
ధాత్రి చీలిన విభక్తము గాదు కాంగ్రె, సది సర్వభారతీయం బగుసంఘ
మది యెల్లమతముల కాప్తమౌ సృష్టి, యది యెల్ల తెగలమే లర్థించుసంస్థ
యది యింక సర్వోదయసమాజ మగుట, యుచితం బని తలంచుచున్నాఁడ నేను
సర్వమానవవికాసము సంతరింపఁ, బేదసాదుల నొంచు బెదఁదల నణఁప
మతకులద్వేష సమ్మర్దంబు లుడుప, శాంతిప్రదము నాత్మశక్తిని బెనుపఁ
బరులఁ బీడింపనిప్రజను సృజింప, వంచన సైఁపనివారి నేర్పఱుప
నిర్మాణకార్యముల్ నియతిమై నెఱపఁ, దపియింపవలయు నేతత్సమాజమ్ము;
అధికారవాంఛకు నవ్వలివారు, రాజకీయాడంబరము లేనివారు
నిత్యసత్యవ్రతనిరతు లౌవారు, కరుణ కాస్థానంబుగా నుండు వారు
లోకసేవాధర్మలుబ్ధు లౌవారు, సాగింపఁదగుదు రీ సత్సమాజమును. 583

## మహాత్ముఁడు కాశ్మీరప్రభువును దిద్దుట

ఆ. ఒజ్జ యిట్లు భారతోర్వీహితక్రియా, నిరతి నిభపురాన నిలిచియుండఁ
గడలుకొనియె రాచకలఁతలు కాశ్మీర, మండలమునఁ బ్రజకు మనుజపతికి 584

వ. భారతభూమిం గల సంస్థానములలోఁ గాశ్మీర మొకటి -దీనియొడయఁడు హిందువు - ఇతనిప్రజలలో నూటి కెనుబదిమంది ముస్లిములు కలరు - కాశ్మీరము పెక్కు రాజ్యములకు నెల్ల - దీని నంటి యామ్యదిశం బాకీస్థాన ముండు - హిందూదేశము విభక్తమగుటతోఁ గాశ్మీరము కీలకపుఁదావై రాజకీయమగు ప్రాముఖ్యము గడించె. 585

మధ్యా. పెక్కేండ్లనుండి యిందలిప్రజలు రాచపెత్తనంబునకు
మక్కువపడి తేని నెద్రిచి సుఖములు మఱచి హింసనము
దిక్కున కేగక పోరుచుండ నధీశుండు పాడిఁ
దక్కి వారలను బాధింపఁదొడఁగె నుదగ్రశిక్షలను 586

క. ము న్నీప్రజోద్యమంబును, గన్నారం జూచి తనియఁగా వచ్చిన వి
ద్వన్నుతు జవహరుసైతము, మన్నింప కితండు పట్టి మరలిచె నిటకున్. 587

వ. రాజుతీ రిట్లుండఁ బాకీస్థానమురాకతో నితనియేలుబడింగల మహమ్మదీయుల యుద్వేగము హెచ్చి జాతీయోద్యమమునకుఁ దోడై కాశ్మీరమునం దరాజకస్థితిని బనిచె - జిన్నామున్నగు లీగు పెద్ద లీసందు కనిపెట్టి యాసంస్థానమునకు సాయుధములగు నల్లరిమూఁకలం దోలి దుండగమ్ముల రేఁపి భూపతిం బెదరించి కాశ్మీరముం దమరాజ్య మునఁ గలిపికొనం జూచుచుండిరి - మహాత్ముఁ డీకుట్ర తన కెఱుకపడి నంతన కదలి

కాశ్మీరమునకు రాచవీడగు శ్రీనగరముం జేరి (1-8-47) మెల మెల్లన యచటిసమస్యలం దెలిసికొని యేలికయగు హరిసింగు నాకారణ వడసి యతనిం గదిసి యాదరముం జాటి 588

చ. నవయుగ మేగుదెంచె నరనాయక! లోకముతీరు మాఱె వీఁ
దెవఁ డతగాఁ డెవం డనుచు హేళనసేయక జాగొనర్ప కీ
యవనిని మీర యేలుకొనుఁడా! ప్రజ! లంచు వచింపు మప్డు నీ
కవిరళకీర్తి దక్కు సుఖ మబ్బును బ్రబ్బును శాంతి దాంతియున్. 589

క. నీమంత్రిపట్లఁ బ్రజలకు, నేమాత్రయుఁ బేర్మి లేమి నెఱిఁగితి లోక
క్షేమము నొల్లనిప్రెగ్గడ, యేమహికైనను విపత్తిహేతువు సుమ్మా! 590

క. నానుడి నాలింపుము త్యా, గానందము ననుభవింపు మవిరతపరిణా
మానుగజగమున్ గను మన, భూనాథుఁడు లోఁగె నొజ్జబోధనమునకున్. 591

వ. అంత నాహరిసింగు బాపూ! నీరాక నాయవివేకధ్వాంతమునకు రాక - నేను ధన్యుండ - నాయమాత్యుని దొలఁగింతు-దేశమునం బ్రజాపరిపాలనము సాగింతు - ఈ నేల భారతభూమిం జేరుటయ నా కభీష్టము - కాని నాప్రజలకోర్కి నిచటం బాటింతు- నా నతనిచూడ్కియం దేర్పడినమార్పునకు మహాత్ముం డలరి వెనుదిరిగి పాటలీపుత్రమునకు వచ్చి (8-8) బీహారుశరణార్థుల యొూగాము లరసి నౌకాళికిం జనుతలంపునఁ గాలీ ఘట్టమునకుం జేరి ఖాదీకేంద్రమున విడియ 592

## సుహ్రావర్దీ కోర్కిపై మహాత్ముఁడు కలకత్తాను గాచుట

ఆ. పగలసెగలఁ బొగులుప్రజ తన్నుఁ గావఁగా, వచ్చె వేల్పు మబ్బు విచ్చెననుచు
సోదెపురము చేరి సూచె నహింసకై, పరితపించు పుణ్యపురుషు గురుని. 593

వ. బంగాళ మప్పటికి విభక్తమై పశ్చిమవంగమునకుఁ బ్రఫుల్లచంద్రఘోషు ముఖ్యమంత్రిగా వచ్చె - ఆ వెంటన కలకత్తానగరమున దుండగములు రేఁగె- ముస్లిము లిందు మివుల నష్టి నందుచుండిరి - కాన రెండుమూఁడునా ళ్లీవీట నిల్వుం డని ప్రఫుల్లచంద్రుఁడు మహాత్ముని వేఁడ నాయయ్య దాని కియ్యకొనియె - కాని గంట గంటకు నవగడములు హెచ్చుందొడఁగె - అయినను స్వాతంత్ర్యపర్వము (15-8) నాఁటికి బాపూ నౌఖాళీ చేరవలయు ననునిశ్చయమునకు వచ్చె-ఇట్టితఱి (13-8) నింతకుమున్ను వంగమహిం బాలించి యేఁడాదినుండి యీగడ్డపై వఱ్ఱొడ్డిన దారుణ రుధిర ప్రవాహములకుఁ బరోక్షముగా బాధ్యుఁడైన లీగునాయకుఁడు సుహ్రావర్దీ మహాత్ముని సన్నిధికి వచ్చి 594

మం. జోహారు బాపుజీ! జోహారు నీకు, నార్తసేవాపరాయణ మానసునకు
నిచ్చట విలయాగ్ని యెగసి తీండ్రింపఁ, జొచ్చెఁ బౌరులచావు చూడలేకుంటి

నెంతపెనంగిన నీమంట లాఱ, వీవుగా కెవఁ డార్పు నీవహ్నిశిఖల
నీ వహింసామూర్తి వీవు పోరాని, చెలివి చుట్టంబవు జీవులకెల్ల
నీపురమ్మున శాంతి యేర్పడుదనుక, విడిసి నౌకాళి కావెన్కన వెడలు
మిది నాదుప్రార్థనమే కాదు తండ్రి!, సకలప్రజాకృత సంప్రార్థనమ్ము. **595**

ఆ. అనుడు నొజ్జ యిట్టు లనె సోదరా! యింత, కడిఁదిపనికి నే నొకండఁ జాల
నీవు ముందు నిల్వ నీవెన్క నే నిల్తుఁ, జేతనైనసేవ చేయనోర్తు. **596**

క. ఐనను నౌకాళీ రే, పేనదవడి కియ్యకొనునొ యెఱుఁగను దానన్
దానవధర్మము రేఁగదు, నా నీకున్ గుండె లుండినన్ నిల్తునిటన్. **597**

గీ. మఱియు నీవు పకీరుగా మాఱి నన్ను, దొరయవలయు రే వగలు నాతోడ నుండ
వలయు నేమందు వన సుప్రావర్ది శక్తి, కొలఁది యత్నింతు ననె భయాకులితమతిని.

వ. పదంపడి బాపూ "శక్తికొలఁది" వంటి పేదమాటలు నాకుం జాలవు - బీహారునం దవగడములు వుట్టుచో నిట్టుపాసము సాగింతునని యచటిపెద్దలకుం జెప్పి యిట వచ్చితి - నౌకాళిలోఁ జెట్టరేఁగినను నా కిల్లి తప్పదు - నాయీనిర్ణయముల న్మఱవక నీపల్కునది గట్టిగాఁ బల్కుము - నా నతం డిఱుకునంబడి గ్రుక్కత్రిప్పుకొననేరక మహాత్మా! మరల నీదర్శనమునకు వత్తునని చనియె - నౌకాళీబాధ్యత వహింపు మని జాతిజనకుం డితని నిగ్గఁదీయుట దొంగచేతికిఁ దాళపుఁజేతులిచ్చుటం బోనిది నాఁదగు - ఇట్టిమేలినదవడిచేతన బాపూ మనదేశమునకు ననితర సాధ్యంబగు నున్నతినాపాదించె.

క. నెచ్చెలులతోడ సాహెబు, వచ్చె న్మఱునాఁడు; తూర్పువంగమునందున్
జిచ్చొదవనీను; గొన్నా, ళ్లిచ్చట నాఁగుము మహాత్మ! యీ వనె నతుఁడై **600**

క. దూఁకిరి శాంతిన్ మనుపఁగ, నౌకాళికి ముస్లిములు; మనమ్ముల నిఁక న
వ్యాకులములఁ జేయుం దని, వాకొని రట నున్న హైందవజనమ్ములకున్. **601**

మం. పదరానిహింసలపాలైనపేఁట, నార్తులై ముస్లిము లల్లాడుచోట
నొకపాడుకొంపలో నొదిఁగి హిందువులు, మలకలు దౌష్ట్యము ల్మాని సోదరుల
కైవడి జీవించుగడె వచ్చుదనుక, నెవరియింటికివార లేతెంచుదనుక
జనతలో నిర్భీతి సంధిల్లుదనుక, విడువ నీగూఁటిని విడువ నీవీటి
నని శపథించె మహాత్ముఁ డవ్వేళ, (14-8) నొజ్జసన్నిధిని గూర్చుండె శహీదు. **602**

వ. ఈయిద్దఱిలో నెవ్వఁడే నొంటిమై నొరులతో మాటాడరాదు - పత్రికలకు వ్రాయరాదు - తినరాదు - త్రాగరాదు - లేవరాదు - కూర్చుండరాదు - కట్టడ లింత పరుసనివై యున్నఁగాని కార్యము ఫలింపదని బాపూ తలంచె - వెండియు **603**

ఆ. అయ్యె నిల్చుగేహ మావిలమేకాక, కదునలంతి; దొండు గదియ కలది
యైననేమి దానిలోని వేల్పును వేల, కొలఁదిమంది కనిరి కుందు తొలఁగ. 604

## మహాత్మునిపై నొకఁడు దుడ్డుగఱ్ఱం బఱపుట

మధ్యా. ఆనాఁడ లోకబాంధవుని గొందఱు హైందవయువలు
కానంగ వచ్చి నిప్పుకలు గ్రక్కుచు గాంధి! నీవిటకు
రానేల ముస్లిములను నుఱుముసేయరా దననేల
కానివాఁడవు నీవు హిందువులకు మొక్కలివి తెక్కలివి. 605

క. హిందువులఁ జంపునపు డీ, వెం దేగితి వుజ్జగింపు మీ పట్టణమున్
మందమతీ! వేదాంతము, చిందింపకు మిచట మోడిసేయకు మిచటన్. 606

క. ఈసుహ్రావర్ది తనవా, ర్కోసిన కుత్తుకలలెక్క కొంతైనఁ జెవిన్
వేసెనొకొ నీకు? వీనిన్, నీసుతువలెఁ జూడ నెట్లు నీ మన సొప్పెన్. 607

క. నిన్నటివఱ కితఁడకదా, యిన్నేలకు తేఁడు? వీనియేల్బడిలో మా
క్రొన్నెత్తు పొడిచి గంగయు, మున్నీరును శోణవర్ణములఁ జిమ్మెఁగదా! 608

వ. అని యార్చుచుండ నొకధూర్తుండు మహాత్మునిదెసకు దుడ్డుఁగఱ్ఱం బఱపె - అది
దైవవశంబునం దలుపుతెక్కకుఁ దాఁకి గొడ్డువోయె-పదంపడి బాపూ నవ్వుచు 609

ఆ. వలదు దుడుకుఁదనము వలదయా! మీరు మా, చిన్నవానికంటెఁ బిన్నవాండ్రు
మేరమీఱి కుఱ్ఱ లేరీతిఁ బల్కిన, నల్కపడరు వృద్ధు లుల్కిపడరు. 610

గీ. జన్మమునఁ గర్మమున సడిసన్న యట్టి, హిందువను నేను నొంతునే హిందువులను?
మీకు నీమాత్ర తెలియదా? నొకలికిఁ, జన్నవాఁడేఁడు? దేనికై చనియెవాఁడు? 611

క. ఏ నచ్చటి కీనాఁడును, బోనెంచితిఁ గాని యిచటఁ బొడమినగొడవన్
మానితి నాపయనమ్మును, బూనితి నిట మానవత్వమును బెనుపంగన్. 612

గీ. 'ఆత్మవత్సర్వభూతాని' యన్నవాఁడు, హిందువే పొందు, నాబ్రతుకెల్ల నేత
దుక్తికనుకూలముగ సాగుచుండుఁజుండు, ముక్తికిదెహేతువంచునమ్ముదువినుండు. 613

క. నా నమ్మిక లన్నియు నా, తో నెగ్గవు మీరు కొంత తోడ్పడకున్నన్;
ఈనాఁడు నన్ను మనుపన్, బ్రాణచ్యుతుఁ జేయఁ దగినబంటులు మీరే! 614

గీ. మహికి నేనుత్తబరు వని మానసించి, నేఁడు నను మీరు చంపిన నెగులు గుదువ
బ్రదుకుపైఁదీపిలేదు నాకదియుఁగాక, ముదిమియును హెచ్చెఁదెచ్చెనెన్నదికిదరికి. 615

క. ఈ వసుధకు నాసల్పిన, సేవయు సామాన్య మనఁగఁ జెల్లదు దీనిన్
భావింపకుఁ డాత్మస్తుతి, గా; వచ్చినకథనుబట్టి కదలిన దిదియున్. 616

ఆ. నన్ను విశ్వసించి పల్కు పాటింపఁ, దగిన దనుచు మీరు తలఁతురేని
శాంతులగుఁడు తొంటిశత్రుత్వముల నెల్ల, మఱచిపొందు రండు మైత్రిదెసకు. 617

గీ. ఏను హిందువులకు ముసల్మానులకును, సేవగావింతు నాపదల్ చెనకినపుడు
పీడితులకు సుఖమ్ము గల్పించుపట్ల, మతము నా కడ్డురాదు కుమారులార! 618

క. ఇట నుండియ నౌకాళిం, గటకట రానీనికుదిరకలు కూర్చితి నూ
అట గనుఁడు సుహ్రావర్ధీ, యటమటకాఁ దని తలంప కరయుఁడు నిజమున్. 619

ఉ. నావుఁడు గుబ్బ లందఱు మనమ్ములు తేటి మహాత్ము మెచ్చి త
జ్జీవన మీజగమ్మునకు జీవన మన్న దెఱింగి సౌహృద
శ్రీవరియంపుఁ దల్లరులుసేయకుఁ డోప్రజలార! యంచు నా
ళావళి దద్దఱిల్లునటు లార్పఁదొడంగిరి వాడవాడలన్. 620

## కలకత్తాలో హిందూ ముస్లిం భాఈ భాఈ

వ. భారతస్వాతంత్ర్యసిద్ధికి నించుక ముందఱన(14-8-47 రాత్రి 11-30) పరస్పర ముఖావలోకనముసైతము సైఁపఁజాలని హిందూమహమ్మదీయులతో నిండి తీంద్రించుచున్న కాళీఘట్టమున "హిందూ ముస్లిం భాఈ భాఈ, హిందూ ముస్లిం ఏక్ హో" యన్న రవళులు వెడలి గుములుగుములుగా గుబ్బతిల్లి వియత్తట కటాహ విపాటనపటువు లయ్యె - సర్వమతములవా రాబాలవృద్ధముగా నితరేతరహార్దములతో వచ్చి నాఁటిరేయెల్ల నజాతశత్రువును గాంధిని సందర్శించి తమకృతార్థతం గొనియాడుకొన మొదలిడిరి - వారు మౌనముద్ర నవధరించినను వారిమోములు క్షమాభిక్ష నర్థించుచున్న పోలకువం జాటె - నగరమున నానావాద్యములతో నూరేగింపులు సాగె - సభలు సందడించె - దీపాలంకరణము హెచ్చె - ఐనను జాతిపిత సాధించిన సౌహృద మహస్సుముం దాదివియలవెలుఁగు వెలకంబాఱె - నౌఖాళియు నిరుప ద్రవమ్ముగా నిర్భరానందకందమ్ముగా నున్నశుభవార్తయు నపుడ వీతెంచె-అమ్మఱునాఁటి రేపు (15-8-47) 621

## స్వాతంత్ర్యదినము - మహాత్ముని యుపవాసము

గీ. తరతరమ్ముల బానిసతనము నెద్రిచి, విద్రిచి తలయెత్తితిమి విశ్వవీధి ననుచు
భారతీయుల విజయోత్సవారభటులఁ, గ్రొత్తపండువు సాగించుకొనుచు నుండ- 622

మధ్యా. తనబలంగమ్మును దేశికుం డొకతావుఁన జేర్చి
మన మందఱము నేఁడు నిద్రు పూనుట మంచిది నాఁగ
నెనలేనివెఱఁగునఁ బడి మనూకన్య యిది నీవు మమ్ముఁ
దనుప లడ్లు జిలేబి పంచుదినము కదా! తాత! యనియె. 623

వ. పదంపడి మహాత్ముఁ డాకెం గని యిట్లనియె. 624

మధ్యా. ఇంతలో మఱచితె మేలుగీడుల నే నిల్లి నవధ
రింతు నన్మాట; కుమారి! స్వాతంత్ర్యరేఖలఁగాంతి
మంతమై మనమాతృభూమి నేఁడు సమ్మదమందుఁ గాన
నింతు నిత్తఱిఁ బస్తు; మౌనము కవచ మీనేమమునకు. 625

మధ్యా. ఏకాదశిని దిండి మానుటంజేసి యెడఁదను భక్తి
రేకెత్తుకరణి నేఁ డుపవసించిన రేఁగు స్వరాజ్య
నౌక నెమ్మెయిఁ బ్రజాసాగరమ్మున నడిపింపవలయు
లోక మెట్లున్న రాణించు ననెడు నాలోచన యమికి. 626

మధ్యా. మఱవరా దీనాఁడు మనము భారతమహిబానిసమును
నుఱుము చేసిన మహాస్త్రంబు రహట మనూనశాంతిదము
మరలు సాధించులక్షలకతనఁ గల్గు మచ్చరితనము
తిరమగుతృప్తి సంధిల్లు రాట్నము తెచ్చువీసమున. 627

క. కర్తవ్యనిష్ఠయును శుచి, వర్తనమును నమ్రతయు నవశ్య మొసంగన్
గీర్తింపవలయుఁ గరుణా, మూర్తిం బరమేశు డెందమునఁ బటుభక్తిన్. 628

వ. ఇవ్విధంబునం బల్కుతతి బాపూవదనమున గంభీరత గూఁడుకట్టుకొని యుండె - కాళీఘట్టమునం దెగసిన విలయాగ్ని లడఁగార నమృతవర్షముం గురిసిన ఘనుం డతఁడు - ఐననేమి - తన్ముఖమునం దెట్టి గెల్పిడియుం గనఁబడదాయె - ఎవ్వరేని తన కావించిన యుపకృతిం గొనియాడ న న్నేల మెత్తురు? నేనొక్కండ నేమి సేయ నోర్తు? మీరందఱుం దోడై బదలుటంజేసి యీశాంతి సమకూడె నని మహాత్ముం డనుట శ్రోతలకు నిరహంకృతిం గఱపు మేలిపాఠముగా నుండె - ఆనాఁడు గాంధితో పాటు తత్పరివారముకూడా నౌపవస్తమునోర్చె - సుహ్రావర్దియుం బస్తుపాటించి బాపుం దనిపె - అయ్యబసలో రాట్నంపురవళి నిరంతరముగా మెరయుచెండె - అట్టితఱిం బశ్చిమ వంగరాష్ట్ర మంత్రులు కొందఱు తమభక్తిం దెలుప నొజ్జపజ్జ కేతేర వారికి మహాత్ముఁడు 629

## మంత్రులకు మహాత్ముని సందేశము

గీ. మస్తకమ్మునఁ గంటకమకుటమును ధ, రించితిరి మీరు మీకుఁ బరీక్షవచ్చె
నోర్మియును నేర్మియును గూర్మియునువెలార్చి పేర్మినందుఁదుప్రజలదుఃఖోర్మినణఁచి.

క. మంచిది గా దధికారము, నించు నహంకృతిని స్వార్థనిరతిని గూర్చున్
బెంచును భోగాసక్తిని, ముంచు మతకులాభిమాన మూర్ఛావస్థన్. 631

క. నేఁటి నిరాడంబరతను, బాటింపుడు మీరు నిరతపద్ధతి కాఁగన్
మాటలకుం జేఁతలు విట, తాటనములుగా నొనర్పఁదగ దేనాఁడున్. 632

గీ. అణఁకువను సత్యము నహింస నార్తసేవఁ, బ్రజలునేర్చుకోవలయు మీబ్రదుకుసూచి
లేమిలోఁ దెల్విలేమిడిలో మునింగి, నలఁగుపల్లెల సవరింపవలయు మీరు. 633

గీ. ఎవ్వరో మనదేశము నేలుచుంట, నిదివఱకు లేదు రాదు మీ కింతరాపు;
అన్నలార! స్వాధీనత యన్నఁ గఱకుఁ, గత్తిపై నొనర్చెడి కసరత్తుసుండు. 634

ఆ. నేఁటినుండి మీకు నిత్యశోధనములు, తప్ప వొప్పునందుఁదప్పునందుఁ
గన్నుగల్గి మెలఁగు దన్నివేళల మీకు, సాయపడుత! లోకనాయకుండు. 635

వ. అనుసందేశమును వ్రాసియిచ్చె - మఱియు నొక్కనాఁటిసదస్సున బాపూ రాష్ట్ర పాలకులకు (గవర్నరులకు) హితోక్తులు చాటుచు వారు మద్యముం దాఁకరాదు - తమబలఁగము సైత మానేమముం దలఁదాల్చునట్లు చూదవలయు - రాట్నముపై నూలుదీసి తాము పేదలకొలువుదు కాం ద్రగుటప్రకటింపవలయు - కుటీరములఁ గాఁపురింప వలయు - చాఁపపైఁ గూర్చుండవలయు - మానసికమగు నౌదార్యము శారీరకమగు సాధారణ్యము నేర్పవలయు - అంటరానితనముం ద్రోయవలయు - మతములనెల్ల నాదరింపవలయు - రాష్ట్రభాషం బలుకవలయు - సమాజమునకు మూదలయగు మనుగడ పాటింపవలయు-నా నెల్లరుం దనిసిరి-మహాత్ముఁ డిట్లు దేశాభ్యుదయమునకు మతసామరస్యమునకుం దోడ్పడుసూక్తులు పెక్కులు ప్రార్థనాసమావేశములం బల్కుచుండ హిందూమహమ్మదీయు లాసభలకు లక్షల కొలఁదివచ్చుచు నితరేతరానురాగములతో నేకగ్రీవముగా 'జైహింద్' నినాదములు గావింపఁ దొడఁగ నాచార్యుం డీ శుభపరిణామ మున కెంతయుందనియుచు సుహ్రావర్దీ వెంటరా నగరమున శాంతి కార్యక్రమము నేర్పఱుచుచుండ 636

క. చీలిన పాంచాలమ్ముల, నాలరు లెసరేఁగి హింస లారంభింపన్
బాలుర వృద్ధుల వనితల, గోలలు దివి కంటి జగముగుండియఁ గరఁచెన్. 637

గీ. బాపూజీ! రావె! హింసల నోపలేక, వెక్కు పాంచాలమును దేర్పవే! యటంచు
సవినయమ్ముగ వైస్రాయి, జవహరుండు, పంపిరి మహాత్మునకు విన్నపంబులపుడు. 638

వ. అయ్యవసరమ్మునందు 639

మం. కాశీపురమ్మునఁ గలసిక్కుయువలు, హిందూమహాసభ నీఁగినవారు
నేచి ముస్లింప్రజ నేఁచుట కొగ్గి, రెగసె గగ్గో లెల్ల యెడల దండడిగ
మడఁగినశిఖ వెండి మండెనే యనుచు, నవ్వేళ బాపుజీ యలమటఁ జిక్కి
యిక్కట్లఁదనుఁగాచు నిల్లికిందొడఁగె (1-9), భగవత్కృపంగూర్పుపస్తునీకొనియె
నుడికెను నగర మట్టుడికినభంగిఁ, దలఁకిరి నానామతమ్ములవారు
బాఁకులు బల్లెముల్ బాంబులు దొఱఁగి, తులువలు పెనుసిగ్గుతో మెల్ల వచ్చి
యార్తబంధువు గాంధియడుగుల వ్రాలి, సైఁపవే మాతప్పు సైఁపవే తండ్రి!
విడువవే నిట్రని వేమాఱు వేఁడ, నిఁక జగదమ్మురానీ మని గురుని
దరి నిరువాగుపెద్దలు పూఁటపడఁగఁ, గళవళపడఁగ నాల్గవనాఁటిరేయి (4-9)
సుకృతిమూర్ధన్యుఁ డించుక గంగముట్టెఁ, బ్రకృతికి నొకమహాపర్వమ్ముపుట్టె. 640

## డిల్లీలోమంటలు రేఁగినవి

వ. కలకత్తాపత్తన మిట్లుండ దుండగుల బారినుండి యెట్టెటో తప్పించుకొని హాహాకారములతో నవమానభారములతో నమర్షణచిత్తములతో భారతరాజధానికిం బరుగెత్తుకొని వచ్చిన పాంచాలహిందువులును సిక్కులుం దమబన్నముల నవ్వీటం జాటినంతన యచటి హిందూమహాసభాసభ్యులును సిక్కులుం దీంద్రించి తెగఁబడి (4-9 నుండి) ముస్లిముల నుఱుమాడం దొడఁగిరి - మహమ్మదీయుల నెలవులలో మసీదులలోఁ గాందిశీకుల నిల్పిరి - అల్పసంఖ్యాకులగుమలక లపుడు చెట్టున కొకఁడు పుట్టకు నొకఁడుగాఁ బరుగు వాతీ వగం గూరిరి - ఢిల్లీనగరమునఁ బ్రభుత్వము నిర్వీర్యమాయె - వాణిజ్యము స్తంభించె - అన్నార్తులు పెరిఁగిరి-చీఁకటిబేరము ఘోరముగా నుండె-ఇట్టి దుష్కాల మునఁ బాంచాలభూమిం దరికొన్నమంటలఁ జల్లార్పఁ గాలీఘట్టమును (7-9) వీడి హస్తినదనుక వచ్చినబాపూ ముందటి కేగలేక తన్నగరమునందు బిర్లాభవనమున నిల్చె (9-9) ప్రాంతబసయగు హరిజన వాటిక నేఁడు కాందిశీకులతోఁ గ్రిక్కిఱిసియుంట నయ్యె కియ్యునికి మార్పు వాటిల్లె-నేఁటిభవన మతివిశాలమగుటం జేసి దానినిష్కుట మున మహాత్ముని సాయంసమయ ప్రార్థనాసభ ప్రవర్తించుచుండె-ఇఁక నలజడి సమయు నని నెహ్రూమున్నగు కాంగ్రెసునాయకు లించుక తేఱిరి-అట్టితఱి మహాత్ముఁడు 641

## మహాత్ముఁడు హస్తినలో శాంతికై బడలుట

మం. పాపం బెరుంగనిప్రజల రక్తంబు, క్రోలు ధూర్తులతీంద్రకుం బెద్దవగచి
దుదుకును దెగడుహిందువులు ముస్లిములు, తనవెంట నడువ నార్తజనమ్ము నిలుచు

వీధులకుం జని విహ్వలప్రజల, నోదార్చి ధీరతాయుతులఁ గావింప
దొరఁకొనె, సభలలోఁ దులువలతీరు, దూతె, గుడుల్ - మసీదులగౌరవమ్ము
గాపాడ రెండువర్గమ్ములవారి, నియమించె, దీనులనెవ్వల నణఁప
నీశ్వరుండె సమర్థుఁ డిది నమ్మి వేల్పు, నాశ్రయింపుఁడు కొల్వుఁడని వేఁడికోలు
రచ్చలఁ బల్కె, హార్దములేని మాసి, బ్రదుకు ధరిత్రికి బరువని నుడివె
నెంతచేసిననేమి? యిభపురి నూఁచ, ముట్టుగా హింసలు ముదుఁగనివాయె
ముక్కారిన సమాజమును జూచి కుములు, బాపున కారోగ్యభంగ మేర్పడియె
మనవలె నను కోర్కి మణఁగె నిట్లుండఁ, బొడతెంచె నాయయ్యపుట్టినరోజు
ప్రాప్తించె నొకమహాపర్వ మిమ్మహికి. 642

## ఢిల్లీలో బాపూజయంతి

వ. మహాత్ముఁడు భాద్రపదబహుళ ద్వాదశియం దవతరించె - నాఁ డక్టోబరు మాసమున రెండవదినము - పెక్కం డ్రాయహస్సు ననురించియు బాపూజన్మదినోత్సవము సాగింతురు - కావుటంజేసి యాప్రొద్దున (2-10-47) 643

గీ. వేకువను దానమాడి మనూకుమారి, మున్నుగా లోకసేవలో మునిఁగితేలు
సుకృతు లాచార్యునకుమ్రొక్కిరకుటిలమ్ము, భక్తిమెఱసిరి డెందముల్ పరవశింప. 644

ఆ. దగ్గుబెడఁద యెంత వెగ్గలముగ నున్నఁ, బాలుగొనియె గాంధి ప్రార్థనమున
వెజ్జొకండు తెల్పె నొజ్జ కీరుజ సూది, మందు వాడకున్న మాన దనుచు. 645

వ. పదంపడి మహాత్ముం డతని కిట్లనియె. 646

మధ్యా. నారామనామమున్ మించుమందు నన్నా! చూపఁగలవె
యేరోగమైనను దానికి జోహారు విడవలెఁజుమ్ము
తీఱు నీబాధ రేపే మదీయహృదిన్ సర్వదిశల
నారి తన్నామంబు మొరయుచో; సందియము వలా దిందు. 647

ఆ. తీఱదేని నమ్ముమా రామభక్తితో, నిండఁ దీనరుండు పండఁ దనుచు
నియతబుద్ధి రాముని జపించుసజ్జనుఁ, దార్తిపడఁడు రుజకు నగ్గపడఁడు. 648

వ. నిన్నువంటివైద్యు లతనిమేన విషూచిక్రిమిం జొనుపఁజాలరు - రామనామప్రభావ మత్యద్భుతము - దానినెల్ల నుడువందగినచదురు నాపాలలేమి నిక్కము - నే నిపుడు కార్చిచ్చునడుమం బడి తన్నామమహిమం బెఱుఁగం బెనఁగుచున్న వాఁడ - ఇందునా కెంతకృతార్థత ముట్టునో - నావిజయ మెట్టిదనను నాప్రాణము లీపరిశోధనమునక సమర్పింతు-నా నోట నపుడు రామనామము రవళించునేని నా ధన్యత కదియ చాలు - ఈ లోకమున నింకను మనవలయు ననుకోర్కి నేఁడు నాకు లేదు - భవిష్య జయంతి నేను గననేమో - నావుడు వేఁడికోలురచ్చంగల వారు నిట్టూర్పులు నిగిడ్చిరి - మఱియు

ఆ. ఔపవస్తమూనె నాచార్యుఁ డపుడు; తత్, పథము ననుసరించె బలఁగమెల్ల
నేల పస్తువలయు నీనాఁడు మన కని, నుడివె నొజ్జతో మనూకుమారి. 650

మం. అంత మహాత్ముఁ డిట్లనె వినుమోసి! యేను బుట్టినదినం బిదియని దీని
కొకవిశిష్టత యెదో యున్నది యనియు, భావించి పాటింపఁ బస్తు నీవేళఁ
బేదలకుం గూడుపెట్టు రాట్నమ్ము, పుట్టిన వరహాలప్రా ద్దీదినమ్ము.
(బాపూ తన జయంతిని చరఖాజయంతిగా 1941 నుండి మార్చెను)
నేఁ డుపవాసాదినియమముల్ పూని, పరులమేల్కొఱకు నేర్పడినరాట్నమును
బ్రార్థింపవలయు మాప్రా పగు మనుచు, రహటచక్ర మనోజ్ఞరవము నిప్పాఁట
వాంఛింపవలె నెల్లవా రన్నిజాలు. 651

వ. అనిన నక్కుమారి శంకం బాసె - పదంపడి 652

క. అతిరథులు మహారథు లా, పతితజనోద్ధర్తృకార్య పరతంత్రుఁ బ్రతి
ష్ఠితమతిని గదిసి మెచ్చిరి, మతకులవర్గముల పొరపు మఱచినయోగిన్. 653

క. వేయేండ్లు మనుఁడు మీ రని, యాయాఖండములపెద్ద లనిపినలేఖల్
నాయనకు వచ్చెఁ దీఁగల, సాయమ్మున; నవి సహస్రసంఖ్యను గడచెన్. 654

గీ. ప్రజ లొసంగినకాన్కలు బాపుజీ ప, దాబ్జములప్రోలఁ బెనురాసియై రహించె
మగువ లొజ్జ కర్పించిననగలు విలువ, కట్టుచో లక్షలకుఁ జాలునట్టి వదిర! 655

వ. మహాత్ముఁ డధివసించినగదిముం దానాఁడు మీరాబాయి కావించినసుమాలం కరణము కళారమాశరణమై చూపఱం దనిపె - అయ్యెమెడం బ్రజలు కీలించిన నూలిదండలు కొండలుగా లేచె - నిరంతరముగా నడిచిన సూత్రయజ్ఞమునం దహింసాదేవత సాక్షాత్కరించె - వచ్చిన పెద్ద లందఱుం జనినవెన్క బాపూదగ్గు మరలఁ దొంగిచూచె - ఆహా! మీయుక్కిస యుక్కడఁగ లేదా యని యపు డొజ్జ నొక్కగఱువ పరామరిసచేయ

ఆ. రాముకరుణయున్న నామయ మిది డిందు, లేనిచో వరింతు దీనఁ జావు
పెక్కునాళ్లు బ్రదుక మక్కువపడదు నా, యెడఁద నేఁడు ప్రజలదుడుకు సూచి. 657

మధ్యా. మీకు నాయందుఁగూర్మి కలదేని "స్వామీ! యహింసనము
నీకొనుచందాన భారతీయులహృదయముల్ మార్చు;
మీకర్జ మొల్లనినాఁడు దావాగ్ని నెరిసెడివృద్ధు
నీకడం జేర్చుము గాంధి"నని దయాన్వితు వేఁడుఁ డీశు. 658

ఆ. ఇంగిలీసువారి నెద్రిచి నాసల్పిన, కయ్యములు శతమ్ము కలవు గాని
యెదియు నాకుఁ గూర్ప దింతనైరాశ్యము, నెదియు నన్ను డింప దిన్ని వెతల. 659

ఆ. ఇంటిలోనిబవర మెగసిన దీవేళ, నెవరి కెఱుకపఱుతు నీయవస్థ
నన్ననె(త్రు తమ్ముఁ దానుఁ దమ్మునిప్రేవు, లఱుత నలవరించి యన్న కులుకు. **660**

క. ఈరక్కసిచేఁతలు క, న్నారం గన బ్రదుకవలయునా యే నకటా!
భారతము రుధిరమేదః, పూరితమై క్రుళ్లి రోతఁపుట్టించు నిసీ! **661**

వ. అని జాతిజనకుఁడు తనయెదఁదం జాట నచటివా రందఱు నలందురి శాంతిగీతముతో నాఁటికార్యక్రమమును ముగించిరి - తదనంతరమున దేహళీనగరింగల ఘూర్జరులకు జాతీయమగుపంచాగమును బాటించువారికి భాద్రపదబహుళద్వాదశినాఁడు (11-10-47) బాపూపుట్టుపండువు సాగించుకోరిక వొడమె - ఆచార్యుఁ దుక్కిస త్రొక్కట నుండియు వారియాకారణ కాదరము తెల్పి జయంతిసభ కేగె - అందు సర్దారుపటే లుపన్యసించుచు **662**

మం. వైశ్యకులమ్మునవాఁ డీమహాత్ముఁ, దగుట నీతనిఁ బాయదాయె లుబ్ధత్వ
మింత యనారోగ్య మింత దౌర్బల్య, మేర్పడి త న్నెంత యేఁచుచుండినను
దండిగా మీరు విత్తము నిత్తురన్న, యాసతో వచ్చె నీయయ్య నేఁడిటకుఁ
బిసినిగొట్టునకు నోపిక లేమి లేదు, లోభి రోగాలకు లొంగుట లేదు
నావుడు గోష్ఠిలో నవ్వులు రేఁగె, సర్దారునుడికిఁ బ్రశంసలు మ్రోఁగె
రాట్నపుంగొల్వు మఱాకుఁ దహింస, కానవా లిది స్వరాజ్యంపుఁజిహ్న మిది
ధర్మానుగార్థసాధన మిది యనుచు, గురుఁడు సందేశించి గూఁటికి సాగె. **663**

గీ. భారతీయులపాపముల్ పండి పండి, యిదియె తుదిపుట్టుపండు వాయెను మహర్షి
మణికి మతదురావేశనిర్మథన చతుర, మతికి మానవతాశుభాకృతికిఁ గృతికి. **664**

వ. అది యట్లుండె - బాపూ హస్తినకు వేంచేసినదాది కాందిశీకుల నోదార్చుచు సేవాసంఘముల నిర్మించుచు నాయైసమావేశములఁ బాల్గొనుచు మతమైత్రికి వలయుసూక్తు లిట్లు వెదలించె. **665**

## బాపూ మతమైత్రి కొనర్చినమహోపదేశము

గీ. మతములనుబట్టి ప్రజలను మార్చుకొనుట, రాజ్యముల కెంతయేని రాదాపుదెచ్చు
నుభయులకు లజ్జగూర్చు ప్రయోగ మిద్ది, పశుతకుం దారకాణయౌ పాడియిద్ది. **666**

గీ. వెలిచివచ్చినవారు వేవేగఁ గదలి, చేరవలయుఁ బరిత్యజించినగృహాల
కల్పసంఖ్యాకవర్గ రక్షావధాను, లగుచు దొరతనములు రెండు నెగడవలయు **667**

క. ఆవేశజనితమగు రిపు, భావమ్మున కొసఁగరాదు బ్రహ్మోయువు; మై
త్రీవిధి నొల్లనిచోఁ బ్రజ, కేవలసమరమ్మునక తెగించుట యొప్పున్. **668**

గీ. మందిబలమున్న మతమువా రెండు రేఁగి, దుందుడుకుచూపినను వారిదొరలు దోస
మొప్పుకొనవలెఁ గప్పుచోముప్పువచ్చు, మూసినంబాసెననరె ముమ్మొదటివారు. 669

గీ. భారతమహమ్మదీయులు పంచమాంగ, దళముగా దారిదప్పుచోఁ దమమతంబు
సావునకుఁ దామె కర్తలై నోవిగుడుతు; రెవరిమహివారి కారాధ్య మవుటవలయు. 670

మధ్యా. ముందుగా దుండగములకుఁ దెగిసఏ ముస్లిములీగె
సందియంపడ నిందు; నేఁడుసైత మాశరవృత్తి విడక
చిందులుత్రొక్కుచున్నది యది, మనముఁ జిత్తముల్ కలఁగి
తొందరపడరాదు చేయఁగాదు దుందుడుకుఁ జెయ్దములు. 671

ఆ. చెడ్డపనులు రెండు చేరి కాలే వొక, దొడ్డపనిగ; నెడఁదజడ్డు కడిగి
తప్పు దిద్దుకొనుఁడు తమ్ముఁగుబ్జులు! త్రిక్క, విడువరేని గోతఁబడుట నిజము. 672

క. పాకీస్థానమువారల, రాకాసితనమ్ము మనము రాత్రిందివమున్
నైకవిధమ్ములఁ జాటినఁ, జేకూరదు శాంతి భగ్నజీవికి లవమున్. 673

క. తనచేసిన పాపమ్ముల, కనుగలమగు శిక్ష గుడుచు నారాజ్యము; క్రొ
వ్విన వారిబ్రదుకు లెన్నో, మన మెఱుఁగుదు; మేల రిత్తమచ్చరికమ్ముల్. 674

క. పాకీస్థానము దారికి, రాకుండిన భారతంబు ప్రకటించు రణం;
బీకడిఁదికర్జమున కే, నీకొందు నహింస కెంతయిష్టుఁడ నైనన్. 675

గీ. ధర్మరక్షకు సర్వహైందవులు కలనఁ, గూలినను దుఃఖపడ; రిపునేల నున్న
హిందువులు దానిగెల్పునకే పెనంగఁ, దగు; నిచటిమల్కలకును గర్తవ్య మిదియ. 676

మధ్యా. అలవోకగా నవ్వులాటగా భారతావనిం జీల్చి
నెలవంకపడగ నెత్తితి మిఁక రణము నెఱపి భారతము
గెలుతు మని పగతు రందురఁట యనికిన్ దలపడిన
నిలుచువాఁ డెవ్వఁడు మనయెదుట ఫాలనేత్రుఁడున్ దలఁకు. 677

గీ. బాఁకుమొన చూపి భారతప్రజలనెల్ల, ముస్లిములఁ జేయఁ గొందఱుమొఱకులెంత్రు
పంద దేనాఁటి కీకోర్కి పంద దెవరు, చాలుదురు మనధర్మువున్ సంహరింప. 678

క. హిందూమతంబు సమసిన, హిందువులే కర్త లగుదు; రిస్లాము మృతిం
జెందిన ముస్లిములే యా, ద్రుందుట దెచ్చెదరు దీని మఱవకుఁ డెపుడున్. 679

క. తమకుడిచిన బన్నంబుల, యమబాధలకతనఁ బ్రజల కతివేలక్రో
ధము రాక సాజ; మైనను, క్షమ వలయుఁ బ్రజాప్రభుత్వసౌధము నిలువన్. 680

గీ. తప్పొనర్చినవానికిఁ దగినశాస్తి, సేయ దొరతన మున్నదిలే యటంచుఁ
ప్రజలు సైరణ పాటింపవలయుఁ గాని, తగ దరాజకపద్ధతిన్ దగిలి చనుట. 681

క. అన్నిటికంటెను మున్నుగ, నెన్నం దగినది యహింసయే యగుఁ గానీ
మన్నింప రిపుదు ప్రజ లీ, తెన్ను దురావేశకుటిలధీ కింకరులై. 682

గీ. పెక్కుతప్పుల నెవరు కావించి రనెడి, తర్కమున కిప్డు పూనుట తగనిచేఁత
యెవరి కనువైనచోట వా రెగసి దనుజ, ధర్మమునకియ్యకొనిరి దుర్దాంతులగుచు. 683

ఆ. తరతరాలనుండి కరిపురమున ముస, ల్మాను లధివసించుమాట నిక్క
మిచటఁ గాపురించుహిందువుల్ తమ్ములఁ, జూచునట్లు వీరిఁ జూడ్కి వలయు. 684

క. చూతు మిఁక, నల్క నవలికిఁ, ద్రోతుము నా నొక్కగంతుతోడం గదియన్
నేతును బాకీస్థానము, పాతు ననిన్, దేల్చు కొందు బ్రదుకో చావో. 685

క. ఏ నొక్కండన పాకీ, స్థానమునకుఁ జనెద నన్ను సాఁకన్ గరుణాం
భోనిధి రాముఁడు కలఁ డని, యేనాఁడో త్రచ్చి నిశ్చయించినవాఁడన్. 686

గీ. మతిసెడినవానిచేత నామృతి ఘటిల్లు, నేని నవ్వుచు నిరసింతుఁ బ్రాణములను
జావు నా కిట్టి దబ్బుచో జగతి కేను, మంచిపారము నేర్పినమనిసి నౌదు. 687

మధ్యా. మతకలహమ్ములు మాని చుట్టాలమాడ్కి నీనేల
బ్రదుకుఁ డన్న లటంచు రేపు లాహోరుప్రజలను గదిసి
హితవును ధర్మువున్ దెలుపుపట్ల న న్నెవఁడేని జంప
గతిదప్ప మీరు కల్ ద్రావినకపులు కారాదుసుండు. 688

ఆ. అగుదురేని యస్మదాత్మ కదుంగదుఁ, బరితపించు డిల్లపడి కృశించుఁ
జేతి కందినట్టిస్వాతంత్ర్యము నశించు, నన్నలార! శాంతి యంతరించు. 689

క. మనకయ్యమ్ములు హెచ్చెడి, దినములు ముందుండె ననుచుఁ దెంపరియై ప
ల్కిన చర్చిలుజోస్యము నీ, రన్నృతముఁ గావింపుఁ డణఁపుఁ డావేశములన్ 690

గీ. ఆంగ్ల సామ్రాజ్యవైశాల్య మణఁగె భార, తావని స్వతంత్ర మగుటచే నని వగర్చి
నేఁటి కార్మప్రభుత్వమున్ నిందసేయు, మాసియతఁడు త్రుళ్ళింతలరాసి యతఁడు. 691

గీ. నరులలోఁ గొందఱసుర లున్నారుమృగముఁ, జంపుచందాన మానవుఁ జంపువారు
ప్రాణమిచ్చుసమర్థత లేనినరున, కెక్కడిది జీవముం దీయుహక్కు సెపుఁడి! 692

ఆ. శిబిచరిత్ర మేమిసెప్పు నాత్మార్పణ, మియ్యకొనక గెల్వఁ డెవఁడు ననియ
యంతదనుక మనము సంతనకట్టిన, నపు దహింసయును జయంబు వడయు. 693

క. మనకెలఁకులు సెడుచోఁ న, య్యనయమునకు మనమె హేతు వనఁజెల్లు నహిం
సనసత్యమ్ముల పొరుగున, మనునా పాపంబు? కుటిలమతి యేర్పడునా? 694

ఆ. ఆత్మగౌరవమ్ము నణఁచుట తనువును, జెలగివైచుకంటెఁ జెడ్డచేఁత
హింసలేనిదేశమే ప్రజాస్వామ్య ప్ర, యోగమునకుఁ దగు నిరాగమగును. 695

ఆ. పరమతమ్మువారి ప్రాణాలు గుంజుట, కియ్యకొన్నవార లెల్లి రేఁగి
తమమతమ్మువారి తల ద్రుంపరా రక్త, దాహ మాఱవర్ధితేహ దీర. 696

క. సిక్కుృకృపాణము పట్టుట, దిక్కఱి యల్లాడుచున్న తెఱవను ముదిమిం
జిక్కినవానిం బ్రోవన, యక్కట! నేఁడతఁడు రేఁగి యనదలఁ జంపున్ 697

క. దీనులఁ గాచిననాఁడే, మానవు నగ్గించు సభ్యమండలి; శౌర్యం
బానాఁడే సఫలం బగు, గానఁడ యానాఁడు నరుఁడు కర్తవ్య మిసీ! 698

క. భగవద్దర్శనమునకై, పొగులుట నరుపాడి; ఱాతిబొమ్మలగుడులం
దగపడఁడు వేల్పు, తిండిని, దిగనాడినమాత్ర నసుమతింపఁడు దయకున్. 699

గీ. అన్నలార! లోకమునెల్ల నాదరించు, ప్రేమ మొక్కఁడె ప్రభుని జూపింపఁగలదు
జంగమస్థావరమ్ముల జగదధీశుఁ, జూచి చూచి మీరాబాయి ద్రోచె భవము. 700

గీ. అపహరించిరి దుండగు లచట నిచట, దీనలై కుందుయువతుల వేనవేల
నుభయరాజ్యాలవారికి నుదుపరాని, మచ్చ యిది యెంత చెడె నిసీ! మనుజజాతి. 701

ఆ. ఏలుబడులు రెండు నీవెలందులచెఱ, మాన్పవలయు ధర్మమర్మ మరసి
పతులు పితలు వీరిఁ బతితలచందానఁ, జూడరాదు నరత వీడరాదు. 702

గీ. ఏను సామాన్యమనుజుఁడ నెన్నఁడును మ, హాత్ముఁడనటంచుఁదలఁచినయతఁడగాను
కాని పరమేశుపట్ల ననూనమైన, నమ్మకము గలవారిలో నాణెగాఁడ. 703

గీ. సత్యము జయించు నణఁగు నసత్య మని మ, హర్షులాడినవాక్యము నాదరించు
హిందువులుముస్లిములుసిక్కులుందురెంత, దనుకభారతమహియంతదనుకఁజెదదు. 704

క. మఱవకుఁ డీశ్వరు నతఁడే, పరిరక్షయొనర్ప నోపుఁ బ్రాణులఁ గరుణా
కరుఁ దతఁడుగాక పోలీస్, దొర మిమ్ము నొగుల్చు వెఱపుఁ దూలించునొకో. 705

## కాశ్మీరసమస్య తీవ్రరూపము దాల్చుట

వ. మహాత్ముఁ డిట్లు సౌహార్దసందేశము నొసఁగు ఢిల్లీనగరము చాలవట్టు శాంతించె - ఇట్టియెడఁ గాశ్మీరసమస్య తీవ్రరూపముం దాల్చె - పాకీస్థానమువారిదేశమునం దల్లరులు రేఁప నాటవికసేనం గదల్చిరి - ఈదండు శ్రీనగరము దెసకుం పరుగెత్తి ముజఫరాబాదు

మున్నగు పట్టణముల (25-10) ముట్టడించె సంస్థానము వారిదళ మీమూఁక నరికట్టఁ జాలక వెలుకంబాఱె - రా జపు దబ్దుల్లామున్నగు ప్రజానాయకుల బంధవిముక్తులఁ గావించి దేశరక్షకు వారిసాయముం గోరుటయకాక 706

మధ్యా. ఏను మీవాఁడ నారాజ్య మీఁకను మీయేల్బడియంద
లీనంబగుఁ గరాచినేతలు దురము లేపి నాప్రజల
నానావిధాన నీనాఁడు నొంచుచున్నా రీవిపత్తు
మానింప మొనల నంపుఁ దని నెహ్రూకు మనవిని బంపె. 707

## బాపూ సైనికచర్యను సమర్థించుట

వ. షేకబ్దుల్లాసైత మూర్వీపతినిర్ణయమున కురరీకృతిం జాటె - అట్టితఱిఁ గర్తవ్యమేమి యని భారతప్రభుత్వమువా రాచార్యు నడుగ మహీపతియుం బ్రజానాయకుఁడును మనసైనికసాహాయ్యము నర్థించినపుడు తద్రాజ్యము మనరాష్ట్రకూటమునం జేర నియ్య కొన్నపుడు మన మీసాయ మవశ్య మొనర్పవలయునని బాపూ హితమ్ము వల్కె - పదంపడి మనబంట్లు (27-10) కాశ్మీరభూమికి దూఁకి పగతురం జిందఱ వందఱ సేయఁ గసివోక మసిఁబూసికొన్నయట్లు భారతప్రభుత్వము దురాక్రమణ మొనర్చె నని పరాజితు లానాఁడు మనరాజనీతి నాక్షేపించుటయు నట్టిదుండగమునకు మున్ముందు సాహసించిన వారు పాకీస్థానము వార యని రాజప్రతినిధి జిన్నా కెఱుకపఱిచె - అది యట్లుండె - మహాత్ముఁ డీసైనికచర్యను సమర్థించుట తనయహింసాధర్మమునకు విరుద్ధము కాదా యని పల్వు రయ్యెడం దమసందియము నావిష్కరింప 708

మం. ఒకఁడు హింసావిధి నోర్చినమాత్ర, నతనిసద్గుణముల నగ్గించుచేఁత
మానఁ దహింసార్థి మాను టొప్పదును; బోసు ఖడ్గముపట్టి పోరాడెఁగాక
యతనివిక్రాంతి సాహన మార్జవంబు, ధృతి దేశభక్తి యుత్తేజితప్రజ్ఞ
కొనియాడఁదగు మేలిగొనములు గావె; హింసాపరాయణు లిర్వురు పెనఁగు
తఱి నహింసావాది ధర్మువున్ విడని, వాని సమర్థింపవలె నవశ్యముగఁ
నరుడుఁ కృపాణియై నడుచునే నతని, సరణి మెచ్చుని యహింసాదీక్షితుండు
పాపాత్మునకుఁ దోడుపడినవాఁ డగును. 709

వ. అని బాపూ ధర్మరహస్యము తెల్లమికావించె - అదియట్లుండె - కాశ్మీరమునకు వచ్చిన యిరువంకదడముల నెయ్యది ముందుగా నుపసంహృతము కావలయుననుపట్ల నానాఁ డుభయప్రభుత్వములకు నభిప్రాయభేద మేర్పడి యెంతకుం దెగదాయె - తుట్టతుదకు భారతదేశ మీసమస్యను భద్రతాసమితికి (30-12) సమర్పించి దాని కావించు ధర్మ నిర్ణయమునకు వార్వం దొడఁగె - అది యట్లుండె. 710

# 1948

## మహాత్ముని గుండెలో ముల్లు నాటుకొన్నది

క. దేశము చీలినకతనన్, గోశంబును జీల్చి పంచుకొనుపని వచ్చెన్
ధీశరధు లపుడు విగతా, వేశంబునఁ దేల్చి రున్నవిత్తములెక్కన్. 711

గీ. ఇచ్చినదిగాక హస్తినయేఁబదైదు, కోట్లధనము కరాచి కీఁగూడు ననిరి
మంచిదేకాని కాశ్మీర్సమస్య చక్కఁ, బడిననాఁ డిత్తుసా త్తనె భారతోర్వి. 712

గీ. పాడిదప్పి కాశ్మీరభూభాగ మాత్ర, మించినది దొంగదండుఁ బంపించినది క
రాచిరాచతికం; బిది సైఁచుటెట్లు, కొదవసొ మ్మిచ్చుటె ట్లని యది వచించె. 713

క. పాకీస్థానమువా రీ, వాకులు విని క్రుద్ధులై యవాచ్యమ్ములతో
నైకవిధమ్ముల హిందూ, ర్వీకృతనిర్ణయము పరిభవింపం దొడఁగన్ - 714

మధ్యా. వచియింపు మిందు ధర్మువు నని గురుఁడు వైస్రాయి నడుగ
నుచితంబు గాదు సొ మ్మాఁపుట యనియె నుర్వీధవుండు
సుచరిత్రతో స్వతంత్రత గడించి సంస్తుతు లంది యేల
పచరించు నేఁ డిట్లు భారతం బని బా పారటించె. 715

ఆ. చిల్లిగవ్వయైనఁ జేత లేక కరాచి, కుందుగుడుచు నేఁదు కూటికొఱకు
మనయహింస యింతమఱపునఁ బడ్డదా, సిగ్గుసి గ్గటంచు స్రగ్గె గాంధి. 716

వ. పదంపడి ఢిల్లీనగరమునఁ గాఁపున్నముస్లిములు కొందఱు బాపూసన్నిధికి వచ్చిరి - వీరు కాంగ్రెసున కండగా నిల్చినవారు - బారతదేశముపట్ల వీరి కాదరము మెండు - తమవీట నెన్నిదుండగములు సాగుచున్నను జలింపక యిందనుక నిండ్లువీడని పెద్దలు - వీరు జాతిపిత కభివందనములు సమర్పించి 717

మం. బాపుజీ! మాపదుబన్నముల్ వెతలు, వినిపింపరానివి వినరాని వయ్యె
నెన్నాళ్లు సైరింతు మీహింసనములు; తొలఁగె మాసైరణ తూలె మాయాశ
కాంగ్రెసు మాకు రక్ష యొసంగదేని, బ్రదుకలే మిచ్చోట భయమున బ్రుంగి
భారతమ్మున మాకుఁ బ్రాపు లేనపుడు, నడువలే మన్న! జిన్నా రాజ్యమునకు
నీరెండుగడ్డల నిలయెల్ల లేదు, బహువిశాలం బీప్రపంచ; మెన్నేని
దేశంబు లున్నవి దీన; నింగ్లాండు, భూమికో వేఱొందుపుడమికో పోయి
బ్రదికెద మేము తోడ్పడవె మా కనుదు, నౌర! జాతీయమహమ్మదీయులము
మే మని చాటినమీరె యీనాఁడు, పల్కితిరా యింతపరుసనిపల్కు
లని దేశికుఁడు వారి నదలించెఁ గాని, గ్రుచ్చుకొన్నది తండ్రిగుండెలో ముల్లు
దరికొన్నది మహాత్ముతలఁపునఁ జిచ్చు. 718

ఆ. నాఁటివేఁడికోలునకుఁ జనుదెంచిన, ప్రజల కిభపురానఁ బ్రల్లదీంద్ర
కతనఁ గుందువారికథ తెల్పి గాంధి యీ, నేల కిది యరిష్టకాలమనియె. 719

మధ్యా. మతము వైయక్తికధర్మ మైనను మఱచి యీసత్య
మతివేలముగ హిందువులను సిక్కుల నణఁచిరి మల్క
లితవరు లెంతసెప్పిన గణింపక హిందువు లిచటఁ
బ్రతికారమునకుఁ బూనెద రిది సకలప్రజ నార్చు ననియె. 720

వ. మఱియు నహింసయు సత్యమును దొంగతనము లేమియు బ్రహ్మచర్యమును మితిమీఱిన సంపదనార్జింపమియుఁ గాయకష్టమును రుచులుకోరకుంటయు సర్వావస్థలయందును నిర్భయత్వము పాటించుటయు సకలమతములం దుల్యదృష్టితోఁ గనుటయు స్వదేశవస్తువులు వాడుటయు మానవుఁడు వినమ్రుఁడై వ్రతనిష్ఠతో సేవింపఁదగిన ధర్మములని వక్కాణించి తన వేఁడికోలు రచ్చ ననుదినమ్మును బఠియించు

"అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అసంగ్రహ
శరీరశ్రమ, అస్వాద, సర్వత భయవర్జన
సర్వధర్మసమానత్వ, స్వదేశీ, స్పర్శభావనా
వినమ్ర వ్రతనిష్ఠాసే యే ఏకాదశ సేవ్యహైఁ".

అను పద్యముం గ్రోల్చె-మఱునాఁడు మహాత్ముని మౌనదినము (12-1)- కాన నాఁటి ప్రార్థనసభాసందేశము నాచార్యుండు వ్రాసియొసఁగ సుశీలానయ్యరు చదివె - బాపూ లిఖించినపల్కులు దాన నిట్లుండె. 721

## బాపూ ప్రాయోపవేశము పూనుట

మం. ఎల్లి సాపడినంతనే యిల్లి ఊన, నెంచితి దీనికి నెల్ల నేమింప
నీట్రులో నీరమో నిమ్మరసంబో, త్రావెద నన్యంబు తాఁక నెద్దియును
ప్రజలచిత్తం బతిపాప మైనపుడు, ప్రజ లహింసాపథప్రవణు లైనపుడు
వర్జింతు ననశనవ్రతమును దీని, వసుధ ధర్మగ్లాని వచ్చిననాఁడు
మానవత్వము మటుమాయ మైనపుడు, సంఘమున్ సవరించుశక్తి లేనపుడు
తనయసమ్మతి చాటఁ దననొవ్వి దెలుపఁ, బస్తుగాక యహింస పాటించువాని
కస్మాదృశున కన్యమగుదారిలేదు, వచ్చె నా కిపు దౌపవస్తలగ్నంబు;
నాల్గుమాసంబులనాఁ డీపురమ్ముఁ, గదిసి కాంచితి వల్ల కాటితీ రిందు
నిచటఁ జైతన్య మెట్లేర్పడు ననుచు, నిచట సౌహార్ద మె ట్లెసరేఁగు ననుచు
నొచ్చితి నీతు లెన్నో వచించితిని, నివుఱుకట్టెను గాని ని ప్పాఱలేదు
మూన్నాళ్ళనుండి యీముప్పు నణంప, వెర వెద్దియని పెద్ద వెదకి యీ తీర్పు
తగు ననుకొంటి నీతపము నా కమిత, సంతుష్టి నిడు దీని జగమెల్ల నెఱుఁగు

మైల యెద్దియు లేని మనుజుండ నేను, వెఱవcడు ప్రాణాలు విడువc బవిత్రుc
డీదేశపుంగీర్తి నిల నుద్ధరింపc, బూనితిc బస్తు; నాపూన్కి కాదనక
నాపట్ల నల్గక నన్ను దీవింపుc, డన్నలారా! యహింసార్చకులార
తమ్ములారా! సూనృతవ్రతులార! **722**

గీ. దేశికుని చిన్న కొమరుcడు దేవదాసు, తంద్రికుపవాసమున ననర్థము ఘటిల్ల
నెంత దురవస్థ మూcడునో యీధరిత్రి, కార్తి యెంత జనించునో యని కలంగి-**723**

వ. బాపునకుం దనవనటc దెల్ప "నోయీ! నానిర్ణయము తీవరపాటునం జేసినది కాదు - పురుషకారము రిత్తయైనంతన వేల్పు శరణుసొచ్చితి - గజేంద్రునికథం జదువుదేని నా తెఱంగు నీ కవగతం బగు - నని ప్రత్యుత్తర మిచ్చె - అది యట్లుండె. **724**

మధ్యా. మొదలిడె వైష్ణవగీతితోc బస్తు మోహనదాసు
పొదలె నయ్యెడ గురునివదన మనిదంపూర్వహర్షమున
వదలవే ప్రాయోపవేశ మని జగావాసి గన్నట్టి
పెద్దపెద్ద లర్థింపసాగి రయ్యను భీతచిత్తముల. **725**

ఆ. ఏల రిత్తకోర్కి, యిది గాంధి నలయించుc, గాని తనుపcజాల; దీనరాళి
యెడcద మాఱినపుడె యిల్లి మాను మహాత్ముc, డనె నజాదు విద్వదగ్రసరుcడు. **726**

గీ. లీగునాయకులును విహ్వలించి నిట్రు, మానవే యని తీcగవక్కాణములను
బంపి రాచార్యునకు నార్తబాంధవునకు, నేరcబోతులదురుసు మన్నించుయమికి. **727**

మధ్యా. ఆనాcడ హాహారవముల హస్తిన కరుదెంచుచున్న
దీనులపొగబండి నాcపి మల్క లతిక్రాంతనీతు
లానిరి కాందిశీకజనర్తకము నాకంఠముగను
బూనిరి దానవత్వంబు, మఱచిరి పుణ్యాపాపములు. **728**

క. ఈ వెది పనిచిన దానిం, గావించెద నిల్లి నుడిగి కాపాడcగదే
యీవసుధ నని పటే లపు, దావిష్కృతిచేసె నొజ్జ కాత్మాశయమున్. **729**

వ. అట్లగునేని మునుముందు పాకీస్థానమున కీవలసినసొమ్ము నొసంగవలయు నని బాపు సర్దారునకుం దెలిపె - మఱునాcటి (14-1) వేcడికోలుసభం బ్రల్లదులు నిన్న కావించిన యవగడములపట్ల సంతాపము మెఱసె - ఇట్టికట్టcడిపను లనర్థకము లని జిన్నాను హెచ్చరించె - ప్రతీకారవాంఛ గర్హణీయం బనె - బాపూ ముస్లింపక్షపాతి యని కొంద అప్పుడు నిప్పులుక్రక్కిరి - వీనిc జంపుట మనదేశమునకు మేలని కొంద ఱాపన్నాగము నకు దిగిరి - నాcటిరేయి పశ్చిమపాంచాలపుసిక్కులు కాందిశీకులు మూcకగా వచ్చి 'రక్తమునకుమాఱు రక్తమ - ప్రతీకారము సముచితము - గాంధిని జంపవలయు' - నను కేకలతో బిర్లా - భవనమును నింప నెహ్రూ తాళలేక **730**

గీ. ఎవ్వఁడామగవాఁడు? నాయెదుట నిల్చి, శౌర్యముం జూపవలె నన్నుఁ జంపి గురుని
జంపవలె నని తుకతుక చాటు గుంపు, పడుచు లేచుచు విడిదలపజ్జ కుఱికె. 731

మధ్యా. ప్రాయోపవేశవార్త యిది సర్వప్రపంచసంతాప
దాయక మయ్యె మహమ్మదీయమతము నేలుగురువు
లాయాయిభూములవారు శాంతింపు మని మహాత్మునకుఁ
జేయందొడఁగిరి విజ్ఞప్తి లీగు చేసినది తప్పనిసరి. 732

మధ్యా. తనపాలి మొదటిపగతుఁగ బాపును దలఁచి యెన్నేని
యనరానిపల్కు లాడిన కరాచిరాజ్యాధిపు లిపుడు
కనుదెఱచిరి తమనేల నల్పసంఖ్యం గలవారి
మనుగడ రక్షింతు మని రహింసాభిమతమ ల గ్గనిరి. 733

మధ్యా. లాహోరునం దన్ని మతములప్రజ బలా! సభ చేసి
జోహారు లర్పించి వేఁడెను బరమేశు దయాసముద్రు
నేహాని రానీక గాంధి నీవేళ నేలవే తండ్రి!
మోహాదులను జయించిన పరమపుణ్యామూర్తి నటంచు. 734

వ. తృతీయోపవాసమునాటి (15-1)కాచార్యుఁడు పెద్ద నీరసించుటం జేసి ప్రార్థనా స్థలమున కదుగిడలేక సెజ్జనుండియ ధ్వనివర్ధకయంత్ర (మైక్) ద్వారమునఁ దన సందేశము నెల్లరయెడఁదలుం గలియవలయు ననుదానిని సభకు వినిచె - ఆసదస్సు నంద బాపూబ్రదుకు సందిగ్ధదశకు వచ్చిన దని వైద్యులు ప్రకటించిరి - పాకీస్థానము పాలిసొమ్మేఁబదియైదు కోట్లు చెల్లింతు మని భారతప్రభుత్వమువా రనిరి - నాఁటి రాత్రి ఢిల్లీప్రజలు వాడవాడకుంజని 'మతసామరస్యమును బాటింపుఁడు - జాతి పితను బ్రదికింపుఁ' దను నినాదము లిచ్చుచు నూరేగింపు జరిపిరి - మఱియు నమ్మఱు నాఁడు (16-1) 735

గీ. చేవ సెడియున్న దేశికుచెంత కచటి, ముస్లిములు కొంద ఱేతెంచి ముప్పుఁదెరలు
విచ్చుచున్నవి ధైర్యమువచ్చెమాకు, మాను ముపవాస మోతండ్రి! మానుమనిరి. 736

మధ్యా. కరిపురమున రేఁగిన యవగడములకతనఁ బ్రాణమ్ము
లఱచేత నిడుకొని మును కరాచికి నరిగినవారు
'మరలిరావచ్చునె మేము జడియక మాయిండ్ల' కనుచుఁ
బఱపినతంతివార్తయు నపుడ దూఁకె బాపుసన్నిధికి 737

మం. తనగది నున్న పెద్దలను దేశికుఁడు, కని యిది మీకు నుగ్రపరీక్ష యనియెఁ
గర్తవ్యమును దీర్పఁ గడఁగిరి గఱువ, లచటికి శరణార్థులై పఱతెంచి
కసిదీఱ మల్కలఁ గాఱియపెట్టు, సిక్కులు హిందువుల్ చిత్తముల్ మాఱి

వందలు వేలుగా వచ్చి మహాత్మ!, రావచ్చు ముస్లిముల్ రావచ్చు భీతి
వదలి హస్తినకు రావచ్చును వారి, నాదరింతుము వారియాస్తి నిచ్చెదము
మతవైరములు మాని మనెదము నీవు, మానవే! పస్తును మానవే! నీదు
బ్రదు కీధరిత్రికిఁ బరమభాగ్యమ్ము, నీ వింక వేయేండ్లు నిల్వఁగావలయు
నని గురుసన్నిధి నాత్మానుతాప, మావిష్కరించి తా మన్నది వ్రాసి
చేవ్రాళ్ళు చేసి యిచ్చిరి పత్ర మయ్య, కిభపురి నుత్సాహ మెసఁగె సౌహార్ద
గంధముల్ కదలె నల్గడ శాంతి పొదలె, నార్థరుమూ రను నాంగ్లేయుఁ డొజ్జ
(ఇతడు స్టేట్సుమన్ - ఎడిటర్, కలకత్తా)
దెస సానుభూతిని దెలుప నుపాస, మూనినాఁ డనువార్తయును వచ్చె నపుడ
పాటియాలా మహాప్రభువు మాసిక్కు, లాగడం బిఁకజేయ రనె గాంధితోడ
నొకసిక్కు హతుఁడైన నోహటంపడక, పదుగురుమల్కుల ప్రాణంబు లేను
గొనియెద ననెఁ 'మలేర్కోట్లా' నవాబు, బాపురే! నాకల పందె నీతేని
దేశమ్మునం దని దేశికుం దలరె, నాఁటిసాయంవేళ నడిచినసభకు
రాలేక బాపు భారతభూమి నేలు, వారు కరాచి కీవలసినవిత్త
మిచ్చుట గణనీయ, మిది జగమ్మునకు, సంతృప్తి నిదు నని సందేశ మంపె. 738

వ. మఱునాఁడు (17-1) మహాత్మున కారోగ్యము కదుంగదుదిగజాతి మాటిమాటికి దెలివి తప్పుచుండె - తాను మంచముపై నుండియు నన్ను మంచమునకుఁ జేర్పుఁడని జాతిపిత పల్క నచటివారియుల్లములు జల్లుమనె-దుండగీంద్ర హృదయముల నుచితపరిణామ మేర్పడుటంజేసి యిఁక బాపూ మెతుకు ముట్టవచ్చునని పౌరులూహించి యాశుభవార్త నాలకింప వార్చిరి - మతమైత్రికై నగరమున నెన్నో సభలు సాగె - ఊరేగింపులు కదలె - రాజప్రతినిధి వచ్చి ప్రజాసామరస్యమునకు నలఁగుచుంటి నని మహాత్మునకు విన్నవించె - అజా దొకసభలో నెల్లరతలంపులు సుపరిశుద్ధము లైనపుడ బాపు తనదీక్ష విడుచుననె - రాజేంద్రప్రసాదుభవనమున నానామతవర్గప్రతినిధులు చేరి యితరేతర ప్రేమముతో జీవింప నియ్యకొనిరి-నాఁటి వేఁడికోలురచ్చ కాచార్యుండు తన సందేశము నిట్లు వినిచె. 739

క. పాకీస్థానము నుండియు, నాకెన్నో తీఁగవక్కణమ్ములు వచ్చెన్
లోకం బహింసవలనికి, రాకన్ విని మన్మదంబు ఱంపిలుచుండెన్. 740

గీ. ఐన నెల్లరయెడఁదలయందు హార్ద, మొదవినప్పుడె నాదీక్ష నుడుగువాఁడఁ
బ్రజలు తమకింపరాదు నాబ్రదుకు నిల్ప, రిత్తవాగ్దానములు వెల్వరింపరాదు. 741

మధ్యా. ఈనాఁడు పల్కినపల్కులకు వార లెల్లకాలమ్ము
లోనై చరింపవలయును సూనృతలుబ్ధులు మెచ్చ
నానాశ్రమమ్ముల నీకొని గడించినది స్వరాజ్యమ్ము
దీనికిఁ బ్రాణంబు చెల్మిమై నిరుదెగలవారుంట. 742

వ. అమ్మఱునాఁటికి (18-1) మహాత్ముని బ్రదుకు సందియమునం బడె - కఠోరవార్త యిది విన్నంతన రాజేంద్రుఁ డాదిగాఁగల పెద్దలు బిర్లాభవనమునకువచ్చి కడచిన నాఁటి రేయి తమకావించిన నిర్ణయము నయ్యె కెఱుకపఱిచి యెల్లరసంతకములతో నొదంబడిక పత్రము సమర్పించి యిఁక నుపాసము నుజ్జగింపుమని విన్నవించిరి - వీరిలో హిందూ మహాసభవారియు రాష్ట్రీయస్వయంసేవక సంఘంవారియుం బ్రతి నిధులు కలరు - ఈపత్రమున మాననీయ రాజేంద్రప్రసాదు నాధ్వర్యవమునఁ గేంద్ర శాంతిసంఘ మేర్పడిన దనియు 1 రానున్న ముస్లిముపండుగునాఁడు మహమ్మదీయు లాయుత్సవమున నిర్భయముగాఁ బాల్గొనునట్లుచూచుట 2 కాందిశీకులగు హిందువులు సిక్కులు నగ్గపఱుచుకొన్న మసీదులను ముసల్మానుల కప్పగించుట 3 పలాయితులైన ముస్లిములను వారినెలవుల కాహ్వానించుట 4 ముసల్మానుల దుకాణములపైఁ గల యార్థిక బహిష్కారము తొలఁగించుట 5 నగరమునందలి వీథులకెల్ల మహమ్మదీయులు వచ్చునట్లు సేయుట 6 పొగబండిలోఁ బయనించు మల్కలకుపద్రవము రామికిం బెనఁ గుట 7 పోలీసులయు సైనికులయు సాయము నందక ప్రజాశాంతి కాపాడుట - దీనికర్తవ్యము లనియు వ్రాయంబడియె. 743

క. ఆపత్రమును గనుంగొని, బాపూ తలయూఁపి మంచిపని చేసితి; రే
నీపరిణామం బొదవుట, కే పూనితిఁ బస్తు;నేఁటి కిది ఫలియించెన్. 744

గీ. నిర్ణయం బిది మఱవక నెమ్మికొఱకుఁ, బగలు రేయి నలంగుఁ డీపట్టణమున
నన్ను వంచింపఁబోకుఁ డోయన్నలార!, సైఁపలే నిఁక నే నుపాసంపుబరువు. 745

ఆ. ఇచట శాంతి యొదవునేని దేశమ్మున, నాల్గుదెసల నెమ్మి నాట్యమాడు
నెమ్మిలేనిబ్రదుకు వ; మ్మెంత కాల మీ,రిత్త మనువు నవధరింపఁగలము. 746

## మహాత్ముఁ డుపవాసము మానుట

మధ్యా. మానుచున్నాఁడ నిరశనదీక్ష మీ మాటలు నమ్మి
నా నిచ్చె నాజాదు జాతిపిత కింత నారింజరసము
ఘనభోంతరమున బూరటిల్లె 'బాపునకు జే'యనెడి
ధ్వాన మసంఖ్యాతజన ముఖోత్థ మద్వంద్వమై యపుడు. 747

మధ్యా. ఒజ్జతో నుపవాస మూని తపియించుచున్న వా రంద
ఱుజ్జనచేసిరి దీక్ష; బాపూజయోద్గతికొఱకు
నిజ్జన్నమున ముస్లిమువనితలు నూర్వు రేకీభవించి
రజ్జారె! దుండగీంద్రుసు బలువు రయ్యె కనుగంత లైరి. 748

క. కరుణకు లొంగనివా రెవ్వ రుంద్రు; ప్రేమకును సత్యవాణికి జయ మ
ఖ్ఖురమా దయాదులువినా, నరు దిద్దన్ రాజశాసనము లోపునాకో! 749

క. నిన్నటినుండియు నిట్రున, నున్న జవహరునకు మాను ముపవాసము నీ
వెన్నేండ్లో మనవలె నని, ప్రన్ననిపల్కుల గురుండు పంపెను జీటిన్. 750

వ. మహాత్ముఁ డాసాయంకాలపుసభ నుద్దేశించి మంచమున నుండియ మాటాడుచు సభాసదులార! మన కిది యపూర్వ పర్వదినము - మీ హృదయములు మార్పు నందుటకతన నే నుపాసనముం బాసితి - కడచన్న కథల విస్మరించి నెయ్యతియ్యము లతో నెల్లరున్ మనుఁడు - మతగ్రంథము లన్నియు నాదరణీయములని నమ్ముడు - ముసల్మాను లీగడ్డయందును హిందూసిక్కులు పాకీస్థానమునందును భయసంశయ విదూరులై తిరిగిన నాఁడ నాయానందము సోడుముట్టు-నాశాంతి యనంతమగు కాందిశీకు లిఁక నెవరి సీమకు వా రేగి యిరుగుపొరుగులతోఁ గలసిమెలసి బ్రదుకుట వలయు - నావుడుం బ్రజలు బాపుం జూడ నుత్కంఠ చాటిరి - నిరంతధారమై వర్షము పడుచున్నను బరివారము మహాత్ము నొకకురిచీ నుంచి పంచకుఁ దేర జనులందఱుం గని తనిసిరి - నేలనాల్గు చెఱఁగుల నుండియు నపుడు బాపుం బ్రశంసించుచు వచ్చిన తంత్రీవార్తలకు లెక్కసెప్పుట యరిది - అదియట్లుండె - పదంపడి (20-1) మహాత్ముఁడు 751

## మహాత్ముని సభలో బాంబుప్రేలుట

ఆ. వేఁడికోలుసభను వివిధసమస్యలఁ, దడవుచుండఁ బాడి నుడువుచుండ
నాతఁ డున్న తిన్నె కనతిదూరమ్మున, బాంబుప్రేలె నభ్రపదము వ్రీలె. 752

ఆ. అచటిగోడ పగిలె నాకఠోరధ్వని, కదరి ప్రజలు లేచి రలబలముల
నింతమాత్రకే చలింతురా యని యొజ్జ, మందలింప సభను మలసె శాంతి. 753

మధ్యా. తనకొఱకై వేచియున్న కారుచెంతకుఁ జేరులోన
నణఁచిపట్టిరి రక్షకభటులు కఠినాత్ము నద్దోషి
ననయం బిది ఘటిల్లిన దని తెలిసినంతన మంత్రు
లెనలేనితహతహ వచ్చి రాచార్యు నీక్షసేయంగ. 754

వ. ఇంతజరిగినం గలఁగక తనధర్మోపన్యాసము సాగించుచున్న బాపు నాపెద్దలు సూచి యీనిబ్బర మబ్బురము - ప్రతిష్ఠతప్రజ్ఞ నా నిట్టిదని శిరఃకంపన మాచరించి - అయ్యపట్ల నిట్టిచెట్టకుం దెగినవాఁ డొకహిందూకాందిశీకుఁడు-పశ్చిమపాంచాలమునుండి హస్తినకు వచ్చినవాఁడు - వీనిపేరు మదనలాల్ పావా - ఇతనివయస్సిరువదియైదేండ్లు - వీఁ డొకకుట్రమూఁకలోనివాఁడనియు నిమ్మూఁకకు రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ప్రముఖుఁడు, 'హిందూరాష్ట్ర' మను మరాటీదినపత్రిక సంపాదకుఁడు, హిందూ రాజ్య

మున కారటించువాఁడు, దెబ్బకుం బదిదెబ్బ లనువాఁడు, నాథూరామ్ వినాయక్ గోడ్సే యనునతఁడు నాయకుఁ డనియు మెల్లమెల్ల బయల్పడె - మహాత్ముఁడు కావించు శాంతియజ్ఞ మీకూటువవారి కోపతాపములకు హేతువాయె - బాపూ ప్రాయోప వేశములవలనఁ బాకీస్థానమున కేఁబదికోట్ల విత్తము లభించుట, ముస్లిముల భయము తొలఁగుట వీ రొప్పనిపనులు - కావుటం జేసి వీరికి సివమెక్కి వీరిబుద్ధిని మహాత్ముడు వధ్యుఁ డని నిర్ణయించుదనుక లాగె - అది యట్లుండె. 755

ఆ. అఖిల దేశపూజ్యుఁడైన బాపును జంపఁ, దొడరి పట్టువడిన దోసకారి
నటనకైన నింత నాన వెలార్పఁడు, కటుత నెంతబిగువు గన్నవాఁడొ! 756

ఆ. గాంధి నెదురుకొన్నగండ, మాఱడివోవు, టెఱిఁగి యెల్లయెదలగఱువ లాత్మ
సమ్మదంబు తెల్పి రమ్మహాత్మునకు మా, పాలిభాగ్య మీవు బ్రదుకు టనుచు. 757

మం. మఱునాఁటిసభ నహింసాయోగమూర్తి, మదనలాల్‌కథ నెత్తి మాటాడువేళ
నితనిని మన్నింపుఁడీ సభ్యులార! యితనికీ డెంచకుఁడీ యన్నలార!
నన్నుఁ బోకార్చిననాఁడు హిందూస, మాజ మెచ్చిఱు నని మది నెంచె నితఁడు
హిందూమతమ్మున కీగాంధి నతక, రించురక్షకుఁడు ధరిత్రిని లేమి
యెఱుఁగ డీకుఱ్ఱవాఁ డెఱుఁగఁ డీమొఱకు, ననుఁజంపఁగా జగన్నాథుఁడే తన్నుఁ
బనిచెఁబో! యని వీఁడు భావించియుండు, వేఁడుఁ డీతనికి వివేకంబు నొసఁగ
వేఁ యని పరమేశు వినతానుకూలు, ననవుడు నీయోర్మి యతిమానుషంబు
బాపురే! గురుఁ డెంతపండె నటంచు, సొగసెను దనివిమై శ్రోతృలోకంబు. 758

## నాకుఁ బోలీసులకాపు వలదు

వ. జనవరినెల నిరువది రెండవదినమున వల్లభభాయిపటేలు మహాత్ముని సన్నిధికి వచ్చి

మధ్యా. బాపుజీ! ప్రార్థనసభకు నేతెంచుప్రజలఁ బోలీసు
లాఁపి పరీక్షసేయుట యుఱవు; దీని కనుమతి నీవె
నీపట్లఁ గసి పెంచుకొన్న చెనఁటు లీనేల నున్నట్లు
చూపట్టుచుండె మొన్నటియకార్యంబు చూచిన దాది. 760

ఆ. అనుడు నొజ్జ యేల యడలె దోయీ! నన్ను, నెంతదనుక దైవ మిలను నిలుపఁ
దలఁచె నంతదనుకఁ దన కెట్టిచెట్టయు, రాదు వల్లభాయి! పేదవడకు. 761

ఆ. నాకు దైవరక్షణము కల దది చాలు, నేల నరునికాపు నిచ్చగింప
నాఁ బటేలు సేయునది కాన కూర్చుచు, నరిగె వేల్పుమీఁద బరువుమోపి 762

మం. సాయంసమయమందు సాగినసభకు, నడిచివచ్చె గురుం దనాయాసముగను
కాందిశీకులకస్తి గని కుంది మంత్రు, లాత్మగేహంబుల నవ్వారి నిల్పి

యాదరించుట మెచ్చె నందఱుగేస్తు, లాదారి త్రొక్కుట కృత్యమం చనియె
మదనలాల్ తప్పును మన్నించి యేను, ఘనకార్య మెద్దియో కావించినట్లు
నన్ను శ్లాఘించుచున్నది నేఁడు లోక, మతఁడు నాముందటి కరుదెంచి నిల్చి
తనమీఁది కేయాయుధంబునో పఱుపఁ, దొడఁగిన నది సూచి తొలఁగక వాని
యెడ నల్కసెందక యెలనవ్వు మాన, కసువు లిచ్చినమేటి నైనచో నన్ను
జగము కొండాడుట చనుఁగాని యేమి, చేసితి నని పెద్దసేయు నేఁ? దనియె. **763**

వ. ఢిల్లీనగరము శాంతిసంపన్నమైనది - ఇఁక లాహోరునకుంజని మతసామరస్యము సాధింపవలయునని బాపూ నిర్ణయించుకొని పూర్వరంగము నేర్పఱుప సుశీలా నయ్యరు ప్యారీలాలు మున్నగు ననుయాయుల నటకు నింతకుమున్న పనిచె - ఈ యాత్రలో జాతీయమహ్మదీయులేకాక ముస్లింలీగున వీనుమిగిలిన సుహ్రవర్దీ పురోగములును బాపుతోనడువ నడుముగట్టిరి-పాకీస్థానమునకు వేంచేయు మని యెందఱెందఱో ముస్లిము లానేలవారు మహాత్ము నాకారణసేయఁ జాగిరి-సర్వము సమీచీనమ - కాని కరాచీరాచతికమువారి యనుమతితోఁ బయనించుట లగ్గని తలంచి బాపూ తదంగీకారము వడయ నొకలేఖ వ్రాసె - దాని కెన్నాళ్ళకును మాఱుపల్కు రామింజేసి సేవాగ్రామమునఁ (2-2-48) బ్రవర్తిల్లనున్న నిర్మాణ కార్యకర్తృసభ కేగనెంచి తత్సమావేశ వ్యవహారములు దిద్ద మున్ముందు రాజేంద్రప్రసాదును వార్తాకుఁబంపె - సుప్రసిద్దదేశ భక్తుఁడు త్యాగమూర్తి జమునాలాల్‌బజాజుశ్రాద్ధదినము సైతము చేరువనుంటయుఁ దత్క్రతువునకుఁదప్పక రావలయు నని తన్ను బజాజుబిడ్డ లర్థించుటయు నీప్రయాణమున కొకహేతువు నాఁజను - అదియట్లుండె - అమ్మఱునాఁడు (23-1) సుభాసుచంద్రబోసు పుట్టిన ప్రొద్దగుట నాఁటిప్రార్థన సభయం దాచార్యుఁడు **764**

ఆ. బోసుదేశభక్తి పొగడి యాతనిపోఁజు, మాడ్కి జాతి మఱచి మతము మఱచి
ప్రజ పరస్పరానురాగముతో మను, టొప్పు ననియె శాంతి గుప్పు ననియె. **765**

వ. మఱుసటినాఁటి (24-1) సంజతతిఁ గన్నడులు కొంద ఱాచార్యుని గని తమ రాష్ట్ర మతిశీఘ్రముగా నవతరింపఁ దోడ్పడు మని వేఁడిరి-వా రేగినవెన్క బాపూ తెలుఁగు పెద్ద పట్టాభిసీతారామయ్యను గని యిట్లనియె **766**

మధ్యా. కలదులే నీ కాంధ్రరాష్ట్రవాంఛ; నిన్ గా దన నేల
కలహంబు రానిసీమ లిపు డెల్లలుగా నుంట కొప్పు;
నిలుకడమీఁద నిక్కచ్చిమేరల నియమించుపొంటె
వలఁతులు వత్తురు బారెఁ డెటు చన్న వచ్చులో టేమి? **767**

మధ్యా. పలుకులఁబట్టి దేశనంబునం దెన్నిపాయ లేర్పడిన
మొలకెత్తరాదు భారతధరైకత్వమున కెట్టికొఱఁత
వలయును బ్రజలవిజ్ఞానము పెరుఁగవలె నన్ననాఁడు
పలురాష్ట్రములు మనమహిని బాసలఁబట్టి యేర్పడుట. **768**

గీ. దేశభాషకుఁ దోడు జాతీయభాష, యాంధ్రతకుఁదోడు భారతీయత్వమున్న
రాష్ట్రమున వచ్చునట్టిరారాపు లేదు, కొమ్మ లెచ్చినద్రమానికిం గొదవలేదు. 769

ఆ. తెలుఁగువారు కన్నడులు ఘూర్జరులు నిట, నుంట విశ్వ మెఱుఁగ; దున్నవార
లెల్ల భారతీయులే యని నమ్ము; నీ, రహి నెఱుంగవలయు రాష్ట్రవాది. 770

వ. నాఁటి ప్రార్థనసదస్సునందును మహాత్ముఁ డీభాషారాష్ట్రవిభజనమును వివరించుచు సంకుచితదృష్టియుఁ బరస్పరాసూయలు లేని తెలఁగున రాష్ట్రము లేర్పడవచ్చు ననె - రాష్ట్ర స్వాతంత్ర్యముకంటె గ్రామస్వాతంత్ర్యము ప్రధాన మనె - భారత స్వరాజ్యము గ్రామస్వరాజ్యముపై నాధారంపడి యుండు ననియె - పదంపడి (25-1) ప్రసంగమున

గీ. సచివు లాడంబరములకు స్వస్తిచెప్పి, ప్రజల కూడిగ మొనరింపవలయు ననియె
నైతికబలమ్ము చాలనిజాతి విశ్వ, వీథి నపహసితవ్యమై ప్రిదులు ననియె. 772

గీ. అల్పవేతనమునఁ దృప్తి నందువాఁడె, జగతికాప్తుఁ డనం దగు ప్రెగడ యనియె
మనది పేదదేశము కాన మంత్రికూడఁ, బేదగా నుంట యస్మదభీష్ట మనియె. 773

మధ్యా. మఱునాఁడు పూర్ణస్వరాజ్యమహమున మన మిన్ని నాళ్లు
వరియించినస్వరాజ్యమా యిది యని తీవ్రత చాటె నొజ్జ
సిరినేలుదొర లింకఁ గూలివారలసేమంబు కోరి
సరిక్రొత్తచూపున మెలఁగరేని ప్రజల్ సైఁప రనియె. 774

ఆ. కర్మకరులు దేశకల్యాణ మర్థించి, వస్తుసృష్టి సేయవలయు లెస్స
చనదు మాటిమాటికిని సమ్మె పరపాల, నమ్ములోఁ గృశించునాఁడువోలె. 775

వ. అవ్వలిప్రొద్దు (27-1) ఢిల్లీ కామడదవ్వున 'మెహరౌలీ' యను తావున జరుగు ముస్లిముల యుత్సవమున కాచార్యుఁ దరిగి యచటిహిందూమహమ్మదీయుల పరస్పర సౌహార్ద సాహాయ్యములు వీక్షించి విస్మయానందము లనుభవించె - ఆనాఁటిపత్రికలు పెషావరు చెంత హంతలచే హిందూసిక్కులు మున్నూర్వురు నిహతులై రన్నదుర్వార్త వెలువరించి నను హస్తినయం దవగడములు రేఁగమికి నుప్పొంగె - ప్రార్థనాసమావేశమునఁ బ్రతీకారవాంఛ తగదనియె - విశ్వాసమునకు సైరణకు నిది తీవ్రపరీక్ష యనె-వేఁడి కొలుసభకు వచ్చు హిందువు గాని సిక్కుగాని తనవెంట నొకముస్లిముం గొనితేరవలయు ననె - తరువాత (28-1) సమావేశమున మహమ్మదీయుఁ డొక్కండ యుంట యెఱిఁ గి నిట్టూర్పులు విడిచె - పదంపడి (29-1) కొందఱు కాందిశీకులు మహాత్ముని చెంత కేతెంచి 776

ఆ. ఓమహాత్మ! మాకు నీమూలమునఁ జావు, లొదవె మానభంగమొదవె నెల్ల
నోవు లొదవెఁ జాలు నీ వైభవం బింక, బదలకయ్య! మాశుభమ్ముకొఱకు. 777

గీ. మమ్ము వదలి విశ్రాంతిని గొమ్మ శీత, శిఖరికందరముల నివసింపఁ బొమ్ము
పాప! మెనుబదియేండ్లు పైఁబడియె నీకు, నకట! కఠినోపవాసాల నలసి తీవు. 778

గీ. అనుదు మీయాజ్ఞ కా దీశ్వరాజ్ఞయైన, నపుడ యూఱట నాసింతు ననె గురుండు
బాపుజీ! నేఁడు మాపల్కు పల్కులెల్ల, నీశ్వరునిపల్కులే యని రెదురువారు. 779

క. ఏ నెఱుఁగుదు మీచందము, మీనెంజిలి నాదువెతను మించదు, దీనిం
గానవలయు మీ రోర్మిం, బూనవలయు ననె మనీషిపుంగవుఁ డంతన్. 780

వ. నాఁటి కై వారపుంగొల్వునసైతము బాపూ వీరి ప్రస్తవము దెచ్చి విశ్రాంతికై యే నెటకుఁ
జనుదు? ఇట లభింపనిశాంతి నాకొండుకడఁ జిక్కునా? శాంతి యొండె నశాంతి,
బ్రతుకొండెఁ జావు నా కీప్రజలయంద దక్కవలయు ననియె – నాఁ డంతయుఁ గాంగ్రెసిఁ
కఁ బాటింపఁదగిన కార్యక్రమము నేర్పఱచుచు మహాత్ముఁడు మిగుల నొచ్చియుండె
– కావున నాఁటిరేయి సంవాహనక్రియ సేయించుకొనుచు నశాంతిలో శాంతిని,
దమస్సులో మహస్సును, నిరాశలో నాశను సందర్శింపవలయు నని యొకనవ్వు నవ్వి
దాస్యవిచ్ఛిత్తికై కాంగ్రెసువా రెనలేనిత్యాగము కావించిరి – కాని నేఁడు వారి నావరించిన
యధికారవ్యామోహము పరిహాసాస్పదముగా నున్నదనియె–అంతలో నయ్యకొక దగ్గుతెర
వచ్చుడు నచ్చటివారు మందు తెమ్మందురా యన నొజ్జ 781

క. ఈదగ్గు రామనామము, చేఁ దగ్గించెదను గాని సీ! సీ! సీసా–
సూదులమందుల నణఁపను, పోదా యిది రామనామ పుణ్యాజపమునన్? 782

ఆ. తెగులు హెచ్చిహెచ్చి దీర్ఘకాలము మంచ, మెక్కి చత్తునేని యేను భగవ
దర్చకుఁడను గామి యాచావు చాటు నా, భక్తి యల్ప మనుట పగటుసేయు. 783

గీ. నన్నుఁ జంపుట కెవ్వఁడైనను దుపాకి, కాల్చుఁగాక నే మూల్గను గాసిపడను
రామ!రామ! యటంచు నాప్రాణములను, విడుతునయ్యెడ హర్షంబువెల్లివిరియ.784

వ. అదియ నా గొప్పతనమునకు మూదల యగుననియె – అంత (30–1–48) 785

## దుర్దినము వచ్చినది

ఆ. వచ్చె దుర్దినమ్ము వసుధ కహింసామ, హత్త్వ మెఱుకచేసి యాంగ్లజాతి
బింక మణఁచి తల్లిసంకెలల్ త్రెంచిన, బిరుదుబ్రదుకునందుఁ జరమదినము. 786

ఆ. వచ్చె దుర్దినమ్ము వాడివాడి వగర్చు, జాతి కాత్మశక్తి సంతరించి
విశ్వగణ్యమైన విజయమ్ము గూర్చిన, బిరుదు బ్రదుకునందుఁ జరమదినము. 787

ఆ. వచ్చె దుర్దినమ్ము వగపులో బెదరక, సుఖము నాసచేయ కఖిలవికృతి
దూరుఁడై ప్రసన్నతారూఢమతి యైన, బిరుదు బ్రదుకునందుఁ జరమదినము. 788

వ. నాఁటి వేగుజామున బాపూ నిద్రవీడి ప్రార్ధనకుం దొడరఁ బరిజనమునం దొకఁ డప్పటికిని గుఱువెట్టుచెండె - వానిపరాకునకుఁ దనదోసం బేదియో హేతువని మహాత్ముఁడు వగచి వేఁడికో లైనవెనుక నిన్నఁ దా వ్రాసిన క్రొత్తకాంగ్రెసునియమములఁ బరిశీలింపు మని ప్యారీలాలున కొసంగి చిన్నకునుకుదీసి లేచి తన యాంతరంగిక సేవకుని 'విశ్వ' మనువానిం బిలిచి యోయీ! రే పుందునో యుందనో వచ్చినలేఖలనెల్ల నిటుతెమ్ము - ప్రత్యుత్తరములు వ్రాసెద నని కిశోర్‌లాల్ మష్రూవాలా మున్నగువారికిం గమ్మలు తీర్చి రేపాడినడకకుఁ దగ్గబిగి లేమిఁ దా నున్నగదియంద యటు నిటు నడచి యొడలు పట్టించి మజ్జనమాచరించి మిత్రులతో నౌకాళీపరిస్థితులు చర్చించి వంగభాష యించుక నేర్చి తూకము చూచి (109 పౌనులుండె) మనూ! ఏమిసేయుచున్న దాన వన నాకన్య యారేయికి వలయు దగ్గుమందు (తాటిబెల్లము, లవంగములపొడి - చేరినబిళ్ళలు) నాయితము సేయుదు ననుదు నయ్యె చిఱునవ్వు నవ్వి. 789

ఆ. ఓసి వెఱ్ఱిదాన! యీసందెతఱి నేమి, జరుగఁగలదొ యెవ్వఁ డెఱుఁగుఁ జెపుమ!
రాత్రిదనుక నేను బ్రాణాలతోనున్న, నపుడె నూఱవచ్చు నౌషధంబు. 790

క. లేలెమ్మిపుడా చేఁతను, జాలింపుము నా నిదేమి శ్రవణమ్మునకుం
బోలనిపల్కులు తాఁకెను, వేలుపు దయమాలి యింతవెత గూరుచునా? 791

వ. అని మనూకుమారి లోలోన దురపిల్లి కల్వమును విడిచె - పిమ్మట బాపూ సాపడి మిశ్రమించిన వెనుకం గ్రీఁగడుపుపై వండలిగుడ్డ వేసికొని యనంతరము తన్నుఁ జూడవచ్చినవారి నాదరించె - ప్యారీలా లపుడు మహాత్ముని గదిసి మీ రెల్లుండి సేవాగ్రామమునకుఁ గదలుదురని యచటివారికిఁ దంత్రీవార్త నంపుదునా యన నాచార్యుం డిట్లు వల్కె. 792

ఆ. చేయఁబోకు మట్టిచేఁత, వృథా వెచ్చ, మేల నేఁటి వేఁడికోలుసభను
దేటపఱుతు నస్మదీయప్రయాణము, నెల్లి యది ధరిత్రినెల్ల మెఱయు. 793

మం. పదపడి యోగీంద్రుపజ్జ కాత్మీయ, తనయతో వచ్చె సర్దారుపటేలు
బాపుజీ రాట్నంపుఁబనినుండి తొలఁగ, కతనితో బహుసమస్యలు చర్చచేసి
జవహరుండును నీవుసచివపీఠముల, నుంట లెస్సయ కాని యొకనిప ల్కొకని
కిష్టముగాదు నేఁ డిది సైఁపజాల, నీవేని పండితుఁడేని యమాత్య
పదమును విడకతప్పద యని తలఁతు, జాటెదఁ బ్రార్థనాసభ నీతలంపు
నాలింతు జవహరునభిమత మిందు, నావుడు సర్దారు నల్లవో! యనియె. 794

వ. ఇంతఁలోఁ దనముంగడకు వచ్చితనతిండి నాచార్యుఁ దారగించె ప్రార్థనతఱి తఱియంబడె -పటేలుతోడిసంభాషణము నయ్యె మరల సాగించె-ఆభాగాంధి (బాపూ మనుమఁడు కనూగాంధీభార్య) మహాత్ముని దెసకు గడియారముం జూపె-బాపూ సభ కాయిత్తపడె - అపుడొక్కరుండు వచ్చి మహాత్మా! 795

మధ్యా. నీతోడ మాటాడ వలసి గుజ్జరినేలవా రిద్ద
తేతెంచి వాకిట నిల్చియున్న వా రేమందు వనిన
నాతనువునఁ బ్రాణ మున్నఁ బ్రార్థనానంతరమంద
చూతు నవ్వారి ననె గురుఁ దుల్కఁగా సూరెలవారు. 796

## రామ! రామ!

ఆ. వేళతప్పె నన్న వేదన మది రేఁగ, నింగి నేత్రుడాలు నివ్వటిల్ల
మనుమరాండ్రమూఁపులను జేతు లానించి, వెడలె జాతిసవిత వేదికడకు. 797

(10 ని. ఆలస్యముగా 5-10 ని.లకు)

గీ. రెండుపాయలుగా సభ్యమండలమ్ము, చీలి తెరువు నొసంగ దేశికుఁ డెలర్చి
చేతులెత్తి నమస్కృతిచేసె సభకుఁ, గద్దియకుఁ జేర మెట్టుపైఁ గాలుమోపె. 798

వ. అట్టితఱిఁ బ్రజాసముదాయమునుండి క్రోఁతివన్నెదుస్తులు దాల్చినయువ యొకండు (గోడ్సే) జనులం ద్రోసికొనివచ్చుచు మనూకన్య నిలువరింప నాఁగక యాగరిత నొకప్రక్కకుగెంటి బాపున కతిసన్నిహితుఁడై జోహారు వొనరింప వంగినచాడ్పున వంగి జేబునందలి పిస్తోలు వెలికి లాగి 799

క. పటపట ముమ్మఱు ప్రేల్వన్, జటులగతిన్ రెండుగుండ్లు సంయమికుక్షిన్
విటతటమొనర్చి చనె నొ, క్కటి గుండియలోను సొచ్చి కదలక నిల్చెన్. 800

మధ్యా. మూఁగినపేదర్మికతనఁ బ్రాఁగోక మూరెఁడె లేక
వేఁగుదీనులఁ గని కుంది కుబుసము వీడి మహాత్ముఁ
డేగుండె నెండకు వానకుఁ జలికి నిరవుఁ గావించె
నాగుండెపైఁ గాల్చె నతనితమ్ముండ యగ్నిగోళమ్ము. 801

మధ్యా. ఈగడ్డవారినెత్తురును గండల నెమ్ములఁ గుడిచి
వీఁగునాంగ్లేయుల నెద్రిచి మార్తురు విడిచెదుగుండ్ల
కేగుండెనొడ్డి బాపూ మహీదాస్య మిల్లిగ్గఁజేసె
నాగుండెపైఁ గాల్చె నతనితమ్ముండ యగ్నిగోళమ్ము. 802

మధ్యా. ఏగుండె సూనృ తాహింసన తపోఽర్చులిన్నినా కోర్చె
నేగుండె దీర్ఘోపవాస భర ముద్వహించుట నేర్చె
నేగుండె విశ్వహార్దమున నార్ద్రత నెనసి జాల్వాఱె
నాగుండెపైఁ గాల్చె నతనితమ్ముండ యగ్నిగోళమ్ము. 803

ఆ. పలికినట్టిపల్కు బ్రదికినబ్రదుకును
గట్టకడకు సార్థకమ్ము గాఁగ
రామ! రామ! యనుచు రక్తంపుమడువునఁ
గూలె గాంధి మోడ్పుఁగేలు తోడ. 804



రఘుపతి రాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరేనామ్
సబ్‌కో సన్మతి దే భగవాన్



## .....తరువాత

(ఇంక వచ్చు పద్యములు బాపూ నిర్యాణవార్తవిని 1948 ఫిబ్రవరిలో వ్రాసి
'అమరజ్యోతి'అను పేరఁ బ్రకటించినవి)

సీ. యుగయుగమ్ముల భారతోర్వీ తపఃపుంజ, మెసరేఁగి జగముల కిడిన పంట
తరతరమ్ములనుండి తరలని దాస్యమ్ము, కట్లు త్రెంచిన శాంతికదనయోద్ధ
నరనరమ్మున జీవనజ్యోత్స్నగా నహిం, సను సహించిన యోగిసత్తముండు
పదపదమ్మున సత్య భాషా సనాతన, సౌరభ్యములు చిమ్ము సాధుశీలుఁ
దహరహమ్మును విశ్వకల్యాణలబ్ధి, కొఱకు నాత్మార్పణ మొనర్చుకొను తపస్వి
కూలెనా దుర్మతోన్మాదకుటిలతంత్ర, జుష్టదుష్టచ్ఛటామృత్యుముష్టిహతికి. 1

మ. ఒఱగెన్ విశ్వపతాకలెల్ల వసుధావ్యోమంబు లార్తస్వర
స్ఫుర ణాకంపిత వీథులయ్యె మిహిరాంశుజ్యోతు లేపారినన్
గఱకుంజీఁకటు లేచి కప్పె దెసలన్ గాకోలకల్పమ్ములై
చరమస్థానము నీవుసేర జగమే స్తంభించె యోగీశ్వరా! 2

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దాతయు నేతయు నెయ్యతియ్యముల్
చల్లెడిమిత్రుఁడున్ సచివ సత్తముఁ డు త్తమబంధు వీశ్వరుం
డెల్లరు లేని దైన్య ముదయించెఁగదా! యిటు లెన్ని కల్పముల్
చెల్లునొ మాకు నచ్చుతర జీవను లబ్బుటకున్ భవాదృశుల్. 3

ఉ. వ్రల్లదుఁ దేచి ప్రేల్చిన తుపాకికి నీ హృదయమ్ము వ్రయ్యలై
వెల్లువకట్టి హస్తిపురవీథుల నీ రుధిరమ్ము పాఱెనా
త్రుళ్ళెడి దుష్టశక్తుల నెదుర్చుట కందలి చుక్కచుక్కకున్
బల్లిదు లిద్ధవీరపరిపాలకు లెందఱు పుట్టివత్తురో. 4

ఉ. పూవులతెప్పపైఁ గదలిపోయితివా యమునాతరంగిణీ
పావనరాజఘట్టమున భౌతికదేహము గాల్చుకొంటివా
నీ వపురస్థి చందనవనీశకలమ్ముల బూదియయ్యెనా
బావురుమంచు నీదు చితిపజ్జల శోకము పొంగెనా ప్రభూ! 5

మ. బలిసెన్ దావకభూతి మోచు యమునా భాగీరథీ గౌతమీ
బలదా సహ్యసుతా మహేంద్రతనయా భద్రా కవేరాత్మజా
సలిలోర్మిచ్ఛట కీప్సితార్థసుఖముల్ సంధించుపుణ్యంబు; త
జ్జలసేకంబున భారతక్షితి నహింసాసస్యముల్ పండుతన్! 6

క. మందాకినీసరిత్కా, ళిందిసరస్వతుల నస్థిలేశము కలియన్
హిందూ ముస్లిము క్రైస్తవ, బృందములో ఈమహస్సు పెనఁగొన్నదిరా! 7

శా. నీబూదిన్ గొనితెచ్చురైలుఁ గనుచో నేత్రమ్ము లంధమ్ములై
బాబూ! మూర్ఛకుఁ జిక్కనాఁడ యీ బంధంబు నేమందువో
నా బాగోగు సమీక్షచేసికొనుచున్ నాఁడెల్ల వేసారితిన్
నీ బంధుత్వము నాదుభాగ్య మనుకొంటిన్ భక్తి నమ్రుండనై. 8

క. చేసినసేవయుఁ ద్యాగము, వీసమ యగుఁ గాని కన్ను విచ్చినపిదపన్
వ్రాసిన దంతయు నీకథ, నీసందేశంబ యని వినీతిన్ వినుతున్. 9

శా. రామా! నన్ గరుణించితే పిలిచితే రమ్మంటివే జీవన
స్వామీ! ధన్యుడనైతి నంచు భగవత్ సామ్రాజ్యముం జేరితే
కామాదు ల్విదళించు సామఋషి త్యాగబ్రహ్మకున్ నీ కహో!
సామాన్యంబు ఘటిల్లెనా వరదుఁ దాశాసించులగ్నంబునన్. 10

క. కస్తూరి చన్నతతి నెఱ, కస్తిం బడ, వట్లు నిల్వఁగారణ మీ వీ
వ్యస్తత కదు నస్థిర మని, యస్తుంకృతి వడసి యుంటయకద మహాత్మా! 11

సీ. అపవర్గబాంధవం బదికి లౌకికధర్మ, మాలపించితి నందబాలునట్లు
కనుదిక్కులేక సోలిన మూఁగజీవాల, మూల్గు మాన్పితి శాక్యముని విధాన
సతత క్షమా ప్రేమ శరణమై నరదైత్య, కిల్బిషం బోర్చితి క్రీస్తువోలె
ఆత్మ నిత్యము, దైవ మది యొండె - యని ప్రతి, ష్ఠింపఁజాలితి సోక్రటీసుకరణి
బానిసముద్రేఁగు డించి కింపాకజాతి, కండగా నిల్వఁబడి తబ్రహాముపగిది
నద్భుతంబాయె మనుగడయంద కాక, మృతివిధిన్ వీరి ననుసరించితె మహాత్మ! 12

మ. నిను రామాదులఁ జేర్చి మెత్తురది మన్నింపన్ రిపుగ్రీవముల్
రణరంగమ్మునఁ గోసి రక్తఝరిలో రామాదు లోలాడి రా
పనికిన్ నీకును లేదు పొత్తు, రిపుతన్ బాధించి విద్వేషిపై
నెనరుం జిమ్మెద వీవు చిక్కదు ప్రభూ! నీయోగ మెవ్వానికిన్ 13

సీ. చిరదాస్యమున క్రుంగి పిఱికివాఱిన జాతి, కలవరించితివి సాహసికముద్ర
మోఁకతించి కృపాణములు సలాములుసేయు, నస్త్ర మెత్తితివి సత్యాగ్రహంబు
పరధర్మలుబ్ధులై పరువులెత్తెడి వారిఁ, ద్రిప్పఁజాలితివి జాతీయవిధికి
అడుగడ్డునకు నడ్డపడిన కోటలఁ గూల్చి, సవరించితివి సమాజవ్యవస్థ
దిక్కెఱుంగక రే పవల్ దేవురించు, ప్రజకు నేర్పితి వాత్మగౌరవసమీక్ష
బాపుజీ! స్రష్ట వీవు నీచూపు సోఁకి, ద్రష్టలైనారు కొంద ఱీతరమువారు 14

ఆ. వేయి గాదు లక్షవిశ్వకలాపరి, షత్తు లెన్నినాళ్ళు మొత్తుకొన్న
నేర్పలేని తెల్వి నీ వీజగమ్మున, కిచ్చినాఁడ విరులు విచ్చి వీడ. 15

క. పెఱబాసలకొల్వునకున్, బొరలుట జాతికి విషమ్ముపోయుట యని తెం
పరివై చాటితి విఁక నె, వ్వరు దిక్కో దేశిపల్కువఱువ ట్లుడుపన్. 16

సీ. నీ పల్కు గాక యీ నిఖిలభారతమహీ, చక్రంబు ద్రిప్పుశాసనము గలదె
నీ యున్కి గాక పండినపాపముల నెల్ల, రాపాడు పుణ్యతీర్థమ్ము గలదె
నీ కిన్కగాక మానిసిగుండెలోఁ దూఱి, చెదుగుపాదు పెకల్చుశిక్ష కలదె
నీ కూర్మిగాక నిర్నిద్రయోగసమాధి, బడలి సంపాదించుపదవి గలదె
కలదె నీ జీవనపథమ్ము గాక లోక, శర్మసంపత్తి నొదవించుధర్మశాస్త్ర
మద్వితీయంబు నీ తపస్యావిధాన, మెవ్వనిమనీష నిల్చు ని న్నెఱిఁగి పల్క. 17

ఉ. నీ పరమోపవాస మశనిప్రతిమం బయి శైల సాగర
ద్వీపవిశిష్ట విశ్వజగతిన్ వడఁకించుతతిన్ భయార్తులై
పాపులు బల్లెముల్ మరతుపాకులు బాఁకులు పెట్టి తావక
శ్రీపదపీఠిపై నొరగి సిగ్గిలి రేమితపస్సురా ప్రభూ! 18

గీ. అనఘ! నీ వీశ్వరునిదూత వగుట విశ్వ, మానవీమానవుల్ భగవానుపట్లఁ
దేటపఱుపనిభక్తి నీదెస వెలార్తు, రసలుకంటెను వడ్డి ముద్దైనయట్లు. 19

ఉ. అంకిలివీడి నిర్భర వయః పరిపాకమునందె యింద్రి యా
హంకృతిఁ దూల్చి పూనితి మహామతులోర్వని బ్రహ్మచర్య; మీ
బింకము లేనినాఁడు వలపించి జగంబులనెల్ల నిట్లు నీ
లెంకలఁ జేసికోఁ దగవు లే! తెలిసెం గిటుకెల్లఁ గోమటీ! 20

మ. వలపుల్ చిమ్మెడు పూలచెండ్లవలె సేవాధర్మ నిర్మాతవై
మలపిండంబుల నెత్తివైచితి; వసీమత్యాగమై ప్రాణముల్
బలిదానంబిడఁ గంటి విశ్వహితముం బాటించి; నీబాటలో
నిలువంజాలిన మానవుం డెవఁడు గాంధీ! ఖండఖండమ్ములన్ 21

(అసీమత్యాగమై– మేరలేని త్యాగము గల్గి)

చ. స్వమతవిధుల్ ప్రశస్తములు, సత్యము లంచు భజింతు వన్య ధ
ర్మముల సమాదరింతు వపరాజితసూత్రములన్ గణింతు వీ
సమరసదృష్టి ప్రాక్తనులు శంకరముఖ్యుల కింత యున్నచో
సమరము లెన్ని క్రిందువడి శాంతి యదెంత ఫలించియుండునో! 22

శా. లాటీ నెత్తివిశాలభారతము నేలం జూచు దుష్టప్రభు
త్వాటోపం బడcగించు టెట్టు లని తీవ్రాలోచనామగ్నమై
బాటం గానని యోధమండల మెలర్పన్ నాcడు 'క్విట్టిండియా'
యాటంబాంబు సృజించి డించితివిరా! యాంగ్లేయరాజ్యోద్ధతిన్. 23

శా. దారిద్ర్యంబు నవిద్యయుం గవిసి పంతాలాడ సంపన్నులున్
బేరుల్ నెత్తురు పీల్చి పీల్చి బహుధాపీడించినన్ జీవనా
ధారంబై జగ ముద్ధరించు బదు గార్తప్రాణబంధుండు రై
తే రాజ్యంబున కర్హుcడంటి వది సిద్ధిం బొందు టేనాcటికో! 24

చ. వలదు పరాన్నభుక్కుల నివాసము లీ పురముల్, పదంబిటన్
నిలుపక పొందు పల్లెలకు; నేర్పుc డటన్ జదువుల్ సదర్థముల్
వెలుcగులు నింపి భారతసవిత్రికి నాయువుపట్టులై యా
పొలములు దున్నుచున్ నలిcగిపొం దని తోలితివోయి! పౌరులన్. 25

చ. బడలెద వేకువోలె మనభాగ్యము పంటకు, రాట్నపాకుగా
సుడివడె దార్తరక్షణకు, సూత్రమవై సకలప్రజావళిం
బడుగునc బేకలోc గలిపిపట్టెద, వెట్టివిపత్తి మూcగినన్
జడియక నిచ్చలున్ బిగియసాగెదురా! కదురై మహాప్రభూ! 26

ఉ. మొద్దుగ నుండుcగాక వెల ముమ్మర మయ్యెడుcగాక దీక్షమై
ఖద్దరు కట్టి పేదలకు గంజిని బోయుcడు భారతార్థి కా
పద్దశ దీనc బాయు ననిపల్కితి, వూపిరి లేనిరాట్నపున్
ముద్దియ తేతి తెప్పితిలి మోహనసూత్రము లాలపింపcగన్. 27

క. నీకదలించిన ఖద్దరు, నీకీర్తివిధాన జగతి నిండారెcగదా
రేకెత్తిన జాతీయత, కాకల్పం బిది పతాకయై అంపిలుతన్. 28

ఉ. వంటయు నంట్లు తోముటయు, వల్లభుచేతి విలాసవస్తువై
యుంటయు గర్భరౌరవదురుద్ధతి కోర్చి ప్రజాపరంపరన్
గంటయుc గాక లోకమును గానని భారతనారి నీకృపన్
గెంటెcగదా పరప్రభుతc గెవ్వునc గేకలుపెట్టి పాఱcగన్. 29

శా. నీవస్పృశ్యుcడ! వీ వవాచ్యుcడ విసీ! నిన్ జూచినం బాపముల్
ప్రోవై చుట్టు నటంచు శిష్టు లెవనిం బోనాడి రా మాల యా
జీవత్ప్రేతము వెల్గెడిన్ హరిజన శ్రీనాముc డారాధ్యుcడై
యీవే దివ్యసమాధిలోc దలcచితో యీపేరు యోగీశ్వరా! 30

ఉ. శంబుకువంటి సాధువులఁ జంపక సంపద లేమి యన్న భే
దంబులు లేక సర్వజనతాసమతా సహజన్మతల్ నభ
శ్చుంబులు గాఁగ శాంతిపరిశోభితమై నుతిగాంచు రామరా
జ్యంబున కాసచేసి చరితార్థత నందకమున్నె సాగితే! 31

శా. ఒద్దారించి నినున్ వధించి కుటిలవ్యూహమ్ము పండించి మా
జద్దల్ పోయె నటంచుఁ బ్రేంఖణములన్ సారించి కజ్జాయముల్
లడ్డుల్ పంచినమూఁక భారతము నేలన్ నేల దయ్యాల కే
యడ్డం బాఁకయు లేనిరంగ మగుఁగాదా భావి యెట్లున్నదో! 32

సీ. కుల వర్గములఁ గ్రుళ్ళి కుమిలిన నీ మతం, బుద్ధరింపఁగఁ జక్కదిద్దు కతన
మాలకై మందారమాల కై సేసి నీ, దేవాలయముతల్పు దెఱచుకతనఁ
బొగలతో సెగలతోఁ బొగులు హిందూముస్లి, ముల కౌఁగిలింతలు వలచుకతనఁ
బేదసాదులనెత్రు పీల్చి గట్టునఁ ద్రేఁచు, సాహుల నదలింప సాగుకతనఁ
బ్రజ నెదిర్చిననాఁడు మీబ్రదుకు లేదు, లే దనుచుఁ గింప్రభుల మందలించుకతనఁ
గాల్చితఁటరా మహాత్ముని గర్మయోగి, లోకమూర్ధాభిషిక్తు గోడ్సేకిరాత! 33

మ. శతధా - కాదు - సహస్రధా తునియలై సామ్రాజ్యవాదం బహో!
యతలంబున్ సుతలంబు నంటుతఱిఁ బ్రాజ్యంబుల్ ప్రజారాజ్యముల్
క్షితినెల్లన్ వికసించువేళ నసురస్పృహ్యం బసహ్యంబు నౌ
మత రాజ్యంబున కుద్యమించిఁతటరా మాత్సర్యధుర్యాగ్రణీ! 34

గీ. మతముపే ర్వెట్టి కపటధర్మములు పల్కి, మోస మెఱుఁగనిసాదుల ముంచిముంచి
బొజ్జ పెంచెదువారికి బుద్ధిసెప్పు, కాల మేతెంచె నని యెఱుంగవె జడాత్మ! 35

క. పుట్టుకతో నాధిక్యము, పెట్టెన్ సోమరికిఁ బెద్దపీఁటను వైచెన్
ముట్టకొనరానిమానవుఁ, గట్టా! నీమెచ్చుమతమకద సృజియించెన్. 36

గీ. బుక్కు లొకనికి నొకనికిఁ జెక్కభజన, ప్రభుత యొకనికి నొకనికి బానిసమ్ము
గ్రామ మొకనికి నొకనికిఁ గసటుగూడె, మేమి సౌభ్రాత్ర మేమిహిందూమతంబు! 37

క. సావర్కా రిసిరో! 'విజ, యావహమగుఁగాక! నీప్రయాణ'ం బని నిన్
దీవించి పంపినాఁడటె!, కావిరిచీఁకట్లు వీనికను గప్పెనొకో! 38

క. తరతరమునం 'దహింసా, పరమోధర్మ' యని నొక్కిపల్కిన మతపుం
బరు వెఱుఁగలేని దామో, దరుఁ డితఁడా నీకు దైవతం బధరమతీ! 39

శా. ఆనాఁడే సుపవిత్రరక్తమున దాహం బార్చుకొన్నట్టి యూ
దీ నాఁ డెందును దిక్కు లేని పురుగై యేఁకారుచున్నాఁడు నీ
వేనీచత్వము నేలెదో మఱియు నేయేహింసలం గూలెదో
దీనత్రాణపరాయణున్ ఋషివరున్ దిన్నాఁడ వేనఃఖనీ! 40

ఉ. బోయఁడు విప్రుఁడై భువనపూజ్యుని రాముని కీర్తి నిల్ప రా
మాయణసృష్టి చేసి నుతు లందె నొకానొకనాఁడు విప్రుఁడే
బోయతనమ్మునంది ఋషిపుంగవు నేఁడు వధించె రామసే
వా యజనార్ద్రచిత్తుఁ దనవంగస మాఱనిలజ్జఁ గ్రుంగఁగన్. 41

ఉ. వేదము క్రోల్చి ధర్మపదవీనదవీయసియైన బుద్ధికిం
బాదులుకట్టి పుణ్యములపంటలు నూర్చి యనంతశాంతికిన్
మూదలయైన విప్రకులమున్ బిశితాశి యితండు నేఁడు దు
ర్వేదనపాలు చేసె నపవిత్రులపుట్టుక లిట్టివేకదా! 42

ఉ. విప్రకులంబె కాదు కనువిచ్చిన హైందవసంఘమెల్ల నేఁ
డప్రతిమ త్రపాపిహితమై భయ దుఃఖ ధురా పరిచ్యుత
క్షిప్రతమైఖలుం డొకఁడు చేసినపాపము జాతికే వినా
శ ప్రదమంచు నేడ్చు నవశమ్ముల ముప్పదికోట్ల గొంతులన్. 43

ఉ. ఏడ్చుటె కాదు భీష్మతరమీఘటనన్ విను చెందఱెందఱో
యూడ్చిరి మేను - క్రైస్తవులు యూదులు ముస్లిము లెల్లవారలున్
మోడ్చిరి మోము నెవ్వగలముంపులతో దిగువాఱి కంటినీ
రోడ్చిరి విశ్వవీథి విలయోదధిపొంగులు రేఁగెనో యనన్. 44

ఉ. చచ్చిరి దేశభక్తులు విశాంపతు లిద్ధకవుల్ ప్రవక్తలుం
జచ్చిరిగాని ము న్నెవని చావునకుం బ్రజ లిట్లు క్రుంగి; రే
సచ్చరితుండు పోవునెడ సర్వజగంబు లిటుల్ వెలార్చె న
త్యుచ్చతరాదరంబు హృద యోద్గత భక్తియు సానుభూతియున్. 45

శా. నాపై బాంబులు ప్రేల్చినట్టి మనుజున్ నాపాలి చుట్టమ్ముఁగా
నా పుణ్యమ్ముల పంటఁగా దలఁచి లేసవ్వుల్ వెలారించుచున్
దాపం బింతయులేక యే నరిగినన్ దామప్పు దా నన్ను వా
ణీపారమ్యముఁ జూపి మెచ్చుఁ దని తంఁడ్రీ! పల్కు పండించితే! 46

సీ. క్రుళ్లినయెముకకై కుక్కగుంపులవోలె, నధికారమునకుఁ గారాడువారి
లంచాలగడ్డి కాసించి సేవాధర్మ, నియమముల్ బలిసేయ నేర్చువారి
కుహనా వణిజ్యోపగూహ నోద్రిక్తులై, సుధవోలెఁ బ్రజనెత్రు జుఱ్ఱువారి
పరమత ద్వేషాగ్ని మరగి నారీ వృద్ధ, శిశుమండలిని జీల్చి చెండువారి
దేశ హిత కృత్యముల పేరఁ దెచ్చు నర్థ, మాత్మ బంధువులకుఁ బంచునట్టివారి
బ్రతుకుఁ గనలేక కన్ను మూసితివి గాని, కలఁడె నీగుండెపైఁ బ్రేల్వఁగల మగండు. 47

శా. నిన్నుం గొల్చినయట్లు కొల్చి నిను ఖూనీచేసి రే గోముఖ
చ్ఛన్నవ్యాఘ్రము లే పయోముఖవిషస్థాలుల్ దయా సూనృత
స్కన్నుల్ వారలె నీకు దేవళములం గట్టించు పన్నాగముల్
పన్నం బూనిరి స్వప్రయోజనకర ప్రజ్ఞావిధా చుంచువుల్ 48

ఉ. బుద్ధుని యెంపముక్కల కపూర్వములౌ గుదులిట్లె కట్టి సం
విద్ధనమెల్లఁ జూపి రపవిత్రవిధుల్ కథలుం బురాణముల్
వృద్ధియొనర్చి రాతఁ డుదయించిన భూములనుండి యెన్నఁడో
బౌద్ధము నెట్టివైచిరి జపాను సయాముల నాశ్రయింపఁగన్. 49

గీ. అతనిహృదయంబ మధురశిల్పాభిరామ, నిలయమై ప్రీతి సంధించు నీకెవండు
బ్రదుకులోఁ జావులో నీదు బాట ద్రొక్కి, పీడితప్రజకై సల్పు నూడిగంబు. 50

గీ. మనుజుఁడవుగావు నీవు కోమటివిగావు, బడలిపోయిన భారతీయుఁడవుగావు
కావు గాంధివి – లోకలోకముల వెల్గుఁ, జూపు నిరవధి కామరజ్యోతి వోయి! 51

ఉ. నశ్వరమైనకాయము వినాయకధూర్తుఁడు కూల్చెఁ గాని నీ
శాశ్వతమైన యాత్మ నెటు చంపఁగలం డతఁ; డస్త్రశస్త్ర తీ
వ్ర శ్వసనాగ్ను లేకమయి వచ్చునపో! యది లెక్కసేయ; దీ
విశ్వము దానిచల్వ శుభవృద్ధము సత్యము సుందరంబగున్. 52

మ. శతజన్మార్జిత మామకీన సుకృతస్థానమ్ముగా నీ జగా
బ్రతుకున్ జాటెడికావ్యమున్ దెనుఁగునన్ బందించి నిందించి నా
బ్రతుకున్ ధన్యముఁ జేసికొంటిని జగద్బంధూ! దయా సత్యని
ష్ఠితమై తావకమూర్తి నల్గడలఁ గంటిన్ నేఁటికిన్ మాటికిన్. 53

ఉ. నా నుడికార మెట్టిదయినన్ భవదీయము దైవసంప దా
స్థానము జీవనంబును బ్రశంసయొనర్చిన దౌటఁజేసి లో
కానఁ బ్రశంసితం బగునకాఁ దలపోసెద – నొండె నొండుగా
నైనను నా కదేటికి గుణాంబుధి! నావిధి నేను దీర్చితిన్. 54

చ. పతితజగత్సముద్ధరణభారము నౌదలఁ దాల్చి ధాత్రిపై
ప్రతికినయన్నినాళ్ళు పలుభంగులఁ గర్మము లాచరించి తు
ట్టతుదకు నిర్మమత్వము కడల్కొన బంధము లూడ్చి భారతీ
యతకు మెఱుంగుపెట్టిన మహాత్మ! భవత్కథ మమ్ముఁ దేర్చుతన్! 55

-తుమ్మల సీతారామమూర్తి



| సాయపడిన గ్రంథములు | గ్రంథకర్తలు |
|---|---|
| కాంగ్రెసు చరిత్ర (ఇంగ్లీషు) | భోగరాజు పట్టాభి సీతారామయ్య |
| కాంగ్రెసు చరిత్ర (తెలుఁగు) | కొడాలి ఆంజనేయులు |
| మహాత్మ గాంధి – చరమఘట్టము (ఇంగ్లీషు) | ప్యారీలాల్ |
| గాంధిమహాత్ముని జీవితము | మానికొండ సత్యనారాయణశాస్త్రి |
| గాంధిమహాత్ముని సమగ్రచరిత్ర | వెలిదండ శ్రీనివాసరావు |
| గాంధి చరిత్రము | కొమాండూరి శఠకోపాచార్యులు |
| బాపూజీ ప్రార్థనాంతర – ఉపన్యాసములు | కందిరాజు వేంకటకిషన్‌రావు |
| బాపు – నా తల్లి (గుజరాతి) | కుమారి మనూగాంధి |
| బాపు – నా తల్లి (తెలుఁగు) | నండూరి వేంకటకృష్ణమాచార్యులు |
| యుగపురుష – మహాత్మాగాంధి (హిందీ) | యస్. మనోహరలాల్ |
| | ప్రొ. భగవతీప్రసాదపార్థరీ (ఎం.ఎ.) |
| ఆంధ్రరత్న ప్రశంస | గుమ్మిడిదల వేంకటసుబ్బారావు |
| స్వీయ చరిత్ర | కొండ వేంకటప్పయ్య |
| అల్లూరి సీతారామరాజు (బుఱ్ఱకథ) | సుంకర సత్యనారాయణ |



ఈ గ్రంథకర్తలకు కృతజ్ఞుఁడ.

మఱియు ఆయా సమాచారములఁదెల్పిన సర్వశ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, తల్లాప్రగడ ప్రకాశరాయఁడు, కల్లూరి సుబ్బారావు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, కొడాలి ఆంజనేయులు, ప్రభాకర్‌జీ, గొఱ్ఱెపాటి వేంకటసుబ్బయ్య మున్నగు వారికి నా నమస్కృతులు.

–రచయిత